ఓం.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.

సంసారసాగర నిమగ్నులగు జనుల నుద్ధరించుటకొఱకు

శ్రీమత్కృష్ణద్వైపాయన మహామునిచే రచియింపబడిన

# బ్రహ్మసూత్రములు.

ఈ గ్రంథము,

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య

శ్రీమచ్ఛంకరాచార్య విరచిత భాష్యానుసారముగ

సంస్కృత ప్రాకృతాద్యనేక భాషానిపుణులగు

బ్రహ్మశ్రీ - వెన్నెలకంటి - సుందరరామశర్మ గారిచే

రచియింపబడిన

ప్రతిపదటీకా తాత్పర్యసహితముగ

చెన్నపురి

**బరూరు - త్యాగరాయశాస్త్రులవారి**

స్వకీయ

గీర్వాణభాషారత్నాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

మదరాస్ - **1917.**



బరరాడు - త్యాగరాయశాస్త్రితి

పూర్వాశ్రమప్రసిద్ధాభిధాన

రాజయోగి - శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామి.

—※(*)※—

ఈబ్రహ్మసూత్రములు-

రాజయోగి - శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామ్యాఖ్య

మదీయగుర్వాజ్ఞచే లోకోపకారార్థము ముద్రించి

ప్రసిద్ధి చేయబడినది.

ఇట్లు, సజ్జనవిధేయుడు.

బరరాడు - కుప్పుస్వామిశాస్త్రి

# నూతన గ్రంథముల ప్రకటన.

శ్రీ వేదాంతపంచదశీ - టీకాతాత్పర్య సహితము ... రూ ౫-౦-౦

శ్రీ జ్ఞానవాశిష్ఠరామాయణము - తెనుగు వచనకావ్యము రూ ౫-౦-౦

ఈ బ్రహ్మసూత్రములు - ప్రతిపద టీకా తాత్పర్యసహితము రూ ౨-౮-౦

ఈ గ్రంథములు వలయువారు మదరాసు - గోవిందప్పనాయని వీధి (౩౧౬) వ నెంబరు గల గృహమున నివసించుచుండు బరూరు - త్యాగరాజశాస్త్రి గారి పేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

——*——

# ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

# బ్రహ్మసూత్రనిర్ణయవిధానమ్.

## శ్రీస్కాందే - మహాపురాణే

శ్లో॥ నారాయణాద్వినిష్పన్నం జ్ఞానంకృతయుగేస్థితమ్ । కించిత్తదన్యథాజాతం త్రేతాయాం ద్వాపరేఽఖిలమ్ ॥ గౌతమస్య ఋషేశ్శాపాత్ జ్ఞానేత్వజ్ఞానతాంగతే । సంకీర్ణబుద్ధయోదేవా బ్రహ్మరుద్రపురస్సరాః ॥ శరణ్యంశరణంజగ్ము ర్నారాయణమనామయం । తైర్విజ్ఞాపితకార్యస్తు భగవాన్పురుషోత్తమః ॥ అవతీర్ణో మహాయోగీ సత్యవత్యాం పరాశరాత్ । ఉత్సన్నాన్భగవాన్వేదా నుజ్జహార హరిస్స్వయం ॥ చతుర్ధావ్యభజత్తాంశ్చ చతుర్వింశతిధాపునః । శతధా చైకధాచైవ తథైవచసహస్రధా ॥ కృష్ణోద్వాదశధాచైవ పునస్తస్యార్థవిత్తయే । చకార బ్రహ్మసూత్రాణి యేషాం సూత్రత్వమంజసా ॥ అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖం । అస్తోభమనవద్యంచ సూత్రంసూత్రవిదోవిదుః ॥ నిర్విశేషితసూత్రత్వం బ్రహ్మసూత్రస్యచాప్యతః । యథావ్యాసత్వమేకస్యకృష్ణస్యాన్యేవిశేషణాత్ ॥ సవిశేషేణసూత్రాణి హ్యపరాణివిదోవిదుః । ముఖ్యస్యనిర్విశేషేణ శబ్దోఽన్యేషాంవిశేషతః ॥ ఇతివేదవిదఃప్రాహుః శబ్దతత్త్వార్థవేదినః । సూత్రేషుయేషుసర్వాణి నిర్ణయాన్యఖిలానితు ॥ శబ్దజాతస్యసర్వస్య యత్ప్రమాణశ్చనిర్ణయః । ఏవంవిధానిసూత్రాణి కృత్వావ్యాసోమహాయశాః ॥ బ్రహ్మరుద్రాదిదేవేషు మనుష్యపితృపక్షిషు । జ్ఞానంసంస్థాప్యభగవాన్ క్రీడతేపురుషోత్తమః ॥ ఇత్యాది ॥ అశుభానినిరాచష్టే తనోతిశుభసంతతిమ్ । శ్రుతిమాత్రేణయత్పుంసాం బ్రహ్మతన్మంగళంపరమ్ ॥

## —(*) ధ్యానశ్లోకాః (*)—

శ్లో॥ ఓంకారశ్చాథశబ్దశ్చ ।
ద్వావేతౌ బ్రహ్మణఃపురా ।
కంఠంభిత్వా వినిర్యాతౌ ।
తస్మాన్మాంగళికావుభౌ ॥

శ్లో॥ అతికల్యాణరూపత్వా న్నిత్యకల్యాణసంశ్రయాత్ । స్మర్తౄణాంవరదత్వాచ్చ బ్రహ్మతన్మంగళంవిదుమ్ ॥ ఓం, నమశ్శ్రితిశిరఃపద్మ షండమార్తాండమూర్తయే । బాదరాయణసంజ్ఞాయ మునయేశివవేశ్మనే । బ్రహ్మసూత్రకృతేతస్మై వేదవ్యాసాయవేధసే। జ్ఞానశక్త్యవతారాయ నమోభగవతేహరేః ॥ వ్యాసాయయతిచర్యాయవిద్యావిగ్రహధారిణే । నమస్తే హిబూవందదాయినే పరమాత్మనే ॥ ఇతిశ్లోకాన్పఠిత్వా నత్వా మహామునిమ్ । బ్రహ్మసూత్రంపఠేత్పశ్చా ద్వ్యతిరోస్మతుపరాయణః ॥

—(*)—

బ్రహ్మసూత్రస్యభగవాన్ వేదవ్యాసోమహానృషిః । నానాఛందాంసిచతథా పరంబ్రహ్మస్య దేవతా ॥ వినియోగోత్రమోక్షార్థే వందేనిత్యంయతీశ్వరం । ఏవంధ్యాన విధింకృత్వా బ్రహ్మ సూత్రంపఠేత్తుయః ॥ సర్వపాపవినిర్ముక్తో యాతివిష్ణోఃపరంపదం । బీజశక్త్యాదిరహితం సూత్రంకైవల్యసాధనం ॥ పఠతాం శృణ్వతాంనిత్యం సత్యంసత్యంమునీశ్వరాః ॥

—(*)—

శ్రీరస్తు




హరిః ఓమ్.

శ్రీగురుభ్యోనమః.

# వైయాసకీ శారీరక మీమాంసా

# బ్రహ్మసూత్రాణి

## నిత్యపారాయణోపయుక్తమ్

—(*) ౫౫౫ (*)—

## ప్రథమాధ్యాయే ప్రథమఃపాదః.

ఓం, నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో వంశర్షిభ్యో నమోగురుభ్యో నమః మహద్భ్యః॥

సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి, బ్రహ్మైవాహమస్మి॥

అ. ౧- అథాతో బ్రహ్మజిజ్ఞాసా॥ ౧॥ అ. ౨- జన్మాద్యస్య యతః॥ ౨॥ అ. ౩- శాస్త్రయోనిత్వాత్॥ ౩॥ అ. ౪- తత్తుసమన్వయాత్॥ ౪॥ అ. ౫ ఈక్షతేర్నాశబ్దం॥ ౫॥ గౌణశ్చేన్నాత్మశబ్దాత్॥ ౬॥

తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్ ॥ ౭ ॥ హేయత్వావచనాచ్చ ॥ ౮॥ స్వాప్యయాత్॥ ౯॥ గతిసామాన్యాత్॥ ౧౦ ॥ శ్రుతత్వాచ్చ ॥ ౧౧॥ అ. ౬ ఆనందమయోఽభ్యాసాత్॥ ౧౨॥వికారశబ్దాన్నేతిచేన్న ప్రాచుర్యాత్॥ ౧౩ ॥ తద్ధేతువ్యపదేశాచ్చ ॥ ౧౪ ॥ మాంత్రవర్ణికమేవచ గీయతే॥ ౧౫॥ నేతరోఽనుపపత్తేః ॥ ౧౬ ॥ భేదవ్యపదేశాచ్చ ॥ ౧౭॥ కామాచ్చనానుమానాపేక్షా॥౧౮॥అస్మిన్నస్యచతద్యోగంశాస్తి॥౧౯॥ అ. ౭ అంతస్తద్ధర్మోపదేశాత్ ॥ ౨౦ ॥ భేదవ్యపదేశాచ్చాన్యః॥ ౨౧॥ అ. ౮- ఆకాశస్తల్లింగాత్ ॥ ౨౨ ॥ అ. ౯- అతఏవ ప్రాణః॥ ౨౩॥ అ. ౧౦ జ్యోతిశ్చరణాభిధానాత్ ॥ ౨౪॥ ఛందోఽభిధానాన్నేతిచేన్న తథా చేతోఽర్పణనిగదాత్తథాహిదర్శనం ॥ ౨౫ ॥ భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చైవం ॥ ౨౬ ॥ ఉపదేశభేదాన్నేతి చేన్నోభయస్మిన్నప్యవిరోధాత్ ॥ ౨౭ ॥ అ. ౧౧- ప్రాణస్తథానుగమాత్॥ ౨౮ ॥ నవక్తురాత్మోపదేశాదితిచేదధ్యాత్మసంబంధభూమాహ్యస్మిన్॥ ౨౯॥ శాస్త్రదృష్ట్యాతూపదేశోవామదేవవత్॥ ౩౦॥ జీవముఖ్యప్రాణలింగాన్నేతిచేన్నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహతద్యోగాత్॥ ౩౧॥ అస్త్రై కాదశైకత్రిగుంశత్॥ ౧౧॥ ౩౧॥ అథ, జన్మాది, శాస్త్రయోని, సమన్వయా, ఈక్షతే, రానందమయో న్త, రాకాశో, తఏవప్రాణో, జ్యోతిః, ప్రాణ, ఏకాదశ॥

ఇతి బ్రహ్మసూత్రే ప్రథమస్యాధ్యాయస్య ప్రథమః పాదః.

ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ ప్రథమాధ్యాయస్య ద్వితీయఃపాదః

అ. ౧- సర్వత్రప్రసిద్ధోపదేశాత్ ॥ ౧ ॥ వివక్షితగుణోపపత్తేశ్చ॥౨॥అనుపపత్తేస్తునశారీరః॥ ౩ ॥ కర్మకర్తృవ్యపదేశాచ్చ॥౪॥

శబ్దవిశేషాత్ ॥ ౫॥ స్మృతేశ్చ ॥ ౬ ॥ అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ ॥ ౭ ॥ సంభోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్ ॥ ౮ ॥ అ- ౨- అత్తా చరాచరగ్రహణాత్ ॥ ౯ ॥ ప్రకరణాచ్చ ॥ ౧౦ ॥ అ- ౩ - గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్ ॥ ౧౧॥ విశేషణాచ్చ ॥ ౧౨॥ అ- ౪- అంతర ఉపపత్తేః ॥ ౧౩॥ స్థానాదివ్యపదేశాచ్చ ॥ ౧౪॥ సుఖవిశిష్టాభిధానాదేవ చ ॥ ౧౫ ॥ శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ ॥ ౧౬ ॥ అనవస్థితేరసంభవాచ్చ నేతరః ॥ ౧౭॥ అ- ౫- అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్ ॥౧౮॥ న చ స్మార్తమతద్ధర్మాభిలాపాత్ ॥ ౧౯॥ శారీరశ్చోభయేఽపి హి భేదేనైనమధీయతే ॥ ౨౦ ॥ అ- ౬- అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః ॥ ౨౧॥ విశేషణభేదవ్యపదేశాభ్యాం చ నేతరౌ ॥ ౨౨॥ రూపోపన్యాసాచ్చ ॥ ౨౩॥ అ- ౭ వైశ్వానరస్సాధారణశబ్దవిశేషాత్ ॥ ౨౪॥ స్మర్యమాణమనుమానం స్యాదితి ॥ ౨౫॥ శబ్దాదిభ్యోఽంతః ప్రతిష్ఠానాచ్చేతి చేన్న తథా దృష్ట్యుపదేశాదసంభవాత్పురుషమపి చైనమధీయతే ॥ ౨౬ ॥ అత ఏవ న దేవతా భూతం చ ॥ ౨౭॥ సాక్షాదప్యవిరోధం జైమినిః ॥ ౨౮॥ అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః ॥ ౨౯॥ అనుస్మృతేర్బాదరిః ॥ ౩౦ ॥ సంపత్తేరితి జైమినిస్తథా హి దర్శయతి ॥ ౩౧॥ ఆమనంతి చైనమస్మిన్ ॥ ౩౨॥ సర్వత్రప్రసిద్ధ్యాదీని ద్వాత్రింశత్ ॥ ౭॥ ౩౨ ॥ సర్వత్రా, త్తా, గుహా, మంతరో, న్తర్యా, మ్యదృశ్య, వైశ్వానరాస్సప్త ॥ ... ... *

ఇతి బ్రహ్మసూత్రే ప్రథమస్యాధ్యాయస్య ద్వితీయః పాదః.

ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణే నమః.

శ్రీ గురుభ్యో నమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ ప్రథమస్యాధ్యాయస్య-తృతీయః పాదః

అ- ౧- ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్ ॥ ౧ ॥ ముక్తోపసృప్యవ్యపదేశాచ్చ ॥ ౨॥ నానుమానమతచ్ఛబ్దాత్ ॥ ౩॥ ప్రాణభృచ్చ ॥ ౪॥

భేదవ్యపదేశాచ్చ॥ ౫ ॥ ప్రకరణాత్ ॥ ౬ ॥ స్థిత్యదనాభ్యాంచ ॥ ౭॥
అ- ౨- భూమాసంప్రసాదాదధ్యుపదేశాత్॥౮॥ ధర్మోపపత్తేశ్చ॥౯॥
అ- ౩- అక్షరమంబరాంతధృతేః ॥ ౧౦॥ సాచప్రశాసనాత్ ॥ ౧౧॥
అన్యభావవ్యావృత్తేశ్చ॥౧౨॥అ- ౪- ఈక్షతికర్మవ్యపదేశాత్సః॥౧౩॥
అ- ౫- దహరఉత్తరేభ్యః ॥ ౧౪ ॥ గతిశబ్దాభ్యాంతథాహిదృష్టంలిం
గంచ ౧౫ ॥ ధృతేశ్చమహిమ్నోస్యాస్మిన్నుపలబ్ధేః ॥ ౧౬ ॥ ప్రసిద్ధే
శ్చ॥ ౧౭॥ ఇతరపరామర్శాత్సఇతిచేన్నాసంభవాత్॥ ౧౮ ॥ అ- ౬-
ఉత్తరాచ్చేదావిర్భూతస్వరూపస్తు॥౧౯॥ అన్యార్థశ్చపరామర్శః॥౨౦॥
అల్పశ్రుతేరితిచేత్తదుక్తం॥ ౨౧ ॥ అ ౭- అనుకృతేస్తస్యచ॥౨౨॥అపి
చస్మర్యతే॥ ౨౩॥ అ- ౮- శబ్దాదేవప్రమితః॥ ౨౪॥ హృద్యపేక్షయా
తుమనుష్యాధికారత్వాత్ ॥ ౨౫ ॥ అ- ౯- తదుపర్యపి బాదరాయణ
స్సంభవాత్ ॥ ౨౬ ॥విరోధఃకర్మణీతిచేన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్॥౨౭॥
శబ్దఇతిచేన్నాతఃప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యాం॥ ౨౮॥ అతఏవ
చనిత్యత్వం॥౨౯॥సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధోదర్శ
నాత్స్మృతేశ్చ॥ ౩౦॥ మధ్వాదిష్వసంభవాదనధికారంజైమినిః॥౩౧॥
జ్యోతిషిభావాచ్చ॥ ౩౨॥ భావంతుబాదరాయణోస్తిహి॥౩౩॥అ- ౧౦-
శుగస్యతదనాదరశ్రవణాత్తదాద్రవణాత్సూచ్యతేహి ॥ ౩౪ ॥ క్షత్రి
యత్వగతేశ్చోత్తరత్రచైత్రరథేనలింగాత్ ॥ ౩౫॥ సంస్కారపరామ
ర్శాత్తదభావాభిలాపాచ్చ॥ ౩౬ ॥ తదభావనిర్ధారణేచప్రవృత్తేః॥ ౩౭॥
శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్స్మృతేశ్చ ॥ ౩౮ ॥ అ- ౧౧- కంప
నా ॥ ౩౯॥ అ ౧౨- జ్యోతిర్దర్శనాత్ ॥ ౪౦ ॥ అ- ౧౩- ఆకాశో
ర్థాంతరత్వాదివ్యపదేశాత్॥ ౪౧ ॥ అ- ౧౪ - సుషుప్త్యుత్క్రాంత్యో
ర్భేదేన॥ ౪౨॥ పత్యాదిశబ్దేభ్యః॥ ౪౩॥ వ్యభావాదేశ్చ ౩ ద్విశత్రిచత్వా
రింశత్॥ ౧౪॥ ౪౩ ॥ ద్యుభ్వాది, భూమా, క్షరే, ఈక్షతి, దహర, ఉ
త్తరా, దనుకృతే, శబ్దా, త్తదుపరి, శుగస్య, కంపనా, జ్యోతిర్ద
ర్శనా, దాకాశోర్థాంతరత్వాదివ్యపదేశా, త్సుషుప్త్యుత్క్రాంత్యో
శ్చతుర్దశ ॥ ... ... ... ... ...

ఇతి బ్రహ్మసూత్రే - ప్రథమస్యాధ్యాయస్య తృతీయః పాదః

—(*)(*)(*)—

ఓం.

శ్రీ వాసుదేవ పరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యో నమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ ప్రథమస్యాధ్యాయస్య - చతుర్థః పాదః

అ-౧- ఆనుమానికమప్యేకేషామితిచేన్న శరీరరూపకవిన్యస్తగృహీతేర్దర్శయతిచ॥ ౧ ॥ సూక్ష్మంతు తదర్హత్వాత్ ॥ ౨ ॥ తదధీనత్వాదర్థవత్ ॥ ౩ ॥ జ్ఞేయత్వావచనాచ్చ ॥ ౪ ॥ వదతీతిచేన్నప్రాజ్ఞోహి ప్రకరణాత్ ॥ ౫ ॥ త్రయాణామేవచైవముపన్యాసః ప్రశ్నశ్చ ॥ ౬ ॥ మహద్వచ్చ ॥ ౭ ॥ అ-౨- చమసవదవిశేషాత్ ॥ ౮ ॥ జ్యోతిరుపక్రమాతుతథాహ్యధీయతఏకే ॥ ౯ ॥ కల్పనోపదేశాచ్చ మధ్వాదివదవిరోధః ॥ ౧౦ ॥ అ-౩- నసంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ ॥ ౧౧ ॥ ప్రాణాదయో వాక్యశేషాత్ ॥ ౧౨ ॥ జ్యోతిషైకేషామసత్యన్నే ॥ ౧౩ ॥ అ-౪- కారణత్వేనచాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః ॥ ౧౪ ॥ సమాకర్షాత్ ॥ ౧౫ ॥ అ-౫- జగద్వాచిత్వాత్ ॥ ౧౬ ॥ జీవముఖ్యప్రాణలింగాన్నేతిచేత్తద్వ్యాఖ్యాతం ॥ ౧౭ ॥ అన్యార్థంతు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యామపిచైవమేకే ॥ ౧౮ ॥ అ-౬- వాక్యాన్వయాత్ ॥ ౧౯ ॥ ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః ॥ ౨౦ ॥ ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః ॥ ౨౧ ॥ అవస్థితేరితి కాశకృత్స్నః ॥ ౨౨ ॥ అ-౭- ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్ ॥ ౨౩ ॥ అభిధ్యోపదేశాచ్చ ॥ ౨౪ ॥ సాక్షాచ్చోభయామ్నానాత్ ॥ ౨౫ ॥ ఆత్మకృతేః పరిణామాత్ ॥ ౨౬ ॥ యోనిశ్చహిగీయతే ॥ ౨౭ ॥ అ-౮- ఏతేనసర్వేవ్యాఖ్యాతావ్యాఖ్యాతాః ॥ ౨౮ ॥ ఆనుమానికమష్టావష్టావింశతిః ॥ ౮ ॥ ౨౮ ॥ ఆనుమానిక, చమస, నసంఖ్యాకారణత్వ, జగద్వాచిత్వ, వాక్యాన్వయ, ప్రకృతి, సర్వవ్యాఖ్యాష్టౌ ॥

ఇతి బ్రహ్మసూత్రే - ప్రథమస్యాధ్యాయస్య - చతుర్థః పాదః.

నకర్మావిభాగాదితిచేన్నానాదిత్వాత్ ॥ ౩౫ ॥ ఉపపద్యతేచాప్యుపలభ్యతేచ॥ ౩౬॥ అ- ౧౩ సర్వధర్మోపపత్తేశ్చ॥ ౩౭ ॥

సూత్రాణి త్రయోదశ సప్తత్రింశత్ ॥ ౧౩॥ ౩౭॥

స్మృతి, యోగ, నవిలక్షణ, శిష్ట, భోక్త్రా, ఆరంభణ, ఇతర, ఉపసంహార, కృత్స్న, సర్వోపేత, ప్రయోజన, వైషమ్య, సర్వధర్మా, త్రయోదశ.

ఇతి బ్రహ్మసూత్రే ద్వితీయస్యాధ్యాయస్య ప్రథమః పాదః.

ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణే నమః.

శ్రీగురుభ్యో నమః హరిః ఓం.

# బ్రహ్మసూత్రాణి

## అథ ద్వితీయాధ్యాయస్య ద్వితీయః పాదః

అ- ౧ రచనానుపపత్తేశ్చనానుమానం॥ ౧ ॥ ప్రవృత్తేశ్చ॥ ౨॥ పయోంబువచ్చేత్తత్రాపి॥ ౩॥ వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్॥ ౪॥ అన్యత్రాభావాచ్చనతృణాదివత్ ॥ ౫ ॥ అభ్యుపగమేప్యర్థాభావాత్॥ ౬॥ పురుషాశ్మవదితిచేత్తథాపి ॥ ౭ ॥ అంగిత్వానుపపత్తేశ్చ॥ ౮॥ అన్యథానుమితౌచజ్ఞశక్తివియోగాత్॥ ౯ ॥ విప్రతిషేధాచ్చాసమంజసం ॥ ౧౦ ॥ అ- ౨ మహద్దీర్ఘవద్వాహ్రస్వపరిమండలాభ్యాం॥ ౧౧ ॥ ఉభయథాపినకర్మాతస్తదభావః ॥ ౧౨ ॥ సమవాయాభ్యుపగమాచ్చసామ్యాదనవస్థితేః ॥ ౧౩ ॥ నిత్యమేవచభావాత్ ॥౧౪॥ రూపాదిమత్త్వాచ్చవిపర్యయోదర్శనాత్ ॥ ౧౫ ॥ అ- ౩ ఉభయథాచదోషాత్ ॥ ౧౬ ॥ అపరిగ్రహాచ్చాత్యంతమనపేక్షా ॥ ౧౭ ॥ అ- ౪ సముదాయఉభయహేతుకేపితదప్రాప్తిః॥ ౧౮ ॥ ఇతరేతరప్రత్యయత్వాదితిచేన్నోత్పత్తిమాత్రనిమిత్తత్వాత్ ॥ ౧౯ ॥ ఉత్తరోత్పాదేచపూర్వనిరోధాత్॥ ౨౦॥ అసతిప్రతిజ్ఞోపరోధోయౌగపద్య

మన్యథా॥ ౨౧॥ ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యావిరోధాప్రాప్తి రవిచ్ఛేదా త్॥ ౨౨॥ ఉభయథాచదోషాత్॥ ౨౩॥ ఆకాశేచావిశేషాత్॥ ౨౪॥ అనుస్మృతేశ్చ॥ ౨౫॥ నాసతోదృష్టత్వాత్॥ ౨౬॥ ఉదాసీనానామపి చైవంసిద్ధిః॥ ౨౭॥ అ- ౫- నాభావఉపలబ్ధేః॥ ౨౮॥ వైధర్మ్యాచ్చన స్వప్నాదివత్॥ ౨౯॥ నభావోనుపలబ్ధేః॥ ౩౦॥ క్షణికత్వాచ్చ॥ ౩౧॥ సర్వథానుపపత్తేశ్చ॥ ౩౨॥ అ- ౬- నైకస్మిన్నసంభవాత్॥ ౩౩॥ ఏవం చాత్మాకార్త్స్న్యం॥ ౩౪॥ నచపర్యాయాదప్యవిరోధోవికారాది భ్యః॥ ౩౫॥ అంత్యావస్థితేశ్చోభయనిత్యత్వాదవిశేషః॥ ౩౬॥ అ- ౭- పత్యురసామంజస్యాత్॥ ౩౭॥ సంబంధానుపపత్తేశ్చ॥ ౩౮॥ అధిష్ఠా నానుపపత్తేశ్చ॥ ౩౯॥ కరణవచ్చేన్నభోగాదిభ్యః॥ ౪౦॥ అంతవత్త్వ మసర్వజ్ఞతావా॥ ౪౧॥ అ- ౮- ఉత్పత్త్యసంభవాత్॥ ౪౨॥ నచక ర్తుఃకరణం॥ ౪౩॥ విజ్ఞానాదిభావేవాతదప్రతిషేధః॥ ౪౪॥ విప్రతిషే ధాచ్చ॥ ౪౫॥ రచనానుపపత్తిరష్టౌ౦చచత్వారిగ్౦శత్॥ ౮॥ ౪౫॥ రచనా, మహ, దుభయ, సముదాయ, నాభావ, నైకస్మిన్, పత్యు, రుత్పత్తిరష్టౌ॥

ఇతి బ్రహ్మసూత్రే ద్వితీయస్యాధ్యాయస్య- ద్వితీయఃపాదః.

ఓం.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ ద్వితీయాధ్యాయస్య తృతీయఃపాదః

అ- ౧- నవియదశ్రుతేః॥ ౧॥ అస్తితు॥ ౨॥ గౌణ్యసంభవా త్॥ ౩॥ శబ్దాచ్చ॥ ౪॥ స్యాచ్చైకస్యబ్రహ్మశబ్దవత్॥ ౫॥ ప్రతిజ్ఞాహా నిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః॥ ౬॥ యావద్వికారంతువిభాగోలోకవత్॥ ౭॥ అ- ౨- ఏతేనమాతరిశ్వావ్యాఖ్యాతః॥ ౮॥ అ- ౩- అసంభవస్తుసతో

సుపపత్తేః॥ ౯॥ అ-౪- తేజోఽతస్తథా హ్యాహ॥౧౦॥అ- ౫- ఆపః॥౧౧॥
అ- ౬- పృథివ్యధికారరూపశబ్దాంతరేభ్యః॥ ౧౨॥ అ-౭- తదభిధ్యా
నాదేవతుతల్లింగాత్సః॥ ౧౩॥ అ- ౮ విపర్యయేణతుక్రమోఽత ఉప
పద్యతేచ॥ ౧౪॥ అ- ౯- అంతరావిజ్ఞానమనసీక్రమేణతల్లింగాదితి
చేన్నావిశేషాత్॥ ౧౫ ॥ అ - ౧౦ - చరాచరవ్యపాశ్రయస్తుస్యాత్త
ద్వ్యపదేశోభాక్తస్తద్భావభావిత్వాత్॥ ౧౬ ॥ అ ౧౧ - నాత్మా
శ్రుతేర్నిత్యత్వాచ్చతాభ్యః॥౧౭॥ అ- ౧౨- జ్ఞోఽతఏవ॥ ౧౮॥ అ ౧౩-
ఉత్క్రాంతిగత్యాగతీనాం॥ ౧౯॥ స్వాత్మనాచోత్తరయోః॥ ౨౦॥ నా
ణురతచ్ఛ్రుతేరితిచేన్నేతరాధికారాత్ ॥ ౨౧ ॥ స్వశబ్దోన్మానా
భ్యాంచ॥ ౨౨॥ అవిరోధశ్చందనవత్॥ ౨౩ ॥ అవస్థితివైశేష్యాదితిచే
న్నాభ్యుపగమాద్ధృదిహి॥ ౨౪॥ గుణాద్వాలోకవత్ ॥ ౨౫॥ వ్యతిరే
కోగంధవత్॥ ౨౬॥ తథాచదర్శయతి॥ ౨౭॥ పృథగుపదేశాత్॥౨౮॥
తద్గుణసారత్వాత్తుతద్వ్యపదేశః ప్రాజ్ఞవత్॥ ౨౯॥ యావదాత్మభా
విత్వాచ్చనదోషస్తద్దర్శనాత్ ॥ ౩౦ ॥ పుంస్త్వాదివత్త్వస్యసతోఽభివ్యక్తి
యోగాత్॥ ౩౧॥ నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగోఽన్యతరనియమోవా
న్యథా॥ ౩౨॥ అ- ౧౪- కర్తాశాస్త్రార్థవత్త్వాత్॥ ౩౩॥ విహారోపదే
శాత్॥ ౩౪॥ ఉపాదానాత్ ॥ ౩౫ ॥ వ్యపదేశాచ్చక్రియాయాంనచే
న్నిర్దేశవిపర్యయః॥ ౩౬ ॥ ఉపలబ్ధివదనియమః ॥ ౩౭ ॥ శక్తివిపర్య
యాత్॥ ౩౮॥ సమాధ్యభావాచ్చ॥ ౩౯॥ అ ౧౫ యథాచతక్షోభ
యథా॥ ౪౦॥ అ ౧౬ పరాత్తుతచ్ఛ్రుతేః॥ ౪౧॥ కృతప్రయత్నా
పేక్షస్తువిహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః॥ ౪౨॥ అ ౧౭ అంశోనా
నావ్యపదేశాదన్యథాచాపిదాశకితవాదిత్వమధీయతఏకే॥ ౪౩॥ మం
త్రవర్ణాచ్చ ॥ ౪౪ ॥ అపిచస్మర్యతే ॥ ౪౫ ॥ ప్రకాశాదివన్నైవంప
రః॥ ౪౬॥ స్మరంతిచ ॥ ౪౭ ॥ అనుజ్ఞాపరిహారౌ దేహసంబంధాత్
జ్యోతిరాదివత్ ॥ ౪౮ ॥ అసంతతేశ్చావ్యతికరః ॥ ౪౯ ॥ ఆభాస
ఏవచ ॥ ౫౦ ॥ అదృష్టానియమాత్ ॥ ౫౧ ॥ అభిసంధ్యాదిష్వపిచై
వం॥ ౫౨॥ ప్రదేశాదితిచేన్నాంతర్భావాత్ ॥ ౫౩ ॥ నవియదశ్రుతే
స్సప్తదశత్రిపంచాశత్ ॥ ౧౭ ॥ ౫౩ ॥ నవియద్దృశతే, ఏతేనమాత
రిశ్వా, అసంభవస్తు, తేజోఽత, ఆపః, పృథివీ, తదభిధ్యానా, ద్విప

ర్యథేణాం, తరా, చరాచరవ్యపాశ్రయా, నాత్మా, జ్ఞాత, ఉత్క్రాంతిగత్యాగతి, కర్తా, యథాచతక్ష, పరాత్తు, అంశో, నానా, సప్తదశ ॥ ౧౭ ॥ ... ... *

ఇతి బ్రహ్మసూత్రే - ద్వితీయస్యాధ్యాయస్య తృతీయః పాదః.

ఓం.

శ్రీ వాసుదేవ పరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ ద్వితీయాధ్యాయస్య చతుర్థఃపాదః-

అ- ౧- తథాప్రాణాః॥౧॥ గౌణ్యసంభవాత్॥ ౨॥ తత్ప్రాక్ శ్రుతేశ్చ॥ ౩॥ తత్పూర్వకత్వాద్వాచః॥ ౪॥ అ- ౨- సప్తగతేర్విశేషితత్వాచ్చ ॥ ౫ ॥ హస్తాదయస్తుస్థితేఽతోనైవం॥ ౬ ॥ అ- ౩ - అణవశ్చ॥ ౭॥ అ- ౪- శ్రేష్ఠశ్చ॥ ౮॥ అ- ౫- నవాయుక్రియే పృథగుపదేశాత్॥ ౯॥ చక్షురాదివత్తుతత్సహశిష్ట్యాదిభ్యః॥ ౧౦ ॥ అకరణత్వాచ్చనదోషస్తథాహిదర్శయతి ॥ ౧౧ ॥ పంచవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే॥ ౧౨॥ అ- ౬- అణుశ్చ॥ ౧౩॥ అ - ౭ - జ్యోతిరాద్యధిష్ఠానంతు తదామననాత్॥ ౧౪॥ ప్రాణవతాశబ్దాత్ ॥ ౧౫ ॥ తస్యచనిత్యత్వాత్॥ ౧౬॥ అ- ౮- తఇంద్రియాణితద్వ్యపదేశాదన్యత్రశ్రేష్ఠాత్ ॥౧౭॥ భేదశ్రుతేః॥ ౧౮॥ వైలక్షణ్యాచ్చ॥ ౧౯॥ అ- ౯- సంజ్ఞామూర్తిక్లృప్తిస్తుత్రివృత్కుర్వత ఉపదేశాత్॥ ౨౦ ॥ మాంసాదిభౌమం యథాశబ్దమితరయోశ్చ॥ ౨౧॥ వైశేష్యాత్తుతద్వాదస్తద్వాదః ॥ ౨౨ ॥ తథాప్రాణానవద్వావింశతిః॥ ౯॥ ౨౨॥ తథాప్రాణా, సప్తగతే, రణవః, శ్రేష్ఠో, నవాయు, రణుశ్చ, జ్యోతిరాది, తఇంద్రియాణి సంజ్ఞామూర్తి, ర్నవ ॥ ౯ ॥ ... ... *

ఇతి బ్రహ్మసూత్రే - ద్వితీయాధ్యాయస్య చతుర్థః పాదః.

—(*)—

ఓం.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ తృతీయాధ్యాయస్య - ప్రథమఃపాదః

అ- ౧. తదంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యాం॥ ౧ ॥ త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్ ॥ ౨ ॥ ప్రాణగతేశ్చ॥ ౩॥ అగ్న్యాదిషు గతిశ్రుతేరితి చేన్న భాక్తత్వాత్॥ ౪ ॥ ప్రథమేఽశ్రవణాదితి చేన్న తా ఏవ హ్యుపపత్తేః॥ ౫ ॥ అశ్రుతత్వాదితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః ॥ ౬ ॥ భాక్తం వాఽనాత్మవిత్త్వాత్తథాహి దర్శయతి॥ ౭॥ అ- ౨- కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవంచ॥ ౮॥ చరణాదితి చేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః॥ ౯॥ ఆనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్॥ ౧౦ ॥ సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః॥ ౧౧॥ అ- ౩- అనిష్టాదికారిణామపి చ శ్రుతం॥ ౧౨ ॥ సంయమనే త్వనుభూయేతరేషామారోహావరోహౌ తద్గతిదర్శనాత్॥ ౧౩॥ స్మరంతి చ॥ ౧౪॥ అపి చ సప్త ॥ ౧౫ ॥ తత్రాపి తద్వ్యాపారాదవిరోధః॥ ౧౬॥ విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్॥ ౧౭॥ న తృతీయే తథోపలబ్ధేః॥ ౧౮॥ స్మర్యతేఽపి చ లోకే॥ ౧౯ ॥ దర్శనాచ్చ ॥ ౨౦ ॥ తృతీయశబ్దావరోధస్సంశోకజస్య॥ ౨౧॥ అ- ౪ సాభావ్యాపత్తిరుపపత్తేః॥ ౨౨॥ అ- ౫- నాతిచిరేణ విశేషాత్॥ ౨౩ ॥ అ- ౬ అన్యాధిష్ఠితే పూర్వవదభిలాపాత్॥ ౨౪॥ అశుద్ధమితి చేన్న శబ్దాత్॥ ౨౫ ॥ రేతస్సిగ్యోగోఽథ॥ ౨౬॥ యోనేశ్శరీరం॥ ౨౭॥ తదంతరప్రతిపత్తౌ షట్ సప్తవింశతిః॥ ౬॥ ౨౭॥ తదంతర, కృతాత్యయే, నిష్టాదికారి, సాభావ్య, నాతిచిరే, ణాన్యాధిష్ఠితే, షట్॥ ౬ ॥

ఇతి బ్రహ్మసూత్రే- తృతీయస్యాధ్యాయస్య ప్రథమఃపాదః.

ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యో నమః హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ తృతీయాధ్యాయస్య ద్వితీయఃపాదః-

అ- ౧- సంధ్యేసృష్టిరాహహి॥ ౧॥ నిర్మాతారంచైకేపుత్రా
దయశ్చ॥ ౨॥మాయామాత్రంతుకార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వా
త్॥ ౩॥ సూచకశ్చహిశ్రుతేరాచక్షతేచతద్విదః॥ ౪॥ పరాభిధ్యానా
త్తుతిరోహితంతతోహ్యస్యబంధవిపర్యయౌ ॥ ౫ ॥ దేహయోగాద్వా
సోఽపి॥ ౬॥ అ- ౨- తదభావోనాడీషుతచ్ఛ్రుతేరాత్మనిచ॥ ౭ ॥ అతః
ప్రబోధోఽస్మాత్ ॥ ౮ ॥ అ- ౩- సఏవతుకర్మానుస్మృతిశబ్దవిధి
భ్యః॥ ౯॥ అ- ౪- ముగ్ధేఽర్ధసంపత్తిఃపరిశేషాత్॥ ౧౦॥ అ- ౫- నస్థా
నతోఽపిపరస్యోభయలింగంసర్వత్రహి॥౧౧॥ నభేదాదితిచేన్నప్రత్యేక
మతద్వచనాత్॥ ౧౨॥ అపిచైవమేకే॥ ౧౩ ॥ అరూపవదేవహితత్ప్ర
ధానత్వాత్॥ ౧౪॥ ప్రకాశవచ్చావైయర్థ్యం ॥ ౧౫ ॥ ఆహచతన్మా
త్రం॥ ౧౬॥ దర్శయతిచాథోఅపిస్మర్యతే ॥ ౧౭ ॥ అతఏవచోపమా
సూర్యకాదివత్॥ ౧౮॥ అంబువదగ్రహణాత్తునతథాత్వం॥ ౧౯॥ వృద్ధి
హ్రాసభాక్త్వమంతర్భావాదుభయసామంజస్యాదేవం॥ ౨౦॥ దర్శనా
చ్చ॥ ౨౧॥ అ- ౬- ప్రకృతైతావత్త్వంహిప్రతిషేధతి తతోబ్రవీతిచ
భూయః॥ ౨౨॥ తదవ్యక్తమాహహి॥ ౨౩ ॥ అపిసంరాధనే ప్రత్యక్షా
నుమానాభ్యాం ॥ ౨౪ ॥ ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చకర్మ
ణ్యభ్యాసాత్॥ ౨౫॥ అతోఽనంతేనతథాహిలింగం॥ ౨౬॥ ఉభయవ్యప
దేశాత్త్వహికుండలవత్॥ ౨౭॥ ప్రకాశాశ్రయవద్వాతేజస్త్వాత్॥ ౨౮॥
పూర్వవద్వా॥ ౨౯॥ ప్రతిషేధాచ్చ॥ ౩౦॥ అ- ౭ - పరమతస్సేతూ
న్మానసంబంధభేదవ్యపదేశేభ్యః॥ ౩౧॥ సామాన్యాత్తు॥ ౩౨ ॥ బుద్ధ్య
ర్థఃపాదవత్॥ ౩౩॥ స్థానవిశేషాత్ ప్రకాశాదివత్॥ ౩౪ ॥ ఉపపత్తే
శ్చ॥ ౩౫॥ తథాఽన్యప్రతిషేధాత్॥ ౩౬॥ అనేనసర్వగతత్వమాయా
మశబ్దాదిభ్యః॥ ౩౭॥ అ- ౮- ఫలమతఉపపత్తేః ॥ ౩౮ ॥ శ్రుతత్వా

వ్యా॥ ౩౯॥ ధర్మంజైమినిరతఏవ ॥ ౪౦ ॥ పూర్వంతుబాదరాయణోహే తువ్యపదేశాత్ ॥౪౧॥ సంధ్యేస్పష్టిరష్టావేకచత్వారింశత్ ॥ ౮ ॥ ౪౧॥
సంధ్యే, తదభావ, స్వవవతు, ముగ్ధే, నస్థానతః, ప్రకృతైతావత్వా, పరం, ఫల, మష్టౌ ॥ ౮ ॥ ... ... *

ఇతి బ్రహ్మసూత్రే - తృతీయస్యాధ్యాయస్య ద్వితీయః పాదః.

ఓం.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః

శ్రీ గురుభ్యో నమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ తృతీయాధ్యాయస్య తృతీయః పాదః

అ-౧- సర్వవేదాంత ప్రత్యయంచోదనాద్యవిశేషాత్ ॥ ౧ ॥ భేదాన్నేతిచేన్నైకస్యామపి॥ ౨ ॥ స్వాధ్యాయస్యతథాత్వే నహిస మాచారేఽధికారాచ్చ సవవచ్చతన్నియమః॥ ౩॥ దర్శయతిచ ॥ ౪ ॥ అ-౨- ఉపసంహారోర్థాభేదాద్విధిశేషవత్సమానేచ ॥ ౫ ॥ అ- ౩- అన్యధాత్వంశబ్దాదితిచేన్నావిశేషాత్ ॥ ౬॥ నవాప్రకరణభేదాత్పరో వరీయస్త్వాదివత్ ॥ ౭॥ సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తితుతదపి॥ ౮॥ అ- ౪- వ్యాప్తేశ్చసమంజసం॥ ౯॥ అ-౫- సర్వాభేదాదన్యత్రేమే॥ ౧౦॥ అ-౬- ఆనందాదయఃప్రధానస్య॥ ౧౧॥ ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయా పచయౌహిభేదే॥ ౧౨॥ ఇతరేత్వర్థసామాన్యాత్ ॥౧౩॥ అ-౭-ఆధ్యా నాయప్రయోజనాభావాత్॥ ౧౪॥ ఆత్మశబ్దాచ్చ॥ ౧౫॥ అ-౮- ఆత్మ గృహీతిరితరవదుత్తరాత్ ॥ ౧౬ ॥ అన్వయాదితిచేత్స్యాదవధారణా త్॥ ౧౭॥ అ- ౯- కార్యాఖ్యానాదపూర్వం॥ ౧౮॥ అ- ౧౦- సమాన ఏవంచాభేదాత్॥ ౧౯॥ అ- ౧౧- సంబంధాదేవమన్యత్రాపి॥ ౨౦ ॥ నవావిశేషాత్ ॥ ౨౧॥ దర్శయతిచ॥ ౨౨ ॥ అ -.౧౨ - సంభృతిద్యు వ్యాప్త్యపిచాతః॥ ౨౩॥ అ- ౧౩- పురుషవిద్యాయామివచేతరేషామ

నామ్నానాత్ ॥ ౨౪॥ అ- ౧౪- వేధాద్యర్థభేదాత్ ॥౨౫॥ అ- ౧౫- హానౌతూపాయన శబ్దశేషత్వాత్ కుశాచ్ఛందః స్తుత్యుపగానవత్తదుక్తం ॥ ౨౬ ॥ అ- ౧౬ - సాంపరాయేతర్తవ్యాభావాత్తథాహ్యన్యే॥ ౨౭॥ ఛందతఉభయావిరోధాత్ ॥ ౨౮॥ అ - ౧౭ - గతేరర్థవత్త్వముభయథాన్యథాహివిరోధః॥ ౨౯ ॥ ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్ ॥ ౩౦॥ అ- ౧౮- అనియమస్సర్వేషామవిరోధశ్శబ్దానుమానాభ్యాం॥ ౩౧॥ అ- ౧౯ - యావదధికారమవస్థితిరాధికారికాణాం॥ ౩౨॥ అ- ౨౦- అక్షరధియాంత్వవరోధస్సామాన్యతద్భావాభ్యామౌపసదవత్తదుక్తం॥ ౩౩॥ అ- ౨౧- ఇయదామననాత్ ॥ ౩౪॥ అ- ౨౨- అంతరాభూతగ్రామవత్స్వాత్మనః ॥ ౩౫ ॥ అన్యథాభేదానుపపత్తిరితిచేన్నోపదేశాంతరవత్ ॥ ౩౬॥ అ - ౨౩ - వ్యతిహారోవిశింషంతిహీతరవత్ ॥ ౩౭॥ అ- ౨౪ - సైవహిసత్యాదయః ॥ ౩౮ ॥ అ- ౨౫- కామాదీతరత్రతత్రచాయతనాదిభ్యః॥ ౩౯॥ అ- ౨౬- ఆదరాదలోపః॥ ౪౦॥ ఉపస్థితే తస్తద్వచనాత్ ॥ ౪౧॥ అ- ౨౭ - తన్నిర్ధారణానియమస్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబంధఃఫలం॥ ౪౨॥ అ- ౨౮- ప్రధానవదేవతదుక్తం॥ ౪౩॥ అ- ౨౯- లింగభూయస్త్వాత్తద్ధిబలీయస్తదపి ॥ ౪౪ ॥ పూర్వవికల్పప్రకరణాత్ స్యాత్క్రియా మానసవత్ ॥ ౪౫॥ అతిదేశాచ్చ॥ ౪౬॥ విద్యైవతునిర్ధారణాత్ ॥ ౪౭ ॥ దర్శనాచ్చ॥ ౪౮॥ శ్రుత్యాదిబలీయస్త్వాచ్చనబాధః ॥ ౪౯ ॥ అనుబంధాదిభ్యఃప్రజ్ఞాంతరపృథక్త్వవద్దృష్టశ్చతదుక్తం॥ ౫౦॥ నసామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువన్నహిలోకాపత్తిః॥ ౫౧॥ పరేణచశబ్దస్యతాద్విధ్యంభూయస్త్వాత్త్వనుబంధః॥ ౫౨ ॥ అ- ౩౦ - ఏకఆత్మనశ్శరీరేభావాత్ ॥ ౫౩ ॥ వ్యతిరేకస్తద్భావాభావిత్వాన్న తూపలబ్ధివత్ ॥ ౫౪ ॥ అ- ౩౧- అంగావబద్ధాస్తునశాఖాసుహిప్రతివేదం॥ ౫౫ ॥ మంత్రాదివద్వాఽవిరోధ ॥ ౫౬॥ అ- ౩౨- భూమ్నఃక్రతువజ్జ్యాయస్త్వంతథాహిదర్శయతి॥ ౫౭॥ అ- ౩౩- నానాశబ్దాదిభేదాత్॥ ౫౮॥ అ- ౩౪- వికల్పోఽవిశిష్టఫలత్వాత్॥ ౫౯॥ అ- ౩౫- కామ్యాస్తుయథాకామం సముచ్చీయేరన్నవాపూర్వహేత్వభావాత్ ॥ ౬౦ ॥ అ- ౩౬- అంగేషుయథాశ్రయభావః॥ ౬౧॥ శిష్టేశ్చ॥ ౬౨ ॥ సమాహారాత్॥ ౬౩ ॥

గుణసాధారణ్యశ్రుతేశ్చ॥౬౪॥ నవాతత్సహభావాశ్రుతేః॥౬౫॥ దర్శ
నాచ్చ॥౬౬॥సర్వవేదాంతప్రత్యయసారంచ త్రిశత్షష్టిః॥ ౩౬॥ ౬౬॥
సర్వవేదాంతో, పసంహారో, న్యథాత్వ, వ్యాప్తేః స్సర్వాభేదా,
దానందాదయ, అర్థ్యానాయా, త్మగృహీతిః, కార్యాఖ్యానా,
త్సమాన, స్సంబంధా, త్సంభృతి, పురుషవిద్యాయాం, వేధాద్యర్థ,
హానౌ, సాంపరాయే, గతే, రనియమో, యావదధికార, మక్షరధి
యా, మియదామనసా, దంతరాభూతగ్రామ, వ్యతిహార, స్సైవ
హి, కామాద్యా, దదగాదలోప, స్తన్నిర్ధారణానియమః, ప్రధా
నవ, ల్లింగభూయ, ఏకఆత్మనోం, గాఽబద్ధాస్తు, భూమ్నో, నానా
శబ్దాది, వికల్పః, కామ్యా, అంగేషు, యథాశ్రయభావ షట్త్రిగ్
శతి॥ ౩౬॥

ఇతి బ్రహ్మసూత్రే తృతీయస్యాధ్యాయస్య తృతీయఃపాదః.

ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యో నమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ తృతీయాధ్యాయస్య చతుర్థఃపాదః-

అ- ౧- పురుషార్థోతశ్శబ్దాదితి బాదరాయణః ॥ ౧ ॥ శేష
త్వాత్పురుషార్థవాదోయథాన్యేష్వితిజైమినిః ॥ ౨ ॥ ఆచారదర్శనా
త్॥ ౩॥ తచ్ఛ్రుతేః॥ ౪ ॥ సమన్వారంభణాత్ ॥ ౫ ॥ తద్వతోవిధా
నాత్॥ ౬॥ నియమాచ్చ॥ ౭ ॥ అధికోపదేశాత్తు బాదరాయణస్యై
వంతద్దర్శనాత్ ॥ ౮॥ తుల్యంతుతద్దర్శనం॥౯॥ అసార్వత్రికీ॥౧౦॥ విభా
గశ్శతవత్॥ ౧౧॥ అధ్యయనమాత్రవతః॥ ౧౨॥ నావిశేషాత్॥ ౧౩॥

స్తుతయేనుమతిర్వా॥ ౧౪॥ కామకారేణ చైకే॥౧౫॥ ఉపమర్దంచ॥౧౬॥
ఊర్ధ్వరేతస్సుచశబ్దేహి॥ ౧౭॥ అ- ౨- పరామర్శంజైమినిరచోదనా
చాపవదతిహి॥ ౧౮॥ అనుష్ఠేయంబాదరాయణస్సామ్యశ్రుతేః॥ ౧౯॥
విధిర్వాధారణవత్ ॥ ౨౦॥ అ- ౩ - స్తుతిమాత్రముపాదానాదితిచే
న్నాపూర్వత్వాత్॥ ౨౧ ॥ భావశబ్దాచ్చ॥ ౨౨ ॥ అ . ౪ - పారిప్ల
వార్థా ఇతిచేన్న విశేషితత్వాత్ ॥ ౨౩ ॥ తథాచైక వాక్యతోపబం
ధాత్ ॥ ౨౪ ॥ అ- ౫ - అతఏవచాగ్నీంధనాద్యనపేక్షా ॥ ౨౫ ॥
అ-౬- సర్వాపేక్షాచ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్ ॥ ౨౬ ॥ శమదమాద్యు
పేతస్స్యాత్తథాపితుతద్విధేస్తదంగతయా తేషామవశ్యానుష్ఠేయత్వా
త్॥ ౨౭॥ అ - ౭ - సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనా
త్॥ ౨౮॥ అబాధాచ్చ॥ ౨౯॥ అపిచస్మర్యతే ॥ ౩౦ ॥ శబ్దశ్చాతోఽ
కామకారే॥ ౩౧॥ అ- ౮- విహితత్వాచ్చాశ్రమకర్మాపి॥ ౩౨॥ సహ
కారిత్వేనచ॥ ౩౩॥ సర్వథాపితఏవోభయలింగాత్॥౩౪॥ అనభిభవంచ
దర్శయతి॥ ౩౫॥అ- ౯- అంతరాచాపితుతద్దృష్టేః॥౩౬॥ అపిచస్మర్య
తే॥ ౩౭॥ విశేషానుగ్రహశ్చ ॥ ౩౮ ॥ అతస్త్వితరజ్జ్యాయో లింగా
చ్చ॥ ౩౯॥ అ- ౧౦- తద్భూతస్యతు నాతద్భావో జైమినేరపినియమా
తద్రూపాభావేభ్యః॥ ౪౦॥ అ - ౧౧ నచాధికారికమపి పతనాను
మానాత్తదయోగాత్॥ ౪౧॥ ఉపపూర్వమపిత్వేకేభావమశనవత్తదు
క్తం॥ ౪౨॥ అ ౧౨- బహిస్తూభయథాపి స్మృతేరాచారాచ్చ॥౪౩॥
అ- ౧౩- స్వామినఃఫలశ్రుతేరిత్యాత్రేయః ॥ ౪౪ ॥ ఆర్త్విజ్యమిత్యౌ
డులోమిస్తస్మైహిపరిక్రీయతే॥ ౪౫॥ శ్రుతేశ్చ॥౪౬॥ అ-౧౪- సహ
కార్యంతరవిధిఃపక్షేణ తృతీయంతద్వతోవిధ్యాదివత్॥ ౪౭॥ కృత్స్న
భావాత్తుగృహిణోపసంహారః॥ ౪౮ ॥ మౌనవదితరేషామప్యుపదేశా
త్॥ ౪౯॥ అ- ౧౫- అనావిష్కుర్వన్నన్వయాత్ ॥ ౫౦॥ అ-౧౬-ఐహి
కమప్రస్తుతప్రతిబంధేతద్దర్శనాత్॥౫౧॥ అ- ౧౭ - ఏవంముక్తిఫలా
నియమస్తదవస్థావధృతేస్తదవస్థావధృతేః॥ ౫౨ ॥ పురుషార్థస్సప్తదశ
ద్విపంచాశత్॥ ౧౭॥ ౫౨॥ పురుషార్థః, పరామృశం, స్తుతిమాత్రం,
పారిప్లవార్థా, అతఏవచాగ్నీంధనాది, సర్వాపేక్షాచ, సర్వాన్నాను
మతిశ్చ, విహితత్వాచ్చాం, తరాచాపితు, తద్భూతస్యతు, నచాధి

శారీకం, బహిస్తూభయథా, స్వామిన, స్సహకార్యంతరవిధి, రవా విశుర్వ్య, హైష్ణహీక, మేవంవిము క్తిఫలానియమస్స ప్తదశ॥ ౧౭ ॥
ఇతి బ్రహ్మసూత్రే - తృతీయస్యాధ్యాయస్య చతుర్థఃపాదః.

ఓం.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.
శ్రీ గురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ చతుర్థాధ్యాయస్య - ప్రథమఃపాదః

అ- ౧ ఆవృత్తిరసకృదుపదేశాత్ ॥ ౧ ॥ లింగాచ్చ ॥ ౨ ॥ అ- ౨- ఆత్మేతితూపగచ్ఛంతిగ్రాహయంతిచ॥ ౩॥ అ- ౩- నప్రతీకే నహిసః॥ ౪॥ అ- ౪- బ్రహ్మదృష్టిరుత్కర్షాత్ ॥ ౫॥ అ- ౫- ఆదిత్యాదిమతయశ్చాంగ ఉపపత్తేః॥ ౬ ॥ అ- ౬- ఆసీనస్సంభవాత్ ॥ ౭ ॥ ధ్యానాచ్చ॥ ౮॥ అచలత్వంచాపేక్ష్య॥ ౯॥ స్మరంతిచ॥ ౧౦॥ అ ౭- యత్రైకాగ్రతాతత్రావిశేషాత్॥ ౧౧ ॥ అ - ౮ - ఆప్రాయణాత్తత్రాపిహిదృష్టం॥ ౧౨॥ అ- ౯- తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌతద్వ్యపదేశాత్॥ ౧౩ ॥ అ- ౧౦ - ఇతరస్యాప్యేవమసంశ్లేషఃపాతేతు॥ ౧౪ ॥ అ- ౧౧- అనారబ్ధకార్యేఏవతు పూర్వేతదవధేః॥ ౧౫॥ అ- ౧౨- అగ్నిహోత్రాదితుతత్కార్యాయైవ తద్దర్శనాత్ ॥ ౧౬॥ అతోన్యాపిహ్యేకేషాముభయోః॥ ౧౭॥ అ-౧౩- యదేవ విద్యయేతిహి॥ ౧౮॥ అ- ౧౪ భోగేనత్వితరేక్షపయిత్వా సంపద్యతే॥ ౧౯॥ ఆవృత్తిశ్చతుర్దశైకోనవింశతిః॥ ౧౪ ॥ ౧౯ ॥ ఆవృత్తి, రాత్మేతి, నప్రతీకే, బ్రహ్మదృష్టి, రాదిత్యాది, రాసీనో, యత్రైకాగ్రతా, ప్రాయణా, త్తదధిగమ, ఇతరస్యా, నారబ్ధకార్యే, గ్నిహోత్రాది, యదేవవిద్యయా, భోగేనత్వితరేచతుర్దశ ॥ ౧౪ ॥

ఇతి బ్రహ్మసూత్రే - చతుర్థస్యాధ్యాయస్య-ప్రథమఃపాదః.

ఓం.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యో నమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ చతుర్థాధ్యాయస్య ద్వితీయః పాదః

అ. ౧- వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ ॥ ౧ ॥ అతఏవ చ సర్వాణ్యను ॥ ౨ ॥ అ- ౨- తన్మనః ప్రాణ ఉత్తరాత్ ॥ ౩ ॥ అ- ౩- సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః ॥ ౪ ॥ భూతేషు తచ్ఛ్రుతేః ॥ ౫ ॥ నైకస్మిన్ దర్శయతో హి ॥ ౬ ॥ అ- ౪- సమానా చాసృత్యుపక్రమా దమృతత్వం చానుపోష్య ॥ ౭ ॥ అ- ౫ - తదాఽపీతేస్సంసారవ్యపదేశాత్ ॥ ౮ ॥ సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః ॥ ౯ ॥ నోపమర్దేనాతః ॥ ౧౦ ॥ అస్యైవ చోపపత్తేరూష్మా ॥ ౧౧ ॥ అ- ౬- ప్రతిషేధాదితి చేన్న శారీరాత్ ॥ ౧౨ ॥ స్పష్టో హ్యేకేషాం ॥ ౧౩ ॥ స్మర్యతే చ ॥ ౧౪ ॥ అ- ౭ - తాని పరే తథా హ్యాహ ॥ ౧౫ ॥ అ- ౮- అవిభాగో వచనాత్ ॥ ౧౬ ॥ అ- ౯- తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ హార్దానుగృహీతశ్శతాధికయా ॥ ౧౭ ॥ అ- ౧౦- రశ్మ్యనుసారీ ॥ ౧౮ ॥ నిశి నేతి చేన్న సంబంధస్య యావద్దేహభావిత్వాద్దర్శయతి చ ॥ ౧౯ ॥ అ- ౧౧- అతశ్చాయనేఽపి దక్షిణే ॥ ౨౦ ॥ యోగినః ప్రతి స్మర్యతే స్మార్తే చైతే ॥ ౨౧ ॥ వాఙ్మనస్యేకాదశైకవింశతిః ॥ ౨౧ ॥

వాఙ్మనసి, తన్మన, స్సోఽధ్యక్షే, సమానా, తదాపీతేః, ప్రతిషేధా, త్తానిపరే, అవిభాగ, స్తదోకో, రశ్మ్యనుసా, ర్యతశ్చాయనే, స్యైకాదశ ॥ ౧౧ ॥

ఇతి బ్రహ్మసూత్రే - చతుర్థస్యాధ్యాయస్య ద్వితీయః పాదః.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ చతుర్థాధ్యాయస్య - తృతీయఃపాదః.

అ. ౧. అర్చిరాదినాతత్ప్రథితేః॥ ౧॥ అ. ౨. వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యామ్॥ ౨॥ అ. ౩. తటితోఽధివరుణస్సంబంధాత్॥ ౩॥ అ. ౪. ఆతివాహికాస్తల్లింగాత్ ॥ ౪ ॥ ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః॥ ౫॥ వైద్యుతేనైవతతస్తచ్ఛ్రుతేః॥ ౬॥ అ. ౫. కార్యంబాదరిరస్యగత్యుపపత్తేః॥ ౭॥ విశేషితత్వాచ్చ ॥ ౮ ॥ సామీప్యాత్తుతద్వ్యపదేశః॥ ౯॥ కార్యాత్యయేతదధ్యక్షేణసహాతః పరమభిధానాత్॥ ౧౦॥ స్మృతేశ్చ॥ ౧౧॥ పరంజైమినిర్ముఖ్యత్వాత్॥ ౧౨॥ దర్శనాచ్చ॥ ౧౩॥ నచకార్యేప్రతిపత్త్యభిసంధిః॥ ౧౪ ॥ అ. ౬. అప్రతీకాలంబనాన్నయతీతిబాదరాయణ ఉభయథాఽదోషాత్తత్క్రతుశ్చ॥ ౧౫॥ విశేషంచదర్శయతి॥ ౧౬॥ అర్చిరాదినావట్షోడశ॥ ౬ ॥ ౧౬ ॥ అర్చిరాదినా, వాయుం, తటితో, తివాహికాః, కార్యం బాదరి, రప్రతీకాష్షట్॥ ౬ ॥

ఇతి బ్రహ్మసూత్రే - చతుర్థస్యాధ్యాయస్య తృతీయఃపాదః.

౨౭. ఓం.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రాణి

## అథ చతుర్థాధ్యాయస్య చతుర్థః పాదః

అ. ౧. సంపద్యావిర్భావస్స్వేనశబ్దాత్ ॥ ౧ ॥ ముక్తః ప్రతిజ్ఞానాత్ ॥ ౨ ॥ ఆత్మా ప్రకరణాత్ ॥ ౩ ॥ అ. ౨. అవిభాగేనదృష్టత్వాత్ ॥ ౪ ॥ అ. ౩. బ్రాహ్మేణజైమినిరుపన్యాసాదిభ్యః ॥ ౫ ॥ చితితన్మాత్రేణతదాత్మకత్వాదిత్యౌడులోమిః ॥ ౬ ॥ ఏవమప్యుపన్యాసత్పూర్వభావాదవిరోధంబాదరాయణః ॥ ౭ ॥ అ. ౪. సంకల్పాదేవతుతచ్ఛ్రుతేః ॥ ౮ ॥ అతఏవచానన్యాధిపతిః ॥ ౯ ॥ అ. ౫. అభావంబాదరిరాహహ్యేవం ॥ ౧౦ ॥ భావంజైమినిర్వికల్పామననాత్ ॥ ౧౧ ॥ ద్వాదశాహవదుభయవిధంబాదరాయణోఽతః ॥ ౧౨ ॥ తన్వభావేసంధ్యవదుపపత్తేః ॥ ౧౩ ॥ భావేజాగ్రద్వత్ ॥ ౧౪ ॥ అ. ౬. ప్రదీపవదావేశస్తథాహిదర్శయతి ॥ ౧౫ ॥ స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతంహి ॥ ౧౬ ॥ అ. ౭. జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ ॥ ౧౭ ॥ ప్రత్యక్షోపదేశాదితి చేన్నాధికారికమండలస్థోక్తేః ॥ ౧౮ ॥ వికారావర్తిచతథాహిస్థితిమాహ ॥ ౧౯ ॥ దర్శయతశ్చైవంప్రత్యక్షానుమానే ॥ ౨౦ ॥ భోగమాత్రసామ్యలింగాచ్చ ॥ ౨౧ ॥ అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్ ॥ ౨౨ ॥ సంపదిసప్తద్వావింశతిః ॥ ౭ ॥ ౨౨ ॥ సంపద్య, విభాగేన, బ్రాహ్మేణ, సంకల్పా, దభావం, ప్రదీపవ, జ్జగద్వ్యాపారవర్జం, సప్త ॥ ౭ ॥

ఇతి బ్రహ్మసూత్రే - చతుర్థస్యాధ్యాయస్య చతుర్థః పాదః.

—(*)—

ఓం.

హరిః ఓమ్.

శ్రీ గురుభ్యో నమః.

# నిర్వాణషట్క స్తోత్రమ్

శ్లో॥ మనోబుద్ధ్యహంకారచిత్తానినాహం నశ్రోత్రంనజిహ్వేన చఘ్రాణనేత్రే । నచవ్యోమభూమిర్నతేజోనవాయు శ్చిదానందరూపశ్శివోహంశివోహమ్॥ ౧॥

నచప్రాణసంజ్ఞోనవై పంచవాయుర్నవా సప్తధాతుర్నవా పంచకోశః । నవాక్పాణిపాదౌ నచోపస్థపాయు శ్చిదానందరూప శ్శివోహం శివోహమ్॥ ౨॥

నమేద్వేషరాగౌనమేలోభమోహౌ మదోనైవమేనైవమాత్సర్యభావః। నధర్మోనచార్థో నకామోనమోక్షః శ్చిదానందరూపశ్శివోహం శివోహమ్ ॥ ౩॥

నపుణ్యం నపాపం నసౌఖ్యంనదుఃఖం నమంత్రోనతీర్థం నవేదానయజ్ఞాః । అహంభోజనంనైవభోజ్యం నభోక్తా చిదానందరూప శ్శివోహంశివోహమ్ ॥ ౪॥

నమృత్యుర్నశంకానమేజాతిభేదః పితానైవమేనైవ మాతాచ జన్మ । నబంధుర్నమిత్రం గురుర్నైవశిష్య శ్చిదానందరూప శ్శివోహం శివోహమ్॥ ౫॥

అహంనిర్వికల్పో నిరాకారరూపో విభుత్వాచ్చసర్వత్రసర్వేంద్రియాణామ్ । నచాసంగతంనైవముక్తిర్నమేయ శ్చిదానందరూప శ్శివోహం శివోహమ్॥ ౬॥

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య

శ్రీమచ్ఛంకరాచార్య విరచితం

నిర్వాణషట్కస్తోత్రం - సమాప్తమ్.

ఓం.

హరిః ఓమ్.

శ్రీ గురుభ్యో నమః.

# ఆత్మపంచకస్తోత్రమ్.

శ్లో ॥ నాహం దేహో నేంద్రియాణ్యంతరంగం నాహంకారః ప్రాణవర్గో నబాహం । దారాపత్యక్షేత్రవిత్తాది దూరస్సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోహమ్ ॥ ౧॥

రజ్జ్వజ్ఞానాద్భాతి రజ్జుర్యథాహిస్స్వాత్మాజ్ఞానాదాత్మనో జీవభావః । ఆప్తోక్త్యాహి భ్రాంతినాశే సరజ్జుర్జీవోనాహం దేశికోక్త్యాశివోహమ్ ॥ ౨॥

ఆభాతీదంవిశ్వమాత్మన్యసత్యం సత్యజ్ఞానానంద రూపేవిమోహాత్ । నిద్రామోహాత్స్వప్నవత్తన్నసత్యం శుద్ధఃపూర్ణో నిత్యఏకశ్శివోహమ్ ॥ ౩॥

మత్తోనాన్యత్కించిదత్రాస్తివిశ్వం సత్యంబాహ్యం వస్తుమాయోపక్లుప్తం । ఆదర్శాంతర్భాసమానస్యతుల్యం మయ్యద్వైతేభాతితస్మాచ్ఛివోహమ్ ॥ ౪

నాహంజాతోనప్రవృద్ధో ననష్టోదేహస్యోక్తాః ప్రాకృతాస్సర్వధర్మాః । కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తి నాహంకారస్యైవహ్యాత్మనోమేశివోహమ్ ॥ ౫

నాహంజాతోజన్మమృత్యూ కుతోమేనాహంప్రాణః క్షుత్పిపాసేకుతోమే । నాహంచిత్తం శోకమోహౌ కుతోమే నాహంకర్తా బంధమోక్షౌకుతోమే ॥ ౬।

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య
శ్రీమచ్ఛంకరాచార్య విరచితం
ఆత్మపంచకం సమాప్తమ్.



బ్ర. గురునాథ శర్మ




శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.

శ్రీ గురుభ్యోనమః హరిః ఓమ్.

# వైయాసకీ - శారీరకమీమాంసా

# బ్రహ్మసూత్రములు.

## ప్రథమాధ్యాయము - ప్రథమపాదము.



శ్లో॥ సర్వవేదాంతతాత్పర్య నిర్ణయాయమహామునిః ।
చకార బ్రహ్మసూత్రాణి భగవాన్బాదరాయణః ॥ ౧ ॥
చత్వారస్తత్రచాధ్యాయాః ప్రత్యేకంతే చతుష్పదాః । సూ
త్రాణాంపంచపంచాశదుత్తరం శతపంచకమ్ ॥ ౨ ॥ వేదాంతశాస్త్ర
కరణం ద్విచత్వార్యుత్తరంశతమ్ । ఏతచ్ఛారీరకంశాస్త్రం కృతాదరాత్ ॥
యనోగురుః॥ వృత్తమధ్యాపయామాస శిష్యాంచ శ…

తే - గీ ॥ శ్రేయమును గోరువారు భజింతురెవని । నేఘనుం డుస్సృష్ట్యాదుల కెల్ల హేతు । వెవఁడు వేదంబుచేగాని యెఱుఁగఁబడఁడు । వానికిసుఖాత్మునకొనగ్తు వందనములు ॥ తే- గీ ॥ శంకరాచార్యపదము లసాగిమ్రొక్కి । యస్మదీయగురుశ్రేణి నభినుతించి । తెనుఁగునరచింతు సుఖముగఁదెలియుకొఱకు । బ్రహ్మసూత్రార్థబోధిని బ్రమదమెసఁగ॥

క॥ పరదేశమంత్రికినిసుం । దరమాంబికకును సుతుండ ధరవెన్నెలకం । టిరుచిర వంశభవుఁడసుం । దరరామాఖ్యుండ సజ్జనవిధేయుండన్ ॥

—(*) ౧. జి జ్ఞా సా ధి క ర ణ మ్. (*)—

సూ ॥ ౧॥ అథాతో బ్రహ్మజిజ్ఞాసా॥

టీక ॥ అథ=ఈ బ్రహ్మవిచారమునందు అధికారము కలిగినపిదప (సాధనచతుష్టయసంపత్తి కలిగినతరువాత) అతః=ఈకారణమువలన, (ఆకర్మలనుజెప్పునట్టివేదమునందే ఆకర్మలవలన గలిగినఫలములు అనిత్యములని చెప్పబడియున్నందున) బ్రహ్మ=బ్రహ్మముయొక్క, జిజ్ఞాసా=విచారము, కర్తవ్యా=చేయవలయును.

తాత్పర్యము ॥ సాధనచతుష్టయసంపత్తికలవాఁడు బ్రహ్మవిచారమునందు అధికారియగును. ఏవేదములు కర్మలు ముఖ్యములనియు వానిని అవశ్యముగా ఆచరించవలెననియు చెప్పుచున్నవో ఆవేదములే కర్మలిచ్చుఫలములు శాశ్వతములుకావని చెప్పుచున్నవి. కావున పైని రూపించిన అధికారి కర్మలయందలి అభిమానమునువిడచి బ్రహ్మవిచారమును సేయవలయును. దీనిచేవాఁడు బ్రహ్మజ్ఞానముగలిగి శాశ్వతమగు మోక్షమును జెందునని తాత్పర్యము.

—(*) ౨. జన్మాద్యధికరణమ్. (*)—

అవతారిక ॥ బ్రహ్మవిచారము జేయుమని చెప్పితిరే ఆ బ్రహ్మ ఎట్టివాఁడు ఏమిలక్షణములుగలవాఁడు అనిన, చెప్పుచున్నారు.

సూ॥ ౨॥ జన్మాద్యస్య యతః॥

టీక ॥ అస్య=ఈకనుపడుచున్నప్రపంచముయొక్క, జన్మాది=పుట్టుకలుగునవి ఉత్పత్తిస్థితిప్రళయములు, యతః = ఎవ్వనివలనఁ గలుగుచున్నవో తత్ బ్రహ్మ=అది బ్రహ్మము.

తా॥ ఈప్రపంచమంతయును ఎవనివలనబుట్టుచున్నదో ఎవని చేత రక్షింపబడుచున్నదో నశించినపిదప ఎవనియందు లీనమగుచున్నదో ఆయనయే బ్రహ్మమని తెలిసికొనవలయును. ఇట్లు నానాభేదములుగల ప్రపంచమును తనసామర్థ్యముచేత చక్కగా నిర్వహించువాడు కావున నాబ్రహ్మముసర్వజ్ఞుడనియు డ నెఱుంగవలయునని తాత్పర్య॥

అవ ॥ బ్రహ్మ సర్వజ్ఞుడని ఎట్లునిరూపింపనగును అన చెప్పుచున్నాడు.

—(*) 3. శాస్త్రయోనిత్వాధికరణమ్. (*)—

సూ॥ ౩॥ శాస్త్రయోనిత్వాత్.

టీక॥ శాస్త్రస్య=శాస్త్రములకు ( ఋగ్వేదాది వేదములకు ) యోనిత్వాత్ = కారణమగుటవలన, బ్రహ్మ=బ్రహ్మము, సర్వజ్ఞం= సర్వజ్ఞుడు.

తా॥ కనబడుచున్నవియు కనబడకుండునట్టివియు నగు సర్వవిషయములనుగూర్చి వేదములు వివరించుచుండును. అట్టి వేదములకు కర్తయగుటచే బ్రహ్మము సర్వజ్ఞుడనుటకు సందియములేదని తాత్ప॥

ఈసూత్రమునకు రెండవయర్థము.

అవ॥ బ్రహ్మకు లక్షణమును జెప్పియున్నారు. ఆయనను విచారించుటకు సాధనమేది, ఏప్రమాణమువలన ఆయన నెఱుంగవచ్చును అనిన చెప్పుచున్నాడు.

టీక॥ శాస్త్రయోనిత్వాత్ =శాస్త్రమే (వేదమే) ప్రమాణముగాగలవాడనుటవలన, ప్రమాణాంతరైః = ప్రత్యక్షముమొదలగు ఇతరప్రమాణములచేత, నదృశ్యతే=గ్రహింపబడడు.

తా॥ ఈబ్రహ్మమును దెలిసికొనుటకు "శ్రు॥ యతోవా ఇమాని జాయంత ఇత్యాదివాక్యములుగల వేదమొక్కటియే ప్రమాణము. ప్రత్యక్షము మొదలనునవి ఏవియును బ్రహ్మవిచారమునందు సహాయములు కానేరవు. కావున అధికారియగువాడు ఉపనిషద్వాక్యముల సహాయముచేతనే బ్రహ్మవిచారము సేయవలయునని తాత్పర్యము.

—(*) ४. సమన్వయాధికరణమ్. (*)—

అవ ॥ బ్రహ్మమును వేదాంతవాక్యముల సహాయముచేతనే

తెలిసికొనవలయునుగాని మఱియొకవిధముగా తెలిసికొనుటకు వలనుపడ
దనిచెప్పితిరి. ఆవేదాంతవాక్యములను చూడబోయిన నవి ఒక్కొక
చోట నొక్కొకవిషయమును బోధించుచున్నవిగాని బ్రహ్మమనొకదా
దానినిగురించియే చెప్పుటలేదు. ఇట్లుండగా నావాక్యముల తాత్ప
ర్యము పరబ్రహ్మను నిర్ణయించుటయేయని తెలిసికొనుటకు ఎట్లువీలగు
ననిన, చెప్పుచున్నాడు.

సూ ॥ ౪ ॥ తత్తుసమన్వయాత్॥

టీ॥ తత్తు = ఆ బ్రహ్మ అయితే, సమన్వయాత్ - సమన్వయము
వలన (ఉపక్రమము మొదలగు తాత్పర్య లింగముల సహాయముచేత
వేదాంతవాక్యములన్నియు బ్రహ్మనొకదానినే బోధించునని విమ
ర్శించి తెలిసికొనుటవలన) శ్రుతులచే తెలిసికొనబడును.

తా॥ సామాన్యముగా చూచువారలకు వేదాంతవాక్యముల
తాత్పర్యము లనేకవిధములుగా నున్నట్లు తోచుటలో సందేహమేమి
యును లేదు. ఉపక్రమము మొదలగు తాత్పర్యలింగముల సహాయము
చేత బాగుగ విమర్శించిన నట్లు తోచదు. ఆవేదాంతవాక్యములన్నియు
బ్రహ్మము నొకదానినే బోధించునదియు మఱియొకదానిని బోధింప
వనియు బాగుగ విస్పష్టమగునని తాత్పర్యము.

—(*) ౫. ఈక్షత్యధికరణమ్. (*)—

అవ॥ జగత్తునకు కారణమగు వస్తువే బ్రహ్మమనియు ఆబ్రహ్మ
మును విచారణ చేయవలెననియు రెండవయధికరణమునందు చెప్పితిరి.
సాంఖ్యమతస్థులు జగత్కారణము ప్రధానము (జడమయ్యును ప్రపం
చమును సృష్టించుటయందు స్వతంత్రశక్తికలదియు సత్వరజస్తమో
గుణములే స్వరూపముగా కలదియునగు ఒకవస్తువు) అనియు వేద
ములు ఆప్రధానమునే జగత్కారణముగా జెప్పుచున్నవనియు పలుకు
చున్నారు. కావున జగత్కారణము బ్రహ్మమేయని ఎట్లు నిర్ణయింప
నగును అనిన, చెప్పుచున్నాడు.

సూ॥ ౫॥ ఈక్షతేర్నాశబ్దమ్.

టీక॥ ఈక్షతేః-ఈక్షతి (చూచుట) అనుక్రియను ఉపయోగిం
చుటవలన (సంకల్పించెనని చెప్పుటవలన) అశబ్దం = వేదమునందు

చెప్పబడని (ప్రధానము) న జగత్కారణం=జగత్కారణము కాదు.

తా॥ "సదేవసోమ్యేదమగ్రఆసీత్" అను స్థలమునందు సత్ అనుశబ్దముచేత వేదము బ్రహ్మమునే జగత్కారణముగా చెప్పుచున్నదిగాని అచేతనమగు ప్రధానమునుగూర్చి ఏమియు జెప్పటలేదు. అది ఏలయనిన, "ఐక్షత" అని ఆవేదము జగత్కారణమగు వస్తువు సంకల్పము జేసెనని చెప్పుచున్నది. సంకల్పము జేయుట చేతనముల పనిగాని అచేతనముల పనికాదు గదా. కావున జ్ఞానస్వరూపుడగు బ్రహ్మమే జగత్కారణముగాని అచేతనమగు ప్రధానము కాదు. వేదము అప్రధానమునుగూర్చి చెప్పటమే లేదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుట సరికాదు. "ఆపోఐక్షంత తత్తేజఐక్షత" అనుమొదలగు స్థలములయందు జలరూపముగాను అగ్నిరూపము గాను ఉన్న పరబ్రహ్మమే ముఖ్యమైన జలము సంకల్పించెను. అగ్ని సంకల్పించెను. అనివేదము చెప్పుచున్నదికదా, అట్లే "సదేవసోమ్యేదమగ్రఆసీత్" అనుస్థలమునందు ( జగత్కారణమును జెప్పుస్థలమునందు ) కూడ ప్రధానమునే ముఖ్యముగా జేసికొని సఐక్షత (అదిసంకల్పించెను) అనిచెప్పియుండవచ్చును. ఇట్లే సత్ మొదలగు పదములచేత చెప్పబడునది ప్రధానమేకావచ్చునుగదా, అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౬॥ గౌణశ్చేన్నాత్మశబ్దాత్॥ ౬

టీక॥ ఈక్షతేః=ఈక్షతిశబ్దము (సంకల్పించెను అనుట) గౌణశ్చేత్=అప్రధానము అనేయెడల (సంకల్పించునది ప్రధానమేకాని బ్రహ్మముకాని సచ్ఛబ్దము బ్రహ్మమును జెప్పినను ఆ బ్రహ్మమే సంకల్పించెనని చెప్పట గౌణముగాని ముఖ్యముకాదు. అనేహతుమున) న=అదిసరికాదు. కుతః=ఎందువలననగా, ఆత్మశబ్దాత్ = ఆత్మ (జీవుడు లేక పరమాత్మ) అనుశబ్దము చెప్పబడి యుండుటవలన (సచ్ఛబ్దము చేత ఏవస్తువు చెప్పబడుచున్నదో ఆవస్తువే జీవుడు అని చెప్పబడి యుండుట వలన.

తా॥ మొట్టమొదట ఈప్రపంచమంతయును సర్వకారణమగు సద్వస్తువే అయియుండెను అని అరంభించి క్రమముగా సృష్టినిచెప్పి తుదకు ఈసమస్తమును సద్వస్తువే అదియే ఆత్మ అని వేదముచెప్ప

తనయందు లయమునొందునని వేదము చెప్పుచున్నది. చేతనుడగు జీవుడు అచేతనమగు ప్రధానమునందు లయమగుటకు వీలులేదుకదా. కావున సత్పదము బ్రహ్మమునే బోధించునుగాని ప్రధానమునుగూర్చి చెప్ప నేచెప్పదని తాత్పర్యము.

సూ॥ ౧౦॥ గతిసామాన్యాత్ ॥

టీక॥ గతిః= సర్వవేదాంతవాక్యములచేతను తెలియజేయుబడు విషయము (చేతనమే జగత్కారణమనుట) సామాన్యాత్ = ఒకటే అయినందువలన, జడంప్రధానం = జడమగుప్రధానము, సచ్ఛబ్దవాచ్యం=సచ్ఛబ్దముచేత చెప్పబడునది, నభవతి=కానేరదు.

తా॥ వేదాంతవాక్యము లన్నిటిచేతను జగత్కారణము చేతనవస్తువేయని తెలిసికొనుచున్నారు. అట్లగుటచేత ఇచ్చట సచ్ఛబ్దమునకు అర్థము ప్రధానమెట్లగును. అది జడమగుటచే సచ్ఛబ్దమునకు అర్థముకాదని తాత్పర్యము.

సూ॥ ౧౧॥ శ్రుతత్వాచ్చ॥

టీక॥ శ్రుతత్వాచ్చ=శ్రుతియందు ప్రత్యక్షముగా (సర్వజ్ఞుడగు చేతనవస్తువే జగత్కారణమని) చెప్పబడి యుండుటవలనకూడ, సచ్ఛబ్దవాచ్యం=సచ్ఛబ్దముచేత చెప్పదగినది, ప్రధానంనభవతి = ప్రధానము కానేరదు.

తా॥ శ్వేతాశ్వతరోపనిషత్తునందు "జ్ఞః కాలకాలో గుణీసర్వవిద్యః" అనుమొదలగు వాక్యములచేత సర్వజ్ఞుడగు పరబ్రహ్మమునుగూర్చి చెప్పట కారంభించి "సకారణంకరణాధిపాధిపః" అనువాక్యముచే ఆబ్రహ్మయేజగత్కారణమని స్పష్టముగా జెప్పియున్నది. కావున జగత్కారణమును జెప్పు సత్పదముచేత బ్రహ్మమే చేప్పబడునుగాని ప్రధానము చెప్పబడదని తాత్పర్యము.

——(*) ౬. ఆనందమయాధికరణమ్. (*)——

అవ॥ పైజెప్పబడిన ఐదు అధికరణముల వలనను వేదాంతవాక్యములన్నియు బ్రహ్మమునుగూర్చియే జెప్పునని నిర్ణయింపబడెను బ్రహ్మనిర్గుణుడు అనిచెప్పువాక్యములను గుణించియు ఉపాసన నిమిత్తమై ఆబ్రహ్మమునందు గుణముల నారోపించి చెప్పువాక్యములకు

సూ॥ ౧౨॥ ఆనందమయోఽభ్యాసాత్ ॥

టీక॥ అభ్యాసాత్ = పలుమారు ఒకటేరీతిగ జెప్పుటవలన, ఆనందమయః=ఆనందమయవాక్యమునందున్న బ్రహ్మపదము, బ్రహ్మ= స్వతంత్రుడగుపరబ్రహ్మమునే, వదేత్=చెప్పును.

తా॥ "అసన్నేవసభవతి,అసద్బ్రహ్మేతి వేదచేత్,అస్తి బ్రహ్మేతిచేద్వేద, సంతమేనంతతోవిదుః" (బ్రహ్మలేదనేయెడల ఆనందమయకోశముకూడా లేనిదేయగును. బ్రహ్మయున్నదనినయెడల ఆనందమయకోశముకూడా ఉన్నదేయగును) ఇది ఆనందమయకోశ విషయమును ఉపసంహారముచేయునట్టివాక్యము. ఈవాక్యమునందు అనేకమార్లు స్వతంత్రునగు బ్రహ్మయే చెప్పబడియున్నది. దీనిని పట్టిచూచిన "బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠా" అనువాక్యమునందున్న బ్రహ్మపదముగూడ స్వతంత్రుడగు పరబ్రహ్మనే జెప్పునని తాత్పర్యము.

అవ॥ ఆనందమయపదము బ్రహ్మమును జెప్పుననుట సరికాదు. మయ అనుప్రత్యయమునకు వికారము (స్వరూపము) అనిగదాయర్థము, కావున ఆనందమయ అనుపదమునకు ఆనందమే స్వరూపముగా గల ఆనందమయకోశమే అర్థము కావలయునుగాని బ్రహ్మముకానేరదు. అనిన, చెప్పుచున్నాడు.

సూ॥ ౧౩॥ వికారశబ్దాన్నేతిచేన్న ప్రాచుర్యాత్ ॥

టీక॥ వికారశబ్దాత్ = మయ అనుప్రత్యయమునకు వికారము అని అర్థముకావున ఆనందమయః = ఆనందమయపదముచేత చెప్పబడువాడు పరబ్రహ్మము, నేతిచేత్=కాదుఅనేపక్షమున, న = అదిసరి కాదు, కుతః = ఎందువలననగా, ప్రాచుర్యాత్ = ప్రచురమైనది. (చాలభాగమువరకు అధికమైనది) అనునర్థముకూడా నుండుటవలన (ఆనందమయశబ్దమునకు ఆనందము స్వరూపముగా గలదియనియే గాక ఆనందమయమనునర్థముకూడాఉండుటవలన) ఆనందమయః= ఆనందమయశబ్దముచేత జెప్పబడునది, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ మయఅనుపదమునకు వికారము అని అర్థముండుటవలన ఆనందమయపదము బ్రహ్మనుచెప్పదనుటసరికాదు. ఆపదమునకు ప్రాచుర్యమనికూడ అర్థముగలదు. కావున ఆనందమయపదము బ్రహ్మమునే

చెప్పును. ప్రాచుర్యార్థమునందు ఆనందమయమనగా, ఆనందమే యని అర్థమగును. కావున ఆనందము పరబ్రహ్మమునుచెప్పుటలో సంశయమేమియునులేదని తాత్పర్యము.

రెండవ అర్థము.

అవ॥ "బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠా" అనువాక్యములోని బ్రహ్మపదము స్వతంత్రమగు బ్రహ్మమునేచెప్పును, అంటిరి. అది యెట్లుసరియగును. ఆవాక్యమునందు పుచ్ఛం అనునట్టి అవయవవాచకపదము (అవయవమును చెప్పునట్టి పదము) ప్రయోగింపబడి యున్నది గదా, (బ్రహ్మపుచ్ఛమనుటవలన చెప్పబడియున్నదికదా), అనిన, చెప్పుచున్నాడు.

సూ॥ ౧౩॥ వికారశబ్దాన్నేతిచేన్నప్రాచుర్యాత్॥

టీక॥ వికారశబ్దాత్ అవయవవాచకమగు పుచ్ఛశబ్దమును ప్రయోగించియుండుటవలన ఆనందమయ- ఆనందమయవాక్యమునందలి బ్రహ్మపుచ్ఛవాక్యమునందు బ్రహ్మపదముచేత చెప్పబడునది. బ్రహ్మ-స్వతంత్రబ్రహ్మము, న ఇతిచేత్ - కాదనేయెడల, న - సరికాదు, కుతః - ఎందువలననగా, ప్రాచుర్యాత్ - ప్రచురముగా అట్టి అవయవవాచకపదములను ప్రయోగించియుండుటవలన, ఆనందమయబ్రహ్మ ఆనందమయవాక్యమునందలి బ్రహ్మపుచ్ఛవాక్యమునందున్న బ్రహ్మపదముచేత చెప్పబడునది స్వతంత్రబ్రహ్మమే.

తా॥ "బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠా" అనువాక్యమునందు అవయవవాచకమగు పుచ్ఛశబ్దము ప్రయోగింపబడినదనియు అందువలన ఆ బ్రహ్మము ఆనందమయకోశమునకు అంగము కావలయునేకాని స్వతంత్రముకానేరదనియు చెప్పుటసరికాదు. ఎందువలననగా అపుచ్ఛశబ్దము అంతకుముందు అన్నమయ ప్రాణమయ కోశములను చెప్పినప్పుడు ప్రయోగింపబడినట్లు ఇచ్చటకూడా ప్రయోగింపబడినది అంతియేకాని బ్రహ్మ ఆనందమయకోశమునకు అంగమని చెప్పుటకు కాదు. కావున బ్రహ్మపుచ్ఛవాక్యమునందలి బ్రహ్మపదము స్వతంత్రబ్రహ్మనే చెప్పుచున్నదనుటకు సంశయమేమియులేదు అని తాత్పర్యం.

సూ॥ ౧౪॥ తద్ధేతువ్యపదేశాచ్చ॥

టీక॥ తత్ = ఆఆనందమునకు, హేతు = కారణమని, వ్యపదేశా చ్చ = చెప్పియుండుటవలనగూడ ఆనందమయుడు ఆనందమయుడు (ఆనందమయ శబ్దముచేత జెప్పబడువాడు ఆనందమయ వాక్యమునందలి బ్రహ్మపుచ్ఛవాక్యమునందుండు బహ్మశబ్దముచేత జెప్పబడువాడు. (ఇది రెండవ అర్థము) బ్రహ్మైవ పరబ్రహ్మమే.

తా॥ "ఏష హ్యేవానందయాతి" (ఈబ్రహ్మమే ఆనందమును కలుగజేయును) అనువాక్యమునందు పరబ్రహ్మ ఆనందమునకు కారణమని చెప్పియున్నది. రాముడు కృష్ణుని ధనవంతునిచేయుచున్నాడు. అనునప్పుడు కృష్ణుని ధనవంతునిగా చేయుటకు కారణభూతుడగు రాముడు తానుమొదట ధనవంతుడుగనుండవలెనుగదా, అట్లు ఇచ్చటగూడ పరులకు ఆనందముగలిగించుటకు కారణభూతుడగుటచే బ్రహ్మముకూడ ఆనందప్రచురుడై (ఆనందమయుడై) ఉండవలయును కావున ఆనందమయవాక్యములోని ఆనందశబ్దముచేత జెప్పబడువాడు ఆనందప్రచురుడగు నిర్గుణపరబ్రహ్మమేగాని జీవుడొకడుకాదని తాత్పర్యం.

రెండవ అర్థమును పట్టిచూచిన, ఆనందమునకును దానిలోని భేదములకును (కొంచియుగొప్పయు అను నానావిధములగు యానందములకనుట) కారణభూతుడగుటచే పరబ్రహ్మము ఆఆనందమునకు అవయవముకానేరదు. కారణమగువస్తువు తనకార్యమునకు అవయవముకాదుగదా, కావున "బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠా" అనువాక్యమునందున్న బ్రహ్మపదముచే జెప్పబడునది స్వతంత్రమగు పరబ్రహ్మమేకాని వేరొకటికాదని తాత్పర్యము.

సూ॥ ౧౫॥ మాంత్రవర్ణికమేవచ గీయతే॥

శంకరాచార్యుల అభిప్రాయము ననుసరించిన టీక.

టీక॥ మాంత్రవర్ణికమేవచ (సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ) అను మంత్రమునందు ఉపదేశింపబడిన బ్రహ్మమే ఇహాపి = ఈఆనందమయ వాక్యమునందుగూడ, గీయతే = చెప్పబడుచున్నది, తస్మాత్ = ఆనందమయః బ్రహ్మైవ = అందువలన ఆనందమయపదముచేత జెప్పబడినది నిర్గుణపరబ్రహ్మమే.

తా॥ "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" (సత్తియు జ్ఞానమును

స్వరూపముగా గలవాడును నాశములేనివాడునునై (పరబ్రహ్మము ప్రకాశించుచున్నాడు) అనువాక్యమునందు ఏనిర్గుణ పరబ్రహ్మమును గూర్చి చెప్పబడియున్నదో ఆపరబ్రహ్మమే ఈ ఆనందమయవాక్యమునుగూడ ఆనందమయపదముచేత చెప్పబడియున్నదికాని, వేరొకటి కాదని తాత్పర్యము.

వాచస్పతిమిశ్రుల అభిప్రాయము టీక.

టీక॥ [మాంత్రవర్ణికమేవ:- బ్రహ్మప్రాప్తికి ఉపాయమును చెప్పునదియై ఆ బ్రహ్మ దేహాదులకంటె వేరైనవాడని నిరూపించుటకై అన్నమయము మొదలగు నాలుగు కోశములనుగూర్చి చెప్పువాక్యము మంత్రము] ఆమంత్రమునందు ఏ బ్రహ్మమును నిరూపించుటకు ప్రయత్నించబడినదో ఆ బ్రహ్మమే, ఇహాపి ఈఆనందమయ వాక్యమునందు కూడ, గీయతే చెప్పబడుచున్నది.

తా॥ బ్రహ్మమును తెలిసికొను ఉపాయమును జెప్పుటకై కొన్ని వాక్యములు ఆరంభించినవి. అవిఅన్నమయకోశము ప్రాణమయకోశము మనోమయకోశము విజ్ఞానమయకోశము అనునాలుగింటిని మొట్టమొదటనిరూపించి పిటికన్నిటికంటె వేరైన ఆనందమయుడనువాడే బ్రహ్మమని నిరూపించుటకు ఉపక్రమించినవి. కావున పైనిరూపించిన అన్నమయాదివాక్యములయందు ఏనిర్గుణబ్రహ్మము నిరూపించుటకుపక్రమింపబడినదో ఆనిర్గుణబ్రహ్మమే ఆనందమయశబ్దముచేత జెప్పబడుచున్నదని తాత్పర్యము.

రెండవ అర్థము.

టీక॥ మాంత్రవర్ణికమేవ సత్యంజ్ఞానాదిమంత్రమునందు చెప్పబడినస్వతంత్రబ్రహ్మమే, ఇహాపి ఈపుచ్ఛవాక్యమునందలి బ్రహ్మపదముచేతగూడ, గీయతే- చెప్పబడుచున్నది.

తా॥ సత్యంజ్ఞాన అని మొదలగువాక్యము ఏస్వతంత్రబ్రహ్మనుగూర్చిచెప్పెనో ఆస్వతంత్రబ్రహ్మమునుగూర్చియే పుచ్ఛవాక్యమునందుండు బ్రహ్మపదముకూడా చెప్పుచున్నది. అంతేకాని ఆనందమయకోశముయొక్క అవయవమునుగూర్చి చెప్పుటలేదని తాత్పర్యము.

అవ॥ ఆనందమయుడు జీవుడే నిర్గుణబ్రహ్మముకాదు. అని

చెప్పిన విరోధమేమియనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౧౬॥ నేతరోనుపపత్తేః॥

టీక॥ ఇతరః- మఱియొకడైనజీవుడు, అనుపపత్తేః= క్రిందిసందర్భములకు విరోధమగుటవలన, ఆనందమయః = ఆనందప్రచురుడు, నభవతి=కాడు.

తా॥ తైత్తిరీయోపనిషత్తునందు ఆనందమయవాక్యమును చెప్పినపిదప "సోకామయత" (ఆపరబ్రహ్మ సృష్టికిసంకల్పించెను) అను మొదలగువాక్యములచేత ఆఆనందమయుడే సర్వజగత్తునుసృజించెనని చెప్పబడిఉన్నది. ఆనందమయుడు జీవుడేయని చెప్పినయెడల ఆజీవుడు సర్వజగత్తునుసృజించెనని చెప్పవలయునుగదా, అట్లుచెప్పుటకు వీలులేదుకావున ఆనందమయశబ్దముచేత జీవుడు చెప్పబడుచున్నాడనుటకు వీలులేదని తాత్పర్యము.

రెండవఅర్థము.

అవ॥ ఆనందమయ వాక్యమునందలి బ్రహ్మపుచ్ఛ వాక్యములోని బ్రహ్మశబ్దముచే స్వతంత్రబ్రహ్మమే చెప్పబడుచున్నదనుటయేల? ఉపాసనార్థమైన ఆనందమయకోశమునకు అవయవమగు పరిచ్ఛిన్న బ్రహ్మమే చెప్పబడుచున్నదనకూడదా? అనిన, చెప్పుచున్నాడు.

సూ॥ ౧౬॥ నేతరోనుపపత్తేః॥

టీ॥ అనుపపత్తేః=ఉపక్రమాదులచేత నిర్ణయింపబడిన తాత్పర్యమునకు విరోధమువచ్చును గనుక, ఇతరః = స్వతంత్రబ్రహ్మముకంటెవేరగునదేదియును, ఆనందమయః = ఆనందమయ వాక్యమునందలి బ్రహ్మపుచ్ఛవాక్యములోని బ్రహ్మపదముచే చెప్పబడినది, న= కానేరదు.

తా॥ "బ్రహ్మవిదాప్నోతిపరం" (నిర్గుణబ్రహ్మము నేనేఅని తెలిసికొనినవాడు మోక్షమును బొందును. అని ఆరంభించి ఆనిర్గుణబ్రహ్మమును తెలిసికొనుటకుగాను దానిలక్షణమును స్వరూపమును తైత్తిరీయోపనిషత్తు తెలియజేయుచున్నది. ఇట్లు నిర్గుణబ్రహ్మమును గూర్చియు ఆబ్రహ్మమును తెలిసికొనుటనుగూర్చియు చెప్పుసందర్భమున ఏమియుసంబంధములేకుండ ఉపాసనను చెప్పబడియున్నదనుట

ము క్తియు క్తముకాదుగదా, అందువలన ఆనందమయ వాక్యమునం
దలి బ్రహ్మపుచ్ఛవాక్యమునందలి బ్రహ్మశబ్దము స్వతంత్రుడగు నిర్గు
ణబ్రహ్మను చెప్పును అనవలయునుగాని, మఱేమియు చెప్పుటకు వీలులే
దని తాత్పర్యము.

సూ॥ ౧౭॥ భేదవ్యపదేశాచ్చ॥

టీక॥ భేద = జీవునకును, ఆనందమయునకును భేదమును, వ్యపదే
శాత్ = చెప్పియుండుటవలన, ఆనందమయః = ఆనందమయుడు, నేతరః =
బ్రహ్మముతప్ప మఱియొకడుకాడు.

తా॥ "రసో వైసః, రసగ్ంహ్యేవాయం లబ్ధ్వానందీభవతి
(ఆ ఆనందమయుడే రసమనబడును. ఈ జీవుడు ఈ రసమునుపొందియే
ఆనందము కలవాడగును) అని ఉపనిషత్తునందు చెప్పబడియున్నది. ఇట్లు
చెప్పుటవలన రసస్వరూపుడగు ఆనందమయునకును ఆ రసమును అనుభ
వించిసుఖించు జీవునకును భేదమున్నదని స్పష్టముగ తెలియుచున్నది
గదా, కావున ఆనందమయుండను చేత చెప్పబడువాడు జీవుడుకాడని
తాత్పర్యము.

రెండవ అర్థము.

సూ॥ ౧౭॥ భేదవ్యపదేశాచ్చ॥

టీక॥ భేద - అన్నమయాదికోశములను చెప్పుసందర్భమునకును
ప్రస్తుత ఆనందమయవాక్యసందర్భమునకును భేదము, వ్యపదేశాత్ =
కనుపడుచుండుటవలన, ఆనందమయ - (బ్రహ్మపుచ్ఛ) వాక్యములోని
బ్రహ్మపదముచేత చెప్పబడువాడు, న ఇతరః స్వతంత్రబ్రహ్మమున
కంటె వేరైనవాడు కాడు.

తా॥ తైత్తిరీయోపనిషత్తు అన్నమయాదికోశములను చెప్పుచు
ఆయాకోశములను ఉపాసనచేయవలయుననిచెప్పి ఆ ఉపాసనకు ఫల
మునుకూడా చెప్పియున్నది. ఈ ఆనందమయునిగూర్చి చెప్పునప్పుడు
పైవిధముగా ఉపాసనునుగాని దానిఫలమునుగాని చెప్పలేదు. ఈ భేద
మువలన ఇచ్చట ఆనందమయుడు ఉపాసనకొరకు చెప్పబడినవాడు
కాదనియు స్వతస్సిద్ధ నిర్గుణ పరబ్రహ్మమే యనియు తెలియదగునని
తాత్పర్యము.

అవ॥ ఈ ఆనందమయశబ్దముచేత జెప్పబడువాడు జీవుడుకా కపోయినను ప్రధానముకావచ్చునుగదా, అనిన కాదని చెప్పుచు న్నాడు.

సూ॥ ౧౮॥ కామాచ్చనానుమానాపేక్షా॥

టీక॥ కామాచ్చ = సంకల్పముజేసెనని చెప్పియుండుటవలన, అనుమానాపేక్షా= సాంఖ్యమతస్థులు అనుమానముచేత కల్పించిన ప్రధానము కావచ్చునను సంశయము, న = లేదు, ఆనందమయః బ్రహ్మైవ = ఆనందపదముచేత జెప్పబడువాడు పరబ్రహ్మయే.

తా॥ "సోకామయత" అనువాక్యముచేత చెప్పబడిన ప్రకారము సంకల్పముచేయుట చేతనవస్తువులపనియేకాని అచేతనవస్తువుల పనికాదు. కావున ఆనందమయశబ్దముచేత చెప్పబడునది చేతనమగు బ్రహ్మయేకాని అచేతనమగు ప్రధానమెప్పటికినికాదని తాత్పర్య.

రెండవ అర్థము.

అవ ॥ ఆనందమయశబ్దము ఆనందమయకోశమును చెప్పునని చెప్పి దానికవయవమునుజెప్పునట్టి పుచ్ఛవాక్యముమాత్రము స్వతంత్రబ్రహ్మనేచెప్పుననుట సరికాదు. కావున ఆనందమయపదముకూడ నిర్గుణబ్రహ్మమునే చెప్పుననిన అన్నిటికిని యుక్తముగనుండునుగదా, అనిన అట్లుచెప్పుటకు వీలులేదని చెప్పుచున్నాడు.

సూ॥ ౧౮॥ కామాచ్చనానుమానాపేక్షా॥

టీక॥ కామాత్=ఆనందపదము ప్రయోగించియుండుటవలన (భృగువల్లియందు ప్రయోగింపబడిన ఆనందపదము ఆనందమయకోశమునుగాక కేవలపరబ్రహ్మమునే చెప్పుటవలన) అనుమానాపేక్షా=ఇచ్చటనుండు ఆనందమయశబ్దముకూడా కేవలపరబ్రహ్మనే చెప్పునని యూహించునవకాశమః, న=లేదు, తథా = ఇది అట్లుచెప్పినయెడల, వికారార్థకమయడ్విరోధః=ఆనందమయశబ్దమునందు వికారార్థమును జెప్పవలయునను ఉద్దేశ్యముచే ఆనందముతో చేయబడినకోశను ప్రయోగింపబడిన మయ అను ప్రత్యయమునకు విరోధమువచ్చును.

తా॥ భృగువల్లియందు మొట్టమొదటనుండియు అన్నమయాద

అనుచెప్పుచూవచ్చి కట్టకడకు "ఆనందో౽బ్రహ్మేతి వ్యజానాత్" (ఆనందమేపరబ్రహ్మమని తెలిసికొనెను) అను వాక్యముచేత ఐదవది యగు నానందమునే పరబ్రహ్మమని శ్రుతిచెప్పుచున్నదిగదా, అట్లు ఈ ఆనందవల్లియందుగూడ ఐదవదియగు ఆనందమయవస్తువుకూడ పరబ్రహ్మయేయని అనుమానప్రమాణముచే (ఊహచే) నిశ్చయింపవచ్చుననకూడదు. ఏలఅనిన, ఆనందమయ శబ్దమునందలి మయట్ అను ప్రత్యయము వికారార్థమును బోధించును. అనగా, సువర్ణమయకుండలము అనునప్పుడు సువర్ణముతో చేయబడినకుండలము అనియర్థమగునట్లు ఆనందమయపదార్థము అనునప్పుడు ఆనందముతో చేయబడిన పదార్థము అని అర్థమగునని తెలిసికొనవలయును. ఇట్లు విచారించిన ఆనందముతో చేయబడిన పదార్థము ఆనందమయకోశము (ఆనందమయమగునావరణము) కావచ్చునుగాని, ఆనందప్రచురుడగు (ఆనందమేస్వరూపముగాగలిగిన) పరబ్రహ్మకానేరదుగదా, ఇటువిరోధమువచ్చునుగావున పైనిరూపించిన యనుమానము యుక్తముకాదని తాత్పర్యం.

సూ॥ ౧౯॥ అస్మిన్నస్యచతద్యోగంశాస్తి॥

ప్ర॥ అస్మిన్ ఈఆనందమయబ్రహ్మయందు, అభేదజ్ఞానవతః= నేనేఆబ్రహ్మమని జ్ఞానముగల, అస్య=ఈ జీవునకు, తద్యోగం=ఆబ్రహ్మముతో సంబంధమును (ఐక్యమును) శాస్త్రం = వేదాంతశాస్త్రము, శాస్తిచ=చెప్పుచున్నది.

తా॥ "యదాహ్యేవైష ఏతస్మిన్నదృశ్యే నాత్మ్యేనిరుక్తే నిలయనేఽభయంప్రతిష్ఠావిందతే అథసో౽భయంగతోభవతి" (నిర్వికారుడును శరీరములేనివాడును ఇట్టివాడని నిరూపించుటకు వీలులేనివాడును సర్వమునకుతానాధారమయ్యును తనకాధారాంతరములేనివాడును అగు పరబ్రహ్మమునందు అభేదజ్ఞానముకలవాడై ఆపరబ్రహ్మమే నేనని జీవుడెప్పుడునిశ్చలవివేకముగలవాడగునో అప్పుడు ఆపరబ్రహ్మమేయగును.) అనువాక్యముచే జీవునకును ఆనందమయ బ్రహ్మమునకును భేదముచెప్పి ఆనందమయబ్రహ్మను తెలిసికొనినవాడు ఆనందమయుడేయగునని బ్రహ్మజ్ఞానమును దెలిసికొనగలుగుమోక్షమును శ్రుతి చెప్పుచున్నది. ఈకారణమును బట్టిచూచినను ఆనందమయుడు పర

బ్రహ్మమేయగునుగాని జీవుడుకానేరడని తాత్పర్యము

రెండవ అర్థము.

టీక॥ అస్మిన్=ఈపరబ్రహ్మమునందు (పుచ్ఛవాక్యమునందలి బ్రహ్మపదముచే జెప్పబడు పరబ్రహ్మమునందు) అభేదజ్ఞానవతః=నేనే బ్రహ్మమనుజ్ఞానముగల, అస్య=ఈఆనందమయాత్మకు (జీవునకు) తద్యోగం=ఆపరబ్రహ్మముతో సంబంధమును, శాస్తి=వేదముచెప్పుచున్నది.

తా॥ అన్నమయముమొదలగు పైచకోశములును జీవునితోకూడియుండునవియే కావున అన్నమయాదినామములలో దేనితోనైనను జీవునిచెప్పవచ్చునని తెలిసికొనునది. ఇంతకుముందు ఉదహరించిన యదాహ్యేవైష యనువాక్యము బ్రహ్మజ్ఞానమువలన జీవబ్రహ్మలకైక్యముగలుగునని ఉపదేశించునని చెప్పియుంటిమి గదా, అదేకారణమున ఆనందమయపదముచేత చెప్పబడుపదార్థము పరబ్రహ్మమనుటకు వీలులేదు. మఱియు బ్రహ్మైక్యరూపమగు మోక్షము నిర్విశేష బ్రహ్మజ్ఞానమువలన (గుణములు వికారములు మొదలైనవేవియునులేని శుద్ధపరబ్రహ్మమును తెలిసికొనుటవలన) కలుగునుగాని ఆనందమయాత్మకు అవయవములగు సవిశేషబ్రహ్మను (ఆరోపించబడిన ఉపాధులగల బ్రహ్మను) తెలిసికొనుటవలన కలుగనేరదుగదా, కావున బ్రహ్మపుచ్ఛవాక్యమునందలి బ్రహ్మపదముచే జెప్పబడునది ఆనందమయాత్మకు అవయవమనికూడ చెప్పుటకు వీలులేదు. పైనిరూపించినవిధముగ మోక్షము బ్రహ్మజ్ఞానమువలననే తప్ప ఇతరమగు ఉపాసనావిధులచే గలుగదు కావున ఆనందమయవాక్యమునందు ఉపాసనచెప్పబడినదనియును చెప్పుటకువీలులేదు. కావున బ్రహ్మపుచ్ఛవాక్యమునందలి బ్రహ్మపదముచేత చెప్పబడునది నిర్విశేష పరబ్రహ్మమేయనుట యెక్కువ సయుక్తికమని తాత్పర్యము.

—(*) ౭. అంతరధికరణమ్. (*)—

అవ॥ పైఅధికరణమునందు ఆనందమయ వాక్యమునందు గల సంశయమును నివర్తిచేయబడినది. ఛాందోగ్యోపనిషత్తునందలి "అథ యఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే, హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవసువర్ణః (మీసములును వెంట్రుకలును

శిరస్సునుండి కాలిగోరువరకునుగల అన్ని అవయవములును తేజోవంతములైయుండ ప్రకాశించునట్టి ఏపురుషుడు సూర్యునిమధ్యమున కనబడుచున్నాడో) అనువాక్యముచే సూర్యమండలమధ్యమందున్న పురుషునకు రూపముకలదనిచెప్పి పిదప అవాక్యమునందే "సఏషసర్వేభ్యః పాప్మభ్య ఉదితః" (ఆపురుషుడు సర్వకర్మములతోను సంబంధములేకశుద్ధుడైయున్నాడు) అని ఆపురుషునకు కర్మసంబంధమేమియు లేదని చెప్పబడియున్నది. ఇట్లుండినను, పైచెప్పబడిన పురుషుడు సంసారియా లేక పరమేశ్వరుడా అనిసంశయముదాగా దానిని నివారించుటకై ఈఅధికరణము ఆరంభింపబడుచున్నది.

సూ॥ ౨౦॥ అంతస్తద్ధర్మోపదేశాత్॥

టీక॥ తద్ధర్మోపదేశాత్=బ్రహ్మయొక్క-ధర్మములను (కర్మసంబంధములేక పరిశుద్ధుడుగానుండుట మొదలగువానిని) ఉపదేశించుటవలన, అంతః=సూర్యమండలమధ్యమునందున్నాడని చెప్పబడు పురుషుడు, పరమేశ్వరః-పరమేశ్వరుడే, నసంసారీ=సంసారికాడు.

తా॥ పైవాక్యమందు చెప్పబడినపురుషుడు సంసారికాడు. ఆపురుషునకు రూపముకలదనిచెప్పియున్నను పరబ్రహ్మకుగల ధర్మములనే ఆతనికిగూడచెప్పియున్నారుగదా, ధర్మమును ఆచరించుటవలనగాని ఇతరకారణములవలనగాని ఔన్నత్యమునుపొందిన సంసారియే పైచెప్పినపురుషుడైనచో వానికి బ్రహ్మధర్మము లుండకూడదు గదా, కావున పైవాక్యమునందు నిర్గుణుడగు పరమేశ్వరునకే ఉపాసనకొఱకై ఒకక్క-రూపముకల్పింపబడెనుగాని, మఱియేదియులేదని తాత్పర్యము.

అవ॥ పైవిషయమును నిర్ణయించుటకు మఱియొకకారణమును చెప్పుచున్నాడు.

సూ॥ ౨౧॥ భేదవ్యపదేశాచ్చాన్యః॥

టీక॥ అన్యత్ర=వేఱొకచోట (అంతర్యామి బ్రాహ్మణమునందు) భేదవ్యపదేశాత్=సూర్యునకును (సూర్యమండలములోనివున్న పురుషునకును) వానిలోపలనుండువానికిని భేదముచెప్పటవలను, పురుషః=పైనచెప్పబడినపురుషుడు, అన్యః=పరబ్రహ్మయే.

తా॥ "యఆదిత్యేతిష్ఠన్ ఆదిత్యాదంతరో యమాదిత్యోన వేద, యస్యాదిత్యశ్శరీరం" ఎవ్వడు సూర్యునియందున్నాడో సూర్యుని ప్రేరేపించుచున్నదో ఎవ్వనికి సూర్యుడే శరీరమో తనలోపలనే యున్నను ఎవనిని సూర్యుడు తెలిసికొనలేకయున్నాడో అట్టివాడే అంతర్యామి అతడే పరమాత్మ) అనువాక్యము ఎ సూర్యునకును సూర్యుని లోపలనుండువానికిని భేదము చెప్పుచున్నవి. సూర్యుడనగా సూర్యదేహమునభిమానించుజీవుడని యెఱుంగునది. పైసూత్రమును వివరించునప్పుడు "సంసారి" అని వ్రాయబడియున్నది ఆజీవునిగూర్చియే ఇచ్చట ఆజీవునకును సూర్యునిలోపలనుండుపురుషునకును భేదము కనుపరుపబడినది కావున పై ఛాందోగ్యశ్రుతియందు చెప్పబడిన పురుషుడు పరమేశ్వరుడేకాని మఱియొకడు కాడని తాత్పర్యము.

—(*) ౮. ఆకాశాధికరణమ్. (*)—

అవ॥ "అస్యలోకస్యకాగతిరితి ఆకాశ ఇతిహోవాచ" (ఈలోకమునకు గతియెయ్యది అనగా ఉత్పత్తిస్థితి లయములు ఎవరివలన గలుగుననుట ఈవిధముగా ప్రశ్నచేయగా ఆకాశమే దీనికిగతియని సమాధానము చెప్పెను) అనువాక్యమొకటి కలదు. ఈవాక్యమునందుండు ఆకాశశబ్దమున కర్థమేమి? భూతాకాశమా? పరబ్రహ్మయా? అని సంశయము రాగా, దానిని ఈఅధికరణముచే నివారించుచున్నాడు.

సూ॥ ౨౨ ॥ ఆకాశ స్తల్లింగాత్ ॥

టీక॥ తల్లింగాత్=బ్రహ్మయొక్క గురుతులు (జగత్కారణమనుట మొదలగు బ్రహ్మలక్షణములు కనబడుటవలన) ఆకాశః=శ్రుతియందలి ఆకాశశబ్దముచేత చెప్పబడినది, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ పైనుదహరించిన శ్రుతియందు బ్రహ్మలక్షణము చెప్పబడియున్నది. అనగా ఆకాశశబ్దముచేత చెప్పబడిన వస్తువే జగత్కారణమని చెప్పబడియున్నది. భూతాకాశమే జగత్కారణమనుట సంభవింపదుకదా, కావున పైశ్రుతియందలి ఆకాశశబ్దముచేత చెప్పబడునది పరబ్రహ్మమేకాని మఱియొకటికాదని తాత్పర్యము.

—(*) ౯. ప్రాణాధికరణమ్. (*)—

అవ॥ "కతమా సా దేవతా ప్రాణ ఇతి హోవాచ" (ఆ దేవత ఎవరు అనియడుగగా ప్రాణము అనిసమాధానము జెప్పెను అను ఒక వాక్యముగలదు. ఈవాక్యము ఉన్న సందర్భమునందే "సర్వాణిహ వా ఇమానిభూతాని ప్రాణమేవాభిసంవిశంతి" (ఆ ప్రాణమునందే ఆకాశాది పంచభూతములును లయించును) అనుమొదలగువాక్యములు గలవు. కావున పైవాక్యములో చెప్పబడిన ప్రాణము పరబ్రహ్మమా లేక ప్రసిద్ధమగు ప్రాణవాయువా అను సంశయమును ఈ అధికరణముచే నివారించుచున్నాడు.

సూ॥ ౨౩॥ అతఏవప్రాణః॥

టీక॥ అతఏవ=పైజెప్పినకారణమువలననే (బ్రహ్మలక్షణములు కనుపడుటచేతనే) ప్రాణః=ప్రాణవాక్యమునందు, ప్రాణశబ్దముచేత చెప్పబడునది, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ ఎనిమిదో అధికరణమునందు బ్రహ్మలక్షణములు కనుపడుచుండుటవలన ఆకాశశబ్దముచే చెప్పబడునది బ్రహ్మమేయని చెప్పియున్నాముగదా, ఈప్రాణవాక్యమునందుకూడా పై విధముగానే బ్రహ్మలక్షణము చెప్పబడియున్నది. సర్వభూతములు దేనియందులయమగునో అదియే ప్రాణమని ఇచ్చట చెప్పియున్నారుగదా, ప్రాణవాయువునందు భూతములన్నియు లయముచెందుననుట శ్రుతికిని యుక్తికిని అనుభవమునకునుగూడ విరోధముగదా, కావున ఈప్రాణవాక్యమునందలి ప్రాణశబ్దముచే జెప్పబడునది పరబ్రహ్మమేయగుననితాత్పర్యము.

— —(*) ౧౦. జ్యోతిరధికరణమ్. (*)— —

అవ॥ అథయదతః పరో దివో జ్యోతిర్దీప్యతే (ద్యులోకమునకు పైగా ఏజ్యోతి ప్రకాశించుచున్నదో) అను మొదలగు వాక్యమునందుండు జ్యోతిశ్శబ్దముచే చెప్పబడునది పరబ్రహ్మమా లేక ఆకాశాది భూతములలో మూడవదియగు అగ్నియా అని సంశయమురాగా దానిని ఈయధికరణమున నివారించుచున్నాడు.

సూ॥ ౨౪॥ జ్యోతిశ్చరణాభిధానాత్॥

టీక॥ చరణాభిధానాత్ = (పాదోస్యవిశ్వాభూతాని) అనిపాదమును చెప్పుటవలన జ్యోతిః = పైనుదహరించిన జ్యోతిర్వాక్యమునందలి జ్యోతిశ్శబ్దముచే జెప్పబడునది, బ్రహ్మ = పరబ్రహ్మమేయైన అగ్నిః=అగ్నికాదు.

తా॥ పైనుదహరించిన వాక్యమునకు పూర్వవాక్యమునందు "పాదోస్యవిశ్వాభూతాని" ఈ సర్వభూతములును ఆయనలోని నాలగవభాగమునందున్నది అనిచెప్పి ప్రస్తుతవాక్యమున అట్టిజ్యోతి ద్యులోకమున కావలవెలుగుచున్నదియని ఆవాక్యమునకు మొదటనున్న యచ్ఛబ్దముచేత శ్రుతి వర్ణించుచున్నది. ఇట్లు సర్వభూతమయుడగువాడు అగ్నికాదుగదా, కాబట్టి పూర్వవాక్యమునందుండు పాదవర్ణనముపట్టిచూచిన పైనుదహరించినవాక్యమునందలి జ్యోతిశ్శబ్దము పరబ్రహ్మమునే చెప్పునని స్పష్టమగును. తాత్పర్యము.

అవ॥ ఇట్లుచెప్పుటసరికాదు పూర్వవాక్యమునందు పాదోస్య అనుచోట పరబ్రహ్మనుగూర్చి చెప్పియుండినయెడల మీరుచెప్పినదిసరియేయగునుకాని అట్లు చెప్పియుండలేదు అంతేకు పూర్వవాక్యమున "గాయత్రీవాఇదగ్ంసర్వమ్" (ఈప్రపంచమంతయును గాయత్రియే) అని గాయత్రీఛందస్సునుగూర్చి చెప్పుచున్నది. ఇట్లుండ జ్యోతిశ్శబ్దము పరబ్రహ్మనుగూర్చి చెప్పునని ఎట్లుఅనిన, చెప్పుచున్నాడు.

సూ॥ ౨౫॥ ఛందోభిధానాన్నేతిచేన్నతథాచేతో

ర్పణనిగదాత్తథాహి దర్శనమ్॥

టీక॥ ఛందోభిధానాత్ - పూర్వవాక్యమునందు గాయత్రీ ఛందస్సునుగూర్చి చెప్పుటవలన, జ్యోతిః = జ్యోతిర్వాక్యమునందలి జ్యోతిఃపదముచే జెప్పబడునది, నబ్రహ్మ=పరబ్రహ్మముకాదు, ఇతి చేత్=అనేపక్షమున, న = అదిసరికాదు, కుతః = ఎందువలనననగా, బ్రహ్మణి = పరబ్రహ్మమునందు, తథా = ఆగాయత్రీమూలముగా, చేతోర్పణనిగదాత్ = మనసునేకాగ్రము చేయవలెననే అభిప్రాయముతో చెప్పియుండుటవలన (గాయత్రీమూలమున బ్రహ్మయందు మనస్సునునిలుపుదురను అభిప్రాయముతో శ్రుతి ఇట్లు చెప్పుచున్నది) అన్యత్ర=ఇతరస్థలములయందు, తథా = అట్లు (ఏదియో యొకవికారము

నాశ్రయించి దానిమూలమున నిపుణుడగు పరబ్రహ్మయందు మన
స్సును నిలుపవలయునని చెప్పుటను ) దర్శనం= చూచుట, భవతిహి=
కలుగుచున్నదిగదా (చూచుచున్నాముగదా)

తా॥ అవతారికయందు చూపబడిన ప్రకారము పూర్వవాక్యమునందు గాయత్రీ ఛందమునుగూర్చి చెప్పియున్నను బాధలేదు. అది గాయత్రీఛందస్సుద్వారా పరమాత్మయందు మనసునిలుపుటకై చెప్పబడినదేకాని గాయత్రీఛందస్సునుగూర్చి చెప్పుటకై కాదు. అట్లుగాక ఛందస్సునుగూర్చియే చెప్పుచున్నదనిన ఆఛందస్సు సర్వాత్మకమగునా, కానేరదు. కావున " గాయత్రీవా ఇదగ్ంసర్వమ్ " అనువాక్యము బ్రహ్మమును చెప్పునదియే. ఈయొకవాక్యమేగాక "అగ్నావధ్వర్యవః" (యజ్ఞమును సేయువారు లేక ఋత్విక్కులు, అగ్నియందు బ్రహ్మభావనసేయుదురు) అను మొదలగు ననేకవాక్యములు ఏదియో యొకవికారము [కంటితోచూచుటకుగాని మనస్సుతోభావించుటకుగాని వీలగుసృష్టిలోని యేదో ఒకపదార్థమును] ఆధారముచేసికొని దానిమూలమున నిర్గుణుడగు పరబ్రహ్మమునందు మనస్సును నిలుపవలెనని చెప్పుచున్నవి. కావున పూర్వసూత్రమునందు చెప్పియున్నప్రకారము ఉపాసనముచేయుటకును జ్యోతిర్వాక్యమునందలి జ్యోతిశ్శబ్దముచే చెప్పబడునది పరబ్రహ్మమని నిర్ణయించుటకును ఆటంకమేమియును లేదని తాత్పర్యము.

రెండవ అర్థము.

టీక॥ ఛందోభిధానాత్ - గాయత్రీఛందస్సునుగూర్చి చెప్పుటవలన, న=జ్యోతిశ్శబ్దముచేత చెప్పబడునది బ్రహ్మకాదు. ఇతిచేత్= అనేమెడల, న=సరికాదు, కుతః=ఎందుచేతనంటే, తథా=అట్లియుండుటవలన [గాయత్రీవలె బ్రహ్మముకూడ నాలుగుపాదములు గలవాడని చెప్పబడియుండుటవలన] చేతోర్పణ=పరబ్రహ్మమునందు మనస్సును స్థిరముగానిలుపగల గాయత్రీపదముచేత నిగదాత్=పరబ్రహ్మమునే చెప్పుటవలన, ఛందోభిధానం = ఛందస్సునుగూర్చి చెప్పెననుమాట, అసిద్ధం=సిద్ధించదు, (చెప్పుటకువీలులేదు) తథా=అట్లే [ఛందస్సులనుచెప్పునట్టి గాయత్రీపంక్తి విరాట్ మొదలగు పదములను సం

ళ్యా మొదలగు ఇతర అర్థములుచెప్పుటకై ఉపయోగించుచుండుటను అన్యత్ర=ఇతరశ్రుతులయందు, దర్శనం=చూచుట, భవతిహి= కలుగు చున్నదిగదా [చూచుచున్నాముగదా,]

తా॥ "గాయత్రీవా ఇదగ్ంసర్వం" అను వాక్యమునందలి గాయత్రీపదము గాయత్రీఛందస్సును చెప్పదు. పరబ్రహ్మమునకుకూడ నాలుగుపాదములుగలవని చెప్పియుండుటచేతను గాయత్రీఛందస్సు పరబ్రహ్మమునందు మనస్సునిలుచునట్లుచేయుటకు శక్తికలదియగుటచే తను [గాయత్రీఛందస్సును బ్రహ్మమని ఉపాసించువారిమనస్సు ఆపర బ్రహ్మమునందు శీఘ్రముగ ఏకాగ్రత్వమునుపొందునుకనుక] ఆగాయ త్రీశబ్దము పరబ్రహ్మమునేచెప్పును. ఛందోవాచకములగు శబ్దములు అనేకములు వేరువేరు అర్థములచెప్పుటకై ఉపయోగింపబడువాడుక కలదు. సైషావిరాడన్నాది [అన్నమయము మొదలగునది విరాట్ అన బడును] అనువాక్యమునందు విరాట్ అనుశబ్దము పాదమునకు పది అక్షరములుగల విరాట్ఛందమును చెప్పునదియైనను దశప్రాణవాయు వులకాధికయగు శరీరమునుచెప్పుటయందు ఉపయోగింపబడియున్నది. అట్లేపైవాక్యమునందలి గాయత్రీశబ్దముకూడ బ్రహ్మమును చెప్పుటకు ఉపయోగింపబడినదేగాని ఛందస్సును చెప్పుటకు ఉపయోగింపబడ లేదు. కావున ఇరువదినాలగవ సూత్రమునందు చెప్పియున్న ప్రకా రము పూర్వోత్తరసందర్భముల విచారించిన జ్యోతిశ్శబ్దమువలన చెప్ప బడునది పరబ్రహ్మమేయని నిర్ణయించుకొనుటకు ఏ ఆక్షేపమునులేదని తాత్పర్యము.

అవ॥ గాయత్రీశబ్దముచేత పరబ్రహ్మమే చెప్పబడెననుటకు కారణమును చెప్పుచున్నాడు.

సూ॥ ౨౬॥ భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చైవమ్॥

టీక॥ భూతాది=భూతములు (జంతువులు) మొదలగువానిని, పాద=పాదములుగ, వ్యపదేశ=చెప్పుట, ఉపపత్తేశ్చ= తగియుండుట వలనగూడ, ఏకం=ఇట్లే, (గాయత్రీపదముచేత పరబ్రహ్మ చెప్పబడు చున్నదనియే నిర్ణయించుకొనవలయును.)

తా॥ ఛాందోగ్యశ్రుతియందు ఈగాయత్రీపాదములను వర్ణిం

చునవుడు మొదటిపాదము జంతువులనియు రెండవపాదము భూమియనియు మూడవపాదము శరీరమనియు నాలుగవపాదము హృదయమనియు చెప్పబడియున్నది. ప్రపంచరూపముగా గాయత్రీఛందస్సునకు ఇట్టి పాదములుండునా? ఉండనేరవు. సర్వాత్మకుడగు పరబ్రహ్మమునకు ఉపాసనార్థమై ఇట్టిపాదములను కల్పించుటవలన విరోధమేమియును లేదు. ఈకారణమునుబట్టి విచారించిన గాయత్రీశబ్దము పరబ్రహ్మమునే చెప్పియుండవలయునుగాని వేరొకదానిని చెప్పుటకును అట్లూహించుటకును వీలులేదని తాత్పర్యము.

అవ॥ మీరిట్లు గాయత్రీపదము బ్రహ్మమునే చెప్పినను జ్యోతిర్వాక్యమునందు జ్యోతిశ్శబ్దముమాత్రము బ్రహ్మమును జెప్పునని నిర్ణయించుటకు వీలులేదు. పూర్వవాక్యమునందు త్రిపాదస్యామృతందివి (ఈబ్రహ్మముయొక్క మూడుపాదములు ద్యులోకమునందున్నవి) అని ద్యులోకము బ్రహ్మకాధారముగా జెప్పబడియున్నది. ఉత్తరవాక్యములో "పరోదివోజ్యోతిః" (ద్యులోకమునకు పైనుండుజ్యోతి) అని ద్యులోకము ఒకహద్దుగా జెప్పబడియున్నది. ఇట్లు రెండువాక్యములకును భేదముండుటవలన పూర్వవాక్యము చెప్పుచున్న వస్తువునే ఉత్తరవాక్యముకూడ చెప్పుచున్నదనుటకు తగినయాధారమేమియు కనుపడుటలేదు. కావున పూర్వవాక్యముగా గాయత్రీవాక్యమునందు బ్రహ్మమే చెప్పబడియున్నను ఉత్తరవాక్యమగు జ్యోతిర్వాక్యమునందు బ్రహ్మ చెప్పబడలేదనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౭॥ ఉపదేశభేదాన్నేతిచేన్నోభయస్మిన్నప్య
విరోధాత్॥

టీక॥ ఉపదేశభేదాత్=ఒకచోట (ఆధారమనియు మఱియొకచోట హద్దనియు ద్యులోకమునుగూర్చి భేదముగా చెప్పుటవలన, జ్యోతిః=జ్యోతిర్వాక్యమునందలి జ్యోతిశ్శబ్దముచేత చెప్పబడునది, న బ్రహ్మ=పరబ్రహ్మముకాదు, ఇతిచేత్ = అనియెడల, న=సరికాదు, కుతః=ఎందువలననగా, ఉభయస్మిన్నపి = రెండువిధములుగా జెప్పుటయందును, అవిరోధాత్=విరోధములేదుగనుక(విరోధములేదు)

తా॥ అవతారికయందు చూపబడినభేద మొకభేదమేకాదు,

ఆపిట్టచెట్టుకొనయందున్నది. అది చెట్టుకొనకుపైననున్నది. అను రెండు వాక్యములకును అర్థభేదమెట్లులేదో అట్లే అవతారికయందు చూపబడిన రెండువాక్యములకును అర్థభేదములేదు కావున జ్యోతిశ్శబ్దముచే బ్రహ్మమే చెప్పబడునని తాత్పర్యము.

—(*) ౧౧.. ఇంద్రప్రాణాధికరణమ్. (*)—

అవ॥ కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునందు "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా" (నేనేజ్ఞానస్వరూపముగు ప్రాణమును) అనునట్టి ఇంద్రవాక్యమొకటిగలదు. దీనినిపట్టిచూచిన ప్రాణమునకు ఇంద్రుడు దేవతయని ఏర్పడును. ఆపదమునకు ప్రాణవాయువు అను అర్థము ప్రసిద్ధము. మఱియొకవాక్యమునందు "నవాచంవిజిజ్ఞాసీత వక్తారంవిద్యాత్" (ఆప్రాణమువాక్కును తెలిసికొనదలంచును చెప్పువానిని తెలిసికొనును) అనువాక్యముగలదు. దీనివలన ప్రాణపదముచే జీవుడు చెప్పబడుచున్నాడని తెలియవచ్చుచున్నది. అంతమునందు "సఏషప్రాణ ఏవప్రజ్ఞాత్మా ఆనందో అజరో అమృతః" (ఆప్రాణమే ఆనందస్వరూపుడు జరామరణములులేనివాడు) అను మొదలగు వాక్యమువలన ఆప్రాణమునకే పరబ్రహ్మలక్షణములు చెప్పబడియున్నది. కావున ఈసందర్భమున చెప్పబడియున్న ప్రాణశబ్దమునకు అర్థమేమి, అధిదేవతయగు ఇంద్రుడా? ప్రాణవాయువా? జీవుడా? లేక పరబ్రహ్మమా? అనిసంశయముురాగా దానిని ఈ అధికరణముచే నివారించుచున్నాము.

సూ॥ ౨౯॥ ప్రాణస్తథానుగమాత్॥

టీక॥ తథా=ఆప్రకారముగా (ప్రాణవాక్యమునందలి ప్రాణపదముచే పరబ్రహ్మమేచెప్పబడునని, అనుగమాత్=సందర్భానుసారముగా తెలియవచ్చుటవలన, ప్రాణః= ప్రాణవాక్యమునందలి ప్రాణశబ్దముచే చెప్పబడునది, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ పైనిరూపించిన వాక్యమునందుండు ప్రాణశబ్దమునకు పరబ్రహ్మయనియే అర్థముగాని ఇంద్రుడనిగాని వాయువనిగాని జీవుడనిగాని అర్థముగాదు ఏలయనగా పైచూపబడినవాక్యము ఇంద్రునకును దివోదాసపుత్రుడగు ప్రతర్దనుడనురాజునకును జరిగినసంవాదము

లోనిది. ఇంద్రుడు తనయొద్దకువచ్చిన ప్రతర్దనునిజూచి నీకిష్టమైనవర మునుకోరుము ఇచ్చెదను అనిచెప్పెను దానికిప్రతర్దనుడు, మనుష్యులు అన్నిటికంటె ముఖ్యముగా దేనినికోరవలయునో అట్టిదానిని నీవేవిచారించి నాకొసంగుము అని జవాబుచెప్పెను. పిదప ఇంద్రుడు "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా" అనుమొదలగువాక్యములచే ప్రాణోపాసనను చెప్పి తుదకు "యోమాంవేదనహవై తస్యకేనచ కర్మణాలోకోమీయతే నస్తేయేన నబ్రహ్మహత్యయా (ఏపురుషుడు నన్ను ప్రాణరూపునిగా తెలిసికొన్నునో వానికి చౌర్యము, బ్రహ్మహత్య, మొదలగు పాపకర్మలవలన గూడ హానియేర్పడదు) అని ప్రాణోపాసనకు ఫలముచెప్పియున్నాడు. ఇట్టిచేయువానిలో నెల్ల సర్వోత్తమమైనదియు కర్మలన్నిటిని నాశనముచేయగలదియునగు వస్తువు పరబ్రహ్మముతప్ప వేరొకటికలదా? మఱియు ఉపాస్యదేవతనుగూర్చి చెప్పినప్పుడు "సఏషప్రాణఏవప్రజ్ఞాత్మా, ఆనందో జరో అమృతః" అని పైనచెప్పిన వాక్యములో ప్రత్యక్షముగానే బ్రహ్మలక్షణములు చెప్పబడియున్నవి. వీనిన్నిటిని విమర్శించిచూచిన ప్రాణవాక్యమునందలి ప్రాణశబ్దముచే చెప్పబడు ఉపాస్యదేవత పరబ్రహ్మమేయగునుగాని వేఱొకటికాదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుటసరికాదు. పై ఉపనిషత్తునందు ఇంద్రుడు "మామేవవిజానీహి" (ఓప్రతర్దనా! నీవు నన్నేబాగుగ తెలిసికొనుము. పరమపురుషార్థముగలుగును) అనువాక్యముచేత నన్నే తెలిసికొనుమని చెప్పియున్నాడు. ఇంద్రుడనగా శరీరముగల ఒకానొకదేవత. ఆదేవతయే ప్రాణశబ్దముచేత చెప్పబడినవాడు కావలయునుగాని బ్రహ్మమగుటకు వీలులేదు. అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౯॥ నవక్తురాత్మోపదేశాదితిచే దధ్యాత్మసంబంధ
భూమాహ్యస్మిన్॥

టీక॥ వక్తుః= చెప్పిన ఇంద్రునియొక్క, ఆత్మ-స్వస్వరూపమును, ఉపదేశాత్-ప్రాణము అనిచెప్పియుండగ, న-ప్రాణము బ్రహ్మమనుటసరికాదు. ఇతిచేత్-అని నేనెడల, న-సరికాదు, అస్మిన్= ఈ అధ్యాయమునందు (ఇంద్రప్రతర్దన సంవాదరూపమగు కౌషీతకబ్రా

ప్రాణోపనిషత్తునందలి అధ్యాయమునందు, అధ్యాత్మ సంబంధభూమాపరబ్రహ్మముతో మిక్కిలి సంబంధము కలిగియుండుట, దృశ్య లేహి = కనబడుచున్నదికదా.

తా॥ ఇంద్రుడు తనను ఉపాసింపవలయునని చెప్పినంతమాత్ర మున ప్రాణశబ్దము పరబ్రహ్మమును చెప్పవలసినది లేదు. ప్రస్తుతాధ్యాయమునందు ఎచ్చటచూచినను పరబ్రహ్మయొక్కలక్షణములే విశేషముగ చెప్పబడియున్నవి. వానినన్నిటిని విమర్శించిచూచిన ఈ అధ్యాయమునందంతట పరబ్రహ్మమునే ప్రతిపాదించుచున్నాడని నిశ్చయ మేర్పడును. కావున ప్రాణవాక్యమునందలి ప్రాణపదమునకు అర్థము ఉపాస్యదేవత పరబ్రహ్మమే కాని వేరొకడు కాడని తాత్పర్యము.

అవ॥ ఇట్లైన మామేవవిజానీహి అని చెప్పిన ఇంద్రునివాక్యమున కేమి అర్థము అని చెప్పుచున్నాడు.

సూ॥ 30॥ శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్॥

టీక॥ వామదేవునకు వామదేవునకు ఉపదేశించిన ప్రకారముగా, ఉపదేశస్తు ఇంద్రునిచేసిన ఉపదేశమైతే " శాస్త్రదృష్ట్యా తత్త్వమసి అహంబ్రహ్మాస్మి " అను మొదలగువాక్యములను వినుటవలన కలిగిన అపరోక్షబ్రహ్మజ్ఞానముచేత, తే అహంబ్రహ్మాస్మి అను మొదలగు మహావాక్యముల అర్థమును ప్రత్యక్షముచేయుటవలన కలిగిన అపరోక్ష బ్రహ్మజ్ఞానముచేత (ఇంద్రుడు అర్థము వానిన్నిమిత్తముల అభిప్రాయము) భవతి - కలుగుచున్నది.

తా॥ ఇంద్రుడుచేసిన ఉపదేశము నిని ప్రాణశబ్దము బ్రహ్మమునే చెప్పుననుటకును విరోధము లేదు. బ్రహ్మజ్ఞానము కలిగినవిధమున వామదేవమహాముని అహంమనురభవం (నేను మనువునైతిని) అనుమొదలగువాక్యములచేత తానే సర్వాత్మకుడై ఎట్లు చెప్పెనో అట్లే ఇంద్రుడును పరిపూర్ణజ్ఞానముగలవాడు కావున నేనే బ్రహ్మమునని చెప్పెను. కావున ప్రాణపదము పరబ్రహ్మమునే చెప్పుననుటలో విరోధమేమియు లేదని తాత్పర్యము.

అవ॥ ప్రాణపదమునకు ఇంద్రుడనే అర్థముకాకపోయినను బ్రహ్మమయ్యని చెప్పుటకుమాత్రము వీలులేదు. " సవాచంవిజిజ్ఞాసీత "

అనుమొదలగు వాక్యములచే ప్రాణశబ్దమునకు అర్థము జీవుడని చెప్పబడియున్నది. "ఇదంశరీరంపరిగృహ్యోత్థాపయతి (ఆప్రాణముశరీరమునుపట్టుకొనిలేవదీయును) అనువాక్యముచే ఆప్రాణపదమునకు అర్థము ప్రాణవాయువేయనిచెప్పబడియున్నది. కావున ప్రాణపదము పైచూపబడినరెంటిలో దేనినైన నొకదానినిచెప్పుననుట యుక్తముగానున్నది. అైన అట్లుచెప్పుటసరికాదని నిరూపించుచున్నాడు.

సూ॥ ౩౧॥ జీవముఖ్యప్రాణలింగాన్నేతిచేన్నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహతద్యోగాత్ ॥

టీక॥ జీవముఖ్యప్రాణలింగాత్ = జీవుడనియు ప్రాణవాయువనియు ఊహించుటకు తగినగుర్తులుండుటవలన, న - ప్రాణశబ్దమునకర్థము బ్రహ్మముకాదు, ఇతిచేత్ - అనేనెడల, న - సరికాదు, కుతః = ఎందువలననగా, ఉపాసాత్రైవిధ్యాత్ = మూడువిధములగు (జీవబ్రహ్మప్రాణములయొక్క) ఉపాసనలు ఒక్కవాక్యమునందే చెప్పబడినవనుట దోషమగుటవలన (ఇదిమొదటివిరోధము) ఆశ్రితత్వాత్ = ఇతర ఉపనిషత్తులయందు ప్రాణశబ్దమునకు పరబ్రహ్మమే అర్థమని తాత్పర్యలింగములచే నిర్ణయింపబడి యుండుటవలన [ఇదిరెండవవిరోధము] ఇహ = ప్రస్తుతసందర్భమందును, తద్యోగాత్ = అట్టి (బ్రహ్మమునుబోధింపగల) తాత్పర్యలింగములుండుటవలన (ఇది మూడవవిరోధము) ప్రాణశబ్దార్థ = పైజూపినమూడువిరోధములవలనను ప్రాణపదము పరబ్రహ్మమునే చెప్పునదగుటవలనయును.

తా॥ ప్రాణశబ్దము ప్రాణవాయువునే చెప్పుననుటకును జీవుని చెప్పుననుటకును తగినగుర్తులున్నను పరబ్రహ్మనొక్కనినే చెప్పుననియే చెప్పితీరవలయును ఏలనగా ఆపదమునకు పరబ్రహ్మయే యర్థమని ఇంతకుముందే నిర్ణయింపబడియున్నది. ప్రాణవాయువని జీవుడనియు చెప్పుటకు గురుతులున్నవి. ఇది ఉపాసనాప్రకరణము కావున ఒక్కవాక్యమునందే బ్రహ్మోపాసనయు జీవోపాసనయు ప్రాణవాయూపాసనయును మూడుఉపాసనలు చెప్పబడెనని చెప్పవలసి వచ్చును. ఇదియంగీకరించుటకుయుక్తముకాదుగదా మఱియు, "అతఏవప్రాణః" అను ౧౧ వ అధికరణమునందు తాత్పర్యలింగముల సహా

యేయుచే ప్రాణశబ్దము పరబ్రహ్మయందే వర్తించునని నిర్ణయింపబడి యున్నవి. "సపష ప్రాణవివ ప్రజ్ఞాత్మా" అనుమొదలగు వాక్యమువలన అట్టితాత్పర్యలింగములు ప్రస్తుతసందర్భమునందుగూడనున్నట్లు తెలియవచ్చుచున్నవి. ఈకారణములవలన ప్రాణశబ్దమునకు అర్థము పరబ్రహ్మయేయని చెప్పి తకిరిన విషయములన్నిటిని పరబ్రహ్మమునందే సమన్వయముచేయువలయునని తాత్పర్యము.

టీక॥ జీవముఖ్యప్రాణలింగాత్ =జీవుడనిగాని ప్రాణవాయువనిగాని చెప్పుటకుతగినగురుతులుండుటవలన, నప్రాణపదముచే జెప్పబడునది పరబ్రహ్మముకాదు. ఇతిచేత్ - అనేయెడల, న=సరికాదు, కుతః=ఎందువలననగా, ఉపాసనాత్రైవిధ్యాత్ = మూడువిధములుగా (జీవరూపముగాగాని ప్రాణరూపముగాగాని శుద్ధబ్రహ్మరూపముగాగాని) పరబ్రహ్మను ఉపాసింపవలయునని చెప్పబడియుండుటవలన, ఆశ్రితత్వాత్ =ఇతరమైననేకచోట్లయందుకూడా ఇట్లేవవైన నొకవికారమునాశ్రయించి దానిమూలమున పరబ్రహ్మను ఉపాసించవచ్చునని చెప్పియున్నందువలన, ఇహ= ఈవాక్యమునందును, తద్యోగాత్ =అదియే (వికారమునాశ్రయించి ఉపాసన చేయవచ్చుననుటయే) చెప్పబడియేనని సిద్ధాంతముచేయుట యుక్తియుక్తముగానున్నందువలన "ప్రాణోబ్రహ్మేవ" పైనిరూపించినమూడుకారణముల వలనను పాణివాక్యమునందలి పాణిపదముచే జెప్పబడునది పరబ్రహ్మమే.

తా॥ పరబ్రహ్మనిర్గుణుడగుటచే ఆయనను శుద్ధస్వరూపముతో ఉపాసించుటయే తటస్థించదు. కావుననే " మనోమయఃపాణిశరీరః [మనోమయుడును] పాణిమేశరీరముగాగలవాడును అను మొదలగు శ్రుతివాక్యములు ఉపాసకులననుగ్రహించుటకై పరబ్రహ్మమునకు ఒకరూపమునుగల్పించుచున్నది. ౭ అధికరణముమొదలు అటువంటివాక్యములనుగురించియేగదా విచారించుచున్నాము. కావున ఈసందర్భమునందుకూడ జీవప్రాణబ్రహ్మలింగములను జెప్పుట ఆయారూపములతో బ్రహ్మను ఉపాసించవచ్చునని చెప్పుటకైకాని వేరుకాదు. పైవివరించిన మూడువిధములగు బ్రహ్మోపాసనలను బోధించుటకై

శ్రుతిఅట్లు చెప్పెనుగాని పరస్పరవిరోధమును చెప్పలేదు. అట్లు చెప్పెనేని, శ్రుతి అప్రమాణమగునుగదా కావున ప్రాణపదము పరబ్రహ్మనే చెప్పుననుటకు ఏవిధమైనసంశయము లేదని తాత్పర్యము.

అధ్యైకాదశైకత్రిగ్ంశత్ ॥ ౧౧ ॥ ३० ॥ అథ, జన్మాది, శాస్త్రయోని, సమన్వయా, ఈక్షతే, రానందమయో - న్త, రాకాశో, తఏవప్రాణో, జ్యోతిః, ప్రాణ, ఏకాదశ॥

ఇతి బ్రహ్మసూత్రే - ప్రథమాధ్యాయస్య ప్రథమ పాదః.

ఇట్లు ప్రథమాధ్యాయమునందు ప్రథమపాదము
ముగిసెను.

——(*)——

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## ప్రథమాధ్యాయము - ద్వితీయపాదము.

### —(*) ౧. సర్వత్రప్రసిద్ధ్యధికరణమ్. (*)—

అవ॥ "సక్రతుంకుర్వీతమనోమయః ప్రాణశరీరో భారూపః" [మనోమయుడును ప్రాణమే శరీరముగాగలవాడును ప్రకాశరూపుడునగు ఆపురుషుడే, క్రతువునొనర్చును] అను వాక్యమునందు చెప్పబడినపురుషుడు పరమేశ్వరుడా? జీవుడా? అను సంశయమురాగా, దానిని ఈ అధికరణముచే నివారించుచున్నాడు.

సూ॥ ౧॥ సర్వత్రప్రసిద్ధోపదేశాత్॥

టీక॥ సర్వత్ర = వేదాంతవాక్యములందన్నిచోట్లను, ప్రసిద్ధ= ప్రసిద్ధమగు బ్రహ్మపదమును, ఉపదేశాత్ = ప్రస్తుతవాక్యమునకు సంబంధించిన ఉపక్రమమునందు చెప్పియుండుటవలన, మనోమయత్వా

దిగుణకః = (ప్రస్తుతవాక్యమునందు చెప్పబడిన మనోమయత్వము (మనోమయుడుగానుండుట) మొదలగు గుణములుగలవని చెప్పబడిన వాడు, బ్రహ్మైవ=పరబ్రహ్మమే, న శారీరః=జీవుడుకాడు.

తా॥ అవతారికయందు చూపబడినవాక్యములో వర్ణింపబడిన పురుషుడు పరబ్రహ్మయేకాని మఱియొకడుకాడు. వేదాంతవాక్యములందన్నిచోట్లను ఏపదము పరబ్రహ్మనుచెప్పుటకు తఱుచుగ ఉపయోగింపబడునో అట్టి సుప్రసిద్ధమగు బ్రహ్మపదమే "సర్వంఖల్విదంబ్రహ్మ" (ఈకనుపడుచుండెడియంతయు పరబ్రహ్మమే) అనునట్టి యుపక్రమవాక్యమునందు ప్రయోగింపబడియున్నది. కావున నీయుపక్రమమును పట్టిచూడగా ప్రస్తుతవాక్యమునందుకూడ ఆపరబ్రహ్మయే చెప్పబడెననియు ఉపాసకుల ననుగ్రహించుటకై మనోమయత్వాది ధర్మములు ఆబ్రహ్మమునందు ఆరోపింపబడినవనియు చెప్పుటయే ఉచితమని తాత్పర్యము.

అవ॥ మనోమయత్వాది గుణములుగలవాడు పరబ్రహ్మమే యగుననుటకు మఱియొకకారణమును చెప్పుచున్నాడు.

సూ॥ ౨॥ వివక్షితగుణోపపత్తేశ్చ॥

టీక॥ వివక్షిత-ఉపాసనార్థమై వర్ణింపబడిన, గుణ గుణములయొక్క (గుణములుండుటకు) ఉపపత్తేశ్చ - ఔచిత్యమువలననున్న (తగినవాడగుటవలననున్న) మనోమయత్వాదిగుణకః=మనోమయత్వాదిగుణములుగలవాడు, బ్రహ్మైవ - బ్రహ్మయే, నశారీరః-జీవుడు కాడు.

తా॥ ఉపక్రమవాక్యమునందు బ్రహ్మశబ్దమున్నదనుటయేగాక పైవిషయమును నిర్ణయించుటయందు మఱియొక కారణముగూడగలదు. పైనుదహరించినవాక్యమునందే ప్రాణశరీరోభారూపః అనిచెప్పినపిదప సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మసర్వకామః (సత్యమగు సంకల్పముగలవాడు ఆకాశరూపుడు సర్వకర్మలనుస్వతంత్రుడై చేయువాడు పరిపూర్ణకాముడగుటచే తానుకోరవలసిన దేమియులేనివాడు) అనుమొదలగు విశేషణములు చెప్పబడియున్నవి. ఈవిశేషణములు పరబ్రహ్మమునుచెప్పునవియేకదా, మనోమయత్వము మొదలగు గుణ

చినపిదప నేను ఈఉపాస్య దేవతనుపొందుదును అని శ్రుతిచెప్పుచు న్నది. ఈవాక్యమునుపట్టియుంచిన "స క్రతుంకుర్వీత" ఇత్యాది వాక్యములయందు వర్ణించినపురుషుని ఉపాసనచేసి యుదకృతపుడు అపురుషుని యందేకలయునని యేర్పడుచున్నది. [illegible] ఉపాస్యదేవతగా "స క్రతుంకుర్వీత" అనుమొదలగువాక్యమునందు వర్ణింపబడిన పురుషుడు జీవుడెట్లగును కానేరడని తాత్పర్యము.

సూ॥ ౫॥ శబ్దవిశేషాత్ ॥

టీక॥ శబ్ద=శబ్దములయొక్క, విశేషాత్=భేదములవలన, మనోమయత్వాదిగుణకః = మనోమయత్వముమొదలగు గుణములుగలవాడు, నశారీరః=జీవుడుకాడు.

తా॥ "[illegible] యవోవా, శ్యామాకోవా శ్యామాకతండులోవా, ఏవమయమంతరాత్మన్ పురుషో హిరణ్మయః" (వడ్లగింజవలె, యవయను ధాన్యపుగింజవలె, చామగింజవలె, చామబియ్యపుగింజవలె, అతిసూక్ష్మరూపుడై తేజోమయుడగు ఈపురుషుడు అంతరాత్మయందున్నాడు) అని శ్రుతియందు [illegible] యున్నది. ఈవాక్యమునందు పురుషః అనుప్రథమావిభక్తిచే ఉపాస్యదేవత చెప్పబడియున్నది. అంతరాత్మన్ అను సప్తమీవిభక్తిచే జీవుడు చెప్పబడుచున్నాడు. కావున జీవబ్రహ్మలకు భేదముకలదని స్పష్టముగ తెలియుచున్నది. ఈ యుపాస్యదేవతను చెప్పుటకై [illegible] "స క్రతుంకుర్వీత" అనుమొదలగువాక్యములందుకూడ మనోమయః అనుమొదలగు ప్రథమావిభక్తిచే ప్రయోగింపబడియుండుటచే అవి జీవునకు ఉపాస్యదేవతగు బ్రహ్మకే అన్వయించునని తెలియుచున్నది. కావున పైవిధముగా విభక్తిభేదములవలన మనోమయత్వాదిగుణములుకలవాడు జీవుడగుటకు వీలులేదని తాత్పర్యము.

సూ॥ ౬॥ స్మృతేశ్చ ॥

టీక॥ స్మృతేశ్చ = స్మృతివలనకూడ (స్మృతియందుకూడ జీవబ్రహ్మలకు భేదముకలదనిచెప్పియుండుటవలన) మనోమయత్వాది

గుణకః=మనోమయత్వాదిగుణములుగలవాడు, న శారీరః = జీవుడు కాడు.

తా॥ "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి" (ఓ అర్జునా! పరమేశ్వరుడు సర్వప్రాణుల హృదయములందును ఉన్నాడు) అనువాక్యమువలన శాస్త్రమునందు జీవబ్రహ్మలకు భేదముచెప్పబడియున్నది. ఈభేదమును పట్టిచూచిన మనోమయత్వాది గుణములు గలవాడు ఉపాస్యదేవతయగు పరబ్రహ్మమేయగునుగాని ఉపాసకుడగుజీవుడు కానేరడని తాత్పర్యము.

అవ॥ ఇట్లుచెప్పుటకు వీలుకాదు. "ఏషమ ఆత్మాంతర్హృదయే" (నాయాత్మ హృదయములో నున్నాడు) అనుశ్రుతిచే అల్పకొంచెము స్థలమునందే ఉండువాడనియు "అణీయాన్ వ్రీహేర్వా" (వడ్లగింజవలె సన్ననివాడు) అనుశ్రుతిచే మిక్కిలి చిన్నవాడనియు చెప్పబడియున్నది. ఈవాక్యములచే వర్ణింపబడినవాడు జీవుడు కావచ్చునుగాని సర్వవ్యాపియగు పరమాత్మ యెట్లగును. కావున ఈ వాక్యసందర్భమును పట్టిచూడగ సక్రతుంకుర్వీత అను వాక్యమునందు వర్ణింపబడినవాడు జీవుడేయని చెప్పుట యుక్తమని తోచుచున్నది. అనిన నట్లు చెప్పకూడదని నిరూపించుచున్నారు.

సూ॥ 7॥ అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతిచేన్న నిచా
య్యత్వాదేవం వ్యోమవచ్చ॥

టీక॥ అర్భక=చిన్నదైన, ఓకస్త్వాత్=స్థానము గలిగియుండుట వలన (కొద్దిస్థలములోనున్నాడని చెప్పబడుటవలన) తత్ = ఆవిధముగా (చిన్నవాడని) వ్యపదేశాచ్చ=చెప్పుటవలనను (శ్రుతిచెప్పియుండుటవలన) మనోమయత్వాదిగుణకః= మనోమయత్వము మొదలగు గుణములుగలవాడు, బ్రహ్మ=పరబ్రహ్మముకానేరడు, ఇతిచేత్ = అనే యెడల, న=సరికాదు. కుతః = ఎందువలననగా, నిచాయ్యత్వాత్=హృదయకమలమునందు ఉపాసనచేయవలయునని చెప్పబడెనుగనుక, ఏవం = ఈవిధముగా (కొద్దిస్థలమందు ఉండువాడనియు కొద్దిప్రమాణముగలవాడనియు) చెప్పబడెను. ఇదం = ఈచెప్పుట, వ్యోమవత్=ఆకాశమువలె (ఆకాశమునుగూర్చి ఘటాకాశాది మఠా

కాశాదిభేదములను చెప్పునట్లు ) ఇతిద్రష్టవ్యం = అని తెలిసికొనవల యును.

తా ॥ కొన్నిస్థలమందున్నవాడని చెప్పినను కొద్ది ప్రమాణము గలవాడని చెప్పినను పరబ్రహ్మయొక్క సర్వవ్యాపకత్వమునకు భంగ మేమియునురాదు. హృదయకమలమునందు పరబ్రహ్మయున్నాడని ధ్యానింపుమని చెప్పియుండుటచే శ్రుతి ఆహృదయకమలము యొక్క ప్రమాణమునను సరించి పరబ్రహ్మయొక్క ప్రమాణముకూడ కొద్దిదని చెప్పుచున్నది కాని సంకోచమేమియును లేదు. లోకమునందు ఆకాశము సర్వవ్యాపకమైనను అదియుండుస్థలమును పట్టి కుండలోని యాకాశము ఇంటిలోనియాకాశముకంటె చిన్నది. సూదిరంధ్రములోనున్న యాకాశము అన్నిటికంటెచిన్నది. అనిమనము చెప్పుచున్నట్లు వేదము కూడా హృదయకమలమను స్థానమునుబట్టి పరబ్రహ్మము గూడ చిన్న వాడనిచెప్పినది. కావున ఈవాక్యమును సర్వకర్మాకర్మాత అనువా క్యమునందు వర్ణింపబడిన పురుషుడు [illegible] లేదు. ఆపురు షుడుపరబ్రహ్మయేయనిసిద్ధాన్తము.

అవ॥ పైచెప్పినప్రకారముగా సర్వాంతరుడగు పరబ్రహ్మయే సర్వ భూతముల హృదయమునందుండినను ఉపాసింపవ ఆబ్రహ్మకును జీవునకును భేదమేమియులేకపోయినదియగుయునుగాక "నాన్యోతోస్తి ద్రష్టా" (ఈయనకంటె చూచువాడెవ్వడును లేడు) అను శ్రుతిచేతనే ప్రత్యక్షముగ జీవబ్రహ్మల కభేదముచెప్పబడియున్నది. కావున జీవునకుండు సుఖదుః ఖానుభవము పరబ్రహ్మకుకూడా కలుగవలయునుగదా అనిన నట్లుక లుగదని చెప్పుచున్నారు.

సూ॥ ౮॥ సంభోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్॥

టీక॥ సంభోగప్రాప్తి = సుఖదుఃఖానుభవము పరబ్రహ్మము నకు కలుగవలసివచ్చును. ఇతిచేత్ = అనేనెడల, న = అదిసరికాదు, వైశేష్యాత్=జీవబ్రహ్మమునకు భేదముండుటవలన, న, సుఖదుఃఖాను భవః=సుఖదుఃఖ అనుభవము బ్రహ్మకులేదు.

తా ॥ యథార్థములో జీవబ్రహ్మలకు భేదము లేకపోయినను ఉపాధులవలన భేదముండుటచే జీవునికికలుగు సుఖదుఃఖానుభవము

బ్రహ్మమునకును కలుగవలసినపనిలేదు. జీవుడు కర్మలనుచేసి ఆకర్మ ఫలముల ననుభవించువాడు. పరబ్రహ్మము దేనిని అనుభవింపక నిర్లి ప్తుడైయుండువాడు. అల్పజ్ఞజీవుడ అసత్యమైనదానినంతయును నిజమని భ్రాంతిచే భావించుచుండువాడు పరబ్రహ్మము యథార్థజ్ఞానముచే సర్వజ్ఞుడై తనకంటె వేరైనది నేనేలేదనియుండువాడు. పైనిరూపించిన విధముగా జీవుడు భ్రాంతికలవాడగుటచే నతనికి స్వస్వరూపమునకం టె వేరుగా సుఖదుఃఖములు కనుపడును. వాటిననుభవించుటయును సంతోషమును దుఃఖమును పొందుటయును సంభవించును. యథార్థ జ్ఞానముగలవాడనుటచే పరబ్రహ్మమునకు ఇవియేవియును కలుగనే రవు. కావున "క్రతుంకుర్వీత" అనువాక్యమునందు వర్ణింపబడిన పురుషుడు పరబ్రహ్మమని చెప్పుటకు ఏ ఆక్షేపమునులేదని తాత్పర్యము.

——(*) ౨. అత్త్రధికరణమ్. (*)——

అవ॥ యస్య బ్రహ్మచక్షత్రంచ ఉభేభవత ఓదనః మృత్యుర్యస్యో పసేచనం, (ఎవనికిబ్రహ్మక్షత్రియకులములు అన్నమువంటివో సర్వప్ర పంచమును సంహరించుమృత్యువు ఎవనికి అనుపానమో అట్టిపర బ్రహ్మమును తెలిసికొనవలయును) అనువాక్యమునందు చెప్పబడినసర్వ సంహారకుడగు పురుషుడెవ్వడు. ఆపురుషుడు పరబ్రహ్మమని చెప్పు టకువీలులేదు. పైసూత్రమునందు పరబ్రహ్మకు సుఖదుఃఖానుభవము మొదలగునవి ఏవియునులేవని చెప్పబడియున్నదిగదా అందువలన అప రబ్రహ్మకు సర్వసంహారకత్వముకూడ ఉండకూడదు. కావున పైవా క్యమునందు వర్ణింపబడినపురుషుడు జీవుడుగాగాని లేక అగ్నిగాగాని ఉండవలయును. అని పూర్వపక్షముగాగా పైవాక్యమునందు చెప్ప బడిన పురుషుడు పరబ్రహ్మమేయని ఈఅధికరణముచే సిద్ధాంతముసే యుచున్నాడు.

సూ॥ ౯॥ అత్తాచరాచరగ్రహణాత్॥

టీక॥ చరాచరగ్రహణాత్ = బ్రహ్మక్షత్రపదములచేత జంగమ స్థావరాత్మకమగు సర్వప్రపంచము గ్రహించియుండుటవలన. అత్తా = సర్వసంహారకుడు, బ్రహ్మైవ = పరబ్రహ్మమే.

తా॥ అవతారికయందు చెప్పబడిన వాక్యమునందు వర్ణింపబ

డినపురుషుడు పరబ్రహ్మమేకాని మఱియొకడుకాడు. పైనిరూపించిన ప్రకారము పరబ్రహ్మమునకు సర్వసంహారకత్వము ఉండకూడదని చెప్పుట సయుక్తికముకాదు. సర్వశక్తుడును సృష్టిస్థితిసంహారమునకు కారణభూతుడును అగు నాపరమాత్మకు సంహారకత్వము ఉండుట విరోధముకాదుగదా మఱియు పైవాక్యములందుండు బ్రహ్మక్షత్రపదములచే బ్రహ్మక్షత్రియకులములు మాత్రమే గ్రహింపబడలేదు. బ్రహ్మక్షత్రియపదములాదిగాగల జంగమస్థావరరూపమగు సర్వప్రపంచము ఆపదములచే గ్రహింపబడినది. ఏలయనిన "మృత్యుర్యస్యోపసేచనం" అనువాక్యముచే ఆపురుషునకు సర్వసంహారకమగు మృత్యుదేవతయే అనుపానమని వర్ణింపబడియున్నది. ఆపురుషుడు బ్రహ్మక్షత్రజాతులను మాత్రమే సంహరించువాడయ్యేనేని సర్వప్రపంచమునుసంహరించుమృత్యువే యనుపానమనిచెప్పుట యుక్తముకాదుగదా, కావున సర్వప్రపంచసృష్టిస్థితిలయ కారణభూతుడగు పరబ్రహ్మమే పైవాక్యమునందు వర్ణింపబడునుగాని జీవుడుగాని అగ్నిగాని వర్ణింపబడలేదని తాత్పర్యము.

సూ॥ ౧౦॥ ప్రకరణాచ్చ॥

టీక॥ ప్రకరణాచ్చ=ప్రకరణమువలనగూడ (ఈవాక్యము పరబ్రహ్మమునుగూర్చి చెప్పు సందర్భములోను ఇది యనుటవలనగూడ, అత్తా=సర్వసంహారకుడు, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ పైన ఉదహరించినవాక్యము కఠోపనిషత్తునందు ఉన్నది. ఆఉపనిషత్తునందు "నజాయతేమ్రియతేవా (పరబ్రహ్మము పుట్టువాడుకాదు మృతిజెందువాడుకాదు) అని పరబ్రహ్మమునుగూర్చి చెప్పుటకారంభించి ఆసందర్భమునందే "యస్యబ్రహ్మచ" అను వాక్యము చెప్పబడియున్నది. కావున పరబ్రహ్మమే ప్రకృతమున వర్ణింపబడుచుండుటచే ప్రస్తుతవాక్యమునందుకూడ ఆపరబ్రహ్మమె వర్ణింపబడెననుట మిక్కిలి ఉచితమని తాత్పర్యము.

—(*) ౩. గుహాధికరణమ్. (*)—

అవ॥ కఠోపనిషత్తునందు "ఋతంపిబంతౌసుకృతస్యలోకే గుహాంప్రవిష్టౌపరమేపరార్ధే। ఛాయాతపౌబ్రహ్మవిదోవదంతి (అవ

శ్యకమగు కర్మఫలము అనుభవించుచు జీవాత్మపరమాత్మలు ఇరువురు కర్మలవలనబుట్టినదియగు శరీరమనులోకమునందును ఉత్తమమగు హృదయమునందు ఉండు ఆకాశమనుగుహను ప్రవేశించియున్నారు. వారు ఎండనీడలవలె పరస్పరము విరుద్ధమగు స్వభావముగలవారలు అని (బ్రహ్మవేత్తలు చెప్పుదురు) అను వాక్యమునందు వర్ణింపబడిన పురుషులెవ్వరు అనువిషయమును, ఈ అధికరణమునందు నిర్ణయించుచున్నాడు.

సూ॥ ౧౧॥ గుహాం ప్రవిష్టావాత్మానౌహితద్దర్శనాత్॥

టీక॥ గుహాం=హృదయాకాశరూపమగు గుహను, ప్రవిష్టౌ=ప్రవేశించినవారలు, జీవపరమాత్మానౌ=జీవబ్రహ్మలే, కుతః=ఎందువలననగా, తౌ=వారిద్దరు, ఆత్మానౌహి=ఆత్మలేకదా (జ్ఞానస్వరూపులగుటచే ఒకటేస్వభావముగలవారలేకదా, తద్దర్శనాత్ = దానినే (సంఖ్యను చెప్పినప్పుడు సమానమగు స్వభావముగల వస్తువులనేగ్రహించుచుండుటను) లోకమునందుచూచుచుండుటవలన, తౌ ఆత్మానమేవ=వారాత్మలే కావలయును.

తా॥ లోకమునందు ఒకసంఖ్యనుచెప్పినచో ఆసంఖ్యచే జెప్పబడినవస్తువులన్నియు సమానములుగా నుండవలయునను నియమమొకటికలదు. ఎట్లనిన ఈయావునకు తగిన జతను సంపాదింపవలయుననిన రెండవయెద్దును సంపాదింపవలయునని అర్థమేకాని మఱియొకవస్తువునుసంపాదింపవలయునని అర్థముకాదు గనుక ఇట్లు ప్రస్తుతవాక్యమునందుగూడ కర్మఫలము అనుభవించుచున్నాడనుటచే జీవుడుచెప్పబడెను హృదయాకాశగుహయందు ఆజీవునితోపాటు ప్రవేశించియున్నాడని చెప్పబడిన రెండవపురుషుడు పైచూపినన్యాయము ననుసరించి జీవునితోసమ నస్వభావముకలవాడు కావలయును. కావున జ్ఞానస్వరూపుడగు జీవునితోసమానుడు జ్ఞానస్వరూపుడగుపరబ్రహ్మయనియు పైవాక్యమునందు ఈయిరువురే వర్ణింపబడిరనియు నిర్ణయింపవలెనని తాత్పర్యము.

అవ॥ పైనిగూపించినట్లు నిరూపించవలయుననుటకు మఱియొకకారణమును జెప్పుచున్నాడు.

సూ॥ ౧౨॥ విశేషణాచ్చ॥

టీక॥ విశేషణాచ్చ=ఈప్రకరణమునందు జీవబ్రహ్మలనుగూర్చి నవిశేషణములే యుండుటవలనకూడా, తౌ జీవపరమాత్మానావేవ= పైవాక్యమునందు వర్ణింపబడినవారు జీవబ్రహ్మలే.

తా॥ ప్రస్తుతవాక్యము ఉన్నప్రకరణమునందే ఆత్మానంరథినంవిద్ధి (జీవుడు రథికుడుగా నెఱుంగవలయును) అనువాక్యముచే జీవుడు శరీరరూపమగు రథమునెక్కి సంసార మోక్షములనుగూర్చి పోవును అనియును "సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదం" (ఆజీవుడు వివేకవంతుడయ్యెనేని తాను నడచుమార్గమునకు అవలనున్న పరబ్రహ్మరూపమగు మోక్షమును జెందును.) అనువాక్యముచే జీవుడుపొందదగినస్థానము పరబ్రహ్మయని చెప్పబడియున్నది. కావున నీనినిపట్టి చూడగ ప్రకరణమునకాదియందును ఋతంపిబంతౌ అనువాక్యమునందుకూడా ఈ జీవబ్రహ్మలే వర్ణింపబడి యుండవలయుననుటయే నిశ్చయమని తాత్పర్యము.

—(*) ౪. అంతరాధికరణమ్. (*)—

అవ॥ "య ఏషోఽక్షిణిపురుషోదృశ్యత ఏష ఆత్మేతిహోవాచైతదమృతమేతదభయమేతద్బ్రహ్మేతి" (కంటియందు ఏపురుషుడు కనుపడుచున్నాడో అపురుషుడే ఆత్మ అపురుషుడే జరామరణములు లేనియును ఆనందస్వరూపుడైనట్టియు పరబ్రహ్మము అని చెప్పెను) అను ఛాందోగ్యశ్రుతియందు వర్ణింపబడిన పురుషుడెవ్వడు ప్రత్యక్షముగా కనుపడుచున్నాడనుటచే ప్రతిబింబరూపుడనవచ్చునా, లేక జీవుడనవచ్చునా, నేత్రాధిదేవతయగు సూర్యుడనదగునా, వీరెవ్వరునుగాక అపురుషుడు శుద్ధపరబ్రహ్మమా అను సంశయమును ఈఅధికరణము నివారించుచున్నాడు.

సూ॥ ౧౩॥ అంతర ఉపపత్తేః॥

టీక॥ ఉపపత్తేః=జరామరణములులేకపోవుట ఆనందస్వరూపుడగుటమొదలగు లక్షణములన్నియును పరబ్రహ్మకే తగియుండుటవలన అంతరః = కంటిలోనున్నాడని చెప్పబడుపురుషుడు, బ్రహ్మైవ = పరబ్రహ్మమే.

తా॥ కంటియందు ఒకపురుషుడు కనుపడుచున్నాడనిచెప్పి ఆపురుషుడే ఆనందరూపుడనియు జరామరణములు లేనివాడనియు చెప్పబడియున్నది. ఆనందరూపుడగుట మొదలగు లక్షణములు పరబ్రహ్మమునకే తగియుండునుకావున ఆపురుషుడు పరబ్రహ్మమే కావలయునుగాని ప్రతిబింబాదులెవ్వియును కానేరవు. కనుపడుటయనిన శాస్త్రసహాయముచే తెలిసికొనుటకూడ కావచ్చును. కావున అంతమాత్రముననే పైవాక్యమునందు వర్ణింపబడినపురుషుడు ప్రతిబింబమనుటకువీలులేదు. శుద్ధములగు పరబ్రహ్మలక్షణములు చెప్పబడియుండుటచే దేవతయనియు జీవుడనియుకూడ చెప్పుటకువీలులేదని తాత్పర్యము.

అ॥ ఇట్లు చెప్పిన దోషమువచ్చును సర్వవ్యాపకుడగు పరబ్రహ్మమునుగూర్చి చెప్పునప్పుడు స్థలము నొకదానిని నిర్ణయించుట యుక్తముకాదుగనా యనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౪॥ స్థానాదివ్యపదేశాచ్చ॥

టీక॥ స్థానాది=చోటు పేరు ఆకారము మొదలగువానిని, వ్యపదేశాచ్చ=ఉపాసనార్థమై అనేకశ్రుతులయందు చెప్పబడియుండుట వలనకూడ, అంతరః బ్రహ్మైవ = కంటిలోపలనుండు పురుషుడు పరబ్రహ్మమే.

తా॥ పైనచెప్పబడినది దోషముకాదు. పరబ్రహ్మ సర్వవ్యాపకుడేయైనను ఆయననుగూర్చి చెప్పునప్పుడు స్థానమునుచెప్పుట యుక్తముకాకున్నను ఉపాసనచేయుట కనుకూలముగనుండుటకై అన్నిటిని చెప్పవచ్చును. సర్వమయుడగు బ్రహ్మమునకు ఏదియెట్లుచెప్పినను విరోధములేదుకదా కావుననే “ శ్రుతి ॥ యఃపృథివ్యాంతిష్ఠన్ (ఏపరబ్రహ్మముభూమియందున్నాడో) అనికొన్నిచోట్ల ఆపరబ్రహ్మమునందుచోటు ఇదియనియు తస్యోదితినామ ( ఆపరబ్రహ్మమునకు ఉత్ అనిపేరు ) అనికొన్నిచోట్ల పరబ్రహ్మమునకు ఇది నామధేయమనియు “హిరణ్యశ్మశ్రుః” (ఆపరబ్రహ్మ తేజోనంతములగుమీసములు గలవాడు) అను మొదలగువాక్యములచే కొన్నిచోట్ల పరబ్రహ్మమున కిట్టిరూపముగలదనియు చెప్పుచున్నది. కావున ప్రస్తుతవాక్యమునందు

బ్రహ్మకంటెయందున్నాడని చెప్పుటవలనకూడ విరోధమేమియులేదని తాత్పర్యము.

సూ॥ ౧౫॥ సుఖవిశిష్టాభిధానాదేవచ॥

టీక॥ సుఖవిశిష్ట=సుఖముతోకూడిన (సుఖస్వరూపుడైన) పర బ్రహ్మమును, అభిధానాత్=చెప్పుటవలన (ప్రస్తుతవాక్యమునందు "ఏష" అనుశబ్దముచే ఉపక్రమవాక్యమునందు చెప్పబడిన బ్రహ్మమునే పరామర్శచేయుటవలన) అంతరః = కంటిలోపల నున్నాడని చెప్పబడినపురుషుడు, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ ప్రస్తుతవాక్యముండిన ప్రకరణములోని ఉపక్రమవాక్యమునందు "ప్రాణోబ్రహ్మ, కం బ్రహ్మ" (ప్రాణమేపర బ్రహ్మము, సుఖమేపరబ్రహ్మము,) అనువాక్యముచే సుఖస్వరూపుడైన పరబ్రహ్మము చెప్పబడెను. ప్రస్తుతవాక్యమునందు "ఏషపురుషః" ఈపురుషుడు అనువాక్యభాగముచే మొట్టమొదట (ఉపక్రమవాక్యమునందు) చెప్పబడినపరబ్రహ్మమే పరామర్శచేయబడెను. (పరామర్శయనగా ఒకమారుచెప్పిన నామవాచకమును పలుమారు ఉపయోగించుటకు మారుగా దానిస్థానములయందు సర్వనామమును ఉపయోగించుట) ఈ కారణమువలన ప్రస్తుతవాక్యమునందు వర్ణింపబడినది పరబ్రహ్మమే యగుటకు ఏవిధమైన సంశయములేదని తాత్పర్యము.

సూ॥ ౧౬॥ శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ॥

టీక॥ శ్రుత=వినబడి (తెలిసికొనబడిన) ఉపనిషత్క= బ్రహ్మవిద్యగలవానియొక్క, (బ్రహ్మజ్ఞానియొక్క) గతి=మార్గమును (మరణానంతరమున బ్రహ్మజ్ఞాని హిరణ్యగర్భలోకమును గూర్చిపోవునట్టి అర్చిరాదిమార్గమును) అభిధానాచ్చ=చెప్పుటవలనకూడా (అక్షిపురుషోపాసకులకుకూడ అర్చిరాదిమార్గమునే చెప్పియుండుటవలన) అంతరః బ్రహ్మైవ = అక్షిపురుషుడు పరబ్రహ్మమే.

తా॥ శ్రుతిస్మృతులయందు బ్రహ్మవేత్తయగువానికి మరణానంతరమున బ్రహ్మలోకమునకు పోవునప్పుడు అర్చిరాదిమార్గముచెప్పబడియున్నది. "అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం" (అగ్నిని తేజస్సును, పగటిని, శుక్లపక్షమును, ఉత్తరాయణమును అభి

మానించునట్టి దేవతలు అర్చిరాదిమార్గమని చెప్పబడుదురు. బ్రహ్మవేత్త యగువాడు దేహమును విడిచినపిదప వానిని పైనచెప్పబడిన దేవతలు మొదటిదేవత రెండవదేవతయొద్దకును, రెండవదేవత మూడవదేవత సమీపమునకును, ఈవిధముగా తీసికొనిపోవుదురనియును పిదప బ్రహ్మ లోకమునుండి ఒకపురుషుడు వచ్చి వారిని అచటకు గొనిపోవుననియును తెలిసికొనవలయును) పైనిరూపింపబడిన అర్చిరాదిమార్గమే ప్రస్తుత సందర్భమునందుకూడ గ్రహింపబడియున్నది. "తేఽర్చిషమేవాభిసంభవంతి" (ఎవరు అక్షిపురుషోపాసనచేయుదురో వారు అర్చిర్మార్గమునుపొందుదురు) అను వాక్యముచే అక్షిపురుషోపాసకులకుగూడ బ్రహ్మవేత్తలమార్గమే చెప్పబడియున్నందున అక్షిపురుషుడు పరబ్రహ్మమే కావలయునని తాత్పర్యము.

**అవ॥** ఈవిధముగా అక్షిపురుషుడు పరబ్రహ్మమేయని నిర్ణయించి ప్రతిబింబము మొదలగునవి కానేరవని నిరాకరించుచున్నాడు.

సూ॥ ౧౭॥ అనవస్థితేరసంభవాచ్చ నేతరః॥

టీక॥ అనవస్థితేః కనులయందు స్థిరముగా నుండకపోవుటచేతను, అసంభవాచ్చ పైవాక్యమునందు చెప్పబడిన గుణములన్నియు ఉండుటకు వీలులేకపోవుటచేతను, ఇతరః ఇతరుడొకడు (జీవుడు మొదలగువాడు) అక్షిపురుషుడు, న కానేరడు.

తా॥ అక్షిపురుషుడు జీవుడనికాని నేత్రాధిదేవతయనిగాని ప్రతిబింబమనికాని చెప్పుటకువీలులేదు. ఏలయనగా పైచెప్పినమూడును కంటియందు మాత్రము ఉండవని నియమములేదుకదా, ఇదియునుగాక ప్రస్తుతఅక్షిపురుషవాక్యమునందు జరామరణములు లేనివాడనియు ఆనందరూపుడనియు చెప్పియున్నలక్షణములు పరబ్రహ్మమునకుతప్ప పైజెప్పినవారలలో ఎవరికిగూడ ఉండవుకదా, కావున అక్షిపురుషుడు పరబ్రహ్మమేయని తాత్పర్యము.

— (*) ౫. అంతర్యామ్యధికరణము. (*) —

అవ॥ "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః [ఎవ్వడు భూమియందున్నాడో భూమికిలోప

లనున్నాడో ఎవనిని భూమి తెలిసికొనలేదో ఎవనికిభూమిశరీరమో లో పలనుండి ఎవ్వడుభూమిని ప్రేరేపించుచున్నాడో వాడే నిన్నును నన్ను ను ప్రేరేపించునట్టి అంతర్యామియు ఆనందరూపుడు జరామరణములు లేనివాడగు పరమాత్మ] అనుమొదలగువాక్యములచే అంతర్యామిబ్రా హ్మణమునందు అధిదైవ అధిలోకములకు [సర్వదేవతలకును సర్వలో కములకును] ప్రేరేపకుడని వర్ణింపబడినపురుషుడు అణిమాదిసిద్ధులను పొందినయోగియో లేక ఆయాలోకముల నభిమానించు అధిదేవత యో లేక పరబ్రహ్మమో పరబ్రహ్మము శరీరము లేనివాడగుటచే ఆయన ఈసర్వమును ప్రేరేపించుచున్నాడని చెప్పుటకు వలులేదుకదా, అనుసంశయమును ఈఅధికరణముచే నివారించుచున్నాడు.

సూ॥ ౧౮॥ అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మ
వ్యపదేశాత్॥

టీక॥ తద్ధర్మవ్యపదేశాత్ = ఆబ్రహ్మయొక్క అసాధారణధర్మ ములను, [పరబ్రహ్మమునకు మాత్రమేతప్ప మరియెవరికిని లేనిధర్మములను] చెప్పి యుండుటవలన, అధిదైవాదిషు - అధిదైవము అధిలోకము మొదలగు వానియందు అంతర్యామి లోపలనుండి నియమించువాడు, బ్రహ్మైవ= పరబ్రహ్మమే.

తా॥ ఎవడు సర్వమును ప్రేరేపించుచున్నాడో వాడే నీకును నాకును ఆత్మ. జరామరణములు లేనివాడు మోక్షరూపుడు అని అంత ర్యామి బ్రాహ్మణమందు చెప్పబడియున్నదిగదా, సర్వవ్యాపకుడై యుండుట మోక్షస్వరూపుడగుట ఆత్మగానుండుట అనునవి పరబ్ర హ్మమునకుగల అసాధారణ ధర్మములనుటలో సంశయమేమియును లేదుగదా, కావున నాయంతర్యామి బ్రాహ్మణమునందు వర్ణింపబడిన పురుషుడు పరబ్రహ్మమెయగును. ఆపరబ్రహ్మము సర్వవ్యాపకుడగు టచే ఆయనకుశరీరములేకపోవుట దోషముకాదు. ఆయనచే ప్రేరే పింపబడువారిశరీరములన్నియును ఆయనకు శరీరములే అని తాత్ప ర్యము.

అవ॥ ప్రధానమే అంతర్యామియనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౧౯॥ నచస్మార్తమతద్ధర్మాభిలాపాత్॥

టీక॥ అతత్ =అదికాని (ప్రధానముకాని) బ్రహ్మముయొక్క, ధర్మ=అసాధారణధర్మములను, అభిలాపాత్ = చెప్పుటవలన, ఇహ= ఈఅంతర్యామి బ్రాహ్మణమునందు చెప్పబడిన అంతర్యామి (లోపలనుండి ప్రేరేపించుపదార్థము) స్మార్తం= సాంఖ్యస్మృతియందు చెప్పబడిన ప్రధానము, న=కానేరదు.

తా॥ శరీరము లేకునుట విరోధముకాదని నిర్ణయింపబడినందున సర్వాంతర్యామి పరబ్రహ్మమే కాని అభిమానదేవతగాని యోగసిద్ధిపొందినపురుషుడుగాని కానేరడని ఇదివరకే సిద్ధాంతము చేయబడినది. "అదృష్టోద్రష్టా" (తాను దేనిచేతను గ్రహింపబడక అన్నిటిని గ్రహించుచుండును) అని అంతర్యామియగు పురుషుడు వర్ణింపబడియున్నాడు. కావున సర్వసాక్షియగు పరబ్రహ్మమే అంతర్యామి కావలయును. జడమగు ప్రధానము అంతర్యామియనుటకు వీలులేదు అని తాత్పర్యము.

అవ॥ జీవుడంతర్యామియనిన దోషమేమియనిన, చెప్పుచున్నాడు.

సూ॥ ౨౦॥ శారీరశ్చోభయేఽపిహి భేదేనైనమధీయతే॥

టీక॥ శారీరశ్చ= జీవుడున్ను, అంతర్యామిః భవతి = (అంతర్యామి కానేరడు, ఉభయేఽపి= కాణ్వశాఖవారును మధ్యందినశాఖవారును ఈఇరువురును, ఏనం ఈజీవుని, భేదేన=అంతర్యామికంటె వేరైనవానినిగా, అధీయతేహి = అధ్యయనముసేయుచున్నారుగదా.

తా॥ జీవుడంతర్యామియని చెప్పుటకు వీలులేదు. ఆయనకు ఉపాధియొకటియున్నది కావున (పరిచ్ఛిన్నుడుకావున) కించిత్ జ్ఞుడు కావునను పృథివ్యాదులను నియమింపనేరడు. మఱియు "యోవిజ్ఞానేతిష్ఠన్ విజ్ఞానాదంతరః" (ఎవడు విజ్ఞానమునందుండి విజ్ఞానమును ప్రేరేపించునో ఎవడు జీవునియందుండి జీవుని ప్రేరేపించునో వాడే మో ఈస్వరూపుడు అనువాక్యమువలన జీవునకును అంతర్యామికిని భేదము కలదని స్పష్టముగ తెలియుచున్నది. శుక్లయజుర్వేదమునందు కణ్వశాఖయనియు మధ్యందినశాఖయనియు రెండుశాఖలుగలవు. ఆరెండుశాఖలవారికిని ఉపనిషత్తుబృహదారణ్యకమొకటియే ఈరెండుశాఖలవారిపాఠమునందును, "యోవిజ్ఞానేతిష్ఠన్ య ఆత్మనితిష్ఠన్" అను

మంత్రములున్నవి. కావున జీవాంతర్యాములకుకలభేదమును ఖండించు టకు ఏయుపాయమునులేదు (వేరువేరు శాఖలుగలవారి పాఠము యందు గ్రంథమొకటియైనను కొన్ని కొన్ని మంత్రములలో భేద మును కొన్నికొన్ని మంత్రములు నాస్తిగనే లేకుండుటయును కలదు కావున ఇట్లుచెప్పబడెనని తెలిసికొనవలయును) పైనిరూపించిన కారణ ములవలన అభిమానియగుదేవతగాని యోగసిద్ధుడగు పురుషుడుగాని ప్రధానముగాని జీవుడుగాని అంతర్యామియగుటకు వీలులేదనియు ఆఅంతర్యామి పరబ్రహ్మయే అనియు సిద్ధాంతము చేయబడినది అని తాత్పర్యము.

—(*) ౭. అదృశ్యత్వాదిగుణకాధికరణమ్. (*)—

అవ॥ "యత్తదద్రేశ్యమగ్రాహ్యం [జ్ఞానేంద్రియములచే గ్రహించుటకు వీలుకానిదియును (నగా రూపాదులు లేనిదియును) కర్మేంద్రియములచే గ్రహించుటకు వీలులేనిదియును అనగా చేతికందనిదియనుట అగు ఏవస్తువుగలదో అట్టి పరబ్రహ్మము జగత్కారణ ము అనువాక్యము ముండకోపనిషత్తునందు గలదు. ఈవాక్యము ఎవరినివర్ణింపుచున్నది పైచెప్పిన అదృశ్యత్వము [కనపడకుండుట] మొదలగు ధర్మములు ప్రధానమునకుగూడ నుండవచ్చునుగదా, అనిన సమాధానము చెప్పుచున్నాము.

సూ॥ ౨౧॥ అదృశ్యత్వాదిగుణకోధర్మోక్తేః॥

టీక॥ ధర్మోక్తేః = బ్రహ్మధర్మములను జెప్పుటవలన, అదృశ్యత్వాదిగుణకః=అదృశ్యత్వము మొదలగు గుణములు గల జగత్కారణ ము, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ ఉపనిషత్తునందు "యత్తదద్రేశ్యమగ్రాహ్యం" అను వాక్యమునకు తర్వాత "యస్సర్వజ్ఞస్సర్వవిత్ యస్యజ్ఞానమయం తపః తస్మాదేతద్బ్రహ్మనామరూపమన్నంచజాయతే" [సామాన్య ముగాను విశేషముగాను ఎవడు సర్వమును ఎఱుంగునో ఎవనితపస్సు జ్ఞానరూపమైనదో అట్టి పరమేశ్వరునినుండి ఈసూత్మ్మప్రపంచ మును అభిమానించు హిరణ్యగర్భుడను నామరూపములను పృథివ్యాదిపంచభూతములును అనగా సర్వప్రపంచమును పుట్టును] అను వాక

ముచే జగత్కారణము సర్వజ్ఞుడని వర్ణింపబడియున్నది. సర్వజ్ఞుడగు వాడు పరబ్రహ్మమే కావున ఈవాక్యమునందు వర్ణింపబడినది కూడ పరబ్రహ్మము కావలయునుగాని ప్రధానముగాని జీవుడుగాని కానేరదని తాత్పర్యము.

అవ॥ ప్రస్తుతవాక్యమునందు వర్ణింపబడిన పురుషుడు పరబ్రహ్మమేయని చెప్పి ప్రధానమునిగాని జీవుడనిగాని చెప్పుటకువీలులేదని నిరాకరించుచున్నాడు.

సూ॥ ౨౨॥ విశేషణభేదవ్యపదేశాభ్యాంచ నేతరౌ॥

టీ॥ విశేషణభేదవ్యపదేశాభ్యాం - (జీవబ్రహ్మలకు) విశేషణములను వేరువేరుగా చెప్పుటచేతను [ప్రధానమునకును బ్రహ్మమునకును] భేదమును చెప్పుటచేతను, ఇతరౌ = ఇతరులైనవారిరువురును (ప్రధానముగాని జీవుడుగాని) భూతయోని - అదృశ్యత్వము మొదలగు గుణములుకల జగత్కారణము, నభవతః కానేరరు.

తా॥ "దివ్యోహ్యమూర్తఃపురుషః" (స్వయంప్రకాశుడును నిరాకారుడును సర్వపరిపూర్ణుడును) అను మొదలగు వాక్యమునందు కూడ జగత్కారణమే వర్ణింపబడియున్నది. ఈవాక్యమునందు చెప్పబడియున్న విశేషణములు జీవునకుగాని ప్రధానమునకుగాని ఉండుటకువీలులేదుగదా, అదియునుగాక "అక్షరాత్పరతఃపరః" (జగత్కారణభూతమగు వస్తువు వికారాత్మకమగు సర్వప్రపంచమునకంటె వేరుగనున్నది.) అనువాక్యముతో ప్రధానమునకును జగత్కారణమునకును భేదము చెప్పబడియున్నది. (అనగా పైవాక్యమునందలి అక్షరశబ్దము ప్రధానమునుచెప్పును జగత్కారణముదానికంటె వేరుగానున్నదని చెప్పబడియున్నదనుట) ఈ రెండుకారణముల వలనను జగత్కారణము పరబ్రహ్మమే అనవలయునుగాని ప్రధానమనిగాని జీవుడనిగాని చెప్పుటకు వీలులేదని తాత్పర్యము.

అవ॥ దీనిని నిర్ణయించుటకు మఱియొక కారణమును చెప్పుచున్నాడు.

సూ॥ ౨౩॥ రూపోపన్యాసాచ్చ॥

టీ॥ రూప= జగత్కారణమని చెప్పబడువస్తువునకు సర్వప్ర

పంచాత్మకమగు ఒకరూపమును లేక జగత్కారణమగు వస్తువ సర్వాత్మకమైనదని, ఉపన్యాసాత్ = చెప్పుటవలన, భూతయోనిః = జగత్కారణమగు వస్తువు, బ్రహ్మైవ = పరబ్రహ్మమే, న ఇతరౌ = జీవుడు గాని ప్రధానముగాని కారు.

తా॥ అగ్నిర్మూర్ధాచక్షుషీచంద్రసూర్యౌ (ద్యులోకము శిరస్సు, చంద్రసూర్యులు నేత్రములు) అను మొదలగువాక్యములవలన జగత్కారణవస్తువునకు సర్వప్రపంచమయమగు నాకరూపము చెప్పబడియున్నది. జీవునకుగాని ప్రధానమునకుగాని ఇటువంటిరూపము ఉండుటకు వీలులేదు. కావున జగత్కారణమగుటకుకూడ వీలులేదు. పరబ్రహ్మము సర్వవ్యాపకుడగుటచే పైవర్ణించినరూపము ఆయనకు ఉండుటకు సంశయ మేమియును లేదు. కావున ఆపరబ్రహ్మమే జగత్కారణము. శంకరభగవత్పాదాచార్యమతము అనుసరించి పై ఉదహరించిన మంత్రము సూక్ష్మప్రపంచాభిమానియగు హిరణ్యగర్భుని చెప్పునదియగుటచేత ఆస్థానమున పురుష ఏవేదగ్ంవిశ్వం (ఈసమస్తప్రపంచమును పరమాత్మయే) అనువాక్యము ఉదహరింపవలయును. ఈవాక్యమునందుకూడ జగత్కారణమగువస్తువు సర్వాత్మకమని చెప్పియుండుటను ప్రధానముగాని జీవుడుగాని సర్వాత్మకులు గాకపోవుటచేత, ఈప్రధానజీవులు జగత్కారణమని చెప్పుటకు వీలులేదు. కావున ''యత్తదద్రేశ్యమగ్రాహ్యాం'' అను మొదలగువాక్యమునందు వర్ణింపబడిన అదృశ్యత్వాది గుణములుగల జగత్కారణము పరబ్రహ్మముకాని వేరొకటికాదని తాత్పర్యము.

ఈఅధికరణమునందు అక్షరము (ప్రధానము) అనిచెప్పబడున సాంఖ్యులుచెప్పునట్టి ప్రధానముకాదనియు వేదాంతులు చెప్పునట్టి అవ్యక్తమనియు తెలియతగినది.

## (*) ౭. వైశ్వానరాధికరణమ్. (*)

అవ॥ ''ఆత్మానమేవేమం వైశ్వానరంసంప్రత్యధ్యేషి'' (ఆత్మను వైశ్వానరుడని ధ్యానించుచున్నావు) అనుఈవాక్యమునందు వైశ్వానరుడని చెప్పబడినవాడెవ్వడు? జఠరాగ్నియా, పంచభూతములలో

పాదములుభూమియో అట్టిపరమేశ్వరుడు) అను. శ్లోకముచే స్మృతి యందుపరమేశ్వరుని ఆకారము వర్ణింపబడియున్నది. స్మృతియందు ఏవిషయమువర్ణింపబడినను దానికిఆధారమగు స్మృతియొకటియుండ వలయునని ఊహింపవలయును. ఇదియే ప్రాచీనుల సంప్రదాయము. ప్రస్తుతము మనము విచారించుచున్న వైశ్వానరవాక్య సందర్భమున పైస్మృతియందు వర్ణించియున్నరూపమునే వైశ్వానరునకు చెప్పి యున్నాడు. దీనినిబట్టిచూచిన వైశ్వానరశబ్దముచే జెప్పబడువాడ పరమేశ్వరుడేయనియు అట్లుగాకపోయినచో స్మృతియందు అట్లువ ర్ణించియుండుటకు వీలులేదనియు తాత్పర్యము.

అవ॥ ఇట్లుచెప్పుటసరికాదు వైశ్వానరశబ్దము అగ్నినిచెప్పున గాని పరబ్రహ్మమును చెప్పనేరదు. మఱియు (జఠరాగ్ని ఒకటేదానినే వైశ్వానరుని త్రేతాగ్నులుగా విభాగించియున్నారు. ప్రాణాహుత లకు ఆధారమనికూడ చెప్పియున్నారు. "పురుషేంతః ప్రతిష్ఠితం వేద" (పురుషునిలోపల స్థాపింపబడిన వైశ్వానరుని తెలిసికొనవల యును) అనువాక్యముచే పురుషునిలోపల నిలచియున్నాడని ఆవైశ్వా నరునిగూర్చియే చెప్పియున్నారు. వీటనన్నిటినిబట్టిచూచిన వైశ్వా రశబ్దముచే జెప్పబడువాడు జఠరాగ్నియని చెప్పుటయే యుక్తము అనిన, అట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౨౬॥ శబ్దాదిభ్యోంతఃప్రతిష్ఠానాన్నేతిచేన్నతథా
దృష్ట్యుపదేశాదసంభవాత్పురుషమపిచైనమ
ధీయతే॥

టీక॥ శబ్దాదిభ్యః=శబ్దముమొదలగువానివలన (వైశ్వానర ? ము ప్రసిద్ధముగ అగ్నినే చెప్పునదియగుటచేతను ; త్రేతాగ్ని విభా మును ఈవైశ్వానరునకే చేయబడియుండుటచేతను ; ప్రాణాహుతు కాధారమని ఈవైశ్వానరునిగూర్చియే చెప్పబడి యుండుటచేతను అంతః=పురుషునిలోపల, ప్రతిష్ఠానాత్= ఉన్నాడనిచెప్పబడియుండ టవలన, వైశ్వానరః= వైశ్వానరపదముచే జెప్పబడువాడు, బ్రహ్మ పరబ్రహ్మము, న=కానేరదు, ఇతిచేత్=అనేయెడల, న=సరికాదు కుతః=ఎందువలననగా, తథాదృష్ట్యుపదేశాత్ = ఆవిధముగాతలం

ఉపాసనచేయవలయునని ఉపదేశించుటవలన (జఠరాగ్నియందే పరమేశ్వరుడనుభావమునుంచి ఉపాసన చేయవలయుననిగాని, జఠరాగ్నియందున్నపరమేశ్వరుని ఉపాసనచేయవలయుననిగాని ఉపదేశించుటవలన) అసంభవాచ్చ = పరమేశ్వరునిలక్షణములు (ద్యులోకము శిరస్సుగా నుండుటమొదలగునవి) ఈజఠరాగ్నియందుండుటకు వీలులేకపోవుటవలననున్ను, వైశ్వానరః = వైశ్వానరశబ్దముచే చెప్పబడువాడు, బ్రహ్మైవ = పరబ్రహ్మమే. తథా = మఱియు, వాజసనేయినః = వాజసనేయశాఖవారు, ఏనం = ఈవైశ్వానరుని, పురుషం అపి = పురుషుడనికూడ, అధీయతే చ = అధ్యయనము చేయుచున్నారు.

తా॥ పదారికలో చూపినప్రకారము వైశ్వానరపదముచే చెప్పబడువాడు జఠరాగ్నియనుటకు వీలులేదు. అట్లు చెప్పిన విరోధములు అనేకములువచ్చును. ద్యులోకము శిరస్సుగానుండుటమొదలగు అట్టి పరమేశ్వరలక్షణములు (పరమేశ్వరునకు చెప్పబడియున్న సకలప్రపంచమయమగు స్వరూపము జఠరాగ్నికి ఉండుటకు వీలులేదు. శ్రుతియందుకూడ నొకచోట (వాజసనేయశాఖయందు) ఏతమేవాగ్నిం వైశ్వానరంపురుషం (ఈపురుషునే అగ్ని వైశ్వానరశబ్దముచే) చెప్పుచున్నాము. (పురుషుడనగా పరబ్రహ్మము) అను వాక్యముచే వైశ్వానరశబ్దముచే చెప్పబడువాడు పరబ్రహ్మమేయని చెప్పబడియున్నది. వైశ్వానరుడు జఠరాగ్నియేయనినచో ఈశ్రుతికికూడ విరోధమువచ్చును. ఈవిరోధములనుబట్టి వైశ్వానరశబ్దముచే జెప్పబడువాడు పరబ్రహ్మమే కావలయును. మఱియు మనమువిచారించుచున్న వాక్యమునందు జఠరాగ్నియనిగాని జఠరాగ్నిలో ఉన్నాడనిగాని ఏఅభిప్రాయముచేతనైనను పరబ్రహ్మమును ఉపాసన చేయవలయునని చెప్పబడియున్నది. ఇట్లు అగుటచే నొకటొకటిచోట జఠరాగ్నికిమాత్రము సంబంధించిన త్రేతాగ్నివిభాగము (అగ్నులుమూడు అని చెప్పితమూటికిని హృదయముమొదలగు ప్రత్యేక స్థానములను చెప్పుట) మొదలగు గురుతులు కనబడినను విరోధమేమియులేదని తాత్పర్యము.

అవ॥ ఇట్లువైశ్వానరశబ్దముచే చెప్పబడువాడు పరబ్రహ్మమేయని నిర్ణయించి అగ్నిని అభిమానించుదేవతగాని పంచభూతముల

లోని అగ్నిభూతముగాని వైశ్వానరశబ్దమునకే చెప్పబడదని నిరాకరిం చుచున్నాడు.

సూ॥ ౨౭॥ అతఏవన దేవతాభూతంచ॥

టీక॥ అతఏవ=పైచెప్పబడిన కారణములవలననే (సర్వప్రపంచమయమగు శరీరమును కలిగియుండుటకు వీలు లేక పోవుటవలననే) దేవతా= అగ్ని అభిమానించునట్టి దేవతయును, భూతంచ=పంచభూతములలోని అగ్నిభూతమును, వైశ్వానరః=వైశ్వానరశబ్దముచే జెప్పబడునది, న=కానేరదు.

తా॥ పైన నిరూపించిన విధముగా సర్వప్రపంచమయమగు శరీరము సర్వవ్యాపి యగు పరమేశ్వరునకే ఉండవలయును అను మొదలగు అనేక కారణముల బలమువలన వైశ్వానరుడే పరబ్రహ్మయని నిర్ణయింపబడినది. కావున అగ్ని అభిమానించు దేవతగాని పంచభూతములలోని అగ్నిభూతముగాని ఇచ్చట వైశ్వానరశబ్దముచే జెప్పబడదని తాత్పర్యము.

అవ॥ ఇంతకుముందు ౨౬ వ సూత్రమునందు వైశ్వానరశబ్దము జఠరాగ్ని నే చెప్పునని ఒప్పుకొని జఠరాగ్నియనికాని జఠరాగ్నియందు ఉన్నాడనికాని పరమేశ్వరుని ఉపాసనచేయవలయునని అవైశ్వానరవాక్యమునందు చెప్పబడియున్నదనియు అందువలన అవైశ్వానరశబ్దము జఠరాగ్ని నే చెప్పినను పరమేశ్వరుని చెప్పునదియే అగునయు చెప్పియున్నాడు. ఈవిషయమునందు ఇతరుల అభిప్రాయము వివరించుచున్నాడు.

సూ॥ ౨౮॥ సాక్షాదప్యవిరోధం జైమినిః॥

టీక॥ జైమినిః= జైమినిమహాముని, సాక్షాత్= ప్రత్యక్షము, (జఠరాగ్నియనికాని జఠరాగ్నిలోపలనున్నాడనికాని తలంచక నేరుగ పరబ్రహ్మమునే తలంపుచునే) వైశ్వానరస్య = వైశ్వానరశబ్దము జెప్పబడువానిని, ఉపాసనాయామపి=ఉపాసనచేసినప్పటికిని, అవిరోధం=విరోధములేదని, మన్యతే=తలంచుచున్నాడు.

తా॥ సర్వప్రపంచమయమగు శరీరము ఉండుట మొదలగు కారణములవలన వైశ్వానరశబ్దమునకు పరబ్రహ్మయే అర్థమని నిశ్చ

మైనది. కావున అగ్నివైశ్వానరశబము జఠరాగ్నినే చెప్పునని చెప్పకొన నవసరములేదు. జఠరాగ్నియనిగాని జఠరాగ్నిలో ఉన్నాడనిగాని తలంచుటతో పనిలేకనే శుద్ధబ్రహ్మమును ఉపాసింపవచ్చును. ఇట్లుపాసనచేసిన పూర్వోత్తరసందర్భములకు విరోధము ఏమియునురాదు. వైశ్వానరుడు అగ్ని మొదలగుశబ్దములు అగ్నినేచెప్పునవియైనను ఏదో ఒకవ్యుత్పత్తి ఆశ్రయమును చేసికొని పరబ్రహ్మను చెప్పునవిగా మార్చుకొనవచ్చును. త్రేతాగ్నివిభాగము ప్రాణాహుతులకు ఆధారమైయున్నాడని చెప్పుటమొదలగునవికూడ సర్వమయుడగు పరబ్రహ్మవిషయములో విరుద్ధములుకానేరవు. అని జైమినిమహాముని అభిప్రాయపడుచున్నాడని తాత్పర్యము.

అవ॥ పైచెప్పినప్రకారము వైశ్వానరపదమునకు శుద్ధపరబ్రహ్మమని చెప్పటసరికాక. అట్లుచెప్పినయెడల వైశ్వానరుడు ప్రాదేశమాత్రుడు (ప్రాదేశమనగా లొడితెడు అని అర్థము) అనిచెప్పుశ్రుతిని సమన్వయముచేసికొనుట ఎట్లు? అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౨౯॥ అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః॥

టీక॥ ఆశ్మరథ్యః=ఆశ్మరథ్యుడనుమహాముని, అభివ్యక్తేః = పరమేశ్వరుడు, సర్వవ్యాపకుడైనను ఉపాసకులను అనుగ్రహించుటకై చిన్నవాడుగానునట్లుకనపడుచున్నందువన, ప్రాదేశమాత్రశ్రుతిః= ప్రాదేశమాత్రుడు అనిచెప్పట, నవిరుద్ధా= విరుద్ధముకాదు, ఇతిమన్యతే= అనితలంచుచున్నాడు.

తా॥ పరమేశ్వరుడు సర్వవ్యాపకుడైనను ఉపాసకుల అనుగ్రహించుటకై చిన్నవాడుగ కనుపడుచున్నాడుకదా, ఈఅనుభవమునుపట్టి వేదముకూడ ప్రాదేశమాత్రుడని చెప్పినది. కావున దీనివలన విరోధమేమియునులేదు. కాబట్టి వైశ్వానర శబ్దమునకు శుద్ధపరబ్రహ్మమనియే అర్థము చెప్పవలయునని ఆశ్మరథ్యుడను మహాముని చెప్పుచున్నాడు. కావున ప్రాదేశమాత్రశ్రుతివలన పైనిరూపించిన అర్థమునకు విరోధమేమియునులేదని తాత్పర్యము.

అవ॥ ప్రాదేశమాత్రశ్రుతినిగూర్చి మఱియొకరి అభిప్రాయము చెప్పుచున్నాడు.

సూ॥ ౩౦॥ అనుస్మృతేర్బాదరిః॥

టీక॥ బాదరిః=బాదరిమహాముని, అనుస్మృతేః= ధ్యానముచే యుటయనుకారణమువలన (ప్రాదేశమాత్రమగు హృదయములో నున్న మనస్సుచే ధ్యానింపబడువాడు, కావున ఆపరబ్రహ్మముకూడా) ప్రాదేశమాత్రశ్రుతిః=ప్రాదేశమాత్రుడని చెప్పుట, నవిరుద్ధా= విరుద్ధముకాదు, ఇతిమన్యతే = ఇట్లని అభిప్రాయపడుచున్నాడు.

తా॥ మనస్సు ప్రాదేశమాత్రమగు హృదయస్థానమందున్నది. కావున ప్రాదేశమాత్రమనబడును. అట్టిమనస్సుచే ధ్యానింపబడువాడు. కావున పరమేశ్వరునికూడ ప్రాదేశమాత్రుడని శ్రుతిచెప్పుచున్నదిగాని దీనివలన పరమేశ్వరుని సర్వవ్యాపకత్వమునకు విరోధమేమియును లేదని బాదరిమహాముని అభిప్రాయపడుచున్నాడు. దీనినిపట్టిచూచినను ప్రాదేశమాత్ర శ్రుతిని పరబహ్మమునందు సులభముగ సమన్వయము చేసికొనవచ్చునని తాత్పర్యము.

అవ॥ ఇట్లు ఈవిషయమున పరుల అభిప్రాయమునుచూపి ఇప్పుడు ౨౯ వ సూత్రమునందు చూపబడిన మతమునకు కర్తయగు జైమినిమహామునియొక్క సిద్ధాంతమును జెప్పుచు దానిని సూత్రకారుడగు వ్యాసుడుస్వయముగాకూడా దృఢపరుచుచున్నాడు.

సూ॥ ౩౧॥ సంపత్తేరితిజైమినిస్తథాహిదర్శయతి॥

టీక॥ జైమినిః=జైమినిమహాముని, సంపత్తేః=ప్రాదేశమాత్రుడుగానే ఏర్పడుచుండుటవలన, ప్రాదేశమాత్రశ్రుతిః=పరబ్రహ్మము ప్రాదేశమాత్రుడని చెప్పుట, నవిరుద్ధా = విరుద్ధముకాదు, ఇతి=ఇట్లు, మన్యతే=అనితలంచుచున్నాడు, శ్రుతిశ్చ=వేదముకూడ, తథా= అట్లు (పరబ్రహ్మము ప్రాదేశమాత్రుడుగా ఏర్పడునట్లు) దర్శయతిహి= వాజసనేయ బ్రాహ్మణమునందు చూపుచున్నదికదా.

తా॥ "ఏషవా అతిష్ఠావైశ్వానరః" (ఇదిమేధ్యలోకము వైశ్వానరునిశిరస్సు) ఈవాక్యమును గురువుశిష్యునియొక్క శిరస్సును జూపిచెప్పెను. అనివాజసనేయ బ్రాహ్మణమునందున్నది. పై ఉదహరించిన శ్రుతివంటి శ్రుతులచే ఆబ్రాహ్మణమునందు వైశ్వానరుని ఉపాసనచేయుమార్గము చెప్పబడియున్నది. ఎట్లనగా, ఉపాసకుడగు

వాడు తనశిరస్సును వైశ్వానరునిశిరస్సునుగాను తనకన్నులను వైశ్వానరుని కన్నులనుగాను తననిట్టూర్పులను వైశ్వానరుని నిట్టూర్పులను గాను తననోటిలోనూడు ఆకాశమును వైశ్వానరుని సర్వశరీరము గాను తననోటియందుండుజలము వైశ్వానరునివస్తిప్రదేశము (పొత్తికడుపు) గాను తనగడ్డము వైశ్వానరుని పాదములుగాను భావించి ఉపాసనచేయవలయునని చెప్పబడియున్నది. గడ్డముమొదలు శిరస్సు వరకునుండుప్రదేశము ప్రాదేశమాత్రమే యగుటచే వైశ్వానరుడు కూడ ప్రాదేశమాత్రుడేఅవ్వనుకదా, దీనినిపట్టి జైమినిమహాముని ప్రాదేశమాత్రశ్రుతి పరబ్రహ్మాను చెప్పుటలో విరోధములేదని చెప్పుచున్నాడు. ఈయన అభిప్రాయమునే వేదముకూడ దృఢపరుచుచున్నదికదా అని తాత్పర్యము.

సూ॥ ౩౨॥ ఆమనంతి చైనమస్మిన్॥

టీక॥ అస్మిన్ - ప్రాదేశమాత్రమైన గడ్డముమొదలు శిరస్సువరకునుగలప్రదేశమునందు, అస్మిన్=ఉన్నాడని, ఏనం - పరమేశ్వరుని, జాబాలాః=జాబాలశాఖవారు (జాబాలోపనిషత్తును అధ్యయనముచేయువారు) ఆమనంతి=చెప్పుచున్నారు.

తా॥ పైసూత్రతాత్పర్యమునందు ఉదహరించిన శ్రుతివలన గడ్డముమొదలు శిరస్సువరకునుండు ప్రదేశమునందు పరమేశ్వరుడు ఉన్నాడనిచెప్పెరికదా? అట్లే జాబాలోపనిషత్తునందుకూడ మఱియొక శ్రుతికలదు. "య ఏషోఽనంతోఽవ్యక్త ఆత్మా సోఽవిముక్తే ప్రతిష్ఠితః" (అంతములేనివాడును స్వస్వరూపముతో స్పష్టముగా ప్రకాశింపనివాడును అగుపరమాత్మ యెవ్వడు. వాని ఎట్లు తెలిసికొనవలయును? ఇది అత్రిమహామునిచేసినప్రశ్న, ఆపరమాత్మ జీవునియందు ప్రతిష్ఠింపబడియున్నాడు. (ఇది యాజ్ఞవల్క్యమహామునిచెప్పిన ఉత్తరము) అను మొదలగువాక్యములచే ప్రశ్నోత్తరరూపముగ పరమేశ్వరుడు భ్రూమధ్యమునందు ఉన్నాడని నిర్ణయింపబడియున్నది. ఈనిర్ణయముకూడ పరమేశ్వరుడు ప్రాదేశమాత్రుడనుటకు తోడుపడుచున్నదికదా? కావున వైశ్వానరశబ్దము శుద్ధపరబ్రహ్మమునే చెప్పుననియు ప్రాదేశమాత్రశ్రుతివలన విరోధమేమియులేదనియు జఠరాగ్నియనికాని జఠరాగ్ని

యందు ఉన్నాడనికాని తలంచుటతో పనిలేకయే శుద్ధపరబ్రహ్మనే ఉపాసింపవచ్చుననియును ఇదియే వైశ్వానరవాక్యమునకు తాత్పర మనియును సిద్ధాంతముచేయబడినది అని తాత్పర్యము.

సర్వత్రసప్తద్వాత్రింశత్॥ ౭॥౩౨॥ సర్వత్రా, త్తా, గుహ మంతరో, న్తర్యా, మ్యదృశ్య, వైశ్వానరాస్సప్త॥

ఇతి బ్రహ్మసూత్రే - ప్రథమస్యాధ్యాయస్య ద్వితీయఃపాదః.

ఇట్లు ప్రథమాధ్యాయమునందు ద్వితీయపాదము

ముగిసెను.

---

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## ప్రథమాధ్యాయము - తృతీయపాదము.

### ——(*) ౧. ద్యుభ్వాద్యధికరణమ్. (*)——

అవ॥ " యస్మిన్ద్యౌః పృథివీచాంతరిక్షం " (ఎవనియం దు ద్యులోకము భూమి ఆకాశము మొదలగునవి ఉన్నవో, ఆయన ఆత్మయని తెలిసికొనుడు) అను వాక్యమునందు వర్ణింపబడినవాడెవ పరబ్రహ్మమా, జీవుడా, ప్రధానమా, వాయువా, అను సంశ యమును ఈఅధికరణముచే నివర్తింపజేయుచున్నాడు.

**సూ॥ ౧॥ ద్యుభ్వాద్యాయతనంస్వశబ్దాత్॥**

టీక॥ స్వశబ్దాత్ = ఆత్మ అనుశబ్దము ప్రయోగింపబడిన దుటవలన; ద్యుభ్వాద్యాయతనం = ద్యులోకము భూమి మొదలగు నికి ఆధారమైనది, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

డని చెప్పబడినవాడుకూడ ప్రాణవాయువే యైయుండునా? అను సంశయముకలుగుచున్నది కాని యిట్లు సందేహింపవలసిన పనిలేదు. ప్రాణములనుగూర్చి ఉపదేశించిన పదపదార్థములకంటె వేరగు మఱియొక దానినిగూర్చి ఉపదేశించుటన్యాయముగాని మరల ఆప్రాణములనుగూర్చియే ఉపదేశించిరనుట సరికానేరదుకదా, కావున భూమాశబ్దముచేత జెప్పబడువాడు పరమేశ్వరుడే అని తాత్పర్యము.

అవ॥ పైవిషయమును స్థిరపరచుటకు మఱియొక కారణమును జూపుచున్నాడు.

సూ॥ ౮॥ ధర్మోపపత్తేశ్చ ॥

టీక॥ ధర్మ=ప్రస్తుత ప్రకరణమునందు చెప్పబడియున్న ధర్మములు, ఉపపత్తేశ్చ = పరబ్రహ్మమునకే తగియుండుటవలనకూడ, భూమా=భూమాశబ్దముచేత జెప్పబడువాడు, పరమేశ్వర ఏవ=పరమేశ్వరుడే.

తా॥ యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత (ఏబ్రహ్మము నెఱింగినప్పుడు సాధకునకు సర్వము ఆత్మస్వరూపమయగునో అట్టి బ్రహ్మము నెఱింగినపిదప దేనిని దేనితో చూచును. తనకంటె ఇతరమగు వస్తువు కనుబడకపోవుటచే ఒకదానిని చూచుచున్నానను వ్యవహారమే కలుగదని తాత్పర్యము.) అనుమొదలగు వాక్యములచేత అనేకస్థలములయందు పరబ్రహ్మ నెఱింగినయెడల సర్వవ్యవహారములును నశించునని చెప్పబడియున్నది. అట్లే ప్రస్తుతప్రకరణమునందును "యత్రనాన్యత్పశ్యతి" అనుమొదలగు వాక్యముచే సర్వవ్యవహారములును నశించుటకు సాధనమైన వస్తువే భూమాశబ్దముచే జెప్పబడుచున్నదని వర్ణింపబడియున్నది. మఱియు ప్రస్తుతప్రకరణమునందే "యో వై భూమా తత్సుఖం యో వై భూమా తదమృతం అతోఽన్యదార్తం (భూమాశబ్దముచేత నేది చెప్పబడునో అదియే పరమానందస్వరూపమైనది. అదియే మోక్షస్వరూపమైనది. దానికంటె వేరయిన పదార్థమంతయును నశించుస్వభావముగలది) అనువాక్యములచే ఆనందమోక్షస్వరూపమగు సత్యపదార్థమే భూమాశబ్దముచేత జెప్పబడెనని వివరింపబడియున్నది. ఈవిధముగా ఈప్రకరణమునందు వర్ణింపబడిన

ధర్మములన్నియు సచ్చిదానంద స్వరూపుడగు పరమేశ్వరునకు తగియుండునుగాని ప్రాణమునకు తగియుండవుకదా, కావున భూమాశబ్దముచే జెప్పబడువాడు పరమేశ్వరుడే కాని ప్రాణము కాదనుటయే సిద్ధాంతమని తాత్పర్యము.

—(*) 3. అక్షరాధికరణమ్. (*)—

అవ॥ "ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి" (ఓ గార్గీ దీనినే బ్రహ్మవేత్తలగువారు అక్షరమని చెప్పుదురు. అనువాక్యమునందుండు అక్షరపదముచే ఏది చెప్పబడును? ఓంకారరూపమగు అక్షరమా? లేక పరబ్రహ్మమా? అను సంశయమును ఈ అధికరణముచే నివారించుచున్నారు.

సూ॥ ౧౦॥ అక్షరమంబరాంతధృతేః॥

టీక॥ అంబరాంతధృతేః=పృథివి మొదలు ఆకాశమువరకు గల సర్వవికారములను (పంచభూతములను భౌతికములను) ధరించుట వలన (ధరించునది కనుక వలననుట) అక్షరం=అక్షరశబ్దముచే జెప్పబడునది, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ "ఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చ" (ఓ గార్గీ ఈ అక్షరమునందే ఆకాశముకూడ ఓతప్రోతభావమును జెందియున్నది. అనగా అక్షరమునే ఆధారముచేసికొని ఆకాశముకూడా ఉన్నదనుట, ఓతప్రోతభావమునుగూర్చి నాచే వివరించబడిన బ్రహ్మగీత ౧౦వ అధ్యాయమును చూడవలెను.) ఈ వాక్యమువరకు భూమిమొదలు ఆకాశమువరకుగల పంచభూతములును ఆభూతములవలనబుట్టిన సర్వప్రపంచమును ఆ అక్షరమునే ఆధారముచేసికొని ఉన్నవని చెప్పబడియున్నది. ఓంకారరూపమగు అక్షరము సర్వప్రపంచమునకు ఆధారమని చెప్పుటకు వీలులేదుకదా, కావున అవతారికయందు చూపబడే ఈ అధికరణమునందు విచారణలోను ఉన్న శ్రుతియందలి అక్షరశబ్దముచేత జెప్పబడినవాడు పరమేశ్వరుడే అని తాత్పర్యము.

అవ॥ పంచభూతములను ధరించుట అనునది పరమేశ్వరుడు తప్ప మఱి ఎవ్వరునేయలేరని నిశ్చయమేనున్నది. చేతనమగు పదా

ర్థమే ప్రపంచమును ధరింపవలయుననియు అచేతనమైన పదార్థము ప్రపంచమును ధరించకూడదనియును నియమము ఎచ్చటనున్నది? అను పూర్వపక్షమునకు ఉత్తరము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౧॥ సాచప్రశాసనాత్॥

టీక॥ ప్రశాసనాత్=ఆజ్ఞాపించుటవలన ( ఈ అక్షరము ఆజ్ఞాపించుచున్నదని చెప్పుటవలన ) సాచ=ఆధారణకర్మ, ( భూతభౌతికములను ధరించుట. అనుపని ) బ్రహ్మణ ఏవ=పరబ్రహ్మముయొక్క పనియే.

తా॥ " ఏతస్యవా అక్షరస్య ప్రశాసనేగార్గి సూర్యాచంద్రమసౌవిధృతౌతిష్ఠతః " ( ఓగార్గీ సూర్యచంద్రులు ఈ అక్షరముయొక్క ఆజ్ఞయందే ధరింపబడియున్నారు ) అనువాక్యముచేత అక్షరము సూర్యచంద్రాదులను ఆజ్ఞాపించుచున్నదని చెప్పబడియున్నది. దీనివలన ధరించుట అనగా ఆజ్ఞచేత నియమించుటయని ఏర్పడుచున్నది. ఈ ఆజ్ఞచేతన ధర్మముగాని అచేతన ధర్మముకాదుకదా కావున మనకు ప్రస్తుతము విచారణలో నున్నశ్రుతియందలి అక్షరపదముచే చెప్పబడువాడు చేతనస్వరూపుడగు పరమేశ్వరుడేకాని మఱియెవ్వరుకారని తాత్పర్యము.

అవ॥ అక్షరశబ్దముచేత శ్రుతి పరబ్రహ్మమును చెప్పనేకాని మఱియొకదానిని చెప్పదు. అనువిషయమును నిర్ధారణచేయుటకై మఱియొక కారణమును జెప్పుచున్నాడు.

సూ॥ ౧౨॥ అన్యభావవ్యావృత్తేశ్చ॥

టీక॥ అన్యభావ= పరబ్రహ్మమునకంటె ఇతరమగు ప్రధానము జీవుడు మొదలగువారియొక్క స్వభావమును, వ్యావృత్తేః=నివర్తింపజేయుటవలన ( లేదనిజెప్పుటవలన) అక్షరం = అక్షరశబ్దముచేత జెప్పబడునది, పరబ్రహ్మైవ=పరబ్రహ్మమే, నాన్యత్=వేరొకటికాదు.

తా॥ తద్వా " ఏతదక్షరం గార్గ్యదృష్టంద్రష్టృ ( ఓగార్గీ తానుదేనిచేతను చూడబడకుండియున్న ఈఅక్షరము అన్నిటిని చూచుచుండును) అను వాక్యముచే అక్షరశబ్దముచేత జెప్పబడువస్తువే సర్వప్రపంచసాక్షి అని చెప్పబడియున్నది. ఈసాక్షిత్వము అచేతనమగు ప్రధానమునకు సంభవింపదు కావున అక్షరశబ్దముచే ప్రధానము

చెప్పబడుననుటకు వీలులేదు. మఱియు " నాన్యదతోఽస్తిద్రష్టృ (ఈ అక్షరమునకంటె ఇతరుడగు ద్రష్టయు సాక్షియు లేడు ) అనువాక్యముచే అక్షరశబ్దముచే జెప్పబడువానికంటె ఇతరుడగు సాక్షియే లేదని చెప్పబడియున్నది. దీనినిబట్టి చూచిన దేహముల జీవుడుకూడా చేతనస్వరూపుడేమైనను ఉపాధివలన సర్వసాక్షియగుటకు వీలులేదు. కావున ఆ అక్షరశబ్దము జీవునిచెప్పుననుటకూడ సరియైనదికాదు. కావున అక్షరశబ్దము పరబ్రహ్మనుచెప్పుననవలయునే కాని మఱియొకవిధముగ జెప్పుట కవకాశము లేదని తాత్పర్యము.

— —(*) ౪. ఈక్షతికర్మాధికరణమ్. (*) — —

అవ॥ " యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరంపురుషమభిధ్యాయీత " ( ఏసాధకుడు అకార ఉకార మకారములను మూడుమాత్రలుకల ఓం అను అక్షరమును పురుషునిగా ధ్యానించునో ) అనుమొదలగు వాక్యమునందు ఉపాసకునిచే ప్రణవరూపముగా ధ్యానింపబడవలసిన పురుషదేవుడు పరమేశ్వరుడా లేక హిరణ్యగర్భుడా ( హిరణ్యగర్భుడనగా సకలజీవుల నభిమానించు సమష్టివుడు. వీనినేచతుర్ముఖబ్రహ్మయని చెప్పుదురు. ) హిరణ్యగర్భుని గూర్చిగూడ ఉపక్రమమునందు చెప్పబడియే యున్నదికదా! అను సంశయముగూర్చి ఈ అధికరణమున విచారించుచున్నారు.

సూ॥ ౧౩ । ఈక్షతికర్మవ్యపదేశాత్సః ॥

టీక ॥ ఈక్షతి=చూచుటయును ( తెలిసికొనుటయును ) క్రియకుకర్మగా, వ్యపదేశాత్=చెప్పుటవలన, సః=పైనుదహరించిన వాక్యమునందు ధ్యానింపతగినవాడని చెప్పబడునపురుషుడు, పరంబ్రహ్మైవ=పరబ్రహ్మయే.

ఆ॥ " తస్మిన్దృష్టే పరావరే " ( సర్వవ్యాపకుడైన ఆపరబ్రహ్మను చూచినచో + తెలిసికొనినచో + ) అను మొదలగు వాక్యములచే ఇతరశ్రుతులయందు చూడతగినవాడు ) తెలిసికొనతగినవాడు పరబ్రహ్మమేయని నిర్ణయింపబడియున్నది దానికనుగుణముగా ప్రస్తుత యఃపునరేతం అనువాక్యమునకు రెండవ భాగమునందు " సఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే "

( ఆసాధకుడు ఈ కనుపడుచున్న సర్వజీవుల నభిమానించు హిరణ్యగర్భుడున్న సత్యలోకమునకంటె ఉత్తముడును, సర్వ శరీరములయందును అంతర్యామి స్వరూపుడై యున్నవాడును అగుపరమాత్ముడగు పురుషుని జూచును ) అని చెప్పబడియున్నది. ఈ విధముగా చెప్పుటవలన చూడతగినవాడు అని సర్వశ్రుతులచేతను ఏకగ్రీవముగా చెప్పబడుచున్న పరమాత్మయే ప్రస్తుత యఃపునరేతం అనుమొదలగు వాక్యములందుకూడ ధ్యానింపదగినవాడుగా వర్ణింపబడెననుట నిస్సంశయమని తాత్పర్యము.

——(*) ౫. దహరాధికరణమ్. (*)——

అవ॥ " అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరంపుండరీకంవేశ్మ దహరోఽస్మిన్నంతర ఆకాశః " ( ఈ శరీరమునందు సూక్ష్మమగు ఏహృదయ కమలముగలదో దానిలోపల ఏసూక్ష్మమగు ఆకాశము కలదో) అనువాక్యమునందు ఆకాశమనగా నేమి? పంచభూతములలోని ఆకాశభూతమా? లేక శరీరములోనున్న యీకాశమని చెప్పబడినది కావున పురుషుడా? లేక బ్రహ్మమా? అనుసంశయమును, ఈ అధికరణమున విచారించుచున్నాము.

సూ॥ ౧౪॥ దహర ఉత్తరేభ్యః ॥

టీక॥ ఉత్తరేభ్యః=తరువాతనున్నలక్షణములవలన, దహరః= దహరాకాశపదముచే చెప్పబడినవాడు, బ్రహ్మైవ = పరబ్రహ్మము.

తా॥ యావాన్వా అయమాకాశ స్తావానేషోఽంతర్హృదయ ఆకాశః ఉభే అస్మిన్ ద్యావాపృథివీ అంతరేవ సమాహితే. ( ఈభూతాకాశము ఎంతపెద్దదియో హృదయకమలమునందుండు ఆకాశముకూడ అంతపెద్దదియే ఆహృదయాకాశమునందే ద్యులోకమును భూమియు ఇమిడియున్నవి ) అనువాక్యశేషముచే ( వాక్యశేషమనగా తానుచెప్పిన విషయమును బాగుగ వివరించుటకై చెప్పెడు మఱియొక వాక్యము ) హృదయాకాశము పంచభూతములలోని ప్రసిద్ధ ఆకాశముతో పోల్పబడియున్నది. హృదయాకాశమును భూతాకాశమును ఒక్కటియే అయినయెడల ఇట్లు చెప్పుటకు ( పోల్చుటకు ) వీలులేదు కదా? మఱియు పైవాక్యశేషమునందే ఈ హృదయాకాశమునందు

ద్యులోకమును భూమియు ఇమిడియున్నవని చెప్పబడియున్నది. ఇది యును సర్వప్రపంచమునకు ఆధారభూతుడగు పరబ్రహ్మయందు సరిపడునుగాని మఱియొకచోట సరిపడవుకదా, ఇదియునుగాక దీనికి సంబంధించిన మఱియొకవాక్యమునందు "ఏషఆత్మాపహతపాప్మా" (హృదయకమలమునందు ఉన్నదని చెప్పబడిన ఆకాశమేదికలదో ఇది యేఆత్మ ఇదియే సమస్తపాప సంబంధములులేని పరిశుద్ధవస్తువు) అని ప్రత్యక్షముగానే బ్రహ్మలక్షణములు అనేకములు చెప్పబడియున్నవి. ఇట్టిసందర్భములనన్నిటిని విమర్శించిచూచిన దహరాకాశ పద ముచే చెప్పబడువాడు పరబ్రహ్మమేకాని వేఱొకడు కాడనితాత్పర్యము.

అవ॥ ఈవిషయము నిర్ణయించుటకై మఱియొక కారణమును చెప్పుచున్నాడు.

సూ॥ ౧౫॥ గతిశబ్దాభ్యాంతథాహిదృష్టం లింగంచ॥

టీ॥ గతిశబ్దాభ్యాం = సర్వభూతములును సుషుప్తికాలము నందు దహరాకాశమును పొందుచున్నవని చెప్పుటచేతను ఈదహరా కాశమునందు బ్రహ్మలోకశబ్దము ప్రయోగించియుండుటచేతను వా రః=దహరాకాశపదముచే చెప్పబడువాడు, బ్రహ్మైవ = పరబ్రహ్మ మే, తథా= బ్రహ్మలోకశబ్దము పరబ్రహ్మమును చెప్పునదియనీ, లింగం చ=గురుతుకూడ (అనుభవముకూడ) దృష్టంహి=చూడబడుచున్నదిగ దా (అందఱకును స్పష్టముగ తెలియుచున్నదిగదా.)

తా॥ పైసూత్రతాత్పర్యమునందు నిరూపించబడిన వాక్యముల కంటే వేఱగు నొకవాక్యమునందు "ఇమాస్సర్వాఃప్రజాఅహరహ ర్గచ్ఛంత్యః ఏతంబ్రహ్మలోకం నవిందంతి" (ఈప్రజలందరును ప్రతి దినమునందును ఈపరబ్రహ్మమును పొందుచున్నను దానిస్వరూపమును తెలిసికొనలేకున్నారు) అనిసుషుప్తికాలమునందు సర్వప్రపంచము దహరాకాశమునందే లీనమగుననియు ఆదహరాకాశమునకు బ్రహ్మ లోకమని పేరుగలదనియు చెప్పబడియున్నది. భూతాకాశమునందు కాని జీవునియందుకాని సర్వప్రపంచము లీనమగుననుట సంభవిం పదుకదా! మఱియు బ్రహ్మలోకశబ్దము బ్రహ్మైవలోకః (పరబ్రహ్మ మనియెడుస్థానము.) అను వ్యుత్పత్తిచే పరబ్రహ్మమును చెప్పునుగాని

భూతాకాశముగానీ జీవునిగానీ చెప్పదు. బ్రహ్మలోకశబ్దము పరబ్రహ్మమునే చెప్పుననుటలో ప్రత్యక్షానుభవముకలదు. ఎట్లనగా, సర్వప్రపంచము సుషుప్తికాలమునందు బ్రహ్మలోకమును పొందుననిగదా చెప్పియున్నారు. బ్రహ్మలోకమనగా సత్యలోకమయినన్ను పైనచూపిన వ్యుత్పత్తిచే పరబ్రహ్మమైనను కావలయును. ప్రతిదినమును జనులు సత్యలోకమునకు పోవుచున్నారనుట సంభవింపదు కావున పరబ్రహ్మమునందు లీనమగుచున్నారనియే చెప్పవలయును. ఇట్లు నిరూపించిన విషయములన్నిటిని విమర్శించినచో దహరాకాశపదముచే చెప్పబడు వాడు పరబ్రహ్మయే యగునని తాత్పర్యము.

సూ॥ ౧౬॥ ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మిన్నుపలబ్ధేః॥

టీక॥ ధృతేశ్చ = సర్వప్రపంచమును ధరించియున్నాడని చెప్పుటవలన, దహరః = దహరాకాశము, బ్రహ్మైవ = పరబ్రహ్మమే, అస్య = ఈజగద్ధారణరూపమయిన, మహిమ్నః = ప్రభావముయొక్క, (ప్రభావము) అస్మిన్ = ఈపరబ్రహ్మమునందే, ఉపలబ్ధేః = తెలియబడుచుండుటవలన (కలదని తెలియుచున్నది.)

తా॥ "ఏష ఆత్మా సేతుర్విధృతిః" (ఆత్మ అనువాడు ఎవ్వడో ఆతడే సర్వజగత్తును ధరించునట్టి | సరిహద్దులను విడువకుండునట్లుచేయగల | సేతువు [కట్ట]) అనువాక్యమునందు దహరాకాశమే జగత్తునంతయు ధరించునని చెప్పబడియున్నది. ఈ కారణమువలన కూడ దహరాకాశము పరబ్రహ్మమే కావలయును. "ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" అనుమొదలగు ఇతరశ్రుతులయందుకూడ జగత్తునుధరించుట అనునది పరబ్రహ్మయొక్క కార్యముగనే కదా నిరూపింపబడియున్నది. కావున దహరాకాశపదము పరబ్రహ్మమును చెప్పునదియేగాని భూతాకాశమునుగాని జీవునిగాని చెప్పునది కాదని తాత్పర్యము.

సూ॥ ౧౭॥ ప్రసిద్ధేశ్చ॥

టీక॥ ప్రసిద్ధేః = ప్రసిద్ధివలన (ఆకాశశబ్దము పరబ్రహ్మమును చెప్పునను విషయము ప్రసిద్ధమగుటవలన) దహరః = దహరాకాశము, బ్రహ్మైవ = పరబ్రహ్మమే.

తా॥ "ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితా సర్వాణి హవా ఇమాని భూతా న్యాకాశా దేవసముత్పద్యంతే" ( ఈఆకాశమే నామరూపములను నిర్వహించుచున్నది. ఈఆకాశమునుండియే. ఈశ నబడుచున్న సర్వభూతములును పుట్టుచున్నవి ) అనుమొదలగు ఇతర శ్రుతులయందుకూడ ఆకాశపదము పరబ్రహ్మమును చెప్పుననుట ప్రసిద్ధమేఅయియున్నది. కావున ప్రస్తుత దహరాకాశవాక్యమునందుకూడ దహరాకాశపదముచే పరబ్రహ్మమే చెప్పబడెనని తాత్పర్యము.

అవ॥ ఇట్లుచెప్పుట సరికాదు "అథయఏష సంప్రసాదోస్మాచ్ఛరీరాత్సముత్థాయ ( ఏసంప్రసాదము ఈశరీరమునుండి లేచి) అను మొదలగుదహరాకాశవాక్యశేషమునందు సంప్రసాదశబ్దముచే జీవుడు పరామర్శచేయబడియున్నాడు. సర్వాత్మకుడగు పరమేశ్వరునకు ఒక చోటనుండిలేచి మఱియొకచోటికిబోవుటయనునది సంభవింపదుగదా, ఇట్లువాక్యశేషమునందు జీవునిపరామర్శించుటవలన వాక్యమునందున్న విషయవాచకమగు దహరాకాశపదముచేత ఆజీవుడే చెప్పబడియుండవలయును అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౮॥ ఇతరపరామర్శాత్స ఇతిచేన్నాసంభవాత్ ॥

టీక॥ ఇతర=పరబ్రహ్మమునకంటె ఇతరమైనజీవుని, పరామర్శాత్=వాక్యశేషమునందు పరామర్శచేయుటవలన, సః=ఆఇతరుడే ( ఆజీవుడే ) దహరః=దహరాకాశశబ్దముచే చెప్పబడువాడు, నబ్రహ్మ=బ్రహ్మకాదు, ఇతిచేత్=నేనెడల, న=సరికాదు, కుతః=ఏలననగా, అసంభవాత్=అసంభవ దోషమువచ్చును, కావున ( దహరాకాశమునచెప్పబడు ధర్మములన్నియు జీవునియందుండుటకు వీలులేదు కావున.)

తా॥ ౧౩ వ- సూత్రతాత్పర్యమునందును అచ్చట నుండియు ౧౭ వ- సూత్రమువరకుగల అన్నిసూత్రములయందును వివరింపబడియున్నధర్మములు సర్వాత్మకుడగు పరబ్రహ్మము నందుండునుగాని ఉపాధిపరిచ్ఛిన్నుడగుజీవునియందుండునవికావు. ఈ కారణమువలన అవతారికయందు చూపబడినప్రకారము దహరవాక్య శేషమునందు జీవుడుపరామర్శింపబడియున్నంతమాత్రమున దహరాకాశశబ్దమునకు

జీవుడర్థమనిచెప్పుటకు వీలులేదు ఆపదమునకు పరబ్రహ్మమేయర్థమని తాత్పర్యము.

——(*) ౬. ఉత్తరాధికరణమ్ (*)——

అవ॥ ఇంతమాత్రమువలననే దహరాకాశపదమునకు జీవుడు అర్థముకాదని చెప్పుటకు వీలులేదు. ఏలయనగా, దహరవిద్యకు తర్వాత నుండు ప్రాజాపత్యవిద్యయందు "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే" (కంటియందున్నాడని ఏపురుషుడు శాస్త్రములవలన తెలియజేయబడుచున్నాడో) అనుమొదలగు వాక్యములవలన జాగ్రత మొదలగు అవస్థలతో గూడినజీవుని వర్ణింపుచువచ్చి కట్టకడకు "య ఆత్మా అపహతపాప్మా" (సమస్తపాపములతోను సంబంధములేని ఏఆత్మగలడో) అనుమొదలగువాక్యములచే ఆజీవునకే అపహతపాప్మత్వము (పాపములతో సంబంధములేకపోవుట) మొదలగుపరబ్రహ్మధర్మములు చెప్పబడియున్నది. దీనినిపట్టిచూచిన దహరాకాశశబ్దమునకర్థము జీవుడే కావచ్చునన్న కాదనిచెప్పుచున్నాడు.

సూ॥ ౧౯॥ ఉత్తరాచ్చేదావిర్భూతస్వరూపస్తు ॥

టీక॥ ఉత్తరాత్ = ప్రకరణనుండు ప్రాజాపత్యవిద్యవలన, జీవః=జీవుడే, దహరః=దహరాకాశశబ్దార్థమని, నిశ్చితశ్చేత్ = నిశ్చయింపబడెనేని, న=అదిసరికాదు, తత్రతు = ఆ ప్రాజాపత్యవిద్యయందైతే, ఆవిర్భూతస్వరూపః (ప్రకాశించినస్వస్వరూపముగల (అనగా పరబ్రహ్మమైనజీవుడు) ఉక్తః=చెప్పబడెను.

తా॥ ప్రాజాపత్యవిద్యయందు జీవునిగూర్చియే సర్వవిషయములును చెప్పబడియున్నవనుట నిశ్చయము అయినను అందుచెప్పబడినజీవుడు 'తత్త్వమస్యాది మహావాక్యముల అర్థమును విచారించుటచే జ్ఞానవంతుడై అజ్ఞానమును అజ్ఞానమువలనజనించినసకలప్రపంచమును వదలి శుద్ధబ్రహ్మస్వరూపుడైయుండువాడేకాని అవిద్యకులోపడియుండువాడుకాదు. కావున ఆవిద్యయందు చెప్పబడినజీవుడు పరబ్రహ్మమే కదా దీనినిపట్టి చూచిన ఆప్రాజాపత్యవిద్యయందు అపహతపాప్మత్వాదిగుణములు బ్రహ్మకు ఉన్నవనిచెప్పినను జీవునకున్నవని చెప్పినను ఒకటియేయగును. ఇంతమాత్రముననే అపహతపాప్మత్వము మొద

లగు గుణములు జీవులకందరకుగలవనియు, దహరాకాశ శబ్దమునకు జీవుడేయర్థమనియు, దీనివలన నేర్పడుననియు చెప్పుట మిక్కిలి పొరబాటని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పినచో ౧౮ వ- సూత్రమునందు చూపబడిన జీవపరామర్శకర్థమేమి అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౨౦॥ అన్యార్థశ్చ పరామర్శః ॥

టీక॥ పరామర్శః=౧౮ వ- సూత్రమునందు చూపబడిన జీవపరామర్శ, అన్యార్థః=మఱియొకదానికొఱకై (పరమేశ్వరుని నిరూపించుటకొరకై) క్రియతేచ=చేయబడుచున్నది.

తా॥ "యఏషసంప్రసాదోస్మాచ్ఛరీరాత్సముత్థాయపరంజ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతఏష ఆత్మేతిహోవాచ" ఈ జీవుడు స్థూలసూక్ష్మరూపములగు శరీరములనుండి లేచి (జ్ఞానముగలవాడైయుండుట) పరంజ్యోతిని పొంది స్వస్వరూపముతో నిలుచునో ఆజ్యోతియే ఆత్మ అని చెప్పెను.) అనువాక్యమునందుగల జీవపరామర్శ కలదని ౧౮ వ- సూత్రమునందు చూపబడియున్నది. ఈపరామర్శపరబ్రహ్మస్వరూపమును నిరూపించుటకై చేయబడినదికాని దహరాకాశ శబ్దమునకు జీవుడే అర్థమని చెప్పుటకు కాదు. కావున దహరాకాశపదమునకు పరమేశ్వరుడే అర్థము కాని, జీవుడుగాని భూతాకాశముగాని అర్థముకాదనియును చెప్పుట యంతయును, యుక్తి యుక్తమని తాత్పర్యము.

అవ॥ ఇప్పటికిని దహరాకాశశబ్దము పరమేశ్వరుని చెప్పుననుట యుక్తమని తోచలేదు. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు అత్యల్పమగు హృదయకమలమందు ఉన్నాడనియు అల్పస్వరూపుడనియు ఈ ప్రకరణమువలన వర్ణింపబడియున్నాడు, ఇదియుక్తము కాదు గదా యనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౧॥ అల్పశ్రుతేరితి చేత్తదుక్తమ్ ॥

టీక॥ అల్పశ్రుతేః = చిన్నవాడుఅని శ్రుతియందు చెప్పబడుటవలన, దహరః=దహరాకాశముచే జెప్పబడువాడు, పరమేశ్వరః= పరమేశ్వరుడుకాడు, ఇతిచేత్=ఇట్లనేయెడల, న=అదియుక్తముకాదు, తత్ =

అవిషయము ( పరమేశ్వరుడు చిన్నవాడనిచెప్పినను బాధలేదను విష యము ) ఉక్తం=ఇంతకుముందే చెప్పబడియున్నది.

తా॥ “ దహరోస్మిన్నంతర ఆకాశః ” ( ఈ హృదయకమలమునందు అల్పమగు నాకాశముగలదు ) అనుటచే ఆకాశ పదముచే జెప్పబడు పరబ్రహ్మము అల్పపరిమాణము గలవాడని చెప్పబడి యుండుట నిశ్చయమేయైనను ఇట్లు చెప్పుటవలన దోషమేమియు లేదనియు పరమేశ్వరుడు సర్వవ్యాపకుడేయైనను ఉపాసకులననుగ్రహించుటకై ఆపరమేశ్వరుని ఉపాధులననుసరించి అల్పప్రమాణముకలవాడుగ శ్రుతి చెప్పుచుండుననియు ఇంతకుముందే “ అర్భకౌకస్త్వాత్ ” అను సూత్రముచే వివరించియున్నాము. కావున దహరాకాశ పదముచే పరమేశ్వరుడే చెప్పబడుచున్నాడనుటకు ఏవిధమగు సందేహము లేదని తాత్పర్యము.

——(*) ౭. అనుకృత్యధికరణమ్. (*)——

అవ॥ “ నతత్రసూర్యోభాతినచంద్రతారకం నేమావిద్యుతోభాంతి కుతోయమగ్నిః, తమేవభాంతమనుభాతిసర్వం తస్య భాసా సర్వమిదంవిభాతి ” [ ఆపరబ్రహ్మను సూర్యుడుగాని చంద్రుడుగాని నక్షత్రములుగాని మెఱుపులుగాని అగ్నిగాని ప్రకాశింప చేయనేరవు. ఈ అన్నియును పరబ్రహ్మప్రకాశించుచుండగా ఆయనను అనుసరించి ప్రకాశించుచుండును. ఈసమస్తమును ఆయనయొక్క ప్రకాశముచేతనే ప్రకాశించుచుండును. అనగా సూర్యాదులలో కనపడుచున్న ప్రకాశమంతయు పరబ్రహ్మప్రకాశమేయనుట ] అనువాక్యమునందు సూర్యాదులను ప్రకాశింపచేయుచున్నాడని చెప్పబడినవాడెవ్వడు? తేజోవిశేషమా, పరబ్రహ్మమా, అను సంశయమును ఈ అధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౨౨ ॥ అనుకృతేస్తస్యచ ॥

టీక॥ అనుకృతేః= అనుసరించి ప్రకాశించుచున్నదని చెప్పుటవలనను, తస్యచ=సూర్యాది సమస్తమునందును ఉండుప్రకాశము పరబ్రహ్మప్రకాశము అనుటవలను. [ తస్యభాసాసర్వమిదంవిభాతి, అనుటవలనను ] సూర్యాది భాసకః= సూర్యాదులను ప్రకాశింప జేయు

నాడు పరమేశ్వరఏవ = పరమేశ్వరుడే, న తేజోధాతుః = తేజస్సు కాదు.

తా॥ అవతారికయందు చూపబడిన వాక్యమునందు సూర్యాదులను ప్రకాశింపజేయువాడు ప్రజ్ఞాత్మయైన పురుషుడు పరమేశ్వరుడే కాని వేఱొకతేజస్సు కాదు. ఏలయనగా సూర్యాదులను ప్రకాశింపజేయు తేజస్సు సూర్యాదులకంటె ఎన్నియో రెట్లు అధికమైయుండవలయునుగదా, అట్లున్నయెడల సూర్యునియెదుట దీపప్రకాశము నశించునట్లు ఆ తేజస్సు యెదుట సూర్యాదుల ప్రకాశముగూడ నశించవలసివచ్చును. ఇట్లుండ "తమేవభాంతమనుభాతిసర్వం" అని (దాని ననుసరించియే సర్వమును ప్రకాశించుచున్నదియని) చెప్పుటకు వీలు లేదుకదా. ఈరీతిగా గొప్పతేజస్సువలన చిన్నతేజస్సును అడంచుటయే స్వభావముగాని ప్రకాశింపజేయుట స్వభావముకాదు. కావున సూర్యాదులను సూర్యాదులకంటె అధికముగు మఱియొక తేజస్సు ప్రకాశింపచేయుచున్నదియనుటయు యుక్తముకాదు. మఱియు పైవాక్యమునందు నాలుగవపాదమున తస్యభాసాసర్వమిదంవిభాతి అనిచెప్పుటవలనకూడ సూర్యాదులను ప్రకాశింపచేయునట్టిది వేఱొకతేజస్సుకాదనియు పరమేశ్వరుడేయనియు స్పష్టమని తాత్పర్యము.

సూ॥ ౨౩ ॥ అపిచస్మర్యతే॥

టీక॥ అపిచ=మఱియు, తథా= పై రీతిగా నిరూపించిన విధముగానే, స్మర్యతే=స్మృతియందును చెప్పబడుచున్నది.

తా॥ పై సూత్రమునందు సూర్యాదులను ప్రకాశింపజేయువాడు పరమేశ్వరుడేయని శ్రుతిసహాయముచే నిశ్చయింపబడినది. స్మృతియందుకూడా "నతద్భాసయతేసూర్యో నశశాంకోనపావకః॥ యదాదిత్యగతంతేజో జగద్భాసయతేఖిలం। యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజోవిద్ధిమామకం (సూర్యుడు చంద్రుడు అగ్ని మొదలగు తేజస్సులన్నియును ఆ బ్రహ్మమును ప్రకాశింపజేయనేరవు. సూర్యచంద్రాగ్నులయందుండి ఏతేజస్సు జగత్తును ప్రకాశింపజేయుచుండునో ఆతేజస్సు నాదియే నేనేయనుట) అని పరమేశ్వరుని వలననే సర్వమును ప్రకాశించుచున్నదని చెప్పబడియున్నది. దీనినిపట్టి

చూచినను నతత్రసూర్యోభాతి అనుమొదలగు వాక్యమునందు సర్వా ర్థ్యములు ప్రకాశింపజేయువాడుగా అభివర్ణింపబడిన పురుషుడు పరమేశ్వరుడే యగునని తాత్పర్యము.

--(*) ౮. దేవతాధికరణమ్. (*)—

అవ॥ "అంగుష్ఠమాత్రఃపురుషః" (పురుషుడుఅంగుష్ఠమాత్రుడుగా నున్నాడు) అనుచోట పురుషుడనగా నెవ్వరు? బ్రహ్మమా, లేక జీవుడా, అపరిమేయుడును [పరిమాణము చెప్పటకు వీలులేనివాడును] సర్వవ్యాపియు అను పరమేశ్వరునకు అంగుష్ఠమాత్రుడని కొలతచెప్పటకు వీలులేదుకదా, అనువిషయము ఈ అధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౨౪॥ శబ్దాదేవ ప్రమితః ॥

టీక॥ శబ్దాదేవ=శ్రుతివలననే [శ్రుతియందు ఈశాన శబ్దము ప్రయోగించి యుండుటవలననే,] ప్రమితః=కొలవబడిన పురుషుడు అంగుష్ఠమాత్రుడని చెప్పబడినవాడు, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ శ్రుతియందు "ఈశానోభూతభవ్యస్య" (భూతభవిష్యత్తులనుకూడా స్వతంత్రుడై నియమించువాడు) అను వాక్యముచే అంగుష్ఠమాత్రుడని చెప్పబడిన పురుషుడు కాలత్రయమునందలి పదార్థములను స్వతంత్రుడై నియమించునని చెప్పబడియున్నది. కావున ఈశాన శబ్ద బలముచేతనే అంగుష్ఠమాత్రుడగు పురుషుడు పరబ్రహ్మమేయని నిర్ణయింపవచ్చును. పరిచ్ఛిన్నుడగు జీవునకు స్వాతంత్ర్యమేమియు లేదని తాత్పర్యము,

అవ॥ అట్లైన సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు అంగుష్ఠమాత్రుడని చెప్పట యుక్తముకాదా అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౨౫॥ హృద్యపేక్షయాతుమనుష్యాధికారత్వాత్ ॥

టీక॥ శాస్త్రస్య=శాస్త్రము, మనుష్యాధికారత్వాత్ = మనుష్యునిగూర్చి చెప్పనది యగుటవలన (అనగా మనుష్యుని ఉద్దేశించి ఓ మనుష్యుడా! ఈవిధముగా నడచినచో మేలగును అని చెప్పనది కావున అనుట) హృది=(అంగుష్ఠమాత్రపరిమాణముగల) మనుష్యుని హృదయకమలమునందు, బ్రహ్మఉపాస్యమితి= పరబ్రహ్మను ఉపాసనచే

యవలయునని, ఉక్తైః=చెప్పుటవలన, తస్య=అహృదయ కమలముయొక్క, అపేక్షయా=అపేక్షచేత ( హృదయకమలముయొక్క పరిమాణమునుపట్టి, పరమేశ్వర ఏవప్రమితః=పరమేశ్వరుడే అంగుష్ఠమాత్రుడని చెప్పబడి యున్నాడు.

తా॥ పరమేశ్వరుడు సర్వవ్యాపకుడైనను అంగుష్ఠమాత్రుడని చెప్పుటవలనవిరోధమేమియునులేదు. ఏలయనగా, శాస్త్రము విషయమును చెప్పినను మనుష్యులనుద్దేశించియే చెప్పును. శాస్త్రోక్తములగు విధానములను ఆచరించుటకు సమర్థులగువారును శాస్త్రములుచెప్పిన ప్రకారముచేసిఅభివృద్ధి చెందవలయునని కోరువారును అనుమనుష్యులే కదా, వారిహృదయకమలము అంగుష్ఠ ప్రమాణము కలదిగా యుండును అట్టిహృదయకమలమునందు ఉన్నాడని తలంచి పరమేశ్వరుని ఉపాసించవలయునని చెప్పబడియున్నది. కావున ఆహృదయకమలప్రమాణము ననుసరించి పరమేశ్వరునకుగూడ అంగుష్ఠమాత్ర ప్రమాణము వర్ణింపబడియున్నది. ఇంతమాత్రమువలన పరమేశ్వరుని సర్వవ్యాపకత్వమునకు భంగమేమియు లేదనియు అంగుష్ఠమాత్రుడుగా చెప్పబడిన పురుషుడు పరమేశ్వరుడనుటకు సంశయమేమియు లేదనియు పైనిరూపించిన కారణముచే సిద్ధాంతమైనదని తాత్పర్యము.

—(*) ౮. తదుపర్యధికరణము. (*)—

అవ॥ "తద్యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్" ( దేవతలలో నెవ్వడు ఆ పరబ్రహ్మమును నెఱింగునో వాడు బ్రహ్మమే యగును ) అను మొదలగు వాక్యములయందు దేవతలకుకూడా బ్రహ్మజ్ఞానము మొదలగు వానియందు అధికారము కలదని చెప్పబడి యున్నది. ( అనగా దేవతలను ఉద్దేశించికూడా శాస్త్రము చెప్పుచున్నదని వివరింపబడియున్నది ) ఇట్లుండ మీరు ౨౫-సూత్రమునందు శాస్త్రోక్తవిధుల నాచరించుటయందు మనుష్యులకే మాత్రమే అధికారము కలదని ( శాస్త్రము మనుష్యులనుగూర్చియే సర్వవిషయములను చెప్పునని ) చెప్పియున్నారు. ఇదియెట్లు సరియగును? అను విషయమును గూర్చి ఈ యధికరణమునందు విచారించుచున్నాడు.

సూ॥ ౨౬॥ తదుపర్యపి బాదరాయణః సంభవాత్ ॥

టీక॥ సంభవాత్=ఉచితమైయుండుటవలన, తదుపర్యపి=ఆమనుష్యులకుపైనకూడ ( దేవతులకుకూడననుట ) అధికారో స్తీతి= అధికారముకలదని, బాదరాయణః= బాదరాయణాచార్యులు, మన్యతే= తలంచుచున్నాడు.

తా॥ బాదరాయణాచార్యుల అభిప్రాయ ప్రకారము దేవతలకుకూడా బ్రహ్మజ్ఞానాదులయందు అధికారముగలదు వారికి గూడ కర్మచేయగల సామర్థ్యము మోక్షము మొదలగు ఉత్తమ ఫలముల యందు కోరికయును కలదుగదా యని తాత్పర్యము.

అవ॥ అట్లు చెప్పిన యెడల దేవతలకు శరీరము గలదని ఒప్పుకొనవలయునుకదా అట్లుఒప్పుకొనినయెడల యజ్ఞాదికర్మల విషయమునందు విరోధమువచ్చును. అనేకులనేకచోట్ల ఒకేదేవతనుగూర్చి యజ్ఞములను చేయుచుండిరేని అప్పుడు ఆ దేవత తన శరీరముతోకూడ అన్నిచోట్ల యొక్కమారేయుండుటకు వీలులేదుకదా? కావున దేవతలకు బ్రహ్మవిద్యాదులయందధికారము లేదనుటయే పైసూత్రమునందు చేయబడిన సిద్ధాంతముకంటె శ్రేష్ఠముగనుండును. అనిన, సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౭॥ విరోధఃకర్మణీతిచేన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్ ॥

టీక॥ కర్మణి = యజ్ఞకర్మములయందు ( అనేకచోట్ల జరుగు యజ్ఞమునకు శరీరముతోకూడేవదయ్యును ఒక్కదేవతయే వచ్చునని చెప్పినయెడల ) విరోధః=విరోధమువచ్చును, ఇతిచేత్= అనేయెడల, న= అదిసరికాదు, కుతః=ఎందువలన ననగా, దేవతాయాః= దేవతకు, అనేకప్రతిపత్తిర్దర్శనాత్= అనేకములగు శరీరములను ఒక్కమారే ధరించుటను, పెక అనేకులచేత ఒక్కదేవతయే ఉపాసింప బడుచుండుటను చూచుటవలన ( చూచుచున్నాము గదాయనుట. )

తా॥ పైనచూపబడినది విరోధముకానేరదు. దేవతలకు శరీరమున్నను అనేకస్థలముల కొక్కమారేవచ్చి ఋత్విక్కులు మొదలగు వారివలె ఆయాకర్మలకు ఉపకారము చేయవచ్చును. యోగసిద్ధులగు మహాత్ములే అనేక శరీరములను ఒక్కమారే ధరించి అనేక స్థలముల యందు విహరించుచుండ అట్టిసిద్ధిని స్వభావముగానే చెందియున్న

దేవతలవిషయమై చెప్పవలసిన దేమున్నది? మఱియు " కతిదేవాః " ( దేవతులెందరు ) అనుమొదలగు ప్రకరణమువలన వేదమునందు మూడువేల మూన్నూటఆరుగురు దేవతలను చెప్పి వారలను ముప్పైమూగ్గురు దేవతల విస్తారములుగా (ముప్పైముగ్గురు దేవతలయొక్క రూపభేదములనుగ ) వర్ణించియు యున్నారు ( ౮ వసువులు. ౧౨ సూర్యులు. ౧౨ మంది ఆదిత్యులు. ౧౧ రుద్రులు. ప్రజాపతి. ఇంద్రుడు వీరే ముప్పైముగ్గురు దేవతలు, ఈ దేవతలకంటే అమూడువేల మున్నూటఆరుదేవతలును ఇతరులుకారని చెప్పబడియున్నదనుట) ఈరీతిగానే ఆముప్పై మూగ్గురును ఆరుగురు దేవతలేయనియు ( అగ్ని భూమి వాయువు అంతరిక్షము సూర్యుడు ద్యులోకము వీరు ( దేవతలు) ఆ ఆరుగురును త్రిలోకములనబడు ముగ్గురుదేవతలేయనియు అముగ్గురును అన్నప్రాణములనబడు ఇరువురేఅనియు ఆ ఇరువురును ప్రాణశబ్దముచేత చెప్పబడు వాయువు ఒక్కడేయనియు చెప్పియున్నారు. దీనినిబట్టిచూచిన వాయువు ఒక్కడే మూడువేలమున్నూట ఆరురూపములతోనున్నాడని తెలియుచున్నది కదా? కావున ఈశ్రుతిని పట్టి చూచినను. ౨౬ వ- సూత్రసిద్ధాంతమునకు భంగములేదు. ఇదియునుగాక నమస్కారముచేయు పురుషులు అనేకులుగాను నమస్కారముచేయబడు బ్రాహ్మణుడు ఒక్కడుగాను ఉండుటకూడ లోకమునందు అనుభవములోనున్నది. ఈ అనుభవమునుపట్టి చూచినను ఒక్కదేవతను ఉద్దేశించియే అనేకులు అనేకకర్మల నాచరించుచున్నారనుటలోకూడ విరోధమేమియు లేదని తాత్పర్యము.

అవ॥ పైన నిరూపించినవిధముగా యజ్ఞాది కర్మకాలమునందు విరోధములేక పోయినప్పటికిని దేవతలునిత్యులని చెప్పుశ్రుతికి విరోధమువచ్చును. దేవతలకుకూడ శరీరము కలదనేయెడల వారికిని మనకువలెనే పుట్టుకచావుమొదలగునవి ఉండవలయునుకదా? అట్లున్నయెడల వారునిత్యులగుటయెట్లు? అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౮॥ శబ్దఇతిచేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షాను
మానాభ్యాం॥

టీక॥ శబ్దే= వేదవాక్యములకు, విరోధః = విరోధమువచ్చును,

ఇతిచేత్ = అనేయెడల, న = అదిసరికాదు, కుతః = ఎందువలననగా, అతః = ఈ వేదమునుండియే, ప్రభవాత్ = దేవతలు మొదలగు సర్వప్రపంచము పుట్టుటవలనను, ప్రత్యక్షానుమానాభ్యాం = ఈవిషయమును శ్రుతిస్మృతులే నిరూపించుచుండుటవలనను, అవిరోధః = పైఆక్షేపించినవిరోధములేదు.

తా॥ వేదశబ్దములు నిత్యములగుటచే ఆశబ్దములచే జెప్పబడు దేవతలుకూడ నిత్యులే కావలయుననియు శరీరము ఉన్నదనినచో వారట్లు అగుటకు వీలులేదనియు కావున వారికి శరీరము ఉన్నదనుటయు క్తముకాదనియుకదా మీఅభిప్రాయము. నిత్యశబ్దముల చెప్పనంతమాత్రముననే ఆశబ్దములచే జెప్పబడిన పదార్థములన్నియు నిత్యములుకావలయునని నిర్బంధములేదు. "ఏతఇతివై ప్రజాపతిర్దేవానసృజతాసృగ్రమితిమనుష్యాన్" [ నీరు ఇంద్రియములకు అధిపతులగువారు ] అనిస్మరించి దేవతలనుసృజించెను. అసృగ్ర [రక్తమునందు రమించువారు అనగా రక్తప్రధానమగు శరీరమునందు ప్రేమగలవారు] అనుపదమునుండి మనుష్యులను సృజించెను. అను శ్రుతియు "నామరూపంచభూతానాం కర్మణాంచప్రవర్తనం । వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమేసమహేశ్వరః (సర్వభూతములకుగల పేరులను రూపములను అవిచేయదగినపనులను వీటినన్నిటిని ఆబ్రహ్మదేవుడు వేదశబ్దములనుండియే ఆదికాలమునందు నిర్మించెను) అనుస్మృతియు వేదశబ్దములనుండియే సర్వప్రపంచము జనించెనని చెప్పుచున్నవి. పుట్టుకగలవానికి నాశముగలదనుట నిర్వివాదాంశముగదా? కావున ఆవు మనుష్యుడు మొదలగు శబ్దములుకూడ ఆయాజాతిని ( ఆయా ఆకారముగలపదార్థమును ) చెప్పునుగాని వ్యక్తిని ( ప్రత్యేకవస్తువులను ) చెప్పదు. ఈకారణమువలన జాతియెప్పటికిని నశింపదు. కావున శబ్దములు నిత్యపదార్థములనే చెప్పునని వ్యవహరింపబడుచున్నది. ఇదియే న్యాయమును అనుసరించి వేదశబ్దములచే చెప్పబడు వస్తువులు (జాతులు) కూడ నిత్యములేకావచ్చును. వ్యక్తికినాశమున్నను శబ్దములు అనిత్యములు కావలసినపనిలేదు. కావున అవతారికయందు చూపబడిన విరోధము ఒకవిరోధముకాదని తాత్పర్యము.

అ॥ (నిత్యశబ్దములచే జెప్పబడినంతమాత్రమువనే వస్తువులు నిత్యములుకావలసిన నిర్బంధము లేదు.) అనిచెప్పుట వ్యక్తులను గూర్చియేకాని జాతినిగూర్చికాదని తెలిసికొనునది.

సూ॥ ౨౯॥ అతఏవచనిత్యత్వం॥

టీక॥ అతఏవ=పైన నిరూపించినకారణమువలననే (నియతమగుస్వరూపముగల దేవాదులనుగూర్చి [జాతినిగూర్చి చెప్పునదిగనుకనే] వేదస్య=వేదమునకు, నిత్యత్వమ్=నిత్యత్వము, (నిత్యములుగానుండుట) అస్తీతి=కలదని (వేదము నిత్యములని) ప్రత్యేతవ్యం=తెలిసికొనవలయును.

తా॥ పైసూత్రమునందు వ్యక్తులునశించినను జాతినశింపదనియు వేదము అట్టిజాతినిగూర్చి చెప్పునుగాని వ్యక్తులనుగూర్చి చెప్పదనియు నిరూపించియున్నాము. వేదము నిత్యమని చెప్పుటకుకూడా ఇదియేకారణము (అనగా వేదార్థము నిత్యమగుటచే వేదముకూడ నిత్యమే అని చెప్పబడుచున్నదనుట) దీనివలన దేవతలు అనిత్యులైనంతమాత్రమున వేదముకూడా అనిత్యము కావలయునుకదా అను సందేహము నివారణచేయబడినదని తాత్పర్యము.

అ॥ ఇంతవరకు సూత్రములందుచేసిన నిరూపణకూడ సరియైనదికాదు. ప్రళయమునందు సర్వమును నశించునుకదా, రెండవమారుకలుగు మహాసృష్టియందు ఈ దేవతల నామరూపములిట్లేయుండునని నిశ్చయమేమి? ఇందువలన వేదము జాతినిగూర్చియే చెప్పునని యు వ్యక్తులునశించినను జాతి నశింపదు కావున నిత్యస్వభావముగల దియైన వేదశబ్దములు ఉండుటకు విరోధములేదనియు చెప్పుట సరికాదుకదా అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౩౦॥ సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరో
ధోదర్శనాత్స్మృతేశ్చ॥

టీక॥ ఆవృత్తౌ=ఏమియులేదనుట (మహాప్రళయము, మహాసృష్టియు, కలదనుట) (అభ్యుపగతాయామపి = ఒప్పుకొనినప్పటికిని, న విరోధః=విరోధములేదు, కుతః = ఎందువలననగా, ప్రపంచస్య=ప్రపంచము, సమాననామరూపత్వాత్ = సమానమగు ఒకటేవిధ

మైన) నామరూపములు కలిగియుండుటవలన, అవిరోధః= పైనచూపి నవిరోధములేదు, దర్శనాత్ =శ్రుతివలన, స్మృతేశ్చ – స్మృతివలన నున్ను, తథాజ్ఞాయతే= ఆవిధముగా తెలియబడుచున్నది.

తా॥ అవతారికయందు చూపబడినప్రకారము సర్వవ్యవహారములను నశించుటకు కారణమైన మహాప్రళయమును అవ్యవహారములన్నియు క్రొత్తగా ఉత్పన్నములుకావలసినట్టి మహాసృష్టి ఒకటియుకలదని మేము ఒప్పుకొనము. ఒకవేళ ఒప్పుకొనినను వేదశబ్దార్థముల నిత్యసంబంధమునకు విరోధమేమియునురాదు. ఆమహాప్రళయమునందు ప్రపంచసంస్కారముతప్ప తక్కినదంతయు నశించును. రెండవసృష్టియందుకూడ నామరూపభేదములేకనే సర్వప్రపంచము జనించును. (అనగా దేవ మనుష్య పశుపక్ష్యాదులలో దేనిదేనికి ఏయే విధమగురూపము మొదటికల్పమునందు కలిగియుండెనో రెండవకల్పమునందుకూడ దానిదానికి ఆయావిధమగు రూపమే ఆయాపేరే ఉండుననుట) ఈకారణమువలన (సర్వకల్పములయందును ఒకటే ఆకారముగల జాతియే వచ్చుచున్నందున) శబ్దార్థములకుగల నిత్యసంబంధము ప్రపంచము సంస్కారమాత్రముగానున్న ప్రళయకాలమునందుకూడ కలదనుటలో ఏ ఆక్షేపణయునులేదు. సమస్తప్రపంచము సర్వకల్పములయందును ఒకటియే యనుట శ్రుతిస్మృతులయందే సిద్ధాంతముచేయబడియున్నది. "ధాతాయథాపూర్వమకల్పయదితి శ్రుతేః" (సృష్టికర్త సర్వప్రపంచమును మునుపటివలెనే సృష్టించెను.) "యథాభిమానినోఽతీతాస్తుల్యాస్తే సాంప్రతైరిహ ఇత్యాది స్మృతేః" [ కడచిపోయినకాలమునందుండువారు ఇప్పుడుండువారలతోసమానులే ] వీటినిపట్టిచూచిన అవతారికయందు చూపబడిన విరోధము ఈ వసూత్రమునందు చేయబడిన సిద్ధాంతమును భంగముచేయనేరదని తాత్పర్యము.

అవ॥ ఈవిధముగా బాదరాయణాచార్యుని మతమును నిరూపించి ఇతరులమతమును చూపుచున్నాడు.

సూ॥ ౩౧॥ మధ్వాదిష్వసంభవా దనధికారం జైమినిః ॥

టీక॥ మధ్వాదిషు= [ వసురుద్రాదిత్యులను ధ్యానముసేయవ·

నని చెప్పు ] మధువిద్యమొదలగు విద్యలయందు, దేవానాం= దేవతల యొక్క, అధికారస్య=అధికారముయొక్క, అసంభవాత్ = సంభవింపకపోవుటవలన, [ దేవతలు అధికారులగుటకు వీలులేదుకావున ] జైమినిః=జైమినిమహర్షి, తేషాం =బ్రహ్మకారులు వారికి బ్రహ్మవిద్యయందు అధికారము లేదని, మన్యతే=తలంచుచున్నాడు.

తా॥ మధువిద్యమొదలగు కొన్నివిద్యలు వసురుద్ర ఆదిత్యాది దేవతలలో నొకొక్కరిని ధ్యానము చేయవలయునని చెప్పును. ఈ విద్యలును బ్రహ్మోపాసనలే చెప్పబడినవగుటచే బ్రహ్మవిద్యయందధికారముగల దేవతలకు ఈ విద్యలయందు కూడ అధికారముండ వలసివచ్చును. అట్లుగా బ్రహ్మవిద్యాధికారి మధువిద్య మొదలగువిద్యల యందు చెప్పబడిన ప్రకారము వసురుద్రాది దేవతలను ఉపాసింప వలయునట. ఈ ప్రకారము వలన దేవతలకు బ్రహ్మవిద్యయందు అధికారముండుటకు వీలులేదు. ఉపాస్యుడగువాడే [ ధ్యానింప బడతగినవాడే ] ఉపాసకుడుగాకుండ ధ్యానము సేయువాడుగకూడ ఉండుట సంభవించదుగదా, అని జైమినిమహర్షి చెప్పుచున్నాడని తాత్పర్యము.

అవ॥ ఈ విషయమునందు మఱియొక కారణమును చూపుచున్నాడు.

సూ॥ ౩౨॥ జ్యోతిషి భావాచ్చ॥

టీక॥ ఆదిత్యాదిశబ్దానాం సూర్యుడు మొదలగు శబ్దములకు, జ్యోతిషి=మనకు కనుపడుచున్న తేజోమయములగు సూర్యమండలము మొదలైన గోళములయందు, భావాత్ = ప్రయోగముండుటవలన, దేవాః అచేతనాః=దేవతలు అచేతనులు, అతః ఈ కారణమువలన కూడా, తేషాం నాధికారః=వారికి బ్రహ్మవిద్యయందు అధికారములేదు.

తా॥ సూర్యుడు మొదలగు శబ్దములు మనకు కనుపడుచున్న బింబములను చెప్పుటకై ప్రయోగింపబడుచున్నవి. ఆబింబములు మట్టిముద్దలవలె అచేతనములై యున్నవి. ఈ కారణములవలన ఆదిత్యాది పదములకర్థమగు దేవతలు అచేతనులు కావలయునేకాని చేతనులగుటకు వీలులేదు. అచేతనములనునవి ఒకదానిని కోరుటయు ఒకపనిని

చేయుటయు సంభవించదుగదా, కావున దేవతలకు బ్రహ్మవిద్యాధి కారము లేదని తాత్పర్యము.

అవ॥ పై విధముగా ౩౧ వ- సూత్రము ౩౨ వ- సూత్రముల చే పూర్వ పక్షమునుజెప్పి ఈ క్రింది సూత్రముచే దేవతల బ్రహ్మ విద్యాధి కారమునుగూర్చి నిర్ణయించుచున్నాడు.

సూ॥ ౩౩॥ భావంతు బాదరాయణో౽స్తిహి ॥

టీక॥ కింతు = మఱియేమనిన, బాదరాయణః = బాదరాయణా చార్యులు, భావం=దేవతలకుగూడా అధికారము గలదనుటను, మన్య తే= తలంచుచున్నాడు, అస్యదానికి ప్రమాణం=ప్రమాణము [ లు ] అస్తిహి=ఉన్నదిగదా.

తా॥ అర్థవాద వాక్యములయందు దేవతలకు స్వరూపము గల దని చెప్పబడియున్నది.ఇతరప్రమాణములలో దేవతలనగాని ఆసిద్ధాం తమునకు విరోధములేదు. కావున దేవతలకు కర్మజేయు సామర్థ్యము ను మోక్షాపేక్షయు నుండుటలో విరోధమేమియులేదు. దీనివలన దేవతాసంబంధముగల మధువిద్యాదులయందు దేవతల కధికారముం డుటకు వీలులేక పోయినను నిర్గుణ బ్రహ్మ విద్యలయందు వారికి అధి కారముండుటలో నేమియు ఆక్షేపణలేదుగదా, కావున బ్రహ్మవిద్యల యందు మనుష్యులకు మాత్రమేకాక దేవతలకుగూడా నధికారముకల దనుట సిద్ధాంత మయ్యెనని తాత్పర్యము.

—(*) ౧౦. అపశూద్రాధి కరణమ్. (*)—

అవ॥ మనుష్యులకును దేవతలకును బ్రహ్మ విద్యలయందు అధి కారము కలదని పై అధికరణమునందు నిర్ణయింప బడినది. ఆమను ష్యులలో నాలుగు వర్ణములు గలవు. అందు శూద్రునకు ఈ బ్రహ్మ విద్యయందు అధికారము కలదా, అను విషయము ఈ అధికరణమున విచారింప బడుచున్నది.

సూ॥ ౩౪॥ శుగస్యతదనాదర శ్రవణా త్తదాద్రవణా త్సూచ్యతేహి ॥

టీక॥ తత్ =ఆహంసయొక్క, అనాదర = అగౌరవ కరమగు మాటలను, శ్రవణాత్ =వినుటవలన, అస్య=ఈ జానశ్రుతిమహారాజు

నకు, శుక్ = శోకము కలిగెను, తత్ = అజానశ్రుతి మహారాజుయొక్క, ఆద్రవణాత్ = పరుగెత్తుటవలన, సూచ్యతేహి = అహహ రేమా అను వాక్యమునందున్న శూద్రపదముచేత అజానశ్రుతి మహారాజే చెప్పబడుచున్నాడని సూచింపబడుచున్నది గదా.

తా॥ జానశ్రుతియనురాజు విశేషమగు కాంతిచే ప్రకాశించుచుండ వానినొక హంసచూచి ఆశ్చర్యపడెను. మఱియొకహంస దానినిజూచి రైక్వమహారాజు తేజస్సులో ఇదెంతమాత్రము అనినెను. ఆ అగౌరవమాటలవిని జానశ్రుతి మహారాజు గోవులు మొదలగు వానిని కానుకగా గైకొని రైక్వమహారాజునొద్దకుపోయెను. అప్పుడు ఆ రైక్వమహారాజు “ అహహ రేత్వా శూద్రతవ ఇవ సహగోభిరస్తు ” (ఆశ్చర్యము హంసలు అనాదరము చేసెనని నన్నుచూడవచ్చితివా? ఓశూద్ర! ఈ గోవులు మొదలగనవి అన్నియునీయొద్దనే యుంచుకొనుము అనిచెప్పెను. ఈ వాక్యమునందు శూద్రశబ్దమున్నది. కావున శూద్రజాతి వానికిగూడ బ్రహ్మవిద్యయందు అధికారము కలదని చెప్పుచున్నాడు. అదిసరికాదు. పై వాక్యమందున్న శూద్రశబ్దము “ శుచాదుద్రావ ” ( దుఃఖముతోపరిగెత్తిపోయెను ) అను వ్యుత్పత్తిచే జానశ్రుతి మహారాజునందు ప్రయోగింపబడి యున్నది కాని, శూద్రజాతి గలవానియందు ప్రయోగింపబడియుండ లేదు. ఈ విషయము పై నిరూపించిన కథవలన స్పష్టమగుచున్నది గదా, కావున శూద్రజాతివారికి బ్రహ్మవిద్యయందు అధికారము లేదు. వారికి మోక్షమునందు ఇచ్ఛయున్నను వేదాధ్యయనము మొదలగు సామర్థ్యములేదు గదా, ఇచ్ఛయు సామర్థ్యము గలవాడే అధికారి యగునుగాని, ఇందేది లోపమైనను అధికారికానేరడని తాత్పర్యము.

అవ॥ అజానశ్రుతి శూద్రజాతివాడుకాడని నిర్ణయించుట కాధారముండిన అప్పుడుగదా పైవాక్యమునందలి శూద్రపదము శూద్రజాతి వానిని చెప్పడని నిర్ణయింప వలయును. కావున మొట్టమొదట జానశ్రుతిజాతిని నిర్ణయింప వలయును. దానిని ఏ ఆధారము వలన నిర్ణయింప వచ్చుననిన చెప్పుచున్నాడు.

సూ॥ ౩౫॥ క్షత్రియత్వగతేశ్చోత్తరత్ర చైత్రరథేనలింగాత్ ॥

టీక॥ ఉత్తరత్ర= తర్వాత వాక్యములయందు, చైత్రరథేన= చైత్రరథునితోకూడిన ( క్షత్రియుడగు చైత్రరథునితోగూడ ఈజాన శ్రుతి సహపాఠిన్నై చదివెనని ) లింగాత్ = గురుతు ఉండుటవలన, జానశ్రుతేశ్చ=ఆజాన శ్రుతికికూడ, క్షత్రియత్వ= క్షత్రియత్వము కల దని ( జానశ్రుతి క్షత్రియుడని ) గతేః= తెలిసికొనుటవలన, జానశ్రుతి నశూద్రః=జానశ్రుతి శూద్రుడు కాదు.

తా॥ పై సూత్ర తాత్పర్యమునందు ఉదహరించియున్న అహ హే అనువాక్యమునకు తర్వాత సందర్భములో చైత్రరథుడను క్షత్రి యునితోకూడ సహపాఠియై ఈ జానశ్రుతి బ్రహ్మవిద్యాభ్యాసము చేసెనని చెప్పబడియున్నది. దీనినిబట్టిచూచిన జానశ్రుతికూడ క్షత్రి యుడేయని నిర్ణయింప వలయునుగాని శూద్రుడని చెప్పుటకు తగిన యాధార మేమియును లేదు. కావున జానశ్రుతినకు బ్రహ్మవిద్యా ధికారము లేదనువిషయములో ఆక్షేపమేమియు లేదని తాత్పర్యము.

అవ॥ ఈ విధముగా జానశ్రుతి శూద్రజాతి వాడు కాడనియు ఆకారణమువలన "అహహే" అనుమొదలగు వాక్యమునందు శూద్రశబ్ద ము ఉన్నంతమాత్రమునచే శూద్రజాతివారికి బ్రహ్మవిద్యయందు అధికారము కలదని చెప్పుటకు వీలులేదనియు నిర్ణయించి ఈ నిర్ణయ మును స్థిరపరుచుటకై మరియొక కారణమును చెప్పుచున్నాడు.

సూ॥ ౩౬॥ సంస్కారపరామర్శాత్తదభావాభిలాపాచ్చ ॥

టీక॥ సంస్కార = ఉపనయన సంస్కారమునుగూర్చి, పరా మర్శాత్ =చెప్పుటవలన, బ్రహ్మవిద్యాభ్యాసమును గూర్చిచెప్పు ప్రతి స్థలమునందున్న ఉపనయన సంస్కారమునుగూర్చి చెప్పియుండుటవల నను ( శూద్రాణాం=శూద్రజాతివారికి, తదభావాభిలాపాచ్చ = ఆ ఉపనయన సంస్కారములేదని చెప్పియుండుటవలనను, శూద్రాణాం నాధికారః=శూద్రజాతివారికి బ్రహ్మవిద్యయందు అధికారము లేదు.

తా॥ బ్రహ్మవిద్యనుగూర్చి చెప్పు ప్రతిస్థలమునందును " తం హోపనిన్యే " ( ఆశిష్యునకు ఉపనయనము చేసెను ) అనుమొదలగు వాక్యములచే ఉపనయన సంస్కారమునుగూర్చి చెప్పబడియున్నది. " శూద్రశ్చతుర్థోవర్ణ ఏకజాతిః " ( శూద్రజాతి నాల్గవది,దానికి

ద్విజత్వములేదు. అనగా ఉపనయనము లేదనుట ) అనుమొదలగు వాక్యములచే శూద్రునకు ఉపనయన సంస్కారము లేదని నిషేధింపబడియున్నది. ఈ విధముగ బ్రహ్మవిద్యలయందు ఉపనయన సంస్కారముగలవాడే అధికారియని సూచించి యుండుటచేతను శూద్రునకు ఆ ఉపనయన సంస్కారము లేదనుటచేతను శూద్రజాతివాడు బ్రహ్మవిద్యయందు అధికారి కాడని తాత్పర్యము.

౩౪ వ- సూత్ర తాత్పర్యమునందుకూడా వేదాధ్యయనము లేకపోవుటచే శూద్రునకు బ్రహ్మవిద్యయందు అధికారము లేదని చెప్పియున్నాము. ఉపనయనము లేకపోవుటచేతనే వేదాధ్యయనము లేకపోవును. కావున ఆ ౩౪ వ- సూత్రమునందుకూడా ప్రస్తుత ౩౬ వ- సూత్రమునందు నిరూపింపబడిన విషయమే నిరూపించినట్లగును. కావున ఆ సూత్రమునందు చెప్పబడిన విషయమునకును ఈ ౩౬ వ- సూత్రమందు చెప్పబడిన విషయమునకును భేదము తెలిసికొనవలసియున్నది. ఎట్లనగా, ౩౪ వ- సూత్రమందు చెప్పబడిన ఉపనయనము సామాన్యోపనయనము ( సర్వవిద్యలను అభ్యసించుటకై అనగా; వేదము నభ్యసించుటకై చేయబడు ఉపనయనము ) ఈ ౩౬ వ-సూత్రమునందు చెప్పబడినది విశేషోపనయనము ( బ్రహ్మవిద్యను గ్రహించుటకు మాత్రము విధింపబడినఉపనయనము అని తెలిసికొనునది.

సూ॥ ౩౭॥ తదభావ నిర్ధారణేచ ప్రవృత్తేః॥

టీక॥ తదభావనిర్ధారణే=శూద్రుడు కాదని నిశ్చయమైన పిదప, ఉపనయనాదౌ=ఉపనయనము మొదలగు వానియందు, ప్రవృత్తేశ్చ=గురువగువాడు ప్రవర్తించి యుండుటవలనగూడ, శూద్రస్యానాధికారః=శూద్రునకు బ్రహ్మవిద్యయందు అధికారము లేదు.

తా॥ సత్యకాముడను బాలుడు గౌతమ మహాముని యొద్దకు పోయి నాకు ఉపనయనము నాచరించి వేదములను ఉపనిషత్తులను కూడా ఉపదేశింపుడని ప్రార్థించెను. ఆ గౌతమముని నీవు ఏజాతివాడవు? అనగా ఆబాలుడు తనకుగాని తనతల్లికిగాని తానేజాతివాడైనది తెలియదని, యథార్థము చెప్పెను. అప్పుడు ఆ మహర్షి దివ్యదృష్టి గలవాడగుటచే సర్వము నెఱింగి ఆసత్యకాముడు నిష్కల్మషముగు

సత్యమును పలుకుటకు సంతసించి "నైతద బ్రాహ్మణో వివక్తు మర్హతి" (బ్రాహ్మణుడు కానియెడల ఇంత నిష్కల్మషముగ సత్యమును పలుకనేరడు) అను మొదలగు వాక్యములచే ఓ సత్యకాముడా! నీవు బ్రాహ్మణుడవేయని చెప్పెను: తరువాత ఆబాలునకు ఉపనయనము మొదలగు సంస్కారములను జేసి వేదములను వేదాంగములను కూడా ఉపదేశించెనని ఒక కథగలదు. ఈ కథను విమర్శించిన శూద్రజాతిలోనివాడు కాదని నిర్ణయమగు నంతవరకు సత్యకామునకు ఉపనయన సంస్కారమును గౌతమ మహర్షి చేయలేదని ఏర్పడు చున్నది. ఈ కారణమువలన కూడా శూద్రునకు ఉపనయన సంస్కారము లేదనియు దానివలన బ్రహ్మవిద్యలయందుకూడా అధికారము లేదనియు ఏర్పడుచున్నదని తాత్పర్యము.

సూ॥ ౩౮॥ శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్ స్మృతేశ్చ॥

టీక॥ శ్రవణ= వేదము వినుటయందును, అధ్యయన = వేదము చదువుటయందును, అర్థ=వేదార్థమును తెలిసికొనుట ఆ విధముగా ఆచరించుట వీటియందును, ప్రతిషేధాత్ =నిషేధించి యుండుటవలన (శూద్రునకు పైచెప్పబడిన పనులు అనుచితములని వేదమునందునిషేధింప బడియుండుట వలన) స్మృతేశ్చ=స్మృతివలనకూడ(స్మృతియందు కూడనిషిద్ధముచెప్పి యుండుటవలన.) శూద్రస్య బ్రహ్మవిద్యాయాం నాధికారః=శూద్రునకు బ్రహ్మవిద్యయందు అధికారము లేదు.

తా॥ "అథహాస్య వేద ముపశృణ్వత స్త్రపు జతుభ్యాం శ్రోత్ర ప్రపూరణం పద్యువా ఏతచ్ఛ్మశానం" (శూద్రుడు వేదమునువినినచో సీసమును లక్కను కరగించి చెవులలో పోయుట ప్రాయశ్చిత్తము. ఈ శూద్రుడు పాదములతో సంచరింపగల శ్మశానము. అనగా అట్టి అపరిశుద్ధుడనుట వాని యెదుట వేదమును చదువరాదు,) అను మొదలగు వాక్యములచే శూద్రునకు వేదమును వినుటయందు కూడ నధికారములేదని శ్రుతిచెప్పుచున్నది. వినుటకే అధికారము లేకున్న అధ్యయనముసేయుటకు అధికారము ఎక్కడినుండి వచ్చును. మఱియు "న, శూద్రాయమతిందద్యాత్" (శూద్రునకు వేదశుద్ధమగు జ్ఞానము నియ్యరాదు.) అనుస్మృతి వేదార్థమును తెలిసి కొనుట యం

దును అవిధముగా నాచరించుటయందును కూడ శూద్రునికి అధికార ములేదని చెప్పుచున్నది. ఈ రెండుకారణముల వలనను శూద్రునకు బ్రహ్మవిద్యయందే గాక కర్మాదులను బోధించు వేదవిద్యయందు కూడ అధికారములేదని ఏర్పడుచుండగా బ్రహ్మవిద్యయందు అధికారము లేదని సూత్రకారుడు ప్రత్యేకముగా చెప్పవలయునా, లేదు. అయినను ఇందొక విశేషముకలదు. విదురుడు ధర్మవ్యాధుడు మొదలగు శూద్రులు అనేకులు బ్రహ్మజ్ఞానసంపన్నులై యుండిరని భారతాదులయందు తెలియ వచ్చుచున్నది. వారిజ్ఞానము పూర్వజన్మములయందు ఆచరింపబడిన పరిశ్రమనుబట్టి ఉదయించినదియేకాని ఈ జన్మమునందు చేసిన ప్రయత్నములవలన పుట్టినదికాదు. ఈజన్మమునందు శూద్రుడై యుండువాడు పూర్వ జన్మమునందుకూడ శూద్రుడుగానే యుండవలయునని నిర్బంధమేమియు లేదు కదా, కావున పూర్వజన్మ సిద్ధులగు మహాత్ములకు ఏదియో యొక కర్మవశమున శూద్ర జన్మకలిగినను బ్రహ్మజ్ఞానము వారలకు అప్రయత్నముగనే సిద్ధించును. అట్లుకానివారికి మాత్రము వేదాధ్యయనమునందు అధికారము లేకపోవుటచే మోక్షమునందు ఇచ్ఛయున్నప్పటికిని బ్రహ్మజ్ఞానమునకై ప్రయత్నించుటకు వీలులేదు. భక్తిమొదలగు ఇతరఉపాయములచే చిత్తశుద్ధిని సాధించుటకై ప్రయత్నింప వలయునని తాత్పర్యము.

—(*) ౧౧. కంపనాధికరణమ్. (*)—

అవ॥ "యదిదంకించ జగత్సర్వం ప్రాణఏజతి నిస్సృతం" (ఈ సర్వ ప్రపంచము ప్రాణమువలననే సర్వ కార్యములను చేయు చున్నది. ఈ ప్రాణము వలననే సర్వప్రపంచము పుట్టినది.) అను వాక్యమునందలి ప్రాణశబ్దముచే చెప్పబడునది పరబ్రహ్మమా, లేక ప్రాణవాయువా అనుసంశయమును ఈ అధికరణమునందు నివారించుచున్నారు. సూ॥ ౩౯॥ కంపనాత్ ॥

టీక॥ కంపనాత్ = కదలుటవలన (వాయువుతోకూడ సర్వ ప్రపంచము కదలుచున్నది. అనగా సర్వకార్యములను చేయుచున్నది. అనిచెప్పుటవలన) ప్రాణః= పైవాక్యమునందలి ప్రాణశబ్దముచే చెప్ప బడువాడు బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ అవతారికయందు చూపబడినవాక్యమునందున్న ప్రాణ శబ్దము పరబ్రహ్మమునే చెప్పునుకాని ప్రాణవాయువును చెప్పను. ఏల యనగా, ప్రాణమువలన సకలప్రపంచము దాని దానికార్యములను చేయుననిగదా పై వాక్యమునందు వర్ణింప బడియున్నది. సకలప్రపంచమనగా ఆకాశాది పంచభూతములును ఆ భూతముల వలన పుట్టిన సర్వ పదార్థములును ఇవన్నియును చేయునుగదా, రెండవ భూతమగు వాయువు మాత్రము ఏనిలో చేరక వేరుగ నిలచునా, కావున అవతారికయందు చూపబడిన వాక్యములోని ప్రాణపదము ప్రాణవాయువును చెప్పుటకు వీలులేదు. సర్వశక్తుడగు పరబ్రహ్మమునే చెప్పవలయునని తాత్పర్యము.

—(*) ౧౨. జ్యోతిర్దర్శనాధికరణమ్. (*)—

అవ॥ "ఏషసంప్రసాదో స్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య" (ఈ జీవుడు జ్ఞానము గలవాడై శరీరమును విడచి పరంజ్యోతినిపొంది) అనువాక్యము నందు జ్యోతిశ్శబ్దము ప్రయోగింప బడియున్నది. జ్యోతి యనగా అగ్నియని యర్థము ప్రసిద్ధమైయున్నది. కావున ఇచ్చటనుండు జ్యోతిశ్శబ్దము అగ్నిని చెప్పునా లేక పరబ్రహ్మను చెప్పునా, అని సంశయము రాగా, దానిని ఈ అధికరణముచే నివారించుచున్నాడు.

సూ॥ ౪౦॥ జ్యోతిర్దర్శనాత్ ॥

టీక॥ దర్శనాత్ = శాస్త్రమువలన (ఉపక్రమాది లింగములవలన) జ్యోతిః = పై వాక్యమునందలి జ్యోతిశ్శబ్దముచేత జెప్ప బడినవాడు, బ్రహ్మైవ = పరబ్రహ్మమే.

తా॥ అవతారికయందు చూపబడిన వాక్యమునందలి జ్యోతిశ్శబ్దము పరబ్రహ్మమునేచెప్పును. ఏలయనగా, పైన చూపిన వాక్యము యొక్క మిగతభాగమునందే "స్వేనరూపేణాభి నిష్పద్యతే" (పై వర్ణించినవిధముగా పరంజ్యోతి స్వరూపమును జెంది ఆ యనయే తా అభేదముగా నిలచును) అని చెప్పబడియున్నది. దీని వలన ముక్తి జెందినవాడు ఏపరబ్రహ్మమును చెంది ఐక్యమగునో అట్టి పరబ్రహ్మమునుగూర్చియే ఈ వాక్యమునందున్న జ్యోతిశ్శబ్దముచే చెప్పబ

నని యేర్పడుచున్నది. మఱియు ఈ ప్రకరణము "ఏషఆత్మాపహతపాప్మా (కర్మసంబంధము లేనియుండెడి ఈ పరమాత్మ) అని ఆరంభించుచున్నది. దీనినిపట్టిచూచినను "ఏషసంప్రసాదః" అనువాక్యమునందలి జ్యోతిశ్శబ్దముచే పరబ్రహ్మము చెప్పబడెననుటె యుక్తియుక్తముగా నున్నది. ముక్తులగు జీవులకు బ్రహ్మయందుతప్ప వేఱొకచోట ఐక్యముగలుగదుగదా, యని తాత్పర్యము.

—(*) ౧౩. అర్థాంతరత్వాదివ్యపదేశాధికరణమ్. (*)—

అవ॥ "ఆకాశోహ వై నామ రూపయోర్నిర్వహితా" (ఆకాశము నామరూపములను నిర్వహించును) అనువాక్యమునందలి ఆకాశశబ్దము పరబ్రహ్మమును చెప్పునని ఈ అధికరణముచే సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ॥ ౪౧॥ ఆకాశోఽర్థాంతరత్వాదివ్యపదేశాత్ ॥

టీక॥ అర్థాంతరత్వాది=ఆకాశము మఱియొక వస్తువు (ఆకాశము నామరూపములకంటె వేఱైన వస్తువు) అను మొదలగు ధర్మములను, వ్యపదేశాత్=చెప్పుటవలన, ఆకాశః=ఆకాశము (పైవాక్యమునందలి ఆకాశశబ్దముచే చెప్పబడువాడు), బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ తేయదంతరాతద్బ్రహ్మ (ఆనామరూపములు ఏవస్తువునకంటె వేఱో ఆవస్తువే పరబ్రహ్మము) అనువాక్యముకూడ ఆకాశోహవై అనువాక్యమునకు ప్రకరణమునందే యున్నది. ఆ, తేయదంతరా అనువాక్యమునందున్న బ్రహ్మపదము ఆకాశమును చెప్పుటకే ప్రయోగింపబడియున్నది, (అనగా, ఆకాశోహవై అనువాక్యమునందలి ఆకాశపదమునకును తే అను రెండవవాక్యమునందలి బ్రహ్మపదమునకును అర్థమొకటియే అనుట) ఈ విధముగ ఆకాశము నామరూపములకంటె వేఱైయు నామరూపములను నిర్వహించునదియనియు చెప్పబడియుండుటచే ఆకాశోహవై అనువాక్యమునందలి ఆకాశపదముచే చెప్పబడునది పరబ్రహ్మమే యగును. ఆకాశభూతము నామరూపములకంటె వేఱగుటకును నామరూపములను నిర్వహించుటకును వీలులేదుకదా, యని తాత్పర్యము.

—(*) ౧౪. సుషుప్త్యుత్క్రాంత్యధికరణమ్. (*)—

అవ॥ "కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః" (దేహము ఇంద్రియములు మొదలగువానిలో ఆత్మ ఎవరు? అని జనకుడు ప్రశ్న చేసెను. బుద్ధిస్వరూపుడగు వాడెవ్వడో అతడే ఆత్మ. ఇదియే యాజ్ఞవల్క్య మహర్షి ఉత్తరము) ఈ వాక్యమునందు విజ్ఞానమయుడని చెప్పబడువాడు జీవుడా, పరబ్రహ్మమా, అనువిషయమును ఈ అధికరణమునందు నిర్ణయించుచున్నాడు.

సూ॥ ౪౨॥ సుషుప్త్యుత్క్రాంత్యోర్భేదేన ॥

టీక॥ సుషుప్త్యుత్క్రాంత్యోః=సుషుప్త్యవస్థయందును మరల జాగ్రదవస్థలోనికి వచ్చునప్పుడును (అనగా, మెలుకువవచ్చునప్పుడు) భేదేన=భేదముగా, (జీవునకును బ్రహ్మమునకును భేదముకలదని) వ్యపదేశాత్=చెప్పుటవలన, విజ్ఞానమయః బ్రహ్మ=విజ్ఞానమయుడు పరబ్రహ్మమే.

తా॥ "ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తః"=(విజ్ఞానస్వరూపుడగు నాత్మచే ఆక్రమింపబడినవాడై విజ్ఞానమయుడగు నీ జీవుడు సుషుప్త్యవస్థయందు ఏవిషయమును ఎరుగలేకయుండును) అను వాక్యమునందు ప్రాజ్ఞశబ్దముచేత విజ్ఞానీయుడు పరబ్రహ్మమనియు జీవుడు ఆపరబ్రహ్మముకంటె వేఱనియు చెప్పబడియున్నది. ఇట్లే జాగ్రదవస్థనుగూర్చి వర్ణించునప్పుడు గూడ, జీవుడు పరబ్రహ్మను విడచి మరలవచ్చును. అని జీవునకును పరబ్రహ్మమునకును భేదము చెప్పబడియున్నది. ఈ విధముగా విజ్ఞానమయునకును జీవునకును చెప్పబడియుండుటచే "యోఽయం విజ్ఞానమయః" అను వాక్యమునందలి విజ్ఞానమయ పదముచే చెప్పబడువాడు పరబ్రహ్మమే కాని జీవుడు కానేరడని తాత్పర్యము.

అవ॥ పై విషయమును నిర్ణయించుటకు మఱియొక కారణమును చూపుచున్నాడు.

సూ॥ ౪౩॥ పత్యాదిశబ్దేభ్యః ॥

టీక॥ పత్యాది=అధిపతిమొదలగు, శబ్దేభ్యః=పదములు శ్రుతి

యందు ప్రయోగించుటవలన, విజ్ఞానమయః= విజ్ఞానమయుడని చెప్ప బడ్డ పురుషుడు, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ "సర్వస్యవశీ సర్వస్యేశాన స్సర్వస్యాధిపతిః" విజ్ఞానమయుడని చెప్పబడిన పురుషుడు సర్వప్రపంచమును తనస్వాధీనము నందుంచుకొని యున్నాడు. సర్వప్రపంచమును నియమించు చున్నాడు. సర్వప్రపంచమును రక్షించుచున్నాడు ) అనువాక్యముచేత విజ్ఞానమయుడని చెప్పబడినపురుషుడు వర్ణింపబడియున్నాడు. పై చెప్పిన లక్షణములు జీవునకుండుటకు వీలులేదుగదా. కావున విజ్ఞానమయుడని చెప్పబడిన పురుషుడు పరబ్రహ్మమేయని తాత్పర్యము.

ద్యుభ్వాద్యేష్వత్ర త్రిచత్వారింశత్ ॥ ౧౮॥ ౪౩॥

ద్యుభ్వాది, భూమా, క్షరే, క్షుః, దహర, ఉత్తరా, దనుకృతే, శ్శబ్దా, త్తదుపరి, శుగస్య, కంపనా, జ్యోతిర్దర్శనా, దాకాశోర్థాంతరత్వాదిష్వపశేషా, త్సుషుప్త్యుత్క్రాంత్యోశ్చాష్టధ ॥

ఇతి బ్రహ్మసూత్రే ప్రథమస్యాధ్యాయస్య తృతీయః పాదః.

ఇట్లు ప్రథమాధ్యాయమునందు తృతీయపాదము
ముగిసెను.



శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## ప్రథమాధ్యాయము - చతుర్థపాదము.

### —(*) ౧. ఆనుమానికాధికరణమ్. (*)—

అవ॥ ప్రథమాధ్యాయ ప్రథమ పాదమునందలి ఐదవ అధికరణమునందు వేదములు ప్రధానమును గూర్చి ఏమియు చెప్పవని సిద్ధాంతముచేసి యున్నారు. ఆసిద్ధాంతము పొరపాటు. కొన్ని వేద శాఖలయందు ప్రధానమునుగూర్చి చెప్పకపోయినను మఱికొన్నిటి

పరః । మహతఃపరమవ్యక్త మవ్యక్తాత్పురుషఃపరః । పురుషాన్న పరంకించిత్ " ( ఇంద్రియములకంటె శబ్దాది విషయములును వాటి కంటే మనస్సును వానికంటేబుద్ధియు అంతకంటే మహత్తత్వమును హిరణ్యగర్భునిబుద్ధి మహత్తత్వమునకంటే అవ్యాకృతమును దాని కంటే జీవుడును శ్రేష్ఠులు. జీవునికంటే శ్రేష్ఠుడగునాము మఱెవ్వ డును లేడు. ) అను వాక్యములను చెప్పి యున్నారు. దీనివలన గుఱ్ఱ ములు మొదలగునవిగా పోల్చబడిన ఇంద్రియాదుల లోనిపరస్పర భేద ములను రథికుడని చెప్పబడిన పురుషుడే సర్వాధికుడగు మోక్షస్వ రూపుడనియును తెలియవచ్చుచున్నదిగాని, రథమని చెప్పబడిన శరీ రమునుగూర్చి ఏమియును తెలియవచ్చుటలేదు. కావున సర్వప్రపంచ కారణమగు అవ్యాకృతమును ( మాయను ) చెప్పు అవ్యక్తపదమే ఆశరీరమును గూర్చి చెప్పుచున్నదియని సిద్ధాంత మగుచున్నది. ఈకారణమువలన అవ్యక్తశబ్దము శరీరమునుగూర్చి లేక శరీరాదు లకు కారణమగు అవ్యాకృతమునుగూర్చి చెప్పునదికాదని సాంఖ్య కల్పితమగు ప్రధానమునుగూర్చి చెప్పునదికాదని తాత్పర్యము.

అవ॥ పై సూత్రమునందు చేసిన నిరూపణవలన అవ్యక్త పద ము శరీరమునుగూర్చియే చెప్పునని ఏర్పడుచున్నది. స్థూలమైన శరీ రము వ్యక్తపదముచే చెప్పుటకు తగియుండును గాని, అవ్యక్త పద ముచే చెప్పుటకు తగియుండదు గదా, కావున అవ్యక్త పదము శరీ రమును చెప్పుననుట సరికాదు అను నాక్షేపమునకు సమాధానము చెప్పుచున్నాడు,

సూ॥ ౨॥ సూక్ష్మంతుతదర్హత్వాత్ ॥

టీక॥ శ్రుతిస్తు=వేదమైతే, సూక్ష్మం=స్థూలశరీరమును కలిగిం చిన పంచమహాభూతములకు కారణమగు సూక్ష్మభూతములను, తద ర్హత్వాత్=ఆఅవ్యక్తశబ్దమునకు తగియుండుటవలన, అవ్యక్తశబ్దేన= అవ్యక్తశబ్దముచే, దర్శయతి=చూపుచున్నది. ( చెప్పుచున్నది. )

తా॥ అవ్యక్తశబ్దము స్థూలశరీరమును చెప్పుటకు తగినది కా పోయినను వానినికలిగించిన పంచమహాభూతములకును కారణములగు సూక్ష్మభూతములను చెప్పవచ్చును. సూక్ష్మభూతములు అవ్యక్తము

లేకాని వ్యక్తములుకావుకదా, కావున కారణములగు సూక్ష్మభూతములను చెప్పునదియగుటచే ఆఅవ్యక్తపదము కార్యమగు స్థూలశరీరమును జెప్పినదియగును. కారణమగు వస్తువును చెప్పుటకై ఉపయోగింపబడు శబ్దము కార్యమునుచెప్పుటకుకూడా ఉపయోగింపబడుచున్నది. ఈన్యాయము ననుసరించి అవ్యక్తశబ్దము శరీరమును చెప్పుటకై ఉపయోగింపబడినదనిన విరోధమేమియును లేదని తాత్పర్యము.

అవ॥ సూక్ష్మభూతములు జగత్కారణమనియు ఆభూతములే అవ్యక్తశబ్దముచేత చెప్పబడుచున్నవనియు ఒప్పుకొనినయెడల ప్రధానము జగత్కారణమను పక్షమును మీరును అంగీకరించినట్లు అగును. సాంఖ్యమతస్థులుకూడ సూక్ష్మభూతములనేకదా ప్రధానమని చెప్పుచున్నారు. ఈవిధముగా ప్రధానమును జగత్కారణముగ నొప్పుకొనిన మీమతమునకు భంగమువచ్చునుకదా, అనిన చెప్పుచున్నారు.

సూ॥ ౩॥ తదధీనత్వాదర్థవత్ ॥

టీక॥ అవ్యక్తస్య=అవ్యాకృతము (నామరూపములు లేక, జగత్తుసృష్టి కాక పూర్వము ఉన్నస్థితి) తదధీనత్వాత్ = ఆపరమేశ్వరుని స్వాధీనమునందుండుటవలన, ప్రధానవాదాభ్యుపగమదోషః = ప్రధానమును జగత్కారణముగా ఒప్పుకొనుటవలన కలుగుదోషము, న=లేదు. తత్=అవ్యక్తము జగత్కారణమని ఒప్పుకొనుట, అర్థవత్=ప్రయోజనము కలదియేకదా.

తా॥ అవ్యక్తము జగత్కారణమని ఒప్పుకొనుటవలన మామతమునకు భంగమేమియురాదు. మేము అంగీకరించిన అవ్యక్తమునకును సాంఖ్యులుచెప్పుప్రధానమునకును భేదముకలదు. మేముచెప్పు అవ్యక్తము పరమేశ్వరుని స్వాధీనమందుండునది. ( అనగా పరమేశ్వరుని ఇచ్ఛననుసరించి ప్రపంచమును కల్పించునదియనుట ) సాంఖ్యమతస్థులు చెప్పుప్రధానము స్వతంత్రమైనది. ( అనగా ఒకరి ఇచ్ఛతో పనిలేకయే స్వయముగ సృష్టిచేయునదియనుట ) ఇట్లు అవ్యక్తప్రధానములకు భేదము ఉండుటవలన పైసూత్రమునందు చేసినసిద్ధాంతమువలన మామతమునకు భంగమురాదు. ఇదియునుగాక పరమేశ్వరుడు సర్వప్రపంచమును సృష్టించెనని చెప్పుటకొఱకు మొట్టమొదట

ఈ వ్యాకృతమును ( సృష్టికిముందు ప్రపంచము ఉన్నస్థితిని ) ఒప్పుకొనియే తీరవలయునుకదా, అని తాత్పర్యము.

అవ॥ అవ్యక్తమునకును ప్రధానమునకును భేదముకలదనియు, ఆకారణమువలన అవ్యక్తపదముచే ప్రధానము చెప్పబడదనియు, నిరూపించుటకు మఱియొకకారణమును చూపుచున్నాడు.

సూ॥ ౪॥ జ్ఞేయత్వావచనాచ్చ॥

టీక॥ జ్ఞేయత్వా=తెలిసికొనుటను, అవచనాచ్చ=చెప్పకపోవుటచేతగూడ, అవ్యక్తం న ప్రధానం = అవ్యక్తము ప్రధానముకాదు.

తా॥ సాంఖ్యమతస్థులు ప్రకృతిపురుషుల నెఱింగినవారికి మోక్షముకలదని చెప్పుదురు. ప్రకృతియనగా ప్రధానమే. పైచెప్పినవిధముగా వారిమతమునందు ప్రధానముకూడ జ్ఞేయమని ( తెలిసికొనబడతగినది ) అని చెప్పబడియున్నది. మనమతమునందు అవ్యక్తమును తెలిసికొనవలయునని ఎచ్చటను చెప్పియుండలేదుకదా, కావున సాంఖ్యమతస్థులుచెప్పు ప్రధానమునకంటె మనముచెప్పు అవ్యక్తము వేరని తాత్పర్యము.

అవ॥ పూర్వసూత్రమునందు చేసినసిద్ధాంతముసరికాదు. తరువాతవాక్యములయందు అవ్యక్తమునే తెలిసికొనవలయునని చెప్పబడియున్నది. "అశబ్దమస్పర్శమరూపమవ్యయం" ( శబ్దస్పర్శరూపములులేనిది నాశరహితమైనది ) అనుమొదలగు వాక్యములు అవ్యక్తమునుగూర్చి చెప్పినవియే, అన, అట్లుకాదని సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౫॥ వదతీతిచేన్నప్రాజ్ఞోహిప్రకరణాత్॥

టీక॥ వదతీతిచేత్ = చెప్పుచున్నదనియెడల ( శ్రుతి అవ్యక్తమును జ్ఞేయమని చెప్పుచున్నదనియెడల) న = అదిసరికాదు, ప్రకరణాత్=ప్రకరణమువలన, ( పూర్వోత్తరసందర్భములను పట్టిచూచిన ) ప్రాజ్ఞః = పరబ్రహ్మమే, ఉచ్యతేహి=చెప్పబడుచున్నాడుకదా.

తా॥ అవతారికయందు ఉదహరించిన అశబ్దమస్పర్శం అను శ్రుతి అవ్యక్తమునుగూర్చి చెప్పినదికాదు ( అనగా, అవ్యక్తమును తెలిసికొనవలయునని చెప్పబడుట ) ప్రస్తుతప్రకరణమును పట్టిచూ

చిన ఈవాక్యము పరబ్రహ్మమును చెప్పునదియే కావున అవ్యక్తము జ్ఞేయముకాదని ౪అ వ - సూత్రమునందు చేసిన సిద్ధాంతమునకు భంగమేమియు లేదని తాత్పర్యము.

అవ॥ అవ్యక్తశబ్దము ప్రధానమును చెప్పదనియు ఆప్రధానము జ్ఞేయమని చెప్పుటకుకూడ వీలు లేదనియు నిరూపించుటకు మఱియొక కారణమును చెప్పుచున్నాడు.

సూ॥ ౬॥ త్రయాణామేవచైవముపన్యాసః ప్రశ్నశ్చ॥

టీక॥ ఏవం= ఈప్రకారముగ (కఠవల్లిని విమర్శించినమొదల) ప్రశ్నః=అడుగుటయు, ఉపన్యాసశ్చ=సమాధానము చెప్పుటయును, త్రయాణామేవ = ముగ్గురికిమాత్రమే ( అగ్ని జీవ పరమాత్మలకుమాత్రమే ) సంబంధించి, దృశ్యతే చ కనుపడుచున్నది.

తా॥ నాచికేతుడను మునిపుత్రుడు అగ్నినిగూర్చియు జీవునిగూర్చియు పరబ్రహ్మమును గూర్చియు యమధర్మరాజును ప్రశ్నించెనని ఉపక్రమించి ఆప్రశ్నలకు ఉత్తరములు కఠవల్లియందు వివరింపబడియున్నది. ఇందు ప్రధానమునుగూర్చి ప్రశ్నగాని ఉత్తరముగాని లేదు కదా, ఈకారణమువలన అవ్యక్తశబ్దము ప్రధానమును చెప్పుననుట వీలులేదు. మఱియు ప్రధానమును జ్ఞేయమని సాంఖ్యమతస్థులు చెప్పెదరనియు ఈ అవ్యక్తము జ్ఞేయముకాదు కావున ఆప్రధానమునకును దీనికిని సంబంధము లేదనియు ఇదివరకే నిరూపించియున్నము. అవ్యక్తము జ్ఞేయమేయని ఒప్పుకొనినప్పటికి అది ప్రధానము కానేరదని ఈసూత్రమువలన సిద్ధాంతమైనదని తాత్పర్యము.

సూ॥ ౭॥ మహద్వచ్చ॥

టీక॥ కించ=మఱియును, మహద్వత్ = మహచ్ఛబ్దమువలె అవ్యక్తశబ్దమపి= అవ్యక్తశబ్దముగూడ, మంతవ్యః = తలంపబడవలయును.

తా॥ సాంఖ్య శాస్త్రమునందు మహచ్ఛబ్దము మహత్తత్త్వమును చెప్పుటకు ఉపయోగింప బడుచుండును. వేదమునందు " మహాంతం విభుమాత్మానం " ( గొప్పవాడును సర్వ వ్యాపకుడు అగు పరమాత్మను ) అను మొదలగు వాక్యములయందు మహచ్ఛ

మున్నను అది మహత్తత్త్వమును చెప్పదుగాన, ఇట్లే అవ్యక్తశబ్దము కూడ సాంఖ్యతంత్రమునందు ప్రధానము చెప్పుటకు ఉపయోగింపబడుచున్నదైనను వేదమునందు ప్రధానమును చెప్పదు. ఈకారణమువలన ప్రధానమును గూర్చి వేదము చెప్పనే చెప్పదని సిద్ధాంతమయ్యెనని తాత్పర్యము.

—(*) ౨. చమసాధికరణమ్. (*)—

అవ॥ పై అధికరణమునందు నిరూపించిన ప్రకారముగ అవ్యక్తపదము ప్రధానమును చెప్పకపోయినను ఆప్రధానము వేదోక్తము కాకపోదు. "అజామేకాం లోహిత శుక్లకృష్ణాం" (ఎఱుపు తెలుపు నలుపు అను వర్ణములుగల ఒకజనములేని శరీరాన్ని గాన) అను మొదలగు వాక్యమునందలి అజాశబ్దముచేత వేదము ప్రధానమును చెప్పుచున్నది, అనిన, అట్లు చెప్పదని ఈ అధికరణమువలన నిరూపించుచున్నాడు.

సూ॥ ౮॥ చమసవదవిశేషాత్ ॥

టీక॥ అవిశేషాత్=భేదమేమియు లేకపోవుటవలన (అజాపదము ప్రధానమునే చెప్పవలెనని నిర్ణయించుటకు ఏమియు లేకపోవుటవలన) చమసవత్=చమసమను యజ్ఞపాత్రశబ్దమువలె, అజాశబ్దము అజాశబ్దము, నప్రధానవాచి = ప్రధానమును చెప్పదు.

తా॥ అజాశబ్దము జననమరణములు లేనివస్తువును చెప్పును. కావున ప్రధానమును చెప్పవలెనని చెప్పుచున్నారు. అట్లు నిర్ణయముచేయుటకు వీలులేదు. ఏలననగా "అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః" [క్రిందివైపున రంధ్రమున్న యజ్ఞపాత్ర చమసమనబడును. పైవైపున రంధ్రమున్న యజ్ఞపాత్ర బుధ్నమనబడును] అను వాక్యమునందున్న చమసపదముచే రెండురంధ్రములుగల యజ్ఞపాత్రములలో ఇదియే చమసమని నిర్ణయించుటకు ఎట్లు వీలులేదో అట్లే అజాశబ్దముచేతగూడ జననమరణములులేని పదార్థములలో ఇదే [అజాశబ్దముచేత] చెప్పబడునని నిర్ణయించుటకు వీలులేదు. కావున సాంఖ్యమతస్థులు చెప్పు ప్రధానమే ఈ అజాశబ్దముచేత చెప్పబడునని నిర్ణయించుట యుక్తము కాదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు అజాశబ్దముచే ప్రధానము చెప్పబడుచున్నదను

అవిరోధః=అజాశబ్దము ప్రకృతిని చెప్పుననుటలో విరోధమేమియును లేదు.

తా॥ ఇచ్చట అజాశబ్దము రూఢియైనట్లు గాగాని యోగముమూలము గాగాని తేజోజలపృథివీరూపమగుప్రకృతిని జెప్ప అవసరము లేదు. ఈవాక్యమునందు అజాశబ్దము మేకను చెప్పుటకు ఉపయోగింపబడియున్న దేలోకమునందు మేక వివిధమగు రంగులుగల మూడనేకపిల్లలను కనునో అటె వివిధముగా ఈప్రకృతియు ఒకటే మూడు సర్వప్రపంచమును సృష్టి జేయుచున్నది. అనుపోలికచేత అజాశబ్దము మేకకాకుండ ప్రకృతియందు ఉపయోగింపబడియున్నది. దీనివలన విరోధమేమియును లేదు. వస్తువులకు భేదమున్నను ఏదియో యొకపోలిక అనుసరించి ఒకవస్తువును చెప్పుటకై మరియొకవస్తువుపేరును ఉపయోగించువాడుక కూడ లోకమునందు కలదు. ఈవాడుక ననుసరించియే వేదమునందు ధేనువు కాని వాక్కును చెప్పుటకై ధేనుపదము ఉపయోగింపబడియున్నది. లోకమునందు కూడ నీపుత్రుడు సింహము వంటి వాడని ప్రయోగములు కూడా పైన్యాయము ననుసరించి వచ్చినవే గదా, కావున అజాశబ్దము ప్రకృతిని చెప్పుననుటలో విరోధమేమియును లేదు. దీనివలన వేదము ప్రధానమునుగూర్చి ఒకమాటనైనను జెప్పదనుటయే సిద్ధాంతమని తాత్పర్యము.

—(*) 3. సంఖ్యోపసంగ్రహాధికరణము. (*)—

అవ॥ " యస్మిన్ పంచపంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః" (ఏపరబ్రహ్మమునందు ప్రాణాదులు ఐదును ఆకాశమును ప్రతిష్ఠింపబడియున్నవో) అను వాక్యమునందు పంచజనశబ్దముచే ప్రసిద్ధుడగు పురుషుని జెప్పుటకు వీలు లేదుకదా, కావున పంచపంచజన అని చెప్పి పంచ పంచ అనగా ఇరువదియైదు అగుటచే సాంఖ్యమతస్థులు చెప్పియున్న ఇరువదియైదు తత్వములనుగూర్చియే ఈవాక్యము చెప్పుచున్న దనవలయును. అట్లైనయెడల ప్రధానము వేదోక్తమే యగును కదా, అనిన అట్లుకాదని ఈఅధికరణమునందు నిరూపించుచున్నారు.

సూ॥ ౧౧॥ నసంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ॥

టీక॥ సంఖ్యోపసంగ్రహాదపి= పైశ్రుతియందు ఇరువదిఐదు సంఖ్య చెప్పబడినదని ఒప్పుకొన్నప్పటికిని, ప్రధానం వేదోక్తం న= ప్రధానము వేదోక్తముకానేరదు, కుతః= ఎందువలననగా, నానాభావాత్=పంచకములు అయిదును క్రమముతప్పియుండుటవలన, అతిరేకాచ్చ= ఏదియో ఒకవిధముగా పంచకముల క్రమమును సాధించినను ఇచ్చట చెప్పబడియున్నవి. ఇరువదిఅయిదుకంటె ఎక్కువగా ఉండుటవలనను, అస్మిన్ వాక్యే పంచవింశతి తత్వానినోక్తాని= ఈవాక్యమునందు ఇరువదిన్నైదు తత్వములనుగూర్చి చెప్పబడలేదు.

తా॥ అవతారికయందు ఉదహరించిన వాక్యమునందు ప్రయోగింపబడిన శబ్దము పంచజనశబ్దముకాని పంచపంచజన శబ్దముకాదు. ఆపంచజనశబ్దముచే జ్యోతి ప్రాణము నేత్రము శ్రోత్రము మనస్సు అనునవి చెప్పబడును. మొదట పంచశబ్దముచే వీటిసంఖ్య చెప్పబడను. ఇంతేకాని పంచపంచజనశబ్దముకాని అది ఇరువదిఅయిదు తత్వములను చెప్పుటగాని లేదు. ఒకవేళ పంచపంచజనశబ్దము ఈవాక్యమునందు ప్రయోగింపబడియున్నదనియు ఆపదమువలన ఇరువదిఐదు అనుసంఖ్య గ్రహింపబడుననియు అంగీకరించినను ఈవాక్యము ఇరువదిఅయిదుతత్వములనుగూర్చి చెప్పుననుట సిద్ధింపదు. ఏలయనగా పై ఉదహరించిన మంత్రమునందు పంచజనులకు ఆధారముగ యస్మిన్ అనుపదముచే ఆత్మయును ఆకాశమును ప్రత్యేకముగా చెప్పబడియున్నవి. ఈరెండును లెక్కకురావుకదా, కావున వీటినివిడిచినచో మహత్తత్వముమొదలు ఇరువదిరెండు తత్వములే ఏర్పడును సత్వరజస్తమోగుణరూపయగు మూలప్రకృతినిగూడ చేర్చుకొనినగాని గుణములుమూడు మహత్తత్వముమొదలు తత్వములు ఇరువదిరెండు అన్నియుగలసి ఇరువది అయిదు అనులెక్క ఏర్పడదు. ఇట్లు లెక్కఏర్పరచుకొన్నను, ప్రతిపంచకము ఒకజాతికలదై యుండుట సిద్ధింపదు. అయిదు అయిదులు అని చెప్పినప్పుడు అయిదుపదార్థములు చేరిన ప్రతిసముదాయమును ఒకజాతికలదై ఉండవలయునను లోకసిద్ధమగు న్యాయముకదా, ఒకవేళ ఆత్మ ఆకాశము రెంటిని విడిచియే ఈఇరువది అయిదింటియందు ప్రతిపంచకమునకును సమా

మనుజాతి సాధించినను ప్రధానము వేదోక్తమని చెప్పుటకు వీలులేదు. మీరు చెప్పిన ఇరువది అయిదు తత్త్వములకుపైగా ఆకాశము ఆత్మ అను రెండుతత్త్వములు ఎక్కువగావచ్చునుకదా, కావున ఏవిధముగా చూచినను అవతారికయందు చూపబడిన పంచజన వాక్యమునందు సాంఖ్యకల్పితములగు ఇరువది అయిదుతత్త్వములు చెప్పబడలేదు అనియు, అందువలన ప్రధానము వేదోక్తము కానేరదనియు తాత్పర్యము.

౧ మూలప్రకృతి, [ ఇదియే ప్రధానము, ఇదియే సత్త్వరజస్తమోగుణములు ] ౨ మహత్తత్త్వము, ౩ అహంకారము, ౪ ఆకాశము, ౫ వాయువు, ౬ అగ్ని, ౭ జలము, ౮ పృథివి, ( ఆకాశము మొదలు అయిదును సూక్ష్మభూతములు ) ౯ త్వక్, ౧౦ చక్షువు, ౧౧ శ్రోత్రము, ౧౨ జిహ్వా, ౧౩ ఘ్రాణము, [ త్వక్ మొదలు ఐదును జ్ఞానేంద్రియములు ] ౧౪ మనస్సు, ౧౫ వాక్కు, ౧౬ పాణి, ౧౭ పాదము, ౧౮ పాయువు, ౧౯ ఉపస్థ, [వాక్ మొదలు ౫గును కర్మేంద్రియములు] ౨౦ ఆకాశము, ౨౧ వాయువు, ౨౨ అగ్ని, ౨౩ జలము, ౨౪ పృథివి, ( ఆకాశము మొదలు ౫ దును, స్థూలభూతములు ) ౨౫ ఆత్మ ఇవియే సాంఖ్యమతస్థులు చెప్పు ౨౫ దు తత్త్వములని తెలిసికొనవలయును.

అవ॥ అట్లైన పంచజనములు అయిదనుటకు అర్థమేమి? అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౧౨॥ ప్రాణాదయో వాక్యశేషాత్ ॥

టీక॥ వాక్యశేషాత్ = వాక్యశేషమువలన, ప్రాణాదయః = ప్రాణముమొదలగునవియే, పంచజనాః = పంచజనములు.

తా॥ ప్రాణస్యప్రాణః (ప్రాణమునకు ప్రాణము) అనుమొదలగు వాక్యమునందు చెప్పబడియున్న ప్రాణ నేత్ర శ్రోత్ర అన్న మనస్సు అయిదును పంచజనవాక్యమునందలి పంచజనశబ్దముచే చెప్పబడుచున్నవిగాని, సాంఖ్యులుచెప్పు పంచవింశతితత్త్వములు చెప్పబడుటలేదని తాత్పర్యము.

అవ॥ పై సూత్రమునందు అన్నముతోకూడ అయిదు పదార్థములను పంచజనములని చెప్పియున్నారు. ఇట్లు చెప్పుట మాధ్యందిన

శాఖవారి పాఠముప్రకారము సరిపడునుకాని, కాణ్వశాఖవారి పాఠము ప్రకారము సరిపడదు. వారిపాఠమునందు పంచజనవాక్యముకలదుగాని, వాక్యశేషమునందు అన్నస్యాన్నం (అన్నమునకు అన్నము) అనుభాగము లేదుకదా, అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౧౩॥ జ్యోతిషైకేషామసత్యన్నే॥

టీక॥ ఏకేషాం=కొందరికి, [కాణ్వశాఖవారికి] అన్నేఅసతి= అన్నమునుగూర్చిన పాఠములేనప్పుడు, జ్యోతిష = పంచజనవాక్యమునకు పూర్వమునందు వినబడుచున్న జ్యోతిర్వాక్యమునందు వర్ణింపబడినజ్యోతిచే, పంచత్వపూరణం = ౫ అను సంఖ్యను ముగించవలయును.

తా॥ అన్నస్యాన్నం అని పాఠములేని కణ్వశాఖవారు "తద్దేవజ్యోతిషాంజ్యోతిః" (సూర్యాదితేజస్సులను ప్రకాశింపజేయు పరబ్రహ్మమును) అను సూర్యవాక్యమునందు చెప్పబడియున్న జ్యోతిని జేర్చి ప్రాణాదులు అయిదని లెక్కచేయుచిరు. ౧౧ వ సూత్రతాత్పర్యమునందు వీరిలెక్కయే చూపబడియున్నది. పై నిరూపించినకారణమువలన పంచజనవాక్యము పంచవింశతితత్వములనుగూర్చి చెప్పదని తాత్పర్యము.

—(*) ౪. కారణత్వాధికరణమ్. (*)—

అవ॥ పై మూడు అధికరణములయందును ప్రధానమును గూర్చి వేదము ఏమియుచెప్పదనియు ఆకారణమువలన ప్రధానము జగత్కారణము కాదనియు సిద్ధాంతము చేయుచున్నారు. వేదము పరబ్రహ్మమునుగూర్చిగూడ అన్నిచోట్లను ఒకటేవిధముగ చెప్పుటలేద ఈ కారణమువలన పరబ్రహ్మము ఒకటియే జగత్కారణమనియు వేదాంత వాక్యములన్నియు ఆబ్రహ్మను గూర్చియే చెప్పుననియు సిద్ధాంతము చేయుటకుగూడ వీలులేకున్నది. అను సంశయమునకు నీయధికరణమునందు సమాధానము జెప్పుచున్నాడు.

సూ॥ ౧౪॥ కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః॥

టీక॥ ఆకాశాదిషు = ఆకాశవాక్యము మొదలగు వాక్యములయందు, " తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః, తత్తేజో

సృజత ( " ఈ ఆత్మవలన ఆకాశముపుట్టెను ఈ ఆత్మమొదట తేజస్సును సృజించెను అనుమొదలగు వాక్యముల యందు ) బ్రహ్మణః = పరబ్రహ్మము కారణత్వే = కారణమని చెప్పబడి యున్నను, నవిరోధః = విరోధము లేదు, కుతః = ఎందుకనగా, సర్వత్ర = అన్ని వాక్యముల యందును ( అర్థభేదములు కలిగియున్నవై నప్పటికిన్నీ సర్వ వాక్యములయందును, ) యథావ్యపదిష్టోక్తేః = నిరూపింపబడిన విధముగ పరబ్రహ్మము నొకనినే కారణముగ చెప్పియుండుటవలన ( చెప్పియున్నారనుట. )

తా॥ " తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః తత్తేజ సృజత " అనుమొదలగు వాక్యములయందు సృష్టినిగూర్చి అనేక విధములుగా చెప్పబడియున్నది. ఇట్లు చెప్పుటవలన ఈ వాక్యములన్నియు ఒక బ్రహ్మమునుగూర్చియే చెప్పుచున్నవా లేక పరస్పర భిన్నములగు ననేకజగత్కారణములను చెప్పుచున్నవా? అను సంశయము కలుగుట స్వాభావికము. అయినను ఆకాశాది వాక్యములలో నన్నిటి యందును జగత్కారణమునుగూర్చి ఒకేవిధముగా జెప్పబడియున్నందున ఆవాక్యములన్నియు సృష్టిని వేరువేరుగా జెప్పినను, జగత్కారణమగు పరబ్రహ్మమొకనినే యు చెప్పుచున్నవనుటయే సిద్ధాంతమని తాత్పర్యము.

అవ॥ సృష్టినిగూర్చి వేరువేరుగ చెప్పబడి యుండుట యను ఒకకారణమువలననే పరబ్రహ్మము జగత్కారణము కాదని చెప్పలేము. కొన్ని కొన్ని శ్రుతులయందు " అసద్వా ఇదమగ్ర ఆసీత్ " ( ఈ ప్రపంచమంతయు మొట్టమొదట అసత్తుగానుండెను ) " సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్ " ( ఓ శాంతుడా, ఈ ప్రపంచమంతయును మొట్టమొదట సత్తుగా నేయుండెను ) అను మొదలగు వాక్యములయందు జగత్కారణమునుగూర్చి ప్రత్యక్షవిరోధముగా జెప్పబడియున్నది. ఈ కారణమువలన పరబ్రహ్మ మొకడే జగత్కారణమనియు ఆ పరబ్రహ్మము నొకనినిగూర్చియే వేదములు చెప్పునవనియు పలుకుట యుక్తి యుక్తము కాదనిన చెప్పుచున్నారు.

సూ॥ ౧౫॥ సమాకర్షాత్ ॥

టీక॥ సమాకర్షాత్ = పూర్వోత్తర సందర్భముల విచారించుట వలన. బ్రహ్మణః కారణత్వే = పరబ్రహ్మము జగత్కారణ మనుటలో, నవిరోధః = విరోధ మేమియును లేదు.

తా॥ "అసద్వా ఇదమగ్ర ఆసీత్" అనువాక్యమునకు పూర్వమునందే "సంతమేనం తతోవిదుః" (ఎవడు బ్రహ్మ కలదని యెఱుంగునో వాడు సత్పురుషుడగును) అను మొదలగు వాక్యములచేత పరబ్రహ్మమును సద్రూపుడని నిర్ణయింప బడియున్నాడు. ఆ సద్రూపుని వలననే ప్రపంచ ముత్పత్తి యయ్యెననికూడ "సోకామయత" (ఆ పరబ్రహ్మము సంకల్పించెను) అనుమొదలగువాక్యములచే నిర్ణయింప బడియున్నది. వీటి నన్నిటినిపట్టి విమర్శించిన అసద్వా యను వాక్యమునకు ప్రపంచమునకు అసత్తే కారణము అని అర్థము చెప్పటకు వీలులేదుగదా, కావున ప్రపంచము పూర్వము అసత్తైయుండెననగా, నామరూపాదులచే ప్రకాశింపకుండ వాసనా మాత్రమై యుండెనని యర్థముకాని, అసద్రూపమగు స్వకారణమునందు లీనమై యుండెనని యర్థము కాదు. ఈ విధముగనే జగత్కారణమును గూర్చి విరోధము కనుపడిన చోట్లయందెల్లను పూర్వోత్తర సందర్భములనుపట్టి విచారించిన సర్వము పరబ్రహ్మయందే సమన్వయమగును. కావున వేదాంత వాక్యములన్నియు పరబ్రహ్మ మొకటిదానినే జగత్కారణముగా జెప్పుననుట సిద్ధాంత మయినదని తాత్పర్యము.

—(*) ౫. జగద్వాచిత్వాధికరణమ్. (*)—

అవ॥ "యోవై బాలాక ఏతేషాం పురుషాణాం కర్తా యస్య వై తత్కర్మ సవై వేదితవ్యః" (ఓ బాలాకి యనువాడనీ, ఈ ఆదిత్యాది పురుషులకు ఎవడు కర్తయో ఈ సర్వము ఎవనికర్మయో వాడే తెలిసికొనబడ తగినవాడు) ఆ వాక్యమునందు తెలిసికొనవలయునని చెప్పినది ఎవనిగూర్చి పరబ్రహ్మమునుగూర్చియా? జీవునిగూర్చియా? ప్రాణమునుగూర్చియా? అను విషయమును ఈ యధికరణము నందు పరిహరించు చున్నాడు.

సూ॥ ౧౬॥ జగద్వాచిత్వాత్ ॥

టీక॥ కర్మశబ్దస్య = పై శ్రుతియందున్న కర్మశబ్దము, జగద్వా

చిత్వాత్=జగత్తునకుకర్తృ త్వము చెప్పుటవలన, వేదితవ్యః=పై శ్రుతియందు తెలిసికొనవలయునని చెప్పబడినవాడు, పరబ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ అవతారికయందు చూపబడిన శ్రుతియందు తెలిసికొన బడతగినవాడని వర్ణింపబడిన పురుషుడు పరబ్రహ్మమే యగును. జీవుడు ప్రాణముగాని, కాదు. ఏలయనిన పై శ్రుతియందు ప్రయోగింప బడిన కర్మశబ్దము చరాచరాత్మకమగు ప్రపంచమును చెప్పును గాని చలనాదిరూపమగు కర్మమును చెప్పదు. కృత్స్నప్రపంచమునకును కర్త యగువాడు పరమేశ్వరుడేకాని జీవప్రాణములలో నెవరును కారుగదా, కావున పై శ్రుతియందు తెలిసికొనవలయునని చెప్పబడినవాడు పర మేశ్వరుడేకాని ఇతరు డొకడు కాడని తాత్పర్యము.

ఆ॥ " ఏవ మేవైష ఏతస్మాదాత్మా ... " (ప్రధానుడగు పురుషుడు భృత్యులను ... లగువారిని ... గా చేసికొని ఏ ... ముగా సర్వభోగములను అనుభవించుచున్నాడో) అనుమొదలగు వా క్యశేషమువలన ౧౬ వ సూత్రము అవతారికయందు చూపబడిన యధికరణమునందు విచారములోనున్న శ్రుతియందు చెప్పబడినవాడు జీవుడేయని ఏర్పడుచున్నవి. ముఖ్యముగా భోక్తృత్వము జీవునకు తప్ప పరబ్రహ్మ కు కలుగదుగదా. మఱియు ఆ శ్రుతియందున్న కర్మశబ్దమువలన వ్యా పారము చెప్పబడుచున్నది. వ్యాపారరూపమగు కదలుట మొదలగు పను లేకదా, అది వాయువునకుతప్ప మఱియొకదానికి సంభవింపదు. వాక్య శేషమునందు ప్రాణశబ్దముకూడ ప్రత్యక్షముగనే వినబడు చున్నవి. ఈ గురుతులను బట్టిచూచిన ప్రస్తుతము విచారములోనున్న శ్రుతియందు తెలిసికొనవలయునని చెప్పబడినవాడు జీవుడుగాని ప్రా ణముగాని కావలయునుగాని పరబ్రహ్మము కానేరదనిన అట్లు కాదని సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౭॥ జీవముఖ్యప్రాణ లింగాన్నేతిచేత్తద్వ్యా ఖ్యాతం॥

టీక॥ జీవముఖ్యప్రాణలింగాత్ = జీవుడనిగాని, ప్రాణ వా యువనిగాని, చెప్పుటకు గుర్తులుండుటవలన, వేదితవ్యః=ప్రస్తుతశ్రుతి యందు తెలిసికొనవలయునని చెప్పబడినవాడు, నబ్రహ్మ=పరబ్రహ్మ

ము కాదు. ఇతి చేత్=అనేయెడల, తత్ = ఆవిషయము ( ఈ పూర్వ పక్షమునకు సమాధానము ) వ్యాఖ్యాతం= ఇదివరకే చెప్పబడి యున్నది.

తా॥ అవతారికయందు చూపబడిన ప్రకారము ప్రస్తుతము విచారణలోనున్న శ్రుతికి అర్థముచేయుటకు వీలులేదు. వాక్యశేషమునందు జీవుడనిగాని, ప్రాణమనిగాని, చెప్పుటకు గురుతులున్నప్పటికిని ప్రధానవాక్యము పరబ్రహ్మమును చెప్పుటలో విరోధ మేమియు లేదని అధికరణం ౧౧ అధ్యాయం ౧ టి - పాదం ౧ సూత్రం ౩౧ యందు అనేక యుక్తులచే సిద్ధాంతము చేయబడి యున్నదని తాత్ప.

అవ॥ పై విషయమునందు ఇతరుల అభిప్రాయమును చూపుచున్నాడు.

సూ॥ ౧౮॥ అన్యార్థంతు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యా మపి చైవమేకే ॥

టీక॥ ప్రశ్నవ్యాఖ్యానాభ్యాం=ప్రశ్న దానియుత్తరము వీటివలన, జైమినిః=జైమిని మహాముని, జీవపరామర్శం = వాక్యశేషమునందు జీవుని గూర్చిచెప్పుట. అన్యార్థం = మఱియొక దానికొఱకైనదగా ( పరబ్రహ్మము గుఱితించుటకై చెప్పబడినదిగ ) మన్యతే= తలంచుచున్నాడు, అపిచ=మఱిన్ని, ఏకే= కొందరు. ( వాజసనేయ శాఖవారు ) ఏవం=పై జెప్పినవిధముగానే. అధీయతేహి=అధ్యయనము జేయుచున్నారుగదా.

తా॥ "క్వైషఏతద్బాలాకే పురుషో ఽశయిష్టక్వవా ఏతదభూత్ " (ఓబాలాకిమహాముని ! ఈపురుషుడు ఇంతవరకు ఎచ్చటపరుండియుండెను? ఎచ్చటలీనమైయుండెను? ) అను మొదలగు వాక్యములచే సుషుప్తికాలమునందు జీవునకు ఆధారమైయుండిన వస్తువేదిః అను ప్రశ్నశ్రుతియందు వర్ణింపబడియున్నది. "యదాసుప్తస్స్వప్నంనకంచనకంచన పశ్యత్యథాస్మిన్ప్రాణ ఏవైకధాభవతి " నిదురించువాడు కలువరింపక ఎప్పుడు సుషుప్త్యవస్థనుజెందునో అప్పుడు, పరబ్రహ్మముతో నేకీభవించును) అనుమొదలగు వాక్యములచేత పైన నిరూపించిన ప్రశ్నములకు ఉత్తరము వర్ణింపబడియున్నది. ఈప్రశ్నో

త్తరములనుబట్టిచూచిన ప్రస్తుతము మనకు విచారములోనున్న శ్రుతిలోనివాక్యశేషమునందు జీవపరామర్శయున్నను అది పరబ్రహ్మమును గురుతించుటకై చెప్పబడినదేగాని మఱియొక యుద్దేశమువలన కాదని యేర్పడుచున్నది. ఇదియే జైమినిమహామునియొక్క అభిప్రాయము. మఱియువాజసనేయశాఖయందు ( బృహదారణ్యకోపనిషత్తునందు ) పైనజూపిన ప్రశ్నయును దానియుత్తరమును మిక్కిలి స్పష్టముగా వర్ణింపబడియున్నది. " యఏషవిజ్ఞానమయఃపురుషఃక్వైషతదభూత్, యఏషోఽంతర్హృదయ ఆకాశః " (విజ్ఞానమయుడగు ఈ పురుషుడు ఎచ్చటనుండెను హృదయమధ్యమునందు సూక్ష్మమగు ఏదహరాకాశముకలదో దానియందుండెను) అను వాక్యములయందు విజ్ఞానమయశబ్దము ప్రయోగింపబడియుండుటచే జీవుడు అను అర్థము స్పష్టముగ తెలియుచున్నదిగదా. కావున వాక్యశేషమునందు జీవపరామర్శయున్నను వాక్యము బ్రహ్మపరమనుటలో సంశయమేమియు లేదని తాత్పర్యము.

— (*) ౬. వాక్యాన్వయాధికరణమ్. (*) —

అవ॥ " ఆత్మావారేద్రష్టవ్యః " ( ఆత్మయే తెలిసికొనతగినవాడు అనువాక్యమునందు ఆత్మయనువాడెవ్వడు? జీవుడా, పరబ్రహ్మమా, అను సంశయమును ఈఅధికరణమువలన నివారించుచున్నాడు.

సూ॥ ౯॥ వాక్యాన్వయాత్॥

టీక॥ వాక్యాన్వయాత్ = పూర్వోత్తరసందర్భములనుపట్టిచూచిన, ఆత్మావారే = ఆత్మావారే అనువాక్యము పరబ్రహ్మమునందే సమన్వయమగునుగావున, ఆత్మ = ఆత్మశబ్దముచేత చెప్పబడినవాడు, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ అవతారికయందు ఉదహరింపబడిన వాక్యమునందలి ఆత్మశబ్దముచే చెప్పబడువాడు పరబ్రహ్మమేగాని జీవుడుకాడు. ఆవాక్యము పరబ్రహ్మమునందే సమన్వయమగుచున్నది. ( అనగా పూర్వోత్తరసందర్భములను పట్టిచూచిన ఆవాక్యము పరబ్రహ్మమును చెప్పునదిగానే యేర్పడుచున్నదనుట ) అదియెట్లనిన, మొట్టమొదట మైత్రేయీ అనువామె మోక్షసాధనమునుగూర్చి యాజ్ఞవల్క్యుని ప్రశ్నిం

చెను. ఆ యాజ్ఞవల్క్యుడు “ ఆత్మావారేద్రష్టవ్యః ” ఇత్యాదివాక్యములచే ఆ ప్రశ్నకు ఉత్తరము చెప్పుటయే గాక ఆత్మ ఒకదానిని తెలిసికొనిన సర్వప్రపంచమును తెలిసికొనదగునని చెప్పియున్నాడు. ఆత్మశబ్దముచే చెప్పబడినవాడు పరబ్రహ్మము కానియెడల పైచూపిన ప్రశ్నయు ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కలుగుననుటయు సంభవింపదుకదా. కావున ఆత్మశబ్దముచే పరబ్రహ్మమే చెప్పబడునని తాత్ప.

అ॥ “ న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవత్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి ( భార్యకు భర్త ప్రియుడైయున్నాడనట భర్తకొఱకు కాదు. తనకొఱకే అను మొదలగు వాక్యములచేత సర్వపదార్థములను అనుభవించుపురుషుడు ఆత్మగా వర్ణింపబడియున్నాడు. ఆపురుషుడే ఆత్మా వా అరే అను వాక్యమునందు తెలిసికొనతగినవాడని ఉపదేశింపబడియున్నాడు. విషయముల అనుభవించువాడు జీవుడేయగునుగాని పరబ్రహ్మ మగుటకు వీలులేదు. కావున ఆత్మావారేయను వాక్యమునందు చెప్పబడినవాడు జీవుడే కావలయునని పూర్వపక్షమునకు ఆశ్మరథ్యమహాముని అభిప్రాయము ననుసరించి సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౦॥ ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః ॥

టీ॥ ఆశ్మరథ్యః=ఆశ్మరథ్యుడనుముని, ఇదం= ఈజీవోత్క్రమణము (ఆత్మశబ్దముచేత చెప్పుట) అభేదాంశమునకు దాయ=జీవబ్రహ్మలకుగల అభేదాంశమును గ్రహించి చెప్పబడినది. ఇదంచ = ఇట్లుచెప్పుట, ప్రతిజ్ఞాసిద్ధేః = ఒకదానిని తెలిసికొనిన సర్వము తెలిసికొనవచ్చును అని అను ప్రతిజ్ఞసిద్ధించుటకు, లింగం=గురుతు, ఇతిమన్యతే= అనితలంచుచున్నాడు.

తా॥ పరబ్రహ్మమునకు జీవుడు కార్యము ఈకారణము వలన బ్రహ్మమునకు జీవునకును భేదము అభేదము కూడకలదు. అనిఆశ్మరథ్యాచార్యులమతము. ఈమతమును నుంచి ఆఆశ్మరథ్యమహాముని అనతాదికియందు జూపబడిన పూర్వపక్షమునకు ఈక్రిందివిధముగా సమాధానము చెప్పుచున్నాడు. పరబ్రహ్మమునకును జీవునకును భేదాభేదములు రెండునుగలవు. కావున ఆత్మావారేఅను శ్రుతియందు

జీవబ్రహ్మలకు అభేదము కలదను అంశమునుమాత్రముగ్రహించి (జీవుడే బ్రహ్మ అను అభిప్రాయముతో) ఆత్మశబ్దముచేత జీవుడు చెప్పబడియున్నాడు. ఇట్లు చెప్పుటవలన విరోధమునుయునురాదుకదా అని తాత్పర్యము.

అవ॥ పైపూర్వపక్షమునకే ఔడులోమియను మహామునిమతము అనుసరించి మఱియొక విధముగా సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౧॥ ఉత్క్రమిష్యత ఏవం భావాదిత్యౌడులోమిః ॥

టీక॥ సంసారాత్ = అజ్ఞాన రూపమగు సంసారము నుండి, ఉత్క్రమిష్యతః= దాటి పోబోవుచున్న, (జ్ఞానము గలుగుటచేత సంసారమునుండి ఏముక్తుడై మోక్షమునకు పోబోవుచున్న) జీవస్య= జీవునకు ఏవంభావాత్ = ఈ విధముగా సంభవించుటవలన, బ్రహ్మమునకును జీవునకును అభేదము సిద్ధించుటవలన ) అస్మి వాక్యే=ఆత్మా వా అరే అను ఈ వాక్యమునందు, జీవోపక్రమః=పరబ్రహ్మమునుచెప్పవలసియున్నను జీవునిజెప్పుట, ఉపపద్యతే=సరియగును, ఇతి = అని, ఔడులోమిః=ఔడులోమిమహాముని, మన్యతే=తలంచు చున్నాడు.

తా॥ సంసార దశయందు జీవునకును బ్రహ్మకును భేదము నిత్యముగా గలదు. జీవునకు జ్ఞానము గలిగిన పిదప పరబ్రహ్మతోనభేదము సిద్ధించును. అనుట ఔడులోమిమతము. ఈమతము ననుసరించి ఔడులోమి మహాముని ౨౦ వ- సూత్రములో చేయబడిన పూర్వపక్షమునకు ఈ క్రిందివిధముగా సమాధానము జెప్పుచున్నాడు. జీవునకును బ్రహ్మమునకును సంసారదశయందు భేదమున్నను ముక్తదశయందు అభేదమేకావున ఆయభేదమునుబట్టి ఆత్మావా అరె అనువాక్యమునందు బ్రహ్మమునకు మాఱుగా జీవుడే చెప్పబడి యున్నాడు. ఈ విధముగా విరోధము పరిహరింప బడినదని తాత్పర్యము.

అవ॥ పై రెండు సూత్రములయందును చూపబడియున్న, ఆశ్మరథ్య ఔడులోమి మతములయందు దోషము లుండుటచే ఆమతముల ప్రకారము చెప్పిన సమాధానములుకూడ దోష యుక్తములే యగునుగావున ఈక్రింది సూత్రమునందు నిర్దుష్టమైతన యభిప్రాయమునకు

అనుగుణమై యుండు కాశకృత్స్నాచార్యుల మతమును చూపుచు తన్మతాను సారముగ ౨౦వ- సూత్రమునందు చేయబడిన పూర్వ పక్షమునకే సమాధానమును చెప్పుచున్నాడు.

సూ॥ ౨౨॥ అవస్థితేరితి కాశకృత్స్నః ॥

టీక॥ పరమాత్మనః= పరబ్రహ్మమే, విజ్ఞానాత్మతయా= జీవుడుగా, అవస్థితేః=ఉన్నందువలన, అస్మిన్వాక్యే = ఆత్మావారే అను వాక్యమునందు, జీవోపక్రమః=జీవునిగూర్చి చెప్పబడియున్నది, ఇతి= ఇట్లని, కాశకృత్స్నః=కాశకృత్స్నాచార్యులు, మన్యతే = తలంచుచున్నాడు.

తా॥ జీవబ్రహ్మలకెప్పుడును భేదములేదనుట కాశకృత్స్నాచార్యులమతము. ఇదియే సూత్రకారుల మతమని అవతారికయందే సూచించి యున్నాము. ఈ మతమునుబట్టి చూచిన జీవుని గూర్చి చెప్పినను పరబ్రహ్మమునుగూర్చి చెప్పినను ఒకటియే యగును. కావున ఆత్మావారె అనువాక్యమునందలి ఆత్మశబ్దము చేత పరబ్రహ్మము చెప్పబడినదనుటకు ఏవిధమగు ఆక్షేపము లేదని తాత్పర్యము,

—(*) ౭. ప్రకృత్యధికరణమ్. (*)—

అవ॥ ఈవిధముగ జగత్కారణము పరబ్రహ్మమేకాని ప్రధానము మొదలగు నేవియును కావని సిద్ధాంతము చేసి యున్నాడు. ఈ క్రింది యధికరణమునందు ఈ ప్రపంచమునకు ఉపాదానకారణము ( కార్యరూపముగా పరిణామము నెందుకారణముమట్టికుండగా మారునుగదా, ఇటువంటికారణము ఉపాదాన కారణమనుట ) నిమిత్తకారణము ( కుమ్మరవాడు కుండకు కారణమైనట్లు నిమిత్తమాత్రముగ కారణమైనది ) ఈ రెండును పరబ్రహ్మమేయని నిరూపించుచున్నాడు.

సూ॥ ౨౩॥ ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతాను పరోధాత్ ॥

టీక॥ ప్రతిజ్ఞః= ఒకవస్తువును తెలిసికొనినంతమాత్రముననే సర్వమును తెలిసికొనినవాడగునను ప్రతిజ్ఞకును దృష్టాంతము మట్టిముద్దనొకదానిని తెలిసికొనిన మట్టిపాత్రములనన్నిటిని ఎట్లు తెలిసికొనగలుగుచున్నామో అనుమొదలగు దృష్టాంతములకును అనుపరో

ధాత్=విరోధము లేకుండుట వలన, బ్రహ్మ=పరబ్రహ్మము, ప్రకృతిశ్చ=ఉపాదాన కారణముగా కూడా, భవతి=ఉన్నాడు.

తా॥ "యేనాశ్రుతం శ్రుతం" (దేనిచేత విన బడని వస్తువులన్నియు వినబడినవగునో) "యథాసౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం" ఓ సౌమ్యుడా! ఒకటి మట్టిముద్దను తెలిసికొనిన మట్టి పాత్రములన్నియు నెట్లు తెలియబడునో) అను మొదలగు వాక్యములచే ఛాందోగ్యోపనిషత్తునందు ప్రతిజ్ఞయు దృష్టాంతమును వర్ణింప బడియున్నది. (అనగా ఒకటి మట్టి ముద్దను తెలిసికొనినయెడల ఆమట్టి ఉపాదాన కారణముగాగల మృణ్మయ పదార్థములన్నియు నెట్లు తెలిసి కొనబడు చున్నవో అట్లే పరబ్రహ్మము నొకటి దానిని తెలిసి కొనిన సర్వ ప్రపంచమునుగూర్చియు తెలిసికొనునట్లగునని చెప్పబడియున్నదనుట) పరబ్రహ్మము జగత్తునకు నిమిత్త కారణమే యగునుగాని ఉపాదానము కానేరదని చెప్పినచో పైనిరూపించిన విధముగా శ్రుతియందు చెప్పబడియుండుటకు వీలులేదు కదా, కావున పై యధికరణము లన్నిటియందును పరబ్రహ్మము చేతనునుగుటచేత ఈ ప్రపంచమునకు నిమిత్త కారణమని సిద్ధాంతము చేయబడియున్నది. ఈ యధికరణము నందు ఉపాదాన కారణము కూడ పర బ్రహ్మమే యని నిరూపింపబడి యున్నదని తాత్పర్యము.

అవ॥ ఒకటి-పరబ్రహ్మమే ఉపాదాన కారణముగాను నిమిత్త కారణముగ కూడనుండుట విరోధముకదా, యనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౨౪॥ అభిధ్యోప దేశాచ్చ ॥

టీక॥ శ్రుతౌ=వేదమునందు, అభిధ్యా=ధ్యానమును, (పరమేశ్వరుడు ధ్యానించెనని) ఉపదేశాచ్చ=చెప్పుటవలన కూడ, బ్రహ్మ=పరబ్రహ్మము, ఉపాదానం నిమిత్తంచ = ఉపాదాన కారణముగాను నిమిత్తకారణముగానుకూడా అయి యున్నాడు.

తా॥ "సోకామయత బహుస్స్యాం" (నేను అనేక రూపములు గలవాడ నగుదునని పరమాత్మ సంకల్పించెను.) అను వాక్యమునందు జగద్రూపమై యున్నవాడును సంకల్ప పూర్వకముగ సృష్టి నొనర్చుటచే ఆప్రపంచమునకు నిమిత్త కారణమైయున్న వా

దును ఒక పర బ్రహ్మమే అని చెప్ప బడియున్నది. ఈ శ్రుతి ప్రమాణము ననుసరించి చూచినప్పటికి ౨౩ వ- సూత్రమునందు చేయ బడిన సిద్ధాంతమునకు విరోధము లేదని తాత్పర్యము.

అవ॥ పర బ్రహ్మమే జగత్తునకు ఉపాదాన కారణ మనుటకు మఱియొక హేతువును చూపుచున్నాడు.

సూ॥ ౨౫॥ సాక్షాచ్చోభయామ్నానాత్ ॥

టీక॥ సాక్షాత్=ప్రత్యక్షముగానే, బ్రహ్మణి= పరబ్రహ్మమునందు, ఉభయ=ప్రపంచముయొక్క ఉత్పత్తి ప్రళయముల రెంటిని, ఆమ్నానాచ్చ=చెప్పుటవలనకూడా, ప్రకృతిః=ఉపాదానకారణము, బ్రహ్మైవ=పరబ్రహ్మమే.

తా॥ ప్రతివస్తువును తన ఉపాదాన కారణము నుండియే పుట్టును. నశించినప్పుడు దానియందే లయించును, అను నియమము లోకమునందు గలదు. వేదమునందు “ సర్వాణి హవాఇమాని భూతాన్యాకాశాదేవసముత్పద్యంతే ఆకాశం ప్రత్యస్తంయంతి ”( ఈ భూతములన్నియు పర బ్రహ్మము నుండియే పుట్టుచున్నది. ఆ పర బ్రహ్మమునందే లీనమగుచున్నది. ) అనువాక్యముచే జగత్తు ఉత్పత్తియగుటకును లీనమగుటకును పరబ్రహ్మమే కారణమని చెప్పబడియున్నది. కావున పైన వివరించిన నియమమును పట్టి చూచిన యెడల పరబ్రహ్మము జగత్తునకు ఉపాదాన కారణమనుట మిక్కిలి యుక్తియుక్తమని తాత్పర్యము.

సూ॥ ౨౬॥ ఆత్మకృతేః పరిణామాత్ ॥

టీక॥ పరిణామాత్=ప్రపంచ రూపముగా పరిణమించియుండుటయనుకారణమువలన, ఆత్మకృతేః=సృష్టిచేసినవాడు సృష్టి చేయబడిన ప్రపంచమును పరబ్రహ్మమేయని కర్తగాను కర్మగాను కూడా ఒక పరబ్రహ్మనే చెప్పబడియున్నందున బ్రహ్మ= ఆ పరబ్రహ్మము, ప్రకృతిః నిమిత్తంచ=ఉపాదాన కారణముగాను నిమిత్త కారణముగానుకూడ నున్నాడు.

తా॥ “ తదాత్మానగ్గ్ం స్వయమకురుత ” ( ఆపరబ్రహ్మము తననుతానే ప్రపంచమునుగా జేసికొనెను ) అనువాక్యమునందు సృష్టి

కర్తయు సృజించబడిన ప్రపంచముకూడా పరబ్రహ్మమేయని చెప్ప బడియున్నది. ఇతర శ్రుతులయందు ఈ పరబ్రహ్మమే ప్రపంచ రూపముగా పరిణామమును (వేదాంతమునందు పరిణామమునకు వివర్త మని పేరువాడుట సంప్రదాయము. ముఖ్యముగా పరబ్రహ్మ ప్రపంచ రూపమయ్యెనని చెప్పు స్థలములయందు పరిణామ మనగా వివర్తమని యే యర్థముచేసి కొనవలయును. ఒక పురుషుడు త్రాడునుచూచి పా మని భ్రాంతిపడినప్పుడు త్రాడు పాముగా మారెనని చెప్పవచ్చును గదా, ఇట్టి మార్పునకు వివర్తమని పేరు.) పరిణామమును చెందె నని చెప్పబడి యుండుటచే తదాత్మానగ్గం మొదలగువాక్యము చెప్పిన విషయమునందును విరోధ మేమియును లేదు. కావున పైన ఉదహరిం చిన శ్రుతిప్రమాణమును అనుసరించి పరబ్రహ్మము ప్రపంచమునకు ఉపాదాన కారణముగను నిమిత్తకారణముగను ఉన్నాడని నిరూపించ వచ్చునని తాత్పర్యము.

ఇచ్చట ఆత్మకృతేః అనునది ఒక సూత్రముగాను పరిణా మాత్ అనునది వేఱొక సూత్రముగాను వ్యాఖ్యానము చేయుట కలదు. ఈ రెండవ పక్షమునందుకూడ టీకలో భేదములేదు. తాత్ప ర్యము మాత్రము ఈ క్రిందివిధముగా గ్రహింప వలయును.

తా॥ సచ్చత్యచ్చాభవత్ (రూపముగల వస్తువులును రూప ము లేని వస్తువులునుకూడా ఆపరబ్రహ్మమె) అను వాక్యముచేత పర బ్రహ్మమే సర్వప్రపంచమని చెప్పబడి యున్నది. ప్రపంచమునకు ఉపాదాన కారణము కాకున్నచో పరబ్రహ్మము ప్రపంచ రూపు డనుటకు వీలులేదుగదా, కావున ఆ పరబ్రహ్మము అన్యముగా జగ త్తునకు ఉపాదాన కారణము కావలయును. నిమిత్త కారణమని ఇది వరకే సిద్ధాంతము చేయబడియున్నది. ఇట్లగుట రెండుకారణములు పరబ్రహ్మమే యని తాత్పర్యము.

సూ॥ ౨౭॥ యోనిశ్చ హిగీయతే ॥

టీక॥ బ్రహ్మ= పరబ్రహ్మము, యోనిశ్చ = ఉపాదానకారణ మును చెప్పు యోని శబ్దముచేతగూడ, గీయతేహి=చెప్పబడు చున్నా డుగదా,

తా॥ "కర్తారమీశం పురుషం బ్రహ్మ యోనిం" (కర్త నియామకుడు సర్వవ్యాపకుడు పరబ్రహ్మము ఉపాదాన కారణము) అను మొదలగు వాక్యములయందు ఉపాదాన కారణమును యోని శబ్దముచేత పరబ్రహ్మను చెప్పబడుచున్నాడు. ఈ కారణమువలన పరబ్రహ్మను ప్రపంచమునకు ఉపాదాన కారణము నిమిత్త కారణమును నుండెనని సిద్ధాంత మయ్యున్నది. కావున రెండు కారణములును పరబ్రహ్మయేయని తాత్పర్యము.

—(*) ౮. సర్వవ్యాఖ్యానాధి కరణమ్. (*)—

అవ॥ ఇట్లు జగత్తునకు ఉపాదాన కారణము నిమిత్త కారణము పరబ్రహ్మ యొక్కడే యనియు ప్రధాన మేదియు కాదనియు గ్రంథానుసారముగా సిద్ధాంతపరచి ఈ యధికరణమునందు పరమాణువులు జగత్కారణములు అను మొదలగు వాదములను ఖండించుచున్నాడు.

సూ॥ ౨౮॥ ఏతేన సర్వేవ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః ॥

టీక॥ ఏతేన=దీనిచేత, (ప్రధానము జగత్కారణము కాదని ఖండనముచేసి) సర్వే= ఇతరమతములన్నియు, వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః=వ్యాఖ్యానము చేయబడినవి (పరమాణువులు మొదలగునవి జగత్కారణములు కావని ఖండింప బడినవి.)

తా॥ ప్రధానము జగత్కారణముకాదని ఖండించుటకై ఏయే న్యాయములు చూపబడినవో ఆన్యాయముల చేతనే ఇతర మతములను (పరమాణువులే జగత్కారణము అను మొదలగు మతములను) ఖండింప వలయునని తాత్పర్యము.

ఆనుమానిక ముఖ్యాష్టావింశతిః ॥

ఆనుమానిక, చమస, నసంఖ్యాకారణత్వ, జగద్వాచిత్వ, వాక్యాన్వయ, ప్రకృతి, సర్వవ్యాఖ్యానాః.

ఇతి శ్రీమత్కృష్ణ ద్వైపాయనముని ప్రణీతే బ్రహ్మసూత్రే
ప్రథమస్యాధ్యాయస్య చతుర్థః పాదః.

క॥ నూరును ముప్పది రెండగు। నారయ సూత్రములనిందు నధి
కరణంబుల్। మీరు న్ముప్పది తొమ్మిది। యై రమ్యంబగు సమ న్వయా
ధ్యాయమునన్ ॥

సీ। స్పష్టంబుగాగ నీశ్వరుడె ప్రవాక్యాళి మొదటి పాదంబున
గుమురుబరచి। అస్పష్టములలోద దర్శనంబెరిగించు శ్రుతుల రెండవ
చోట సొంపుగూర్చి। విదిలన్నిజ్ఞే యుడై వెలయునెద్దంబును దే ప్రవా
సినిమాట దిరముచేసి। పరమతంబులనెల్ల ఖండించు నానా నిషత్తులను
యుక్తులను నవ్వల ఘటించి॥

తే. గీ॥ ప్రౌఢజగత్ప్రధాన కారణము దన్న। విస్తారాకార
ముచు బురుషోత్తముండె। యాజగన్నాథు నెఱిగిన యాతడెముక్తు।
డనిమెఱింగించెమీ స్వసిద్ధాంతబుంచు॥

ఇట్లు వెన్నెలకంటి సుందరరామ శర్మచే రచియింపబడిన బ్రహ్మ
సూత్రార్థబోధినియను ఆంధ్రటీకాతాత్పర్యమునందు,
ప్రథమాధ్యాయము, చతుర్థపాదము
ముగిసెను.

—*—

శ్రీవాసుదేవపరబ్రహ్మణే నమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

# ద్వితీయాధ్యాయము - ప్రథమపాదము.



## —(*) ౧. స్మృత్యధికరణము. (*)—

అవ॥ మొదటి అధ్యాయమునందు సర్వేశ్వరుడగు బ్రహ్మ
మే జగత్కారణమనియు వేదాంత వాక్యములన్నియు ఆ బ్రహ్మ
మునుగూర్చియే చెప్పుననియు నిర్ణయింపబడియున్నది. ఈ నిర్ణయ
మునకు విరోధముగ కపిలాచార్యులు రచించిన స్మృతి చెప్పుచున్నది.

కావున వేదాంత వాక్యములను పరబ్రహ్మమునందు సమన్వయము చేయవలయునా, లేక కపిలాచార్యుడుచేసిన స్మృతి కనుగుణముగ ప్రధానమునందు సమన్వయము చేయవలయునా, అను సంశయమును నివారణము చేయుటకై ఈ అధికరణమును ఆరంభించుచున్నాడు.

సూ॥ ౧॥ స్మృత్యనవకాశదోష ప్రసంగఇతిచే న్నాన్య స్మృత్యనవకాశ దోష ప్రసంగాత్ ॥

టీక॥ ఏవంచేత్=ఈ విధముగా పరబ్రహ్మమునందే వేదాంత వాక్యములను సమన్వయము చేయవలసినయెడల, స్మృత్యనవకాశ దోష ప్రసంగః = సర్వజ్ఞుడగు కపిల మహామునిచే రచియింపబడిన స్మృతి అప్రమాణమగునను దోషమువచ్చును, ఇతిచేత్=అనేయెడల, న=అదిసరికాదు, కుతః=ఎందువలన ననగా,అన్యస్మృత్యనవకాశదోష ప్రసంగాత్ = మనుస్మృతి మొదలగు ఇతర స్మృతులన్నియు అప్రమాణము లగునను దోషమువచ్చును కావున ( దోషమువచ్చును. )

తా॥ ప్రథమాధ్యాయమునందు వివరించియున్న ప్రకారము వేదాంత వాక్యములనన్నిటిని పరబ్రహ్మమునందే సమన్వయముచేయ వలయును. ఇట్లు చేసిన ప్రధానమే జగత్కారణమని చెప్పు సాంఖ్య స్మృతికి విరోధము వచ్చునుగదా, అనియందురేమో, ఇదియొక దోషముకాదు. ఏలయనగా, సాంఖ్య స్మృతి ప్రధానమే జగత్కారణ మని చెప్పుచున్నది. మనుస్మృతి మొదలగు ఇతర స్మృతులు సర్వజ్ఞుడగు పరబ్రహ్మమే జగత్కారణమని చెప్పుచున్నవి. ఇట్లు పరస్పర విరోధము గలిగినప్పుడు వేద విరుద్ధములుకాని మనుస్మృతి మొదలగు స్మృతులను ప్రమాణములని చెప్ప వలయునుగాని ఒక సాంఖ్యస్మృతికి అప్రామాణ్యము గలుగునని ఇతర స్మృతుల నన్నిటిని అప్రమాణములనుట యుక్తము కాదుగదా, యని తాత్పర్యము.

అవ॥ సాంఖ్య స్మృతి అప్రమాణ మనుటకు మఱియొక కారణమును జూపుచున్నాడు.

సూ॥ ౨॥ ఇతరేషాంచా నుపలబ్ధేః ॥

టీక॥ ఇతరేషాంచ=సాంఖ్య స్మృతియందు చెప్పబడిన మహాత్తత్వము అహంకారము పంచ తన్మాత్రలు కూడా, లోకేవేదేచ=

లోకమునందును వేదమునందును, అనుపలబ్ధేః=కనుబడక పోవుటవలనను;స్మృతిః అప్రమాణం= సాంఖ్యస్మృతి ప్రమాణము కాదు.

తా॥ మఱియు సాంఖ్యస్మృతియందు మహత్తత్త్వము అహంకారము పంచతన్మాత్రలు అనునవి కల్పింపఁబడియున్నవి. ఈకల్పనము వేదమునకు విరుద్ధమగుటచే ప్రమాణముకాదు. కావున మహత్తత్త్వము మొదలగువానిని కల్పించియున్న భాగము ఎట్లు అప్రమాణమో అట్లే ప్రధానమును కల్పించియున్న భాగముకూడ అప్రమాణమే. కావున సాంఖ్యస్మృతి ప్రమాణముకాదనియు దాని అనుసరించి వేదాంతవాక్యములనన్నిటిని ప్రధానమునందు సమన్వయింపవలసిన పనిలేదనియు సిద్ధాంతమైనదని తాత్పర్యము.

—(*) ౨. యోగప్రత్యుక్త్యధికరణమ్. (*)—

అవ॥ పై నిరూపించినవిధముగ సాంఖ్యస్మృతి అప్రమాణమనిచెప్పి ఈఅధికరణమునందు యోగస్మృతిగూడ అప్రమాణమని నిరూపించుచున్నాడు.

సూ॥ ౩॥ ఏతేనయోగః ప్రత్యుక్తః॥

టీక॥ ఏతేన=పైనచూపిన యుక్తులచేతనే, యోగః = యోగస్మృతి, ప్రత్యుక్తః = నిరాకరింపఁబడినది.

తా॥ యోగులకును సాంఖ్యులకును ప్రధానాదివిషయములలో భేదమేమియును లేదు. కావున సాంఖ్యమతఖండనముతోనే యోగమతముగూడ ఖండించినట్లయ్యెను. ఈకారణమువలన యోగస్మృతి గూడ అప్రమాణమేయనియు వేదాంతవాక్యములను ప్రధానపరముగ సమన్వయింప అవసరములేదనియు తాత్పర్యము.

—(*) ౩. నవిలక్షణత్వాధికరణమ్. (*)—

అవ॥ వేదాంతవాక్యములను పరబ్రహ్మమునందు సమన్వయము చేయుటకు స్మృతులవలన విరోధమేమియు లేదని పై రెండధికరణములచే నిరూపించి తర్కములవలనగూడ విరోధమేమియు లేదని ఈ అధికరణమునందు నిరూపింపఁబోవుచున్నవాఁడై మొదట పూర్వపక్షమును చెప్పుచున్నాడు.

సూ॥ ౪॥ నవిలక్షణత్వాదస్య తథాత్వంచశబ్దాత్॥

టీక॥ అస్య=ఈప్రపంచము, విలక్షణత్వాత్ = విరుద్ధధర్మములుగలిగియుండుటవలన, బ్రహ్మప్రకృతికత్వం = పరబ్రహ్మ ఉపాదానకారణముగా గలిగియుండుట, న=సంభవింపదు, తథాత్వంచ=ఆవిధముగా ఉండుటయును [ఉపాదానకారణమగు పరబ్రహ్మమునకంటే ఈజగత్తు విరుద్ధధర్మములు కలిగియున్నదని] శబ్దాత్ = వేదమువలననే, అవగమ్యతే = తెలియువచ్చుచున్నది.

తా॥ ఆకాశాది ప్రపంచమునకు చేతనమగు పరబ్రహ్మము కారణమగుట సరికాదు. పట్టినలనపుట్టినకుండ మట్టియేమైనట్లు చేతనమువలనపుట్టిన ప్రపంచము చేతనమే కావలయునుగదా, అట్లగుట లేదు. ప్రపంచము చేతనముగానే యున్నది. వేదమునందే "విజ్ఞానం చావిజ్ఞానంచ" (చేతనమును అచేతనమును ఆయెను) అనువాక్యముచే ప్రపంచమునందు కొంతభాగమే చేతనమని చెప్పబడియున్నదికదా, ఈకారణమువలన చేతనమగు పరబ్రహ్మము జగత్కారణమని చెప్పటకు వీలులేదు. వేదాంతవాక్యములను పరబ్రహ్మమునందు సమన్వయము చేయుటకు పైనిరూపించినకారణములవలన వీలులేదని తాత్పర్యము.

అవ॥ ఈ పూర్వపక్షము సరియైనదికాదు. మృదబ్రవీత్, (మట్టిమాటలాడెను) అను మొదలగు వాక్యములచేత మట్టి మొదలగు అచేతనపదార్థములుగూడ చేతనకార్యములగు సంభాషణాదులను చేసినట్లు చెప్పబడియున్నదిగదా, అనిన (పూర్వపక్షి) సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౫॥ అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్॥

టీక॥ తంతు = మఱియేమనిన, అచేతనేషు చేతనవ్యపదేశః= అచేతనమగు వస్తువులయందు చేతనవ్యవహారము కలదని చెప్పుట, విశేషానుగతిభ్యాం = విశేషణములనుపట్టియు అనుగతిని (ఈశబ్దమునకు ఇదే అర్థమని ఏర్పడి అనేకస్థలములయందు ఒకటేవిధముగా ఆశబ్దము అదే యర్థమునందు ప్రయోగింపబడుట) పట్టియు, అభిమానవ్యపదేశః = అభిమానిదేవతనుగూర్చి చెప్పుటయానియే, అభ్యుపగంతవ్యం= ఒప్పుకొనవలయును.

తా॥ అచేతనములగు మట్టిమొదలగువానియందు చేతన ధర్మ

ములగు సంభాషణ మొదలగువానిని చెప్పుట ఆయా అచేతనములను అభిమానించు దేవతలనుగూర్చి చెప్పుటయేకాని అచేతనములనుగూర్చి చెప్పుటకాదు. ఏలయనిన, "ఏతాహవై దేవతాః" ( ఈదేవతలు ) అను మొదలగు వాక్యములయందు అచేతనములగు ప్రాణములను ప్రత్యక్షముగా దేవతాశబ్దముచే శ్రుతిచెప్పుచున్నది. మఱియు మంత్రార్థవాదాదులయందు ప్రయోగింపబడు పృథివిమొదలగు శబ్దములు దేవతావాచకములో అగుచున్నదికదా ( అనగా పృథివ్యాది శబ్దములు తత్తదభిమాని దేవతలను చెప్పటకై మంత్రార్థవాదాదులయందు పలుమారు ప్రయోగింపబడి యున్నవికదా, అనుట ) కావున అచేతనములను గూర్చి చేతనధర్మములను చెప్పుట ఆయా అచేతనముల అభిమానించు దేవతలనుగూర్చి చెప్పుటయేయని నిరూపింపబడినది. ఈకారణమువలన అచేతనమగు ప్రపంచమునకు చేతనమగు పరబ్రహ్మము కారణముకానేరదని తాత్పర్యము.

అవ॥ ఈవిధముగ అచేతనమగు ప్రపంచమునకు చేతనమగు పరబ్రహ్మము కారణము కానేరదనియు ఈకారణమువలన వేదాంతవాక్యములను పరబ్రహ్మమునందు సమన్వయముచేయుట యుక్తము కాదనియు ౪ వ ౫ వ సూత్రములచే పూర్వపక్షముచేసి సూత్రకారుడు ఈక్రిందిసూత్రములచే సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ ॥ ౬ ॥ దృశ్యతేతు ॥

టీక॥ లోకే=లోకమునందు, విలక్షణకార్యోత్పత్తిః = చేతనములవలన అచేతనములును అచేతనములవలన చేతనములును పుట్టుచుండుట, దృశ్యతేతు = కనుపడుచున్నదిగదా.

తా॥ ప్రపంచము చేతనమగుటచే చేతనమగు బ్రహ్మ దానికి కారణముగా ఉండుటకు వీలులేదనిచేసిన పూర్వపక్షము సరియైనది కాదు. చేతనుడగు మనుష్యుడుండే అచేతనములగు గోళ్ళు వెంట్రుకలు మొదలగునవి పుట్టుటయు అచేతనములగు గోమయము మొదలగువాని నుండి చేతనములగు వృశ్చికములు మొదలగునవి జనించుటయు లోకమునందు ప్రత్యక్షముగ జూచుచున్నాముకదా, కావున కారణమగు పరబ్రహ్మ చేతనమైయుండినప్పటికిని కార్యమగు ప్రపంచము అచేత

నమైయున్నదనుటలో విరోధమేమియు లేదని సిద్ధాంతము చేయబడిన దని తాత్పర్యము.

అవ॥ ఇట్లుచెప్పినచో (బ్రహ్మమునుండి జగత్తుపుట్టిన దనినచో) ఈప్రపంచము సృష్టికిపూర్వము అసత్తని (లేనిదని) చెప్పవలసివచ్చునుగదా, అనిన అట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ ॥ ౭॥ అసదితిచేన్న ప్రతిషేధమాత్రత్వాత్ ॥

టీక॥ జగత్=ప్రపంచము, అసత్ – ఉత్పత్తికిపూర్వము లేదు, ఇతిచేత్=అనేమొడల, న=అదిసరికాదు. కుతః = ఎందువలననినగా. అస్య=ఈ లేదనుట, ప్రతిషేధమాత్రత్వాత్ = నిషేధమాత్రమేయగుటవలన ( ఈనిషేధమునకు విషయమేమియు లేదనుట.

తా॥ కార్యము కారణమునకంటె వేరైనదికాదు. కావున కార్యమగు ప్రపంచము కారణరూపముగా త్రికాలములయందు (భూతభవిష్యద్వర్తమానకాలములయందు) ఉండుటలో విరోధమేమియును లేదు. జగత్కారణమగు పరబ్రహ్మమునకు నాశమెప్పుడును లేదుకదా, మఱియు నామరూపములు మిథ్యలు (సత్యములు కానివి. వ్యవహారమునకు మాత్రము ఉపయోగించుననుట) కావున త్రికాలములయందును సత్యములుకావు. ఈకారణములవలన ప్రపంచము ఉత్పత్తికిపూర్వము అసత్యమని నిషేధించుటవలన ప్రయోజనమేమియును లేదని తాత్పర్యము.

అవ॥ ఈవిధముగా ప్రపంచమచేతనమైనను చేతనమగు పరబ్రహ్మము దానికికారణముగా ఉండవచ్చునని ౬ వ, ౭ వ, సూత్రములచే సిద్ధాంతముచేసి ఈక్రిందిసూత్రమునందు మఱియొక పూర్వపక్షమును చూపుచున్నాడు.

సూ ॥ ౮ ॥ అపీతౌతద్వత్ప్రసంగాదసమంజసమ్ ॥

టీక॥ అపీతౌ = ప్రళయకాలమునందు, తద్వత్ప్రసంగాత్ = ప్రపంచధర్మములగు అపారిశుద్ధ్యము స్థూలత్వము మొదలగునవి పరబ్రహ్మమునందు ఉండవలసివచ్చును. కావున అసమంజసమ్ = పరబ్రహ్మము జగత్కారణమని చెప్పుమతము సరికాదు.

తా॥ పరబ్రహ్మమునుండి ప్రపంచము పుట్టినదనిన ప్రళయకాల

మందు ఈ ప్రపంచము పరబ్రహ్మమునందు లీనమగు ననవలయును. కార్యము లన్నియు నశించు సమయములందు తమతమ కారణ ములలో లీనమగుట స్వభావమేకదా, ఈవిధముగ ప్రపంచము పరబ్రహ్మమునందు లీనమగుననిన ప్రపంచము నందుండు జడత్వము మొదలగు గుణములు పరబ్రహ్మమునకు కూడా రావలసి వచ్చును. ఇది సరికాదుగదా, కావున చేతనమగు పరబ్రహ్మము ప్రపంచమునకు కారణమని చెప్పుమతము సరికాదు అని తాత్పర్యము.

అవ॥ పై సూత్రమునందు చేయబడిన పూర్వపక్షమును ఖండించుచున్నాడు.

సూ ౯॥ నతు దృష్టాంత భావాత్ ॥

టీక॥ దృష్టాంత భావాత్ = పై సూత్రమునందు చేయబడిన పూర్వపక్షమును ఖండించునట్టి దృష్టాంతములు అనేకము లుండుట వలన, ఇదంతు = పై సూత్రమునందు చేయబడిన యాక్షేపము, న = సరియైనది కాదు.

తా॥ ఒక వస్తువు మఱియొక వస్తువునందు లీనమగు నప్పుడు లయమగు వస్తువుయొక్క గుణము (ఏ స్థానమగు (దేనియందు లయమగుచున్నదో అట్టి) వస్తువునకు వచ్చుచుండుట కొన్ని స్థలములయందు కనుపడుచున్నను అదినియమము కాదు. ఈ విషయమునందు అనేక దృష్టాంతములు గలవు. కుండమట్టియందు లీనమగుచున్నప్పుడు కుండకుగల చిన్నగిన్నత్వము (శంఖమువలె మూడు గీరలు గల మెడగలిగియుండుట) మొదలగు గుణములు మట్టికిరాలేదుగదా, ఈ కారణమువలన పూర్వ సూత్రముచే చేయబడిన పూర్వపక్షము సరియైనది కాదని తాత్పర్యము.

అవ॥ మఱియొక దోషమును చూపుచున్నాడు.

సూ॥ ౧౦॥ స్వపక్ష దోషాచ్చ ॥

టీక॥ స్వపక్ష దోషాచ్చ = పై పూర్వపక్షమునందు చూపిన దోషములు తనమతమునందు కూడా ఉండుటవలన, ఇమే = తనచే చేయబడిన పూర్వపక్షములు, నయుక్తాః = ఉచితములు కావు.

తా॥ కారణమునకంటె విరుద్ధమగు స్వభావముగల కార్యము

జనించుననుట యుక్తముకాదు. కార్యము పుట్టునసిన యెడల పుట్టుకు పూర్వము అది అసత్తని చెప్ప వలసివచ్చును. ప్రళయ కాలమునందు కార్యమునందుండు ధర్మము లన్నియు కారణమునకు రావలసివచ్చును, అని ౮ వ- ౯ వ- సూత్రములలో మూడు దోషములు సాంఖ్యునిచే చూపబడి యున్నవి. ఈ దోషములు ప్రధానము జగత్కారణమని చెప్పు సాంఖ్య మతము నందుకూడ కలవు. ప్రధానమునకు గూడ స్థూలత్వము మొదలగు ధర్మము లేవియును లేవుగదా. ఇవి యనుగాక బాగుగ విమర్శించినచో నామరూపాత్మకమగు ప్రపంచము సత్యమని చెప్పు సాంఖ్య మతమునకే ఈ దోషములు బాధకమగునుగాని ప్రపంచము మిథ్యయని చెప్పు వేదాంతమతమునకు బాధకములు కానేరవు. కావున మన వేదాంత మతముపై సాంఖ్యులు చేయగల పూర్వపక్ష మేమియును లేదని తాత్పర్యము.

సూ॥ ౧౧॥ తర్కాప్రతిష్ఠానాదప్యన్యథానుమేయమితిచే
దేవమప్యవిమోక్షప్రసంగః ॥

టీక॥ తర్కాప్రతిష్ఠానాదపి = తర్కము నిలుకడ లేనిది కావున ( ఒక పురుషుడు నిరూపించిన విషయము అంతకంటె జ్ఞానముకల మఱియొకనిచేత ఖండింపబడుచు నేయుండును. కావున ) ఉక్త సమన్వయస్య= పరబ్రహ్మమునందు వేదాంత వాక్యములను సమన్వయింప వలయుననుటకు తర్కేభ్యోవిరోధః= తర్కములవలన విరోధ మేమియునురాదు, అన్యథా = మఱియొక విధముగా ( దోషము లేవియును రాకుండునట్లుగా, ఎవడును ఖండించుటకు వీలు లేకుండునట్లుగా ననుట ) అనుమేయం=ఊహింపవలయును ( ప్రధానమే జగత్కారణమని నిశ్చయించెదము) ఇతిచేత్=అందురేమో, ఏవమపి=ఈ విధముగా నిర్ణయించి నప్పటికిని, అవిమోక్షప్రసంగః = దోషము కలుగనేరదు ( ఒకరికంటె మఱియొకరు యుక్తియుక్తముగా క్రొత్త నిర్ణయములను చేయుచునే యుందురనుట.

తా॥ తర్కము మనునది మనుష్యుల బుద్ధి వికాసముచే నేర్పడుచుండునది. కావున దానికి ఒకచోట నిలుకడలేదు. ఒకడు తన బుద్ధి నంతయును ఉపయోగించి ఒక విషయమును సిద్ధాంతము చేసెనేని

వానికంటే బుద్ధి వికాసముగల మఱియొక పురుషుడు ఆసిద్ధాంతమును ఖండించి వేఱొక క్రొత్త సిద్ధాంతమును జేయును. ఇట్లు తర్కము నియమము లేని దగుటచేత తర్కమూలమగు ( కేవల తర్కమే ఆధారము గాగల ) సాంఖ్య సిద్ధాంతముచే వేదమూలమగు వేదాంత సిద్ధాంతమునకు విరోధ మేమియును రాదు. మఱియును నియమము లేని తర్కములను విడచి ఎవ్వడును ఖండించుటకు వీలు లేకుండ నొక క్రొత్త సిద్ధాంతమును జేసినచో అది వేదాంత సిద్ధాంతమునకు భంగముగలిగించునుగదా అందువేమో ఈ తలంపుకూడ సరియైనది కాదు. ఎట్లనిన, ఒక దేశమందును ఒక కాలమందును ఖండనలేక ( ఏ పురుషునిచేతను ఖండింప బడక ) సిద్ధాంతమై యుండినను సర్వదేశ సర్వ కాలములయందును పురుషబుద్ధి కల్పితమగు తర్కము ఒకటేవిధముగ నుండు ననుటకు తగిన యాధారములేదు. కావున తర్కమునకు నియమము లేదను దోషము మరల వచ్చును. ఇదియును గాక ఏదియో యొక గురుతు యుండినగదా తర్కముచేత ఈ వస్తువు ఇట్టిదని నిశ్చయించుటకు వీలగును. జగత్కారణమగు పర బ్రహ్మ విషయములో ప్రత్యక్షమగు గురుతు లేమియును లేకపోవుటచేత తర్కములకూడ నేమియు చేయ నేరవు. ఆపర బ్రహ్మము వేదాంత వాక్యము చేతనే గాని మఱి ఏ విధముగకూడ తెలిసి కొనబడదని మొదటి అధ్యాయము మొదటిపాదము ౨ వ, ౩ వ అధికరణములయందు సిద్ధాంతము చేసి యున్నాము గదా, ఈ కారణముల నన్నిటిని పట్టిచూచిన తర్కమూలమగు సాంఖ్యసిద్ధాంతమువలన వేదాంతసిద్ధాంతమునకు భంగమేమియు కలుగదనియు మొదటి యాధ్యాయమునందు నిర్ణయింపబడినరీతిగ వేదాంత వాక్యములన్నియు పర బ్రహ్మమునందే సమన్వయము చేయ వలయుననియు ఇట్లు చేసిన విరోధ మేమియు లేదని తాత్పర్యము.

—(*) ౪. శిష్టాపరిగ్రహాధికరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా సాంఖ్యులు చెప్పు తర్కముల వలన వేదాంత సిద్ధాంతమునకు భంగమేమియును రాదని నిరూపించి వైశేషికులు ( కణాద మతమువారు వీరిశాస్త్రమే తర్కశాస్త్రమని పిలువ

బడుచున్నది. ) మొదలగువారు చెప్పు తర్కములు వలనగూడ తనమతమునకు భంగమేమియును గలుగదని ఈ యధికరణముచే సూత్రకారుడు సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ॥ ౧౨॥ ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః ॥

టీక॥ ఏతేన=పై యధికరణమునందు చేసిన నిరూపణము చేతనే, శిష్టాపరిగ్రహాః అపి=శిష్టులగు మనువు మొదలగు వారిచేత బొత్తిగ నంగికరింప బడని పరమాణువులే జగత్కారణములను మొదలగు వాదములుకూడ, వ్యాఖ్యాతాః=వివృణింప బడినవి ( వేదాంత సిద్ధాంతమునకు భంగము కలిగింప నేరదని నిరూపింప బడినవనుట.

తా॥ పైన చూపబడిన సాంఖ్య యోగమతములు ప్రధానమే జగత్కారణమను మొదలగు కొన్ని యంశములయందు ఖండింపబడి యున్నను ఇతరాంశములయందు అంగీకరింప బడియే యున్నది. పరమాణువులు జగత్కారణములు అనుమొదలగు కొన్ని వాదములు మనువు మొదలగు వేద మార్గానుయాయులచే సంపూర్ణముగ తిరస్కరింప బడి యున్నది. పై యధికరణమందు చూపిన యుక్తులచేతనే ఆ వాదములను ( పరమాణువులే జగత్కారణములు అని మొదలగు వాదములను ) ఖండించుటకు కూడ అవకాశ మున్నది. కావున ఆవాదములన్నియు అవైదికములను ( వేదములో లేనివను ) నొకకారణము చేతనేగాక ఖండితములను ( ౩ వ- అధికరణముచే ఖండింప బడినవను ) రెండవ కారణము వలనకూడ నిరాకరింప తగినవనియు వాని వలన వేదాంత సిద్ధాంతమునకు భంగమేమియు రాదని తాత్పర్యము.

—(*) ౫. భోక్త్రాపత్త్యధికరణమ్. (*)—

అవ॥ ఈ సిద్ధాంతము ప్రత్యక్షాది ప్రమాణములకు విరుద్ధమగునా కాదా అను సంశయమును ఈయధికరణముచే నిరాకరించుచున్నాడు.

సూ॥ ౧౩॥ భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్ ॥

టీక॥ ఏవం=ఇట్లుచెప్పినయెడల (అద్వితీయమగు పరబ్రహ్మమే ప్రపంచమునకు ఉపాదానకారణమని చెప్పినయెడల ) భోక్త్రాపత్తేః=భోక్తయును (అనుభవించువాడను) భోగ్యమును ( అనుభవింప

బడుచున్నదియును ) ఒకటిగానేయగును. కావున అవిభాగః = లోక మునందు ప్రత్యక్షముగ కనుపడుచున్న భేదము లేకపోవలసివచ్చును. ఇతిచేత్ = అంటే రేమో, న = అదిసరికాదు. సః = ఆభేదము, లోకవత్ = లోకమువలె ( లోకమునందు కనుపడుచున్నట్లు ) స్యాత్ = ఉండవచ్చును.

తా॥ అద్వితీయుడగు పరమేశ్వరుడే ప్రపంచమునకు ఉపాదానకారణమని చెప్పినయెడల ఈ ప్రపంచమంతయును ఒకటిగానేయుండవలయును. అప్పుడు లోకమునందు ప్రత్యక్షముగ కనుపడుచున్నభేదము ఉండుటకు వీలులేదు. అనుభవించువాడును అనుభవింపబడునదియును ఇట్టిభేదముగల సమస్తమును ఒకటియేకావలయును. ఇదిప్రత్యక్షమునకు విరోధముకదా, కావున వేదాంతసిద్ధాంతము ప్రత్యక్షవిరుద్ధము అను పూర్వపక్షము సరియైనదికాదు. ఏలయనిన కారణరూపముగా పరస్పరభేదము లేకపోయినప్పటికిని కల్పితభేదమువూత్రము తమలో తనుకుండుట సర్వపదార్థములయందును కలదనుట లోకమునందు ప్రత్యక్షమయ్యేయున్నది. కుండమూకుడు మొదలగు మట్టిపాత్రములు తమలోతాము భేదముకలిగినవయ్యును ఉపాదానకారణమగు మట్టినిపట్టిచూచిన భేదములేనిదేకదా, కావున పరబ్రహ్మమునుపట్టిచూచిన ప్రపంచమంతయును ఒకటియేయైనను కల్పితమగుభోక్త భోగ్యము అను మొదలగు భేదములుండుటలో విరోధమేమియునులేదు. ఈకారణమువలన వేదాంతసిద్ధాంతము ప్రత్యక్షమునకు విరుద్ధముకాదని తాత్పర్యము.

—(*) ౬. ఆరంభణాధికరణమ్. (*)—

అవ॥ పై అధికరణమునందు ప్రపంచము పరబ్రహ్మమునకంటే వేరుకాదను సిద్ధాంతము ఒకదానిని మనసునందుంచుకొని ప్రపంచమందు కల్పితభేదముండుటలో విరోధమేమియులేదని నిరూపించియున్నారు. ప్రపంచము పరబ్రహ్మమునకంటే వేరుకాదనిచెప్పుటకు ఏమి ఆధారముగలదు. అను సంశయమును ఈ అధికరణముచే నివారించుచున్నాడు.

సూ॥ ౧౪॥ తదనన్యత్వమారంభణ శబ్దాదిభ్యః ॥

టీక॥ ఆరంభణశబ్దాదిభ్యః = వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం, ఐతదాత్మ్యమిదం సర్వం నేహ నానాస్తి కించన (కుండము మొదలగు వికారములు నానారూపములుగల మట్టిపాత్రలనుట) వ్యవహారములకు ఆధారముగ కల్పింపబడిన పేర్లు మాత్రమేకాని, యథార్థముగ భేదము లేదు. వికారములు పదార్థస్థితిలో అవియన్నియు మృత్తికలయే సత్యము. కనుపడునదంతయు పరబ్రహ్మస్వరూపమైనదే, ఈకనుపడు వస్తువుల భేదమను మాట కొంచెమైనను లేదు) అనుమొదలగు శ్రుతులవలన ప్రపంచస్య=జగత్తునకు, తదనన్యత్వం=ఆ బ్రహ్మమునకంటె వేరుకాకుండుట, సిద్ధం=సిద్ధించినది

తా॥ "వాచారంభణం వికారో నామధేయం" అనుమొదలగు శ్రుతులు కార్యకారణములు వేరుకావనియు కార్యమునందు కనుపడుచున్న భేదము నామమాత్రమేకాని వాస్తవము కాదనియు దృష్టాంతపూర్వకముగా నిరూపించుచున్నవి. కావున ప్రపంచమునకు కారణమగు పరబ్రహ్మమునకంటె ప్రపంచము వేరైనది కాదనియు ప్రపంచమునందు కనుపడుచున్న భేదములన్నియు నామమాత్రములేకాని నిజమైనవి కావనియు ఏర్పడినని తాత్పర్యము.

అవ॥ పై విషయమునందు మరియొక కారణమును జూపుచున్నాడు.

సూ॥ ౧౫॥ భావేచోపలబ్ధేః॥

టీక॥ భావేచ = కారణముయొక్క ఉనికియు ప్రకాశమును ఉన్నప్పుడే, ఉపలబ్ధేః = కార్యముయొక్క ఉనికియు ప్రకాశమును ఉన్నందున, కార్యంకారణాత్ అనన్యత్ = కార్యము కారణమునకంటె వేరైనదికాదు.

తా॥ కారణము ఉన్నప్పుడే కార్యముండును. కారణము కనబడుచున్నప్పుడే కార్యము కనుపడుచుండును. నూలు ఉండుసమయమునందే దానికార్యమగు గుడ్డయుండుటయును నూలు కనుపడుచున్నప్పుడే గుడ్డకనుపడుచుండుటయును అదిలేనప్పుడు గుడ్డకూడా లేకపోవుటయును ప్రత్యక్షముగ జూచుచున్నాముకదా, కావున కార

**సూ॥ ౧౭॥ అసద్వ్యపదేశాన్నేతిచేన్న ధర్మాంతరేణవాక్యశేషాత్ ॥**

టీక॥ అసద్వ్యపదేశాత్ = ప్రపంచము సృష్టికి పూర్వము లేదనిచెప్పుటవలన, న=ప్రపంచము ఉత్పత్తికి పూర్వమునందుకూడ పరబ్రహ్మరూపముగా నుండెననుట సరికాదు, ఇతిచేత్=అనేయెడల, న=అదియుక్తముకాదు, కుతః= ఎందువలననగా, వాక్యశేషాత్= వాక్యశేషమువలన' ధర్మాంతరేణ = మఱియొకధర్మము, [ అవ్యాకృతత్వము నామరూపములు ప్రకాశింపకుండుట ] ను కారణముగా జేసి, తథావ్యపదేశః = ఆవిధముగా చెప్పియున్నారు.

తా ॥ " అసద్వాఇదమగ్రఆసీత్ " అను వాక్యమునందు ప్రపంచము సృష్టికిపూర్వము అసత్తని చెప్పియుండుటనుబట్టి సృష్టికి పూర్వము ప్రపంచములేనేలేదని అర్థముచేయుటకు వీలులేదు. ఉత్పత్తి కలుగకముందు నామరూపములులేక వాసనామాత్రమై ఈజగత్తు కారణరూపముతో నుండెననుటయే ( అవ్యాకృతమై యుండెననుటయే ) పై శ్రుతి అభిప్రాయము. ఈయభిప్రాయము " తత్సదాసీత్ " ( అదిసత్తయ్యెను ) అను వాక్యశేషమువలన తెలియజేయబడుచున్నది. ఎట్లనిన, అసద్వా అనుశ్రుతికి ప్రపంచము బొత్తిగాలేదనుటయే అర్థమైనయెడల వాక్యశేషమునందు తత్సదాసీత్ అనిచెప్పుటకు వీలులేదుకదా, ఈకారణమువలన అసత్, సత్, శబ్దములచేత లేదు, ఉన్నది, అను అర్థములు గ్రహింపబడవని యేర్పడుటచే అవ్యాకృతత్వము వ్యాకృతత్వము ( నామరూపములు ప్రకాశింపకుండుట, అవి ప్రకాశించుట ) అనుధర్మములే ఆశబ్దములచే గ్రహింపబడినవని, నిశ్చయము చేయవలసివచ్చుచున్నది. నామరూపములు లేనప్పుడు ఏపదార్థమునైనను లేదనుటయు అవియున్నప్పుడు, ఉన్నదనుటయు, స్వాభావికమయ్యే యున్నదికదా, కావున ప్రపంచము సృష్టికిపూర్వము కారణరూపముగాను ఉండెననుటకు అసద్వా అను శ్రుతివలన విరోధమేమియును లేదు. ప్రపంచమునకును దానికారణమగు పరబ్రహ్మమునకును భేదమేమియును లేదను సిద్ధాంతమునకు భంగమేమియును లేదని తాత్పర్యము.

సూ॥ ౧౮॥ యుక్తే శ్శబ్దాంతరాచ్చ ॥

టీక॥ యుక్తేః=యుక్తివలనను, శబ్దాంతరాచ్చ=ఇతరశ్రుతుల వలనను, కార్యస్య=కార్యమునకు, కారణాద నన్యత్వం= కారణమున కంటె వేరుగాకుండుట, సిద్ధం=సిద్ధించుచున్నది.

తా॥ కార్యములగు పెరుగు మొదలగునవి కారణములగు పాలుమొదలగువాని యందు ఉత్పత్తికి పూర్వము లేకున్నయెడల పెరుగు కోరువారు పాలకై ప్రయత్నించుట సంభవింపదు కదా. ఇది మొదలగు యుక్తులచేత కార్యము కారణమునకంటే వేరుకాదని నిర్ణయింపబడుచున్నది. మఱియు " సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్ " అను మొదలగు శ్రుతులచేతను నీవిషయమే నిర్ణయింపబడుచున్నది. కావున కార్యమగు ప్రపంచము కారణమగు పరబ్రహ్మమునకంటే వేరుకాదనుటలో విరోధమేమియును లేదని తాత్పర్యము.

సూ॥ ౧౯॥ పటవచ్చ ॥

టీక॥ పటవచ్చ=వస్త్రమువలెకూడా కార్యము, కారణాత్= కారణమునకంటే, అన్యత్=వేరుకాదు.

తా॥ పరచియున్న వస్త్రము చుట్టియున్న వస్త్రమునకంటే వేరుకానట్లు వ్యాకృతమయ్యుండుటచే విస్తరించియున్న ఈ ప్రపంచమంతయు కారణమునకంటె వేరైనదికాదు ఎట్లనగా, పైనజూపిన యుక్తుల చేతనే కార్యకారణములకు భేదములేదని సిద్ధాంతపరుపబడియున్నను లోకమునందు భేదప్రతీతివలన ప్రపంచపరబ్రహ్మములకు అభేదము కలుగుట ఎట్లని పలుమారు సంశయము కలుగుచునే యుండునుగాని భేదప్రతీతి యున్నంతమాత్రముననే భేదముకూడ యుండవలసిన అవసరములేదు. ఒకవస్త్రమును మడచియున్నప్పుడును పరచియున్నప్పుడును కూడా భేదప్రతీతి కలుగుచున్నది. అవస్థాభేదమువలన అట్లు భేదప్రతీతి కలిగినను వస్త్రమునకు భేదమేమియులేదుగదా, అట్లే ప్రపంచపరబ్రహ్మముల విషయమునందు కూడ భేదప్రతీతిమాత్రము ( పరస్పరము భేదమున్నట్లు తోచుట ) కలదుగాని భేదము మాత్రము లేదని నిశ్చయించుకొనవలయునని తాత్పర్యము.

అవ॥ ఇంతమాత్రమే కాదు. బ్రహ్మకార్యమునకును జగత్తు చేయు కార్యములకును భేదము కలదు. ఈ భేదమువలన ప్రపంచము పరబ్రహ్మమునకంటె వేఱుకాదనుట అయుక్తమనిన, అట్లు కాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౨౦॥ యథాచ ప్రాణాదిః ॥

టీక॥ ప్రాణాదిశ్చ=ప్రాణాపానాది వాయువులు, అవస్థాభేదేన=వేఱ్వేఱవస్థలవలన, విరుద్ధ కార్యమపి = విరుద్ధమైన కార్యములు చేయుచున్నప్పటికిన్ని, యథానభిద్యతే= ఎట్లు వేఱుకావో ( ఒకపని చేయుచున్నప్పుడు వాయువులుగాను మఱియొక పని చేయుచున్నప్పుడు మఱియొక పదార్థములుగాను ఉండవో,) తథా=అట్లు, కార్యం= కార్యము, కారణాత్ =కారణమునకంటే, నభిద్యతే= వేఱుకాదు.

తా॥ ప్రాణాదివాయువులు నిరోధింప బడియున్నప్పుడు శరీరమునకు జీవితమును మాత్రము కలిగించును. సామాన్యముగా సంచరించు చున్నపుడు కాలు చేయి మొదలగు సర్వావయవములకును చలనము కలిగించుటలో సాధనమై యుండును. ఈ విధముగా విరుద్ధకార్యములను అవస్థాభేదముచే చేయుచున్నను ప్రాణాదులు ఎప్పటికిని భేదము లేనివే కదా. ( ప్రాణము అపానము మొదలగు వాయువులు ఎప్పటికిని వాయువులుగానే యుండును గాని కార్యభేదమున్నంత మాత్రమున వేఱొక వస్తువులుగా మారవుగదా. ) ఇట్లే కార్యకారణము లొకటియే యైనను వ్యాపారభేదములు అవస్థాభేదముల ననుసరించి యుండుటలో విరోధ మేమియును లేదు. కారణమువలన కార్యమగు ప్రపంచము కారణమగు పరబ్రహ్మమునకంటే వేరనుటకు నవకాశమే లేదని తాత్పర్యము.

(కార్యకారణములు అభిన్నములను విషయమునుగూర్చి అధిక విమర్శనమును కోరువారు నాచే వివరింపబడిన బ్రహ్మగీత ౫ వ-అధ్యాయమును చూచుకొనునది. )

—(*) ౭. ఇతర వ్యపదేశాధికరణమ్. (*)—

అవ॥ ఈ అధికరణమునందు మఱియొక పూర్వపక్షమును అనువాద పూర్వకముగా పరిష్కరించుచున్నాడు.

సూ॥ ౨౧॥ ఇతర వ్యపదేశాద్ధితా కరణాదిదోష ప్రసక్తిః ॥

టీక॥ బ్రహ్మణః=బ్రహ్మము, ఇతర వ్యపదేశాత్=జీవుడేయని చెప్పబడి యున్నందున, తస్య జగత్కారణత్వే = ఆ పర బ్రహ్మము జగత్కారణమనే యెడల, హితాకరణాదిదోషప్రసక్తిః = ఇష్టమైన దానిని చేయక పోవుట ఇష్టముకాని దానిని చేయుట అను మొదలగు దోషములు వచ్చును.

తా॥ "స ఆత్మా తత్త్వమసి" (ఆ పరబ్రహ్మమే ఆత్మ ఆ పరబ్రహ్మమే నీవు) అను మొదలగు వాక్యములచే శ్రుతి జీవబ్రహ్మల కభేదము చెప్పియున్నది. దీని పట్టిచూచిన పరబ్రహ్మము జగత్కారణమనినను జీవుడు జగత్కారణమనినను ఒకటియే యగుచున్నది. జీవుడే జగత్కారణమైన యెడల తనకిష్టమైన పదార్థములనే సృజించును గాని యిష్టముకాని జరామరణము మొదలగు వానిని సృష్టించునా ఎప్పటికిని సృష్టింపడు. ఈ ప్రపంచమునందు జీవునకు ఇష్టములైనవియు ఇష్టములు కానివియునగు విషయములు కలవనుట ప్రత్యక్షసిద్ధమై యున్నది. భ్రాంతివలన నిట్లు సృష్టించెననుటకువీలులేదు. పరబ్రహ్మమునకు భ్రాంతియే లేదుకదా. కావున బాగుగ విమర్శించిచో పరబ్రహ్మము ప్రపంచ కారణమనినచో ననేకదోషములు వచ్చుచున్నవి. దీనివలన ప్రపంచము చేతనపదార్థమువలన పుట్టిన దనుటయే సరికాదని తాత్పర్యము. (ఇది పూర్వపక్ష సూత్రము.)

అవ॥ ఈ విధముగ పై సూత్రముచేత పూర్వపక్షమును అను వాదముచేసి ఈ క్రింది సూత్రముచే దానిని ఖండించుచున్నాడు.

సూ॥ ౨౨॥ అధికంతు భేదనిర్దేశాత్ ॥

టీక॥ తు=ఇక సిద్ధాంతమేమనగ, భేదనిర్దేశాత్ = జీవునకును పర బ్రహ్మమునకును భేదమున్నదని చెప్పుటవలన, అధికం=సర్వజ్ఞుడై కించిజ్ఞుడగు జీవునికంటె వేరైయున్న పర బ్రహ్మమే జగత్కారణం=జగత్తునకు కారణమై యున్నది.

తా॥ "ఆత్మావారే ద్రష్టవ్యః" (పర బ్రహ్మమును తెలిసికొనవలయును) అను మొదలగు వాక్యములచే శ్రుతి జీవబ్రహ్మలకు భేదము కలదని చెప్పుచున్నది గదా. ఈ కారణమువలన సర్వజ్ఞుడును

సర్వశక్తుడును నిత్యముక్తస్వభావుడునగు నవచ్ఛిన్న పరబ్రహ్మము జగత్తునకు కారణమని సిద్ధాంతము చేసి యున్నారని తెలిసికొనవలయును. నిత్యముక్తస్వభావుడగు పరమేశ్వరునకు ఇది యిష్టమనియు ఇది అనిష్టమనియు లేదు. కాబట్టి పై సూత్రమునందు చూపబడిన దోషములు మా సిద్ధాంతమును భంగము చేయ నేరవు. అభేదము కూడ శ్రుతియందు చెప్పబడి యున్నది కదా, యన అది నిరుపాధికుడగు (ఆవరణముచేని) యవనికగా చెప్పబడి యున్నదని తెలియ తగినదని తాత్పర్యము.

అవ॥ ఇప్పటికిని ఒకటి పరబ్రహ్మమే జగత్కారణమని చెప్పుట వలన కలుగుదోషము నివారణ కాలేదు. పరబ్రహ్మ మొకటియే జగత్కారణ మైనయెడల ఈ ప్రపంచ మంతయు నొకటే విధముగ నుండవలయునుగాని దీనియందు భేదములుండుటకు వీలు లేదు కదా, యనిన సమాధానము చెప్పుచున్నారు.

సూ॥ ౨౩॥ అశ్మాదివచ్చ తదనుపపత్తిః॥

టీక॥ అశ్మాదివచ్చ = రత్నములు మొదలగు వానియందువలె, బ్రహ్మణ్యపి = బ్రహ్మమునందు కూడ, తదనుపపత్తిః = ఆ భేదము (కారణమొకటే యైనను కార్యములందు భేదములు కలుగుట ఎట్లను సందేహము) కూడ కొనసాగదు.

తా॥ వజ్రము వైడూర్యము మొదలగు రత్నములును రాయి మట్టిపెళ్ళ మొదలగునవియును మంచిగంధము మామిడి విషముష్టి మొదలగు వృక్షముల విత్తనములును ఇవన్నియును పార్థివములే (భూమి ఉపాదాన కారణము గలవే) ఇప్పటికిని యీయందు కాంతిలోను రుచిలోను వాసనలోను అనేక భేదములు ప్రత్యక్షముగ గనుపడుచున్నవి కదా, ఏవస్తువునకు ఏవస్తువు ఉపాదానకారణముగ నుండునో ఆవస్తువు ఆ ఉపాదాన కారణము నస్తువుకంటె వేరు కాదనుట ప్రత్యక్షసిద్ధమైన విషయము. కావున వజ్రము మొదలగువాని యందు కనుపడుచున్న భేదము లన్నియు వజ్రాదులకు ఉపాదానకారణమగు భూమికే కలవని చెప్ప వలయును. ఈ నిరూపణ ప్రకారము భూమి యొకటియే యైనను వానియందు ఇన్ని భేదము లెట్లు కన

పడుచున్నవో అట్లే పరబ్రహ్మ మొకఁడే యైనను ఆయన యందు జీవేశ్వరాది భేదములు కనుపడవచ్చును, మఱియు భూమి యొకటియే కారణము గాఁగలదైనను వజ్ర వైడూర్యాదులు ఎట్లు బహువిధ రసగంధాది భేదములు గలిగియున్నవో ఒకటే అన్నమువలనజనించినవైనను గోళ్లు వెంట్రుకలు మొదలగునవి ఎట్లు విరుద్ధ స్వభావముగలవైయున్నవో అట్లే ఒకటే పరబ్రహ్మ వలననే పుట్టినదైనను ప్రపంచము విరుద్ధ స్వభావము గలదై యుండవచ్చును. కావున పూర్వ పక్షమందు చూపబడిన సంశయములు కలుగుటకే మాత్రము అవకాశము లేదనియు పరబ్రహ్మము జగత్కారణమను సిద్ధాంతమునకు భంగమేమియును రాదనియు దృఢపరుపఁబడినదనియు తాత్పర్యము.

—(*) ౭. ఉపసంహారదర్శనాధికరణము. (*)—

అవ॥ లోకమునందు కారణములగుచున్న పదార్థములకు సహాయములుగా అనేకవస్తువులు ఉన్నవనుట ప్రత్యక్షమై యున్నది. కుమ్మరవాడు కుండ సేయవలెనని దండము చక్రము మొదలగు నానాసహాయములు కావలయును కదా, ఇట్లే మట్టి కుండగా పరిణామము నొందవలయునన్నను పైజెప్పిన సాధనములన్నియు ఉండవలసినవే కదా, కావున అద్వితీయుడగు పరబ్రహ్మము జగత్కారణముగుటకు వీలులేదు. ఆయనకు సహాయములేవియు లేవు కదా, అనుపూర్వపక్షమును ఈ అధికరణముచే ఖండించుచున్నాడు.

సూ॥ ౨౪॥ ఉపసంహారదర్శనాన్నేతిచేన్న క్షీరవద్ధి॥

టీక॥ ఉపసంహారదర్శనాత్ = ఉపాదాన కారణమునకుగాని నిమిత్తకారణమునకుగాని సహాయములు కావలయునని ప్రత్యక్షముగా చూచుచుండుటవలన, అద్వితీయం = ఏకస్వరూపుడగు, బ్రహ్మ= పరబ్రహ్మము, న జగత్కారణం= ప్రపంచమునకు కారణము కానేరదు, ఇతిచేత్ =అనేయెడల, న=అదిసరికాదు, తత్= అది ( పరబ్రహ్మజగత్కారణమనుట ) క్షీరవద్ధి=పాలవలెనే కదా [ పాలు ఇతరసహాయముతో పనిలేకయే పెరుగు అగునట్లు అనుట. ]

తా॥ అవతారికయందు చేయబడిన పూర్వపక్షము సరియైనదికాదు. కొన్నిచోట్ల కారణమునకు సహాయమున్నట్లు నిశ్చయమే

ఒకటియే ఆధారమైయుండుటవలన ) శ్రుతేః = వేదవాక్యములవల
ననే ఏర్పడును. [ వేదముచెప్పినట్లే ఒప్పుకొనవలయుననుట. ]

తా॥ బహుస్యాం [ అనేకవిధములుగా అయ్యెదను ] అను మొదలగువాక్యములచేత పరబ్రహ్మమే జగత్తునకు ఉపాదానకారణమనిచెప్పినట్లే ( అతోజ్యాయాగంశ్చపురుషః ) పరబ్రహ్మము ఈప్రపంచమునకంటె పెదవాడైయున్నాడు. ఈ ప్రపంచమునకంటె వేరుగా నున్నాడనుట ) అను మొదలగు వాక్యములచే పరబ్రహ్మము ప్రపంచమునకంటె వేరుగానున్నాడని శ్రుతియే చెప్పుచున్నది. ఈశ్రుతినిపట్టిచూచిన పరబ్రహ్మము అవయవములు లేనివాడయ్యెను జగద్రూపముగా పరిణమించుచున్నాడనుటవలన పరబ్రహ్మము జగత్తునకంటే వేరుగానుండుటకు వీలులేదు అనుదోషము ( పూర్వసూత్రమునందు చూపబడిన కృత్స్నప్రసక్తియను మొదటిదోషము) కలుగనేరదు. ఇంతమాత్రమువలన పరబ్రహ్మమునకు అవయవములుగలవని చెప్పనక్కరలేదు. నిష్కలం అను మొదలగు శ్రుతులు పరబ్రహ్మమునకు అవయవములులేవని చెప్పుచున్నవి. కావున అవయవములు లేకుండినను కొంతభాగము ప్రపంచరూపముగాను మరికొంతభాగమునందు ప్రపంచాతిరిక్తముగాను ఉండుటలో విరోధమేమియునులేదని నిర్ణయింపవలయును. ఇట్లు చెప్పుటవలన ( పరబ్రహ్మ ప్రపంచాతిరిక్తుడై యున్నాడనియు ఆయనకు అవయవములు మాత్రము లేవనియు చెప్పుటవలన ) విరోధమేమియును రాదు. పరబ్రహ్మముయొక్క స్వభావములను తెలిసికొనుటకు వేదమొక్కటియే ప్రమాణము. కావున వేదమునందు ఏయేవిధముగా చెప్పబడియున్నదో ఆయావిధముగా నిర్ణయించుకొనవలయునేకాని యుక్తియొక విధముగా సాధించుటకు వీలులేదు. అధ్యాయము ౨ పాదం ౧ అధికరణము ౩ సూత్రము ౧౧ అందుపై నిర్ణయించిన విషయమునుగూర్చి సిద్ధాంతము చేయబడియున్నది. ఇదియునుగాక ఉపాదానకారణమగువస్తువు కార్యరూపముగా పరిణమించవలెననుట ఒకనియమముకాదు. భ్రాంతిచేత త్రాడునుచూచి పామని తలంపుకలిగిన సమయమునందు ఆత్రాడు పామునకు ఉపాదానకారణమేకదా? ఇప్పుడు త్రాడు

నామరూపముగా పరిణమించునని కదా, కట్టి ఉపాదానకారణమునకు వివర్తోపాదానమనిరి. " వాచారంభణం వికారో నామధేయం " అనుమొదలగు వాక్యములచే నీ ప్రపంచమంతయు మిథ్యయని చెప్పుచున్నవి. భ్రాంతికల్పితములు చేరి మిథ్యయగు సర్పమునకు ఉపాదానకారణమగు భ్రాంతి యెట్లు వివర్తోపాదానమో మిథ్యయగు ప్రపంచమునకు ఉపాదానకారణమగు పరబ్రహ్మ కూడా అట్లే వివర్తోపాదానము. కావున పూర్వ సూత్రమునందు చూపబడిన దోషములు కలుగుటకు అవకాశమే లేదు, అట్లగుటచేత పరబ్రహ్మ ఉపాదానమైనను ఆ పరబ్రహ్మము [illegible] వలయుననియు చెప్పుటలో [illegible] మైనయు లేదని తాత్పర్యము.

సూ॥ ౨౮॥ ఆత్మని చైవం విచిత్రాశ్చహి ॥

టీక॥ ఏవం = పైని రూపించిన విధముగానే ఆత్మని చ = జీవుని యందుకూడ, విచిత్రాః = నానా విధములగు విచిత్ర పదార్థములు, దృశ్యంతేహి = కనబడుచున్నవి కదా.

తా॥ స్వప్నమునందు కనబడు వస్తువులన్నియు జీవుని చేతనే సృజింపబడుచున్నవని సర్వాభిప్రాయము. దీనననుసరించి చూచిన స్వప్నకాలమందు నానా విధములగు విచిత్ర పదార్థములు కల్పింపబడుచున్నవి. ౨౬ వ సూత్రమునందు చెప్పబడిన దోషములు జీవుని యందు ఎట్లు సంభవించవో అట్లే మాయాసహితుడగు పరబ్రహ్మమునందుకూడా నానావిధమగు ప్రపంచము పుట్టుచున్నను పైనచెప్పిన దోషములు రానేరవు. జీవుడు అవయవములు కలవాడనుట యనుభవమునకు విరోధము. సంపూర్ణముగా స్వాప్న పదార్థ రూపముగ ( స్వప్నమందు కనబడుచున్న వస్తువులుగ ) పరిణమించెననినచో ద్రష్ట ( ఆ వస్తువులను చూచువాడు ) లేక పోవలసి వచ్చును కావున ప్రత్యక్ష విరోధము వచ్చును. కాబట్టి పైచూపిన విరోధముల వలన జీవుడు అవయవములు లేనివాడయ్యును స్వప్న పదార్థ రూపమును పొందువాడుగ కూడనున్నాడని యెట్లంగీకరింపవలయునో అట్లే పరబ్రహ్మముకూడా ప్రపంచమునకు ఉపాదాన కారణముగాను

టకు మఱియొక పూర్వ పక్షమును అను వాదము చేయు చున్నాడు

సూ॥ ౩౨॥ న ప్రయోజనవత్త్వాత్ ॥

టీక॥ ప్రయోజనవత్త్వాత్ = సర్వ కామములును సంపూర్ణములై యుండుటవలన (ఆప్తకాముడగుటవలన) బ్రహ్మ = పరబ్రహ్మము, న జగత్కర్తృ = జగత్కారణము కానేరదు.

తా॥ లోకమునందు ఏదియొక ప్రయోజనమును కోరకనొక కార్యమునందు ప్రవర్తించు వాడు కనబడుట లేదు. ఈ న్యాయము వలన పరమేశ్వరుడు కూడ ప్రపంచమును సృష్టించునప్పుడు ఏదియో యొక ప్రయోజనమును అపేక్షించు చున్నాడని చెప్పవలసి వచ్చును. అట్లు చెప్పుటకు వీలు లేదు. బ్రహ్మము ఆప్తకాముడు గదా, కాబట్టి పరబ్రహ్మము జగత్కారణము కాదని చెప్పుటయే యుక్తి యుక్తమని తాత్పర్యము. (ఇది పూర్వపక్ష సూత్రము.)

అవ॥ పై పూర్వపక్షమును ఖండించు చున్నాడు.

సూ॥ ౩౩॥ లోకవత్తు లీలా కైవల్యమ్॥

టీక॥ తు = కాని, ఈ సృష్టి, లోకవత్ = లోకమునందువలె, లీలా కైవల్యమ్ = లీలామాత్రము,

తా॥ లోకమునందు రాజులకు ప్రయోజన మేమియును లేక పోయినను కేవలము వినోదముగా వేటమొదలగు కొన్ని కార్యములయందు ప్రవర్తించు చుండుట ప్రసిద్ధమై యున్నది. అట్లే ఆపరమేశ్వరుడుకూడ లీలార్థమై ప్రపంచ సృష్టియందు ప్రవర్తించు చున్నాడు. ఇది ఆయనకు స్వభావము. స్వభావము అని చెప్పిన పిదప ఏ ఆక్షేపమునకు కూడ అవకాశము లేదు. కావున ఆప్త కాముడై యుండినను పరమేశ్వరుడు ప్రపంచమును సృష్టించు చున్నాడనుటలో విరోధ మేమియును లేదని తాత్పర్యము.

—(*) ౧౨. వైషమ్య నైర్ఘృణ్యాధికరణమ్. (*)—

అవ॥ బ్రహ్మము జగత్కారణమను విషయమును మఱియొక విధముగా నాక్షేపించి సమాధానము చెప్పబోవు చున్నవాడై సూత్రకారుడు ఈ యధికరణము నారంభించు చున్నాడు.

సూ॥ ౩౪॥ వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వా
త్తథాహి దర్శయతి ॥

ప॥ బ్రహ్మణః=పరబ్రహ్మము, సాపేక్షత్వాత్ = వారివారి కర్మల ననుసరించి సర్వమును ఆచరించుచుండును కావున, వైషమ్య నైర్ఘృణ్యే విషమత్వము ( ఒకనియెడల నొక విధముగాను మఱి యొకరియెడల వేరొక విధముగాను ప్రవర్తించుట ) నిర్దయత్వము అను దోషములు, న సంభవతః = ఆపరబ్రహ్మమునందు కలుగ నేరవు.

తా॥ లోకమునందు మనుష్యులు చేసిన తప్పుపనులను మంచి పనులను ననుసరించి శిక్షలను బహుమానములను చేయుచుండు ప్రభువును విషముడని ( ఒకనియందు ప్రీతిగాను మఱియొకనియందు మఱి యొకరీతిగాను నుండువాడని ) దూషించుట లేదుగదా, అట్లు అనాది నుండియు వచ్చుచున్న పుణ్యపాపకర్మములను ననుసరించి ఫలములను సుఖదుఃఖాదులను నిచ్చు పరమేశ్వరునిగూడ విషముడని దూషించుట యుక్తముగాదు. ఈవిషయమునుగూడ "ఏష హ్యేవ సాధుకర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే" ( ఏపురుషుని ఊర్ధ్వలోకములకు గొనిపోవలయునని యిచ్ఛయించునో [ ఊర్ధ్వలోకప్రాప్తి కారణమగుచున్నాడని పరమేశ్వరుని ఎచ్చటిచ్చట వర్ణించుచున్నా మోయనుట ] ఆపురుషునిచేత పరమేశ్వరుడు మంచి కార్యములను చేయించును. [ మంచికార్యములుచేయుటకు పరమేశ్వరుడే కారణ మని చెప్పబడునుట] (అనుమొదలగువాక్యములచే శ్రుతియందే నిర్ణ యింపబడియున్నది. ఇంతమాత్రమువలన పరబ్రహ్మమునకు సర్వశ క్తిత్వములేకపోవలసివచ్చునని తలంపనక్కరలేదు. పురుషులకార్యము లను ననుసరించి శిక్షమొదలగువానిని చేసినప్పటికిని రాజునకు రాజ త్వము ( సర్వశక్తులుగలిగి ప్రభువుగానుండుట ) ఎట్లుపోవుటలేదో అట్లే పరబ్రహ్మమునకుగూడ జీవకర్మానుసారముగా సర్వకార్యము లను చేయుచున్నను సర్వశక్తిత్వము ( నానావిధములగు శక్తులను కలిగి ప్రభువైయుండుట ) పోనేరదు. కావున ప్రపంచమునందు దుఃఖముకలవారుగా కొందరును సుఖముకలవారుగా కొందరును కను

బడుచున్నను అందు పరబ్రహ్మముయొక్క దోషమేమియును లేదు. మఱియు సర్వసంహారకుడగుటచే పరమేశ్వరునియందు నిర్దయత్వము కలదనుటకూడ సరియైనదికాదు. వినాశముకూడ దేహాంతరప్రాప్తియే (జీవుడు తాను మొదటనున్న శరీరమువిడచి కర్మానురూపమగు మఱియొకశరీరమును పొందుటయే) కావున అదియును కర్మననుసరించి వచ్చునదియే, ఈకారణమువలన పరమేశ్వరునియందు నిర్దయత్వదోషము లేదు. కావున పరబ్రహ్మము సృష్టికర్త యగుటలో ఈ సూత్రమందు చూపబడినదోషములు విరోధముచేయనేరవని తాత్ప.

అవ॥ ఈవిషయమునందు మఱియొకపూర్వపక్షముచేసి ఖండించుచున్నాడు.

సూ॥ ౩౫ ॥ నకర్మావిభాగాదితిచేన్నానాదిత్వాత్ ॥

టీక॥ అవిభాగాత్ = సృష్టిపూర్వము ప్రపంచమునకును పరబ్రహ్మమునకు భేదము లేకపోవుటవలన, కర్మ=కర్మము, (పరబ్రహ్మముకర్మనుబట్టియే సర్వమును చేయుననుట) న=సరికాదు, ఇతిచేత్ = అనేమొదల, న=అదియుక్తముగాదు, కర్మణః=కర్మ, అనాదిత్వాత్ = అనాదియగుటచేత, ("కర్మకు సృష్టినుండి ఆరంభము అనిచెప్పటకు వీలులేదు")

తా॥ "సదేవసౌమ్యేదమగ్రఆసీత్" అను మొదలగు వాక్యములచేత సృష్టికిపూర్వము ప్రపంచమును పరబ్రహ్మమును ఒకటియేయని వేదముచెప్పుచున్నది. దీనినిబట్టిచూచిన మొదటిసృష్టియందు కర్మయే లేకపోవుటచేతను ఆసృష్టియందును మిక్కిలి సుఖము ననుభవించు దేవతలును సుఖదుఃఖములను సమానముగా అనుభవించు మనుష్యులును అధికముగ దుఃఖమునే అనుభవించు తిర్యగ్జంతువులును కలవనుట సిద్ధాంతమే అగుటచేతను పరబ్రహ్మమునందు పైసూత్రమునందు చూపబడిన దోషములు రెండును కలవని ఒప్పుకొనినయే తీరవలయును. ఇట్టిదోషములు ఆభగవంతునియందు ఉండుటకు వీలులేదు కావున, ఆయనను ప్రపంచమునకు కారణముగా చెప్పకుండుటయే యుక్తమని తోచుచున్నది. అని ఆక్షేపింతురేమో, ఈ ఆక్షేపణ సరియైనదికాదు. కర్మకుగాని సృష్టికిగాని "ఇదిమొదలు" అనిచెప్ప

టకు వీలులేదు. కావున పూర్వకల్పమునందు (ప్రళయమునందు) జీవులు ఏయేకర్మల నాచరించియుండి లయమునొందిరో [నశించిరో] ఆయాకర్మలను అనుసరించియే రెండవసృష్టియందు ఆజీవులకు సుఖ దుఃఖాదులు రావచ్చును కదా, కావున పరబ్రహ్మమునకు ౩౪వ సూత్రమున చూపబడిన దోషములు లేవని తాత్పర్యము.

అవ॥ ప్రపంచము అనాదియని మొట్టమొదట సిద్ధాంతమైనది కదా, ౩౫ వ, సూత్రమునందు చెప్పబడిన సిద్ధాంతము సరియగును. ప్రపంచము అనాదియగుటకు కారణము ఏమున్నది. అనిన, చెప్పుచున్నాడు.

సూ॥ ౩౬ ॥ ఉపపద్యతేచాప్యుపలభ్యతేచ ॥

టీక॥ సంసారస్య అనాదిత్వం = సంసారరూపమగు ప్రపంచము అనాదియగుట ఉపపద్యతే = యుక్తియుక్తమైయున్నది. అపి చ=మఱియు, ఉపలభ్యతే = శ్రుతి, స్మృతులయందుకూడ చెప్పబడియున్నది.

తా॥ ప్రపంచము అనాది యను సిద్ధాంతము యుక్తియుక్తమైనది. అనాదికాదని చెప్పినచో చేసియున్న కర్మలఫలములను అనుభవింపకపోవుటయు తానుచేయని కర్మఫలములను అనుభవించుటయును అనుమొదలగు దోషములు అనేకములువచ్చును. ఎట్లనగా ప్రథమ సృష్టినుండి జనించిన జీవులకు పూర్వకర్మములు లేకపోవుటచే కేవల కర్మాధీనములగు (కర్మలవలననే కలుగునట్టి) సుఖదుఃఖరూప ఫలములలో దేనిని అనుభవించుటకు వీలులేదుకదా. ఇదియే అకృతాభ్యాగమము (చేయనిదివచ్చుట) అను దోషము. మఱియు ప్రపంచమునకు ఆదియున్నదనిన అంతముకూడ ఉన్నదని అనవలయును. అప్పుడు (అంతకాలమునందు) నానావిధముల కర్మలను ఆచరించియున్నట్టియు తదనుగుణముగా నానావిధములగు ఫలములను అనుభవింపవలసియున్నట్టియు జీవులకు ఆయా అనుభవములు లేకపోవలసివచ్చును. అంతమనగా సంపూర్ణముగ (రెండవమారు పుట్టకుండ) నశించుటయే కావునను మొదట ఉన్న పదార్థములన్నియు తుదిని (సంపూర్ణవినాశము) కలిగియుండుట నియమమగుటచే మీవాదము

నుబట్టి ( ప్రపంచము అనాదికాదు అను వాదమునుబట్టి ) ఒకప్పుడు గాకున్న మఱియొకప్పుడైనను ప్రపంచము సంపూర్ణముగ నశించునని చెప్పవలయును కదా, కావున జీవులకొకప్పటికి తాముజేసిన కర్మల ఫలములను అనుభవింపకుండుట సిద్ధించునని ఒప్పుకొనవలయును. ఇదియే కృతవిప్రణాశము ( చేసినది అనుభవమునకు రాకుండుట ) అను దోషము. కావున మీరు చెప్పుచున్న వాదమువలన " చేసినదానిని అవశ్యము అనుభవింపవలయును " అను నియమమునకు భంగము కలుగుచున్నది. ఇది ప్రత్యక్షవిరుద్ధముకదా, కావున ఈవిరోధములు పోవుటకై సంసారరూపమగు నీప్రపంచము అనాదియనియే అంగీకరించుటయుక్తము. శ్రుతిస్మృతులుగూడ ఇట్లు చెప్పుచున్నవి. " ధాతా యథాపూర్వమకల్పయత్ " ( సృష్టికర్త పూర్వమువలెనే ఇప్పుడును ప్రపంచమును కల్పించెను ) " నాంతో నచాదిః " ( ఈప్రపంచమునకు అంతమును లేదు ఆదియును లేదు ) అను మొదలగు శ్రుతిస్మృతి వాక్యములు ఈవిషయమునందు ప్రమాణములు. కావున ప్రపంచము అనాదియేయనియు అట్లగుటచే కర్మకు ఇది ప్రారంభమని చెప్పుటకు వీలులేదనియు కావున కర్మానుగుణముగ సర్వవ్యవహారములను నిర్వహించుచున్న పరమేశ్వరునియందు ౩౪ వ సూత్రమునందు చూపబడిన దోషములు ఉండవనియు పరబ్రహ్మము ప్రపంచమునకు కారణమనుటలో ఎట్టివిరోధమును లేదనియు సిద్ధాంతము చేయబడినది తాత్పర్యము.

—(*) ౧౩. సర్వధర్మోపపత్త్యధికరణమ్. (*)—

అవ॥ పైఅధికరణములందు నిరూపింపబడిన కారణములవలన పరబ్రహ్మమే జగత్కారణమని సిద్ధాంతము చేయబడియున్నది. ఈసిద్ధాంతమునకు భంగము ఎప్పటికిని లేదు. అని మఱియొక హేతువును జూపి ఈఅధికరణమునందు సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ ॥ ౩౭ ॥ సర్వధర్మోపపత్తేశ్చ ॥

టీక॥ కించ=మఱియు, బ్రహ్మణి = పరబ్రహ్మమునందు, సర్వధర్మోపపత్తేః=ప్రపంచమునకు కారణమగుటకు కావలసిన ధర్మములన్నియు ఉన్నవని చెప్పుటలో విరోధమేమియును లేదు కావున, పైని

పదః=ఉపనిషత్సంబంధమైన, సిద్ధాంతః=వేదాంత సిద్ధాంతము, సమంజసః=యుక్తమైనదియే.

తా॥ పై అధికరణములయందు వివరింపబడియున్న కారణములవలన పరబ్రహ్మమునందు సర్వధర్మములును (కారణముగానుండుటకు ఏ, ఏ, ధర్మము లుండవలయునో ఆయా ధర్మములన్నియు కలవనుట సిద్ధాంతము చేయబడినదై యున్నది. మఱియు పరమేశ్వరుడు ప్రపంచమునకు పరిణామోపాదానమైనచో మీరుతలంచు దోషములు వచ్చునని సందేహించుటకునైన నవకాశ మున్నది. బ్రహ్మ పరిణామోపాదానము కాదనియు వివర్తోపాదానమనియు ౨ వ- అధ్యాయము ౨౭ వ- సూత్రమునందు నిర్ణయించియున్నాము. ఈ నిర్ణయమును బట్టి చూచిన సర్వశక్తియుక్తుడను మాయావియునగు నప్పరమేశ్వరుని విషయములో పూర్వపక్షము చేయుటకుగాని తుదకు అట్లు తలంచుటకుగాని అవకాశము లేదుకదా, కావున పరబ్రహ్మము నిర్గుణమయ్యును అవయవములు లేనిదయ్యును సర్వప్రపంచమునకును ఉపాదాన కారణముగాను నిమిత్త కారణముగాను కూడ నున్నదని చెప్పు వేదాంత సిద్ధాంతమునకు భంగ మెప్పటికిని లేదని తాత్పర్యము.

స్మృతి త్రయోదశ సప్త త్రింశత్ ॥ ౧౩॥ ౩౭ ॥

స్మృతి, యోగ, నవిలక్షణ, శిష్ట, భోక్త్రా, రంభణే, తగో,
పసంహార, కృత్స్న, సర్వోపేత, ప్రయోజన, వైషమ్య,
సర్వధర్మా, స్త్రయోదశ.

ఇతిశ్రీ బ్రహ్మసూత్రే ద్వితీయస్యాధ్యాయస్య ప్రథమః పాదః.

ఇట్లు ద్వితీయాధ్యాయమునందు ప్రథమపాదము

ముగిసెను.



ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## ద్వితీయాధ్యాయము - ద్వితీయపాదము.

—(*) ౧. రచనానుపపత్త్యధికరణమ్. (*)—

అవ॥ ప్రథమ పాదమునందు ఇతరమతస్థులు కల్పించు దోషములవలన వేదాంతసిద్ధాంతమునకు భంగమేమియును రాదని నిరూపించి ఈ పాదమునందు పరమతఖండన పూర్వకముగా స్వమతసిద్ధాంతమును స్థిర పరుప బోవుచు మొట్టమొదట మనువు మొదలగు పెద్ద శిష్టులచే కొంతవరకు అంగీకరింప బడియున్నదగుటచే శ్రేష్ఠమని చెప్పదగిన సాంఖ్య సిద్ధాంతమును ఖండించుటకు ఈ అధికరణము ప్రారంభించు చున్నాడు.

సూ॥ ౧॥ రచనానుపపత్తేశ్చానుమానం ॥

టీక॥ రచనానుపపత్తేశ్చ= ఈ ప్రపంచ మింత విచిత్రముగా రచియింప బడియుండుట కనుగొనుటకు వీలులేక పోవుటచేతను మఱియు నేక కారణములచేతను, జడం స్వతంత్రం = జడమైనప్పటికిని స్వతంత్రమని చెప్పబడు, అనుమానం = అనుమానముచేత మాత్రమే ఏర్పడుచున్న ప్రధానము, నజగత్కారణం=ప్రపంచమునకు కారణము కానేరదు.

తా॥ ప్రధానము జడమనియు ( జ్ఞానరూపము కాదనియు ) ఇట్లుండినను స్వతంత్రముగా ( చేతనపదార్థముయొక్క సహాయమును లేకనే ) ప్రపంచమును సృష్టిచేయుననియు సుఖము దుఃఖము మోహము ( పొరబాటు ) అను గుణములు ఈ ప్రపంచమును ఎప్పటికిని విడచుటలేదు కావున ( మట్టి కుండను ఆశ్రయించియున్నట్లు ఈ సుఖదుఃఖాది గుణములు ప్రపంచమును ఆశ్రయించియే యున్నవి కావు

నను ) ఆగుణములు సత్వరజస్తమో గుణములవలన పుట్టునవి కావు నను సత్వ రజస్తమో గుణాత్మకమని వర్ణయింపబడిన ప్రధానమీ జగత్కారణము కావలయుననియు సాంఖ్య మతస్థులు చెప్పుచున్నారు. ఈ మతము సరియైనది కాదు. లోకమునందు చేతనులు మనుష్యులు మొదలగువారు తమ తమ ఇచ్ఛవచ్చినట్లు నానా విధములుగా విచిత్ర వస్తువులను నిర్మించుట ప్రత్యక్షమై యున్నదికాని జడములగు రాయి కొయ్య మట్టి మొదలగునవి స్వతంత్రములై కుండలు మొదలగు పదార్థములను నిర్మించుట ఎచ్చటను కనుబడుట లేదు. కావున జడమగు ప్రధానము స్వతంత్రమై ప్రపంచమును నిర్మించుచున్నదనుట ప్రత్యక్ష విరుద్ధము. మఱియు సుఖదుఃఖాది గుణములు ప్రపంచమునందు కల వనుమాట యథార్థమేకాని అవి మట్టికుండను ఆశ్రయించి యున్నట్లు ప్రపంచము నాశ్రయించి యున్న వనుటయు ఈ కారణము వలన మట్టి కుండ కుపాదాన కారణమైనట్లు సుఖదుఃఖాదులు ప్రపంచ మునకు ఉపాదాన కారణములు కావలయుననుటయు దీనిని బట్టిచూచిన సత్వరజస్తమో గుణాత్మకమగు ప్రధానమే జగత్కారణ మనుట యు, సరికాదు. ఏలయనిన సుఖదుఃఖాదులు మనస్సులో నున్నట్లు కనుపడుచున్నవికాని మట్టి కుండను నాశ్రయించినట్లు అంతట నున్న ట్లు కనుబడుటలేదు. కావున కేవలసుఖదుఃఖాదులను మాత్రమే ఆధా రముచేసికొని ప్రధానము జగత్కారణమని చెప్పినచో ఆకాశాది పంచభూతములకును, ఆభూతముల వలనబుట్టిన బాహ్య పదార్థము లకు ( సుఖ దుఃఖాదులను అనుభవించు అంతః కరణము తప్ప తక్కిన పదార్థములకు ) ఆ ప్రధానము కారణమగుటకు వీలు లేదు గదా. కావున పై నిరూపించిన దోషమువలన ప్రధానము జగత్కారణమని చెప్పు సాంఖ్యవాదము సరియైనది కాదని తాత్పర్యము.

అవ॥ ఈ విషయమునందు మఱియొక హేతువును చూపు చున్నాడు.

సూ॥ ౨॥ ప్రవృత్తేశ్చ ॥

టీక॥ ప్రవృత్తేశ్చ= ప్రధానము జడమయ్యును తన స్వరూప మునువిడచి సృష్టి సమయమునందు మార్పు జెందునని చెప్పుట వలన

కూడ అనుమానం, జగత్కారణంన = ప్రధానము జగత్కారణము కానేరదు,

తా॥ "సత్వ రజస్తమోగుణములు సమానముగా నుండు స్థితియే ప్రధానమునకు స్వరూపము. ప్రపంచమునందు సత్వాదిగుణములు ఒకటేరూపముగ (హెచ్చుతక్కువలు లేక యనుట) నుండుట కనుపడదు. ఈ కారణము వలన ప్రధానము సృష్టి చేయునప్పుడు మార్పును పొందునని చెప్పవలయును" అని సాంఖ్యులు చెప్పుచున్నారు. ఇట్లు చెప్పుట వలనకూడ జడమగు ప్రధానము జగత్కారణమనుటకు వీలులేదు. ఎట్లనగా లోకమునందు రథములు మొదలగు జడపదార్థములు ఇటు అటు చలింపవలయును అని నప్పటికిని చేతనసహాయము ఉండవలెననుట ప్రత్యక్షసిద్ధమై యున్నది. ఇట్లే జగత్తును సృష్టింపబూనినప్పుడు ప్రధానమునకు చేతన సహాయము ఆవశ్యకము, ఇట్లగుటచే జడమగు ప్రధానముస్వతంత్రమై జగత్తును సృజించు ననుట యుక్తముకాదని తాత్పర్యము.

అవ॥ చేతన సహాయములేక అచేతనములగు పాలు నీళ్లు మొదలగు పదార్థములు స్వయముగానే వాటి కార్యములయందు ప్రవర్తించుట లోకమునందు చూచుచున్నాము. కావున ప్రధానముకూడ అచేతనమైనను స్వయముగానే ప్రపంచమును సృష్టింపవచ్చును. అనిన ఈ దృష్టాంతము సరియైనది కాదని ఖండించు చున్నాడు.

సూ॥ ౩॥ పయోంబువచ్చేత్తత్రాపి ॥

టీక॥ పయోంబువత్=పాలు నీళ్లు వీటివలె (పాలు స్వయముగానే చేతన పదార్థములయొక్క సహాయము లేకయే శిశువుల అభివృద్ధియందు ప్రవర్తించు చున్నట్లును, జలము చేతన సహాయము లేకయే లోక హితార్థమై ప్రవాహ రూపముగాను వర్ష రూపముగాను ప్రవర్తించు చున్నట్లును,) ప్రధానమపి=ప్రధానముకూడ, సృష్టౌ=జగత్తును సృజించుటయందు, స్వయం ప్రవర్తతే=చేతన సహాయము లేక తానుగానే ప్రవర్తించుచున్నది, ఇతిచేత్=అనేయెడల, తత్రాపి=ఆ దృష్టాంతముల యందును (పాలు నీళ్లు వీటియందు) చేతనాధిష్ఠితత్వం=చేతనము ఆశ్రయించి యున్నదనుట (చేతన స్వరూపు

డగు బ్రహ్మ వాటియందును ఉన్నాడనుట ) అంగీక్రియతే = మాచే నంగీకరింప బడుచున్నది, అతః నాయంయుక్తో దృష్టాంతః= ఈకారణమువలన మీరు చెప్పిన దృష్టాంతము సరియైనది కాదు.

తా॥ ఈసూత్రమునందు చూపబడిన దృష్టాంతములు సరియైనవి కావు. ఏలయనగా నీరుమొదలగువాటియందుకూడ చేతనస్వరూపుడగు పరబ్రహ్మయున్నాడు “ యోఽప్సుతిష్ఠన్ ” ( ఎవ్వడు నీటియందు ఉన్నాడో ) అనుమొదలగు శ్రుతివాక్యములచే మేము నిర్ణయించుచున్నాము. ఇట్లగుటచే ఇవి మీకు దృష్టాంతములు కానేరవు. చేతనసహాయము లేకయే స్వతంత్రముగా జగత్సృష్టిచేయుచున్నదియని చెప్పబడు ప్రధానమునకు చేతనసహాయముతో స్వకార్యములయందు ప్రవర్తించు జలాదులు ఎట్లు దృష్టాంతములగును. కావున ప్రధానమునకుకూడ చేతన సహాయము కలదని ఒప్పుకొనవలయును కాని వేఱొకవిధముగా సిద్ధాంతముచేయుటకు వీలు లేదని తాత్పర్యం.

అవ॥ సాంఖ్యసిద్ధాంతముపై మఱియొక దోషమును చూపుచున్నాడు.

సూ॥ ౪ ॥ వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్ ॥

టీక॥ వ్యతిరేకానవస్థితేః = ప్రధానముకంటే వ్యతిరేకముగా మఱెవ్వరు లేకపోవుటవలన, ( ప్రధానమును ప్రేరేపించువాడుకాని నివర్తింపచేయువాడుగాని మఱెవ్వరును లేరని నీవు [ సాంఖ్యుడు ] చెప్పుటవలన ) అనపేక్షత్వాచ్చ- ప్రధానమునకు చేతనసహాయము లేదని ఒప్పుకొనవలసి యుండుటవలనను, కాదాచిత్క ప్రవృత్తినివృత్త్యసంభవాత్ = ఒకప్పుడు ప్రపంచమును సృజించుననియు మఱియొకప్పుడు సృజింపదనియు ఆప్రధానమునుగూర్చి చెప్పుటకు వీలు లేదు. కావున, నతజ్జగత్కారణం = ఆప్రధానము ప్రపంచమునకు కారణము కానేరదు.

తా॥ సాంఖ్యమతమునందు పురుషుడనుపేరుతో ఒకచేతనవస్తువు చెప్పబడియున్నది. అయినను ఆపురుషుడు ప్రధానమును ప్రేరేపింపక ఉదాసీనుడై ( దేనియందును ప్రవేశింపనివాడై ) ఉండునని వారు చెప్పుదురు. ఇట్లగుటచే ప్రధానమును ప్రపంచ సృష్టియందు

ప్రేరేపించువాడుగాని ప్రపంచసృష్టినుండి మరలించువాడుగాని లేదు కదా. ఈసాంఖ్యసిద్ధాంతమును పట్టినగాచిన వారిమతమునకే దోషమువచ్చును. ఎట్లనగా జడమగు ప్రధానము చేతనసహాయములేకనే (ప్రేరేపించువాడు లేకనే) ఒకప్పుడు సృష్టించుననియు నివర్తింపచేయువాడు లేకనే మరియొకప్పుడు సృష్టినుండి విరమించుననియు చెప్పుట ప్రత్యక్షవిరుద్ధముకదా. కావున సాంఖ్యసిద్ధాంతము అప్రమాణమని తాత్పర్యము.

అవ॥ గడ్డి ఆకు మొదలగు జడపదార్థములు మరియొకదాని సహాయముతో అవసరములేక స్వయముగానే పాలరూపమున పరిణామమును పొందుచున్నవి. అట్లు జడమగుప్రధానముగూడ చేతన సహాయములేకయే ప్రపంచరూపముగా పరిణామమును పొందవచ్చునుగదా. అనిన అట్లు చెప్పుటవలన విరోధములేదని చూపుచున్నాడు.

సూ॥ ౫॥ అన్యత్రాభావాచ్చ న తృణాదివత్ ॥

టీక॥ అన్యత్ర=ఇతరస్థలములయందు (వృషభములయందు తృణాదులు క్షీరరూపముగ పరిణామమును పొందుచున్నట్లు కనుపడుచున్నవో ఆస్థలముదప్ప తక్కినస్థలములందనుట) అభావాత్ = అట్లగా పరిణామము కనుబడకపోవుటవలన, తృణాదివత్=గడ్డిమొదలగు వస్తువులవలె, ప్రధానస్య పరిణామః = ప్రధానము జగద్రూపముగ పరిణమించును. ఇతివచనయుక్తం = అనిచెప్పుట సరికాదు.

తా॥ అవతారికయందు చెప్పబడిన దృష్టాంతము సరియైనది కాదు. గడ్డిమొదలగునవి గోవులుమొదలగు స్త్రీజంతువులు భుజించినప్పుడే పాలుగామారునుగాని ఎద్దులుమొదలగు పురుషజంతువులు భుజించినప్పుడుగాని ఎరువుమొదలగువానిలో వేసినప్పుడుగాని క్షీరరూపముగ పరిణమించుటలేదుగదా. కావున ఈదృష్టాంతము ఆధారముచేసికొని అచేతనమగు ప్రధానము చేతన సహాయములేకయే ప్రపంచరూపముగ పరిణమించుచున్నదని చెప్పుటకు వీలులేదు అని తాత్పర్యము.

అవ॥ ఈవిధముగా అచేతనమగు ప్రధానము స్వతంత్రముగా జగత్తును సృజించుననుట సరియైన సిద్ధాంతముకాదని నిరూపించి ఒక

వేళ ప్రధానము స్వతంత్రకారణమని ఒప్పుకొనినను ఈసాంఖ్యసిద్ధాంతము నిర్దోషము కానేరదని నిరూపించుచున్నాడు.

సూ॥ ౬ ॥ అభ్యుపగమేప్యర్థాభావాత్ ॥

క॥ అభ్యుపగమేపి = ప్రధానము స్వయముగానే జగత్తును సృజించునని ఒప్పుకొనినప్పటికిని, అర్థాభావాత్ = ప్రయోజనమేమియును లేకపోవుటవలన, ప్రధాన కారణవాదః అసమంజసఏవ = ప్రధానము జగత్కారణమని చెప్పు సాంఖ్యవాదము సరియైనదికాదు.

తా॥ ప్రధానము స్వయముగానే జగత్తును సృజించునని ఒప్పుకొనినను సాంఖ్యమతముపై దోషములు పోవు. ఎలగనగా ప్రధానము అచేతనమగుటచేత జగత్సృష్టివలన దానికేమియును లాభము లేదు. పురుషునకు లాభమేర్పడయున్నను జడమగు ప్రధానమునకు ఆజ్ఞానము లేకపోవుటచే (పురుషునకు ఈప్రపంచమువలన ప్రయోజనమున్నది. ఆప్రయోజనమును సాధించుటకై నేను సృష్టిని ఒనర్చుచున్నాను. అను జ్ఞానము కలిగియుండుటచే) అది పురుషప్రయోజనార్థము సృష్టించుచున్నదనుటకు వీలులేదు. మఱియు, పురుషుడు సర్వాధికుడగుటచేతను, స్వస్థుడగుటచేతను, ఆయనకు భోగములుగాని మోక్షమునుగాని కల్పించుటకు ప్రధానమునకు సామర్థ్యములేదు. ఇదియునుగాక పురుషుడు మోక్షస్వరూపుడైయుండుటచేత ప్రధానము ఆవిషయమునందు ప్రవర్తించుటకే అవసరములేదు. మోక్షస్వరూపుడగునాతని సుఖప్రాప్తులగు భోగములందాసక్తి యనునదే లేదు. కావున ఆవిషయమునందుగూడ (పురుషునకు భోగము కలిగింపవలయునను విషయమునందుమాత్రము) ప్రధానము ప్రవర్తింపనవసరము లేదు. కావున ఎట్లుచూచినను జగత్సృష్టికి ప్రయోజనము లేదు కావున జగత్కారణమని చెప్పబడుచున్న ప్రధానము స్వతంత్రమేయని ఒప్పుకొనినప్పటికిని సాంఖ్యమతము సరియైనదికానేరదని తాత్పర్యము.

అవ॥ చూచుటకు శక్తికలిగియును నడచుటకు శక్తిలేనిపురుషుడు చూచుటకు శక్తిలేకున్నను నడచుటకు మాత్రము శక్తిగలిగిన వాని ఆధారము చేసుకొని కార్యములు నిర్వహించునట్లును అయస్కాంతము తానుకదలలేకున్నను ఇనుమును కదలింపగలశక్తి గలదగుటచే

ఆ ఇనుమునకు కదలికను కల్పించుచున్నట్లును పురుషుడు ఉదాసీనుడై నను తనశక్తివలన ప్రధానమునకు చలనమునుకల్పించి దానిమూలమున ప్రపంచసృష్టిని కలిగించును. అనిచెప్పినచో అదియును సరికాదని నిరూపించుచున్నాడు. ( నడచుటయనగా ప్రవర్తించుట )

సూ ॥ ౭ ॥ పురుషాశ్మవదితిచేత్తథాపి ॥

టీక॥ పురుషాశ్మవత్ = పురుషునివలెను అయస్కాంతమువలెను, పురుషః ప్రధానం ప్రవర్తయతి = పురుషుడు ప్రధానమును ప్రవర్తింపచేయును, ఇతిచేత్ = అనేయెడల, న = అదియును సరికాదు. తథాపి దోషః = ఇట్లుచెప్పినను దోషమేవచ్చును.

తా॥ అవతారికయందు చూపబడిన దృష్టాంతము ననుసరించి చేతనస్వరూపుడగు పురుషుడు అచేతనమగు ప్రధానమును జగత్సృష్ట్యాదులయందు ప్రవర్తింపచేయుననుటయు సరికాదు. అట్లు చెప్పినయెడల సాంఖ్యమతమునకే భంగమువచ్చును. ఎట్లనగా సాంఖ్యులు ప్రధానము స్వతంత్రముగానే ప్రపంచసృష్టి చేయుననియు పురుషుడు ప్రధానమును ప్రవర్తింపచేయువాడుకాదనియు చెప్పియున్నారు. ఈసిద్ధాంతములకు పైనచూపినవాదము విరుద్ధమగునుగదా. కావున ఎట్లుచెప్పినను సాంఖ్యమతము నిర్దోషము కానేరదని తాత్ప.

అవ॥ మఱియొక దోషమును చూపుచున్నాడు.

సూ ॥ ౮ ॥ అంగిత్వానుపపత్తేశ్చ ॥

టీక॥ అంగిత్వానుపపత్తేః - సత్వరజస్తమోగుణములలో ఒకటి అంగిగాను ( ముఖ్యమైనదిగాను ) మఱియొకటి అంగముగాను (అప్రధానముగాను) ఉండుటకు వీలులేదుకావున, ప్రధానస్యచ = ప్రధానమునకు, నప్రవృత్తిః = జగత్సృష్టియందు ప్రవృత్తికలుగుటకే వీలు లేదు.

తా॥ సాంఖ్యులు సత్వరజస్తమోగుణములు సమానముగా ఉండుస్థితియే ప్రధానస్వరూపమని చెప్పుచున్నారు. ఇట్లగుటచేత సమానస్వరూపముగలిగియున్న సత్వాదిగుణములు ఒకటి ప్రధానముగాను మఱియొకటి అప్రధానముగాను మారుననుట అసంభవము. అట్లుమాఱినయెడల వాటిస్వరూపమునకు భంగమువచ్చును గదా,

కావున, ప్రధానము జగత్సృష్టి యందు ప్రవర్తించుటకే వీలులేదు. గుణములు సమాన స్థితి యందే యున్నచో బహువిధభేదములుగల ఈ ప్రపంచము పుట్టుటకే వీలులేదుగదా. కావున ప్రధానము జగత్కారణమని చెప్పు సాంఖ్య సిద్ధాంతము యుక్తియుక్తముకాదని తాత్పర్యము.

అవ॥ ఇట్లుగాదు. సత్వరజస్తమోగుణములు మూడును సమానములయ్యే యున్నను నిరపేక్ష స్వభావములు కావు (ఒకదానితో నొకదానికి సంబంధములేక స్వతంత్రములై యుండునవి కావు) మఱి యేమనిన, అవి ప్రపంచము ఉత్పత్తి యగుటకు చేయే విధముగా నుండవలయునో ఆయా విధముగా (పరస్పర సంబంధములు గలిగి ఉండును.) అని మేము (సాంఖ్యులు) క్రొత్తగా నొక అనుమానము చేసెదము. ఇట్లు చేసినయెడల మా మతమునందు దోషమేమియు నుండదుకదా. అనిన, నట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ॥ అన్యథానుమితౌ చ జ్ఞశక్తివియోగాత్ ॥

టీక॥ అన్యథా = పైని సూత్రమునందు చెప్పబడిన దానికంటె వేరుగా, గుణానాం ప్రవృత్తి-గుణములయొక్క ప్రవృత్తిని, అనుమితౌ = అనుమానమును చేసినప్పటికిని, ప్రధానస్య = ప్రధానమునకు, జ్ఞశక్తివియోగాత్ = చేతనశక్తి లేకపోవుటచేత, దోషానాం తాదవస్థ్యం = పూర్వము చెప్పిన దోషములన్నియు నట్లే యుండును.

తా॥ అవకాశారికలో చు సబంధ ... క్రొత్తగా యనుమానము చేసినప్పటికిని (సాంఖ్య) సిద్ధాంతము దోషరహితము కానేరదు. ప్రధానమునకు చేతనశక్తి యున్నదని చెప్పుటకు వీలులేక పోవుటచేతను చేతన సహాయ మున్నదని మీరు (సాంఖ్యులు) ఒప్పుకొనకపోవుట చేతను ఈ యధికరణము మొదనుండియు చెప్పుచుండిన దోషములన్నియు నట్లే యుండును. కావున మీమతము ఎట్లును నిర్దోషము కానేరదని తాత్పర్యము.

సూ॥ ౧౦॥ విప్రతిషేధాచ్చాసమంజసం ॥

టీక॥ విప్రతిషేధాచ్చ = పరస్పర విరుద్ధార్థములను చెప్పుటవలన కూడ, సాంఖ్య దర్శనం = సాంఖ్యులమతము, అసమంజసం = సరియైనది కాదు.

తా॥ సాంఖ్య మతమునందు ఒకచోట ఇంద్రియములు ఏడే యనియు మఱియొకచోట పదకొండనియు ఒకచోట పంచతన్మాత్రలు మహా త్తత్త్వమునుండి బుట్టుననియు మఱియొకచోట అహం కారము నుండి పుట్టుననియు పరస్పర విరుద్ధములగు విషయములు చెప్పబడి యున్నవి. ఈ కారణము వలనకూడ సాంఖ్యమతము సరియైనది కా దని సిద్ధాంతము చేయుబడినదని తాత్పర్యము.

యన్. బి. అధ్యాయము ఒకటి పాదము ఒకటి యందలి ౫ వ- అధికరణము నందును ౪ వ- పాదమునందును అ ౨. పా ౧. అధి ౧. యందును ఈ ప్రధాన వాదమునుగూర్చియే విచారణచేయ బడియున్నది. అయిననుఅచ్చట చేయబడియున్న విచారణ "ప్రధా నము జగత్కారణమని శ్రుతులయందు చెప్పబడి యుండలేదు" అని నిరూపించుటకై చేయబడినదనియు ప్రకృతాధికరణమున చేయబడిన విచారణ "యుక్తులచేతకూడ ప్రధానము జగత్కారణమని నిరూ పించుటకు వీలులేదు" అదినిరూపించుటకై చేయబడినదనియు తెలిసి కొనవలయును.

—(*) ౨. మహ ద్దీర్ఘాధి కరణమ్. (*

అవ॥ ఈ విధముగా పై అధికరణముచే సాంఖ్య మతమును ఖండించి వైశేషిక మతమును ఖండించు చున్నవాడై సూత్ర మొదట వారు తనపై చెప్పుదోషమును పరిహరించు చున్నాడు.

సూ॥ ౧౧॥ మహద్దీర్ఘవద్వాహ్రస్వ పరిమండలాభ్యాం ॥

టీక॥ హ్రస్వ పరిమండలాభ్యాం=ద్వ్యణుకము ( రెండు అణు వుల సముదాయము, ఈ సముదాయమునకు హ్రస్వ పరిమాణము కలదని వైశేషికులు చెప్పుదురు. ) పరమాణువు ( దీని ప్రమాణము నకు పారి మాండల్యమని పేరు. ) వీటివలన, మహద్దీర్ఘహ్రస్వవత్- ( ఇక్కడ హ్రస్వపదము అధ్యాహారము ) పెద్దదైనట్టియు పొడుగై నట్టియు త్ర్యణుకము ( మూడుద్వ్యణుకముల సముదాయము ) ద్వ్యణుకము ఇవిపుట్టుచున్నట్లు, బ్రహ్మణో జగదుత్పత్తిశ్చ = చేతన మగు పరబ్రహ్మమునుండి ప్రపంచము పుట్టవచ్చును.

తా॥ నూలు మొదలగు కారణములు గుడ్డమొదలగు కార్యములుగా నేర్పడునప్పుడు తమయందున్న గుణములనే తమ కార్యములకు కలిగించునుగాని క్రొత్తగుణములను కలిగింపనేరవు. (అనగా కారణమువందున్న గుణములు కార్యమునకు వచ్చుననుట స్వభావమనుట) కావున "చేతనమగు పరబ్రహ్మమునుండి అచేతనమగు ప్రపంచము పుట్టుననుట సరియైనది కాదు." అని వైశేషిక మతస్థులు వేదాంత మతమును ఆక్షేపించుచున్నారు. ఈ ఆక్షేపము సరియైనది కాదు. ఏలయనగా వారు కారణగుణములు కార్యములయందుండవలయునని చెప్పువారైనను ఈ నియమమునకు విరుద్ధములగు సిద్ధాంతములనుకూడ కొన్నిటిని చేసియున్నారు. అది ఎట్లనిన, పరమాణువులకు పారిమాండల్యమను ప్రమాణము కలదనియు ఆ పరమాణువుల వలన పుట్టు ద్వ్యణుకమును మాత్రము పారిమాండల్య ప్రమాణము గాక విజాతీయమగు (పారిమాండల్యమునకంటే వేరగు) (మఱియొక జాతి కలదియగు) హ్రస్వ పరిమాణము కలదనియు ఇట్లే హ్రస్వపరిమాణముగల ద్వ్యణుకము వలనబుట్టు త్ర్యణుకమునకు మహత్పరిమాణము (పెద్దదియగుట) దీర్ఘ పరిమాణము (పొడుగగుట) అను విజాతీయ పరిమాణము కలదనియు అంగీకరించియున్నారు. కావున కారణములగు పారిమాండల్య హ్రస్వ పరిమాణములు కార్యములగు ద్వ్యణుక, త్ర్యణుకములయందు లేవనుటచే కారణ గుణములు కార్యముల యందుండవలయునను నియమమునకు భంగము కలిగినది. దీనిబట్టి జూచిన చేతనమగు పరబ్రహ్మమువలన అచేతనమగు ప్రపంచము పుట్టుననుటలో దోష మేమియును లేదని ఏర్పడినది. వైశేషికులు చేయు నాక్షేపము సరియైనది కాదని నిరూపించ బడినది అని తాత్పర్యము.

యస్. బి. రెండవ అధ్యాయము మొదటి పాదము నాల్గవ అధికరణము నందుకూడ వైశేషికులు వేదాంత మతముపై జెప్పు దోషములే నివారింప బడియున్నవి. అయినను ప్రకృతాధికరణమునందు ఆ విషయములనే విమర్శించి యున్నారు. కావున పునరుక్తి దోషము లేదని తెలిసికొనవలయును.

అవ॥ పై అధికరణముచేత వైశేషికులు తనమతముపై చెప్పు

దోషమును నివారణచేసికొని సూత్ర కారుడు ఈ యధికరణముచే వారి మతమును ఖండించు చున్నాడు.

సూ॥ ౧౨॥ ఉభయథాపి నకర్మాతస్తదభావః ॥

టీక॥ ఉభయథాపి = పరమాణువులు చలించుటకు కారణము కలదని ఒప్పుకొనినను అట్లు ఒప్పుకొనకయున్నను, నకర్మ=చలనరూపమగు కర్మపరమాణువుల యందున్నదని చెప్పుటకు వీలులేదు, అతః= ఈ కారణమువలన, తదభావః=పరమాణువులవలన ప్రపంచ సృష్టి కలుగుట సంభవింపదు.

తా॥ సృష్టిపూర్వము పరమాణువులు నిశ్చలములైయుండు ననియు ఒకానొక అదృష్ట విశేషమువలన ఆ పరమాణువులయందు చలనరూపమగు కర్మ పుట్టుననియు ఆ కర్మవలన పరమాణువులు ద్వ్యణుకములై అద్వ్యణుకములనుండి భూమి జలము తేజస్సు వాయువు అను భూతములను సర్వప్రపంచమును జనించు ననియు ఇట్లే ఒకానొక అదృష్టమువలన సంయోగమును పొందియున్న ద్వ్యణుకములు విభాగమును పొందినప్పుడు ప్రళయమగుననియు వైశేషికులు చెప్పుదురు. ఇట్లు చెప్పుట సరికాదు. ఏలయనగా—జగత్తు సృజించుటకై పరమాణువులయందు చలనరూపమగు కర్మను ఒప్పుకొను చున్నారుగదా. ఆకర్మకు కారణ మేదైన కలదా, లేదా, లోకము నందు ఏదైనను చలింప వలయునన్న ప్రత్యక్షములగు "కొట్టుట, కదలించుట" మొదలగునవి కొన్నిచోట్లను ప్రత్యక్షముకాని అదృష్టము కొన్నిచోట్లను కారణములుగా కనుపడుచున్నవి. కావున పరమాణువులయందలి కర్మకు కారణము లేదని చెప్పుట ప్రత్యక్ష విరుద్ధమగును. అట్లుగాక కారణము కలదనియే చెప్పినప్పటికిని విరోధము వచ్చుట తప్పదు. ఎట్లనగా—పరమాణువులు చలించుటకు ప్రత్యక్షములగు "కొట్టుట మొదలగు కారణములుండుటకు వీలులేదు. అవి జీవుడుచేయు ప్రయత్నమువలన యేర్పడును. జీవుడన్నను సృష్టికి తర్వాత వచ్చిన వాడుకాని సృష్టి యారంభించునప్పు డున్నవాడుకాడు. మఱియు అప్రత్యక్షమగు అదృష్టమే పరమాణు చలనమునకు కారణమని చెప్పిన చో నదియును సరికాదు. అదృష్టమనునది అచేతనమగు పదార్థమే

కావున స్వయముగా పరమాణువులకు చలనమును కలిగింపలేదు. ఇదియునుగాక ఆ అదృష్టము జీవనిష్ఠమై ( జీవుని నాశ్రయించి యున్నదై ) పరమాణువులయందు చలనము కలిగించునా. లేక పరమాణునిష్ఠమై ( పరమాణువుల నాశ్రయించి యున్నదై ) వానియందు చలనముకలిగించునా? అనుప్రశ్నములకు ఉత్తరముచెప్పుటకేవీలులేదు. ఈకారణములను బట్టిచూచిన, పరమాణువులవలన జగత్సృష్టి కలుగుననుట యుక్తముగాదు. మఱియును అదృష్టమే పరమాణువులకు చలనమును కలిగించునని చెప్పినను ఆచలనము జగత్సృష్టిని కలిగింపవచ్చునుగాని ప్రళయమును కలిగించుటకు వీలులేదు. (సృష్టిని కలిగించునప్పుడు పరమాణువుల చలనము వానిసంయోగమునకు కారణమగును. ప్రళయమును కలిగించునప్పుడు విభాగమునకు కారణమగును) అదృష్టమనునది ధర్మాధర్మరూపమైనదగుటచేసుఖదుఃఖములనుఅనుభవింపచేయుటకై ఏర్పడినదేకాని సర్వమును వినాశమును చేయుటకై ఏర్పడినదికాదుగదా. కావున ఎట్లుచూచినను పరమాణువులయందు చలనరూపమగుకర్మ పుట్టుననుటయే సరియైనదికాదు. ఇట్లగుటచేత ప్రపంచసృష్టిగాని, ప్రళయముగాని, పరమాణువులవలన కలుగనేరదు. వైశేషికులమతము యుక్తియుక్తముకాదని దీనిచేతనే ఏర్పడుచున్నదని తాత్పర్యము.

అవ॥ మఱియొక దోషమును చూపుచున్నాడు.

సూ॥ ౧౩ ॥ సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః ॥

టీక॥ సమవాయాభ్యుపగమాత్ = పరమాణువులకును, ద్వ్యణుకములకును సమవాయసంబంధమున్నదని ఒప్పుకొనుటవలన; సామ్యాత్ = సమానమను కారణమువలన ( పరమాణువులకును ద్వ్యణుకములకును భేదమున్నది. కావున ద్వ్యణుకములు సమవాయసంబంధము ద్వారా పరమాణువులతో సంబంధించుచున్నట్లే ద్వ్యణుకమునకును సమవాయ సంబంధమునకుకూడ భేదము ఉండుటవలన సమవాయ సంబంధము ద్వ్యణుకములతో సంబంధించుటకు మఱియొక సమవాయసంబంధము కావలయుననుట సమానమే కావున )

అనవస్థితేః=అనవస్థాదోషమువచ్చును గనుక, తదభావః= పరమాణు వులవలన జగత్సృష్టియగుననుట యుక్తముగాదు.

తా॥ పరమాణువులకును, ద్వ్యణుకములకును సమవాయసంబంధము కలదని వైశేషికులు ఒప్పుకొనియున్నారు. ఇదియును వారి మతసిద్ధాంతమునకే భంగము కలిగించును. ఎట్లనిన?—రెండువస్తువులకు సంబంధముకలదని చెప్పిన ఆరెండువస్తువులును మొట్టమొదట భేదముగానున్నవనియేకదా అభిప్రాయము. కావున పరమాణువులకును, ద్వ్యణుకములకును సంబంధముకలదనిన మొట్టమొదట అవిరెండును పరస్పరభేదము కలిగియుండెననియే చెప్పవలయును. ఇట్లు చెప్పుటచేత సమవాయసంబంధమనునది ద్వ్యణుకములతోను, పరమాణువులతోను సంబంధపడి ఆరెండువస్తువులకును ( ద్వ్యణుకపరమాణువులరెంటికిని ) సంబంధమును కలిగించెనని యేర్పడుచున్నది. ఈన్యాయమును అనుసరించియే విమర్శింపుము. మొట్టమొదట పరమాణువులకును ద్వ్యణుకములకు భేదమెట్లుండెనో అట్లే సమవాయసంబంధమునకును ద్వ్యణుకాదులకుకూడ ( సమవాయసంబంధము ద్వ్యణుకపరమాణువులతో రెంటితోను సంబంధపడవలసినది కావున "ద్వ్యణుకాదులకును" అని చెప్పబడియున్నది ) భేదముండి యుండవలయునుకదా. ఇట్లు సమవాయ సంబంధ ద్వ్యణుకాదులకు భేదమున్నదని పైన్యాయమువలననే సిద్ధించుచుండుటచేత ఆరెంటికిని ( సమవాయసంబంధమునకును, ద్వ్యణుకమునకు, సమవాయ సంబంధమునకును, పరమాణవులకును అనుట ) సంబంధమును కలిగించుటకు మఱియొక సమవాయసంబంధము కావలసివచ్చును. ఈవిషయముకూడ ( భేదముగలవి ఒకసంబంధముద్వారా పరస్పర సంబద్ధము లగును. అనువిషయముకూడ ) పైన్యాయముచేతనే యేర్పడుచున్నది. మఱియు మనముజెప్పుచున్న రెండవ సమవాయ సంబంధముకూడ మొదటిసమవాయసంబంధమువలెనే ద్వ్యణుకాదులకంటే వేరగుటచేత ఆరెంటికిని ( రెండవసమవాయ సంబంధమునకును, ద్వ్యణుకాదులకును ) సంబంధముకలిగించుటకు మూడవ సమవాయ సంబంధము కావలయును. మూడవదికూడ పైనవివరించినట్లు ద్వ్యణుకాదులతో భేద

ముకలదియే యగుటచేత ఆ రెంటికిని సంబంధము కలిగించుటకు నాల్గవ సమవాయ సంబంధము కావలయును. ఈరీతిగ పరమాణువులకు ద్వ్యణుకములకును, సమవాయసంబంధముచే అభేదము కలదనువారు పైవివరించినరీతిగా లెక్కలేని సమవాయ సంబంధములను అంగీకరింపవలసివచ్చును. ఇదియే అనవస్థయనుదోషము. ఈదోషమువచ్చును కావున పరమాణువులవలన ద్వ్యణుకములును, ఆద్వ్యణుకములవలన, త్ర్యణుకములు మొదలగు ప్రపంచమును పుట్టుచున్నదనుటకు వీలు లేదని తాత్పర్యము.

సూ॥ ౧౪ ॥ నిత్యమేవచభావాత్ ॥

టీక॥ పరమాణూనాం = పరమాణువులయొక్క, స్వభావస్య=స్వభావము, నిత్యమేవ = సర్వకాలములయందును, భావాత్= ఉండునుగావున, నిదభావః=పరమాణువులవలన జగత్సృష్టికలుగదు.

తా॥ ప్రపంచమును సృష్టించుటయు, ప్రళయమ్ము నొందించుటయు, పరమాణువుల స్వభావమని వైశేషికులు చెప్పుదురు. ఇదియనుదోషమే. ఎట్లనగా పరమాణువులకు సృష్టిచేయుట స్వభావమా? లేక లయముచేయుట స్వభావమా? సృష్టిచేయుటయే స్వభావమనినచో సర్వకాలములయందును సృష్టియే చేయబడుచుండవలయునుగాని లయమనుమాటయే యుండకూడదు. ఇట్లుగాక లయముచేయుటయే వానికి స్వభావమైనచో డల ప్రపంచము లయమునొందియే యుండవలయునుగాని పుట్టకూడదు. యథార్థములో పరమాణువులు అచేతనములగుటచే అవి చేతనములవలె తమ ఇచ్ఛానుసారముగ (ఎప్పుడెప్పుడు ఎట్లెట్లు చేయవలయునో అప్పుడప్పుడు ఆయారీతిగా చేయుచు) ప్రవర్తింపనేరవుకదా. కావున ప్రపంచసృష్టి పరమాణువుల స్వభావమనికూడ చెప్పుటకు వీలులేకపోవుటచే ఈ వైశేషికుల మతము సరియైనదికాదని తాత్పర్యము.

సూ॥ ౧౫॥ రూపాదిమత్వాచ్చ విపర్యయోదర్శనాత్ ॥

టీక॥ అణూనాం=అణువులకు, రూపాదిమత్వాత్ = రూపము మొదలగు గుణములుండుటవలన, విపర్యయః=వైపరీత్యమువచ్చును (అణువులు అణువులే కాకపోవలసివచ్చును నిత్యములుకూడ కాకపో

వలసివచ్చును. ) కుతః=ఎందువలననవగా, దర్శనాత్ = ప్రత్యక్షము లో అట్లుకనుపడుచుండుటవలన ( అట్లు ప్రత్యక్షములో కనుపడుచున్నది యనుట. )

తా॥ వైశేషికమతమునందు భూమి, జలము, అగ్ని, వాయువు, అనునాల్గు భూతములుమాత్రమే పరమాణువులవలన నేర్పడుచున్నవనుట సిద్ధాంతమని ఇదివరకే నిరూపించియున్నాము. ఈసిద్ధాంతమును బట్టిచూచిన భూమిమొదలగు నాల్గు భూతములయందునుగల గంధము రసము రూపము స్పర్శ అనునాల్గు గుణములును॥ పరమాణువులయందును యుండవలయును. వారుకూడ దీనినొప్పుకొనియే యున్నారు. ఇట్లుండిన, గంధాదిగుణములుగల పృథివ్యాదు లెట్లు అనిత్యములో అట్లే పరమాణువులుకూడ అనిత్యములు కావలసివచ్చును. మఱియు స్థూలములు కావలసివచ్చును. కావున పరమాణువు లున్నవనుటకుకూడ ప్రత్యక్షవిరోధమని తాత్పర్యము.

—(*) ౩. ఉభయథాధికరణమ్. (*)—

అవ॥ పరమాణువులు జగత్కారణమనువాదము సరియైనది కాదని నిరూపించుటకై ఆమతము ( వైశేషికమతము ) పైమఱియొక దోషమును జూపుచున్నాడు.

సూ॥ ౧౬॥ ఉభయథాచదోషాత్ ॥

టీక ॥ ఉభయథాచ = రెండువిధములుగకూడా, దోషాత్ = దోషముకలుగుటవలన, పరమాణుకారణవాదః = పరమాణువులు జగత్కారణము అనిచెప్పువాదము, అసమంజసః= సరియైనదికాదు.

తా ॥ ప్రత్యక్షమునందు భూమికంటె జలమునకును దానికంటే అగ్నికిని అగ్నికంటే వాయువునకును ఒక్కొకగుణము తక్కువగాను ఉండుటవలన ఆభూతములు నాలుగును ఒకదానికంటే నొకటి సూక్ష్మములుగ ఉండునని తెలియుచున్నది. ఈ నాలుగుభూతములేకదా పరమాణువులవలన పుట్టునవిగా వర్ణింపబడియున్నవి. కావున వైశేషికులు ఆపరమాణువులకు ఉపచయాపచయభావములను ( స్థూలసూక్ష్మభావములను ) అంగీకరింపవలయును. అట్లంగీకరింపకపోయిన భూమియందు గంధమునకంటే వేరగు శబ్దస్పర్శరూప

రసములును జలమునందు రసమునకంటే వేరగు శబ్దస్పర్శ రూపము లును ఇట్లే తేజోవాయువుల యందుకూడా రూప స్పర్శములకు వ్యతిరిక్తములగు ఇతర గుణములును కనబడవలెనుగదా. ఈ నిరూపించినదోషము కలుగకుండుటకై ఉపచయ అపచయ భావముల నంగీకరించిరేని అప్పుడు పరమాణువులు పరమాణువులే కానేరవు. పృథివి మొదలగు నాలుగు భూతముల యందుగల స్థూలత్వ సూక్ష్మత్వములు పరమాణువుల యందుకూడ నున్నవనిన అవి అణువు లెట్లగును. కావున పరమాణువులకు ఉపచయ అపచయములు కలవనినను లేవనినను దోషము వచ్చుచుండుటచేత ఆ యణువులు జగత్కారణ మని చెప్పుటయే సరియైన సిద్ధాంతముకాదని ఏర్పడుచున్నదని తాత్పర్యము.

సూ॥ ౧౭॥ అపరిగ్రహాచ్చాత్యంతమనపేక్షా ॥

టీక॥ అపరిగ్రహాచ్చ= వేద వేత్తలగు మనువు మొదలగు మహాత్ములచేత కొంచమైనను గ్రహింపబడకుండుటవలనకూడ, అస్మిన్= ఈ వైశేషిక దర్శనమునందు, అత్యంతం= మిక్కిలి, అనపేక్షా కర్తవ్యా= ముముక్షువులచే అశ్రద్ధ చేయబడవలయును.

తా॥ వేదవేత్తలైన మనువు మొదలగు శిష్టులెవ్వరును ఈ వైశేషిక దర్శనమును పరిగ్రహింపలేదు (ఒక యంశమునందు గాకున్న మఱియొక యంశము నందైనను అంగీకరింపబడలేదు) ఈ కారణమువలనగూడ మోక్షేచ్ఛ గలవారు వైశేషిక దర్శనమును గూర్చి ఏమియు విచారింప నక్కర లేదనియు దానిని సంపూర్ణముగా పరిత్యజించుటయే యుక్తమనియు తాత్పర్యము.

—(*) ౪. సముదాయాధికరణమ్. (*)—

అవ॥ పై అధికరణముచే వైశేషికమతమును ఖండించి బౌద్ధమతమును ఖండించుటకై యారంభించుచున్నాడు. సౌత్రాంతికుడు వైభాషికుడు యోగాచారుడు మాధ్యమికుడు అనిబౌద్ధులు నాలుగు విధములు గలిగి యున్నారు. అందు సౌత్రాంతిక వైభాషిక మతములు సమానములైనవే యగుటచేత అవి ఈ అధికరణము నందు నిరాకరింపబడుచున్నవి.

సూ॥ ౧౮॥ సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః ॥

టీక॥ సముదాయే = సముదాయములు, ఉభయ హేతుకే సత్యపి=పరమాణువులును పంచస్కంధములును కారణములుగా గల వని తలంపు పడుచున్నప్పటికిని, తదప్రాప్తిః = ఆ సముదాయములు సిద్ధింపవు, కుతః = ఎందువలననగా, సముదాయినాం అచేతనత్వాత్ =సముదాయములుగానున్న పరమాణువులు మొదలగునవి అచేతనములగుట వలనను, చేతనస్య అనభ్యుపగమాత్ = మతిమొకచేతన పదార్థము ఒప్పుకొనక పోవుట వలనను ( ఈ రెండు కారణములవలనను సముదాయము సిద్ధింప దనుట. )

తా॥ బాహ్యపదార్థము లనియు ఆంతర పదార్థము లనియు వేదార్థములు రెండు విధములు. అందు భూతములనియు భౌతికము లనియు బాహ్య పదార్థములయందు రెండు భేదములు గలవు. చిత్తమనియు చైత్తములనియు ఆంతర పదార్థములయందును రెండు భేదములు కలవు. భూమి జలము అగ్ని వాయువు ఈ నాలుగును భూతములు రూపము రసము మొదలగునవియు వానిని గ్రహించు నేత్రము జిహ్వ మొదలగు ఇంద్రియములును భౌతికములు ( భూతముల వలన పుట్టినవి ) అనబడును. ఈ బాహ్య పదార్థములన్నియు పరమాణువులవలన పుట్టినవి ( అనగా పరమాణువులు ఒక సమూహముగా జేరి ఒక్కొక్క భూతమును పుట్టించుచున్నవనియు ఆపరమాణు సమూహములనుండి భౌతికములు పుట్టుచున్నవనియు తెలిసికొనవలయును ) ఇట్లే విషయములును ఇంద్రియములును రూపస్కంధను " నేను నేను " అని కలుగుచున్న జ్ఞాన పరంపర విజ్ఞాన స్కంధము ( తెకక్క లేకుండా అనేకజ్ఞానములు ఒకటి తర్వాత నొకటి పుట్టు చుండు నని వీరిమతము ) సుఖము దుఃఖము మొదలగు వానిని తెలిసికొనుట వేదనాస్కంధము " ఆవు గుఱ్ఱము మొదలగు పేర్లు సంజ్ఞా స్కంధము. సుఖ దుఃఖములకు హేతువులగు ధర్మాధర్మములు సంస్కార స్కంధము " ఈ అయిదు స్కంధములవలనను ( ఈ అయిదు స్కంధముల యొక్క సముదాయము వలననే ) ఆంతర పదార్థములు పుట్టుచున్నవి. పై వర్ణించిన స్కంధములలోని విజ్ఞాన స్కంధము చిత్తము ఇతర స్కంధములు చైత్తము ఇవి అన్నియు క్షణికములే అని సౌత్రాంతిక

వైభాషికులు చెప్పుచున్నారు ఈ మతము సరియైనది కాదు. స్కంధములును పరమాణువులును అచేతనములు కావున స్వయముగా సముదాయములు కానేరవు. ఈ అచేతనములను ఒకచోట సముదాయముగా చేయుటకై ఒక చేతన పదార్థమున్నదని వారు ఒప్పుకొనలేరు. ఈ కారణమువలన పరమాణువులవలన బాహ్య పదార్థములును స్కంధములవలన ఆంతర పదార్థములును పుట్టుననుటయే సరికాదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుట సరికాదు. అవిద్య వలన సంస్కారంబులును ఆ సంస్కారముల వలన జ్ఞానమును దానివలన నామ రూపాత్మకమగు ప్రపంచమును ఈ విధముగా పుట్టుచుండు ననిగదా మా మతము దీనినిబట్టి చూచిన పుట్టుకవలన అవిద్యయు అవిద్యవలన సంస్కారాదుల మూలముగా పుట్టుకయును సర్వదా కలుగుచుండు నని యే చెప్ప వలయును. ఇట్లు చెప్పినయెడల బాహ్యాంతర పదార్థరూపములగు పరమాణు స్కంధపంచక సముదాయములు కూడ సిద్ధింప వచ్చును గదా. కావున చేతనపదార్థమును వేరుగా ఒప్పుకొనక పోయినను సముదాయములు సిద్ధించుటలో విరోధ మేమియును లేదనిన అట్లు కాదని ఖండించు చున్నారు.

సూ॥ ౧౯॥ ఇతరేతర ప్రత్యయత్వాదితి చేన్నోత్పత్తి
మాత్ర నిమిత్తత్వాత్ ॥

టీక॥ ఇతరేతర ప్రత్యయత్వాత్ = అవిద్యాదులు ఒక దానికొకటి కారణమగుటవలన, సముదాయ సిద్ధిః = ౧౮ వ- సూత్రమునందు వర్ణించిన సముదాయములు సిద్ధించును, ఇతిచేత్ = అనే యెడల, న=అది సరికాదు, కుతః=ఎందువలన ననగా, తేషాం = ఆ అవిద్యాదులు, ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్ =సంస్కారాదులు పుట్టుటకు మాత్రమే కారణములై యున్నవి.

తా॥ అవతారికయందు చూపబడిన రీతిగా అవిద్యాదులు చక్రమువలె పరస్పరము కారణము లగుచునుండుట యథార్థమే కాని అయినను అవి సంస్కారాదులు పుట్టుటకు మాత్రమే కారణములుగాని అణువుల కొఱకుగాని స్కంధముల కొఱకుగాని సముదాయ

ము లేర్పడుటకు కారణములుగావుకదా. కావున ౧౮ వ- సూత్రము
నందు నిరూపించిన ప్రకారము సముదాయము లేర్పడుటకే వీలు లే
దని తాత్పర్యము.

అవ॥ అవిద్యాదులు సంస్కారాదులను పుట్టించునని కూడా
చెప్పుటకు వీలు లేదని నిరూపించు చున్నారు.

సూ॥ ౨౦॥ ఉత్తరోత్పాదేచ పూర్వ నిరోధాత్ ॥

టీక॥ ఉత్తరోత్పాదే = రెండవది పుట్టునప్పుడు, పూర్వ నిరో
ధాచ్చ= మొదటిది లేక పోవుటవలనకూడా, నకార్యోత్పత్తిః= కార్యో
త్పత్తి కలుగదు.

తా॥ ఈ సౌత్రాంతిక వైభాషికులు ప్రతి వస్తువును ఒకక్షణ
మునకంటే పైన నుండదని చెప్పు చున్నారు. ఇట్లగుటచేత అవిద్య
వలన సంస్కారము పుట్టునని చెప్పుటకూడ వారి మతమునందు సిద్ధిం
పనేరదు. ఎట్లనగా, " అవిద్య మొదటి క్షణమునందు కారణముగా
నుండును. రెండవ క్షణమునందు సంస్కారమును పుట్టించును. " అని
కదా చెప్పవలయును. ఇప్పుడు సంస్కారము పుట్టు క్షణము రెండ
వది యాయెను కావున ఆ క్షణమునందు అవిద్య లేదు గదా, కావున
అది సంస్కారమునకు కారణ మెట్లగును. కానేరదు. ఈ హేతువ
వలన ఈ మతమునందు కారణము నుండి కార్యము పుట్టుననుటకూడ
విరుద్ధమే యగునని తాత్పర్యము.

సూ॥ ౨౧॥ అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్యమన్యథా ॥

టీక॥ కారణే అసతి = కారణములేకుండా, కార్యోత్పత్తిః=
కార్యము పుట్టును, ఇతిచేత్ =అనేయెడల, ప్రతిజ్ఞోపరోధః = వారు
చేసిన ప్రతిజ్ఞకు భంగము వచ్చును, అన్యథా = అట్లు కాక పోయిన
యెడల ( కారణముండి యేకార్యము పుట్టుననే యెడల ) యౌగ
పద్యం= రెండును ( కార్య కారణములు ) ఒకకాలమునందేఉండును.

తా॥ కారణము లేకయే కార్యముపుట్టుటలో విరోధమేమి?
అందురేమో అప్పుడుమీరు ( సౌత్రాంతిక వైభాషికులు ) చెప్పువా
క్యములకు విరోధమువచ్చును. మీరు స్కంధములు పరమాణువులు
మొదలగు కారణములవలన ఆంతరబాహ్యపదార్థములు పుట్టుచున్న

వని చెప్పుచున్నారు. దానికి ఇది విరోధముగదా. అట్లుగాక కారణ ములవలననే కార్యములుపుట్టునని చెప్పినను మీమతమునందు విరోధ ముతెప్పదు. కార్యము ఉత్పత్తియగునట్టి రెండవక్షణమునందుకూడ కారణమున్నదని యొప్పుకోనవలసివచ్చును. కావున " ప్రతివస్తువును ఒకక్షణమునకంటే యుండదు. అను సిద్ధాంతమునకు భంగమువచ్చు ను. కావున ఎట్లుచూచినను కార్యమునుండి కారణము పుట్టుననుటయే మీమతమునందు సరిపడదు. ఇక సముదాయము ఏర్పడుటనుగూర్చి చెప్పవలసినదేమున్నది. ఏమియును లేదని తాత్పర్యము.

సూ॥ ౨౨॥ ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యా నిరోధా ప్రాప్తిరవిచ్ఛేదాత్॥

టీక॥ అవిచ్ఛేదాత్ = విచ్ఛేదమే ( వరుస తెగిపోవుటయే ) లేక పోవుటవలన, ప్రతిసంఖ్యా ఽప్రతిసంఖ్యా నిరోధాప్రాప్తిః = ప్రతి సంఖ్యావినాశముగాని అప్రతిసంఖ్యా వినాశముగాని సంభవింపనే రదు.

తా॥ బౌద్ధమతస్థులు ప్రతివస్తువునకును ప్రతసంఖ్యావినాశము నియు, అప్రతిసంఖ్యావినాశమునియు రెండువినాశములు కలవని చెప్పు దురు. ప్రతిసంఖ్యావినాశమనగా " ఈఘటమును నశింపచేసెదను " అనిబుద్ధిపూర్వకముగా చేయువినాశము. అప్రతిసంఖ్యా వినాశమ నగా " క్షణక్షణమునకును వినాశము కలుగుచున్నది " అనియుక్తి చేత సాధింపబడుచున్నవినాశము, బౌద్ధమతమును అనుసరించిచూ చిన ఈవినాశములు సిద్ధాంతములుకానేరవు. కావున వారిమతము నకే భంగమువచ్చును. ఏలయనగా ఒకకారణము మఱియొకదానిని పుట్టించుచునేయుండునుగాని, ఊరకయుండదు. ( అనగా వారిమత మునందు అన్నిపదార్థములును క్షణికములే కావున పూర్వక్షణమందు న్నపదార్థము ఉత్తరక్షణమునందు ఉండబోవుపదార్థమును కలిగించు చునే యుండుననుట ) ఇట్లుండుటచేత ( విచ్ఛేదమే లేకపోవుటచేత ) ఏవస్తువునకుగాని బుద్ధిపూర్వకనాశము కలుగునని చెప్పుటకు వీలులేదు కదా. అట్లుకలిగినయెడల ఆవస్తువు రెండవవస్తువును పుట్టింపకుండ నశించును అనవలయును. ఇది పైసిరూపించినవిధముగా క్షణికత్వమం

గీకరించిన ( ఉత్తరక్షణమునందు ఉండెడికార్యము పుట్టింపగల సామర్థ్యముతో పూర్వక్షణమునందుండుటను అంగీకరించిన ) బౌద్ధమతమునకు విరుద్ధమే కదా. మఱియు అబుద్ధిపూర్వక నాశముగూడ కలుగుననుటకు వీలులేదు. " పూర్వక్షణమునందున్న ఘటమే ఈక్షణమునందుకూడ ఉన్నది. " అను ప్రత్యభిజ్ఞానమునకు ( గుర్తించుటకు ) అప్పుడు వీలులేకపోవలసివచ్చును. ఇది ప్రత్యక్షవిరుద్ధముకదా. కావున ప్రతిసంఖ్యా అప్రతిసంఖ్యా నిరోధములు వస్తువులకు గలవనుట వారిమతమునకే భంగము కలిగించుచున్నదని తాత్పర్యము.

సూ॥ ౨౩॥ ఉభయథా చ దోషాత్ ॥

టీక॥ ఉభయథాచ = రెండువిధములుగాకూడ ( ప్రపంచమునందలి పదార్థములు నిత్యములు అనుమొదలగు అవిద్య జ్ఞానమువలన నశించునని చెప్పినను స్వయముగానే నశించునని చెప్పినను దోషాత్ = దోషములు వచ్చును కావున, సౌగతం మతమసమంజసం = బౌద్ధమతము మంచిదికాదు.

తా॥ పైసూత్రముచే " కారణము లేమియు లేకుండనే వస్తువులు నశించుచుండును " అని బౌద్ధులు చెప్పుదురని నిరూపించియుంటిమి. మఱియు లోకమునందున్న సర్వవస్తువులును స్థిరములుకావనియును వానియందు స్థిరత్వబుద్ధి అవిద్యవలన కలుగుననియును, ఆఅవిద్యను పోగొట్టుకొనవలయు ననియునుకూడ వారుచెప్పుదురు. ఈ రెండుసిద్ధాంతములను బట్టిచూచిన వారిసిద్ధాంతమే దోషయుక్తమని ఏర్పడుచున్నది. ఎట్లనగా పైన నిరూపించిన అవిద్య జ్ఞానముచేతనశించునా? లేకస్వయముగానే నశించునా? జ్ఞానముచేత నశించుననిన, ఈతాత్పర్య అరంభమునందు జూపిన మొదటి సిద్ధాంతమునకు భంగమువచ్చును. అవిద్యానాశమునకు జ్ఞానము కారణముగదా. స్వయముగా నశించుననిన రెండవసిద్ధాంతమునకు భంగమువచ్చును. అవిద్య తనంతట తానే నశించునేని దానినశింపచేయుటకై జ్ఞానమక్కఱలేదుగదా. కావున బౌద్ధసిద్ధాంతము యుక్తమైనదికాదని తాత్పర్యము.

సూ॥ ౨౪ ॥ ఆకాశే చా విశేషాత్ ॥

టీక॥ ఆకాశేచ=ఆకాశమందున్ను, అవిశేషాత్ = భేదమేమి

యము లేనందువన, వస్తుత్వం=వస్తుత్వముకలదు (భూమిమొదలగు నాలుగింటివలె ఆకాశముకూడ నొకభూతమే యగుననుట.

తా॥ ౨౨ వ, సూత్రమునందు చెప్పబడిన వినాశములు రెండును ఎట్లు అభావరూపములో అట్లే ఆకాశముకూడ అభావరూపమేయని (అనగా లేదని) బౌద్ధులమతము. ఇది దోషము "ఇక్కడ ఘటమున్నది." అను మొదలగు స్థలములయందు ఘటమునకు ఆధారముగా ఉండునది వస్తువని ఎట్లునిశ్చయించుకొనవచ్చునో అట్లే "ఈ పక్షి ఇక్కడయెగురుచున్నది" అను మొదలగు స్థలములయందుకూడ పక్షియెగురుటకు ఆధారమైనది వస్తువేయని ఊహించుకొనవచ్చును కదా. దీనింబట్టిచూచిన ఆకాశముకూడ వస్తువే కావలసివచ్చును. కావున ఆకాశము అభావరూపమనుట దోషమని తాత్పర్యము.

అవ॥ బౌద్ధమతముపై మఱియొక దోషమును చెపుచున్నాము.

సూ॥ ౨౫॥ అనుస్మృతేశ్చ॥

టీక॥ అనుస్మృతేశ్చ=జ్ఞప్తియుండుటవలనకూడ. (నేను దీని నింతకుముందు చూచియున్నాను అని జ్ఞప్తికలుగుట వలనకూడా) బౌద్ధమతమసమంజసం = బౌద్ధమతము దోషయుక్తమైనది.

తా॥ బౌద్ధమతస్థులు ఆత్మయని చెప్పబడు విజ్ఞానసకంధమునుకూడ క్షణికమనియే చెప్పుదురని ఇదివరకే నిరూపించియున్నాము. ఇదియు ఒక దోషము. లోకమునందు "ఈవస్తువును ఇంతకుముందు చూచితిని" అనుమొదలగు అనుభవములు గలుగుచున్నవి. ఈ అనుభవమును బట్టిచూచిన భూతకాలమున దున్న ఆత్మయే వర్తమానకాలమునందుకూడ ఉండవలయునని ఏర్పడుచున్నది. అట్లుగాకపోయినచో ఒకనికికలిగిన అనుభవము మఱియొకనికి స్మరణకు వచ్చుననుట అయుక్తముకదా. కావున ఆత్మ క్షణికుడనిచెప్పు బౌద్ధమతము సరియైనదికాదని తాత్పర్యము.

సూ॥ ౨౬॥ నాసతోదృష్టత్వాత్ ॥

టీక॥ అసతః=అభావమువలన, కార్యోత్పత్తిః= కార్యముయొక్కపుట్టుక, న=సంభవింపదు, కుతః = ఎందువలననగా, అదృష్ట

త్వాత్= లోకమునందు కనబడకుండుటవలన ( లోకమునందు అట్టి కార్యోత్పత్తి కనుబడుటలేదు. )

తా॥ అన్నిపదార్థములును క్షణికములనిచెప్పిన ఆక్షణికపదార్థములనుండి కార్యముత్పత్తికాదని ౨౧ వ, సూత్రమునందు నిరూపించియున్నాము. అట్లు క్షణికములనుండియే కార్యములు పుట్టునని చెప్పకుండుటచే బౌద్ధులు అభావమునుండియే కార్యోత్పత్తి కలుగునని ఒప్పుకొనుచున్నారని చెప్పవలసి యున్నది. వారి గ్రంథములయందు ఈయభిప్రాయము స్పష్టముగ చెప్పబడికూడనున్నది. ప్రత్యక్షాదులకు విరుద్ధమగుటచే ఈసిద్ధాంతము అయుక్తము అభావమునుండి ఒక కార్యము పుట్టుననుట లోకమునందు ఎచ్చటను లేదుకదా. కుందేటికొమ్మునచే అంకుశమును ఏర్పరచినాడు. ఎండమావుల నీటియందు స్నానముచేసినాడు. అను మొదలగు వ్యవహారము లెందైనను కలవా? కావున బౌద్ధమతము సరియైనదికాదని తాత్పర్యము.

సూ॥ ౨౭॥ ఉదాసీనానామపి చైవంసిద్ధిః ॥

టీక॥ కించ=మఱియు, ఏవం=ఈవిధముగా ( అభావమువలన కార్యోత్పత్తికలుగునని ) చెప్పినయెడల, ఉదాసీనానామపి=ఏమియు ప్రయత్నముచేయక ఊరకుండువారికికూడ, సిద్ధిః=కార్యసిద్ధికలుగవలయును.

తా॥ అభావమువలన కార్యము పుట్టునన్నచో మఱియొక దోషము వచ్చును. అభావమునుగూర్చి ఎవ్వరును ఏమియు ప్రయత్నముచేయ నక్కఱలేదుకదా. ఆఅభావమునుండియే కార్యముపుట్టునేని ప్రయత్నముచేయక ఊరకుండువారలకుకూడ సకల కార్యసిద్ధులును కలుగవచ్చును. ఇది అనుభవ విరుద్ధముకదా. కావున సౌత్రాంతికవైభాషికులమతము అసంగతమని తాత్పర్యము.

—(*) ౫. ఉపలబ్ధ్యధికరణమ్. (*)—

అవ॥ ఈవిధముగా సౌత్రాంతిక వైభాషిక మతములను ఖండించి ఈ అధికరణమునందు యోగాచారమతమును ఖండించుచున్నాడు.

సూ ॥ ౨౮ ॥ నాభావ ఉపలబ్ధేః ॥

టీక॥ ఉపలబ్ధేః=కనుబడు చుండుటవలన, అభావః న=బాహ్య పదార్థములన్నియు లేవనుట యుక్తముకాదు.

తా॥ బాహ్యమునందు మనకు కనుబడుచున్న ఘట పటాది పదార్థములన్నియు లేనే లేవు. అంతర పదార్థములలో విజ్ఞాన సంబంధమొక్కటియే కలదు. కాని ఇతర సంబంధములు లేవు. ఆవిజ్ఞానసంబంధముకూడ క్షణికమే. ఆ విజ్ఞాన సంబంధము యొక్క ఆ కారభేదములే నీలపు తెలుపు మొదలగు రూపములుగాను ఘట పటాది పదార్థములుగాను ఈ పదార్థము లన్నియు బయట నున్నట్లుగాను స్వప్నమునందువలె కనుబడు చున్నవేకాని వేఱేమియును లేవు. అని యోగాచారులు చెప్పుచున్నారు. ఈ మతముకూడ దోషయుక్తమైనదినే " ఇది ఘటము ఇది పటము " అని సర్వలోకమునందును అనుభవ సిద్ధములుగా నున్న పదార్థములను శూన్యము లని చెప్పుటకు వీలగునా? కావున బాహ్యపదార్థములన్నియు లేనే లేవనుట యుక్తమని తాత్పర్యము.

అవ॥ కలయందు చూచుచున్న వస్తువులు బాహ్యమునం దెట్లు లేవో అట్లే జాగ్రతయందు చూచుచున్న వస్తువులుకూడ బాహ్యము నందు లేవని చెప్పిన దోషమేమి. అనిన అట్లు చెప్పుటకు వీలులేదని నిరూపించు చున్నాడు.

సూ॥ ౨౯॥ వైధర్మ్యాచ్చన స్వప్నాదివత్ ॥

టీక॥ వైధర్మ్యాత్=భేదముండుటవలన, స్వప్నవత్=స్వప్నమునందువలె, బాహ్యార్థానాం అభావః = బాహ్యపదార్థములు లేకపోవుట, న=సిద్ధింపదు.

తా॥ అవతారికయందు చెప్పిన స్వప్న దృష్టాంతము సరియైనదికాదు. స్వప్నమందు చూచిన వస్తువులు నశించును. జాగ్రదవస్థయందు చూచిన వస్తువులు నశింపవు. రెండవదినమునందు చూచినను మఱియొక పురుషుడు చూచినను అట్లే యుండును. ఈ కారణము వలన జాగ్రద వస్థయందు చూడబడుచున్న పదార్థములకు స్వప్నావస్థయందు చూడబడుచున్న పదార్థములను, ఉపమానముగా చెప్పుట ఉచితము కాదని తాత్పర్యము.

అవ॥ బాహ్యార్థములులేవని సిద్ధాంతము చేయుటకు మఱియొక కారణముకూడ కలదు. "ఇదిఘటము, ఇదిపటము" అను వ్యవహారములు ఘటపటాదులు ఉండినప్పుడే రావలయు ననియు (సత్యములైననే రావలయు ననియు) అసత్యములైనయెడల రాకూడదనియు నియమములేదు. జ్ఞానముల యొక్క వైచిత్ర్యము వలన (జ్ఞానము నానా విధములుగా విచిత్రమై యుండుట వలన) అట్టి వ్యవహారములు కలుగవచ్చును. జ్ఞానములు విచిత్రములుగా నుండుటకు సంస్కారములు కారణములు కావున బాహ్య పదార్థములు లేనే లేవనుట సయుక్తికమగు సిద్ధాంతమే అనిన అట్లు కాదని నిరూపించుచున్నాడు.

సూ॥ ౩౦॥ నభావో నుపలబ్ధేః ॥

టీక॥ అనుపలబ్ధేః= ఎచ్చటను ప్రత్యక్షముగా లేక పోవుటవలనను, యుక్తి యుక్తము కానందు వలనను లేక వాసనలకు ఆశ్రయమగునట్టి స్థిరమగు పదార్థ మొకటి మీ మతమునందు లే పోవుట వలనను, వాసనానాం=వాసనలయొక్క, భావః=ఉనికి, నసంభవతే= సంభ వింపదు.

తా॥ బాహ్య పదార్థములు లేకున్నను బాహ్య పదార్థవాసన జ్ఞానమునందు వైచిత్ర్యమును కలిగించుననుట విరుద్ధమగు విషయము. పదార్థములే లేక పోయినప్పుడు పదార్థ వాసన ఎక్కడ నుండి వచ్చును. ఒకమారు అనుభవించిన పిదపకదా వాసన (సంస్కారము) ఏర్పడును. కావున వాసనలు కలవనియు వానివలన జ్ఞానమునకు వైచిత్ర్యము కలుగుననియు దానిచే బాహ్య పదర్థము లున్నట్లు తోచుననియు చెప్పుట యుక్తము. మఱియు మీ (యోగాచార) మతమునందు స్థిరమగు పదార్థ మొకటియును లేదుకదా. ఇట్లైనచో సంస్కారములన్నియు నెచ్చట నుండును. అవి నిరాధారముగా నుండనేరవుగదా. విజ్ఞానస్కంధమే సంస్కారములకు ఆధార మనుటకు వీలులేదు. అది క్షణికమని మీరేచెప్పుచున్నారు కదా. కావున ఎట్లును వాసన లున్నవని చెప్పుటకు వీలు లేదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుట సరికాదు. విజ్ఞాన స్కంధమే వాసనలకు

ఆశ్రయమని మేము ఒప్పుకొనుచున్నాముగదా అనిన ఈ సిద్ధాంతము గూడ సరియైనది కాదని నిరూపించు చున్నాడు.

సూ॥ ౩౧॥ క్షణికత్వాచ్చ ॥

టీక॥ క్షణికత్వాత్=క్షణమునకంటే అధికకాలముయుండదు కావున, విజ్ఞాన స్కంధశ్చ = విజ్ఞానస్కంధము, న వాసనాశ్రయః= సంస్కారములకు ఆశ్రయమైనది కానేరదు.

తా॥ విజ్ఞాన స్కంధముకూడ క్షణికమనియే మీరు చెప్పు చున్నారుగదా. అట్లగుటచే క్షణమున కొకసారి నశించు విజ్ఞానములు సంస్కారములకు ఆశ్రయములై బాహ్యమునందు నానాకారములగు వస్తువులను తోచునట్లు చేయుననుట యసంభవము. ఎట్లనగా భూత కాలమునందు కలిగిన సంస్కారము లేకదా। వర్తమాన కాలము నందు విషయ ప్రతీతికికారణములు కావలయును.క్షణికవిజ్ఞానమే ఆ సంస్కారమునకు ఆశ్రయమైన చో భూత కాలమునందున్న విజ్ఞానము వర్తమాన కాలమునందు లేక పోవుట చేత సంస్కారము గూడ లేదని చెప్పవలసి వచ్చును. ఆశ్రయము లేక పోయి నప్పుడు దాని నాశ్రయించియున్న పదార్థముండుటకు వీలున్నదా? కావున మీ మతమునందు సంస్కారములున్నవని చెప్పుటకైనను విజ్ఞానస్కంధము క్షణికమని చెప్పుటకైనను వీలు లేకపోవును. ఈ విరోధమువలనమీసిద్ధాంతము అప్రామాణికమని తాత్పర్యము.

సూ॥ ౩౨॥ సర్వథా నుపపత్తేశ్చ ॥

టీక॥ సర్వథా=అన్ని విధములుగా గూడ, తస్య = ఆబుద్ధమతమునకు, అనుపత్తేః=ఉపపత్తి ( సరియైయుండుట ) లేకపోవుటవలన, సౌగతం దర్శనం=బౌద్ధదర్శనము, నాంగీకర్తవ్యం = అంగీకరింపబడ కూడదు.

తా॥ ఏవిధముగా పట్టిచూచినను బౌద్ధమత సిద్ధాంతము యుక్తి యుక్తముగా లేదు. కావున సౌత్రాంతిక వైభాషికుల మతముల వలెనే ఈ యోగాచార మతముకూడ సత్పురుషులచే నంగీకరింపబడ తగినదికాదు. ప్రపంచమనునది ( బాహ్య పదార్థములుకాని అంతర పదార్థములుగాని ) బొత్తిగా లేదనిచెప్పు మాధ్యమిక మతముకూడ

యోగాచార మతఖండనము చేతనే ఖండింప బడినదని తెలిసికొనవల యును. బాహ్య పదార్థములు లేవను యోగాచార సిద్ధాంతమును ఖండించుటకై ఏయే యుక్తులు చెప్పబడియున్నవో ప్రపంచమే లే దను మాధ్యమిక సిద్ధాంతమును ఖండించునప్పుడు కూడ ఆయుక్తులనే ఉపయోగించు కొనవచ్చును. "క్షణికత్వాచ్చ" అను సూత్రమునకు మాత్రము ఈ విధముగా తాత్పర్యమును గ్రహింపవలయును. క్షణి కములని యొకచోటను శూన్యములని యొకచోటను విరుద్ధముగా చె ప్పుటవలన బుద్ధమతము యుక్తమైనది కాదు. ఇట్లు సర్వమును విమ ర్శించిన సౌత్రాంతిక వైభాషికుల మతములవలె యోగాచారమా ధ్యమిక మతములుకూడ అప్రామాణికములే యనియు వానివలన శ్రేయస్కాములగు వారిచే బౌద్ధమతము అంగీకరింప బడతగినది కాదనియు తాత్పర్యము.

—(*) ౬. ఏకస్మిన్నసంభవాధికరణమ్. (*)—

అవ॥ పై రెండధికరణములచే నాలుగు విధములగు బౌద్ధమత ములను ఖండించి ఈ అధికరణముచే దిగంబర జైన మతమును ఖం డించు చున్నాడు.

సూ॥ ౩౩॥ నైకస్మిన్నసంభవాత్ ॥

టీక॥ ఏకస్మిన్ = ఒకదానియందు విరుద్ధధర్మాః = ఏకత్వము అనేకత్వము మొదలగు విరుద్ధ ధర్మములు, అసంభవాత్ = అసంభవ దోషమువలన, న = ఉండనేరవు.

తా॥ లోకమంతయును ఏడుపదార్థముల సముదాయమే యని యు ప్రపంచమునందు కనబడుచున్న పదార్థములకు నిత్యత్వము అని త్యత్వము ఏకత్వము అనేకత్వము మొదలగు విరుద్ధ ధర్మములు కల వనియు దిగంబరజైన మతస్థులు చెప్పు చున్నారు. ఇట్లు చెప్పుట సరి కాదు. ఒక వస్తువు యందు విరుద్ధములగు ధర్మములు ఉన్నవని చెప్పుట సరియగు సిద్ధాంతము కానేరదు. కావున ప్రత్యక్ష విరుద్ధ మగుటచే ఈ దిగంబర జైన సిద్ధాంతము అప్రామాణికమని తాత్పర్యము.

అవ॥ మఱియొక అంశమును ఖండించు చున్నాడు.

సూ॥ ౩౪॥ ఏవంచాత్మాఽకార్త్స్న్యం ॥

టీక॥ కించ = మఱియు. ఏవం=ఈ జైనమతమును అనుసరించి చూచిన, ఆత్మా కార్త్స్న్యం = జీవుడు పరిచ్ఛిన్నుడు కావలసి వచ్చును.

తా॥ శరీరము యెంతయుండునో జీవుడుకూడ అంతయే యున్నాడని దిగంబర జైనులు తలంచుచున్నారు. ఇట్లు తలంచుట దోషము. జీవుడు శరీరమంత పరిమాణము కలవాడే అయినయెడల పరిచ్ఛిన్నుడై యుండవలయును. ( అనగా మనుష్య శరీరమునందు ఒకడును మృగ శరీరమునందొకడును ఇట్లు ప్రతిశరీరమునందును జీవుడు వేరు వేరుగా ఉన్నాడని ఒప్పుకొన వలయును ) ఇట్లు ఒప్పుకొనిన యెడల ఆ జీవునకుకూడ అనిత్యత్వము కలదని చెప్పవలసి వచ్చును. ఇది సమ్మతముకాదు గదా. కావున జీవుడు శరీరపరిమాణము కలవాడనుట యుక్తియుక్తముకాదని తాత్పర్యము.

అవ॥ పై విషయమునందు మఱియొక దోషమును చూపుచున్నాడు.

సూ॥ ౩౫॥ నచపర్యాయాదప్య విరోధో వికారాదిభ్యః ॥

టీక॥ పర్యాయాదపి = కొన్ని అవయవములు వృద్ధియగుటవలనను కొన్ని తగ్గిపోవుచుండుటవలనను, అవిరోధః= పైచూపినవిరోధముపోవును ( అనగా జీవుడు శరీరపరిమాణము కలవాడై యుండవచ్చునని ఏర్పడును. ) ఇతి చేత్ = అనిచెప్పేయెడల, న=అదిసరికాదు. కుతః=ఎందువలననగా, వికారాదిభ్యః = వికారములుమొదలగు దోషములువచ్చును. ( జీవుడు వికారముకలవాడని చెప్పవలసివచ్చును. మఱియు అనేకదోషములుకూడవచ్చును. )

తా॥ జీవుడు శరీరపరిమాణము కలవాడే. మనుష్యశరీరములోనున్న జీవుడు కర్మవశమువలన చీమమొదలగు చిన్నజంతువులయొక్క శరీరమునందు ప్రవేశింపవలసివచ్చినప్పుడు ఆతని అవయవములలో కొన్నితగ్గిపోవును. ( అనగా సన్నమగుననుట ) ఏనుగమొదలగు గొప్పశరీరములయందు ప్రవేశింపవలసినచ్చినప్పుడు కొన్ని అవయవములు క్రొత్తగావచ్చును. కావున జీవునిపరిమాణము, ఆజీవునికి ఆశ్రయమగు శరీరముయొక్క పరిమాణమేయని చెప్పను రేమో అప్పుడు

అనేకదోషములువచ్చును. జీవుడు ఎప్పుడును అవయవములు కలవాడై వృద్ధిక్షయములను పొందువాడై యున్నాడని ఆయనకు వికారములు ఉన్నవని చెప్పవలసివచ్చును. లోకమునందు వికారములు (మార్పులు) కల ప్రతిపదార్థములును నశించుచున్నవనుట ప్రత్యక్షమై యున్నది. జీవుడుకూడ వికారముకలవాడనిన నాశనమును చెందువాడనికూడ చెప్పవలసివచ్చును. ఇట్లుచెప్పుట మీకు సమ్మతముకాదుకదా. మఱియు మీరు బంధమోక్షములను ఒప్పుకొనియున్నారు. జీవుడనిత్యుడై నచో ఆబంధమోక్షములుకూడ సిద్ధింపవు. కావున జీవుడు అణుపరిమాణము కలవాడుగాగాని మహత్పరిమాణము గలవాడుగాగాని ఉండవలయునేకాని శరీరపరిమాణము కలవాడుగానుండుటకు వీలులేదని తాత్పర్యము.

అవ॥ మఱియొకదోషమును చూపుచున్నాడు.

సూ॥ ౩౬ ॥ అంత్యావస్థితేశ్చోభయ నిత్యత్వాదవిశేషః ॥

టీక॥ అంత్యావస్థితేశ్చ = కడపటిజీవపరిమాణము అట్లేయుండుటవలన ( మోక్షావస్థనుచెందిన జీవుడు అట్లేయుండును కావున ) ఉభయనిత్యత్వాత్ = ఇతరజీవులుకూడ ( జీవపరిమాణములుకూడ ) నిత్యములు కావలసివచ్చును. కావున, అవిశేషః= భేదమేమియు ఉన్నదనిచెప్పుటకు వీలులేదు.

తా॥ మోక్షముచెందిన జీవునకు ఏపరిమాణము ఉండునో ఆపరిమాణమే స్థిరమైనది. దానికే అంత్యపరిమాణమని పేరు. ఆపరిమాణము అణుపరిమాణముగాగాని, మధ్య పరిమాణముగాగాని, మహత్పరిమాణముగాగాని ఎట్లయినను యుండవచ్చును. అని జైనమతస్థులు చెప్పుదురు. దీనినిబట్టిచూచిన అణుపరిమాణము మొదలగునవన్నియును ఒకప్పుడుకాకున్న మఱియొకప్పుడైనను, నిత్యములుకావచ్చును. కావున అన్నియును సమానములేయని చెప్పవలసివచ్చును. అప్పుడు "జీవుడు శరీరపరిమాణముకలవాడు" అనిచెప్పు జైనసిద్ధాంతమునకు భంగమువచ్చునుకదా. మఱియు నిత్యములగుటచే పరమాణు పరిమాణము మొదలగు మూడుపరిమాణములును ఒకటేనియుందున్నవని ( అనగాజీవుడు పరమాణురూపుడుగాను మధ్యపరిమాణము

కలవాడుగాను మహత్పరిమాణము కలవాడుగానుకూడ నున్నాడని ) చెప్పవలసివచ్చును. అప్పుడు గజాది శరీరములయందును, పిపీలికాది శరీరములయందును జీవుడు ప్రవేశించుచున్నాడని చెప్పుటలో అనేక విరోధములు వచ్చును. యథార్థస్థితిలో పరిమాణములు నిత్యములై యున్నప్పుడు జీవునకు పైనజెప్పినమూటిలో ఏదైన నొకటిపరిమాణము కలదనుట యుక్తముగాని అన్నియును కలవనుట ప్రత్యక్షాదిసర్వ ప్రమాణములకును విరుద్ధమేకదా. ఇవియన్నియును గాక, ముక్తినిజెందిన జీవునకు కలపరిమాణము నిత్యమని యొప్పుకొనుచున్నారుకదా. అది అవయవములు చేరుటవలనగాని పోవుటవలనకాని కలిగినపరిమాణమా? లేక స్వతస్సిద్ధమైన పరిమాణమా? అవయవముల మార్పువలననే కలిగినదందురేని అదినిత్యమని చెప్పుటకు వీలులేదు. పుట్టుకగల ప్రతివస్తువును నశింపవలయుననుట నియమముకదా. అట్లుగాక ఆపరిమాణము స్వతస్సిద్ధమేయందురేని జీవునకెప్పటికిని ఆపరిమాణమొకటియే యుండవలయునుగాని శరీరానుగుణముగా మారుచుండుటకు వీలులేదు. కావున జీవునకు అణుపరిమాణముగాని మహత్పరిమాణముగాని కలదనవలయునేకాని శరీరపరిమాణము కలదని చెప్పుటకు వీలుండదు. ఇది మీకు సమ్మతము ( జైనులకుసమ్మతము ) కాదు కదా. కావున అప్రామాణికమగు ఈజైనసిద్ధాంతముచే మామతమునకేమియును భంగమురాదు. శ్రేయస్కాములగువారు ఈసిద్ధాంతము అంగీకరింపకూడదని తాత్పర్యము.

—(*) ౭. పత్యురసామంజస్యాధికరణమ్. (*)—

అవ॥ ఈఅధికరణమునందు పాశుపతమతమును ఖండించుచున్నాడు.

సూ॥ ౩౭॥ పత్యురసామంజస్యాత్ ॥

టీక॥ పత్యుః = పాశుపతమతస్థులు అనుమానప్రమాణముచే ప్రపంచమునకు నిమిత్తకారణమని చెప్పినపశుపతి,అసామంజస్యాత్ = సరియగు ఈశ్వరుడగుటకు వీలులేకపోవుటవలన, పాశుపతంమతం అసమంజసం = పాశుపతమతము యుక్తమైనదికాదు.

తా॥ పాశుపతమతస్థులు అనుమానప్రమాణముచేత ఈశ్వ

రుని సాధించి ఆ ఈశ్వరుడు ప్రపంచమునకు నిమిత్తకారణమనియు, ప్రధానాదులను ప్రేరేపించువాడనియు చెప్పుదురు. ఇదిదోషము. ఈశ్వరుడు నిమిత్తకారణముమాత్రమేయై ప్రపంచమును సృష్టించు నేని అందరను ఒకేరీతిగనే సృష్టింపవలయునుగాని ఉత్తమ మధ్యమ, అధమ భేదములచే అనేకవిధములుగా సృష్టించుటకు వీలులేదు. అట్లు సృష్టించునందురేని ఆపరమేశ్వరునకుకూడ మనవలెనే రాగద్వేషాదులుండవలసివచ్చును. ఇదియునుగాక ప్రత్యక్షమును బట్టిచూచిన రాగద్వేషాదులు లేక కార్యములయందు ప్రవర్తించువాడే లేదు కదా. దీనివలన ఈశ్వరుడు ఈశ్వరుడే కాకపోవలసివచ్చును. ఈదోషమువలన పాశుపతమతము సరియైనది కానేరదని తాత్పర్యము.

సూ॥ ౩౮॥ సంబంధానుపపత్తేశ్చ ॥

టీక॥ సంబంధ=ప్రధానాదులకును వానిని ప్రేరేపించు నీశ్వరునకునుగల సంబంధము, అనుపపత్తేః = ఉండుటకువీలులేకపోవుటవలన కూడ, పాశుపతమతం అసమంజసం= పాశుపతమతము సరియైనది కాదు.

తా॥ పై సూత్రమునందు చూపబడిన దోషములేగాక మఱియొకదోషముకూడ కలదు. ఏదియనగా:— ఈశ్వరుడు ప్రధానాదులను ప్రేరేపించునని చెప్పినచో ప్రధానాదులకును ఈశ్వరునకును సంబంధమొకటికలదని చెప్పవలయును. సంబంధములేకపోయిన "వీడు దీనిని ప్రేరేపించుచున్నాడు" అనిచెప్పుటకు వీలులేదుకదా. సంబంధము రెండువిధములైనది. కావున ప్రధానాదులకును ఈశ్వరునకును గల సంబంధము సంయోగ సంబంధమా? సమవాయ సంబంధమా? అని విచారించి నిర్ణయింపవలసియున్నది. బాగుగ విచారించినచో ప్రధానాదులకును ఈశ్వరునకును ఏవిధమైన సంబంధము ఉన్నదని చెప్పుటకు వీలులేదు. ఎట్లనగా:—ప్రేర్యులగు ( ఈశ్వరునిచే ప్రేరేపించబడువారగు ) ప్రధానపురుషులకును ప్రేరకుడగు (ప్రధానపురుషులను ప్రేరేపించువాడగు ) ఈశ్వరునకును సంయోగ సంబంధము ఉండుటకు వీలులేదు. పైనవర్ణించిన ప్రేర్య, ప్రేరకులు అవయవములు లేనివారు సర్వవ్యాపకులు. ఇట్టివారు ఒకరితోనొకరు చేర

టకు ఎట్లువీలుపడును. ఇట్టి సమవాయి సంబంధము ఉండుటకుకూడ వీలు లేదు. ప్రేర్యములు కార్యములు (ఒక కారణమువలన పుట్టినవి) కాకపోవుటచేత ప్రేర్యప్రేరకులు కార్యకారణములని చెప్పుటకును ఇదియే కారణముగువలన వానికి ధర్మ, ధర్మిభావము (ప్రేర్యములు ధర్మము ప్రేరకులుధర్మి. అను ఏర్పాటు) కలదనుటకును వీలు లేదు కదా. ధర్మధర్మిభావము లేకున్న సమవాయి సంబంధ ముండదనుట స్పష్టము. ఈకారణముల నన్నిటిని విమర్శించినూచిన ప్రేర్యప్రేరకు లకు ఏవిధమగు సంబంధమును లేదనవలసి వచ్చును. దీనివలన ఈశ్వ రుడు నిమిత్తకారణమై ప్రధానపురుషులను ప్రేరేపించుచు వారిద్వా రా ప్రపంచసృష్టి చేయుచున్నాడనను సిద్ధాంతము యుక్తియుక్తము కాదని తాత్పర్యము.

సూ॥ ౪౫॥ అధిష్ఠానానుపపత్తేశ్చ ॥

టీక॥ అధిష్ఠాన = ఈశ్వరుడు ప్రధాన పురుషులకు అధిష్ఠాన మగుటకు, (ప్రేరకుడగుటకు) అనుపపత్తేశ్చ = వీలులేక పోవుట వలనకూడ, పాశుపతమతం అసమంజసం = పాశుపత మతము సరి యైనది కాదు.

తా॥ లోకమునందు కుమ్మరివాడు మొదలగు నిమిత్త కారణ ములు మట్టి మొదలగు పదార్థములను ప్రేరేపించుచున్నట్లు ఈ నిమి త్త కారణమగు ఈశ్వరుడు ప్రధానమును ప్రేరేపించుచున్నాడనవల యునుగాని వేరేమియు చెప్పుటకు వీలులేదు. యథార్థ స్థితిలో పై నిరూపించినట్లు సిద్ధాంతము చేయుటకూడ దోషరహితము కానేర దు. కుమ్మరవాడు మొదలగు వారిచేత ప్రేరేపింపబడు మట్టి మొద లగునవి ప్రత్యక్షములు. ప్రధానము రూపాదులు లేనిదగుటచేత అప్రత్యక్షమైనది. ఈ భేదమువలన అప్రత్యక్షమగు ప్రధానమును ప్రేరేపించు విషయములో ప్రత్యక్షమగు కులాలమృత్తికాది దృష్టాం తము సరిపడదుకదా. కావున ఈశ్వరుడు కేవలము నిమిత్తకారణమే యనియు ప్రధానాదులను ప్రేరేపించి తన్మూలమున సృష్టి చేయుననియు చెప్పు పాశుపత మతము యుక్తిశూన్యమైనదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుట సరికాదు. రూపాదులు లేనివైనను ఇం

ంద్రియములు పురుషునిచే ప్రేరేపించ బడుచున్నట్లు ప్రధానము కూడ రూపాది హీనమైనను ఈశ్వరునిచే ప్రేరేపించ బడవచ్చును. అనిన నదియును సరికాదని చెప్పు చున్నాడు.

సూ॥ ౪౦॥ కరణవచ్చేన్న భోగాదిభ్యః ॥

టీక॥ కరణవత్ = ఇంద్రియములవలె ( ఇంద్రియములను పురుషుడు [ జీవుడు ] ప్రేరేపించుచున్నట్లు అనుట ) ప్రధానస్యాపి ప్రేర్యత్వం=ప్రధానముకూడ ప్రేరేపింప బడుచున్నది. ( ప్రధానమును కూడ ఈశ్వరుడు ప్రేరేపింప వచ్చుననుట ) ఇతిచేత్= అనిచెప్పుదు వేని, న=అది యుక్తము గాదు, జీవస్య భోగాదిభ్యః = జీవునకు సుఖ దుఃఖానుభవము మొదలగునవి కలిగియుండుట వలన ( జీవునకు భోగాదులు కలవు. ఈశ్వరునకు లేవుకదాయనుట. )

తా॥ " రూపాదులు లేని ఇంద్రియములకు జీవుడు అధిష్ఠానమై ( ప్రేరకుడై ) యున్నట్లు ప్రధానమునకు ఈశ్వరుడుకూడ అధిష్ఠానము కావచ్చును. అనిచెప్పుట సరికాదు. జీవునకు సుఖ దుఃఖానుభవము కలదు. కావున ఆ అనుభవమును కలిగించు కొనుటకై ఆయన ఇంద్రియాదులకు అధిష్ఠానము కావచ్చునుగాని సుఖదుఃఖానుభవము లేనివాడగుటచే ఈశ్వరుడు మాత్రము ప్రధానమునకు అధిష్ఠానమగుటకు వీలులేదు. ఆయనకుకూడ సుఖదుఃఖానుభవములు కలవని యొప్పుకొందురేని అప్పుడాయన ఈశ్వరుడే కాక పోవలసివచ్చును. కావున బహుదోష యుక్తమగుటచే పాశుపతమతము సరియైనది కాదని తాత్పర్యము.

అవ॥ మతియొక విషయమునందు దోషమును చూపుచున్నాడు.

సూ॥ ౪౧॥ అంతవత్త్వమసర్వజ్ఞతావా ॥

టీక॥ పాశుపతమతే=పాశుపతమతమునందు, అంతవత్త్వం= ప్రధాన పురుషులకు అనిత్యత్వముగాని, అసర్వజ్ఞతావా=ఈశ్వరుడు సర్వజ్ఞుడు కాకపోవుటకాని, సంభవతి=సంభవించును.

తా॥ ప్రధానము పురుషుడు ఈశ్వరుడు ఈముగ్గురును వినాశము లేనివారనియు అందు ఈశ్వరుడు సర్వజ్ఞుడనియు పాశుపత మతస్థులు చెప్పుదురు. ఇది సరికాదు. ఈశ్వరుడు సర్వజ్ఞుడైనచో ఆయ

నకు ప్రధానపురుషుల పరిమాణము తెలియునా? తెలియదా? తెలియునందురేని ప్రధానపురుషులకు వినాశము కలదనవలయును. పరిచ్ఛిన్నమగు వస్తువు లన్నియును వినాశము గలవనుటయును జ్ఞేయములకు (జ్ఞానముచే తెలిసి కొనదగినవానికి) జ్ఞాన పరిచ్ఛిన్నత్వము (జ్ఞానముచే నావరింప బడుటలేక విభాగింప బడుట) తప్ప దనుటయును నియమము కదా, ఇట్లుగాక ఈశ్వరుడు ప్రధానాదుల నెఱుంగలేడనిచో ఆతఁడు సర్వజ్ఞుడు కాక పోవలసి వచ్చును. ఈ విధముగా అనేకదోషములు కలది యగుటచేత పాశుపతమతము అప్రామాణికము. ఈ నిరూపణముచే సేశ్వర సాంఖ్యులు (ఈశ్వరుడు ఒకడున్నాడని అంగీకరించు సాంఖ్యులు) యోగులు శైవులు వైశేషికులు మొదలగువారి మతములన్నియును "ఈశ్వరుడు నిమిత్తకారణమే కాని ఉపాదాన కారణముకాడు" అను నంశమునందు ఖండింపబడినవి "జగత్కారణము ప్రధానము" అను మొదలగు ఇతర అంశములను ఖండించుటకు ఇంతకుపూర్వము ౧ వ అధ్యాయము ౨ వ అధ్యాయము మొదటి పాదము మొదలగు స్థలములయందు చేయబడిన విచారణలే చాలును. కావున ఈశ్వరుడు నిమిత్త కారణమని చెప్పు సర్వమతములును అప్రామాణికము లేయని తెలిసికొనవలయునని తాత్పర్యము.

—(*) ౮. ఉత్పత్త్య సంభవాధి కరణమ్. (*)—

అవ॥ ఈవిధముగా ఈశ్వరుడు నిమిత్త కారణము మాత్రమేయని చెప్పు వేదవిరుద్ధములగు సిద్ధాంతములను ఖండించి వేదములకు సంపూర్ణముగా విరుద్ధము కాకపోయినను కొన్ని అంశములయందు మాత్రము కొంచెము భేదము కలిగియున్న పాంచరాత్ర సిద్ధాంతమును ఈ అధికరణముచే ఖండించుచున్నాడు.

సూ॥ ౪౨॥ ఉత్పత్త్య సంభవాత్ ॥

టీక॥ ఉత్పత్త్య సంభవాత్ = పరమేశ్వరునుండి జీవుడు పుట్టుననుట యుక్తముకాదు. కావున, పాంచరాత్రికాభిమతం అసమంజసం = పాంచరాత్రికులమతము సరియైనదికాదు.

తా॥ భగవంతుడగు వాసుదేవుడు నిరంజనుడు నిర్వికారుడు

ప్రపంచమునకు ఉపదాన కారణము నిమిత్త కారణముకూడ ఆయన యే. ఆ వాసుదేవుని వలన సంకర్షణుడను జీవుడు పుట్టును. (వారి ఆగమమునందు జీవునకు సంకర్షణుడని సంజ్ఞ.) ఆ సంకర్షణుని నుండి ప్రద్యుమ్నుడను పేరుతో మనస్సుపుట్టును. ఆప్రద్యుమ్నుని నుండి అనిరుద్ధ సంజ్ఞగల అహంకారము జనించును. అని భాగవతులు చెప్పుదురు. ఈ సంకర్షణుడను జీవుడు భగవంతుని నుపాసించినేని నీనికి భగవత్ప్రాప్తి రూపమగు మోక్షము కలుగుననికూడ వారుసిద్ధాంతము చేసియున్నారు. ఈ సిద్ధాంతము వేదమునకు సంపూర్ణముగా విరుద్ధముకాదుగాని కొన్ని అంశములయందు మాత్రము భేదముకలిగియున్నది. జీవుడు పరమేశ్వరునివలన పుట్టుననుట యుక్తి యుక్తము కాదుగదా. అట్లు సిద్ధాంతము చేసినయెడల పుట్టుక గలపదార్థముల కన్నిటికిని నాశనము కలదనుట నియమము గావున ఈ జీవుడుకూడ నశింప వలసివచ్చును. ఇట్లు జీవుడు అనిత్యుడన్యేనేని ఆ మతస్థులు చెప్పు మోక్షము నెవరికి కలుగును. ఎవనికిని కలుగుటకు వీలు లేదు కదా. కావున పాంచరాత్రాగమమునందు ఈ విషయము వేదవిరుద్ధమైన దగుటచే శ్రేయస్కాములచేత గ్రహింపబడ తగినది కాదని తాత్పర్యము.

సూ॥ ౪౩॥ నచకర్తుః కరణం ॥

టీక॥ కర్తుః=కర్తవలన, కరణం=సాధనము, నోత్పద్యతేచ= పుట్టదు

తా॥ జీవునివలన మనస్సు పుట్టుననుటకూడ సరికాదు. జీవుడు కర్త (ఒకపనిని చేయువాడు) మనస్సు కరణము (పనిచేయుటకు సాధనమైనది.) ఇట్లగుటచే కర్తనుండి కరణముపుట్టుటకు వీలులేదు. లోకమునందు కాని వేదమునందుకాని ఈ విషయమునందు దృష్టాంతముగాని ప్రమాణముగాని లేదుగదా. కావున ఈసిద్ధాంతముకూడ భ్రాంతి మూలకమైనదియే యని తాత్పర్యము.

సూ॥ ౪౪॥ విజ్ఞానాదిభావేవాతదప్రతిషేధః ॥

టీక॥ సంకర్షణాదీనాం = సంకర్షణుడుమొదలైన మూర్తులకిని, విజ్ఞానాదిభావే = విజ్ఞాన బల ఐశ్వర్యాదులు కలవని, అంగీకృతేవ=

అంగీకరించి నప్పటికిన్ని, తద ప్రతిషేధః = ఉత్పత్త్య సంభవ దోషము పోనేరదు.

తా॥ సంకర్షణుడు అనిరుద్ధుడు ప్రద్యుమ్నుడు ( జీవ అహంకార మనుస్సులు ) ఈముగ్గురును వాసుదేవునితో సమానులే. కావున వీరు వాసుదేవునివలన జనించినను, నశింప వలసిన యవసరము లేదు. అని చెప్పుదురేమో అప్పటికిని ఉత్పత్త్య సంభవదోషము పోనేరదు. వాసుదేవుడు మొదలు నలుగురును సమానులే అయిన యెడల ఒకరికంటే నొకరికి అతిశయ మేమియును లేదు కావున ఒకరినుండి యొకరు పుట్టుచున్నారనుటకు వీలు పడుకదా. ఇదియునుగాక సమాన స్వభావములుగల నలుగురు ఈశ్వరులు ( స్వతంత్రులు ) ఉన్నారనుటవలన ప్రయోజన మేమియును లేదు. ఒకనివలననే సర్వ కార్యములును సిద్ధించుచుండగా సమానస్వభావములుగల నలుగుర నంగీకరింపవలసిన పని యేమి? ఇదియునుగాక వాసుదేవుడే పరతత్త్వమను సిద్ధాంతమునకుగూడ భంగమువచ్చును. అందరును సమానులే అయినయెడల వాసుదేవుడొకడే పరతత్త్వమనియు ఇతరులు కారనియు నిరూపించుటకు నాధార మేమియున్నది. కావున ఎట్లును పాంచరాత్రాగమము నిర్దోషము కానేరదని తాత్పర్యము.

సూ॥ ౪౫॥ విప్రతిషేధాచ్చ ॥

టీక॥ విప్రతిషేధాచ్చ విరుద్ధవిషయములను చెప్పుటవలన కూడ, పాంచరాత్ర మతమసమంజసం = పాంచరాత్రమతము సరి కాదు.

తా॥ పాంచరాత్రులు జ్ఞానైశ్వర్యాదులు భగవంతుడగు వాసుదేవుని గుణములని ఒకచోటను అవి వాసుదేవుడేయని మఱియొక్క చోటను చెప్పుచుందురు. మఱియు “ నాలుగువేదములనుజూచి వానివలన శ్రేయస్సును చెందనేరక శాండిల్యమహాముని ఈపాంచరాత్రాగమమును అభ్యసించెను ” అను మొదలగు వేదనిందకములగు వాక్యములుకూడ వారిఆగమమునందు అచ్చటచ్చట కనుపడుచున్నవి. ఇట్టి విరుద్ధార్థములు చెప్పుచుండుటచేత పాంచరాత్రాగమము సరియైనదికాదు. ఈవిధముగా విమర్శించిచూచిన పరమతములలో దేని

వలనకూడ మన అద్వైతసిద్ధాంతమునకు భంగమురానేరదని తాత్ప.

రచనానుపపత్తేర్ద్వాపంచచత్వారింశత్ ౮॥ ४२॥

రచనా, మహ, దుభయ, సముదాయ, నాభావ, నైకస్మిన్, పత్త్యు, రుత్పత్తిరష్టౌ.

ఇతి శ్రీబ్రహ్మసూత్రే ద్వితీయస్యాధ్యాయస్య ద్వితీయః పాదః.

ఇట్లు ద్వితీయాధ్యాయమునందు ద్వితీయపాదము

ముగిసెను.



ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## ద్వితీయాధ్యాయము - తృతీయపాదము.



—(*) ౧ వియదధికరణమ్. (*)—

అవ॥ పైపాదమునందు వేదవిరుద్ధములగు మతములనన్నిటిని ఖండించి వేదాంతమతము నిర్దోషమని నిరూపించియున్నాడు. ఈపాదమునందు వేదవాక్యములయందుగల పరస్పర విరోధములను పరిహరించి వేదాంతసిద్ధాంతమును దృఢపరుపబోవుచు మొట్టమొదట ఆకాశమునుగూర్చి ఈ అధికరణమునందు విచారించుచున్నాడు.

సూ ॥ ౧ ॥ నవియదశ్రుతేః ॥

టీక॥ అశ్రుతేః = వేదమునందు చెప్పబడియుండక పోవుటవలన, వియత్ = ఆకాశము, నఉత్పద్యతే = పుట్టునని చెప్పుటకు వీలులేదు

తా॥ ఛాందోగ్యశ్రుతియందు తత్తేజోసృజత (ఆపరబ్రహ్మ

ము అగ్నిని సృజించెను ) అనుమొదలగు వాక్యములచేత అగ్ని, జల, పృథువులయొక్క సృష్టి చెప్పబడియున్నదేకాని ఆకాశవాయువుల యొక్క సృష్టి చెప్పబడలేదు. కావున ఆకాశముపుట్టినదని చెప్పుటకు వీలులేదని తాత్పర్యము. ( ఇది పూర్వపక్షసూత్రము )

సూ॥ ౨॥ అస్తితు ॥

టీక॥ తైత్తిరీయకే = తైత్తిరీయోపనిషత్తునందు, ఆకాశోత్పత్తిశ్రుతిః = ఆకాశముపుట్టుచున్నదని చెప్పుశ్రుతి, అస్తితు = కలదు గదా, అతఃవిరోధః = అందువలన శ్రుతులకు పరస్పర విరోధము వచ్చును.

తా॥ ఛాందోగ్యోపనిషత్తునందు ఆకాశము పుట్టుచున్నదని చెప్పబడియుండలేదు. తైత్తిరీయోపనిషత్తునందు మాత్రము, "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" ( ఆ పరమాత్మనుండి ఆకాశము పుట్టును. ) అని ఆకాశోత్పత్తి చెప్పబడియున్నది. ఇట్లు చెప్పుటచేత శ్రుతులకు పరస్పరవిరోధము వచ్చునుగదా. కావున ఆకాశముపుట్టునని చెప్పుటయే యుక్తముగాదని తాత్పర్యము.

అవ॥ తైత్తిరీయోపనిషత్తునందు ఆకాశోత్పత్తి చెప్పబడియున్నదీ కావున ఆశ్రుతిని ప్రమాణముగా చేసికొని ఆకాశము పుట్టుచున్నదనవచ్చునుకదా. అనిన అట్లుకాదని ( పూర్వపక్షి ) చెప్పుచున్నాడు.

సూ ॥ 3 ॥ గౌణ్యసంభవాత్ ॥

టీక॥ సా=ఆతైత్తిరీయశ్రుతి, గౌణీ=గౌణమైనది ( ముఖ్యమైనదికాదు ) కుతః=ఎందుకనగా, ఆకాశస్య = ఆకాశము, నిరవయవత్వాత్ = అవయవములు లేనిదగుటవలన, తదుత్పత్తిః= దానియొక్క ఉత్పత్తి, అసంభవాత్ = సంభవింపదు కావున ( వీలులేదు. )

తా॥ తైత్తిరీయశ్రుతి ముఖ్యమైనదికాదు. ( అనగా దానిని బట్టి ఆకాశోత్పత్తి నిర్ణయించుటకు వీలులేదనుట ) మఱియు ఆకాశము పుట్టుటకేవీలులేదు. దానికి అవయవములు లేవుకదా. అవయవములుగల వస్తువులే పుట్టుచున్నవనుట లోకమునందు కనుపడుచున్నది. కావున ఆకాశము పుట్టుననుటకును వీలులేదు. తైత్తిరీయశ్రుతి

ఆకాశోత్పత్తినిగూర్చి ముఖ్యముగా జెప్పుచున్న దనుటకుకూడ వీలు లేదు. ప్రత్యక్షవిరుద్ధములగు ఇట్టియంశములను చెప్పుననిన యెడల శ్రుతి ప్రమాణము కాకపోవలసివచ్చునుకదా. కావున ఆకాశోత్పత్తి సంభవింపదని తాత్పర్యము.

అవ॥ ఈవిషయమును దృఢపరుచుటకై పూర్వపక్షి మఱియొక హేతువును జూపుచున్నాడు.

సూ ॥ ౪ ॥ శబ్దాచ్చ ॥

టీక॥ శబ్దాచ్చ = మఱియొక శ్రుతివలనకూడ, సాగౌణి = ఆ ఆకాశోత్పత్తి శ్రుతిప్రధానము కాదు.

తా॥ "వాయుశ్చాంతరిక్షం చైతదమృతం" ఈవాయువు, ఆకాశము ఇవి మోక్షస్వరూపమైనవి ( లేకనాశనములేనివి ) అను వాక్యముచే ఆకాశము నాశనములేదని చెప్పబడియున్నది. ఉత్పత్తిగలవాటి కన్నిటికిని నాశముండవలయుననుట నియమమగుటచే "ఆకాశము ఉత్పత్తిగలది" అని చెప్పినయెడల దానికి వినాశము లేదనిచెప్పుటకు వీలులేదుకదా. కావున పై ఉదహరించిన శ్రుతిననుసరించి చూచినయెడల ఆకాశమునకు ఉత్పత్తిలేదనియే చెప్పవలయును. ఈకారణమువలన తైత్తిరీయశ్రుతి ప్రధానముకాదనియే ఏర్పడునని తాత్పర్యము.

అవ॥ ఇట్లుచెప్పుట సరికాదు. "ఆత్మన ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః" ( బ్రహ్మనుండి ఆకాశముపుట్టెను. ఆకాశము నుండి వాయువుపుట్టెను ) అను మొదలగువాక్యములయందు "సంభూతః (పుట్టెను)" అను శబ్దమొకటియే ఆకాశమునుగుఱించి చెప్పునప్పుడు గౌణముగాను ( అప్రధానముగాను ) ఇతర భూతములను గుఱించి చెప్పునప్పుడు ముఖ్యముగాను ఉండుటకు వీలులేదు కదా. కావున తైత్తిరీయశ్రుతి అప్రధానమైనదికాదు. ఆశ్రుతినిబట్టి ఆకాశోత్పత్తి అంగీకరింపవచ్చును. అనిన, అట్లు కాదని (పూర్వపక్షి) చెప్పుచున్నాడు.

సూ ॥ ౫ ॥ స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్ ॥

టీక॥ బ్రహ్మశబ్దవత్ =భృగువల్లియందుండు బ్రహ్మశబ్దమునకు

వలె, ఏకస్యచ = ఒక్క శబ్దమునకే, క్వచిత్ గౌణత్వం ముఖ్యత్వంచ = ఒక చోట గౌణముగాను మఱియొక చోట ముఖ్యముగాను ఉండుట, స్యాత్ = కలుగ వచ్చును.

తా॥ భృగువల్లియందు "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ తపో బ్రహ్మ" (తపస్సుచేత బ్రహ్మను తెలిసి కొనుటకు ప్రయత్నించుము తపస్సే బ్రహ్మ) అను వాక్యములలో ఒక బ్రహ్మశబ్దమే "తపసా" అను మొదలగు స్థలమునందు ముఖ్యముగాను "తపో బ్రహ్మ" అను స్థలమునందు గౌణముగాను ప్రయోగింపబడియున్నది. ఇదే విధముగా సంభూతశబ్దముకూడ ఒకచోట గౌణముగాను మఱియొకచోట ముఖ్యముగాను ఉన్నదన్నను విరుద్ధము లేదు. కావున తైత్తిరీయ శ్రుతి గౌణమే యనియు ఆ కారణమువలన "ఛాందోగ్య శ్రుతి యందు ఆకాశము పుట్టలేదనియున్నది. తైత్తిరీయమునందు ఆకాశము పుట్టునని యున్నది." అను విరోధము లేదనియు పైసన్నిధిని విమర్శించి చూచిన ఆకాశము పుట్టుచున్నదనుటకు వీలు లేదనియు తాత్పర్యము.

వ॥ ఇవ్విధముగా అయిదు సూత్రములచేతను పూర్వపక్షమును చూపి ఈ క్రింది రెండు సూత్రములచే సూత్రకారుడు స్వమత సిద్ధాంతమును చెప్పుచున్నాడు.

సూ॥ ౬॥ ప్రతిజ్ఞాహానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః ॥

టీక॥ ఆకాశోత్పత్త్యనభ్యుపగమే=ఆకాశము పరబ్రహ్మమునుండి పుట్టుచున్నదని యొప్పుకొననప్పుడు, అవ్యతిరేకాత్=కారణమగు పరబ్రహ్మమునుండి కార్యమగు ఆకాశము వేరగుటకు వీలు లేదు. కావున, శబ్దేభ్యః=కార్యకారణములకు అభేదమును దృష్టాంతపూర్వకముగా సూచించు వేదవాక్యముల ననుసరించి ప్రతిజ్ఞ ఒక కారణమును తెలిసికొనిన కార్యములన్నిటిని తెలిసి కొనవచ్చునను ప్రతిజ్ఞకు, అహానిః=హానిలేక పోవుట, సంభవతి=కలుగుచున్నది.

తా॥ ఛాందోగ్య శ్రుతియందు "కారణమగు వస్తువు నొకదానిని తెలిసికొనిన కార్యములన్నిటిని తెలిసికొనినట్లగును" అని ప్రతిజ్ఞచేసి దానిని నిరూపించుటకు "యథా సోమ్య" అను మొదలగు అనేక దృష్టాంతములచేత "కార్యకారణములకు భేదములేదు" అని నిరూ

పింపబడియున్నది. "ఆకాశమునకు పుట్టుక లేదు. అది పరబ్రహ్మమునకంటే వేరైన వస్తువు" అని చెప్పిన యెడల పైన చూపిన ప్రతిజ్ఞకు విరోధము వచ్చును. ఎట్లనగా:—వేదాంత వాక్యములచే ప్రతిపాదింపబడు పరబ్రహ్మమే జగత్కారణమనియు ఆ పరబ్రహ్మమునొకదానిని తెలిసికొనిన సర్వమును తెలిసికొనినట్లగుననియు ఆ శ్రుతి నిరూపించుచున్నది. పరబ్రహ్మమునకంటే వేరుగా కార్యముగాని (ఉత్పత్తిలేని) ఆకాశముకూటి యున్నయెడల పరబ్రహ్మజ్ఞానమువలన ఆకాశజ్ఞానము కలుగనేరదుగదా. కాన సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు భంగమువచ్చును. కావున ఆప్రతిజ్ఞకు భంగము రాకుండుటకై ఆకాశముకూడ పరబ్రహ్మమునుండి పుట్టినదియే యని యొప్పుకొనవలెయును. ఆకాశోత్పత్తిని చెప్పు తైత్తిరీయశ్రుతి యర్థవంతమనియు దానివలన ఆకాశమునకు ఉత్పత్తిలేదనుమాటశ్రుతివిరుద్ధమనియు నెంచుటకు వీలులేదు. ఏమనగా ఛాందోగ్యశ్రుతియందు అగ్నిని సృష్టించెనని మొట్టమొదటనే చెప్పబడియున్నది. తైత్తిరీయశ్రుతియందు ఆయగ్ని మూడవదిగా చెప్పబడియున్నది. దీనిబట్టి పైనుదాహరించిన ఛాందోగ్యశ్రుతికూడ "అగ్ని ఆకాశ వాయువులకు తర్వాత సృజింపబడెను" అనుటయే అభిప్రాయమని స్పష్టపడుచున్నది. అట్లుకాకపోయిన ఆకాశవాయువులనుగూర్చి చెప్పనందుకు అర్థము లేకపోవలసివచ్చును. "కావున పైన ఉదహరించిన ఛాందోగ్య తైత్తిరీయ శ్రుతులు రెండును ఒకటే వాక్యము." అని తెలిసికొనవలెయును. ఇట్లు విమర్శచేసినచో శ్రుతులకు పరస్పర విరోధము లేదనుటయు ఆకాశమునకు ఉత్పత్తి కలదని ఒప్పుకొనవలెయు ననుటయు సిద్ధాంతము చేయబడినది తాత్పర్యము.

అవ॥ ఈసిద్ధాంతమును దృఢపరచుటకై పతీతిమికే కారణమును చూపుచున్నాడు.

సూ॥ ౭॥ యావద్వికారంతు విభాగో లోకవత్ ॥

టీక॥ లోకవత్=లోకమునందువలె, విభాగః = ఇతరవస్తువులకంటే భేదము, యావద్వికారం = వికారమును (కార్యమును) వ్యాపించియుండును. (అనగా ఏయేవస్తువు ఉత్పత్తి కలదియైయుండు

నో ఆయా వస్తువు ఇతర వస్తువులకంటే భేదము కలదియై యుండు ననుట నియమము. )

తా॥ లోకమునందు విభాగము ( భేదము ) ఎక్కడెక్కడ కనుబడుచున్నదో ఆ స్థలము లందంతయు కార్యత్వము ( ఒకదాని వలన పుట్టుట ) కనుబడుచున్నది. ఎట్లనగా ఘటము పటమునకంటే వేరైనది. అది కార్యమైయున్నది. ఇదిగాక చూచిన ఎచ్చటెచ్చట భేదము కనుబడుచున్నదో ఆ వస్తువు లన్నియును కార్యము లేయై యుండవలయునని నియమము చెప్పుచున్నది. శ్రుతులవలనను యుక్తుల వలనను " భేద విరహితుడు. " అని నిరూపింపబడిన పరబ్రహ్మము కార్యము కాదనుట దీనివలన స్పష్టమగుచున్నదికదా. ఆకాశము నందన్నను, భేదము కనుపడుచునే యున్నది. భూమి మొదలగు ఇతర భూతములకంటే ఆకాశము వేరనుట ప్రత్యక్షముగదా, కావున ఘటమునకంటే వేరగు పటము ఎట్లు కార్యమో పృథివ్యాదులకంటే వేరగు ఆకాశముకూడ అట్లే కార్యము. ఈ విమర్శవలన ఆకాశమునకు ఉత్పత్తి కలదనుట సిద్ధాంతము చేయబడియున్నది, ఆకాశము అమృతస్వరూపమని చెప్పుట ఔపచారికము ( పరబ్రహ్మము సర్వవ్యాపకుడగుటచే ఆ పరబ్రహ్మమును గూర్చి ఆకాశరూపునిగా చెప్పుచు, అతడు అమృతస్వరూపుడని చెప్పుటకై ఆకాశము అమృతస్వరూపము ) అని చెప్పబడినదే కాని ప్రత్యక్షాకాశమునుగూర్చి చెప్పుటకు కాదు. కావున వేదాంత సిద్ధాంతమునకు భంగమెట్లునూ కలుగనేరదని తాత్పర్యము.

—(*) ౨. మాతరిశ్వ వ్యాఖ్యానాధికరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా ఆకాశము పుట్టుచున్నదని నిరూపించి ఇట్లే వాయువుకూడ పుట్టుచున్నదని ఈ యధికరణముచే నిరూపించుచున్నాడు.

సూ॥ ౮॥ ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః ॥

టీక॥ ఏతేన=పై అధికరణమునందు చూపిన యుక్తులచేతనే, మాతరిశ్వా = వాయువుకూడ, వ్యాఖ్యాతః= పుట్టుకగలవాడని నిర్ణయించబడెను.

తా॥ ఛాందోగ్య శ్రుతియందు వాయువుయొక్క ఉత్పత్తిని గూర్చికూడ చెప్పబడక పోవుటవలనను తైత్తిరీయశ్రుతియందుమాత్రము దానినిగూర్చి చెప్పబడి యుండుటచేతను పై అధికరణము నందు చూపినపూర్వపక్షములన్నియు వాయువు విషయమునందుకూడ చేయబడవచ్చును. సిద్ధాంతముకూడ పై యధికరణమునందు చూపినట్లే చేయబడ వచ్చును. కావున వాయువుకూడ ఉత్పత్తి కలదియే యని ఈ యధికరణముచే సిద్ధాంతము చేయబడెనని తాత్పర్యము.

—(*) ౩. అసంభవాధికరణము. (*)—

అవ॥ "ఆకాశ వాయువులకు వలెనే పరబ్రహ్మమునకుకూడ పుట్టుకయుండవచ్చును" అను సంశయము రాగా దానిని ఈ అధికరణముచే నివారించుచున్నారు.

సూ॥ ౯॥ అసంభవస్తు సతోఽనుపపత్తేః ॥

టీక॥ సతః=సత్పదార్థమగు పరబ్రహ్మముయొక్క, ఉత్పత్తేః=పుట్టుక, అసంభవః=కలుగదు, కుతః ఎందువల్లననగా, అనుపపత్తేః=సద్వస్తువునకు (ఉన్నపదార్థమునకు) ఉత్పత్తి కలదనుటకు వీలు లేనందున (వీలు లేదు.)

తా॥ అవతారికయందు చూపబడిన సంశయము సరియైనది కాదు. పరబ్రహ్మము సత్సామాన్యస్వరూపుడగుటచే (సర్వపదార్థములయందును కనుపడుచున్న ఉనికయే పరబ్రహ్మ మగుటచేననుట) మఱియొక సత్పదార్థమువలన పుట్టినదగుటకు వీలులేదు. లోకమునందు సామాన్యరూపమగు మట్టివలన విశేషస్వరూపమగు ఘటము మొదలగునవి పుట్టుటను చూచుచున్నాము కాని సామాన్యమువలన మఱియొక సామాన్యముగాని విశేషమువలన సామాన్యముగాని పుట్టుచుండుటను చూచుటలేదు. (విశేషమనగా భేదము సామాన్యమనగా సర్వవిశేషములయందును వ్యాపించి యుండు పదార్థము. ఉదాహరణము. కుండలయందన్నిటియందును మట్టియున్నదికదా. కావున మట్టి సామాన్యము.) కావున సత్సామాన్యరూపమగు బ్రహ్మము మఱియొక సత్సామాన్యమువలనగాని, సద్విశేషము వలనగాని పుట్టుటకు వీలులేదు. ఇక అసత్తునుండి సత్పదార్థము జనించు

ననుటకు నేమాత్రము అవకాశము లేదుగదా. కావున సద్రూపమగు పరబ్రహ్మము పుట్టుననుటకే వీలుగాదని తాత్పర్యము.

—(*) ౪. తేజోధికరణమ్. (*)—

అవ॥ "తత్తేజో సృజత" అని ఛాందోగ్య శ్రుతియందు అగ్ని బ్రహ్మము వలన బ్రహ్మము నుండియే పుట్టెననియు "వాయోరగ్నిం" అని తైత్తిరీయశ్రుతి వాయువు నుండియే అగ్ని పుట్టెననియు చెప్పబడుచున్నది. ఈ రెండు శ్రుతులకును విరోధము కలదా లేదా అను సంశయము నివృత్తి చేయుటకై మునివారించుచున్నారు.

సూ॥ ౧౦॥ తేజోతస్తథాహ్యాహ ॥

టీక॥ అతః=ఈ వాయువు నుండియే, తేజః=తేజస్సు పుట్టినది, శ్రుతిః=వేదము, తథా=అట్లనే అహహి=చెప్పుచున్నదిగదా.

తా॥ వాయువే అగ్నికి కారణమని తైత్తిరీయ శ్రుతి చెప్పుచున్నది. ఈ శ్రుతికిని ఛాందోగ్య శ్రుతికిని విరోధ మేమియును లేదు. ఇవి రెండును ఏకవాక్యమే అని మొదటి అధికరణము నందు నిరూపించి యున్నాము. కావున ఛాందోగ్య శ్రుతికి "వాయు రూపుడైన పరబ్రహ్మము నుండి అగ్ని జనించెను." అనియే అర్థము చెప్పవలయును. మరియు పై రెండు శ్రుతులకును విరోధము కలదని సాధించువారు తైత్తిరీయ శ్రుతియందలి "వాయోః" అనుపంచమ విభక్తికి "వయస" అని అర్థము చెప్పవలయును (అనగా వాయువుకంటె తరువాత అగ్ని పుట్టెను. అనే అర్థమును కల్పింపవలయు ననుట) అట్లు కల్పించుటకు వీలులేదు. "ఆత్మన ఆకాశ స్సంభూతః" అని ఆరంభమునందును "పృథివ్యా ఓషధయః" అను మొదలు కొని అంతమునందును కారణవాచకముగా (కారణమును చెప్పునవిగా) పంచమీ విభక్తి ప్రయోగించ బడుచుండగా నడుమ "వాయోః" అను నొకస్థలమునందుమాత్రము "వరుస" అను అర్థమును సూచించుటకై పంచమీ విభక్తి ప్రయోగింప బడియున్నదనుట అయుక్తముగదా. కావున పై శ్రుతులకు విరోధమే యును లేదనియు అగ్నిభూతము వాయువును పుట్టనదియేకాని శుద్ధబ్రహ్మమునుండి పుట్టినది కాదనియు తెలిసికొనవలయునని తాత్పర్యము.

—(*) ౫. అబధికరణమ్. (*)—

అవ॥ "తదపోऽసృజత" (ఆ బ్రహ్మము జలమును సృజించెను) "అగ్నేరాపః" (అగ్నినుండి జలము పుట్టెను) ఈ రెండు శ్రుతులకును విరోధము కలదా లేదా అను పూర్వాధికరణము నందువలెనే విరోధములేదని నిరూపించుచున్నాడు.

సూ॥ ౧౧॥ ఆపః ॥

టీక॥ అతః = ఈ అగ్నివలన, ఆపః = జలము, ఉత్పద్యంతే = పుట్టుచున్నది.

తా॥ జలము అగ్నివలననే పుట్టునుగాని (అగ్నిరూపమును పొందిన పరబ్రహ్మము వలననే పుట్టునుగాని అనుట) శుద్ధముగ బ్రహ్మమువలన పుట్టదు. పైన చూపిన శ్రుతులకు కూడ విరోధము లేదు. పూర్వాధికరణమునుబట్టియే మిగిలిన విషయముల నన్నిటిని తెలిసికొనవలయునని తాత్పర్యము.

—(*) ౬. పృథివ్యధికరణమ్. (*)—

అవ॥ "తా అన్నమసృజంత" (ఆజలము అన్నమును పుట్టించెను) అను వాక్యమునందు అన్న శబ్దముచే రూఢిమూలమున ఆహార పదార్థములను యోగమూలమున ఆహార పదార్థములకు కారణములగు "ఓషధులను చెప్పబడి యుండుటచే జలమువలన ఓషధులు పుట్టెను" అని ఏర్పడుచున్నది, మఱియొక శ్రుతియందు "పృథివ్యా ఓషధయః" (భూమినుండి ఓషధులు పుట్టెను) అని చెప్పబడియున్నది, ఈ రెండు శ్రుతులకును విరోధము వచ్చునా రాదా అను సంశయము నీయధికరణముచే నివారించు చున్నాడు.

సూ॥ ౧౨॥ పృథివ్యధికారరూప శబ్దాంతరేభ్యః ॥

టీక॥ అధికారరూప శబ్దాదిభ్యః = పూర్వోత్తర సందర్భములనుపట్టి చూచినను నీలరూపము గలదియని చెప్పుటనుబట్టి చూచినను ఇతరశ్రుతులను బట్టిచూచినను, పృథివీ = భూమి, తతః = ఆ జలమునుండి, ఉత్పద్యతే = పుట్టుచున్నది.

తా॥ అవతారికయందు ఉదహరించిన శ్రుతులకు విరోధము లేదు. "తా అన్నమసృజంత" అను శ్రుతియందలి అన్న శబ్దము

టవలననున్న, తల్లింగాత్=ఆయనచే, ఆకాశాదులను ప్రవర్తింప చేయునని చెప్పబడి యుండుట చేతను, సః = అపరబ్రహ్మమే, వియదాది ప్రవర్తకః=ఆకాశాదులను ప్రవర్తింప చేయువాడు.

తా॥ ఆకాశాదులు స్వతంత్రముగా ఏవస్తువునుకూడ పుట్టింప నేరవు. "సోకామయత" (ఆ పర బ్రహ్మము సంకల్పించెను.) అను మొదలగు శ్రుతులచే పరమేశ్వరుడే సంకల్ప పూర్వకముగా ఈ ప్రపంచమును సృష్టించెనని తెలియ చేయబడి యున్నది. మఱియు అంతర్యామి బ్రాహ్మణమునందు "పరమేశ్వరుడే సర్వభూతముల యందు ప్రవేశించి వాటిని తమతమ కార్యముల యందు ప్రేరేపించు చున్నాడు" అని చెప్పబడియున్నవి. ఈ రెండు హేతువుల వలనను ఆకాశాది భూతములకు స్వాతంత్ర్యము లేదనుట నిర్ధారణ చేయబడుచున్నది, దీనివలన అనతారిక యందు ఉదహరింపబడిన శ్రుతికి "ఆకాశ రూపమగు పరబ్రహ్మముచే వాయువుజనించెను" అనియే అర్థము చెప్పవలయునని యేర్పడుచున్నది. కావున అనతారికయందు సందేహింప బడిన ప్రకారముగా శ్రుతులకు పరస్పర విరోధ మేమియును రాదని తాత్పర్యము.

—(*) ౮. విపర్యయాధి కరణమ్. (*)—

అవ॥ ఈవిధముగా ఏడు అధికరణముల యందును ప్రపంచోత్పత్తినిగూర్చి విచారణ చేయబడినది. లయమునుగూర్చి నిరూపించుటకై యీయధికరణము ఆరంభింప బడుచున్నది.

సూ॥ ౧౪॥ విపర్యయేణతుక్రమోత ఉపపద్యతే ॥

టీక॥ లయస్య= లయమగుటయొక్క, క్రమః=వరుస, అతః= ఈ సృష్టిక్రమము, విపర్యయేణ=విపరీతముగా, భవతి = అగుచున్నది, ఇదంచ=ఇదికూడా, ఉపపద్యతే=యుక్తి యుక్తమై యున్నది.

తా॥ సృష్టి ఏవరుసను ఆశ్రయించి చెప్పబడి యున్నదో ఆ వరుసకు వ్యత్యాసముగా (అనగా భూమి దానికి కారణమగు జలమునందు లీనమగును. జలము దానికి కారణమగు అగ్నియందు లయించును. అను వరుసతో) ప్రళయముకలుగును. కార్యములు తమతమ

కారణములయందు లీనమగుట స్వభావమే. కావున పైచేసిన సిద్ధాంతము యుక్తి యుక్తముగా కూడ నున్నదని తాత్పర్యము.

—(*) ౯. అంతరా విజ్ఞానాధికరణమ్. (*)—

అవ॥ పైన ఏడధికరణములవరకు నిరూపించిన ఉత్పత్తి క్రమము సరియైనదికాదు. " ఆత్మన ఆకాశస్సంభూతః " అను శ్రుతియందు పరమాత్మనుండి. ప్రత్యక్షముగా ఆకాశము పుట్టెనని చెప్పబడియున్నది " ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ । ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీవిశ్వస్యధారిణీ " ( ఈ పరమాత్మ వలన ప్రాణము మనస్సు ఇంద్రియములు ఆకాశము వాయువు అగ్ని జలము పృథివి ఇవి పుట్టుచున్నవి. ఇచ్చట ప్రాణమనగా బుద్ధికి ఆధారమగు ప్రాణవాయువు ) అను శ్రుతియందు ఆత్మకును ఆకాశమునకును మధ్య ప్రాణవాయువు మనస్సు మొదలగునవి వర్ణింప బడియున్నది. ( అనగా ప్రాణాదులు పుట్టినపిదప ఆకాశాదులు పుట్టినవని చెప్పబడియున్నదనుట. ) ఇట్లు చెప్పటచే ఈ రెండు శ్రుతులకును విరోధము వచ్చునా రాదా అను విషయమును ఈ అధికరణమునందు విచారించు చున్నాడు.

సూ॥ ౧౫॥ అంతరావిజ్ఞానమనసీక్రమేణతుతల్లింగాది
తిచేన్నావిశేషాత్ ॥

టీక॥ విజ్ఞానమనసీ=విజ్ఞానము ( బుద్ధియును ఇంద్రియ ములును లేక ప్రాణవాయువు ) మనస్సు ఈ రెండును, ఆత్మాకాశయోః= ఆత్మకును ఆకాశమునకును, అంతరా=నడుమ, స్థః=ఉన్నవి, ఇదం= ఇది, క్రమేణ=వరుసగా, తల్లింగాత్ = ఆవిజ్ఞానాదులను చెప్పుటవలన, జ్ఞాయతే= తెలియబడుచున్నది, ఇతిచేత్ =అనిచెప్పియెడల, న=అది సరికాదు, తేషాం=ఆవిజ్ఞానాదులు, భౌతికత్వావిశేషాత్ = భౌతికములే యగుటవలన ( భూతములవలన పుట్టినవే యనుట. )

తా॥ అవతారికయందు చూపబడిన శ్రుతులకు విరోధము లేదు " అన్నమయంహిసౌమ్యమనః, ఆపోమయాః ప్రాణాః " ( ఓ సౌమ్యుడా, మనస్సు అన్నమయ మయినది ప్రాణములు జలమయములైనవి ) అను మొదలగు శ్రుతులచేత విజ్ఞానాదులు భౌతి

కము లేయని చెప్పబడియున్నవి. దీనినిబట్టిచూచిన "ఏతస్మాజ్జాయతే" అను శ్రుతియందు సృష్టి క్రమమునుగూర్చి చెప్పబడలేదనియు సామాన్యముగా "ప్రపంచ మంతయు పర బ్రహ్మమునుండి పుట్టెను." అని మాత్రమే చెప్పబడెననియు ఏర్పడుచున్నది. "ఈకారణమువలన ఆకాశము పర బ్రహ్మమువలన పుట్టెను" అను శ్రుతికి ఏశ్రుతి వలన కూడ విరోధమురాదని తాత్పర్యము.

—(*) ౧౦. చరాచరవ్యపాశ్రయాధి కరణమ్. (*)—

అవ॥ వేదమునందు కొన్నిచోట్ల జీవుడు పుట్టుచున్నాడనియు మృతి నొందుచున్నాడనియు చెప్పి ఆ విషయములందు కొన్ని కొన్ని కర్మలు విధింప బడియున్నవి. మఱియొక చోట జీవుడు నిత్యుడనినే చెప్పబడి యున్నాడు. ఈ రెండు సందర్భములకును పరస్పర విరోధము కలదా, లేదా, అనుసంశయము ఈఅధికరణమున పరిహరింప బడుచున్నది.

సూ॥ ౧౬॥ చరాచరవ్యపాశ్రయస్తుస్యాత్తద్వ్యపదేశో
భాక్తస్తద్భావ భావిత్వాత్ ॥

టీక॥ చరాచరవ్యపాశ్రయః = జంగమ స్థావర రూపములగు శరీరముల నాశ్రయించినదై, తద్వ్యపదేశః= (జీవునియందు) జన్మ మరణములనుచెప్పుట, జీవే=జీవునివిషయములో, భాక్తః = అప్రధానమైనది, స్యాత్=అగును, కుతః= ఎందువలన ననగా, తస్య = ఆజన్మ మరణ వ్యపదేశము, తద్భావ భావిత్వాత్ = ఆ శరీరముండినప్పుడే ఉండును గావున.

తా॥ అవతారికలో చూపినప్రకారము శ్రుతి సందర్భములకు పరస్పర విరోధము కలుగునని సంశయింప నవసరములేదు. జీవుని గూర్చి జన్మమరణములనుజెప్పు శ్రుతి జీవుని విషయమునందు అప్రధానమైనదని తెలిసికొనవలయును. బాగుగ విమర్శించినయెడల పుట్టుక చావు అను వ్యవహారములు శరీరముండుట లేకపోవుట అను వానిఁ బట్టి వచ్చుచున్నవి యనుట స్పష్టమగును గదా. ఈ కారణము వల. శ్రుతి జెప్పుచున్న జనన మరణములు జంగమ స్థావర రూపములగ శరీరములనుగూర్చియే చెప్పబడినవికాని జీవునిగూర్చి చెప్ప బడిన

కావు. శరీరమును విడచి కేవలజీవుడు దేనికిని గోచరుడగు వాడు కాడుకదా. కావున అప్రధానములగు జన్మమరణ ప్రతిపాదకవాక్య ములవలన " జీవుడు నిత్యుడు ' అని ముఖ్యార్థమును చెప్పు వేదాంత వాక్యమునకు విరోధ మేమియును రాదని తాత్పర్యము.

—(*) ౧౧. ఆత్మాధి కరణమ్. (*)—

అవ॥ జీవునకు ప్రతి శరీరములోకూడా ఉత్పత్తి నాశములు లేకపోయినను కల్పముయొక్క ఆద్యంతములయందు అవి కలుగవచ్చు ను " ఏతస్మాదాత్మనస్సర్వఏత ఆత్మానోవ్యుచ్చరంతి. " ( ఈ పర బ్రహ్మమునుండి ఈజీవులందరును వచ్చుచున్నారు. ) అనుశ్రుతియందు కూడ జీవునకుకల్పాదియందు ఉత్పత్తికలదని చెప్పబడియున్నదికదా. మఱియొకచోట జీవుడు ( బ్రహ్మస్వరూపుడు ) నిత్యుడనికూడ శ్రుతి నే చెప్పుచున్నది. ఈ రెండుశ్రుతులకు విరోధమువచ్చునా, రాదా, అను సంశయము ఈ అధికరణమునందు నివారణ చేయ బడుచున్నది.

సూ॥ ౧౭॥ నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చతాభ్యః॥

టీక॥ అశ్రుతేః = ఉత్పత్తినిచెప్పు ప్రకరణములయందు జీవుని ఉత్పత్తిగూర్చి చెప్పబడి యుండక పోవుటవలనను, తాభ్యః=జీవుడు నిత్యుడని చెప్పునట్టి శ్రుతులు ఉండుటవలనను, ఆత్మా = జీవుడు, నో త్పద్యతే=పుట్టడు.

తా॥ సృష్టినిగూర్చి చెప్పు స్థలములయందు భూత భౌతిక సృ ష్టినిగూర్చియే చెప్పబడి యున్నదిగాని జీవసృష్టినిగూర్చి చెప్పబడి యుండలేదు. అవతారికయందు చూపబడిన జీవోత్పత్తి శ్రుతి ఆయ నయందు అప్రధానమైనదేగాని ( భూతములు పుట్టును గావునను వా నియందు పరబ్రహ్మమే జీవరూపముగ ప్రవేశించి యున్నాడు కావు నను ఆ జీవునకుకూడ ఉత్పత్తియున్నట్లు కనుపడుచున్నదికావునను శ్రు తిచే నట్లు చెప్పబడెనుకాని ఆయన పుట్టువాడనియు నశించు వాడని యు చెప్పుటకు గాదు. ) ముఖ్యమైనదికాదు. ఆ శ్రుతియందె మఱి యొకచోట బృహదారణ్యకోపనిషత్తునందు పైన చెప్పిన విషయము స్వయముగానే వివరింప బడియున్నది. మఱియు " అజోనిత్యశ్శాశ్వ తోయంపురాణః " ( ఈజీవుడు అనాదియైనవాడు. పుట్టుకలేనివాడు.

సర్వకాలములయందును నిలచియుండువాడు. ఎప్పటికిని రూపభేదము లేనివాడు. ) అని శ్రుతులు జీవునిగూర్చి చెప్పుచున్నవి. వీటినిబట్టిచూ చిన అవతారికయందు ఉదహరించిన ఉత్పత్తి శ్రుతికిని " పరబ్రహ్మ మే జీవరూపుడై భూతములయందు ప్రవేశించి యున్నాడు " అని. చెప్పుచు అజీవునియందు నిత్యత్వము సాధించు శ్రుతికిని విరోధము లేదని తాత్పర్యము.

—(*) ౧౨. జ్ఞాధి కరణము. (*)—

అవ॥ " అయం పురుషః స్వయంజ్యోతి ర్భవతి " ఈ పురుషుడు స్వప్రకాశుడై యున్నాడు. " పశ్యంశ్చక్షుః, శృణ్వాం శ్రోత్రం ( ఈ జీవుడు చూచునప్పుడు కన్నగును. రూపజ్ఞానము కలవాడగుననుట. ) వినునప్పుడు చెవ్వగును [ శబ్దజ్ఞానము కలవాడగుననుట] అనుమొదలగు శ్రుతులు " జీవుడు విజ్ఞాన స్వరూపుడు " ఆగంతుకములగు ( అప్పటికిమాత్రము వచ్చునట్టి ) జ్ఞానము కలవాడు " అని విరుద్ధార్థములను చెప్పు చున్నవి. వైశేషిక మతస్థులు కూడ జీవునకు ఆగంతుక జ్ఞానము కలదను విషయమునందు ఏకీభవించు చున్నారు. పైన చూపిన రెండువిధములగు శ్రుతులకును పరస్పర విరోధముకలదా, లేదా, అను సంశయమును, ఈ అధికరణమున నివారించు చున్నాడు.

సూ॥ ౧౮॥ జ్ఞోత ఏవ ॥

టీక॥ అతఏవ=పైన నిరూపించిన కారణములవలననే, ఆత్మా=జీవుడు, జ్ఞః=విజ్ఞాన స్వరూపుడు.

తా॥ " పరబ్రహ్మమే జీవరూపుడై భూతములయందు ప్రవేశించియున్నాడు. " అనుటయే సిద్ధాంత మగుటచేతను బృహదారణ్యక శ్రుతియందుకూడ, " విజ్ఞానఘనఏవాయం జీవఏతేభ్యః కార్యకరణ సంఘాతాపన్న భూతేభ్య ఉత్పత్తి మద్భ్యః సామ్యేనోత్థాయ తానిభూతాని వినశ్యంతిసంతి స్వయమను సృత్య వినశ్యతి " [ ఈజీవుడు విజ్ఞాన స్వరూపుడు అయిన, కార్యకారణ స్వరూపములై పుట్టుకగలవియై యున్న భూత ములతో సమాన ముగా ఉత్పత్తి చెందుతు

ఆ భూతములు ఉన్నప్పుడు ఉండుడు నశించు నప్పుడు వానిననుసరించి యే నశించుచును [ అనగా జీవునకు పుట్టుకయు నాశమును కలదనుట ఆయన యాశ్రయించియున్న భూతములను అనుసరించి చెప్పుటయే ఆయనయొక్క స్వభావమును అనుసరించి చెప్పుట కాదనుట. ] అని చెప్పబడి యుండుటచేతను జీవుడు స్వయంప్రకాశ స్వరూపుడే కాని వైశేషికులు చెప్పినట్లు ఆగంతుకవిజ్ఞానము కలవాడు కాడు. "పశ్యం శ్చక్షుః " అను మొదలగు శ్రుతులు ఆగంతుకములగు (అప్పటికప్పుడే పుట్టునట్టి ) చిత్తవృత్తులను అనుసరించి చెప్పుచున్నవే కాని జీవునకు స్వప్రకాశత్వము లేదని చెప్పుటలేదు. కావున అవతారికయందు చూపబడిన విరోధము కలుగనేరదని తాత్పర్యము.

—(*) ౧౩. ఉత్క్రాంతిగత్యధికరణమ్. (*)—

అవ॥ శ్రుతులయందు జీవుడు పరిచ్ఛిన్నుడు ( ఖండ ఖండములుగా నున్నవాడు ) కాదనియు "ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః" ( ఈ జీవుడు అణుస్వరూపుడు మనస్సుచే తెలిసికొనతగినవాడు. ) అనియును చెప్పబడి యున్నది. ఈ రెండు సందర్భములకును విరోధమున్నదా, లేదా, అను సందేహమును ఈ అధికరణముచే పరిహరింప బోవువాడై సూత్రకారుడు మొట్ట మొదట పూర్వ పక్షమును అనువాదను చేయుచున్నాడు.

సూ॥ ౧౯॥ ఉత్క్రాంతి గత్యా గతీనాం ॥

టీక॥ ఉత్క్రాంతి గత్యాగతీనాం=శరీరమును విడచుట పరలోకమునకు పోవుట కర్మఫలమును అనుభవించి కాగానే అచ్చటి నుండి మరలవచ్చుట అనునవి, శ్రవణాత్ = వినబడు చుండుటవలన, జీవః=జీవుడు, నవిభుః=సర్వవ్యాపకుడు కానేరడు.

తా॥ " సయదాస్మా చ్ఛరీరా దుత్క్రామతీ " ( ఆజీవుడు ఈ శరీరమునుండి వెడలి పోయినప్పుడు ) అను మొదలగు వాక్యములచే జీవుడు శరీరమునుండి వెడలిపోవుచున్నాడనియు " చంద్రమసమేవ తే సర్వేగచ్ఛంతి " ( ఆజీవులు చంద్రలోకమునకు పోవుదురు.) అను వాక్యములచే జీవుడు పరలోకమునకు పోవుచున్నాడనియు " తస్మాల్లోకా త్పునరేత్య స్మైలోకాయ కర్మణే " ( ఆ పరలోకమునుండి

మరల కర్మ చేయుటకొరకై జీవుడు ఈలోకమునకు వచ్చుచున్నాడు) అను మొదలగు వాక్యములచేత ఆ జీవుడు పర లోకమునుండి తిరిగి వచ్చుననియు శ్రుతిచే చెప్పబడుచున్నది. దీనిని బట్టి చూచిన జీవుడు విభువు ( సర్వవ్యాపకుడు ) అగుటకు వీలులేదు. సర్వ వ్యాపకుడగు వాడు ఒకచోటనుండి మఱియొకచోటికి వెళ్లుట సంభవింపదు గదా, జైనమతమును ఖండించునప్పుడు " జీవునకు మధ్యమ పరిమాణము ఉం డుటకు వీలులేదు " అని మీరే ఖండించి యున్నారు. కావున జీవుడు అణుస్వరూపుడనియే ఒప్పుకొని తీరవలయునని తాత్పర్యము. ( ఇది పూర్వపక్ష సూత్రము. )

అవ॥ ఈ పూర్వపక్షము సరియైనదికాదు. జీవుడు చలనము లేనివాడై యున్నను దేహము నాదియనియు దీని- అధిపతిని నేనే న యు తలంచకుండెనేని ఈ శరీరమును విడచియున్నాడని చెప్ప వచ్చు నుకదా. కావున శ్రుతి యందు ఉత్క్రాంతిని ( శరీరమును విడచు టను ) గూర్చి చెప్పబడినను జీవుడు అణుస్వరూపుడై యుండవలసి పనిలేదు అనిన ఈ సిద్ధాంతమును అంగీకరించి ఇతర స్థలములయం దు చూపబడిన దోషము ఇప్పటికిని నివారింప బడ లేదని పూర్వప యాక్షేపించు చున్నాడు.

సూ॥ ౨౦॥ స్వాత్మనా చోత్తరయోః ॥

టీక॥ ఉత్క్రాంతేః=ఉత్క్రాంతికంటే, ఉత్తరయోః= త వాతనున్న, గత్యా=గతులకు ( పరలోకమునకుపోవుట అచ్చట నుం మరలవచ్చుట వీనికి ) స్వాత్మనా = స్వయముగానే, సంబంధాచ్చ సంబంధ పడవలసి యుండుటవలన, జీవో అణురేవ = జీవుడు అ స్వరూపుడే.

తా॥ ఉత్క్రాంతి విషయమునందు మీరుచేసిన సిద్ధాంత సరియైనదే యైనను మీపై చెప్పబడిన దోషము సంపూర్ణముగా ని రణ కాలేదు. పరలోకమునకు బోవుననినను అచ్చటనుంచి మరల లోకమునకు వచ్చుననినను ఆయా దేశములతో జీవునకు స్వయము సంబంధము కలదనియేగదా చెప్పవలయును. జీవుడు విభువనిన

నిదిసంభవింపదు. కావున ఆయన పరమాణుస్వరూపుడే యని తాత్పర్యము.

అవ॥ "సవాఏషమహానజఆత్మా" ( ఆజీవుడు ఉత్పత్తి లేనివాడు. సర్వ వ్యాపకుడు ) అను వాక్యములచే శ్రుతి జీవుడు అణుస్వరూపుడు కాడని చెప్పుచున్నది. కావున మీరు చెప్పు దోషములు సరియైనవి కావనిన పూర్వపక్షి తాను చేసిన యాక్షేపమును మఱియొక విధముగా దృఢ పరచుచున్నాడు.

సూ॥ ౨౧॥ నాణురతచ్ఛ్రుతేరితి చేన్నేతరాధికారాత్ ॥

టీక॥ అతచ్ఛ్రుతేః = అణువుకాదని వేదమునందు చెప్పబడియుండుటవలన, నాణుః = జీవుడు అణుస్వరూపుడుకాడు, ఇతిచేత్ = అనేయెడల, న=అదిసరికాదు, తస్యాః-ఆశ్రుతికి, ఇతరాధికారాత్ = పరబ్రహ్మమునుగూర్చి చెప్పుప్రకరణము నందుండుటవలన.

తా॥ అవతారికయందు చూపిన శ్రుతి పరబ్రహ్మమునుగూర్చి చెప్పు సందర్భమునందు ఉన్నదికాని జీవునిగూర్చి చెప్పు ప్రకరణమునందు లేదు. కావున జీవుడు అణుస్వరూపుడుకాడని చెప్పుటకు వీలు లేదని తాత్పర్యము.

అవ॥ పూర్వపక్షి తన సిద్ధాంతమునకు అనుగుణముగా మఱియొక ప్రమాణము కూడ చెప్పుచున్నాడు.

సూ॥ ౨౨॥ స్వశబ్దోన్మానాభ్యాంచ ॥

టీక॥ స్వశబ్దః=ప్రత్యక్షముగా జీవుడు అణు స్వరూపుడని చెప్పునట్టి శ్రుతివలనను, ఉన్మానాభ్యాం= ప్రత్యేకముగా, ఆజీవునిపరిమాణమును గూర్చి చెప్పు శ్రుతివలనను, జీవః = జీవుడు, అణురేవ= పరమాణుస్వరూపుడనియే, సిద్ధః=ఏర్పడుచున్నాడు.

తా॥ మఱియు "ఏషోణురాత్మా చేతసా వేదితవ్యః" అను వాక్యముచేత "జీవుడు అణుస్వరూపుడు" అని స్పష్టముగానే చెప్పబడియున్నది. ఆరాగ్రమాత్రః ( మికిలి పదునుగల వస్తువులయొక్క అంతమువలె నున్నాడు. ) అను వాక్యముచే జీవుని పరిమాణము అత్యల్పముగా చూపబడియున్నది. వీటినిబట్టి చూచిన జీవుడు అణుప్రమాణము కలవాడుఅనియే చెప్పవలయునని తాత్పర్యము.

అవ॥ ఇట్లు జీవుడు అణుస్వరూపుడే అయినచో ఒకటి చోట నే ఉండ వలసివచ్చును. అప్పుడు సర్వ శరీరమునకు సంబంధించిన సుఖాదులను తెలిసికొనుటకు వీలుండదు కదా యనిన అట్లు కాదని (పూర్వపక్షి) నిరూపించు చున్నాడు.

సూ॥ ౨౩॥ అవిరోధ శ్చందనవత్ ॥

టీక॥ చందనవత్=మంచిగంధమువలె, అవిరోధః = అణుస్వరూపుడై యుండినను సర్వశరీరములకును సంబంధించియున్న సుఖాదులను అనుగ్రహించు ననుటలో విరోధ మేమియును లేదు.

తా॥ మంచిగంధము కొంచెమైనను సర్వశరీరమును వ్యాపించి ఆహ్లాదమును కలిగించుచున్నట్లే జీవుడుకూడ అణుస్వరూపుడయ్యును సర్వశరీరమునకును సంబంధించియున్న సుఖాదులను తెలిసి కొనవచ్చును. దీనియందు విరోధ మేమియునులేదు. కావున జీవుడు అణుస్వరూపుడేయని తాత్పర్యము.

అవ॥ పైన చూపిన దృష్టాంతము సరియైనదికాదు. చందనము శరీరమందు ఒకటి చోటనున్నదని స్పష్టముగ దెలియుచున్నది. జీవు విషయములో " ఆయన ఒకచోటనున్నాడు మరియొకచోట లేడు ' అని తెలుసుకొనుటకు వీలులేదుకదా. కావున సర్వ శరీరమును వ్యాపించి యున్న వేడి చలువమొదలగు విషయములను గ్రహించుచుండువాడగుటచే ఆజీవుడు మహత్పరిమాణము కలవాడనిచెప్పిన యుక్తవగానుండు ననిన నట్లు కాదని (పూర్వపక్షి) చెప్పుచున్నాడు.

సూ॥ ౨౪॥ అవస్థితి వైశేష్యాదితిచేన్నాభ్యుపగమాద్ధృదిహి॥

టీక॥ అవస్థితి వైశేష్యాత్ = ఉనికియందు భేదముండుటవలన=చందనము సరియైన దృష్టాంతముకాదు, ఇతిచేత్ = అనేయెడన=అది సరికాదు, హృదిఅవస్థితేః= హృదయమునందున్నాడని, అభ్యుపగమాత్=శ్రుతి అంగీకరించియున్నది కావున, తథాహి = అదియుక్తమేకదా.

తా॥ పై సూత్రమునందు చెప్పబడి యున్న దృష్టాంతము గూర్చి అవతారికయందు చూపియున్న దోషము సరియైనది కాదు " హృదిహ్యేషఆత్మా " ( ఈ జీవుడు హృదయమునందుఉన్నా

అనుమొదలగు శ్రుతులు జీవునకు స్థానమునొక దానిని నిర్ణయించు చున్నవి. కావున జీవుడు అణువని చెప్పుటయు చందనబిందు దృష్టాంతముచే సర్వ శరీరవ్యాపులగు సుఖ దుఃఖ శీతోష్ణాదులను తెలిసికొనుచున్నాడని చెప్పుటయు మిక్కిలి యుక్తి యుక్తమని తాత్పర్యము.

అవ॥ పైన చెప్పిన విషయమునే మఱియొక విధముగా సమర్థించు చున్నాడు.

సూ॥ ౨౫॥ గుణాద్వా లోకవత్ ॥

టీక॥ అథవా=అట్లు కాకపోయిన నప్పటికిని, లోకవత్=లోకమునందు ప్రత్యక్షములైయుండు దీపములు మొదలైన వానివలె, గుణాత్ = సర్వవ్యాపకమగు జ్ఞానమువలన, అణోరపి సర్వవిజ్ఞానం= జీవుడు స్వయముగా అణువైనను సర్వము తెలిసికొనవచ్చును.

తా॥ అను చిన్నదైనను దీపము తన ప్రకాశముచే గృహమును అంతయును ప్రకాశింప జేయునట్లు జీవుడు అణువైనను సర్వాంగమును ప్రకాశింప చేయగల జ్ఞానమువలన సర్వ విషయములను నెఱుంగవచ్చును. " ఈ కారణము వలనకూడ జీవుడు అణు స్వరూపుడు " అను చెప్పు వాదమునకు భంగము రాదని తాత్పర్యము.

అవ॥ జీవుడణువేననియు ఆయునకు గుణమగు జ్ఞానము సర్వపదార్థములను ప్రకాశింప జేయుననియు ( " అనగా ఆయన తన కుగల జ్ఞానముచే సర్వము తెలిసికొనుననియు " అనుట ) చెప్పుట సరికాదు గుణము యెప్పటికిని గుణికంటే ( గుణముగల వానికంటే ) వ్యతిరేకముగా నుండుననుటకు ( గుణిచిన్నవాడైనను గుణము వ్యాపించునదియై యుండుననుటకు. ) వీలు లేదుకదా. అనిన నట్లు కాదని ( పూర్వపక్షి ) దృష్టాంత పూర్వకముగా సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౬॥ వ్యతిరేకో గంధవత్ ॥

టీక॥ గంధవత్=గంధమువలె, వ్యతిరేకః=గుణమునకును గుణముగలవానికిని వ్యతిరేకము ( గుణముకలవాడు కొద్దివాడైనను గుణ విస్తారముగా వ్యాపించుట. ) ఉపపద్యతే = యుక్తి యుక్తమైయేర్పడును.

తా॥ గుణియగు పదార్థము దూరమునందున్నను దానివాసన అన్నివైపులకును వ్యాపించుచున్నట్లు జీవుడు పరమాణుస్వరూపుడైనను ఆయనకుగల జ్ఞానము శరీరమంతయును వ్యాపించవచ్చును. ఈ కారణమువలన గుణము గుణికి వ్యతిరేకముగా వ్యాపించకూడదనుమాట యుక్తి యుక్తము కాదని తాత్పర్యము.

అవ॥ జీవగుణమగు జ్ఞానమే సర్వశరీరమును వ్యాపించియున్నదని చెప్పుటలో శ్రుతి ప్రమాణమును జూపుచున్నారు.

సూ॥ ౨౭॥ తథాచ దర్శయతి ॥

టీక॥ తథాచ=పైన చెప్పిన విధముగానే, దర్శయతి = శ్రుతి చూపించుచున్నది.

తా॥ "ఆలోమభ్య ఆనఖాగ్రేభ్యః" (వెంట్రుకల కొనలవరకు గోళ్ళ కొనలవరకు) అనుమొదలగు వాక్యములచేత శ్రుతి "జీవుడు తన గుణమగు విజ్ఞానముచే శరీరమంతయును వ్యాపించియున్నాడు." అని చెప్పుచున్నది. ఈ ప్రమాణమువలన పైనిరూపింపబడుచున్న విషయము సిద్ధాంతము అగునని తాత్పర్యము.

అవ॥ "పైతాత్పర్యమందు చూపబడిన శ్రుతికి జీవపరముగా అర్థము చెప్పినను నావాదమునకు భంగమురాదు" అని (పూర్వపక్షి) నిరూపించుచున్నాడు.

సూ॥ ౨౮॥ పృథగుపదేశాత్ ॥

టీక॥ పృథక్=వేరువేరుగా (జీవుడు వేఱు ఆయన శరీరమును ప్రవేశించుటకు [వ్యాపించుటకు] కారణమైన జ్ఞానము వేరు.) జీవజ్ఞానయోః = జీవుని జ్ఞానమును, ఉపదేశాత్ = ఉపదేశించుటవలన, జ్ఞానమేవవ్యాపకం = శరీరమును వ్యాపించియుండునది జ్ఞానమేకాని జీవుడుకాడు.

తా॥ "ప్రజ్ఞయా శరీరం సమారుహ్య (జ్ఞానముచేత శరీరమును ఆశ్రయించి [వ్యాపించి])" అనుమొదలగు వాక్యములచేత జీవుడు కర్తయనియు ఆతడు శరీరమును వ్యాపించియుండుటకు జ్ఞానము సాధనమనియు శ్రుతిచెప్పుచున్నది. కావున జీవుడు ఒకచోటనే ఉండుననియు జ్ఞానముమాత్రము శరీరమంతయునువ్యాపించు

ననియు ఏర్పడుచున్నది. దీనివలన జీవుడు పరమాణు స్వరూపుడే అనియు "జీవుడు మహాత్తు (సర్వ వ్యాపకుడు") అనుచెప్పు శ్రుతులకు అవశ్యము బాధకలుగుననియు ఏర్పడుచున్నదియని తాత్పర్యము. (ఇంతవరకు పూర్వపక్ష సూత్రములే.)

అవ॥ ఈ విధముగా ౧౯ వ-సూత్రము మొదలు ౨౮ వ-సూత్రమువరకు పూర్వపక్షమును నిరూపించి సూత్రకారుడు ఈ క్రింద దానిని ఖండించి సిద్ధాంతమును చేయుచున్నాడు.

**సూ॥ ౨౯॥ తద్గుణ సారత్వాత్తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్ ॥**

టీక॥ ప్రాజ్ఞవత్ = పరబ్రహ్మవిషయమునందువలె, జీవేపి= జీవునియందుకూడ, తద్వ్యపదేశః= "అల్పపరిమాణముకలవాడు" అనుమొదలగు వానిని జెప్పుట, తద్గుణసారత్వాత్ =ఆజీవునకు ఉపాధియగు బుద్ధియొక్క గుణముతో ప్రధానముచేసి కొనుటవలన, సంభవతి=సంభవించును.

తా॥ జీవుడు అణు స్వరూపుడని చెప్పుట సరికాదు. జ్ఞానము మాత్రమే శరీరమునంతయు వ్యాపించియుండుననుట యుక్తియుక్తము కానేరదుకదా. వెలయుసిన ౨౬ వ-సూత్రమునందు చెప్పబడియున్న గంధ దృష్టాంతము సరియైనది కాదు. "గంధము సూక్ష్మముగా వ్యాపించుచున్నదనిన గంధముతోగూడిన పరమాణువులు వాయువును అనుసరించి వచ్చుచున్న వస్తువులే" అని లోకమునందు కూడ సిద్ధాంతము చేయబడియే యున్నది కదా. ఇట్లు చెప్పుటచేత జీవుడే సర్వశరీరమును వ్యాపించి యున్నాడని చెప్పవలసి వచ్చుచున్నది. ఆయనకు మధ్యమ పరిమాణము లేదని ఇదివరకే ఖండింపబడియుండుటచేతను అణుపరిమాణము లేదని యిప్పుడు నిరూపింపబడియుండుటచేతను ఆ జీవుడు మహాత్పరిమాణము గలవాడనియే చెప్పవలసియున్నది. (వాలాగ్రశతభాగస్య ; వెంట్రుక కొనలోని నూరవ భాగమునకు) అనుమొదలగు శ్రుతులు జీవునకు ఉపాధియగు బుద్ధియొక్క అణుత్వము, (అణుపరిమాణము గలిగియుండుట) మొదలగు గుణములనుబట్టి జీవునిగూడ అణు స్వరూపునిగా చెప్పుచున్నవి. ఉపాసనా ప్రకరణములయందు ఆయా ఉపాధులకుగల గుణములను

అనుసరించి " దహరోऽస్మిన్ అంతరాకాశః ( హృదయ కమలమునందు స్వల్ప పరిమాణముగల ఆకాశము [ బ్రహ్మ ] కలదు " అని సర్వ వ్యాపకుడగు పరబ్రహ్మమునకు గూడ అల్ప పరిమాణమును జెప్పుట ప్రత్యక్షమై యున్నదికదా. మఱియు " బుద్ధేర్గుణేనాత్మగుణేనచైవ హ్యారాగ్రమాత్రో హ్యపరోऽపి దృష్టః. ( బుద్ధియొక్క స్వభావము వలనను తనయొక్క నిజస్వభావము వలనను ఆ జీవుడు చిన్నవాడుగాను సర్వవ్యాపకుడుగానుకూడా కనుపడు చున్నాడు.") అను శ్రుతిచే జీవుడు సర్వ వ్యాపకుడు అనియు ఉపాధినిబట్టి అణుస్వరూపుడని చెప్పబడు చున్నదనియు స్పష్టము చేయ బడియున్నది. ఇదియునుగాక " తత్త్వమసి ( ఆ బ్రహ్మ నీవు ) " అను శ్రుతులచే జీవ బ్రహ్మములకు అభేదము చెప్పబడియున్నది. కావున ఆ పరబ్రహ్మమువలెనే జీవుడుకూడా సర్వ వ్యాపకుడై యుండవలయును గాని అణువగుటకు వీలులేదు. ఈ కారణమువలన పైన చూపిన పూర్వపక్షముచే " జీవుడు మహాత్పరిమాణము గలవాడు " అని చెప్పు శ్రుతికి బాధయేమియును రాదని తాత్పర్యము.

అవ॥ " సంయోగా విప్రయోగాంతాః ( సంయోగములన్నియును అవశ్యముగా వియోగమును గలిగియుండును) " అను న్యాయమును అనుసరించి చూచిన బుద్ధికిని జీవునకును గలసంయోగము ఎప్పటికైనను విడచి పోవలసి వచ్చును. అప్పుడు జీవుడు అకస్మాత్తుగా సంసారమునుండి ముక్తుడు కావలసి వచ్చును. పై సూత్రమునందు చేసినవియే సిద్ధాంతమైనయెడల ఈ దోషమునెట్లు నివారణ చేసి కొనియెదరు? అనిన సమాధానము జెప్పుచున్నాడు.

సూ॥ ౩౦॥ యావదాత్మభావిత్వాచ్చ న దోషస్తద్దర్శనాత్॥

టీక॥ యావదాత్మభావిత్వాత్ = జీవునకు సంసార ముండునంతవరకు ( అజ్ఞానముండు నంతవరకు ) బుద్ధిసంయోగ ముండును కావున, నదోషః=అవతారికయందు చెప్పబడిన దోషములేదు, తద్దర్శనాత్=శ్రుతి ఆవిధముగానే చెప్పుచున్నది.

తా॥ " ససమానస్సన్నుభౌ లోకా వనుసంచరతి ధ్యాయతీవ లేలాయతీవ ( ఆ జీవుడు బుద్ధితో తాదాత్మ్య సంబంధముగల

వాడై [ తాదాత్మ్య సంబంధమనగా "ఇనుము కాలుచున్నది. అను మొదలగు వాక్యములందు ఇనుమునకును అగ్నికిని స్వభావము లో భేదమున్నను యెట్లు అభేదముగా వ్యవహారము కలుగుచున్నదో అట్లే భేదమున్న పదార్థములయందుకూడ అభేదమునువ్యవహరించు టకు తగినసంబంధము ] ఇహపర లోకములయందు సంచరించు చుం డును ఆ బుద్ధి దేనినైనను ధ్యానించు చున్నప్పుడు ఆయనకూడ ధ్యా నించుచున్నట్లు ఉండును. చలించుచున్నప్పుడు ఆయనకూడ చలించు చున్నట్లుండును ) అనుశ్రుతిచేత శరీరవియోగము కలిగినప్పటికిని జీవు నకు బుద్ధివియోగము కలుగదనియు జీవునకు సంసారముండునంత వరకు బుద్ధిసంయోగము ఉండియే తీరుననియు జెప్పబడి యున్నది. ఆ సంయోగము భ్రాంతిమూలకమైన దగుటచే తత్వజ్ఞానము కలుగు నంతవరకు విచ్ఛేదము ( వినాశము) లేకుండ నుండవలయుననుట యుక్తి యుక్తముకదా. కావున అవతారికయందు చూపబడిన దోషము మాసిద్ధాంతమునందు కలుగనేరదు. అని తాత్పర్యము.

అ॥ ఇట్లు చెప్పట సరికాదు. సుషుప్తి సమయమునందును, ప్రళయ కాలమునందును జీవునకు బుద్ధిసంయోగము ఉన్నదని చెప్పు టకు వీలులేదు. కావున సంసారమున్నంతకాలము ఆయనకు బుద్ధితో సంబంధము ఉండుననుట యుక్తియుక్తము కాదనిన సమాధానము జెప్పు చున్నాడు.

సూ॥ ౩౧॥ పుంస్త్వాదివత్త్వస్యసతోఽభివ్యక్తియోగాత్ ॥

టీక॥ అస్య = ఈ బుద్ధిసంయోగము, సతః = సుషుప్త్యాదుల యందు సూక్ష్మ స్వరూపముతో నుండియే, పుంస్త్వాదివత్ = శుక్ర ము, మీసములు మొదలగు వానివలె, కాలేతు = సకాలమునందైతే, అభివ్యక్తి యోగాత్=ప్రకాశింప వచ్చునుకావున, నవిరోధః=విరోధ మేమియునురాదు.

తా॥ ప్రత్యక్షముగా కనుపడలేదని నంత మాత్రముననే బుద్ధి సంయోగము సుషుప్త్యాదులయందు లేదనుటకు వీలులేదు. యౌవన కాలమునందు ప్రకాశమగునట్టి శుక్రము మీసములు మొదలగునవి బాల్యమునందుకూడ శక్తిరూపమున నున్నవనియే చెప్పవలయుగాని

భ్రాంతిగా లేవనుటకు వీలులేదుకదా. మొదటలేనివి నడుమను ఆకస్మికముగా కలిగినవనిన ప్రత్యక్షాదులకు విరోధము వచ్చును. కావున ప్రత్యక్షముల కాకపోయినను శుక్రాదులు బాల్యమునందు కూడ నున్నవనియు యౌవనమునందు వ్యక్తము లగుననియు చెప్ప వలయును. ఇట్లే జీవబుద్ధి సంబంధముకూడ సుషుప్త్యాదులయందు సూక్ష్మరూపమున నుండుననియు జాగ్రత మొదలగు సమయములందు స్పష్ట మగుననియు చెప్పుట యుక్తముకావు. అవతారికయందు చూపబడిన విరోధము కలుగనేరదని తాత్పర్యము.

అవ॥ బుద్ధి అనునది ఒకటియుండినగదా మీరుచేయు సిద్ధాంతము సరిపడును. అదియున్నదని చెప్పుటకు ఏమి ప్రమాణముగలదు. అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౩౭॥ నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగోన్యతరని
యమోవాన్యథా ॥

టీక॥ అన్యథా = బుద్ధిఅని చెప్పబడు అంతఃకరణము లేదని చెప్పిన, నిత్యోప లబ్ధ్యనుపలబ్ధి ప్రసంగః = విషయములు సమీపము నందున్న యెడల సర్వకాలములయందును ఇంద్రియములకు విషయానుభవము కలగవలసి వచ్చును. లేక భ్రాంతిగా కలుగకనైనను పోవలసి వచ్చును, అథవా=అట్లు కాకపోయినయెడల, అన్యతరనియమః=జీవునకుగాని ఇంద్రియములకుగాని నియమము ( శక్తిని ఆటంకపరుచుట) కలుగుచున్నదని చెప్పవలయును, సర్వథాపి విరోధః =ఎట్లు చెప్పినను విరోధము వచ్చును.

తా॥ బుద్ధియనియు మనస్సనియు అంతఃకరణ మొకటియే చెప్పబడుచున్నది. (ఒకటిదానినే నిశ్చయించునప్పుడు బుద్ధి యనియు సంశయించునప్పుడు మనస్సనియు చెప్పుచున్నాము. )అని తెలిసికొనవలయును. ఆ అంతఃకరణములేదని అవతారిక యందు చూపబడిన పూర్వపక్షము సరియైనదికాదు. అట్లు చెప్పినచో మనస్సుతప్ప తక్కిన జ్ఞానసామగ్రి ( విషయములను తెలిసికొనుటకు కావలసిన సాధనములు [ బ్రహ్మము ] ) అంతయును ఉన్నది కావున ఇంద్రియములకు తమ సమీపమునందు విషయము లున్నప్పు డెల్లను ప్రత్యక్షాది అను

భవములు కలుగవలసియుండును. ( అనగా సర్వేంద్రియముల చేతను సర్వ విషయములు ఒక్కమారే గ్రహింప బడవలసి వచ్చును ) జ్ఞాన సాధనము లెన్నియున్నను ప్రయోజనము లేదన్నచో ప్రత్యక్షాద్యను భవము లెప్పటికిని లేకపోవలసి వచ్చును. ఈ రెండును ప్రత్యక్ష మునకు విరుద్ధములే కదా. ఈ విరోధమును పోగొట్టుకొనుటకై ( లోకానుసారముగా ప్రత్యక్షాదులు సిద్ధించుటకై ) ఆత్మ యొక్కగాని ఇంద్రియముల యొక్కగాని శక్తికి ప్రతిబంధము కలదని చెప్ప వలయును అదియును సిద్ధింపదు. ఆత్మ నిర్గుణుడగుటచే ఆయనకు శక్తియే లేదు. ఇంద్రియములను ప్రతిబంధించుటకు ఒక పదార్థమున్న దనిన నది ఏప్రమాణమునకును గోచరము కాకపోవుటచే ఎవ్వటను అంగీకరింపబడదు. కావున అంతఃకరణ మొకటి యున్నదనియే ఒప్పుకొనవలయును. ఇట్లు చెప్పినచో అంతఃకరణము సావధానముగా నున్నప్పుడు ఇంద్రియములద్వారా విషయానుభవము కలుగునని యు లేనప్పుడు కలుగదనియు చెప్పుటకు వీలుగలుగును. కావున మా సిద్ధాంతమునకు ఎట్టును భంగము రాదని తాత్పర్యము.

—(*) ౧౪. కర్త్రధికరణమ్. (*)—

అ॥ " అసంగోహ్యయంపురుషః " ( ఈపురుషుడు దేనితోను సంబంధము గలవాడు కాడు. ) యావజ్జీవ మగ్నిహోత్రం జుహు యాత్ ( బ్రతికియున్నంతకాలము హోమము చేయవలయును. ) అను మొదలగు అసంగ్రతులకును విధివాక్యములకును పరస్పర విరోధము కలదా? జీవుడే కర్తయని చెప్పినచో పైనచూపిన విరోధము అవశ్యము గావచ్చును. కావున బుద్ధియే కర్తయని చెప్పుట యుక్తి యుక్తము నిన అట్లు కాదని ఈ అధికరణముచే సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ॥ 3౩॥ కర్తాశాస్త్రార్థవత్త్వాత్ ॥

టీక॥ శాస్త్రార్థవత్త్వాత్ = శాస్త్రములు ప్రయోజనములు కలవై యుండుటవలన, ( చేతనములను గూర్చియే ఉపదేశించుటయుక్తమగుటవలన ) జీవః=జీవుడే, కర్తా=చేయువాడు.

తా॥ విధివాక్యములు చేతన పదార్థములనుగూర్చి ఉపదేశించుచున్నవి అనవలయునుగాని అచేతన పదార్థములనుగూర్చి ఉపదేశించు

చున్నవనుటకు వీలులేదు. శాస్త్రోక్తముల నాచరించుటకు చేతనము లకు సామర్థ్యము గలదేకాని అచేతనములకు లేదనుట స్పష్టమేకదా. కావున అచేతనమగు బుద్ధి కర్త్రి (ఇది కర్తృశబ్దమునకు స్త్రీలింగము) కాదనియు చేతనుడగు ఆత్మయే కర్తయనియు చెప్పుట మిక్కిలి యుక్తి యుక్తమై యున్నదని తాత్పర్యము.

సూ॥ ౩౪॥ విహారోపదేశాత్ ॥

టీక॥ విహార=సంచారమును, ఉపదేశాత్=చెప్పుటవలనకూడ, జీవః=జీవుడే, కర్తా=కర్త.

తా॥ "స్వేశరీరే యథాకామం పరివర్తతే (తనశరీరము నందు యథేచ్ఛముగా సంచరించును)" అనుమొదలగు శ్రుతులచేత స్వప్నావస్థయందుకూడ జీవునకు విహారముకలదని వర్ణింపబడియున్నది. కర్త కానివానికి విహారమను కార్యము ఉండుటకూడ సంభవింపదుకదా. కావున జీవుడే కర్తయని తాత్పర్యము.

సూ॥ ౩౫॥ ఉపాదానాత్ ॥

టీక॥ ఉపాదానాత్=ఉపాదాన కారణ మగుట వలనకూడ, జీవః కర్తా=జీవుడే కర్త.

తా॥ "ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ (తన బుద్ధిచేత ఇంద్రియములయొక్క గ్రహణశక్తిని గ్రహించి) అనుశ్రుతి చేత జీవుడు స్వప్నకాలమునందు ఇంద్రియముల యందుగల గ్రహణ శక్తిని తీసికొని హృదయమునందు చేరును" అనిచెప్పబడియున్నది. ఏ పదార్థములైనను తమ ఉపాదాన కారణముల యందు చేరుననుట ప్రత్యక్షము. కావున ఇంద్రియములయందు ఉన్న గ్రహణశక్తికి జీవుడు ఉపాదానకారణమని ఏర్పడుచున్నది. కావున జీవుడే కర్తయని తాత్పర్యము.

సూ॥ ౩౬॥ వ్యపదేశాచ్చక్రియాయాంనచేన్నిర్దేశవిపర్యయః॥

టీక॥ క్రియాయాం = లౌకిక వైదిక క్రియలయందు, వ్యపదేశాత్=కర్తయని చెప్పబడి యుండుటవలనకూడా, జీవః కర్తా=జీవుడే కర్త. నచేత్=అట్లు కాదందురేని, నిర్దేశ విపర్యయః=చెప్పిన విషయముకూడ మారుననవలయును.

సంభవింపదు. కావున కర్మసాధనములగు బుద్ధి మొదలగునవి భ్రాంతి చేత అశుభఫలముల నిచ్చు విషయములయందు "మంచివి" అను తలంపుగలిగి ప్రవర్తించినను వానికి ప్రేరకుడగు కర్తయందు ఆ దోషములు సంభవింప నేరవని తాత్పర్యము.

సూ॥ ౩౮॥ శక్తి విపర్యయాత్ ॥

టీక॥ శక్తి=కరణశక్తియొక్క, విపర్యయాత్ = విపరీతత్వము వలన, జీవఃకర్తా=జీవుడే కర్తయగును, నబుద్ధిః=బుద్ధికానేరదు.

తా॥ లోకమునందు కార్యమును సాధించుటకు కర్తయొక్కడును కరణము (సాధనము) ఒకటియును ఆవశ్యకములైయుండును. "బుద్ధిరేకర్త్రీ" అని చెప్పినచో వేరొక కరణమును కల్పింపవలసివచ్చును, అప్పుడు బుద్ధియే కరణమని మేమును, వేరొక కరణము కలదని మీరును, పేరులనుబట్టిమాత్రమే వివాదము చేసికొనుట యగునుగాని ఇద్దరు చెప్పు మాటయందును వస్తుభేదమేమియు నుండదు. కావున జీవుడు కర్తయనియు బుద్ధి కరణమనియు చెప్పుసిద్ధాంత మెంతయును సయుక్తికమని తాత్పర్యము,

సూ॥ ౩౯॥ సమాధ్య భావాచ్చ ॥

టీక॥ సమాధి=పరమేశ్వరునియందు చిత్తమును చేర్చుటయొక్క, అభావాచ్చ=అసంభవమువలనకూడ, జీవఃకర్తా= జీవుడేకర్త.

తా॥ బుద్ధియనినను మనస్సనినను ఒక్కటియేయని ఇదివరకే చెప్పియున్నాము. వేదమునందు "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః (ఆత్మనుగుఱించి వినవలయును, ఆయననుగూర్చి మననము చేయవలయును. మనస్సును ఆయనయందు చేర్పవలయును)" అని చెప్పబడియున్నది. బుద్ధి యేకర్తయని చెప్పిన యెడల పైన చూపిన విధానమునకు అర్థమే యుండదు గదా. కావున జీవుడే కర్తయని తాత్పర్యము.

—(*) ౧౫. తక్షాధికరణమ్. (*)—

అవ॥ పై అధికరణమునందు జీవుడు కర్తయని నిర్ధారణచేసియున్నారు. దీనివలన పై అధికరణము యొక్క అవతారిక యందు చేయబడిన ఆక్షేపము (అనగా అసంగశ్రుతులకును విధివాక్య ముల

కును పరస్పరవిరోధము వచ్చునను నాక్షేపము) నకు సమాధానము చెప్పబడలేదు. జీవుడే కర్త యనినయెడల అసంగ శ్రుతులకు విరోధము నిశ్చయముగా వచ్చునుగదా. అనిన నాయాక్షేపమునకు సమాధానమును చెప్పుటకై సూత్రకారుడు ఈ యధికరణమును ఆరంభించుచున్నాడు.

సూ॥ ౪౦॥ యథాచ తక్షోభయథా ॥

టీక॥ *కింతు = ఇకనేమంటే, తక్షా = వడ్రంగి, యథా = ఎట్లో, *తథా = అట్లే, జీవోపి, జీవుడుకూడా, ఉభయథా = కర్తగాను, అకర్తగాను కూడనున్నాడు.

తా॥ లోకమునందు ఉళి, బాడిసె, మొదలగు సాధనములతో సంయోగము కలిగినప్పుడే వడ్రంగి కార్యములచేయువాడై (కర్తయై) దుఃఖమును (కష్టమును) అనుభవించునో అట్లే జీవుడుకూడ అవిద్యావశమున తనతో సంయోగము కలిగియున్న బుద్ధి మొదలగు ఉపాధులమూలముననే కర్తయై సంసార దుఃఖమును అనుభవించు వాడై యుండును. సాధనములతో సంయోగము లేనప్పుడు ఆవడ్రంగి యెట్లు కర్తకానేరడో అట్లే జీవుడుకూడ బుద్ధిమొదలగు ఉపాధులు లేనప్పుడు కర్త కానేరడు. కావున అప్పుడు ఆయనకు సంసార దుఃఖము కూడ లేదు. ఈ కారణమువలన జీవునకున్న కర్తృత్వము ఉపాధి నిమిత్తమైనదేకాని స్వాభావికమైనదికాదనియు ఈ కారణమువలన స్వభావమునుబట్టి అసంగుడనియు ఔపాధికమగు కర్తృత్వమునుబట్టి కర్తయనియు శ్రుతి జీవునిగూర్చి చెప్పుచున్నదని నిర్ణయించుటకు వీలగుననియు ఈ నిర్ణయముచే ౧౫- అధికరణము యొక్క అవతారికయందు చేయబడినపూర్వపక్షము ఖండింపబడినదనియు తాత్పర్యము.

—(*) ౧౬. పరాయత్తాధికరణమ్. (*)—

అవ॥ జీవునకు ఔపాధికమగు (ఉపాధులవలనగలిగిన) కర్తృత్వము కలదని చెప్పితిరికదా. అప్పుడు ఆకర్తృత్వము ఈశ్వరునకు స్వాధీనమైనదియా కాదా (అనగా ఈశ్వరుడు జీవునిచేత కర్మలను చేయించునా లేక జీవుడు స్వయముగానే చేయునా అనుట అనుసంశయమును ఈ అధికరణముచే నివారించు చున్నారు.

సూ॥ ౪౧॥ పరాత్తు తచ్ఛ్రుతేః ॥

టీక॥ తత్=ఆకర్తృత్వము, శ్రుతేః= వేదవాక్యమువలన, పరాత్ =పరమేశ్వరుని వలననే (ఈశ్వరాధీనమేయనుట) స్వాయంతు= స్వయముగా, న=లేదు.

తా॥ "ఏషహ్యేవ సాధుకర్మ కారయతి ( ఈ పరమేశ్వరుడే మంచిపని చేయించును. )" అను మొదలగు శ్రుతులవలన జీవునకుగల కర్తృత్వము ఈశ్వరాధీనమే కానిస్వతంత్రమైనది కాదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పినచో లోకమునందు అధర్మము జరుగుటకు వీలులేదు. ఆపరమేశ్వరుడే జీవులచేత కర్మలను చేయించుచుండునేని ధర్మమునే చేయింపవలయును గాని అధర్మమును చేయింపరాదు. ఒకనిచే ధర్మమును చేయించి మఱియొకనిచే నధర్మము చేయించుచున్నాడనిన పరమేశ్వరుని యందు సమభావము దయ అనునవి లేకపోవలసి వచ్చును. అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౪౨॥ కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధా
వైయర్థ్యాదిభ్యః ॥

టీక॥ విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః = "విధినిషేధశాస్త్రములు సార్థకములగును." అనుమొదలగు కారణమువలన, సతు= ఆపరమేశ్వరుడు, కృతప్రయత్నాపేక్షః=చేయబడిన ధర్మాధర్మరూపములగు కర్మలను అపేక్షించువాడు ( పూర్వకర్మాను గుణముగా అనంతర కర్మను చేయించుననుట. )

తా॥ పరమేశ్వరుడు పూర్వపూర్వ జన్మములయందు జీవులచే నాచరింపబడియున్న కర్మల ననుసరించి ఆయా కర్మలవలన పుట్టిన వాసనలకు ( మనస్సునందు నాటుకొనియున్న మంచితనము చెడ్డతనము మొదలగు స్వభావములకు ప్రకారములగు కార్యములను చేయవారిమనస్సులయందు ప్రేరకత్వమును సహకార్యమునుం చేయువారి చిత్తములయందు సత్స్వభావమునునాటుకొని పోవునుగదా) అనుగుణముగా ఉత్తర జన్మములయందు వారిచే కర్మలను చేయించుచుండును, ఇట్లగుటచేత అవతారికయందు చూపబడిన దోషము లేవియును సంభవింపవు. ఇట్లు చెప్పుటకు కారణమేమనిన:—లోకమునం

" ఈకార్యములను చేయవచ్చును. ఈ కార్యములను చేయరాదు. " అని వేదముచే చెప్పబడు చుండుటయు ఆ యాజ్ఞను అతిక్రమించిన వారు దుఃఖమును అనుభవించు చుండుటయు ప్రత్యక్షముగా నున్నది గదా. " ఈశ్వరుడు స్వయముగానే జీవులచే కర్మలను చేయించు చున్నాడు. " అనిన పై నిరూపించిన విషయముండుటకు వీలు లేకపోవలసివచ్చును. ఈశ్వరుడే సర్వకర్మలను చేయించు చుండెనేని వేదము ఎవనినిగూర్చి విధినిగాని నిషేధమునుగాని చెప్పును? కావున ఈశ్వరుడు పూర్వకర్మల ననుసరించియే జీవుని ప్రవర్తింప చేయుచుండు ననియు దానివలన అవతారికయందు చూపబడిన దోష మేమియును కలుగదనియు తాత్పర్యము.

—(*) ౧౭. అంశాధికరణమ్. (*)—

అవ॥ " యఆత్మనితిష్ఠన్ ( ఎవరు జీవుని యందున్నాడో ) తత్త్వమసి ( ఆ బ్రహ్మమేనీవు ) " అనుమొదలగు భేదాభేద శ్రుతులకు విరోధముకలదా లేదా అనువిషయము ఈ అధికరణమున పరిష్కరింపబడును.

సూ॥ ౪౩॥ అంశోనానావ్యపదేశా దన్యథాచాపిదా
శకితవాదిత్వమధీయత ఏకే ॥

టీక॥ నానా=అనేకముగాను ( భేదముగాను ) అన్యథాచ= మఱియొకవిధముగాను ( అభేదముగాను ) వ్యపదేశాదపి=చెప్పియుండుటవలననున్ను, జీవః=జీవుడు, అంశః=కల్పితభేదముగల పరబ్రహ్మముయొక్క అంశము, ఏకే=మఱికొందరు, దాశకితవాదిత్వం = దాశకితవాదిభావమును, అధీయతే=అధ్యయనము చేయు చున్నారు.

తా॥ అవతారికయందు చూపబడినట్లు శ్రుతులకు విరోధము లేదు. ఏలయనగా జీవునకును పరబ్రహ్మమునకును కలభేదము కల్పితభేదము. కావున ప్రత్యక్ష సిద్ధమగు భేదమునుగూర్చియే భేదశ్రుతులు చెప్పు చున్నవిగాని అభేదము పారమార్థికము అని చెప్పుట లేదు. ఈ విషయమును అభేదశ్రుతులు నిర్ణయించుచునే యున్నవికదా. కావున వీటికెంటికిని విరోధముండవలసిన యవసరములు లేదు. ఈనిర్ణయమునకు ఆధారమేమియనిన:— జీవుడు పరబ్రహ్మముయొక్క అంశము

( కల్పితమగు నంశమనుట. ) అయిన పరబ్రహ్మమునకంటే సంపూర్ణముగా వేరనిచెప్పిన అభేదశ్రుతులకును వేరుకాదని చెప్పిన భేదశ్రుతులకును " బ్రహ్మదాసాః " అను మొదలగు శ్రుతులకును ( ఇవియును భేదశ్రుతులే సూత్రమునందు ప్రత్యేకముగా చెప్పబడి యున్నందున మఱియొక మారు వ్రాయబడినది ) విరోధమువచ్చును. కావున ఘటముచే ఆవరింప బడియున్న ఆకాశము మహాకాశములోని అంశమయ్యును ఆ మహాకాశమునకంటే వేరనికాని వేరుకాదనికాని చెప్పుటకు వీలులేకుండనున్నదో అట్లే ఈ జీవుడుకూడ బుద్ధియను నుపాధిచే నావరింప బడినవాడై పరబ్రహ్మమునకంటే వేరనికాని వేరుకాదని కాని నిర్ణయించుటకు వీలులేకుండ నున్నాడు. ఈ కారణము వలనను స్వభావముగా పరబ్రహ్మము విభాగములు లేనివాడు కావునను ఈ జీవుడు కల్పితాంశమనియే నిర్ణయింప వలసియున్నది. ఈ నిర్ణయమును అనుసరించి చూచిన భేదాభేద శ్రుతులకు విరోధము కలుగదని తాత్పర్యము.

అవ॥ జీవుడు పరబ్రహ్మయొక్క అంశమనుటకు మఱియొక కారణమును చెప్పుచున్నాడు.

సూ॥ ౪౪॥ మంత్రవర్ణాచ్చ ॥

టీక॥ మంత్రవర్ణాచ్చ=మఱియొకశ్రుతివలనకూడ, జీవః= జీవుడు, పరమేశ్వరస్య అంశః=పరమేశ్వరునియొక్క అంశమే.

తా॥ " పాదోస్య సర్వాభూతాని ( ఈ సర్వభూతములును ఆ పరమేశ్వరునియొక్క అంశము )" అను శ్రుతివలన కూడా జీవుడు పరబ్రహ్మముయొక్క అంశమేయని తెలియుచున్నదని తాత్పర్యము.

సూ॥ ౪౫॥ అపిచ స్మర్యతే ॥

టీక॥ అపిచ = మఱియు, స్మర్యతే=స్మృతియందుకూడ నిట్లే చెప్పబడియున్నది.

తా॥ " మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ( అనాదియై నాయొక్క అంశమే ఈ లోకమునందు జీవ స్వరూపముతో నున్నది ) " అనుస్మృతినిబట్టి చూచినను జీవుడు పరబ్రహ్మ యొక్క అంశమేయని సిద్ధాంతమగునని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పిన పరబ్రహ్మము కూడ సుఖదుఃఖములు కలవాడు కావలయుననిన నట్లు కాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౪౬॥ ప్రకాశాది వన్నైవం పరః ॥

టీక॥ ప్రకాశాదివత్=కాంతిమొదలగు వానివలె, పరః = పరబ్రహ్మము, నైవం=జీవునివలె సుఖదుఃఖాదులను అనుభవింప వలసిన పనిలేదు.

తా॥ సూర్యకాంతి వంకరగనుగు కఱ్ఱ మొదలగు వాని వలన ఆవరింప బడినదై వంకరగా కనుపడినను సంపూర్ణమగు ప్రకాశము (ప్రకాశమంతయుఅనుట) వంకర కావలసినపనిలేదు. ఎట్లనగా:— ఘటము మొదలైనవానిచే నావరింపబడిన యాకాశము తనయావరణముయొక్క కదలికలవలన కదలిక గలిగి యున్నప్పటికిని మహాకాశమంతయును ఎట్లుకదలిక గలిగియుండదో అట్లే జీవుడు ఉపాధి వలన సుఖదుఃఖములను అనుభవించు చున్నను పర బ్రహ్మమునకు ఆ అనుభవము కలుగ వలసిన పనిలేదని తాత్పర్యము.

సూ॥ ౪౭॥ స్మరంతిచ ॥

టీక॥ వ్యాసాదయః=వ్యాసుడు మొదలగువారు, ఏవం=ఈపైన చెప్పిన ప్రకారముగా (జీవునకు దుఃఖము కలదనియు ఈశ్వరునకు లేదనియు) స్మరంతిచ = తమ తను స్మృతులయందు కూడా చెప్పియున్నారు.

తా॥ “తత్రయః పరమాత్మా సౌస నిత్యోనిర్గుణస్మృతః। నలిప్యతేఫలైశ్చాపిపద్మపత్రమివాంభసా ॥ కర్మాత్మా త్వపరోయోసౌ మోక్షబంధైస్సయుజ్యతే” (ఆ జీవేశ్వరులలో నిత్యుడనియు నిర్గుడనియు ఏ ఈశ్వరుడు చెప్పబడుచున్నాడో ఆయన తామరాకు నీటితో సంబంధపడనట్లు సుఖదుఃఖ రూపములగు ఫలములతో సంబంధపడడు. జీవాత్మ మాత్రము బంధ మోక్షములతో కూడియుండును.) అని వ్యాసాదులు తమ స్మృతులయందు అవిద్యోపాధిలేనివాడగుటచే, బ్రహ్మకు సుఖదుఃఖానుభవము లేదనియు ఆ ఉపాధికలవాడగుటచే జీవునకు అసంబంధము కలదనియు చెప్పియున్నారు. ఈ

స్మృతి ప్రమాణమును అనుసరించి చూచినను పరమేశ్వరునకు సుఖ దుఃఖాదులు కలుగవలసిన పనిలేదని తాత్పర్యము.

అవ॥ సర్వశరీరములయందు ఉన్నజీవు డొకడేయని చెప్ప వలసి వచ్చుటచే మీ సిద్ధాంతమునందు సర్వజాతులును ఒకటియే కా వలసి వచ్చును. దీనినంగీకరింప వలయును, దీనిపరిత్యజింపవలయును అను విధి నిషేధములకు అప్పుడు అవకాశముండదు. అనిన అట్లు కా దని చెప్పు చున్నాడు.

సూ॥ ౪౮॥ అనుజ్ఞాపరిహారౌ దేహసంబంధా జ్జ్యోతిరాదివత్ ॥

టీక॥ జ్యోతిరాదివత్ = అగ్నిమొదలగు దానివలె (ఆయావస్తువుల సంబంధముచేత ఒక అగ్నియే అంగీకరింప తగినవాడుగాను, అంగీకరింప తగనివాడుగాను కూడ నున్నట్లు) దేహ సంబంధాత్ = దేహముతో సంబంధపడి యుండుటవలన, ఆత్మనః = జీవుడు, ఒక డే మైయున్నప్పటికిని అనుజ్ఞాపరిహారౌ = అంగీకారము అంగీకారము లేక పోవుట ఈ రెండును, భవతః = అగును.

తా॥ అగ్ని ఒకడే అయినను స్మశానము నందున్నచో తీసి కొన కూడదనియును పరిశుద్ధములగు ఇతర స్థలములందున్న చో తీసు కొనవచ్చుననియును యెట్లు చెప్పుచున్నామో మల మూత్రము లలో భేదమేమియును లేకున్నను అవి గోవునకు సంబంధించి యున్నప్పుడు మాత్రము పవిత్రములనియు ఇతరజాతికి సంబంధించి యున్నప్పుడు మాత్రము అపవిత్రములనియు యెట్లు చెప్పుచున్నామో అట్లు జీవుడు కూడ ఒకడే అయినను దేహముమొదలగు ఉపాధులసంబంధమును బట్టి "ఇతడు శ్రేష్ఠుడు వీనిని చేర్చుకొనవచ్చును, ఈతడుదుష్టుడు వీనిని చేర్చుకొనరాదు" అను వ్యవహారములు సంభవించును. కావున అవతారికయందు చూపబడిన దోషము మా సిద్ధాంతమునందు కలుగ నేరదని తాత్పర్యము.

అవ॥ పైన చెప్పిన దోషము కలుగక పోయినను మరియొక దోషమువచ్చును. సర్వ శరీరములయందును కర్తయై యుండు జీవుడు ఒకడేయనిన పురుషుల కందరకును అనుభవములోనున్న కర్మఫలము

ఒకటేరీతిగనే యుండవలసి వచ్చును. కర్తయొక్కడైన అతడు చేయు కర్మలుకూడ నొకటేరీతిగనే యుండవలయునుగదా. ఈ ప్రత్యక్షవిరోధమును ఎట్లు పరిహరించుకొనియెదరు? అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౪౯॥ అసంతతేశ్చా వ్యతికరః ॥

టీక॥ ఉపాధీనాం = ఉపాధులు, భిన్నతయా = వేరువేరుగా నుండుటచేత, జీవానామపి = జీవులకుకూడ, అసంతతేః = సర్వశరీరములయందును సంబంధములేను కావున, అవ్యతికరః = జీవధర్మములగు సుఖదుఃఖాదులు ఒకటిగా నుండవలసిన పనిలేదు.

తా॥ పూర్వపక్షమునందు చూపిన విరోధము కలుగ నేరదు. అనాదులగు కర్మవాసనలచే నావరింపబడియున్న మనస్సులు వేరువేరగుటచే ఉపాధిభేదమునుబట్టి జీవుడుకూడ వేరువేరుగా నున్నాడనియే చెప్పవలయును. దానివలన జీవులకు అందరకును ధర్మాధర్మములు మొదలగునవి ఒకటేరీతిగా నుండవలయునని చెప్పుటకు అవకాశము లేదని తాత్పర్యము.

యన్. బి. ఈ సూత్రమునందలి వ్యతికర శబ్దమునకు సంకరము. (అన్నియును కలిసిపోవుట.) అని అర్థము. సర్వశరీరములయందును ఒకటేజీవుడే వ్యాపించి యున్నాడనిన ధర్మాదులు ఒకటేవిధముగా నుండవలసి వచ్చుటచేతను ప్రత్యక్షమునందు అట్లులేక పోవుటచేతను, రాముడనుభవించు ఫలములు కృష్ణుడును, కృష్ణుడనుభవించు ఫలములు, రాముడును, అనుభవింపవలసివచ్చును. కావున జీవగుణములన్నియును సంకరమును పొందవలయును. ఈ విషయము నంతయును మనస్సునందుంచుకొని వ్యతికరపదమునకు "జీవగుణములన్నియు నొకటే విధముగా నుండుటఅని అర్థముచెప్ప బడియున్నది."

సూ॥ ౫౦॥ ఆభాస ఏవచ ॥

టీక॥ జీవః = జీవుడు, బ్రహ్మణః = పరబ్రహ్మయొక్క, ఆభాస ఏవ = ప్రతిబింబమే.

తా॥ జీవుడు అనువాదః బుద్ధియను ఉపాధియందు ప్రతిబింబించిన పరబ్రహ్మముయొక్క ప్రతిబింబమే. ఇంతకుపూర్వము "పరబ్రహ్మముయొక్క అంశము" అనుటకుకూడ "ప్రతిబింబరూపమగు

అంశము " అనియే అర్థమని గ్రహింపవలయును. ఇట్లగుటచేత అనేక జల ఘటములయందు ప్రతిబింబించిన సూర్యప్రతిబింబములలో నొకదానికి చలనము కలిగినయన్నిటికిని ఆ చలనము ఎట్లు కలుగదో అట్లే ఒకజీవునకు కలుగు ననుభవము అందరు జీవులకును కలుగ వలసిన పనిలేదనుట మిక్కిలి యుక్తి యుక్తమని తాత్పర్యము.

అవ॥ ఇట్లు తన సిద్ధాంతమును నిర్ణయించి పర మతములపై దోషములను చూపుచున్నాడు.

సూ॥ ౫౧॥ అదృష్టానియమాత్ ॥

టీక॥ అదృష్టానియమాత్ = అదృష్టమును నియమించుటకు వీలు లేదు కావున ("ఇది యీజీవుని అదృష్టము. ఇదియీజీవుని అదృష్టము " అని నిశ్చయించుటకు వీలు లేదు కావున, ) సుఖాదిసాంకర్యం= జీవుల సుఖదుఃఖములకు సంకరము కలుగును ( విభాగమేర్పడదనుట.)

తా॥ జీవు లనేకులు జ్ఞాన స్వరూపులు సర్వ వ్యాపకులు అని సాంఖ్యులు చెప్పుదురు. జీవులు జడస్వరూపులు సర్వవ్యాపకులు అనేకులు వారికిమనస్సుయొక్క సంయోగమువలన జ్ఞానముపుట్టును, అని వైశేషికులు చెప్పుదురు. ఈ రెండుమతములయందును ప్రతిజీవునకును సర్వ శరీరములతోను సంబంధము కలిగియుండుటచేత " ఈ జీవుని అదృష్టమువలన ఈ అనుభవము కలిగినది. ఈ జీవుని అదృష్టమువలన యీ అనుభవము కలిగినది." అని నిర్ణయించుటకు వీలులేదు. కావున ౪౯ వ- సూత్రమునందు చూపబడిన దోషము వీరి మతములయందే వచ్చును కాని మనమతమందు రానేరదని తాత్పర్యము.

సూ॥ ౫౨॥ అభిసంధ్యాదిష్వపిచైవం ॥

టీక॥ అపిచ= మఱియు, అభిసంధ్యాదిషు= జ్ఞానము చేయవలననుతలంపు మొదలగు వానియందుకూడ, ఏవం = ఇట్లే సాంకర్యము వచ్చును.

తా॥ మఱియు జీవులు సర్వవ్యాపకులుఅని అంగీకరించు మతములయందు పైసూత్రములయందు వర్ణింపబడిన ప్రకారము కేవల సుఖదుఃఖాద్యనుభవ విషయములందేగాక ఆ అనుభవములకు హేతువులగు కర్మల విషయమునందును ఆకర్మల చేయుటకు కారణములైన

జ్ఞానము చేయవలయునను తలంపు మొదలగు వానియందునుకూడసాం కర్యదోషము కలుగును. ప్రతి జీవుడును సర్వవ్యాపియేకావున " ఈ జీవుడు యీకర్మను చేయుటకు సంకల్పించెను. ఈ జీవుడు యీకర్మ ను చేయుటకు సంకల్పించెను. " అని విభాగముచేయుటకు వీలుండదు గదాయని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుటసరికాదు. జీవులు సర్వ వ్యాపకులైనను ఒక్కొక్క-జీవునకు ఒక్కొక్క శరీరమునందు జ్ఞానము సంకల్పము మొదలగునవి కర్మానుగుణముగా కలుగుచుండును. ఇది లోకమునందు ప్రత్యక్షముగనే యున్నదిగదా ( అనగా " రాముడిట్లు సంకల్పించెను, గోవిందుడు దీనిని తెలిసుకొనినాడు " అని లోకమునందు ఒక్కొక్క జీవునివిషయమై ప్రత్యేకముగా సంకల్పాది కార్యములు నిర్ణయింపబడుచున్నవిగదా యనుట ) ఈ ప్రత్యక్షము ననుసరించి చూచిన సుఖదుఃఖాదులకు సాంకర్యములేదనియే చెప్పవచ్చును అనిన నట్లు కాదని నిరూపించుచున్నాడు.

సూ॥ ౫౩॥ ప్రదేశాదితిచేన్నాంతర్భావాత్ ॥

టీక॥ ప్రదేశాత్ = ఒక్కొక్క-జీవునకు ఒక్కొక్క స్థలమని నిర్ణయింపబడి యుండుటవలన, న సుఖాదిసాంకర్యం= సుఖము మొదలగువానికి సాంకర్యము కలుగనేరదు, ఇతిచేత్ =అనేమొడల, న=అది సరికాదు. కుతః = ఎందుచేతననగా, జీవానాం సర్వత్ర అంతర్భావాత్ =జీవులు అన్ని శరీరములయందును ఉన్నారు కావున.

తా॥ అవతారికయందు చూపబడిన యుక్తి మీ ( సాంఖ్య వైశేషిక ) మతములపై జూపబడిన సుఖాది సాంకర్య దోషమును నివారణ చేయనేరదు. ఏలయనగా మీ మతమునందు జీవులందరును సర్వ వ్యాపకులేయగుటచేత " ఈ జీవుని శరీరము ఇది. ఈ జీవుని శరీరము ఇది " అని నిర్ణయించుటకే మొట్టమొదట వీలు లేదు కదా. కావున మీ మతముపై జూపబడిన దోషము నెవ్వరును నివారణచేయ నేరరు. దీనినిబట్టిచూచిన " జీవుడు పరబ్రహ్మముయొక్క ప్రతిబింబము, ఉపాధులు వేరు వేరగుటచే వేరు వేరుగా నున్నట్లు గనబడుచున్నాడు. " అనిచెప్పు మాసిద్ధాంతమే నిర్వివాదమైనదని తాత్పర్యము.

నవియదశ్రుతేస్సప్తదశత్రి పంచాశత్ ॥ ౧౭॥ ౫౩॥

నవియదశ్రుతే, శ్వేతేనమాతరిశ్వా, అసంభవస్తు, తేజోఽత, ఆపః, పృథివీ, తదభిధ్యానా, ద్విపర్యయేణ్ణాం, తరా, చరాచరవ్యపాశ్రయో, నాత్మా, జ్ఞోఽత, ఉత్క్రాంతి గత్యాగతీ, కర్తా, యథా చతక్షా, పరాత్తత్వం, శోనానా, సప్తదశ॥ ౧౭॥

ఇతి శ్రీబ్రహ్మసూత్రే ద్వితీయస్యాధ్యాయస్య తృతీయఃపాదః.
ఇట్లు ద్వితీయాధ్యాయమునందు తృతీయపాదము
ముగిసెను.



ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## ద్వితీయాధ్యాయము - చతుర్థపాదము.

—(*) ౧. ప్రాణోత్పత్త్యధికరణమ్. (*)—

అవ॥ " ఋషయోవావతేఽగ్రేసదాసీత్ కతి తేత ఋషయఇతి ప్రాణావావ ఋషయః " (ఆ ఋషులు సృష్టికంటే పూర్వముండిరి. ఆ ఋషులెవ్వరు? ఇంద్రియములు) " ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ " (ప్రాణములును, మనస్సును, యీసమస్తయింద్రియములును ఆ పరబ్రహ్మమునుండి పుట్టును,) " అను శ్రుతులయందు ఇంద్రియములు పుట్టలేదని యొకచోటను పుట్టునని యొకచోటను చెప్పబడియున్నది. ఈ శ్రుతులకు పరస్పర విరోధము కలదా? లేదా? అను సంశయము ఈ యధికరణముచే నివారింపంబడుచున్నది.

సూ॥ ౧॥ తథా ప్రాణాః ॥

టీక॥ తథా=ఆప్రకారముగానే (ఆకాశము మొదలగునవి పుట్టినట్లు,) ప్రాణాః=ఇంద్రియములుకూడ, జాయతే=పుట్టుచున్నవి.

తా॥ "ఏతస్మాజ్జాయతే ప్రాణః" అను మొదలగు ఉత్పత్తిశ్రుతి యందు ఆకాశాదులతో కూడ ఇంద్రియములయొక్క ఉత్పత్తికూడ తెలియజేయబడుచున్నది. కావున ఆకాశాది భూతములవలెనే ఈ ఇంద్రియములుకూడ పుట్టినవేయని తాత్పర్యము.

అవ॥ ఈ ఇంద్రియోత్పత్తిశ్రుతి గౌణి (అప్రధానమైనది) కావచ్చునుకదా, అనిన అట్లు కానేరదని చెప్పుచున్నాడు.

సూ॥ ౨॥ గౌణ్యసంభవాత్ ॥

టీక॥ అసంభవాత్ = అసంభవదోషము వచ్చునుగావున (తలంచినరీతిగా చెప్పుటకు వీలులేదుకావున) శ్రుతిః = ప్రాణోత్పత్తిశ్రుతి, గౌణీ = అప్రధానమైనది, న = కానేరదు.

తా॥ ఒక్క పరబ్రహ్మము నెఱింగినచో సర్వప్రపంచమును తెలిసికొనుటకు వీలగునని శ్రుతియందు ప్రతిజ్ఞ చేయబడియున్నది. ఆకాశాది ప్రపంచమంతయు పరబ్రహ్మమునకు కార్యమైయుండగా ఈ ఇంద్రియములు మాత్రము వేరుగానున్నవని చెప్పుటకు వీలులేదు. అట్లు చెప్పినయెడల పరబ్రహ్మమును తెలిసికొనుటచే ఈయింద్రియములను తెలిసికొనుటకు వీలులేదుకదా. కావున ప్రాణోత్పత్తిశ్రుతి అప్రధానమని చెప్పుటకు వీలులేదని తాత్పర్యము.

సూ॥ ౩॥ తత్ప్రాక్ శ్రుతేశ్చ॥

టీక॥ తత్ = అపుట్టుక, ప్రాక్ = మొదటనున్న ప్రాణాదులయందుకూడ, శ్రుతేశ్చ = వినబడుటవలన, న గౌణీ = ఆశ్రుతి అప్రధానము కాదు.

తా॥ ఏతస్మాజ్జాయతే అను మొదలగు శ్రుతిచే చెప్పబడుచున్నపుట్టుక ఆకాశాదులయందు ప్రధానముగానే చెప్పబడుచున్నది యని మీరు (పూర్వపక్షులు) కూడ నంగీకరించుచున్నారుకదా. ఒకటేవాక్యమునందు, ౫,౬ పదార్థములనుగూర్చియొక విషయము చెప్పబడినచో అదికొన్నిటినిగూర్చి ప్రధానముగాను కొన్నిటినిగూర్చి అప్రధానముగాను చెప్పబడియున్నదనుట యుక్తియుక్తము కాదుగదా. కావున ఉత్పత్తిశ్రుతి గౌణికానేరదని తాత్పర్యము.

సూ॥ ౪॥ తత్పూర్వకత్వాద్వాచః ॥

టీక॥ వాచః=వాక్కు, మనస్సు, ప్రాణములు, ఇవి, తత్పూర్వకత్వాత్=తేజస్సు, జలము, పృథివి వీటివలన పుట్టినవని చెప్పుట వలన, ప్రాణాఉత్పద్యంతే=ప్రాణములు పుట్టుచున్నవి.

తా॥ " అన్నమయంహిసౌమ్యమనః " అనుమొదలగు శ్రుతులవలన మనస్సు, ప్రాణములు, ఇంద్రియములు, ఉత్పత్తికలవని స్పష్టముగా చెప్పబడియున్నవి. పైన చెప్పినప్రకారము ఏతస్మాజ్జాయతే అన్నశ్రుతియు అప్రధానముకాదు. ఋషయోవావ అను మొదలగు శ్రుతిచెప్పువిషయము వేరు. ఈకారణములవలన ఇంద్రియములు ఉత్పత్తికలవియేయనియు శ్రుతులకు విరోధము లేదనియు సిద్ధాంతమైనదియని తాత్పర్యము.

—(*) ౨. సప్తగత్యధికరణమ్. (*)—

అవ॥ " సప్తప్రాణాఃప్రభవంతి " (ఏడు ఇంద్రియములుపుట్టుచున్నవి) అను మొదలగు వాక్యములచే వేదమునందు ఇంద్రియములు ఏడనియు ౭ ది అనియు, ౮ ది అనియు, ౧౦ ది అనియు, ౧౧ అనియు, ౧౨ అనియు, ౧౩ అనియు, ఇట్లు అనేకచోట్ల అనేక విధములుగా చెప్పబడియున్నవి. ఇచ్చట నిర్ణయమెట్లు అను సంశయమును ఈ అధికరణమునందు పరిష్కరించువాడై మొట్టమొదట పూర్వపక్షము ననువాదము చేయుచున్నాడు.

సూ॥ ౫॥ సప్తగతేర్విశేషితత్వాచ్చ॥

టీక॥ గతేః=వేదమునందు ప్రత్యక్షముగానే చెప్పబడియుండుటచేతను, విశేషితత్వాచ్చ=విశేషణముచే బాగుగనిర్ణయింపబడియుండుటచేతను, తానిసప్త = ఆఇంద్రియములుఏడే.

తా॥ సప్తప్రాణాః = అను శ్రుతియందు ప్రత్యక్షముగానే ఇంద్రియములు ఏడని చెప్పబడియున్నది. మఱియు " సప్తవైశీర్షణ్యాఃప్రాణాః " ( శిరస్సునందున్నఏడును ఇంద్రియములు ) అనిసవిశేషముగ నిర్దేశింపబడియున్నవి. కావున ఇంద్రియములు ఏడనుటయే నిశ్చయము. ఇట్లుచెప్పుటవలన ఇంద్రియములు ౭, ౮, అను మొదలగు విషయములుచెప్పు శ్రుతులకు విరోధముపచ్చునుగదాయని తలంచవలదు. అంతఃకరణ మొకటియయ్యును సంకల్పము నిశ్చయముమొదలగు

వృత్తిభేదములనుపట్టి నాలుగువిధములుగలదిగా ఎట్లు చెప్పబడుచున్నదో అట్లే ఇంద్రియములు ఏడేయైనను వాటివాటి వృత్తిభేదములచే అనేకవిధములుగలవిగా చెప్పబడవచ్చును. కావున ఇంద్రియములు ఏడే అనిచెప్పుట యుక్తియుక్తమని తాత్పర్యము.

అవ॥ పైసూత్రమునందు చేయబడిన పూర్వపక్షమును ఖండించుచున్నాడు.

**సూ॥ ౬॥ హస్తాదయస్తుస్థితేఽతో నైవం॥**

టీక॥ శ్రుతౌతు=శ్రుతియందైతే, హస్తాదయః=హస్తము మొదలగునవి, శ్రూయంతే=వినబడుచున్నది. అతః=ఈకారణమువలన, సప్తాతిరిక్తత్వే = ఏడుకంటె అధికసంఖ్యగలిగియుండుట, స్థితేసతి= ఉండగా, ఏవం=ఈవిధముగా ( ఇంద్రియములు ఏడేయని ) నమంతవ్యం = తలంపగూడదు.

తా॥ పై పూర్వపక్షము సరియైనదికాదు. "హస్తోవైగ్రహః" ( చేయికూడా పురుషునిబంధించునదియే, ఇంద్రియమనుట ) అనుమొదలగు శ్రుతులచేత పూర్వపక్షమునందుచూపిన ఏడు ఇంద్రియములకంటే అధికముగా పాణిపాదాది ఇంద్రియములు వర్ణింపబడియున్నవి. ఇట్లుచెప్పుటచేత సప్తసంఖ్యయే నిశ్చయమని సిద్ధింపదు. కావున పూర్వపక్షమునందు చేసిన నిర్ణయము దోషయుక్తమైనది. కావున జ్ఞానేంద్రియములు అయిదును కర్మేంద్రియములుఅయిదును ప్రత్యక్షానుభవసిద్ధములైన శబ్ద స్పర్శ రూపరస గంధములను పట్టిచూచిన నేర్పడుచున్నది. ( అనగా శబ్దాదులను గ్రహించుటకు జ్ఞానేంద్రియములును వానివిషయములైన కర్మల నాచరించుటకు కర్మేంద్రియములును ఉన్నవనుట ప్రత్యక్షసిద్ధమేయనుట ) వీనిని ప్రేరేపించు నంతఃకరణ మొకటికలదనుటయును ప్రత్యక్షమే. ఈప్రత్యక్షమున కనుగుణముగా శ్రుతికూడా ఇంద్రియములు పదకొండు అను విషయమును చెప్పుచునే యున్నదికదా. కావున ఇదియే సిద్ధాంతము. ఇంద్రియములు ఏడనుచెప్పు శ్రుతిముఖమునందున్న నేత్రశ్రోత్రాది గోళకములనుపట్టి చెప్పినదవలయునేకాని ఇంద్రియముల నుద్దేశించి చెప్పినదనుటకువీలులేదు. అచ్చటనున్నవి అయిదు ఇంద్రియములేకదా. ఈవిధ

ముగనే తక్కినశ్రుతులనన్నిటిని సమన్వయముచేసికొనవచ్చును. పదు నొకటికంటే అధికమగు సంఖ్యనుచెప్పుశ్రుతులను మనోభేదపరము లగువానినిగా నిర్వహించుకొనుటయంతయును సయుక్తికముగనుం డును. కావున ఇంద్రియములు ౧౧, అని చెప్పుటయే సిద్ధాంతమని తాత్పర్యము.

—(*) ౩. ప్రాణాణుత్వాధికరణమ్. (*)—

అవ॥ ఇంద్రియములు విభువులు ( సర్వవ్యాపకములు ) అని సాంఖ్యమతస్థులు చెప్పుదురు. వారిమతమును దూషించుటకై ఈ అధి కరణము నారంభించు చున్నాడు.

సూ॥ ౭॥ అణవశ్చ ॥

టీక॥ ఏతే=ఈప్రాణములు ( ఇంద్రియములు ) అణవః= సూ క్ష్మములైనవి.

తా॥ ఇంద్రియములు సర్వవ్యాపకములనినచో ఎంతదూరమున నున్నవారితోకూడా మాటలాడుట వారినిస్పృశించుట మొదలగునవి కలుగవలసివచ్చును. ఇది ప్రత్యక్షమునకు విరుద్ధముకదా. కావున ఇంద్రియములు పరిచ్ఛిన్నములనియు సూక్ష్మములనియు చెప్పుటయే యుక్తము. అప్పుడు శ్రుతులు మొదలగు ఏప్రమాణమునకును విరోధ మురాదని తాత్పర్యము.

—(*) ౪. శ్రేష్ఠాధికరణమ్. (*)—

అవ॥ పై మూడు అధికరణములయందును ఇంద్రియములను గూర్చిచెప్పి ఇచ్చట ప్రాణములుకూడా పరబ్రహ్మమునందు పుట్టినవే యని నిరూపించుచున్నాడు.

సూ॥ ౮॥ శ్రేష్ఠశ్చ॥

టీక॥ శ్రేష్ఠశ్చ = ముఖ్యప్రాణముకూడా, జాయతే = పుట్టు చున్నది.

తా॥ రెండవ అధ్యాయము నాల్గవపాదమునందలి మొదటి అధికరణమునందు ఇంద్రియోత్పత్తినిగూర్చి నిర్ణయింపబడియున్నది కదా. అచ్చటజూపబడిన యుక్తులచేతనే ప్రాణోత్పత్తినికూడా నిర్ణ యింపవచ్చును. "ఏతస్మాజ్జాయతేప్రాణః" అను శ్రుతి ఇంద్రియ

ప్రాణముల యుత్పత్తినిగూర్చి చెప్పుచునే యున్నది గదా. కావున ప్రాణముకూడా పరబ్రహ్మము నుండిపుట్టినదినేయని తాత్పర్యము.

—(*) ౫. నవాయు క్రియాధికరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా ప్రాణోత్పత్తిని చెప్పి ఈ అధికరణము నందు దానిస్వరూపమును చెప్పుచున్నాడు.

సూ॥ ౯॥ నవాయుక్రియే పృథగుపదేశాత్॥

టీక॥ పృథక్=ప్రత్యేకముగా ( వాయువునకంటెను ఇంద్రియములకంటెను వేరుగా, ) ఉపదేశాత్=చెప్పుటవలన, ప్రాణః=ప్రాణము, వాయుక్రియే = మహా వాయువనిగాని ఇంద్రియములయొక్క వ్యాపారమనిగాని, నవక్తవ్యః=చెప్పుటకు వీలులేదు.

తా॥ సాంఖ్య మతస్థులు ఇంద్రియ వ్యాపారమే ప్రాణమని చెప్పుదురు. శ్రుతియందు మహా వాయువే ప్రాణమని యొకచోటను మహావాయువునకంటెను ఇంద్రియములకంటెను ప్రాణము వేరని మఱి యొకచోటను చెప్పబడియున్నది. కావున ఇందు నిర్ణయమేమనిన:— ఛాందోగ్య శ్రుతియందు మనోరూపుడగు పరబ్రహ్మమును ఉపాసన చేయవలయునని చెప్పుచు ఆ పరబ్రహ్మమునకు వాక్కు ప్రాణము నేత్రము శ్రోత్రము అను నాలుగు పాదములని చెప్పబడియున్నది. అందు వాగాది ఇంద్రియములకంటే ప్రాణము వేరని చెప్పబడి యుండుటచేత ( " ఇంద్రియ వ్యాపారమే ప్రాణము, " అని చెప్పుటకు వీలులేదు. ) ఇంద్రియ వ్యాపారమే అయియున్న వస్తువు ఇంద్రియ మునకంటే వేరని చెప్పబడుట యుక్తముగదా. మఱియు పైన వివరించిన ప్రకరణమునందే " ప్రాణఏవ బ్రహ్మణశ్చతుర్థః పాదః సవాయునైవ జ్యోతిషా భాతితపతి ( ఈ ప్రాణమే మనోరూప బ్రహ్మకు నాల్గవ పాదము. ఆ ప్రాణము వాయువుచే ప్రకాశించును. తేజస్సుచేత స్వకార్యములయందు ప్రవర్తించును. )" అను వాక్యము చేత " ప్రాణము వాయువుకంటే వేరు " అనికూడ చెప్పబడి యుండుటచే " వాయువే ప్రాణము " అని చెప్పుటకుకూడ వీలులేదు. కావున ఈ ప్రాణము మఱియొక పదార్థమేకాని వాయ్వింద్రియములు ( ఇంద్రియములనగా ఇంద్రియ వ్యాపారములనుట ) కావనుటయే

సిద్ధాంతమైయున్నది. అయినను ఇది వాయు వికారమేకావున దీనికిని (ప్రాణమునకును) వాయువునకును స్వాభావికమగు అభేదము కల్పితమగు భేదము ఈ రెండు యుండుటచేత "యః ప్రాణస్స వాయుః ప్రాణము" అని చెప్పు శ్రుతికిని "ప్రాణము వాయువుకంటే వేరు" అని చెప్పు శ్రుతికిని పరస్పర విరోధములేదని తెలిసి కొనవలయునని తాత్పర్యము.

అవ॥ ఇట్లు ప్రాణ స్వరూపమును నిర్ణయించి అది జీవునకు సాధనమైనదియేకాని స్వతంత్రముకాదని చెప్పుచున్నారు.

సూ॥ ౧౦॥ చక్షురాదివత్తు తత్సహ శిష్ట్యాదిభ్యః॥

టీక॥ తు=ఆముఖ్యప్రాణము, తత్సహ శిష్ట్యాదిభ్యః= చక్షురాదులతో పాటు జీవునిచే శాసింపబడుట మొదలగు కారణముల వలన, చక్షురాదివత్=నేత్రములు మొదలగు వానివలె, జీవోపకరణ భూతః=జీవునకు సాధన భూతమైనది.

తా॥ ఈ ప్రాణముకూడ నేత్రములు మొదలగు ఇంద్రియముల వలె జీవునిచే శాసింపబడుచున్నది. మఱియు ఇది అచేతనము భూతములవలన జనించినది. అనే కారణములవలనను ఇది స్వతంత్రము కాదనియు ఇంద్రియములవలె జీవునకు సాధనమేయనియు నిర్ణయింపవలయునని తాత్పర్యము.

అవ॥ ఈ నిర్ణయము దోషయుక్తమైనది. వినుట స్పర్శమును గ్రహించుట మొదలగు పదునొకండు విషయములుతప్ప మఱియొక విషయమేదియును కనుబడుటలేదు. పై పదునొకండు విషయములను నిర్వహించుటకు శ్రోత్రము మొదలు పదునొకండు ఇంద్రియములును గలవు. ఈ ప్రాణముకూడ జీవుని కుపకరణమే యనిచెప్పినచో దీనిచే నిర్వహింపబడుటకు పండ్రెండవ విషయ మొకటుండవలెను. "ఉపకరణము అనిన" దానిచే నేదోయొకవిషయము నిర్వహింపబడునని చెప్పియే తీరవలయునుగదా. అను సందేహమునకు సమాధానము చెప్పుచున్నారు.

సూ॥ ౧౧॥ అకరణత్వాచ్చ నదోషస్తథాహిదర్శయతి॥

టీక॥ తస్య=ఆప్రాణము, అకరణత్వాత్=ఇంద్రియము కాదు

గనుక, నదోషః=పైచెప్పిన దోషమురాదు, తథాహి=అదియుక్తమే గదా, భిన్నంవ్యాపారం=ఇంద్రియ వ్యాపారముకంటె వేరగు మరియొక వ్యాపారమును, శ్రుతిఃదర్శయతిహి=వేదముచూపుచున్నదికదా.

తా॥ ఈ ప్రాణము ఇంద్రియములలో చేరినదికాదు కావున అవతారికయందు చూపబడిన దోషము రానేరదు. ఇదియును జీవునకు సాధనమేయగుటచేత దీనికికూడ నొక వ్యాపార ముండవలయును కదా. ఆ వ్యాపార మెట్టిదనిన వివరించెదను. వినుట మొదలగు పదునొకండు కార్యములకంటె ఇతరమగు వ్యాపారము కనబడ లేదనుట పొసగదు. శరీరమును ధరించుటయనునది ఆపదునొకండింటికంటెను వేరైనదియే కదా. శ్రోత్రాది ఇంద్రియము లేవియును దానిని చేయనేరవనుట స్పష్టము. కావున జ్ఞానప్రధానములగు ఇంద్రియ వ్యాపారములవంటి వ్యాపారము లేనిదైనను ప్రాణము శరీరధారణరూపమగు వ్యాపారము కలిగియున్నది. శ్రుతియు "ప్రాణేనరక్షన్నవరంకులాయం (నానావిధములగు అసహ్య పదార్థములకు స్థానమగు నీశరీరమును ప్రాణముద్వారా రక్షించుచు)" అను వాక్యముచే శరీరస్థితికి ప్రాణస్థితియే ఆధారమని చెప్పుచున్నది. కావున ప్రాణము జీవున కుపకరణమనుటలో నేవిధమగు బాధయును లేదని తాత్పర్యము.

సూ॥ ౧౨॥ పంచవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే ॥

టీక॥ మనోవత్=మనస్సువలె, సః=ఆ ప్రాణముకూడ, పంచవృత్తిః=అయిదువిధములైన వృత్తులు గలదిగా, వ్యపదిశ్యతే=చెప్పబడుచున్నది.

తా॥ యోగశాస్త్రమునందు మనస్సు ప్రమాణము విపర్యయము వికల్పము నిద్ర స్మృతి అను నైదువ్యాపారములు కలదిగా చెప్పబడుచున్నట్లు ఈ ప్రాణముకూడ ఉచ్ఛ్వాసము నిశ్శ్వాసము శరీరమునందంతయును వ్యాపించి చలనాదులను గలిగించుట హేయములగు అన్నపానాదులనుగాని మరణకాలమునందు జీవునిగాని శరీరమునుండి వెడలించుట ఆహార పదార్థములను పచనముచేసి దానివలన నేర్పడిన రక్తము మొదలగువానిని సర్వశరీరమునకును పంచిపెట్టుట అను అయిదుకార్యములు కలదిగా చెప్పబడుచున్నది. పైన వర్ణించిన వ్యాపార

ములను చేయునప్పుడు ప్రాణమునకు క్రమముగా ప్రాణమనియు అపానమనియు వ్యానమనియు ఉదానమనియు సమానమనియు పేర్లు. ఈ విధముగా దేహధారణ రూపమగు వ్యాపార మొకటియు పైన నిరూపించిన అయిదు కార్యములును ప్రాణముచేత నిర్వహింప బడు చున్నవి గావున అదిజీవునకు సాధనమనుటలో సంశయ మేమియును లేదని తాత్పర్యము.

—(*) ౬. అణుత్వాధి కరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా ప్రాణముయొక్క ఉత్పత్తిని స్వరూపమును నిర్ణయించి ఈ అధికరణమునందు దాని పరిమాణమును నిర్ణయించు చున్నాడు.

సూ॥ ౧౩॥ అణుశ్చ ॥

టీక॥ సచ = ఆ ప్రాణము, అణుః = సూక్ష్మమైనది పరిచ్ఛిన్నమైనది.

తా॥ చక్షురాదులవలెనే ఈ ముఖ్యప్రాణముకూడ పరిచ్ఛిన్నమైనది సూక్ష్మమైనది. అట్లుగాకున్న మరణ కాలమునందు శరీరము నుండి నిర్గమించుట మొదలగునవి కలుగనేరవుగదా అని తాత్పర్యము.

—(*) ౭. జ్యోతిరాద్య ధిష్ఠానాధికరణమ్. (*)—

అవ॥ శ్రుతియందు కొన్ని సందర్భములనుబట్టి చూచిన "ఇంద్రియములు స్వయముగానే పనిచేయును." అని తోచుచున్నది. ("అగ్నిర్వాగ్భూత్వాముఖం ప్రావిశత్" అగ్నియేవాక్కులయి [వాగింద్రియ రూపమునుధరించి] ముఖమునందు ప్రవేశించెను) అనుమొదలగు కొన్నివాక్యములను బట్టిచూచిన "ఇంద్రియము లన్నియు వాని అధి దేవతలచే ప్రేరేపింప బడియే కర్మలనుచేయును." అనియేర్పడు చున్నది. ఇందు యింద్రియములను వారి అధిదేవతలే ప్రేరేపించు చున్నారనినచో ఆ యింద్రియములచేత చేయబడుచున్న కార్యముల యొక్క ఫలములనుకూడ వారే అనుభవించుచున్నా రనవలయును. ఇది సరికాదు కదా అనిన నీ విషయమును గూర్చి ఈ అధికరణమున విచారించు చున్నాడు.

సూ॥ ౧౪॥ జ్యోతిరాద్య ధిష్ఠానంతు తదామననాత్॥

టీక॥ ఇంద్రియంతు = ఈ యింద్రియ సమూహమైతే, తదా. మననాత్ = శ్రుతియందు అట్లు చెప్పబడి యుండుటవలన, జ్యోతిరాద్య ధిష్ఠానం=అగ్ని మొదలగు అధి దేవతలచే ప్రేరేపింపబడుచున్నది.

తా॥ " అగ్నిర్వాగ్భూత్వా " అను మొదలగు వాక్యముల యందు చెప్పబడియున్న ప్రకారము ఇంద్రియములు తమ తమ అధి దేవతలయొక్క ప్రేరణలవలననే కార్యములను చేయునుకాని స్వతంత్రముగా చేయనేరవు. " చక్షుషా పశ్యతి ( కంటితో చూచుచున్నాడు " ) అను మొదలగు శ్రుతులుకూడ అధి దేవతా సహితములగు ఇంద్రియములనుగూర్చి చెప్పునవియేకాని కేవల మింద్రియములకే స్వాతంత్ర్యము కలదని చెప్పునవి కావు. మఱియు ఇంద్రియములను ప్రేరేపించినంత మాత్రముననే వాటి కార్యముల వలన కలుగు సుఖ దుఃఖములనుకూడ ఆ దేవతలే అనుభవించు చున్నారన వలసిన పని లేదు. లోకమునందు రథమునుతోలువాడు ఆ రథసంచారము వలన కలుగు ఫలములను పొందుచున్నాడా? ఆ ఫలములను రథికుడు అనుభవించునేకాని సారథి అనుభవింపదనుట ప్రత్యక్షముగదా. ఇది యును గాక ఇంద్రియములు అచేతనములగుటచే వానిని ప్రేరేపించుట కవశ్యము చేతనపదార్థము నొప్పుకొనవలయునుగదా. కావున ఈ శ్రుతి యుక్తుల ననుసరించి విమర్శించిన " ఇంద్రియములు అధిదేవతల ప్రేరణచేతనే తమతమ కార్యములను నిర్వహించు చున్నవనుట సిద్ధాంతమగుచున్నదియని తాత్పర్యము.

అవ॥ ఇంద్రియములచే సాధింపబడిన సుఖదుఃఖాదుల ననుభవించువారు ఇంద్రియాధి దేవతలే కావలసివచ్చును. అనుపక్షమును నిరాకరించు చున్నాడు.

సూ॥ ౧౫॥ ప్రాణవతా శబ్దాత్ ॥

టీక॥ ఇంద్రియాణాం=ఆ యింద్రియములకు, శబ్దాత్ = శ్రుతి ప్రమాణము ననుసరించి, ప్రాణవతా = జీవునితోనే, భోక్తృభోగ్యభావః = అనుభవించువాడు అనుభవింపదగినది అను సంబంధము, అస్తి=కలదు, నదేవతానాం=ఇంద్రియాధి దేవతలకు లేదు.

తా॥ " యోవేదేదం జిఘ్రాణీతిస ఆత్మా గంధాయఘ్రాణం

(ఇదివాసన చూడబడినదని ఎవడు తెలిసికొనునో వాడుజీవుడు. వాసనచూచునది ఘ్రాణము)' అను మొదలగు వాక్యములచేత " జీవునకును ఇంద్రియములకును భోక్తృభోగ్యరూప సంబంధము (ఇంద్రియములు సుఖదుఃఖాదుల ననుభవింప జేయుటకు సాధనము లగుటచే భోగ్యములు. [జీవునిచే ననుభవింప బడదగినవి] జీవుడు భోక్త [ఆ సుఖ దుఃఖరూప ఫలముల ననుభవించువాడు]) కలదు కాని దేవతలకును ఇంద్రియములకును ఆ సంబంధము కలుగనేరదు" అని స్పష్టమగుచున్నది. కావున జీవుడే భోక్తగాని వేరొకరు కానేరరు. పై సూత్రమునందు ఈ విషయమును నిర్ణయించుటకై సారథీ దృష్టాంతముకూడ నియ్యబడి యున్నదికదా యని తాత్పర్యము.

సూ॥ ౧౬॥ తస్యచ నిత్యత్వాత్ ॥

టీక॥ తస్య = ఆ జీవుడు లేక ఇంద్రియములకు జీవునితో గల సంబంధము, నిత్యత్వాత్ = శాశ్వతమైనది కావున, (ఏవ భోక్తా=) జీవుడే భోక్త.

తా॥ జీవుడు తాను పూర్వ జన్మములయందాచరించిన కర్మలచే ఈ దేహమును సంపాదించుకొనెను. కావున ఈ దేహము వలన కలుగజేయబడు సుఖదుఃఖ ఫలములను జీవుడే అనుభవించుచున్నాడనుట యుక్తియుక్తము గదా. కావున జీవుడే భోక్త. మఱియు మరణ కాలమునందు ఈ యింద్రియములు జీవుని అనుసరించి పోవుచున్నవని చెప్పబడి యున్నదికాని అధి దేవతలతో కూడ పోవునని చెప్పబడి యుండలేదు. కావున ఇంద్రియ ములకును జీవునకును నిత్యసంబంధము కలదని యేర్పడుచున్నది. దీనినిబట్టిచూచినను ఇంద్రియములు చేయు కార్యములవలన కలుగు సుఖదుఃఖములను అనుభవించువాడు జీవుడేకాని దేవతలు కాదని సిద్ధాంతమగునని తాత్పర్యము.

—(*) ౮. ఇంద్రియాధి కరణమ్. (*)—

అవ॥ " ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ। ఏతస్యైవ సర్వే రూపమభవన్ (ఈ పరబ్రహ్మమునుండి ప్రాణములును మనస్సును ఇంద్రియములును పుట్టుచున్నవి. ఈ యింద్రియములన్నియు ఈ ప్రాణముయొక్క స్వరూపము లయ్యెను.)" అనుమొద

లగు వాక్యములచే శ్రుతి " ఇంద్రియములు ప్రాణములకంటె వేరు." అని కొన్నిచోట్లను " ఇంద్రియములు ప్రాణములకంటె వేరుకావు " అని కొన్నిచోట్లను చెప్పుచున్నది. ఈశ్రుతులకు రెంటికిని విరోధము కలదా లేదా అనువిషయము ఈ యధికరణమున పరిష్కరింప బడు చున్నది.

సూ॥ ౧౭॥ త ఇంద్రియాణి తద్వ్యపదేశా దన్యత్ర శ్రేష్ఠాత్॥

టీక॥ ఇంద్రియాణి=ఇంద్రియములని పేరుగల, తే= ఆప్రాణములు ( ప్రాణశబ్దము యింద్రియములయందె వర్తించును ) తథా= ఆ విధముగా ( భేదముగా )వ్యపదేశాత్ = చెప్పుటవలన, శ్రేష్ఠాత్= ముఖ్యప్రాణమునకంటె, అన్యత్ర=భిన్నములై యున్నవి.

తా॥ " ఏతస్మాజ్జాయతే " అను శ్రుతి ప్రమాణము వలన ఇంద్రియములును, ముఖ్యప్రాణమును ఒకటికావు. ఏతస్యైవ అను మొదలగు శ్రుతి " ప్రాణముయొక్క శక్తిచలననే యింద్రియములు ప్రవర్తింపనగును. " అని చెప్పుటచే అభిప్రాయమై యున్నదని తాత్పర్యము.

సూ॥ ౧౮॥ భేదశ్రుతేః ॥

టీక॥ భేదశ్రుతేః=ఇంద్రియములకంటె ప్రాణము వేరనిచెప్పు శ్రుతులవలనకూడా, ఇంద్రియాణి ప్రాణాత్ భిన్నాని =ఇంద్రియములు ప్రాణములకంటె భిన్నములైనవి.

తా॥ " మనోవాక్ప్రాణాః ( మనస్సును వాక్కును ప్రాణమును. )" అను మొదలగు శ్రుతులవలన ప్రాణములకును యింద్రియములకును భేదమున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది. ఈ ప్రమాణమును బట్టి చూచినను ప్రాణములకంటె యింద్రియములు వేరని తాత్పర్యము.

సూ॥ ౧౯॥ వైలక్షణ్యాచ్చ ॥

టీక॥ వైలక్షణ్యాచ్చ = ప్రాణమునకును యింద్రియములకును విరుద్ధములగు ధర్మము లనేకము లుండుటవలనకూడా, యింద్రియాణి ప్రాణాత్ భిన్నాని=ఇంద్రియములు ప్రాణమునకంటె వేరు.

తా॥ ఇంద్రియములు స్వప్నావస్థయందు నిద్రపోవును. ప్రాణ

ములు నిద్రపోవుటలేదు. ఇంద్రియములు శరీరమును ధరింపవు (అన గా బ్రతుకుటకు కారణములు కావనుట) ప్రాణములు శరీరమును ధరించును. ఇట్లే యింద్రియములకును ప్రాణములకును విరుద్ధధర్మము లనేకములున్నవి. దీనినిబట్టి చూచినను యింద్రియము ప్రాణములకంటే వేరనుటయే సిద్ధాంతమగునని తాత్పర్యము.

—(*) ౯. సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణమ్. (*)—

అవ॥ ద్వితీయాధ్యాయము మొదటిపాదము ఆరంభము మొదలు పై అధికరణమువరకు భూతోత్పత్తిని గురించిన శ్రుతులయందుగల పరస్పర విరోధము నివారణ చేయబడినది. ప్రస్తుత అధికరణమునందు భౌతికముల యుత్పత్తినిగూర్చి కొంత విచారించబడును. "సేయందేవతైక్షతహంతాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీ (అపర బ్రహ్మ రూపమగు దేవత " అగ్నిజల పృథువులను జీవరూపుడైన నేను స్వయముగా ప్రవేశించి నామ రూపములను ప్రకటించెదను " అని సంకల్పించెను )" అనువాక్యమును బట్టిచూచిన నామరూపములు ప్రకటించువాడు జీవుడని తోచుచున్నది. " ఆకాశోహవై నామ రూపయో ర్నిర్వహితా (నామరూపములను నిర్వహించువాడు పరబ్రహ్మమే )" అను శ్రుతి వలన పరబ్రహ్మమే ఈ ప్రపంచముయొక్క నామరూపములను నిర్వహించుచున్నాడని తెలియవచ్చుచున్నది. ఈ రెండు వాక్యములకును పరస్పర విరోధముకలదా లేదా అనుసంశయము ఈ యధికరణమునందు నివారణ చేయబడుచున్నది.

సూ॥ ౨౦॥ సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్॥

టీక॥ ఉపదేశాత్ = శ్రుతియందు చెప్పబడి యుండుట వలన, సంజ్ఞామూర్తిక్లృప్తిః = నామరూపముగా ప్రకాశింపజేయుట, త్రివృత్కుర్వతః=త్రివృత్కరణమును (పంచీకరణమును) చేసిన పరబ్రహ్మమునకే, అస్తి=కలదు. (అనగా ఆయనయే ప్రపంచముయొక్క నామరూపములను ప్రకటించు చున్నాడనుట.)

తా॥ " సేయందేవతా " అను శ్రుతియందంతమున " వ్యాకరవాణి (ప్రకటించెదను) " అని ఉత్తమ పురుషక్రియ ( ఉత్తమపురుష

క్రియలకు నేను అనునది కర్తగానుండును, ఇది నియమము ) ప్రయోగింపబడి యుండుటవలన ఆ బ్రహ్మము స్వయముగానే నామ రూపములను ప్రకటించెననుట స్పష్టమగుచున్నది. " అనేనజీవేన ఆత్మనానుప్రవిశ్య " అను స్థలమునందు " జీవునిచేత నామరూపములు ప్రకటింపబడుచున్నవి " అనిఅర్థముకాదు. " జీవస్వరూపముతో ప్రవేశించి నేనే ( బ్రహ్మయే ) నామ రూపములను ప్రకటించెదను. " ( ప్రకటించుచున్నాడు ) అనుటయే దాని తాత్పర్యమని అవతారికయందే చూపియున్నాముకదా. కావున అవతారికయందుచూపబడియున్న రెండుగ్రంథములకును పరస్పర విరోధము లేదని తాత్పర్యము.

అవ॥ త్రివృత్కరణముచేయబడిన భూతములు ఆహార రూపముగా పురుషునియందు ప్రవేశించిన పిదప అవిచేయు కార్యములను చెప్పుచున్నాడు.

సూ॥ ౨౧॥ మాంసాదిభౌమం యథాశబ్ద మితరయోశ్చ ॥

టీక॥ భౌమం= త్రివృత్కరణముచేయబడి ధాన్యము మొదలగు రూపములతో పురుషునిచే భక్షింపబడిన భూమి శరీరమునందు చేయు కార్యములు, మాంసాది=మాంసము మొదలగునవి ( అనగా మాంసము మలము మనసు అనుట. ) ఇతరయోశ్చ=పై చెప్పిన విధముగానే పురుషుని శరీరమునందు ప్రవేశించి తక్కినభూతములు ( జల,వహ్నులు ) చేయుపనులనుకూడా, యథాశబ్దం=వేదమునననుసరించి, జ్ఞానం తు= తెలిసి కొనవలయును.

తా॥ త్రివృత్కరణము చేయబడిన భూతములలో భూమి ధాన్యములు శాకములు ఫలములు మొదలగు కఠినద్రవ్యముల రూపముగా భుజింప బడుచుండును. ద్రవములగు పాలు మొదలగు రూపములతో జలభూతమును అగ్నిదీప్తిని కలిగించు నెయ్యి మొదలగు పదార్థముల రూపముతో అగ్నియును అట్లే భుజింప బడుచుండును. ఇందుమలము మాంసము మనస్సు అనునవి మూడును భూమివలన పుట్టుచున్నవి. మూత్రము రక్తము ప్రాణము అనునవి మూడును జలమువలన పుట్టును. ఎముక క్రొవ్వు వాక్ అనునవి మూడును అగ్నివలన పుట్టును. ఇందు భోజనము చేసినపిదప మనస్సునకు సుఖముకలుగును గావునను

నీరుత్రాగకుండిన ప్రాణము నిలువదు కావునను (భోజనము చేయకున్నను నీరుమాత్రము త్రాగుచుండినయెడల ప్రాణము చాలాకాలమువరకు నిలుచును) తేజస్సువలె వాక్కుకూడ జ్ఞానమునకు సాధనముగుటచేతను మనః ప్రాణవాక్కులు క్రమముగా భూమి జల తేజస్సులవలన పుట్టినవని చెప్పబడెనని తెలిసికొనవలయును. ఈరీతిగా భూతకార్యములను శ్రుతిననుసరించి గ్రహింపవలయునని తాత్పర్యము.

అవ॥ పై సూత్రమునందు భౌతికముల సృష్టి నిర్ణయింపబడియున్నది. ఈ భూత భౌతికము లన్నిటియందును త్రివృత్కరణము సమానమై యుండగా ఇదిభూమి ఇది భూకార్యము ఇదిజలము ఇది జలకార్యము అను వ్యవహారము సంభవించుట యెట్లు? అని చెప్పుచున్నాడు.

సూ॥ ౨౨॥ వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః॥

టీక॥ తద్వాదస్తద్వాదః=ఇది ఈ భూతము ఇది ఈ భూతము వలన పుట్టినది అను వ్యవహారము (ఒకే పదము రెండుసారులు ఉచ్చరించుట అధ్యాయము ముగిసెనని తెలియజేయుటకని తెలియదగినది.) వైశేష్యాత్ = ఆయా భూతముల భాగములు అధికముగా నుండుట వలన, భవతి=కలుగుచున్నది.

తా॥ త్రివృత్కరణము అన్నిటియందును సమానమే యైనను భూభాగము అధికముగానున్న భూతమును భూమియనియు ఆ భూమి వలన కలిగిన పదార్థములను భౌమములు (భూమివలన పుట్టినవి) అనియు ఇట్లే జలభాగము అధికముగా గల భూతమును జలమనియు దానివలన పుట్టిన పదార్థములను ఆప్యములు (జలమువలన పుట్టినవి) అనియు ఇట్లే సర్వభూతముల విషయమందును వ్యవహారము సిద్ధించుచున్నది అని తాత్పర్యము.

తథాప్రాణానవద్వావిగ్ంశతిః॥ ౯॥ ౨౨॥ .

తథా ప్రాణా, స్సప్తగతే, రణవః శ్రేష్ఠో, నవాయు, రణుశ్చ, జ్యోతిరాది, తదింద్రియాణి సంజ్ఞామూర్తి, ర్నవ॥ ౯॥

ఇతిశ్రీమత్కృష్ణద్వైపాయనముని ప్రణీత బ్రహ్మసూత్రే
ద్వితీయాధ్యాయస్య చతుర్థః పాదః.

తే॥ గీ॥ అరయ రెండవయధ్యాయ మందుగలవు।
న్యాయములు నేడునాపై నలుబదియును ।
నూరు నేబది రెండియు నారు యుందు ।
సూత్రములు సందర్భాను సూత్రితములు ॥

కందం॥ స్మృతితర్కము లవిరుద్ధపు ।
మతముల పాదద్వయమున మహానీయగతిన్ ।
పితథముల జేసె శ్రుతులం ।
దితరేతర భేదశంక నెడలించెనుదిన్ ॥

ఇట్లు వెన్నెలకంటి సుందరరామ శర్మచే రచియింపబడిన బ్రహ్మసూత్రార్థబోధిని అను ఆంధ్రటీకా తాత్పర్యములు గల బ్రహ్మసూత్రమునందు చతుర్థపాదము

ముగిసెను.



ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## తృతీయాధ్యాయము - ప్రథమపాదము.

—(*) ౧. తదంతర ప్రతిపత్త్యధికరణమ్. (*)—

అవ॥ స్మృతులవలనగాని యుక్తులవలనగాని పరమతసిద్ధాంతములవలనగాని వేదాంత మతమునకు భంగమేమియు రాదనియు శ్రుతులకు పరస్పర విరోధము లేదనియు ఈ కారణమువలన ప్రథమాధ్యాయమునందు చేసిన మతసిద్ధాంత మెంతయు సయుక్తికమనియు పై యధ్యాయమునందు నిరూపింప బడియున్నది. బ్రహ్మజ్ఞాన సాధ

నములగు వైరాగ్యాదులను నిరూపించుటకై ఈ తృతీయాధ్యాయము ఆరంభింప బడుచున్నది. అందు జీవుడు ఈ లోకమునందు కర్మలను చేయుట. పరలోకమునకుపోయి వానిని అనుభవించుట. మరల కర్మ శేషముచే భూలోకమున జనించుట. అనువాని యథార్థస్థితిని తెలిసికొనినచో " ఇహ, పర, లోకములును, వానియం దనుభవించు ఫలములును అనిత్యములు జనన మరణ రూపమగు సంసారము దుఃఖమయము." అని ( జనులు ) తెలిసికొందరు కావున ఇహ పర భోగములయందు వైరాగ్యము కలుగునను తలంపుచే ఈ ప్రథమపాదమునందు జీవుని గమనా గమనములు ( పరలోకమునకు పోవుట, తిరిగి వచ్చుట. ) నిరూపింప బడుచున్నవి. దీనిచే వైరాగ్యమే ఈ పాదమునందు నిరూపింప బడుచున్నదని చెప్పవలయును. " జీవుడు ఈ శరీరమునుండి నిష్క్రమించునప్పుడు సూక్ష్మ పంచభూతములతో కూడ నిష్క్రమించునా? (వెడలిపోవునా,) లేక యింద్రియ ప్రాణాదులతో మాత్రమే కూడి వెడలిపోవునా? " అను సంశయమును మొదటి అధికరణమున బరిష్కరించు చున్నాడు.

సూ॥ ౧॥ తదంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యాం॥

టీక॥ ప్రశ్ననిరూపణాభ్యాం = శ్రుతియందు చూపబడిన ప్రశ్నోత్తరములవలన, జీవః=జీవుడు, సంపరిష్వక్తః=సూక్ష్మ భూతములతో కూడినవాడయ్యే, తదంతరప్రతిపత్తౌ=దేహాంతరప్రాప్తియందు, రంహతి=పరుగెత్తు చున్నాడు.

తా॥ ఈ జీవుడు శరీరకారణ భూతములగు సూక్ష్మ భూతములను కూడ తీసికొనియే పరలోకమునకు పోవును. (దేహమునకనగా తన సూక్ష్మదేహమునకని తెలిసికొనవలయును. స్థూలశరీరము స్థూల భూతముల వలనను సూక్ష్మశరీరము సూక్ష్మ భూతములవలనను పుట్టుచున్నదనుట ఇంతకు పూర్వమే అచ్చటచ్చట నిరూపింపబడియున్నది.) వేదమునందు పంచాగ్నివిద్య నుపదేశించు సందర్భమున జరిగిన ప్రశ్నయు దానికియిచ్చిన ఉత్తరమును యీవిషయమును స్పష్టముచేయును. ఎట్లనగా:—ప్రవాహణుడను రాజు తనసభలోనికివచ్చిన శ్వేతకేతు

మహాముని నిజూచి "జలము అయిదవ యాహుతియందు పురుష రూపమును జెందును" అనుట ఎట్లు సంభవించునో నీకు తెలియునా? అని యడుగగా ఆ ముని ఈ విషయమునుగూర్చి తెలిసికొనుటకై తండ్రియగు గౌతమముని యొద్దకుబోయి ఆయనకుకూడ తెలియనందున వారిద్దరునువచ్చి మరల ఆరాజునే ప్రశ్నించిరి. వారి ప్రశ్నమునకు ప్రవాహణుడిచ్చిన యుత్తరమును శ్రుతియిట్లు వర్ణించుచున్నది. "పంచమ్యామాహుతావాపః పురుషవచసోభవంతి" (" ద్యులోకము మేఘము భూమి పురుషుడు స్త్రీ ఈ అయిదింటిని అగ్నులని యుపాసన చేయవలయును" అని చెప్పి పంచాగ్నివిద్యయందు "స్త్రీ" అని చెప్పబడుచున్న అయిదవ అగ్నియందలి ఆహుతినిగూర్చి ఈశ్రుతి చెప్పుచున్నది. జలముతోక జలమయములగు పదార్థములు శ్రద్ధతో అగ్నియందు హోమము చేయబడెనేని అవి విరాడ్రూపుడగు యజమానుని జెంది వానిద్వారా ఇంద్రియాధి దేవతలగు ఇంద్రాదుల సమీపమునకుబోయివారిచే ప్రథమాగ్నియందు హోమము చేయబడును. పిదప రెండవ అగ్నియందు జలరూపమై మూడవ అగ్నియందు ఓషధిరూపమై నాల్గవ అగ్నియందు వీర్యమై అయిదవ అగ్నియగు స్త్రీయందు హోమముచేయబడిన పిదపగర్భమై పురుషడనుసంజ్ఞను పొందును.)" దీనినిబట్టి చూచిన జీవుడు భూత సూక్ష్మములతో గూడియే శరీరమునుండి వెడలిపోవునని తెలియ వచ్చుచున్నదని తాత్పర్యము.

అవ॥ పైన చూపబడిన ప్రశ్నోత్తరములు ఒకటి-జలమును గూర్చిమాత్రమే నిరూపించుచున్నవి, కావున " పుడు సూక్ష్మభూతములైదింటితోనుకూడి శరీరమునుండి నిర్గమించు చున్నాడనుట ఎట్లుసిద్ధించుననిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨॥ త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్ ॥

టీక॥ అపితు = మఱియు, తాసాం=ఆ జలములు, త్ర్యాత్మకత్వాత్=భూతత్రయ స్వరూపములగుటవలన, భూయస్త్వాత్ =ఇతర భూత భాగములకంటె శరీరమునందు జలభాగ మధికముగా నుండుట వలనను, అప్శబ్దేన భూతాస్స్యుచ్యంతే=శ్రుతియందలి అపః అను శబ్దముచేత పంచభూతములును చెప్పబడును.

తా॥ త్రివృత్కరణ మనినను పంచీకరణమనినను ఒకటియే యని యిదివరకే నిరూపించియున్నాము. కావున "తాసాంత్రివృతం" అనుమొదలగు శ్రుతులవలన ప్రతిభూతము భూతత్రయస్వరూపమైనదేయని (భూతపంచక స్వరూపమైనదేయని) తెలియవచ్చుచున్నది. మఱియు శరీరమునందు పంచభూత భాగములున్నను అందు జలభాగమే అధికమైనది. (పృథ్వీభాగ మన్నిటికంటె నధికము. కావున దానితరువాత యితరభూత భాగములకంటే యీ జలభాగమే యధికమని తెలిసికొనవలయును.) ఈ రెండు కారణముల వలనను శ్రుతియందు "ఆపః" అనుశబ్ద మొకటియే ప్రయోగింప బడియున్నను పంచభూతములనుగూర్చియు చెప్పినట్లే యనియు దీనివలన జీవుడు పంచభూతములతోకూడియే శరీరమునుండి నిర్గమించుననియు తాత్పర్యము.     సూ॥ 3॥ ప్రాణగతేశ్చ ॥

టీక॥ ప్రాణ = ముఖ్యప్రాణము ఇంద్రియములు వీటియొక్క, గతేః=నిర్గమనము శ్రుతియందు చెప్పబడియుండుటవలన, భూతానాం నిర్గమనం = పంచభూతములును జీవునితోకూడ పోవుననుట, అనుమీయతే=ఊహింప బడుచున్నది.

తా॥ "తముత్క్రామంతం ప్రాణోనూత్క్రామతి, ప్రాణముత్క్రామంతం సర్వేప్రాణా అనూత్క్రామంతి (ఆజీవుడు శరీరమునుండి వెడలిపోవునప్పుడు ప్రాణవాయువు ఆయనతోకూడ శరీరమును విడచిపోవును. ఆప్రాణవాయువుతోకూడ నేత్రము మొదలగు ఇంద్రియము లన్నియు శరీరమును విడచి పోవును.)" అనుశ్రుతిచేత ప్రాణవాయువు ఇంద్రియములుకూడ జీవునితోకలసి మరణ కాలమునందు శరీరమును విడచిపోవునని తెలియజేయబడుచున్నది. ఈ ప్రాణాదులు మొట్టమొదట (మరణకాలమునకు ముందు) దేహరూపముగానున్న పంచభూతముల నాశ్రయించియేకదా నిలచియుండెను. కావున అవిశరీరమును విడచిపోవునప్పుడుకూడ తమకాధారములగు పంచభూతములను విడచుననుటకు వీలులేదు. (ఈ కారణమును పట్టిచూచినను జీవుడు పంచ భూతములతో కూడియే శరీరమునుండి నిర్గమించుననుట స్పష్టమగుచున్నదని తాత్పర్యము.)

అవ॥ " యత్రాస్య పురుషస్య మృతస్యాగ్నింవాగప్యేతి ( ఈ పురుషుడు మృతుడైనప్పుడు వాక్కు అగ్నిని జేరును )" అనుమొదలగు శ్రుతులచేత మరణ కాలమునందు ఇంద్రియములు తమతమ అధి దేవతలయందే చేరునని చెప్పబడియున్నది. కాని జీవునితోకూడ పరలోకమునకు పోవునని చెప్పబడి యుండలేదు. కావున ఇంద్రియముల నిర్గమమునుబట్టి భూతనిర్గమమును ఊహింతుమనుట కూడదనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౪॥ అగ్న్యాదిగతిశ్రుతేరితిచేన్న భాక్తత్వాత్ ॥

టీక॥ అగ్న్యాదిగతి శ్రుతేః = అగ్ని మొదలగు అధిదేవతలను పొందుచున్నవి అను శ్రుతివలన, ప్రాణానాం నోత్క్రాన్తిః = ప్రాణములు జీవునితోకూడ పోవు, ఇతిచేత్ = అనేదెడల, న = అదిసరికాదు, తస్యాః = ఆశ్రుతి, భాక్తత్వాత్ = ఔపచారికముగనుక.

తా॥ అవతారికయందుదహరించిన శ్రుతి ఔపచారికము ( అనగా ప్రత్యక్షముగా కనబడుచున్న అర్థమును జెప్పునది కాదు.) ఏలయనగా ఆ శ్రుతియందే యింకొంత దూరమున " మృతి చెందిన పురుషుని వెండ్రుకలు వృక్షములలో లయమునొందును." అని చెప్పబడియున్నది. ఇది ప్రత్యక్ష విరోధమగుటచేత ఈస్థలమునందు శ్రుతి యౌపచారికమని నిశ్చయింపవలయును. దీనితోకూడనే పఠింపబడి యుండుటచే వాగాదింద్రియముల గమనమునుగుర్చి చెప్పు శ్రుతియంతయును ఔపచారికమే కావలయును. ( అనగా వాగాది పదములచే అధిదేవతలగు అగ్ని మొదలగు వానిని జెప్పి దానికి లయమును జెప్పుచున్నది. ఇంతవరకు ఇంద్రియములకు ఉపకారము చేయుచున్న అధిదేవతలు మరణకాలమునందు ఆ యింద్రియములను విడచి పోవుననుట ఆశ్రుతికి తాత్పర్యమని తెలిసికొనవలయును ) కావున ఇంద్రియములు తమ అధిదేవతలయందు లయము కావనియు జీవునితోకూడ శరీరమునుండి నిర్గమించుననియు దీనివలన పంచభూతములుకూడ ఉత్క్రమణ కాలమునందు జీవునితోచేరియే యుండునని నిర్ణయింప వచ్చుననియు తాత్పర్యము.

అవ॥ మొదటి సూత్రమునందు చూపబడిన పంచాగ్ని విద్య

యందు జలము అయిదవదియగు స్త్రీరూపమగు నగ్నియందు హోమముచేయబడి పురుషాకారమును జెందుచున్నదియని చెప్పబడి యున్నది. దానిని ఆధారముగా జేసికొని మీరును జీవునితోగూడ భూతములును దేహమునుండి యుత్క్రమించునని సిద్ధాంతముజేసి యున్నారు. మొట్టమొదట పంచాగ్ని విద్యయందు జలమునుగూర్చి చెప్పినమాటయే యుక్తియుక్తముకాను. ఏలయనగా మొదటిదగు ద్యులోకాగ్నినిగూర్చి చెప్పునప్పుడు జలహోమమునుగూర్చి శ్రుతిచెప్పుటలేదు. "తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవాః శ్రద్ధాంజుహ్వతి ( ఆద్యులోకాగ్నియందు దేవతలు శ్రద్ధను హోమము చేయుదురు.) అని శ్రద్ధాహోమమునుగూర్చిమాత్రమే చెప్పుచున్నది. కావున ఆ పంచాగ్ని విద్య మీ సిద్ధాంతమునకు ప్రమాణము కానేరదని సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౫॥ ప్రథమే శ్రవణాదితిచేన్నతాఏవహ్యుపపత్తేః ॥

టీక॥ ప్రథమే=మొదట ( మొదటిదగు ద్యులోకాగ్నిని గూర్చి చెప్పునప్పుడు, ) శ్రవణాత్ =జలహోమమునుగూర్చి శ్రుతిచెప్పియుండలేదు. కావున, న తాసాంపురుషవచస్త్వం=ఆ జలము పురుషాకారముగా నుండుననుట యుక్తముకాదు, ఇతిచేత్=అనేనెడల, న=అది సరికాదు, ఉపపత్తేః = యుక్తియుక్తమై యుండుట వలన, శ్రద్ధా= ఆ శ్రుతియందలి శ్రద్ధాపదముచేత చెప్పబడినది, తాఏవహి = ఆజలములేకదా.

తా॥ అవతారికయందు చేయబడిన పూర్వపక్షము సరియైనది కాదు. ద్యులోకాగ్నియందు చేయబడు హోమమునుగూర్చి చెప్పునప్పుడు హోమద్రవ్యవాచకముగా నుపయోగింపబడిన శ్రద్ధాపదము లక్షణావృత్తిచే శ్రద్ధాపూర్వకముగా అగ్నియందు హోమముచేయబడియున్న జలమునే చెప్పుననవలయునుగాని మరేమియు చెప్పుటకు వీలులేదు. ఆ శ్రద్ధాపదము జలమును చెప్పదనినయెడల ప్రశ్నమునకును ఉత్తరమునకును సంబంధములేక పోవలసివచ్చునుగదా. కావున మాసిద్ధాంతము నిర్దోషమైనదియేయని తాత్పర్యము.

అవ॥ పంచాగ్నివిద్యయందు చెప్పబడిన విషయము నంగీకరిం

చినను నీ సిద్ధాంతము నిర్దోషము కానేరదు. ఆవిద్యయందు జలము పురుషాకారమును జెందునని చెప్పబడి యున్నదికాని జీవుడు పంచ భూతములతోగూడి శరీరమునుండి నిర్గమించునని చెప్పబడియుండలేదు గదా, అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౬॥ అశ్రుతత్వాదితిచేన్నేష్టాది కారిణాం ప్రతీతేః ॥

టీక॥ అశ్రుతత్వాత్=వేదమునందు చెప్పబడి యుండకపోవుట వలన, జీవస్య=జీవునకు, భూతపరిష్వక్తి= భూతములతోగూడి శరీరమునుండి నిర్గమించుట, నేతిచేత్=లేదుఅని చెప్పేయెడల, న = అది సరికాదు, ఇష్టాదికారిణాం = యాగదానాది పుణ్య కర్మముల నాచరించువారు, శ్రద్ధయాసహ సిర్గమస్య = శ్రద్ధా శబ్దముచేత చెప్పబడు జలముతోకూడినే చంద్రలోకమునకు బోవు చున్నారనుట, ప్రతీయతే=కనుబడుచున్నది.

తా॥ అవతారికయందు చూపబడిన పూర్వపక్షము సరియైనదికాదు. పంచాగ్నివిద్యయందు జీవుడు పంచ భూతములతోకూడి శరీరమునుండి నిర్గమించునను విషయము చెప్పబడి యున్నట్లు స్పష్టముగ తెల్పియుడున్నది. ఎట్లన:—శ్రుతియం దొకచోట ఏ పురుషులు గృహస్థాశ్రమమునందుండి యజ్ఞదానాది పుణ్యకర్మములను చేయుదురో వారు చంద్రలోకమునకుపోయి సోమరాజ శబ్దముచే అచ్చట వ్యవహరింప బడుదురని జీవులనుగూర్చి చెప్పబడియున్నది. ప్రస్తుత పంచాగ్ని విద్యయందు "తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవా శ్రద్ధాం జుహ్వతి, తస్యాఆహుతే స్సోమోరాజా సంభవతి ( దేవతలు ద్యులోకాగ్నియందు జలమును హోమము చేయుదురు, ఆ హోమము వలన సోమరాజు జనించును )" అను వాక్యముచే పై వాక్యమునందు వర్ణించిన సోమరాజులను గూర్చియే చెప్పబడియున్నది. దీనినంతయు విమర్శించిన శ్రద్ధయని చెప్పబడు జలములతో గూడియే జీవుడు సోమరాజు అగుననియు దీనిని పట్టిచూచిన ఆ జీవుడు పంచ భూతములతో కూడియే దేహమునుండి నిర్గమింప వలయుననుట స్పష్టముగనే కనబడుచున్నదనియు సిద్ధాంతమగును. కావున మా (వేదాంత)సిద్ధాంతమునకు భంగమేమియును రాదని తాత్పర్యము.

అవ॥ " ఏషసోమోరాజా తద్దేవానా మన్నంతం దేవాభక్షయంతి ( ఈసోమరాజు దేవతలకన్నము కావున దేవతలు వానిని తిందురు. )" "అను శ్రుతియందు చంద్రలోకమును పొందిన జీవులు దేవతల కాహారమగుదురని చెప్పబడియున్నది, దీనిని బట్టి చూచిన జీవులు తమకర్మఫలముల ననుభవించుటకు చంద్ర లోకమునకు పోవుదురు." అనుటయే యుక్తి యుక్తము గాలేదు. అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౭॥ భాక్తంవా౽నాత్మవిత్త్వాత్తథాహిదర్శయతి॥

టీక॥ అనాత్మవిత్త్వాత్ = జీవులు ఆత్మవేత్తలు కాకపోవుటచేత, దేవాన్నత్వం = దేవతలకు ఆహారము అనిచెప్పుట, భాక్తం= అప్రధానమైనది. శ్రుతిః=వేదము, తథాదర్శయతిహి= ఆవిధముగానే చూపుచున్నదిగదా.

తా॥ పై చూపినశ్రుతి యప్రధానమైనది. ప్రధానమేఅని చెప్పినచో "స్వర్గమును కోరువారు జ్యోతిష్టోమమును చేయవలయును." అను మొదలగు శ్రుతులకు భంగమువచ్చును. కర్మఫలముల ననుభవించుటకు పరలోకమునకు పోయిన జీవులందరును దేవతలచే భక్షింపబడుదురేని కర్మల చేయువారెవరు? అట్టి అనర్థహేతుకమగు కర్మను ఉపదేశించిన శ్రుతిమాత్రము ఆదరణీయ మెట్లగును? ఈ సోమరాజ శబ్దము ముఖ్యముగా యజ్ఞముచేసిన వారియందే ప్రయోగింపబడియున్నదికదా. "కావున పురుషునకు భార్యా పుత్రాదులవలె దేవతలకు ఆత్మజ్ఞానములేని ఈ జీవులు భోగ్యులు ( అనుభవింప దగినవారు ) అగుదురు " అను నంశమును వివరించుటకై అవతారికయందు దుదహరింప బడినశ్రుతి " దేవతలు జీవులను భక్షింతురు " అని చెప్పుచున్నది. ఈ విషయమును నిర్ధారణ చేయుటకు " ఆత్మ జ్ఞానములేని జీవులు దేవతలకు భోగ్యులవ్వెదరు. " అను విషయమును బోధించు " అథయోన్యాం దేవతా ముపాస్తే అన్యోసావన్యోహ మస్మీతిస పశుః ( ఎవడు తానువేరనియు తాను ఉపాసనచేయు దేవతవేరనియు తలంచి యుపాసించునో వాడుపశువు పశువువలె ఆ దేవతచే నియోగింప బడతగినవాడనుట.)" అనుమొదలగుశ్రుతులుకూడప్రమా

ణములైయున్నవి. కావున జీవుడు సూక్ష్మ భూతములతో కూడి చంద్ర లోకమునకుపోయి అచ్చట తన పుణ్య ఫలముల ననుభవించు ననుట సిద్ధాంత మనియు నని తాత్పర్యము.

—(*) ౨. కృతాత్యయాధికరణమ్. (*)—

అవ॥ ఇహ లోకమునందు చేసిన కర్మను పర లోకమునందు జీవు లనుభవించు చున్నారుగదా. వారు మరల ఈ లోకము నందు " రమణీయచరణాః ( మంచిపని చేసినవారలు మంచిజన్మల నెత్తుదురు. )" అనుమొదలగు శ్రుతులచే కర్మానుసారముగ జనించుదురని చెప్పబడియున్నది. ఇదియెట్లు సంభవించును. అను విషయములను ఈ అధికరణమునందు నిరూపించు చున్నారు.

సూ॥ ౮॥ కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవంచ ॥

టీక॥ కృతాత్యయే=కర్మఫలము ముగిసిన పిదప ( చంద్రలోకమునందు అనుభవింప వలసినకర్మ ననుభవించి అయినపిదప ) జీవః= జీవుడు, అనుశయవాన్ = ఇహలోకమునం దనుభవింప వలసినకర్మ శేషముతో కూడ,యథేతం= పోయినమార్గముగుండాను, అనేవంచ= కొన్నికొన్నిచోట్ల ఇతరమార్గములనుండియు, ప్రతి నివర్తతే= ఇహ లోకమునకువచ్చును, ఇదం = ఇది ( ఈ విషయమంతయు ) దృష్టస్మృతిభ్యాం=శ్రుతిస్మృతులవలనను లేక ప్రత్యక్ష స్మృతులవలనను, నిశ్చీయతే=నిశ్చయింప బడుచున్నది.

తా॥ జీవుడు చంద్రలోకమునం దనుభవింపవలసిన ( అత్యంత [ మనుష్యలోకమునందు దొరకని ] సుఖము కలుగజేయు ) కర్మలను అచ్చటనే అనుభవించి భూలోకమునం దనుభవింపవలసిన కర్మలతో కూడి మరలవచ్చును. ఈ విషయమును " రమణీయచరణాః " అనుమొదలగు శ్రుతులును " తతశ్శేషేణ జన్మ ప్రతిపద్యంతే ( తరువాత కర్మ శేషమువలన భూలోకమునందు జన్మింతురు) ' అనిస్మృతులునునిర్ణయించు చున్నవి. ' పుట్టినప్పుడే (స్వయముగా నేపనియును చేయుటకు శక్తిలేనప్పుడే ) కొందరు అధికవైభవపదవిని మఱికొందరు దీనమగుస్థితిని అనుభవించుచున్నారు. దీనికి కారణము వారివారి పురా

కృత కర్మమే కావలసి వచ్చునుగదా. " అనులోకాను భవముకూడ పై విషయమునే స్థిరపరుచుచున్నది. మఱియు ఆజీవులు చంద్ర లోక మునుండి వచ్చునప్పుడు పోయిన మార్గము ననుసరించియే కొంత వరకును మఱియొకమార్గము ననుసరించి కొంతవరకును ప్రయాణము చేయుదురు. ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము, పితృలోకము, ఆకాశము (పితృలోక మొకటిఁటితప్ప తక్కినవన్నియు దానిదాని నభిమానించు దేవతలను చెప్పునని తెలిసి కొనవలయును.) ఇవి జీవుడు చంద్రలోకమునకు బోవుమార్గము నందుండునవి. (ఇది వరకు నిరూపించిన అర్చిరాది మార్గమునందువలెనే యిచ్చట కూడ మొదటి దేవత రెండవ దేవత యొద్దకు ఈ క్రమముగా జీవుని చంద్ర లోకమువరకు గొనిపోవునని తెలిసి కొనవలయును.) ఆకాశము,పొగ, వాయువు, అంతరిక్షము (ద్యులోకము) మేఘము, పృథివి, పురుషుడు, స్త్రీ, ఇవి చంద్రలోకమునుండి మరల వచ్చునప్పటి మార్గము అని తెలిసి కొనవలయును. పైజూపిన శ్రుతులు మొదలగువానిని విమర్శించిన జీవుడు అనుశయ యుక్తుడై (ఇహలోకమునందు ఫలము ననుభవింప జేయుకర్మ అనుశయము) చంద్రలోకమునుండి మరలునని సిద్ధాంత మగుచున్నదని తాత్పర్యము.

అవ॥ "రమణీయచరణాః" అనుశ్రుతిచే అనుశయమువలన జన్మకలుగునని నిర్ణయించుట దోష యుక్తమైనది. చరణ శబ్దమునకు ఆచారము అర్థముకాని అనుశయము అర్థము కాదుగదా. అనినసమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౯॥ చరణాదితిచేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః ॥

టీక॥ చరణాత్ = చరణపదమునకు ఆచార మర్థమగుటవలన, నతథా=పై సూత్రమునందు చేసినసిద్ధాంతము సరియైనదికాదు. ఇతి చేత్ =అనేయెడల,న=అదియుక్తమైనదికాదు,కుతః=ఎందువలననగా, కార్ష్ణాజినిః= కార్ష్ణాజినియను మహాముని, ఉపలక్షణార్థేతి=చరణ శ్రుతి కర్మాంగమ గునాచారము చెప్పును కావున కర్మ విశేషమగు ననుశయమును ఉపలక్షణము (ఊహించుటకు తగిన వీలును) చేయునని, మన్యతే=తలంచుచున్నాడు.

తా॥ అవతారికయందుచేసిన పూర్వపక్షము సరియైనదికాదు. రమణీయచరణా అనుమొదలగు శ్రుతియందలి చరణశబ్దము ఆచారమును చెప్పునదైనను ఆచారము కర్మాంగముగావున ఉపలక్షణముచే సర్వకర్మలను చెప్పవచ్చును. ఇచ్చట పరలోకమునమాత్రమే అనుభవించుటకు వీలగుఫలముల నిచ్చుకర్మలు ఇహలోకమునందు జన్మనుకలిగించుటకు వీలులేదు కావునను అవి ఫలానుభవముచే క్షీణించి యుండుటచేతను శ్రుతియందలి చరణశబ్దముచేత ఆకర్మలనుపలక్షించుటకు వీలులేదు. కావున ఏకర్మలు ఇహలోకమునందు అనుభవించుటకు వీలగుఫలములనిచ్చునో ఆఅనుశయములే ప్రస్తుతచరణశబ్దముచే ఉపలక్షణ చేయుబడవలసియున్నవి. ఇది కార్ష్ణాజినిమహాముని అభిప్రాయము. దీనినిబట్టిజూచిన ౮ వ, సూత్రమునందు చేయబడిన సిద్ధాంతమునకు భంగమేమియును కలుగనేరదని తాత్పర్యము.

అవ॥ ఇట్లుచెప్పుట సరికాదు. అనుశయములో శుభాశుభజన్మములను కలిగించునని చరణశ్రుతి నిరర్థకము కావలసివచ్చును. కర్మలవలననే సర్వముజరుగుచుండగా ఆచారమువలన ప్రయోజన మేమియునుండదుగదా. అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౦॥ ఆనర్థక్యమితిచేన్నతదపేక్షత్వాత్ ॥

టీక॥ ఆనర్థక్యం=చరణశ్రుతి నిరర్థకము కావలసివచ్చును. ఇతిచేత్=అనేయెడల, న=అదియుక్తముకాదు. కుతః= ఎందువలననగా, కర్మణః=కర్మ - తదపేక్షత్వాత్ = ఆ ఆచారమును అపేక్షించియుండుటవలన.

తా॥ అవతారికయందు చేయుబడిన ఆక్షేపము సరియైనదికాదు. అనుశయమై, శుభాశుభజన్మలకు కారణమైనను 'చరణశ్రుతి నిరర్థకము కానకరలేదు. కర్మలవలననే సర్వము జరుపబడుట నిశ్చయమేయైనను ఆచారమువలన ప్రయోజనములేకపోలేదు. ఆచారము కర్మకుప్రధానమగు అంగము. ఎట్టియుత్తమఫలమునిచ్చు కర్మయైనను సదాచారవంతునిచే చేయబడినప్పుడే దానిఫలమును సంపూర్ణముగా నిచ్చునుగాని ఇతరసమయములందు అట్లుఇయ్యనేరదు. " ఆచారహీనంనపునంతివేదాః " ( ఆచారములేనివానిని వేదములు పవిత్రముగనే

యనేరవు ) అను వాక్యముకూడ ఈవిషయమున ప్రమాణముగుచు న్నది. కావున చరణశ్రుతి నిరర్థకము కావలసినపనిలేదనియు పైనచే యబడిన సిద్ధాంతమునకు భంగమెప్పటికినిరాదనియు తాత్పర్యము.

అవ॥ ఇట్లు కార్ష్ణాజిని యభిప్రాయమును దానిపై చేయుబడిన ఆక్షేపమునకును సమాధానమును కూడచెప్పి ఇప్పుడు ౧౧వ, సూత్రముయొక్క అవతారికయందు చూపబడిన పూర్వపక్షమునకే బాదరిమహాముని మతము ననుసరించి సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౧॥ సుకృతదుష్కృతే ఏవేతితుబాదరిః ॥

టీక॥ బాదరిస్తు= బాదరిమహామునియైతే, సుకృతదుష్కృతే ఏవ=పుణ్యపాపములే, చరణార్థావితి=చరణపదములకర్థములని, మన్యతే=తలంచుచున్నాడు.

తా॥ "ధర్మంచర" ( ధర్మమునుచేయుము ) అను మొదలగువాక్యములయందు చరతియను క్రియచేయుటయను అర్థమునందు ఉపయోగింపబడియున్నది. దీనినిపట్టిచూచిన చరణశబ్దమునకు పుణ్యపాపములే ( అనుశయమే ) అర్థముకావచ్చుననియు ఉపలక్షణమువలన ఈయర్థమువచ్చునని చెప్పవలసినంత పనిలేదనియు బాదరిమహాముని అభిప్రాయపడుచున్నాడు. ఈయభిప్రాయమును పట్టిచూచిన ౧౦ యవ, సూత్రమునందు చేయబడిన సంశయమునకుగాని ఇతర సంశయములకుగాని అవకాశము బొత్తిగాలేదని తాత్పర్యము.

—(*) ౩. అనిష్టాదికార్యధికరణమ్. (*)—

అవ॥ సదాచారసంపన్నులై అతిశ్రద్ధతో పుణ్యకర్మలనాచరించినవారు చంద్రలోకమునకుపోయి అచ్చట కొంతకాలము సుఖమునుభవించి కర్మక్షయముకాగానే మరలివచ్చి జన్మము నెత్తుచుందురు. పుణ్యాత్ములగుటచే వారెత్తుజన్మములు ఉత్తమములుగా నుండవచ్చునుగాని అంతమాత్రమున దుఃఖస్పర్శలేదని చెప్పుటకు వీలులేదుగదా. మఱియు చంద్రలోకమున అనుభవించు సుఖములుకూడ శాశ్వతములుకావని మొట్టమొదటనే నిరూపించబడియున్నది. కావున ఇట్టి అశాశ్వతములగు సుఖమునుగోరి మహాప్రయాసలకులోనై కర్మలనుచేయుచుండియును మరల మరల జననమరణరూపమగు సంసార

మును అనుభవించుటకంటే ఇహపరలోకములయందలి అశాశ్వతసుఖములయందాశవదలి శాశ్వతమగు మోక్షసుఖమునకై ప్రయత్నించుట యుక్తము. అని పైయధికరణములయందు పుణ్యాత్ముల జీవులయొక్క గత్యాగతులను నిరూపించుటద్వారా వైరాగ్యములను బోధించి ఈయధికరణమునందు దానిని మఱింతదృఢపరచువాడై పాపాత్ములయొక్క గత్యాగతులను నిరూపించుచు మొదట పూర్వపక్షము నను వాదము చేయుచున్నాడు.

సూ॥ ౧౨॥ అనిష్టాదికారిణామపిచశ్రుతం ॥

టీక ॥ అనిష్టాదికారిణామపి = పాపకర్మముల చేసినవారికి కూడ, చంద్రలోకగమనం=చంద్రలోకమునకు బోవుట, శ్రుతం=శ్రుతియందు చెప్పబడియున్నది.

తా॥ ఇంతకుముందు పుణ్యకర్మలు చేసినవారుమాత్రమే చంద్రలోకమునకు బోవుదురని మీరు సిద్ధాంతము చేసియున్నారు. అట్లు చేయుట సరికాదు. "యేవైకే చాస్మాల్లోకాత్ప్రయంతి చంద్రమసమేవ తేసర్వేగచ్ఛంతి " ( ఏజీవులు ఈలోకమునుండి వెడలిపోవుదురో మృతిజెందుదురో వారందరును చంద్రలోకమునకుపోవుదురు ) అను వాక్యముచే జీవులకందరకును చంద్రలోకప్రాప్తికలదని శ్రుతిచెప్పుచున్నది. కావున పాపాత్ములుకూడా చంద్రలోకమునకు పోవుటచే పుణ్యకర్మలనుగూర్చి యత్నము సలుపవలసిన అవసరములేదని తాత్పర్యము. ( ఇదిపూర్వపక్షసూత్రము. )

అవ॥ పై సూత్రమునందు చేయబడిన పూర్వపక్షమును ఖండించుచున్నాడు.

సూ॥ ౧౩॥ సంయమనేత్వనుభూయేతరేషా మారోహావ
రోహౌతద్గతిదర్శనాత్ ॥

టీక॥ ఇతరేషాంతు = ఇతరులగు పాపాత్ములకైతే, ఆరోహావరోహౌ = ఈలోకమునుండిపోవుట.మరలివచ్చుట ఈరెండును, సంయమనే = యమలోకమునందు, అనుభూయ= కర్మలకుతగినశిక్షననుభవించియే, భవతః = అగుచున్నవి, కుతః = ఎందువలననన గా, తద్గతిదర్శనాత్ =ఆవిధముగా గత్యాగతులను ( పాపాత్ములు యమ

లోకమునకు, పోయితిరిగివత్తురు ) అని శ్రుతిచెప్పుచున్నది. కావున.

తా॥ పై పూర్వపక్షము సరియైనదికాదు. పుణ్యాత్ములగు వారు పోవునట్టిచోటికే పాపాత్ములుకూడ పోవుదురనుట మికిలి విరుద్ధమగు విషయముగదా. పుణ్యాత్ములు సుఖము ననుభవించుటకై చంద్రలోకమునకు బోవుచున్నారు. శిక్ష ననుభవించవలసిన పాపాత్ములు అచ్చటికిపోవుటకు కారణమేలేదుగదా. మఱియు మీపక్షము ననుసరించిచెప్పిన ప్రత్యక్షసిద్ధములగు మంచి చెడ్డలు రెండును ఒకటియే కావలసివచ్చును. ఈయుక్తి ననుసరించిచూచి మీరు ప్రమాణముగా నుదహరించిన శ్రుతి పుణ్యాత్ములనుగూర్చి చెప్పునదియేకాని జీవసామాన్యులనుగూర్చి చెప్పునదికాదనియే నిరూపింపవలసియున్నది. ఇక పాపాత్ములవిషయమేమనగా వారు శరీరమునువిడచిన తదప యమలోకమునకుబోయి అచ్చట పాపకర్మల కనుగుణముగా శిక్ష ననుభవించి మరల భూలోకమునకు వచ్చి తిర్యగాది యోనులయందు జనించుచుందురు. "నసాంపరాయః ప్రతిభాతిబాలం... పునఃపునర్వశమాపద్యతేమే ( అజ్ఞానియగువానికి సత్కర్మలు చేయవలయునను విషయము తెలియదు. వాడు మాటిమాటికి నాకు ( యమునకు ) స్వాధీనుడగుచుందును " అను మొదలగు శ్రుతులయందీవిషయమే నిర్ధారణచేయబడియున్నది. కావున పుణ్యకర్మలయందు శ్రద్ధ అత్యంతావశ్యకమని తాత్పర్యము.

సూ॥ ౧౪॥ స్మరంతిచ ॥

టీక॥ మన్వాదయః= మనువుమొదలగువారు, స్మరంతిచఏవం- పైనసిద్ధాంతము చేసినవిధముగా స్మృతులయందు చెప్పుచున్నారు

తా॥ మనుస్మృతిమొదలగు స్మృతులయందుకూడ నాచికేతోపాఖ్యానము మొదలగువానిని చెప్పునప్పుడు పైచెప్పిన సిద్ధాంతమే వర్ణింపబడియున్నది. ఈప్రమాణమును పట్టిచూచినను పై చెప్పి సిద్ధాంతమునకు భంగమురాదని తాత్పర్యము.

సూ॥ ౧౫॥ అపిచసప్త ॥

టీక॥ అపిచ=మఱియు, పౌరాణికాః = పురాణవేత్తలు, నరకాః =నరకములను, సప్త=ఏడని, పఠంతి=చెప్పుచున్నారు.

తా॥ చిత్రగుప్తుడు మొదలగువారు ఏడుగురు అధి కారులుగా గలిగి రౌరవాది నామములతో ఏడు నరకములు గలవనియు ఆ నరకములయందు బహువిధములగు బాధలు నొందుచు పాపాత్ములు తమ తమ పాప ఫలముల ననుభ వింతురనియు పౌరాణికులు చెప్పుచున్నారు. ఈ ప్రమాణమును బట్టిచూచినను పై సిద్ధాంత మునకు భంగములేదని తాత్పర్యము.

అవ॥ ఆ నరకములకు అధికారులు చిత్ర గుప్తాదులని కదా చెప్పియున్నారు. శ్రుతియందు పాపాత్ములు యమునివద్దకు పోవుదురు. అనికదా చెప్పబడియున్నది. ఈ రెంటికిని విరోధ మున్నది. నరకములకు యము డధికారి కాడుగదా అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౬॥ తత్రాపితద్వ్యాపారా దవిరోధః ॥

టీక॥ తత్రాపి=ఆనరకములయందుకూడ, తద్వ్యాపారాత్= ఆ యముని యొక్క కార్యమే యుండుటవలన, అవిరోధః=పై చూపిన విరోధము లేదు.

తా॥ నరకముల కధికారులు చిత్రగుప్తాదులైనను వారు యముని కింకరులే కావున నరకములయందు జరుగుశిక్షలు యముని చేత చేయబడినవే యని చెప్పవలసి వచ్చును. కావున అవతారికయందు చూపబడిన విరోధము రానేరదు. దీనివలన పై సిద్ధాంతమునకు భంగమురాదని తాత్పర్యము.

సూ॥ ౧౭॥ విద్యాకర్మణోరితితు ప్రకృతత్వాత్ ॥

టీక॥ పంచాగ్ని విద్యాయాంతు = పంచాగ్ని విద్యయందైతే, విద్యాకర్మణోః=జ్ఞానమందును కర్మయందును అధికారము గలవారికి క్రమముగా దేవయానము ( అర్చిరాదిమార్గము ) పితృ యానము ( ధూమాదిమార్గము ) వీటినిగూర్చి చెప్పినపిదప, పాపినాం=పాపాత్ములకు "ఏత త్తృతీయంస్థానం" ఇతి. " ఇదిమూడవమార్గము )" అని. ప్రకృతత్వాత్=చెప్పబడియుండుటవలనకూడ నచంద్రంగచ్ఛంతి పాపినః=పాపాత్ములు చంద్రునివద్దకు పోరు.

తా॥ పంచాగ్ని విద్యయందు ఉపాసకులకు దేవయానము కల

దనియు కర్మఠులకు పితృయానము కలదనియు చెప్పి పిదప " ఏత త్తృతీయం స్థానం " అని పాపాత్ములనుగుఱించి దుఃఖ భూయిష్ఠమును ( దుఃఖ మయమైనదియనుట ) పునరావృత్తి బహుళమును ( స్వల్ప కాలములో పలుమారుపుట్టుట పలుమారుచచ్చుట అనుదుఃఖము విశేషముగాగల ) అగుక్రిమి కీటకాది ( పురుగులుమొదలైనవి ) భావమునుగూర్చి శ్రుతిచెప్పియున్నది. కావున పాపాత్ములు చంద్రలోకమునకు పోరని తాత్పర్యము.

రెండవ యర్థము.

టీక॥ ఏతయోరిత్యన్యతు = " అథైతయోఃపథోః " ( ఈ రెండు మార్గములలో ) అనువాక్యములోని " ఏతయోః " అను పదమునకు, " విద్యాకర్మణోః " ఇతి " విద్యాధికారులగు వారియొక్కయు ( ఉపాసకులయొక్కయు ) కర్మాధికారులగువారియొక్కయు " అని, అర్థః=అర్థము, వక్తవ్యం=చెప్పవలయును, కుతః = ఎందువలననగా, తయోరేవ=ఆదేవయాన పితృయానములే, ప్రకృతత్వాత్ = సందర్భానుగుణమైయుండుటవలన, ( ఆ విద్యాకర్మాధికారులనుగూర్చియే ప్రస్తుతమున చెప్పబడుచున్నది యనుట.)

తా॥ " అథైతయోఃపథోః " అను వాక్యమునందలి " ఏతయోః " అను పదమునకు " విద్యా కర్మ రూపమగు " అని అర్థము (" అనగా విద్యాకర్మలచేత సాధింపతగిన దేవయాన పితృయానరూపములగు రెండు మార్గములలో " అనియర్థమనుట ) ప్రస్తుత ప్రకరణమునందు విద్యాకర్మలను గూర్చియేకదా విచారణ చేయబడు చున్నది. కావున విద్యయందు (ఉపాసనయందు) అధికారముగలవారికి దేవయాన మార్గమును కర్మయం దధికారము గలవారికి ( దానిని చేయువారికనుట ) పితృయాన మార్గమును కలదుకాని యితరుల కీ మార్గములలో నేదియును లేదని యేర్పడుచున్నది.(దీనినిబట్టి చూచిన ఉపాసనమునుగాని పుణ్య కర్మలనుగాని చేయునిపాపాత్ములు పైవర్ణించిన రెండు మార్గములలోను ప్రయాణము చేయరని యేర్పడుటచే వారు జననమరణ ప్రాయమగు క్రిమికీటకాది భావమునే పొందుదురనుట నిర్ణయమగు చున్నదియని తాత్పర్యము.

అవ॥ ఎట్లు చెప్పినను పాపాత్ములుకూడ చంద్రలోకమునకు పోవుదురని యొప్పుకొన తీరవలసి వచ్చును " ద్యులోకాగ్నియందు హోమము చేయబడిన జలము సోమరాజగును " అనుమొదలగువాక్యములచే పంచాగ్ని విద్యయందు శరీరప్రాప్తికై అయిదు ఆహుతులు నియమము చెప్పబడియున్నవి. ఇది జీవులందరి విషయము నందును సమానమే యగుటచేత పాపాత్ముడగువాడు సహితము మొదటి ఆహుతియందు సోమరాజు కావలసి వచ్చునుగదా. అనిన పాపాత్ముల విషయములో నాహుతి నియమమేలేదని చెప్పుచున్నాడు.

సూ॥ ౧౮॥ నతృతీయే తథోపలబ్ధేః॥

టీక॥ తృతీయే=పాపాత్ములుపోవు మూడవ మార్గమునందు, ఆహుతినియమః=ఆహుతులనియమము, న=లేదు, కుతః= ఎందువలన ననగా, తథా=ఆవిధముగానే ( ఆహుతి నియమములేదనియే ) ఉపలబ్ధేః=తెలియుచుండుటవలన ( తెలియుచున్నదిగనుట. )

తా॥ పూర్వపక్షమునందు చూపినయభిప్రాయము సరియైనది కాదు " జాయస్వ మ్రియస్వేత్యేత త్తృతీయంస్థానం" ("పుట్టుము చావుము పుట్టుము చావుము, అనుటయే మూడవమార్గము )" అని శ్రుతియందే " తృతీయమార్గమును చెందిన పాపాత్మునకు తిరిగి శరీరమువచ్చుటలో ఆహుతి నియమములేదు ' అని చెప్పబడి యున్నది కావున ఈ ఆహుతి నియమము పుణ్యకర్ములను చేసిన వానినిగూర్చియే చెప్పబడెనని స్థిరముగ నేర్పడుచున్నది. దీనిబట్టి చూచిన పాపాత్ములెప్పుడును సోమరాజులు కావలసిన యావశ్యకము లేదని తాత్పర్యము.

అవ॥ ఈ విధముగా ఆహుతి నియమము ఒకచోటకలదు మఱియొక చోటలేదని చెప్పిన విరోధము కాదా యనినసమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౯॥ స్మర్యతేపిచలోకే ॥

టీక॥ అపిచ=మఱియు, లోకే=భారతాదులయందు ( లోక్యత ఇతిలోకః, విచారింపబడునది లెక్కసేకొనబడునది.) ఆహుతి నియమాభావః=ఆహుతి నియమము లేకపోవుట, స్మర్యతే= చెప్పబడుచున్నది.

తా॥ భారతాదులయందు ద్రోణాచార్యులు ధృష్టద్యుమ్నుడు మొదలగు అయోనిజులను గూర్చి చెప్పబడియున్నది. ఇందు ద్రోణాచార్యులు కేవల పురుష వీర్యమువలననే కుండనుండి పుట్టినవాడు కావున ఈ యనయొక్క శరీర ప్రాప్తికై స్త్రీరూపమగు అగ్నియందు చేయబడవలసిన అయిదవ ఆహుతిజరుగలేదు. ఇట్లే ధృష్టద్యుమ్నుడు పురుషవీర్య సంబంధముకూడ లేకయే అగ్నినుండి జనించినవాడు. కావున అతని దేహప్రాప్తి విషయములో పురుష స్త్రీరూపములగు నాల్గు అయిదు అగ్నులయందు చేయబడవలసిన రెండు ఆహుతులును జరుగలేదు. కావున పైన చూపిన దృష్టాంతములయందు ఆహుతి నియమమెట్లు లేకపోయెనో అట్లే పాపాత్ముల శరీరప్రాప్తివిషయమునందు కూడ ఆహుతి నియమము లేదనుటలో విరోధములేదని తాత్పర్యము.

సూ॥ ౨౦॥ దర్శనాచ్చ ॥

టీక॥ దర్శనాచ్చ=ప్రత్యక్షమువలనకూడా, ఆహుతిషు అనాదరః=దేహముఉత్పత్తియగుటకు ఐదు ఆహుతులును ఉండియే తీరవలయునని నియమములేదు.

తా॥ మఱియు లోకమునందు జరాయుజములు ( మావివలన బుట్టునవి మనుష్యులు మొదలగునవి ) అండజములు (గ్రుడ్డువలన బుట్టునవి పక్షులు మొదలగునవి ) స్వేదజములు (చెమటవలన పుట్టునవి పేలు మొదలగునవి ) ఉద్భిజ్జములు, భూమినుండిపైకి పొడుచుకొనివచ్చునవి వృక్షములు ) అనునాలుగు విధములగు జంతువులు గలవుగదా. అందు స్వేదజములును ఉద్భిజ్జములును స్త్రీ సంబంధము లేకయే పుట్టుచుండుట ప్రత్యక్షము. దీనిని పట్టిచూచిన శరీరోత్పత్తికి అయిదాహుతులు ఆవశ్యకములనుట నియమము కాదని ఏర్పడుచున్నది. కావున పాపాత్ములు సోమరాజులు కావలయుననుటకు ఆహుతులపద్ధతియొక ఆధారము కానేరదని తాత్పర్యము.

అవ॥ తేషాంఖల్వే తేషాంభూతానాం త్రీణ్యేవబీజానిభవంతి అండజం జీవజముద్భిజం ( అండజమనియు జరాయుజము లనియు ఉద్భిజ్జములనియు ఈ మూడును జంతువులలోని భేదములు ) అను శ్రుతియందు జంతువులు మూడు విధములే యని చెప్పబడియుండగా పై

సూత్రమునందు జంతువులునాలుగు విధములని చెప్పుట యెట్లుయుక్త మగుననిన సమాధానము చెప్పుచున్నాము.

సూ॥ ౨౧॥ తృతీయ శబ్దావరోధ స్సంశోకజస్య ॥

టీక॥ సంశోకజస్య = స్వేదజములకు, తృతీయశబ్దావరోధః= శ్రుతియందు మూడవదియగు ఉద్భిజ్జశబ్దముచే చెప్పబడియుండుట, భవతి=అగుచున్నది.

తా॥ శ్రుతియందు మూడవదియగు ఉద్భిజ్జశబ్దముచే స్వేదజములుకూడ చెప్పబడినవైయున్నవి. భూమిని భేదించుకొని పుట్టునవియను స్వేదాదిరూపనుగు జలమును భేదించి పుట్టినవియును ఉద్భిజ్జములేకావచ్చునుగదా. ఈరెండువిధములగు ఉద్భిజ్జములే క్రమముగా ఉద్భిజ్జ స్వేదజ శబ్దములచే పైసూత్రమునందు వ్యవహరింపబడియున్నవిగాని శ్రుతికివిరుద్ధమగు అయుక్త అంశమునందేమియును లేదు. స్వేదజోద్భిజ్జములకు ఉద్భిజ్జత్వము ( ఒకదానిని భేదించుకొనిపుట్టుట ) సమానమేయైనను ఆ రెంటికినీ జంగమస్థావరరూపమగు భేదముండుట వలన ఆ రెంటినిబోధించు నుద్దేశముతోనే శ్రుతియందు ఉద్భిజ్జపదము ప్రయోగింపబడినదని నిర్ణయింపబడవలసియున్నది. కావున జంతువులు నాలుగువిధములనుటలో విరోధమేమియు లేదనియు స్వేదజాది ప్రత్యక్షమువలనను భారతాది ప్రమాణములవలనను జాయస్వేత్యాది శ్రుతులవలనను పాపాత్ముల శరీరప్రాప్తినిగూర్చి ఆహుతినియమము లేదనుట సిద్ధాంతము చేయబడినదనియును ఈకారణమువలనను నరకమునుగూర్చి శ్రుతిస్మృతులయందు చెప్పబడియుండుటవలనను ప్రత్యక్షవిరోధమువలనను పాపాత్ములుకూడ చంద్రలోకమునకు పోవుదురనుట సరియైనమతముకాదని నిరూపింపబడినదనియును కావున పుణ్యకర్మములయందు శ్రద్ధయుండుట యావశ్యకమనియును అట్లున్నను అకర్మలవలనగలుగు ఫలము లనిత్యములగుటచే వానియందు వైరాగ్యమునుజెంది శాశ్వతసుఖమగు మోక్షమును సంపాదించుటకై ప్రయత్నించుటయే యందరకును కర్తవ్యమనియు సిద్ధాంతము చేయబడెనని తాత్పర్యము.

—(*) ౮. సాభావ్యాపత్త్యధికరణమ్. (*)—

అవ॥ "వాయుర్భూత్వాధూమోభవతి ( వాయువై ధూమమగును )" అను శ్రుతియందు చంద్రలోకమునుండి మరలివచ్చు జీవులు వాయు, ధూమాదిరూపములను పొందుదురని చెప్పియున్నట్లు కనుపడుచున్నది. ఇచ్చటయథార్థమేమి? జీవులు వాయ్వాది రూపమునే జెందుదురా? లేక వానితోసంబంధపడుదురా? అను సంశయ మీఅధికరణముచే నివారింపబడుచున్నది.

సూ॥ ౨౨॥ సాభావ్యాపత్తిరుపపత్తేః ॥

టీక॥ ఉపపత్తేః=యుక్తియుక్తమైయుండుటవలన, జీవానాం=జీవులకు, సాభావ్యాపత్తిః= వాయ్వాదులతో సమానత్వమును చెందుటయె, శ్రుత్యర్థః=అవతారికయందుదహరింపబడిన శ్రుతికి అర్థము.

తా॥ అవతారికయందుదహరింపబడిన శ్రుతికి "జీవులు వాయ్వాదులతో సమానులగుదురు. ( అనగా సూక్ష్మస్వరూపముం గలవారై ఆవాయ్వాదులతో సంబంధపడుదురనుట )" అని అర్థమేకాని వేరొకటికాదు. దీనికి వేరుగానే అర్థమునుచెప్పినను విరోధమువచ్చును. ఎట్లనగా:—ఒకవస్తువు మఱియొకవస్తువుగా పరిణమించుననిన ఆరెండవవస్తువు ( ఏవస్తువుగా పరిణమించవలయునో ఆవస్తువు ) అంతకుపూర్వమే ఉన్నదిగా నుండకూడదు. పాలు పెరుగుగామారినదనిన, ఆపెరుగు పూర్వనకంటే పూర్వములేదు కదా? ప్రస్తుతమున వర్ణింపబడు వాయ్వాదు లట్టివిగావు. అవి సృష్ట్యారంభమునుండియు నున్నవేకదా. కావున జీవుడు వాయ్వాదిరూపముగా పరిణామమును జెందునని నిరూపించుట మిక్కిలి యశక్యము. మఱియు నొకవిధముగా పరిణామమును జెందినపిదప మరల వేరొకవిధముగా పరిణామమును జెందుననుటకూడ యుక్తియుక్తముకానేరదు. కావున ఆజీవులు వాయ్వాదులతో సమానములగు సూక్ష్మరూపముకలవారై వానితో సంబంధముమాత్రమే జెందుదురనిచెప్పుట యుక్తియుక్తమనియు దీనివలన అవతారికయందు చూపబడిన శ్రుతి గౌణియని చెప్పదుననియు తాత్పర్యము.

—(*) ౫. నాతిచిరాధికరణమ్. (*)—

అవ॥ ఈఅధికరణమునందు జీవుడు మరల ఈలోకమునకు వచ్చుమార్గమునందు "ఎచ్చటను ఏ ఎంతవరకు త్వరగా వచ్చును. ఎచ్చట ఆలస్యముగావచ్చును." అను విషయమునుగూర్చి విచారణ చేయబడు

సూ॥ ౨౩॥ నాతిచిరేణ విశేషాత్ ॥

టీక॥ విశేషాత్ = ధాన్యరూపమును పొందినదిమొదలు విశేషము చెప్పబడియున్నందున, తతఃపూర్వం = అంతకంటెముందు, నాతిచిరేణ=శీఘ్రముగానే, నిష్క్రమణం = నిష్క్రమించుట, సంభవించును.

తా॥ "అతో వై ఖలుదుర్నిష్ప్రపతరం ( ఇచ్చటనుండి వెడలుట మిక్కిలికష్టము )" అని ధాన్యరూపమునుపొందిన జీవునిగూర్చి శ్రుతియందు చెప్పబడియున్నది. దీనినిబట్టిచూచిన ధాన్యాద్యాకార రూపమును పొందుటకంటెముందు ఆకాశ, ధూమ, వాయ్వ, భ్ర, మేఘములరూపములను ఒకదానితరువాత నొకదానినిగా పొందుచు ప్రయాణముచేయుట శీఘ్రముగనే జరుగునని సిద్ధాంతము చేయవలసియున్నది. ఇందు విరోధమేమియును లేదుగదాయని తాత్పర్యము.

—(*) ౬. అన్యాధిష్ఠితాధికరణమ్. (*)—

అవ॥ "తఇహవ్రీహియవా ఓషధివనస్పతయ స్తిలమాషా ఇతి జాయంతే ( ఆజీవులు ఈలోకమునందు వడ్లు, యవలు, నానావిధములగు ఓషధులు, చెట్లు, నువ్వులు, మినుములు అనుమొదలగు అనేకవిధములుగా ఏర్పడుచున్నారు )" అని జీవులనుగూర్చి చెప్పబడియున్నది. దీనికి అర్థమేమి? చంద్రలోకమునుండి వచ్చినజీవులు వృక్షజన్మము నెత్తుదురనియా? లేక అవృక్షములతో సంబంధము మాత్రమే కలిగియుందురనియా అను విషయమును ఈఅధికరణమునందు విచారించుచున్నాడు.

సూ॥ ౨౪॥ అన్యాధిష్ఠితే పూర్వవదభిలాపాత్ ॥

టీక॥ పూర్వవత్ = ౨౨ వ సూత్రమునందు చూపింపబడిన ప్రకారము ( వాయ్వాదుల విషయమునందువలె ) అభిలాపాత్ =

వృక్షాదిజన్మములనెత్తి సుఖదుఃఖములను అనుభవించుటకు తగిన కర్మ లనుగూర్చి చెప్పకపోవుటవలన, అన్యాధిష్ఠితే = ఆవృక్షజన్మమునందే తనకర్మఫలముల ననుభవింపవలసియున్న జీవులచే నాశ్రయింపబడిన, వ్రీహ్యాదౌ = వడ్లు మొదలగువానియందు, జీవానాం= జీవులకు, సంబంధమాత్రమేవ= సంబంధముమాత్రమే, అస్తి=కలదు.

తా॥ ౨౨ వ, సూత్రమునందు "జీవులు వాయ్వాదులతో సంబంధమును జెందుదురుగాని పరిణామమును జెందరు" అని నిర్ణయింపబడియున్నది గదా. అట్లే యిచ్చటకూడ "జీవులు వృక్షరూపులుకారనియు, వాటితో సంబంధమునుమాత్రమే చెందుదురనియు నిర్ణయించుకొనవలయును. శ్రుతియును ఆజీవులకు వృక్షరూపమువచ్చుటకు హేతువైన కర్మనుగూర్చి చెప్పలేదు గదా. అట్టి కర్మగలవారే ఆస్థావరరూపమును చెందుదురనిన యుక్తియుక్తముగ నుండును గాని అందరిజీవులకును ఆరూపమే వచ్చుననుట విరోధము కదా. మఱియు ఈజీవులు అచ్చటికివచ్చుటకుముందే ఇతరజీవులు వృక్షజన్మమునం దనుభవింపవలసిన కర్మఫలములుగలవారు ఆవృక్షములను ఆశ్రయించియే యున్నారుకదా. చంద్రలోకమునుండి వచ్చిన జీవులకు వృక్షజన్మవచ్చుటకు హేతువులేదని ఇదివరకే నిరూపింపబడియుండుటచేత వారాశ్రయించు వృక్షములు ఇతరజీవాధిష్ఠితములే కావలయుననుట నిర్వివాదాంశముకదా. కావున జీవులు వృక్షస్వరూపమును జెందుదురని సంశయించుటకుకూడ వీలులేదు. ఈకారణములవలన జీవులకు వృక్షాదులతో సంబంధముమాత్రమేకాని విశేషమేమియు లేదనియు, అవతారికయందు చూపబడిన శ్రుతిగాణియనియు తాత్ప

అవ॥ ఇట్లు చెప్పుటకు వీలులేదు. జ్యోతిష్టోమాదికర్మలయందు హింసచెప్పబడియున్నది. కావున అవి అపరిశుద్ధములే. ఇట్లగుట అనుశయయుక్తులై చంద్రలోకమునుండి మరలివచ్చుజీవులు పాపానుభవమునకై వృక్షాదిజన్మములనుకూడ నొందవచ్చునుకదా. అని సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౫ ॥ అశుద్ధమితిచేన్న, శబ్దాత్ ॥

టీక॥ కర్మ=యజ్ఞాదికర్మము, అశుద్ధం= హింసాత్మకమగుట

అపరిశుద్ధమైనది, అతః పాపఫలానుభవః = అందువలన పాపఫలము లనుకూడ అనుభవింప వలసినదగును, ఇతి చేత్ = అనేయెడల, న = అది సరికాదు, కుతః = ఎందువలన ననగా, శబ్దాత్ = వేదమువలన (వేదమునందు ఆజ్యోతిష్టోమాదులు ధర్మములనియే చెప్పబడియున్న వనుట.)

తా॥ జ్యోతిష్టోమాదులు దోష యుక్తములనుట సరికాదు. సామాన్యముగా హింస నిషేధింపబడియున్నను వేదమునందు "అగ్నీషోమీయం పశుమాలభేత (అగ్నిసోముడు ఈదేవతల ప్రీతికై పశుహింస చేయవలయును.)" అని ప్రత్యేకవిధి చెప్పబడి యున్నందున యజ్ఞార్థమగు హింసవలన మధర్మము కాదనియు, ఇతరహింస యధర్మమనియు ఏర్పడుచున్నది. ఈ వేదప్రామాణ్యమువలన జ్యోతిష్టోమాదులంగు అధర్మమే యగులేదనియు ధర్మము స్థావర జన్మముల నెత్తించున ట విరుద్ధమనియు దీనివలన జీవులు పాపఫలానుభవము వరకు వృక్షరూపమును పొందనక్కర లేదనియు "ఇహ" అను శ్రుతి గౌణియేయనియు తాత్పర్యము.

సూ॥ ౨౬॥ రేతస్సిగ్యోగోఽథ ॥

టీక॥ అథ = వాక్యశేషమునందు, రేతస్సిగ్యోగః = యావనవంతుడగు పురుషునితో సంబంధము, జీవానాం అస్తీతికథితః = జీవులకు కలదని చెప్పబడి యున్నది.

తా॥ "తదిహ" అను గ్రంథము యొక్క ఉత్తర వాక్యమునందు "ఓషధులుగా నుండుటను విడచినపిదప జీవులకు యావనవంతుడగు పురుషునితో సంబంధము కలదు" అని చెప్పబడియున్నది. దీనిని బట్టి చూచిన "తదిహ" అను మొదలగు పూర్వవాక్యమునందు వృక్షములనుగూర్చి చెప్పబడిన విషయముకూడ సంయోగమేకాని వేరేమియు కాదని తెలియుచున్నదని తాత్పర్యము.

సూ॥ ౨౭॥ యోనేశ్శరీరం ॥

టీక॥ యోనేః = ఆ రేతస్సువలన, శరీరం = శరీరము కలుగును.

తా॥ ఇట్లు ఆజీవులు పురుషునితో సంబంధపడినపిదప ఆ పురుషుని రేతస్సు ద్వారా స్త్రీయందు ప్రవేశింతురు. "అచ్చట వారలకు సుఖదుఃఖానుభవసాధనమగు శరీరమేర్పడును." అని శ్రుతియందు

చెప్పబడియున్నది. దీనినిబట్టి చూచినను చంద్ర లోకమునుండి వచ్చు జీవులకు వృక్షాది స్వరూపమును జెందవలసిన పనిలేదనియే సిద్ధాంత మగుచున్నదని తాత్పర్యము.

తదంతరప్రతిపత్తౌ షట్ సప్తవిగ్ంశతిః॥ ౬॥ ౨౭॥

తదంతర, కృతాత్యయే, నిష్టాదికారి, సాభావ్య, నాతిచిరే, నాన్యాధిష్ఠితే, షట్॥ ౬॥

ఇతి బ్రహ్మసూత్రే తృతీయస్యాధ్యాయస్య ప్రథమః పాదః.

ఇట్లు తృతీయాధ్యాయమునందు ప్రథమపాదము,

ముగిసెను.



ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## తృతీయాధ్యాయము - ద్వితీయపాదము.

---

—(*) ౧. సంధ్యాధికరణమ్. (*)—

అవ॥ ప్రథమపాదమునందు జీవుని గత్యాగతులను నిరూపించుటచే "కర్మఫలములయందు వైరాగ్యమావశ్యకము" అని సిద్ధాంతము చేయబడియున్నది. అట్లు వైరాగ్యమును చెందిన యధికారికి మహావాక్యార్థ జ్ఞానము కలుగుటకై ఈ పాదమునందు తత్, త్వం, అను పదార్థములు విచారింపబడును. అందు మొట్టమొదట ౪ అధికరణములయందు త్వం, పదార్థమును (నీవు అనుపదమునొక్క అర్థమును జీవ స్వరూపమును) విచారించుచున్నాము. పరబ్రహ్మమును గూర్చి యింతకుపూర్వమే విశేషముగా వర్ణింప బడియుండుటచేతను సంసారిగా కనుపడుచుండు జీవునిగూర్చియే అధికముగ విమర్శించుట

ఆవశ్యకమై యుండుటచేతను యివి యన్నియునుగాక కించిత్ జ్ఞుడని తలంపబడుచున్న జీవునకు సర్వజ్ఞుడగు పరబ్రహ్మముతో నభేదము చెప్పి అదియే ముక్తియని వేదాంతమునందు వర్ణింప బడియుండుట చేతను మొట్టమొదట త్వంపదార్థ విచారణము నారంభించుటయే యిక్కడి యుక్తి యుక్తమగునుకదా. మఱియు జ్ఞాన స్వరూపుడగు పరబ్రహ్మము ఎట్లు దేనితోను సంబంధ పడకున్నాడో జీవుడు కూడ నట్లే దేనితోను సంబంధము లేనివాడని నిరూపింప వలసి యున్నది. అందు ఇహలోక, పరలోక భోగము లనుగూర్చి నిరూపించుటవలన పై పాదమునందు జాగ్రదవస్థను గూర్చి సర్వమును చెప్ప బడినట్లే అయినది. కావున ఇచ్చట స్వప్నావస్థనుగూర్చి విచారింప బోవుచున్నాడు.

సూ॥ ౧॥ సంధ్యేసృష్టిరాహహి ॥

టీక॥ సంధ్యే=జాగ్రదవస్థకును సుషుప్త్యవస్థకునుమధ్యనుండు స్వప్నావస్థయందు, సృష్టిః = కలుగుచున్న ప్రపంచసృష్టి, సత్యా=నిశ్చయ మైనదియే, నను శుక్తిరజతాదితుల్యా = ముత్యపు చిప్పయందు భ్రాంతిచే గ్రహింపబడిన వెండి మొదలగు వానివలె మాయామాత్ర మైనదికాదు, శ్రుతిః ఆహహి=శ్రుతికూడనిట్లే చెప్పుచున్నదికదా.

తా॥ "అథతత్రరథాన్ రథయోగాన్ పథస్సృజతే (అస్వప్నావస్థయందు రథములను రథములతో సంబంధించి యున్నవారిని మార్గములను సృష్టించుచున్నాడు.)" అని స్వప్నావస్థయందున్న పదార్థములనుగూర్చి శ్రుతిచెప్పుచున్నది. "సృజతే" అనుపదము యథార్థములైన వానినిగూర్చి చెప్పునప్పుడే ఉపయోగింప బడునుగాని యితర సమయములయందు ప్రయోగింప బడదుగదా. కావున ఈ శ్రుతి ప్రమాణము ననుసరించి స్వప్న పదార్థములు సత్యములనియే చెప్ప వలయును. సత్యములగు పదార్థములతో కూడ ఈ జీవునకు సంబంధము లేదనుట యుక్తి యుక్తముకాదు అని తాత్పర్యము. (ఇదిపూర్వపక్ష సూత్రము.)

సూ॥ ౨॥ నిర్మాతారంచైకేపుత్రాదయశ్చ ॥

టీక॥ ఏకే = కఠశాఖనధ్యయనము చేయువారు, స్వప్నపదార్థానాం= స్వప్నపదార్థములను, నిర్మాతారంచ= నిర్మించువానినిగా

పరమేశ్వరం=పరమేశ్వరుని, ఆమనంతి=చెప్పుచున్నారు, కామాశ్చ= ఆశ్రుతియందు కామశబ్దముచేత చెప్పబడినవి, పుత్రాదయ ఏవ=పుత్రులుమొదలగువారే.

తా॥ "యఏషసుప్తేషు జాగర్తికామంకామం పురుషోనిర్మిమాణః (ఈచక్షురాది ఇంద్రియములు నిదురించుచుండగా నానావిధములగు పదార్థములను నిర్మించుచు ఏ పురుషుడు మేలుకొని యుండునో)" అనువాక్యముగల శ్రుతియందు పరమేశ్వరుడే స్వప్నపదార్థములకు కర్తయని చెప్పబడి యున్నది. దీనివలనకూడా పరమేశ్వరకల్పితములగు నాకాశాదులవలె స్వప్న పదార్థములుకూడ సత్యములేయని చెప్పవలయును. పైన ఉదహరించిన శ్రుతి కఠోపనిషత్తునందుండునది. అందలి కామశబ్దమునకు అచ్చటి యుపక్రమము ననుసరించి "కోరబడు పదార్థములు" అని అర్థము చెప్పవలయునేగాని "కోరిక" అని అర్థము చెప్పుటకు వలనుపడదు. కావున స్వప్న పదార్థములకంటే జీవుడు వేరనుట యుక్తి యుక్తము కాదని తాత్పర్యము. (ఇదియును పూర్వపక్ష సూత్రమే.)

అవ॥ పైరెండు సూత్రములచేతను చేయబడిన పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతము చేయుచున్నారు.

సూ॥ ౩॥ మాయామాత్రంతుకార్త్స్న్యేనానభివ్యక్త స్వరూపత్వాత్ ॥

టీక॥ యథార్థస్తు=నిశ్చయమైతే, కార్త్స్న్యేన= సత్యమగు వస్తువున నుండవలసిన ధర్మములతో, అనభివ్యక్త స్వరూపత్వాత్= కూడియుండని స్వరూపము గలదగుటవలన, స్వప్నసృష్టిః=స్వప్నమునందు జరుగుసృష్టి, మాయామాత్రం=మిథ్యయే (అసత్యమే.)

తా॥ స్వప్నమందు కనబడు పదార్థములకు ఉచితమగు స్థలముగాని ఉచితమగు కాలముగాని లేదుగదా. అప్పుడు సర్వ పదార్థములును పరబ్రహ్మమునందే ఆరోపింప బడియుండును కావున వానికి ఉచితములగు భూమి, ఇల్లు, మొదలగు స్థలములులేవు. గడియసేపులో అనుభవింపబడు కలయందు అనేకసంవత్సరములు జరుపవలసిన విషయములుకూడ అనుభవింప బడుచుండుటచే వానికి వలసినంత

కాలముకూడ లేదు. ఇట్లే బాగుగ విమర్శించిన సత్యములగు పదార్థములకుండవలసిన ధర్మములలో నేదియు ఈ స్వాప్న పదార్థములయందు లేదు. మఱియు మొదటి సూత్రమున నుదాహరింపబడిన శ్రుతికి పూర్వవాక్యమునందే " న తత్ర రథాః ( అస్వాప్న వస్తువునందు రథములు లేవు )" అను వాక్యముచే " లేని పదార్థము స్వప్నమునందు కల్పింప బడుచున్నవి " అని చెప్పబడియున్నది. దీనిబట్టి చూచినను అస్వాప్న పదార్థములు సత్యములనుటకు సిద్ధము. ఇదియునుగాక యుత్తర శ్రుతులనుబట్టి చూచిన రెండవ సూత్రమున నుదాహరింపబడిన శ్రుతికికూడ " జీవుడు మనో వృత్తులద్వారా స్వప్నమునందు బహువిధ పదార్థములను కల్పించుకొనుచున్నాడు " అనియే అర్థమేర్పడును. పైన నిరూపించిన విధముగా సత్యములగు పదార్థములకు తగిన దేశకాలము లుండవలసి వచ్చుటచేతను పరమేశ్వర నిర్మితములని చెప్పబడు నాకాశాదులకు నాశనములన్నియు నున్నవనుట ప్రత్యక్షమగుటచేతను స్వప్నపదార్థములు పరమేశ్వర కల్పితములనుటకు బొత్తిగా వీలే లేదుగదా. కావున ఆ స్వాప్న పదార్థములు శుక్తిరజతాదులవలె తోచక కనుబడుటయే గాని అందు యథార్థమేమియు లేదనియు వానిని చూచువాడగుటచే జీవుడాపదార్థములకంటె వేరనుటలో విరోధము లేదనియు తాత్పర్యము.

అవ॥ స్వప్నము అసత్యమని చెప్పిన నది శుభాశుభ ఫలములకు సూచకమని చెప్పుటకు వీలు లేదుకదా, యనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౪॥ సూచకశ్చహి శ్రుతేరాచక్షతేచతద్విదః ॥

టీక॥ శ్రుతేశ్చ=శ్రుతివలన, స్వప్నః= స్వప్నము, సూచకః= శుభాశుభములను సూచించును, తద్విదః= ఆస్వప్నమునుగూర్చి తెలిసినవారు, ఆచక్షతేహి=అట్లు చెప్పుచున్నారుగదా.

తా॥ " యదా కర్మసుకామ్యేషు ( కామ్య కర్మముల యందు కామ్యకర్మముల చేయునప్పుడనుట. )" అను మొదలగు శ్రుతులచేతను స్వప్నాధ్యాయమును తెలిసినవారి వాక్యముల చేతను స్వప్నములు సత్యార్థములను సూచించునని స్పష్టముగ తెలియవచ్చుచున్నది. ఇంత

మాత్రముననే ఆ స్వప్న పదార్థములు సత్యములని చెప్పవలసిన పని లేదు:—పై సూత్రమునందు నిరూపించిన ప్రకారముగా ఆ స్వప్న పదార్థములు బాధితములు (స్థిరములుకావని నిరూపింపబడినవి) అగుటచేతను జీవకల్పితము లగుటచేతను సత్యములుకావని ఇదివరకే తెలియ చేయబడియున్నదిగదా. ముత్యపుచిప్పయందు భ్రాంతిచే కల్పింపబడిన వెండి స్వయముగా నసత్యమయ్యును సత్యములగు హా గ్రాదులను గలిగించునట్లు ఈ స్వప్న పదార్థములుగూడ స్వయముగా నసత్యములైనను సత్యపదార్థములను సూచించుననుటలో విరోధ మేమియునులేదు. కావున స్వప్నపదార్థము లసత్యమనుటలో సంశయ మేమియు లేదని తాత్పర్యము.

అవ॥ ఈశ్వరుడు ప్రపంచము నెట్లు సంకల్ప మాత్రముననే సృష్టించెనో ఆ ప్రపంచముకూడా నెట్లు సత్యమై యున్నదో అట్లే జీవుడుకూడా సంకల్ప మాత్రముననే స్వప్నప్రపంచమును సృష్టించుననియు అదియును సత్యమేయనియు చెప్పవచ్చునుగదా. జీవుడుకూడా పరమేశ్వరుని యంశమగావున ఇట్లుచెప్పుట వలనను విరోధముండదు. అనిన నట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౫॥ పరాభిధ్యానాత్తుతిరోహితంతతోహ్యస్యబంధ విపర్యయౌ ॥

టీక॥ జీవస్య=జీవునియొక్క, ఈశ్వరత్వం= పరమేశ్వరత్వము (జీవునకును పరమేశ్వరునకును భేదము లేకపోవుట,) తిరోహితం= మాయచేత కప్పబడినదై, పరాభిధ్యానాత్ = ఈశ్వరునిధ్యానించుట వలన, వ్యక్తీభవతి=స్పష్టమగును, తతః= అవ్యక్తీభావము వలననే, బంధవిపర్యయౌ=బంధమోక్షములు,భవతోహి=కలుగుచున్నవిగదా.

తా॥ జీవునకును పరమేశ్వరునకును భేదము లేకపోయినను అది మాయచే కప్పబడియున్నది " నేనే బ్రహ్మము " అని పరమేశ్వరుని ధ్యానము చేయుట వలనగాని మరల బయలుపడదు, ఆ అభేదజ్ఞానము కలుగకుండు నంతవరకు జీవుడు బద్ధుడై యుండుననియు జ్ఞానము కలిగినపిదప ముక్తుడగుననియు శ్రుతిచెప్పుచున్నది. ఆశ్రుతిప్రమాణము ననుసరించిచూచిన జీవుడు పరమేశ్వరునకంటె వేరుకాకున్నన

మాయావశమువలన భిన్నశక్త్యో యుండుచున్నారు ఈ కారణము వలన పరమేశ్వరునకు లేని ఆ ... నకు సంకల్ప మాత్రముననే సృష్టి చేయగల సామర్థ్యముండదనుట యుక్తమైనదని యేర్పడు చున్నది. దీనినిబట్టి చూచిన అవతారికయందు చూపబడిన యుక్తులు నిరాధారములనుట సిద్ధాంతమగునని తాత్పర్యము.

సూ॥ ౬॥ దేహయోగాద్వాసోపి ॥

టీక॥ సోపి= జీవేశ్వరులకుగల అభేదము తిరస్కరింప బడుట కూడ, దేహయోగాత్ = దేహేంద్రియాదుల సంబంధమువలననే.

తా॥ దేహేంద్రియాదులతో సంబంధపడియుండుటవలన (అనగా దేహేంద్రియాదులయందు నేను, నాది, అను అభిమానమును కలిగియుండుటవలన ననుట.) జీవునకు ఈశ్వరునితోగల యభేదము అంతర్ధానమును జెందియున్నది. ప్రస్తుతము పైనుదహరించిన సూత్రము నందును నిరూపింపబడియున్నట్లు స్వాప్నిక పదార్థములసత్యములనుటయు ఆస్వప్న పదార్థములు ... కల్పితములనియు సిద్ధించెనని తాత్పర్యము.

—(*) ౭. తదభావాధికరణము. (*)—

అవ॥ ఈ విధముగా పైని అధికరణమునందు స్వప్నావస్థను గూర్చి చెప్పి ఈ అధికరణమున సుషుప్త్యవస్థను గూర్చి విచారించుచున్నాడు.

సూ॥ ౭॥ తదభావోనాడీషు తచ్ఛ్రుతేరాత్మనిచ ॥

టీక॥ తదభావః= స్వప్నముయొక్క అభావము. (అనగాసుషుప్త్యవస్థ) తచ్ఛ్రుతేః=శ్రుతివాక్యముల ప్రామాణ్యమువలన నాడీషు ఆత్మనిచ= నాడులయందునను పరబ్రహ్మము నందునుకూడ, సంభవతి=సంభవించు చున్నది.

తా॥ వేదమునందు "నాడులలోను హృదయకమలమునందును పరమాత్మయందును జీవుడు సుషుప్తి నొందును." అని చెప్పబడియున్నది. ఇటు మూడుస్థానములు చెప్పబడి యుండుటచే సంశయము కలుగుచున్నది. బాగుగ విమర్శించిన ఈ సంశయము రానేరదు. పై చెప్పిన మూడుస్థానములును ప్రత్యేక అభిప్రాయముతో

చెప్పబడినవికావు. "జీవుడు నరములద్వారా హృదయ కమలము ద్వారా పర బ్రహ్మమునందు సుషుప్తి చెందును." అని యీ శ్రుతుల యభిప్రాయము. కావున పరబ్రహ్మయే ముఖ్యమగు సుషుప్తిస్థానమని తాత్పర్యము.

సూ॥ ౮॥ అతఃప్రబోధోఽస్మాత్ ॥

టీక॥ అతః=పైననిరూపించిన కారణమువలన, అస్మాత్= ఈ బ్రహ్మనుండియే, ప్రబోధః=జీవులు మేలుకొనుచున్నారు.

తా॥ పైన నిరూపించిన ప్రకారము పరబ్రహ్మమే ముఖ్యమైన సుషుప్తిస్థానమగుటవలన "ఏతస్మాదాత్మనస్సర్వే ప్రాణా వ్యుచ్చరంతి (ఈ పరబ్రహ్మమునుండియే అందరును బయటికి వచ్చుచున్నారు)" అనిశ్రుతి చెప్పుచున్నది. దీనిని బట్టిచూచినను నరములు మొదలగు వాటిలో పరబ్రహ్మము ముఖ్యమని శ్రుతిచే చెప్పబడెనని తెలియుచున్నది. లోకమునందు "నేలమీద నిద్రపోవుచున్నాడు. మంచముపై నిద్రపోవుచున్నాడు. పరుపుపైననిద్రపోవుచున్నాడు" అనిచెప్పునప్పుడు నేలమొదలగు వన్నియు నిదురకు స్థానములేయైనను పరుపు యెట్లుముఖ్యమో అట్లేనరములు మొదలగునవన్నియు జీవునకు సుషుప్తిస్థానములేయైనను పరబ్రహ్మము ముఖ్యుడు. ఇట్లగుటచేత స్థానభేదమును చెప్పు శ్రుతులకు పరస్పర విరోధము లేదనియు జీవుడు పరబ్రహ్మమునందే సుప్తుడగుననియు తాత్పర్యము.

—(*) ౩. కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణమ్. (*)—

అవ॥ పరబ్రహ్మమునుండియే జీవుడు మేలుకొనుచుండుటచే ఆ పరబ్రహ్మమే సుషుప్తిస్థానమని చెప్పియున్నారు. ఇది యుక్తముగాదు, జీవుడు నాడ్యాదులందెచ్చట సుషుప్తిని జెందినను పరబ్రహ్మమునుండి మఱియొకజీవుడు వచ్చుచుండవచ్చును. నిదురించిన జీవుడే మేలుకొనవలయునని నియమము లేదుగదా, యనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౯॥ సఏవతుకర్మానుస్మృతిశబ్దవిధిభ్యః ॥

టీక॥ కర్మ=పూర్వదినమందు చేయబడిన పనిలోని శేషమును ఉత్తరదినమందు చేయుటచేతను, అనుస్మృతి= "వాడే నేను" అను జ్ఞప్తియుండుటచేతను, శబ్ద=శ్రుతులవలనను, విధిభ్యః=ఉత్తరకాలము

నందు ఫలములనిచ్చు కర్మలను వేదమువిధించి యుండుటచేతను, స ఏవ=ఆజీవుడే (అనగా పూర్వదినమునందు సుషుప్తినిచెందిన జీవుడే ప్రబుధ్యతే=మేల్కొనును.

తా॥ పూర్వదినమునందు నిదురించిన జీవుడే కదును పరదిన మునందు మేల్కొనుజీవుడు వేరియొకడు అనుట యుక్తియుక్తము గాదు. ఇట్లు చెప్పుట ప్రత్యక్ష విరోధమగును. పూర్వ దినమునందు సగము చేసియున్నపనిని రెండవ దినమునందు ముగించుచుండుటయు "నేను నిన్నటివాడనే" అనుజ్ఞప్తి యుండుటయు ప్రతివ్యక్తులయందును ప్రత్యక్షమై యున్నదికదా. వేరు దినమున వేరొకరుగా నుందురనిన ప్రత్యక్షమునకు విరోధము వచ్చును. మరియు వేదము "యాజేత (యాగము చేయవలయును)" అని స్వర్గాదో ఫలమునిచ్చు కర్మలను ఉపదేశించుచున్నది. జీవుడు దినమున వేరొకడైనచో విధులు నెవరిని గూర్చి యుపదేశింపబడును. ఈ విరోధములవలన ఏ జీవుడు నిద్రించునో ఆ జీవుడే మరల మేల్కొనుననియే యొప్పుచున్నది. ఇదియును గాక "తత్ ఇహ వ్యాఘ్రోవా (ఆ జీవుడు పులిగా నున్నవాడు పులి గాను)" అనుమొదలగు శ్రుతులచే పైన వర్ణింపబడియున్న విషయ ము స్పష్టముగాగూడ చెప్పబడియున్నదని తాత్పర్యము.

—(*) ౮. ముగ్ధాధికరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా పై అధికరణములయందు స్వప్న సుషు ప్త్యవస్థలనుగూర్చియు ఈ అధ్యాయము ప్రథమ పాదమునందు ఇహ పరలోకములనుగూర్చి చెప్పబడియుండుటచే జాగ్రదవస్థనుగూర్చియు విచారించి ఆ అవస్థలకంటె సాక్షిరూపుడగు జీవుడు వేరని నిరూపించి ఈ యధికరణమునందు మూర్ఛ సుషుప్త్యవస్థలో నేకీ భవించునా లేక వానికంటే వేరా? అనువిషయమును విచారించుచున్నాడు.

సూ॥ ౧౦॥ ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్ ॥

టీక॥ పరిశేషాత్=శేషముండుటవలన, ముగ్ధే=మూర్ఛచెంది నవానియందుండునవస్థ, అర్ధసంపత్తిః=సగముసుషుప్తిధర్మములతోను తక్కినసగము మరణధర్మములతోను కూడియున్నది, తస్మాత్ పృ థక్= అందువలన వేరు.

తా॥ ఈ మూర్ఛ జాగ్రత మొదలగు నవస్థలలో దేనియందును నేకీభవించదు. సుషుప్త్యవస్థయందలి కొన్ని ధర్మములు అనగా ఏవస్తువును తెలిసికొనలేకపోవుట మొదలగునవి యున్నను వణకుటతన్నుకొనుట చొంగవేయుట మొదలగు మరణ ధర్మములు కూడ నుండుటచే నామూర్ఛ సుషుప్త్యవస్థయం దేకీభవించు ననుటకు వీలులేదు. కావున ఇది ప్రత్యేకావస్థయేయని తాత్పర్యము.

—(*) ౫. ఉభయలింగాధి కరణమ్.(*)—

అవ॥ ఈ విధముగా జీవునియథార్థ స్వరూపమునుగూర్చివిచారించి ( సర్వము ఉపాధివశము వలననేగాని జీవునకు స్వభావముగా దేనితోను సంబంధములేదనియు ఆయన స్వప్రకాశుడనియు నిర్ణయించి ) ఈ క్రింద పరబ్రహ్మమునుగూర్చి విచారించు చున్నాడు. అందు మొట్టమొదట ఈ అధికరణమునందు పరబ్రహ్మ నిర్విశేషుడని ( భేదను లేమియు లేనివాడని ) నిరూపింపబడును.

సూ॥ ౧౧॥ నస్థానతోపిపరస్యోభయలింగం సర్వత్రహి ॥

టీక॥ పరస్య, బ్రహ్మకు, స్థానతోపి=భూమిమొదలగు ఉపాధుల సంబంధమువలనకూడా ఉభయలింగం= ఆకారముకలవాడనియు లేనివాడనియుకూడ చెప్పుటకుతగినవీలు, న=లేదు, సర్వత్ర=సర్వశ్రుతులయందును, బ్రహ్మనిరాకారమిత్యేవ=పరబ్రహ్మమునకు ఆకారములేదనియే, ఉచ్యతేహి=చెప్పబడుచున్నదిగదా.

తా॥ వేదముకొన్నిచోట్ల పరబ్రహ్మకు ఉపాధులను జెప్పియున్నది. ఈ గుర్తునుబట్టి ఆయనకు ఆకారముకలదనియు శుద్ధబ్రహ్మను గూర్చి జెప్పు శ్రుతుల ననుసరించి యాకారము లేదనియు రెండువిధములుగాకూడ చెప్పవలసిన నది యుక్తముకానేరదు. సత్యమగుపదార్థము రెండు రూపములుగా నున్నదనుట ప్రత్యక్ష విరోధముగదా. భ్రాంతిమైనచో ఒకటి-రజ్జువు ఒకపురుషునకు సర్పముగాను మఱియొకపురుషునకు దండముగాను గనుపడునట్లు అనేక విధములుగా ఒకటిపదార్థమే తోచవచ్చును. పరబ్రహ్మము అట్టివాడు కాడుగదా. మఱియు వేదాంతప్రకరణమునంద అన్నిచోట్లను “ అశబ్దమస్పర్శం (శబ్దస్పర్శములు లేనివాడు) ” అను మొదలగు శ్రుతులచే పరబ్రహ్మనిర్వి

కారుడనియే బోధింపబడుచున్నది. కావున పరబ్రహ్మ సాకారుడని చెప్పుటకు ఏయాధారమును లేదని తాత్పర్యము.

అవ॥ ఇట్లుచెప్పుట సరికాదు ఉపాసనకొరకై చెప్పబడు అన్ని విద్యలయందును పరబ్రహ్మమునకు ఆకారభేదము చెప్పబడియేయున్న దిగదా. అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౨॥ నభేదాదితిచేన్నప్రత్యేకమతద్వచనాత్॥

టీక॥ భేదాత్ = ఆకారభేదములు చెప్పబడి యుండుటవలన, బ్రహ్మ=పరబ్రహ్మము, నసిర్విశేషమేవ=నిర్వికారమని మాత్రమే చెప్పుటకు వీలులేదు, ఇతిచేత్=అనేనెడల, న=అదిసరికాదు, కుతః= ఎందువల్లననగా ప్రత్యేకం వేరువేరుగా ( ఆకారముగల బ్రహ్మ ఒకరూడనియు ఆకారములేని బ్రహ్మయొకరూడనియు, ) అతద్వచనాత్= భేదమును చెప్పలేదు. కావున ( శ్రుతియందు పరబ్రహ్మమునకు రెండు రూపములు గలదని చెప్పబడి యుండలేదు.

తా॥ ప్రతివిద్యయందును ఆకారభేదములు చెప్పబడియే యున్నను పరబ్రహ్మము సవిశేషుడనిగాని నిర్విశేషుడుగను సవిశేషుడుగను కూడా నున్నాడనిగాని చెప్పుటకు వీలులేదు. ఏలయనగా ఆకారభేదములు చెప్పబడి యున్నంత మాత్రముననే పరబ్రహ్మకూడా భిన్న స్వరూపముగా నుండవలసిన పనిలేదుకదా, శ్రుతియందు కూడా " అయమేవ సయోయం ( ఈ యుపాధి యందున్న పరబ్రహ్మమే ఆయుపాధియందున్నాడు ) అనుమొదలగు వాక్యములచే నిర్విశేషుడగు పరబ్రహ్మమే సర్వోపాధుల యందు నున్నాడని స్పష్టముగ చెప్పబడుచున్నది. ఇట్లగుటచే పరబ్రహ్మ నిర్విశేషుడనియే చెప్పుట యుక్తి యుక్తమని తాత్పర్యము.

అవ॥ పరబ్రహ్మమునందు భేదము లేవియును లేవనుటకు మఱియొకయాధారమును జూపుచున్నాడు.

సూ॥ ౧౩॥ అపిచైవమేకే॥

టీక॥ అపిచ=మఱియు, ఏకే=కొందరు, ఏవం= ఈ విధముగా ( పరబ్రహ్మమునందు భేదము లేమియును లేవని ) సమామనంతి= చెప్పుచున్నారు.

తా॥ "మనసైవేదమాప్తవ్యం నేహనానాస్తికించనమృత్యోస్సమృత్యుమాప్నోతి యఇహనానేవ పశ్యతి ( ఈ పరబ్రహ్మమును గురూపదేశముచే నిర్మలమగు మనస్సుచేతనే నెఱుంగవలయును. అట్లు తెలిసికొనిన ఆపరబ్రహ్మమునందు భేదమేమియు కనుపడదు. ఎవ్వడు ఆపరబ్రహ్మమునందు భేదమున్నదని తలంచునో [ అవిద్యచేత కల్పింపబడిన భేదము యథార్థముగ నున్నదని తలంచునో వాడు జననమరణరూపమగు సంసారమును మరల మరల పొందుచుండును. ] అనియొక శాఖయందు భేదదృష్టిని నిందించి పరబ్రహ్మ నిర్విశేషుడని నిరూపింపబడియున్నది. దీనిని పట్టిచూచినను పరబ్రహ్మము సవిశేషుడనుటకు వీలు లేదని తాత్పర్యము.

అవ॥ నిర్గుణ శ్రుతులును సగుణశ్రుతులును సమానములై యుండగా పరబ్రహ్మము నిర్విశేషుడనియే చెప్పవలయునని పట్టుదల ఏల? అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౧౪॥ అరూపవదేవహితత్ప్రధానత్వాత్ ॥

టీక॥ బ్రహ్మ=పరబ్రహ్మను, అరూపవదేవ= రూపములేనిదే, తత్ప్రధానత్వాత్ = అశ్రుతులే ప్రధానము లగుటవలన, ఏవమేవహి=ఇట్లు నిర్ణయింప వలయునుగదా.

తా॥ పరబ్రహ్మము నిర్విశేషుడనియే చెప్పి తీరవలయును. సగుణ నిర్గుణశ్రుతులు సమానముగా నుండుట నిశ్చయమే యైనను అందు నిర్గుణ శ్రుతులే ప్రధానములు. యథార్థస్థితిలో సగుణశ్రుతులు ప్రధానములనుటకు వీలే లేదు. అవి ప్రత్యక్ష సిద్ధములగు ( అనగా ప్రపంచమున విమర్శచేయని జనసామాన్యమునకే విధముగా దోచుచున్నదో ఆయా విధముగానే) జీవబ్రహ్మభేదము, (ఉపాసనార్థమై) ఆపరబ్రహ్మమునకు కొన్ని యాకారములు ఇవిమొదలగు విషయములను చెప్పుచున్నవి. వీనినే ప్రధానములని చెప్పిన నిర్గుణ శ్రుతులకు అర్థమే లేకపోవలసివచ్చును. ఇదియునుగాక అపూర్వములగు విషయములను నిరూపించుచుండుటచేతనేగదా? వేదమును వేదమని చెప్పుచున్నాము. కావున సగుణశ్రుతులు అపూర్వమగు విషయమును చెప్పవు. కావున ప్రధానములు కానేరవు. ఇదియునుగాక సగుణ శ్రుతులు

ప్రధానములని చెప్పిన నిర్గుణశ్రుతులకు సరియైన యర్థ ముండదుగాని నిర్గుణశ్రుతులు ప్రధానములని చెప్పిన సగుణశ్రుతులకు ఏ విధమగు భంగమునురాదు. ఒకయపూర్వవిషయమునుఉపదేశింప వలయునన్న మొట్టమొదట శిష్యుడున్న స్థితిని అవలంబించియేకదా యుపదేశమును ఆరంభింపవలయును. కావున యెట్లుచూచినను నిర్గుణశ్రుతులే ప్రధానములనియు వానినిబట్టి పరబ్రహ్మము నిర్విశేషుడనియే సిద్ధాంతము చేయవలయుననియు తాత్పర్యము.

అవ॥ ఇట్లు బ్రహ్మ నిర్విశేషుడని చెప్పిన సవిశేష శ్రుతుల కర్థమేమి? అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౧౫॥ ప్రకాశవచ్చావైయర్థ్యం ॥

టీక॥ ప్రకాశవచ్చ=ప్రకాశమువలె,అవైయర్థ్యం= పరబ్రహ్మమునకు ఆకారముకలదనుట వ్యర్థము కానేరదు.

తా॥ సూర్యప్రకాశము సర్వవ్యాపకమైనదైనను వేర్వేరుపొడవులగు ఉపాధులయొక్క భేదములవలన ఆకార భేదములను పొందినట్లు పరబ్రహ్మముకూడ సర్వవ్యాపకమైయున్నను ఉపాధిభేదమువలన నానావిధములగు రూపములుగలదిగా తోచవచ్చును. కనుకవలన బ్రహ్మ సాకార మనిచెప్పు ఉపాసనా ప్రకరణమునందలి శ్రుతులు కూడా వ్యర్థములు కావలసిన పనిలేదు. ఇంతమాత్రమున బ్రహ్మకూడ సవిశేషముగా నకూడదని తాత్పర్యము.

సూ॥ ౧౬॥ ఆహాచతన్మాత్రం॥

టీక॥ శ్రుతిః=వేదము, బ్రహ్మ=పరబ్రహ్మమును, తన్మాత్రం=చైతన్యమాత్రమునుగా, ఆహాచ=చెప్పుచున్నది.

తా॥ "సయథా సైంధవ ఘనోనంతరో బాహ్యః కృత్స్నో రస ఘనఏవ ఏవం వా అరేయమాత్మా నంతరోబాహ్యః కృత్స్నః ప్రజ్ఞాన ఘనఏవ ( ఉప్పురాయి లోపల వెలుపల అను భేదములేక అంతయును ఉప్పే [ లవణరసమే ] అయ్యున్నట్లు పరబ్రహ్మముకూడ లోపల వెలుపల అనుభేదములేక అంతట చైతన్యమే అయియున్నాడు. )" అనుమొదలగు వాక్యములచే శ్రుతి "పర బ్రహ్మము చైతన్య

మాత్రుడు " అని చెప్పుచున్నది. దీనినిబట్టిచూచినను ఆకారాదులను గూర్చి చెప్పు శ్రుతులు ముఖ్యములగుటకు వీలులేదని తాత్పర్యము.

సూ॥ ౧౭॥ దర్శయతిచాథోఽపిస్మర్యతే ॥

టీక॥ బ్రహ్మనిర్విశేషమితి=పరబ్రహ్మమునందు భేదములేమియును లేవని, దర్శయతి=శ్రుతిచెప్పుచున్నది, అథోపి = అదేవిధముగా, స్మర్యతే=స్మృతికూడ చెప్పుచున్నది.

తా॥ " అథాతఆదేశో నేతినేతి ( పంచ భూతములను గూర్చి చెప్పినపిదప పరబ్రహ్మమును తెలిసికొనవలయును గావున" " ఇది కాదు, ఇదికాదు " అని సర్వపదార్థములను విడచిన శేషించునది పరబ్రహ్మము.) "జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వామృత మశ్నుతే । అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే ( జ్ఞేయమగు పరబ్రహ్మనుగూర్చి చెప్పెదను. దానిని తెలిసికొనిన మోక్షమునొందెదరు. ఆపరబ్రహ్మము కార్యములను చేయదు. ఒకవస్తువునకు కారణము కాదు. ఒకదానికి కార్యమును కాదు) " అనుశ్రుతి స్మృతులచే నిషేధరూపముగా " పరబ్రహ్మము నిర్విశేషుడుఅని నిరూపింప బడియున్నది. దీనినిబట్టిచూచినను పరబ్రహ్మము సవిశేషుడనుటకు వీలులేదని తాత్పర్యము,

సూ॥ ౧౮॥ అతఏవచోపమాసూర్యకాదివత్ ॥

టీక॥ అతఏవచ=ఈకారణమువలననే, సూర్యకాదివదితి=జలమునందు ప్రతిబింబించిన సూర్య ప్రతిబింబముల వలెఅని, ఉపమా=ఉపమానము, ఉచ్యతే=చెప్ప బడుచున్నది.

తా॥ పైన నిరూపించిన కారణముల వలననే ( బ్రహ్మ నిర్విశేషుడగుటవలనను ఆయనకు స్వాభావికములై యున్నట్లుగా తోచుచున్న భేదములు ఉపాధివశము లగుటచే అపారమార్థికము లగుటవలనను ) " పరబ్రహ్మము ఒకరుడైనను, జలమునందలి సూర్యప్రతిబింబములవలె ననేకవిధములుగా దోచుచున్నాడు " అను ఉపమానము శ్రుతులయందును స్మృతుల యందును ప్రయోగింప బడుచున్నది. " యథాహ్యయం జ్యోతిరాత్మా వివస్వాన్ " ( జ్యోతి స్వరూపుడగు ఈ సూర్యునివలె ) ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్ర

వత్ ( జలమునందు ప్రతిబింబించిన చంద్రప్రతి బింబములవలె ఈపర బ్రహ్మము ఒకడుగాను అనేకులుగాను కనుపడు చున్నాడు. )" అను శ్రుతి, స్మృతులు ఈ విషయమున ప్రమాణములు యథార్థముగా పరబ్రహ్మమునకు భేదములున్న యెడల అవాస్తవభేద ప్రతిపాదకమగు ( యథార్థమగు భేదములుగాక, కేవలము భేదములుగానున్నట్లు తోచు సందర్భమును బోధించు ) ప్రతిబింబ దృష్టాంతము నిచ్చియుండకూడ దుగదా. కావున పరబ్రహ్మము నిర్విశేషుడనియే తాత్పర్యము.

అవ॥ ఈదృష్టాంతము సరియైనదికాదని పూర్వపక్షి యాక్షే పించుచున్నాడు.

సూ॥ ౧౯॥ అంబువదగ్రహణాత్తునతథాత్వం॥

టీక॥ అంబువత్ =జలమువలె, మనః = మనస్సును, అగ్రహ ణాత్ =గ్రహించక పోవుటవలన, తథాత్వం=సూర్యునకు జలముఉపా ధియైనట్లు, పరబ్రహ్మమునకు మనస్సు ఉపాధియనుట, నతు = యు క్తమైనదికాదు.

తా॥ మీరుచెప్పిన దృష్టాంతము సరియైనదికాదు. సూర్యునకు ఒక యాకారమున్నది. ఆయన ప్రతిబింబించు జలము ఆయనకు దూర ముగానున్నది. బింబమగు పదార్థము ( ప్రతిబింబించవలసిన వస్తువు ) రూపముగలదిగా నుండ వలయు ననుటయు ప్రతిబింబమునకు ఆధార మగు వస్తువు తగినంతదూరమునందుండవలయు ననుటయు ప్రత్యక్ష సిద్ధములగు నియమములుగదా. కావున సూర్యుని విషయమునందు ఈ నియమములు సంపూర్ణముగ నుండుటచే ఆయన ప్రతిబింబించు చున్నాడనుటయు ఉపాధివశమున ప్రతిబింబములయందు గలుగుభేద ములు ఆయనకు లేవనుటయు యుక్తమగును. ప్రకృతమున పరబ్రహ్మ ము నిర్విశేషుడగుటచే రూపములేనివాడని మీరే (వేదాంతులే) చెప్పు చున్నారు. ఆయన సర్వవ్యాపకుడు కూడ కావున ప్రతిబింబాధార మగు మనస్సు ఆయనకంటె దూరము నందున్న దనుటకు వీలు లేదు కాబట్టి ఈదృష్టాంతము సరియైనది కానేరదని తాత్పర్యము. (ఇది పూర్వపక్షము. )

అవ॥ పై సూత్రమునందు చేయబడిన పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతి సమాధానమును చెప్పుచున్నాడు.

సూ॥ ౨౦॥ వృద్ధిహ్రాసభాక్త్వ మంతర్భావాదుభయ సామంజస్యాదేవం ॥

టీక॥ అంతర్భావాత్ =లోపలనుండుటవలన, (ప్రతిబింబించుటవలన ) వృద్ధిహ్రాస భాక్త్వం= వృద్ధి, క్షయము, మొదలగు వానిని కలిగియుండుట, ఇత్యంశేన = అనుభాగముతోనే, ఉభయసామంజస్యాత్ = దృష్టాంత దార్ష్టాంతికములకు పోలిక యుండుటవలన, ఏవం=పైన చెప్పిన దృష్టాంతము సరియైనదే.

తా॥ పైసూత్రమునందు చేసినయాక్షేపము సరియైనదికాదు. దృష్టాంతమునకును, దార్ష్టాంతిక మునకును ( ఏవిషయమునుగూర్చి దృష్టాంతము చెప్పబడియున్నదో అదిదార్ష్టాంతికము ) అన్ని విషయముల యందును పోలిక యుండవలసిన పనిలేదు. అట్లుండియే తీరవలయునన్న "ఉపమేయమునకంటే ( ఏవస్తువును మఱియొక వస్తువుతో పోల్చుదురో ఆవస్తువు ఉపమేయము. చంద్రునివంటి ముఖము అనుచోట ముఖము ఉపమేయము ) ఉపమానము కొంచెము అధికమై యుండవలయును " అను అలంకార శాస్త్రజ్ఞులనియమమునకును దాని ననుసరించిన ప్రత్యక్ష వ్యవహార మునకును బాధ కలుగును. (దృష్టాంతాలంకారముకూడ ఉపమాలంకారమువంటిదే కావున, ఈ రెండు అలంకారములును ఒకటే నియమము ననుసరించియే యుండవలయునని తెలిసికొనునది. ) కావున దృష్టాంత దార్ష్టాంతి కములకు వక్తృసంకల్పితమగు ( చెప్పినవానికిష్టమైన ) ధర్మ మొకటటి సమానముగా నుండిన చాలును. ప్రకృతమున " జలమునందు ప్రతిబింబించిన సూర్య ప్రతి బింబమునకు ఉపాధి వశమున కలుగు వృద్ధి, క్షయ, చల, నాదులు ఎట్లు యథార్థములుకావో అట్లే పరమేశ్వరునకుకూడ ఉపాధివలన కలుగు వృద్ధి, క్షయాదులు పర మార్థములు కావు " అను నీయంశమున దృష్టాంత దార్ష్టాంతికములకు సాదృశ్యము కలదుగదా. దృష్టాంతము సరియైన దనుటకు ఇంత మాత్రమే

చాలును. కావున మీరుచేసిన యాక్షేపమువలన మామతమునకుభంగ మేమియును రాదని తాత్పర్యము.

సూ॥ ౨౧॥ దర్శనాచ్చ ॥

టీక॥ దర్శనాచ్చ = శ్రుతివలనకూడా, అయం దృష్టాంతో యుక్తః=ఈ దృష్టాంతము సరియైనది.

తా॥ ఇదియునుగాక "పురస్సపక్షీభూత్వా పురఃపురుష ఆవిశత్ (అపరబ్రహ్మము సూక్ష్మశరీరాభిమానియై ఇంద్రియోత్పత్తికంటే పూర్వము తానుసృజించిన శరీరములను ప్రవేశించెను)" అను శ్రుతిచేత "పరబ్రహ్మము సూక్ష్మశరీరోపాధియందు ప్రతిబింబించి దేహమును ప్రవేశించెను" అని స్పష్టముగానే చెప్పబడి యున్నది. కావున పై సూత్రమునందు చూపబడిన యుక్తులచేతను, ఈ సూత్రమునందు చూపబడిన శ్రుతి ప్రమాణము చేతను సూర్య ప్రతిబింబ దృష్టాంతము సరియైనదేయనియు కావున ఈఅధికరణమునందుబ్రహ్మ నిర్విశేషమేయనుటయు చైతన్య స్వరూపమే యనుటయు సయుక్తికముగ సిద్ధాంతము చేయబడినవనియు తాత్పర్యము.

—(*) ౬. ప్రకృతైతావత్త్వాధికరణమ్. (*)—.

అవ॥ "అధాత ఆదేశో నేతి నేతి" అను శ్రుతిచేత ప్రపంచనిషేధపూర్వకముగా పరబ్రహ్మ తెలియజేయబడుచున్నాడని చెప్పియున్నారు. ఇది యుక్తముగాదు. "ద్వేవావ బ్రహ్మణో రూపే మూర్తంచా మూర్తంచేతి (ఆకారము కలదియనియు, లేనిదియనియు పరబ్రహ్మమునకు రెండురూపములుకలవు. పృథివ్యప్తేజస్సులు మూర్తమగు బ్రహ్మరూపము. తక్కినవి అమూర్తమగు రూపమనియు తెలిసికొనవలయును)" అని యారంభించి పై శ్రుతి సంపూర్ణమగు నిషేధమును చెప్పుచున్నది. ఈ నిషేధమువలన పరబ్రహ్మముకూడ నిషేధింపబడెనని తెలియుచున్నది. దీనికి సమాధాన మేమియనిన ఈ పూర్వపక్షమును ఖండించుటకై ఈ అధికరణమును ఆరంభించుచున్నాము.

సూ॥ ౨౨॥ ప్రకృతైతావత్త్వంహి ప్రతిషేధతితతో బ్రవీతిచభూయః॥

టీక॥ ప్రకృత = ప్రస్తుతమైన, ఏతావత్త్వం= పరిచ్ఛిన్నత్వమును, ప్రతిషేధతి=నిషేధించుచున్నది, నబ్రహ్మ= పరబ్రహ్మను నిషేధించుటలేదు, కుతః=ఎందువలన ననగా, తతః = ప్రపంచమును నిషేధించినపిదప, భూయశ్చ = మరలనున్ను, బ్రవీతిహి = పరబ్రహ్మమును గూర్చి చెప్పుచున్నది.

తా॥ "అథాతః" అను శ్రుతి పర బ్రహ్మమును నిషేధించు ననుట దోషము. ఏలయనగా "ద్వేవావ" అనుమొదలగు ఉపక్రమ వాక్యమునందు చెప్పబడిన రూపములను మాత్రమే ఆశ్రుతి నిషేధించునని స్పష్టముగా తెలియుచున్నది. ఆరూపములు యథార్థములేనైననమొడల సర్వవ్యాపకుడగు పర బహ్మము పరిచ్ఛిన్నుడు కావలసివచ్చునుగదా. ఇది ఏశ్రుతికిని సమ్మతముకాదనుట ఇదివరకే నిరూపింపబడియున్నది. ఇదియునుగాక "అన్యత్పరమస్తి (ఈ ప్రపంచమునకంటెే వేరుగనొక్కడున్నాడు)" అను, ఉత్తర వాక్యముచే పైన నిరూపించిన విషయమును శ్రుతియే స్వయముగా దెలియ జేయుచున్నది. పరబ్రహ్మముకూడ నిషేధింప బడియే యుండినచో "అన్యత్పరమస్తి" అను వాక్యమునకు అర్థమే లేకపోవలసి వచ్చునుగదా. కావున అవతారికయందు చూపబడిన పూర్వపక్షము యుక్తిశూన్యమైనదని తాత్పర్యము.

అవ॥ పరబ్రహ్మముండినచో ఏలకనుపడడనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౨౩॥ తదవ్యక్తమాహహి ॥

టీక॥ తత్ =ఆపర బ్రహ్మము, అవ్యక్తం=ఇంద్రియములకు తెలియువాడుకాడని, ఆహహి=శ్రుతి చెప్పుచున్నది కదా.

తా॥ ఈ ఇంద్రియములు పర బ్రహ్మమును గ్రహింప నేరవు. కావున ఆయన సత్య స్వరూపుడైనను ప్రత్యక్షముకాడు. సాక్షిస్వరూపుడై తమ్మును ప్రకాశింప చేయువానిని ఆ ఇంద్రియములు ప్రకాశింపచేయనేరవనుట యుక్తియుక్తమేకదా. ఘటాదులను ప్రకాశింప చేయు దీపమును ఆఘటాదులు మరల ప్రకాశింప చేయలేవనుట ప్రత్యక్ష సిద్ధమే. శ్రుతియు "నచక్షుషా గృహ్యతేనాపివాచా (ఆపర బ్రహ్మము కంటిచే చూడబడువాడుకాడు. వాక్కుచే చెప్పుటకు వీల

గువాడుకాడు )" అనుమొదలగు వాక్యములచేత పైనిరూపించిన విషయమునే అనువాదము చేయుచున్నది. కావున పరబ్రహ్మము సత్యరూపుడనుటకును, ప్రత్యక్షము కాదనుటకును, విరోధము లేదని తాత్పర్యము.

సూ॥ ౨౪॥ అపిసంరాధనేప్రత్యక్షానుమానాభ్యాం ॥

టీక॥ అథాపి=అట్లైనప్పటికిని, సంరాధనే=ధ్యానముచేయునప్పుడు, యోగినః తంపశ్యంతి = యోగులు ఆపరమేశ్వరుని చూచెదరు, ఏతచ్చ=ఇదిన్ని, ప్రత్యక్షానుమానాభ్యాం = శ్రుతిస్మృతుల వలన. జ్ఞాయతే=తెలియబడుచున్నది.

తా॥ అట్లైనను యోగులు ధ్యానమునందు అంత ర్ముఖమగు చిత్తవృత్తిచే ఆ పరమేశ్వరుని సాక్షాత్కరించుచునే యున్నారు. ప్రత్యక్షము కాలేదనుట మాత్రమువలననే పరమేశ్వరుడు లేడని చెప్పు నెడల పైనిరూపించిన యోగుల యనుభవము పరమేశ్వరుడున్నాడనుటలో ప్రమాణమగును. యోగులకు ఇట్టి యనుభవము కలదను విషయమును శ్రుతిస్మృతు లిట్లు చెప్పుచున్నవి. " తతస్తుతంపశ్యతి నిష్కళం ధ్యాయమానః। యోగినస్తం ప్రపశ్యంతి ( ధ్యానించుచున్న పురుషుడు నిరవయవుడగు ఆ పరబ్రహ్మమును ప్రత్యక్షము చేసికొనగలడు. యోగులు ఆ పరబ్రహ్మమును జూతురు )" ఇది మొదలగునవి పై విషయమును అనువాదము చేయు శ్రుతిస్మృతులు. కావున పరబ్రహ్మము సత్పదార్థ మనుటకును ఏవిధమగు సంశయమును లేదని తాత్పర్యము.

అవ॥ ఇదియును సరికాదు. పరబ్రహ్మము నిర్విశేషుడు కావున " ఇతడారాధించువాడు, ఇతడారాధింపబడువాడు " అను భేదమే సంభవింపదుకదా. అనిన సమాధానమును చెప్పుచున్నాడు.

సూ॥ ౨౫॥ ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చ
కర్మణ్యభ్యాసాత్ ॥

టీక॥ ప్రకాశాదివత్=గాంగి, ఆకాశము మొదలగువానికివలె, బ్రహ్మణశ్చ=పరబ్రహ్మమునకుకూడా, కర్మణి = బుద్ధ్యాద్యుపాధుల యందు, ప్రకాశః= నానాభేదములుగా కనుబడుట, అవైశేష్యంచ=

స్వభావముగా మార్పులేకయుండుటను, సంభవతః= కలుగుచున్నవి, కుతః=ఎందువలననన గా, అభ్యాసాత్ =తత్వమసిఅని పలుమారుచెప్పుటవలన (బ్రహ్మముయొక్క స్వభావము నిర్విశేషత్వమేయనియు, ఉపాధులవలన భేదముల్నట్లు కనుపడుచున్నదనియు, తెలియుచున్నది.

తా॥ కాంతియొక్కటియే యైనను వ్రేళ్లు వంకరగా పెట్టుట మొదలగు ఉపాధులవలన నానాభేదములు కలదిగా నెట్లు కనుపడుచున్నదో ఆకాశ మొక్కటియైనను కుండమొదలగు ఉపాధులవలన అనేకవిధములగు నాకారములు గలదిగా నెట్లు కనుపడుచున్నదో అట్లనేక భేదములు కనుపడినను ఆప్రకాశము యొక్కగాని ఆకాశము యొక్కగాని ఏకత్వమునకెట్లు భంగములేదో అట్లే బుద్ధిమొదలగు నుపాధులవలన పరబ్రహ్మముకూడ "ధ్యానించువాడు, ధ్యానింపబడువాడు' అనుమొదలగు ననేక భేదములతో కనుపడవచ్చును. దీనివలన స్వాభావికమగు, నిర్విశేషత్వమునకు భంగముకూడ లేక పోవచ్చును. "తత్వమసి ( ఆ పరబ్రహ్మమే నీవు )" అనుశ్రుతి యనేక మారులు చెప్పబడియుండుటచే పైవర్ణించిన విషయము స్పష్టమగుచున్నది. అనేక దృష్టాంతముల నిచ్చి జీవబ్రహ్మల యేకత్వము నాశ్రుతి పలుమారు నిరూపించుచున్నది. ( ఈ కారణమువలననే '' అభ్యాసము [ ఒకవిషయమునే పలుమారుచెప్పుట ]" కూడ నొకహేతువుగా సూత్రమునందు చెప్ప బడియున్నదని తెలిసి కొనవలయును. ) ఇట్లు చెప్పుటచే పరబ్రహ్మమునకు నిర్విశేషత్వమే స్వభావమనియు భేదము ఉపాధి కల్పితమగుటచే మిథ్యయనియు స్పష్టముగ తెలియుచున్నది గదా. కావున ఈ శ్రుతి ప్రమాణమును బట్టి చూచిన పరబ్రహ్మము నిర్విశేషుడే యైనను ఉపాధి వశమున ధ్యాతగాను ధ్యేయముగాను ( ధ్యానించువాడుగాను, ధ్యానించబడువాడుగాను) కనుపడుననుటలో విరోధ మేమియును లేదని యేర్పడునని తాత్పర్యము.

సూ॥ ౨౬॥ అతోఽనంతేన తథాహిలింగం ॥

టీక॥ అతః= ఈకారణమువలన ( భేదము ఉపాధుల వలననే కలుగునుగావున ) అనంతేన = పరబ్రహ్మముతోకూడా, జీవైక్యం=

జీవు డేకీభవించును, లింగం=శ్రుతియందలి గురుతుకూడ, తథాహి= అట్లే యున్నదికదా.

తా॥ పై సూత్రమునందు "పరబ్రహ్మమునందు కనుపడు భేదములన్నియును ఉపాధులవలన కలిగినవే" అని నిరూపింప బడియున్నది. ఈ కారణమువలన ఇట్టి స్వగత భేదము కలవారుగా నెంచబడుచున్న జీవబ్రహ్మ లొక్కటియే యని సిద్ధాంతము చేయవలసి యున్నది. "బ్రహ్మవేద బ్రహ్మైవభవతి (పరబ్రహ్మము నెఱింగినవాడు పరబ్రహ్మమేయగును)" అను వాక్యముచేత జీవుడు బ్రహ్మ కాకుండుటకు అజ్ఞాన మొకటియే కారణమనియు ఆ అజ్ఞానము పోయిన పరబ్రహ్మమునకును జీవునకును భేదమే లేదనియు స్పష్టముగనే తెలియచేయబడుచున్నదికదా? యని తాత్పర్యము.

అ॥ సూత్రకారుడీ విధముగా జీవబ్రహ్మలు అభిన్నులను విషయమున తనయభిప్రాయమును చెప్పి యితరుల మతములను అనువాదపూర్వకముగా ఖండించుచున్నాడు.

సూ॥ ౨౭॥ ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్ ॥

టీక॥ ఉభయవ్యపదేశాత్=భేదాభేదములు రెండును చెప్పబడి యుండుటవలన, అహికుండలవత్ = చుట్టుకొనియున్న పాము నిలుచుకొనియున్న పాము వీటి యొక్క రూపవలె, జీవబ్రహ్మణోః= జీవబ్రహ్మలకుగల భేదాభేదౌ=భేదము అభేదము ఈ రెండును పారమార్థికౌ=స్వభావసిద్ధములే. ( ఎప్పటికిని మారునవికావు. )

తా॥ లోకమునందు నిలుచుకొనియున్నపాము చుట్టచుట్టుకొని యున్నపాము వీటి రెంటికిని భేదము అభేదము కూడకలదు. రెండును పాములే యగుటచేత నభేదముకలదు. నిలుచుకొనియున్నపాము చుట్ట చుట్టుకొని యున్నదికాదు. కావున భేదముకూడకలదు. ఇవి రెండును యథార్థములైనవేగదా. ఇట్లే జీవబ్రహ్మలకు కూడా భేదాభేదము లుండవచ్చును, ఇరువురును చైతన్య స్వరూపులే. కావున వారలకు అభేదముండవచ్చును. జీవుడొకడును బ్రహ్మ యొకడును గావున వారలకు భేదముకూడ నుండవచ్చును. ఈభేదాభేదములు రెండును మార్పు చెందుటకువీలులేని వగుటచే స్వాభావికములనియే చెప్పవలయును.

ఒకచోట భేదమును, మఱియొకచోట నభేదమును చెప్పుశ్రుతికి నిదిం తాత్పర్యము. అనికొందరు చెప్పుచున్నారని తాత్పర్యము.

సూ॥ ౨౮॥ ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్ ॥

టీక॥ అథవా=అట్లుగాక, తేజస్త్వాత్ = రెండును తేజస్సు యగుటవలన, ప్రకాశాశ్రయవత్ = కాంతియు కాంతికాశ్రయము సూర్యుడు మొదలగునవియు దీనివలె, జీవబ్రహ్మణోరపి=జీవబ్రహ్మల కూడా, భేదేస్వతస్సిద్ధే=భేదముస్వభావికమైయున్నను, అభేదోక్తిః అభేదమును శ్రుతి చెప్పుచున్నది.

తా॥ లోకమునందు సూర్యప్రకాశమునకును సూర్యునకు భేదము స్వాభావికమేమైనను ( సూర్యకాంతి సూర్యుడు కానేరదు సూర్యుడే సూర్యకాంతి యనుటకు వీలులేదు ఇట్లున్నను ) రెండు ( సూర్యుడును సూర్యకాంతియును ) తేజస్సేకావున వాటికభేదమ నెట్లు చెప్పుచున్నారో అట్లేజీవబ్రహ్మలకుకూడా భేదము స్వతస్సిద్ధమైనను అభేదమును ( జీవబ్రహ్మలొకకోటియేయని) చెప్పవచ్చు వారిద్దరును చైతన్య స్వరూపులేకదా. కావున జీవబ్రహ్మలకు భేద స్వభావ సిద్ధమైనది. అని మఱికొందరు చెప్పుచున్నారనితాత్పర్యము

అవ॥ ఈ రెండు మతములను ఖండించుచున్నాడు.

సూ॥ ౨౯॥ పూర్వవద్వా ॥

టీక॥ అథవా=అట్లుకాదుకావున ( ఈ రెండు సిద్ధాంతము సరికావు. కావున ) సిద్ధాంతః= సిద్ధాంతము, పూర్వవత్ = వెనుక వలెనే. అభ్యుపగంతవ్యం=ఒప్పుకొనవలయును.

తా॥ పై సిద్ధాంతములు రెండును సరియైనవికావు. భేదా ములు రెండును పారమార్థికములే యనుటకు వీలులేదు. అప్పుడు బ్రహ్మలకుగల భేదము జ్ఞానముచే నశించుననుటకు వీలులేదుగ కావున ౨౫ వ_ సూత్రమునందు చేయబడిన నిరూపణ ప్రకార ప్రత్యతః సిద్ధమైయుండు భేదము ఉపాధులవలన కలిగినదియేకాని స భావికము కాదనియు (జీవబ్రహ్మ లొకకోటి యనుటయే స్వాభా మనియు) చెప్పుటయే యుక్తమగు సిద్ధాంతమని తాత్పర్యము.

సూ॥ ౩౦॥ ప్రతిషేధాచ్చ ॥

టీక॥ ప్రతిషేధాచ్చ = నిషేధమువలనకూడా, అభేదః = జీవ బ్రహ్మలకు అభేదమే.

తా॥ " నాన్యోతో౽స్తి ద్రష్టా ( ఈ పర బ్రహ్మమున కంటే ఇతరుడగు ద్రష్ట [ చూచువాడు] లేడు) " అనుమొదలగు నిషేధముల వలన చైతన్య స్వరూపుడగు జీవుడు పరబ్రహ్మమునకంటే వేరనుటకు వీలులేదు. కావున జీవ బ్రహ్మలకు భేదము లేదనుట సిద్ధాంత మైనదని తాత్పర్యము.

—(*) ౭. పరాధికరణమ్. (*)—

అవ॥ " నేతి, నేతి " అనుమహావాక్యముచే బ్రహ్మ భిన్నములగు సర్వవస్తువులును నిషేధింప బడెనని చెప్పబడెను. దీనివలన బ్రహ్మభిన్నమగు వస్తువే లేదని చెప్పనగునా యనిన, అట్లు చెప్పట సరికాదు. శ్రుతియందే " స సేతుః ( ఆబ్రహ్మముకట్ట ) " అను మొదలగు వాక్యములచే పర బ్రహ్మమునకంటె వేరగువస్తువులు కొన్ని గలవని తెలియ చేయబడియున్నదికదా. అనిన నీయాక్షేపమునుగూర్చి ఈ అధికరణమునందు విచారింప బడుచున్నది.

సూ॥ ౩౦॥ పరమతస్సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః॥

టీక॥ అతః=ఈ బ్రహ్మమునకంటె, పరం = ఇతరమగువస్తువు, అస్తి=కలదు, కుతః=ఎందువలననగా, సేతు=ఒకచోట పరబ్రహ్మము వంతెన అనియు, ఉన్మానా = మఱియొకచోట పరిమాణము కలదనియు, సంబంధ=వేఱొకచోట నా బ్రహ్మముతో నితర వస్తువునకు సంబంధము కలదనియు, భేద = మఱియొకచోట బ్రహ్మమునందు పరస్పర భేదముకలదనియు, వ్యపదేశేభ్యః = చెప్పటవలన, తథా= ఆవిధముగా ( పరబ్రహ్మము అద్వితీయుడు కాడని, ) అవగమాత్ = తెలియుటవలన.

తా॥ పరబ్రహ్మ మెప్పటికిని అద్వితీయు డనుటకు వీలు లేదు. శ్రుతియే ఈవిషయమును స్పష్టముగా చెప్పుచున్నది. "స సేతుః" అను మొదలగు వాక్యములచే పరబ్రహ్మము వంతెన వలెనున్నాడని చెప్పబడియున్నదికావున " లోకమునందు ఒకవంతెనవలెనున్న (బ్రిడ్జి) వానినిదాటినపిదప నొకస్థలమున్నదనియు అచ్చటికి చేరవలయు నన్న

యు నేర్పడుచున్నట్లే ఇచ్చటకూడ పరబ్రహ్మమును దాటి మఱియొక స్థలమునకు చేరవలయును ( మఱియొకదానిని తెలిసికొనవలయును)" అనియే చెప్పవలసియున్నది. మఱికొన్ని స్థలములయందు "చతుష్పాదష్టాశఫం (పరబ్రహ్మమునకు నాలుగు పాదములు నెనిమిదిగిట్టలు)" అను మొదలగు వాక్యములచే పరమేశ్వరునకు ఒకపరిమాణము చెప్పబడియున్నది. కావున ఆయనకంటె నధిక పరిమాణముగల వస్తువు మఱియొకటి యుండవచ్చునని ఏర్పడుచున్నది. వేఱొకచోట "సతా సోమ్యతదా సంపన్నో భవతి ( జీవుడు ఆసుషుప్తి కాలమునందు పరబ్రహ్మముతో జేరును.)" అని జీవబ్రహ్మలకు సంబంధము చెప్పుటవలన కూడా వారలకు భేదము కలదని తెలియుచున్నది. ఇవి యున్నియును గాక సూర్యునిలోపలనున్నాడని చెప్పబడు పురుషుడే పరబ్రహ్మయని చెప్పుసందర్భమున కంటిలోపలకూడ నున్నాడని చెప్పబడు పురుషుడు కూడ పరబ్రహ్మమేయని చెప్పుచున్నను వారిరువురకును ప్రత్యక్షముగ భేదముకలదని తెలియవచ్చుచున్నది. వారికి భేదమే లేకపోయినచో ఒకటే ప్రకరణమునందు రెండుసారులుగా చెప్పవలసిన పనియుండదుకదా. కావున యెట్లుచూచినను పరబ్రహ్మము అద్వితీయుడని చెప్పటకు వీలులేదని తాత్పర్యము. ( ఇది పూర్వపక్షసూత్రము. )

అవ॥ ఈపూర్వపక్షమును ఖండించువారై మొట్టమొదట సేతుదృష్టాంతమునుగూర్చి విమర్శింపుచున్నారు.

సూ॥ ౩౨॥ సామాన్యాత్తు ॥

టీక॥ సిద్ధాంతస్తు=సిద్ధాంతమైతే, సామాన్యాత్ =సామాన్యధర్మము సరిగానుండుటవలన (సేతుబ్రహ్మలకు పోలిక సరిగానుండుటవలన ) భవతి = కలుగుచున్నది. ( అభేదమే సిద్ధాంతమని యేర్పడుచున్నదనుట. )

తా॥ ఉపమానోపమేయములకు అన్ని ధర్మములయందు, పోలిక యుండవలయుననుట నియమముకాదని యిదివరకే నిరూపించియున్నాము. కావున పరబ్రహ్మము అద్వితీయుడు కాడను విషయమునందు పూర్వపక్షులు చూపిన ప్రమాణములు యుక్తియుక్తములు కానేరవు. ఎట్లనగా బ్రహ్మ వంతెనవలెనున్నాడనిన "లోకమునంద

వంతెన నీటినెట్లు నియమించు చున్నదో అట్లే పర బ్రహ్మముకూడ లోకమునందలి సమస్తమర్యాదలను నియమించుచున్నాడు " అని అర్థము. కావున సేతుబ్రహ్మలకు సరియైనపోలిక ఒకవిషయమున యుండుటచేతను అన్నివిషయములయందును ఉండనక్కర లేక పోవుటచేతను " స సేతుః " అనుశ్రుతిని ఆధారముచేసికొని పూర్వపక్షులుచేసిన యాక్షేపము సరియైనదికాదని తాత్పర్యము.

సూ॥ ౩౩॥ బుద్ధ్యర్థః పాదవత్ ॥

టీక॥ ఉన్మానవ్యపదేశోపి=పరిమాణమును చెప్పుటకూడ, పాదవత్=ఉపాసనకొఱకై, వాక్కు మొదలగువానిని పాదములుగా చెప్పియున్నట్లే, ఇహాపి=ఈ ( పరిమాణమును చెప్పు ) స్థలమునందుకూడ, బుద్ధ్యర్థమేవ=ఉపాసనార్థమై, భవతి=అగుచున్నది.

తా॥ పై సూత్రమునందు " సేతువని చెప్పబడుటవలన పర బ్రహ్మమునకంటె రెండవ, వస్తువున్నదని చెప్పవలసి వచ్చును. " అను పూర్వపక్షము ఖండింప బడినది. " పరిమాణమును చెప్పియుండుట వలనకూడ పరబ్రహ్మము అద్వితీయుడు కానేరడు. " అను పక్షమును గూర్చి విచారించినను, బ్రహ్మ అద్వితీయుడను సిద్ధాంతమునకు భంగము రాదు. " వాక్కు బ్రహ్మముయొక్క మొదట పాదము. " అని ఉపాసనార్థమై పరబ్రహ్మనుగూర్చి చెప్పబడియున్నట్లే ప్రస్తుత " చతుష్పాదం " అను మొదలగు శ్రుతియందు కూడ ఉపాసనార్థ మయ్యే ఆయనకు పాదములుగలవని చెప్పబడియున్నది. కావున " చతుష్పాదం " అనుశ్రుతిని అనుసరించి పర బ్రహ్మమునకంటె నితరమగు మఱియొకవస్తువు యుండవలయునని చెప్పుటకువీలు లేదని తాత్పర్యము.

సూ॥ ౩౪॥ స్థానవిశేషాత్ ప్రకాశాదివత్ ॥

టీక॥ స్థానవిశేషాత్=స్థానములయొక్క భేదమువలన, ప్రకాశాదివత్=ప్రకాశము ఆకాశము మొదలగు వానికివలె, బ్రహ్మతదన్యయోః=పరబ్రహ్మమునకును ఆయనకంటె ఇతరులగు దేవుడు, అక్షిపురుషుడు మొదలగువారికిని, సంబంధభేదవ్యపదేశౌ= సంబంధము కలదనియు, భేదముకలదనియు, చెప్పుటలు ఉపపన్నౌ=తగియున్నది.

తా॥ ఇదియునుగాక జీవబ్రహ్మలకు సంబంధముకలదని చెప్పుట

వలనను ఆదిత్యపురుషునకును, అక్షిపురుషునకును ( సూర్యునిలోపల నున్నాడని చెప్పబడు పురుషునకును కంటిలోపల నున్నాడని చెప్ప బడు పురుషునకును ) భేదమును చెప్పుటవలననుకూడ బ్రహ్మ అద్వితీయుడుకాడని సిద్ధాంతముచేయుటకు వీలులేదు. ఏలయనగా జీవబ్రహ్మలకు ఔపాధికమగు ( ఉపాధివలన కలిగిన ) భేదమున్నది. సుషుప్తి సమయమునందు ఆ ఉపాధి ( బుద్ధియనుట ) దానికి కారణమగు అజ్ఞానమునందు లీనమగును. అప్పుడు ఉపాధిలేకపోవుటచే జీవబ్రహ్మలొక్కటియే యగుదురు. ఇట్లుండుటచే మొట్టమొదటనున్న ఔపాధిక భేదమును బట్టిచూచిన సుషుప్తి కాలమునందు కలుగు నైక్యము సంబంధమనిచెప్పుట యుక్తియుక్తమేకావున "సతాసోమ్యతదాసంపన్నోభవతి" అని శ్రుతిచెప్పుచున్నది. మొట్టమొదట వ్రేళ్లుమొదలగు వానిచే నావరింపబడియున్న ప్రకాశము, మహాప్రకాశమునకంటె వేరని చెప్పబడుచున్నది. ఆవ్రేళ్లుమొదలగు నుపాధులు లేనిసమయమునందు "ఈప్రకాశము దానితోకలసినది" అనిచెప్పబడుచున్నది ఇది లోకానుభవముకదా. ఇట్లె ఘటముచే నావరింపబడియున్న ఘటాకాశము మొట్టమొదట మహాకాశమునకంటె వేరని తలంపబడుచు ఆ ఘటము నశించినపిదప నదిమహాకాశముతోకలిసినట్లుతలంపబడుచున్నది. ఈలోకానుభవములను అనుసరించిచూచిన ఔపాధిక భేదముగవస్తువులకుగూడ నొకానొకప్పుడు ఉపాధులు నశించుసమయమునందు సంబంధ వ్యవహారము కలుగవచ్చును. ఇంతమాత్రమువలన నాపదర్థములకు వాస్తవభేదముకలదని చెప్పుటకు వీలులేదు. ఇట్లే ఆదిత్యపురుష అక్షి పురుషుల విషయమునందును ఉపాసనాస్థానములననుసరించి ఔపాధికభేదము చెప్పబడెనని తెలిసికొనవలయును. కావున నేరీతిగా చూచినను పరబ్రహ్మమునకంటె రెండవదియగు వస్తువుడనదనుటకే వీలులేదని తాత్పర్యము.

సూ॥ ౩౫॥ ఉపపత్తేశ్చ ॥

టీక॥ ఉపపత్తేశ్చ = ఇతరశ్రుతులనుబట్టిచూచిన నట్లే యేర్పడుటవలనకూడా, సంబంధభేదవ్యపదేశౌ గౌణౌ = సంబంధమును గూర్చియు భేదమునుగూర్చియు చెప్పుట అప్రధానమైనదియే.

తా॥ సంబంధమనునది స్వాభావికభేదముగలవానికే కలుగవలసియుండుట నియమము. కావున జీవబ్రహ్మలకు చెప్పబడియున్న సంబంధము అప్రధానమేయని పైసూత్రముచే నేర్పడు చున్నదిగదా. "స్వమపీతోభవతి (తననే చెందినవాడగును)" అనువాక్యశేషముచే, "సతాసోమ్య" అను మొదలగు శ్రుతిచే చెప్పబడినసంబంధము అప్రధానమైనది యేయని స్పష్టముగ తెలియజేయబడుచున్నది. తన్ను తాను చెందుటయనగా భేదముగల రెండుపదార్థములు కలయుట కాదుగదా. ఇట్టి స్వాభావికభేదముగల రెండుపదార్థములను గూర్చియే "ఇదిదీశకంటే వేరు" అని చెప్పబడవలసియున్నను ఆదిత్యపురుష, అక్షిపురుషులవిషయములో చెప్పియున్న భేదము మాత్రము ఇట్టిది కాదని ఇతరశ్రుతులచేత స్పష్టమగుచున్నది. ఈశ్వరుడొక్కడేయని చెప్పుశ్రుతులన్నియు నీవిషయమున ప్రమాణములేగదా. కావున పరబ్రహ్మమునకంటె రెండవదియగు వస్తువున్నదనుటకు అవకాశమే లేదని తాత్పర్యము.

అవ॥ ఈ విధముగా ౩౦వ సూత్రమువరకు పూర్వపక్షిచే చూపబడిన కారణముల నన్నిటిని ఖండించి బ్రహ్మ అద్వితీయుడని నిరూపించి ఇప్పుడు స్వయముగా కొన్ని ప్రమాణములను చూపుచున్నాడు.

సూ॥ ౩౬॥ తథాఽన్యప్రతిషేధాత్ ॥

టీక॥ తథా=అట్లే, అన్యప్రతిషేధాత్=పరబ్రహ్మమునకంటే రెండవది లేదని నిషేధించుటవలన, బ్రహ్మద్వితీయం=పరబ్రహ్మమద్వితీయమైనదే.

తా॥ ఇవియన్నియునుగాక, "యస్మాత్పరం నా పరమస్తికించిత్ (ఏవస్తువునకంటే అధికమైనదికాని తక్కువైనదికాని ఒకవస్తువైనను లేదో)" అను మొదలగు వాక్యములచే శ్రుతి స్పష్టముగనే పరబ్రహ్మ అద్వితీయుడని చెప్పుచున్నది. కావున పరబ్రహ్మమునకంటే రెండవదియగు వస్తువే లేదని తాత్పర్యము.

సూ॥ ౩౭॥ అనేన సర్వగతత్వ మాయామశబ్దాదిభ్యః ॥

టీక॥ అనేన = పైనచేసిన సిద్ధాంతముచేతను, ఆయామశబ్దా

దిశ్యః=" పరబ్రహ్మము వ్యాపించియుండువాడు" అని చెప్పుశ్రుతులు స్మృతులుమొదలగువానివలనను, సర్వగతత్వం = పరబ్రహ్మసర్వవ్యాపకుడని చెప్పబడియున్నది.

తా॥ పైనచెప్పబడిన కారణముల వలనను ( "సనేతః" అను మొదలగు శ్రుతులు చెప్పువిషయములు ప్రధానములు కావనియు పరబ్రహ్మమునకంటె రెండవది లేదని శ్రుతియందు నిషేధముకూడనున్నదనియు చెప్పుటవలన ) " ఆకాశవత్సర్వగతశ్చ, నిత్యస్సర్వ గతస్థాణుః ( ఆకాశమువలె సర్వమును వ్యాపించి యున్నాడు. నిత్యుడు సర్వమును వ్యాపించి యున్నవాడు స్థిరుడు [ స్థిరమైనవాడు ]," అను మొదలగు శ్రుతి, స్మృతులవలనను బ్రహ్మసర్వవ్యాపకుడనికూడ ఏర్పడుచున్నది. బ్రహ్మయొక్కడే యున్నాడనిన ఆయన వ్యాపించుటకు ప్రదేశములేవి? అని అందురేమో; అవిద్యవలన అనేక భేదములుగా గనుపడుచున్న ఈ ప్రపంచమే ఆయన వ్యాపించుటకు స్థలము. శ్రుతియును వ్యావహారిక భేదమునుబట్టియే బ్రహ్మ సర్వవ్యాపకుడని చెప్పుచున్నదని తెలిసికొనవలయును అని తాత్పర్యము.

—(*) ౮. ఫలాధికరణమ్. (*)—

అవ॥ పై యధికరణమునందు పరబ్రహ్మము నిర్విశేషుడని చెప్పియున్నాడు. ఇట్లు చెప్పిన " ఆ పరమేశ్వరుడే కర్మ ఫలముల నిచ్చుచున్నాడనుటకు వీలులేక పోవలసి వచ్చునుకదా" అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౩౮॥ ఫలమత ఉపపత్తేః ॥

టీక॥ అతః = ఈ పరమేశ్వరుని వలననే, ఫలం= కర్మఫలము భవతి=కలుగుచున్నది కుతః= ఎందువలననగా, ఉపపత్తేః= అనేకయుక్తులుండుటవలన ( ఈ విషయమును నిర్ధారణ చేయుటకు యుక్తులనేకములు కలవనుట. )

తా॥ " కర్మలు క్షణికములగుటచే ఉత్తరకాలమునందు అనభవింప తగినఫలములను ఇచ్చుననుటకు వీలులేదు. " అను మొదలగు యుక్తులవలన " కర్మఫలమును పరమేశ్వరుడే ఇచ్చుచున్నాడు. అనియే చెప్పవలయునని తాత్పర్యము.

సూ॥ ౩౯॥ శ్రుతత్వాచ్చ ॥

టీక॥ శ్రుతత్వాచ్చ = శ్రుతియందు చెప్పబడి యుండుటవలన కూడ, ఫలం-ఈశ్వరాదేవ=ఫలమును ఈశ్వరుడే ఇచ్చుచున్నాడు.

తా॥ “ అన్నాదో వసుదానః ( జీవులకందరకును అన్నము నిచ్చువాడు ధనమునిచ్చువాడు )” అను మొదలగు శ్రుతులనుబట్టిచూచి నను పై సూత్రమునందు చేయబడిన సిద్ధాంతమే స్థిరపడుచున్నదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు రెండుసూత్రములచేతను చేయబడిన సిద్ధాంతము నందు పూర్వపక్షమును చూపుచున్నాడు.

సూ॥ ౪౦॥ ధర్మంజైమినిరతఏవ ॥

టీక॥ అతఏవ=పైన నిరూపించబడినట్లు శ్రుతియుక్తుల వలననే, జైమినిః=జైమినిమహాముని, ధర్మం=ధర్మమునే, ఫలదాతారం=ఫలము నిచ్చుదానినిగా, మన్యతే=తలంచుచున్నాడు.

తా॥ వేదాంత సిద్ధాంతమునందు ఎట్లు యుక్తిచేతను శ్రుతి చేతను పరమేశ్వరుడే కర్మఫలదాతయని సిద్ధాంతముచేయబడియున్న దో అట్లే జైమిని మహామునికూడ కర్మయే ఫలదాతయని సిద్ధాంత ముచేసియున్నాడు. ఎట్లనగా “ జ్యోతిష్టోమేన స్వర్గకామోయ జేత ( స్వర్గముకావలయువాడు జ్యోతిష్టోమయాగమునుచేయవలయును)” అనుమొదలగు శ్రుతులు కర్మయే ఫలము నిచ్చుననుటయందు ప్రమాణ ములు. వేదాంత సిద్ధాంతమునందువలెనే “ కర్మ క్షణికము గావున ఉత్తరకాలమునందు అనుభవింపవలసిన ఫలమును కలుగ జేయుటకు వీలులేదు. కావున జ్యోతిష్టోమేన అనుమొదలగు శ్రుతులనుబట్టి ఆకర్మ కే ఒకానొకవిధమగు ఉత్తరావస్థ ( కర్మజరిగిపోయినపిదప ఫలమను భవమునకు వచ్చువరకును ఉన్నకాలమునందు ఆ కర్మయుండు స్థితిని) కలదని యంగీకరింప వలయును.” అను యుక్తియును పై విషయము నందే ప్రమాణము. కావున ఈశ్వరుడే ఫలదాతయని నిశ్చయించు కొనుటకు వీలులేదుకదా యని తాత్పర్యము. ( ఇదిపూర్వపక్షము.)

అవ॥ పై సూత్రముచే చేయబడిన పూర్వపక్షమునకు సమా ధానమును చెప్పుచున్నాడు.

సూ॥ ౪౧॥ పూర్వంతు బాదరాయణో హేతువ్యపదేశాత్॥

టీక॥ బాదరాయణస్తు = బాదరాయణాచార్యులైతే, హేతువ్యపదేశాత్ =కర్మలకుకూడ ఆపరమేశ్వరుడే కారణమని చెప్పబడియుండుటవలన, పూర్వం=ముందుచెప్పబడియున్న పరమేశ్వరునే, ఫలదాతారం=కర్మఫలముల నిచ్చువాడుగా, మన్యతే= తలంచుచున్నాడు.

తా॥ కర్మలుగాని ఉత్తరావస్థయని చెప్పబడు అపూర్వముగాని అచేతనమగుటచేత అది స్వయముగా ఫలమిచ్చు ననుటకు వీలులేదు. కావున వానిని ఉపాధిగా జేసికొని ఒకచేతన పదార్థము ఉన్నదనవలసివచ్చును. కావున ఈశ్వరుడే ఫలమును ఇచ్చువాడనుట యుక్తము. "ఏషహ్యేవసాధుకర్మ కారయతి, యమేభ్యోలోకేభ్యఉన్నినీషతే॥ లభతేచతతఃకామాన్, మయైవవిహితాన్హితాన్. (ఆ పరబ్రహ్మము ఎవరిని యూర్ధ్వలోకమునకు కొనిపోవతలంచునో వానిచే నుత్తమకర్మములను చేయించును, నాచే నియ్యబడిన కోరుకలను తరువాత వాడుపొందును)" అను శ్రుతిస్మృతులవలన కర్మలకును వానిఫలములకునుకూడ పరబ్రహ్మమే కారణమని తెలియుచున్నది కావున పరమేశ్వరుడే ఫలదాతయనియు ఆయననిర్విశేషుడైనను ఉపాధివలన సర్వముసిద్ధించుననియు కర్మలనుబట్టియే ఫలమునిచ్చు వాడగుటచే ఆయనకు విషమత్వమునిర్దయత్వము మొదలగుదోషములు కలుగనేరవనియు తాత్పర్యము.

సంధ్యేసృష్టి రష్టావేకచత్వారింశత్ ॥

సంధ్యే, తదభావ, స్వప్నవతు, ముగ్ధే, నస్థానతః, ప్రకృతైతావత్వా, పరం, ఫల, మష్టౌ॥ ౮॥

ఇతిబ్రహ్మసూత్రే తృతీయస్యాధ్యాయస్య ద్వితీయపాదః.

ఇట్లు తృతీయాధ్యాయమునందు ద్వితీయపాదము,

ముగిసెను.



ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్ర హ్మ సూ త్ర ము లు.

## తృతీయాధ్యాయము - తృతీయపాదము.

### —(*) ౧. సర్వవేదాంత ప్రత్యయాధికరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా పైపాదమునందు వాక్యార్థమునకు కారణములగు తత్త్వం పదార్థములను విచారించి ఈపాదమునందు వాక్యార్థమును నిర్ణయించువారై మొట్టమొదట చిత్తశుద్ధి సాధనమగు సగుణోపాసననుగూర్చి విచారించుచున్నాము. అందు ఉపాసనలకు శాఖాభేదమువలన భేదముకలదా? లేదా? అను సంశయము మొదటియధికరణమునందు నివారింపబడుచున్నది.

సూ॥ ౧॥ సర్వవేదాంతప్రత్యయంచోదనాద్యవిశేషాత్ ॥

టీక॥ చోదనాద్యవిశేషాత్ = చోదనము ( దీనినిచేయుమని చెప్పుట. ) సంయోగము ( ఫలము ) రూపము ( ఉపాసనయొక్కగాని లేక ఉపాస్య దేవతయొక్కగాని స్వరూపము ) సమాఖ్య( ఇది ప్రాణోపాసన ఇదిపంచాగ్ని ఉపాసన అనుమొదలగు పేరులు ) ఈ నాలుగు అన్నిశాఖలయందు ఒకటే విధముగా నుండుటవలన, సర్వవేదాంతప్రత్యయం=సర్వవేదాంతములయందు చెప్పబడుచున్నఉపాసన, ఏకమేవ=ఒకటిమే.

తా॥ అన్నిశాఖలయందు చెప్పబడుచున్న ఉపాసనయు (అనగా అథర్వణశాఖయందు చెప్పబడుచున్న పంచాగ్ని ఉపాసనయు మఱియొక శాఖయందు చెప్పబడియున్న పంచాగ్ని ఉపాసనయు ) ఒకటియె. ఈపంచాగ్ని ఉపాసనను చేయవలయునని చోదనయు, దీనివలన ఈఫలముకలుగునని చెప్పబడియున్న సంయోగమును, దేవతాస్వరూపమును, ఇదిపంచాగ్ని ఉపాసన అను పేరును, ఇవిఅన్ని

శాఖలయందును ఒక్కటియేగదా, కావున ఏశాఖయందు చెప్పినను పంచాగ్ని ఉపాసన పంచాగ్ని ఉపాసనయే ప్రాణోపాసన, ప్రాణోపాసనయే యగునుగాని, ఇతరము కానేరదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుటసరికాదు వాజసనేయ శాఖయందు ఈ పంచాగ్ని విద్యను చెప్పునప్పుడు ఆరవ యగ్ని కలదని చెప్పి దానినే యుపాసింప వలెననికూడా చెప్ప బడియున్నది. ఛాందోగ్య శాఖయందు ఐదు అగ్నులను గురించియే చెప్పబడి యున్నది. ఇట్టిపరస్పర భేదముండుటచే వాజసనేయ శాఖయందును ఛాందోగ్య శాఖయందును చెప్పబడిన యుపాసనయొక్కటే యనుటకు వీలులేదుగదా యనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౩॥ భేదాన్నేతిచేన్నైకస్యామపి ॥

టీక॥ భేదాత్ = వేరువేరు శాఖలయందు వేరువేరువిధములుగా చెప్పబడియుండుటవలన నైవం= పైసూత్రమునందు చేయబడిన సిద్ధాంతము సరియైనదికాదు, ఇతిచేత్=అనేయెడల, న = అదిసరికాదు, కుతః – ఎందువలననగా, ఏకస్యామపి = ఒకదానియందున్న (భేదములేని దానియందున్న) రూపభేదదర్శనం = రూపభేదములు కనుపడుట, అస్తిహి=కలదుగదా.

తా॥ పూర్వపక్షమునందు చూపినదోషము సరియైనది కాదు. ఒకయగ్ని అధికముగా చెప్పబడి యుండుటతప్ప తక్కిన దంతయును రెండుశాఖలయందును సమానమేగదా. అధికభాగము సమానముగానున్నప్పుడు ఆరెండు శాఖలయందు చెప్పబడినవిద్య యొక్కటియే యని చెప్పుటకు ఏ యాక్షేపమునుండదు. యాగములు మొదలగు నితర విషయములందుకూడ నిట్లే అనేకచోట్ల ఒకటే విషయము కొంచెము భేదముతో చెప్పబడుచుండుట కలదు. కావున పూర్వపక్షమునందు చేయబడిన యాక్షేపము మొదటిసూత్రమునందు చేయబడినసిద్ధాంతమునకు భంగమును కలిగింపనేరదని తాత్పర్యము.

అవ॥ బ్రహ్మవిద్యనుగూర్చి చెప్పునప్పుడు ముండకోపనిషత్తునందు శిరోవ్రతమను ఒకధర్మము చెప్పబడియున్నది. ఇతర ఉపనిషత్తులయందు అదిచెప్పబడియుండలేదు. కావునముండకోపనిషత్తునందు

చెప్పబడిన విద్యలకును ఇతర ఉపనిషత్తులయందు చెప్పబడిన విద్యలకును భేదముండ వలయునుగదా అనిన నట్లుకాదని సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౩॥ స్వాధ్యాయస్యతథాత్వేనహిసమాచారేఽధికారాచ్చసవవచ్చతన్నియమః ॥

టీక॥ శిరోవ్రతం=శిరోవ్రతమను ధర్మము, స్వాధ్యాయస్య=ముండకోప నిషత్తు అధ్యయన మునకు సంబంధించినదే, నతదుక్త విద్యానాం=ఆ ఉపనిషత్తునందు చెప్పబడిన విద్యలకు సంబంధించినది కాదు, సమాచారే = వేద వ్రతములనుగూర్చిచెప్పు సమాచారమను గ్రంథమునందు, తథాత్వేన=అట్లే (శిరోవ్రతమధ్యయనాంగమనియే ఉచ్యతేహి=చెప్పబడుచున్నదిగదా, అధికారాచ్చ) నైతదచీర్ణవ్రతోధీతే (ఈ శిరోవ్రతమును చేయని యెడల ఈ ముండకోప నిషత్తును అధ్యయనము చేయువాడు) అను నధికారమువలనే కూడా (శిరోవ్రతమును చేసినవాడే ముండకోపనిషత్తును అధ్యయనము చేయుటకు అధికారిఅని చెప్పుటవలనకూడా) ఏవం విజ్ఞాయతే=పై నిరూపించిన విధముగానే తెలియవచ్చుచున్నది, సవవచ్చ = హోమముల వలెనే, తన్నియమః = ఆ శిరోవ్రతముకూడా ముండకాధ్యయనమునందే ఉపయోగించుననుట నియమము.

తా॥ అవతారికయందు చూపబడిన యుక్తి సరియైనదికాదు. ముండకోప నిషత్తునందు చెప్పబడిన శిరోవ్రతము అధ్యయనాంగమే కాని బ్రహ్మవిద్యాంగముకాదు. బ్రహ్మవిద్యాంగమైననేకదా అవతారికయందు చూపబడిన దోషమువచ్చును. వేద వ్రతమునుగూర్చి చెప్పుసమాచారమను గ్రంథమునందు శిరోవ్రతము అధ్యయనాంగమనియే చెప్పబడియున్నది. మఱియు ముండకోపనిషత్తునందే నైతదచీర్ణవ్రతోధీతే అనువాక్యముచే పైవిషయమే దృఢపరుపబడియున్నది. ఇట్లున్నను ఆ శిరోవ్రతము ముండకాధ్యయనము చేయువారికేగాని ఇతరులకు పనిలేదనుటకు ఆధారముకలదా, యని, సంశయించెదరేమో, ఆ సంశయముతోపనిలేదు. మూడు అగ్నులతో సంబంధపడియున్న హోమములు కొన్నియును ఒకఅగ్నితోమాత్రమే సంబంధ

పడియున్న హోమములు మఱికొన్నియును వేదమునందు చెప్పబడి యున్నవి. అందు ఏకాగ్నిని గూర్చి అధర్వణ శాఖయందు మాత్రమే చెప్పబడియుండుటచేత దానితో సంబంధించియున్న హోమములు అధర్వణ శాఖవారికొఱకే చెప్పబడినవని నిర్ణయించుటకు వీలున్నది కదా. అట్లే ఈ శిరోవ్రత విషయమునందు కూడ నిర్ణయించుకొన వచ్చును. ఈ వ్రతము ముండకోపనిషత్తు నందుమాత్రమే చెప్పబడి యుండుటచేతను వేదవ్రతమునుగూర్చి చెప్పు గ్రంథమునందు ఈ వ్రత ముకూడ చెప్పబడి యుండుటచేతను ఇదిముండకాధ్యయనమునుగూర్చి యే విధింపబడిన వ్రతమని నిర్ణయింప వలసియున్నది. కావున శిరో వ్రత మధ్యయనాంగమే యగుటచేత దానివలన బ్రహ్మవిద్యలు పర స్పరభేదము నొందవలసిన పనిలేదని తాత్పర్యము.

సూ॥ ౪॥ దర్శయతిచ ॥

టీక॥ దర్శయతిచ=శ్రుతియును ఇట్లే చూపుచున్నది.

తా॥ వాజసనేయ శాఖయందు ప్రాదేశ మాత్రుడని వైశ్వా నరుడు నిరూపింపబడియున్నాడు. శిరస్సు మొదలు గడ్డమువరకు ఆ వై శ్వానరుడు వ్యాపించియున్నాడని తలంచి ఉపాసన చేయవలయునని యు ఇందువలననే ఆయన ప్రాదేశ మాత్రుడగుననియు ఆశాఖయం దు చెప్పబడియున్నది. ఛందోగశాఖయందు అట్టి నిరూపణయేమియు లేకనే వైశ్వానరుడు ప్రాదేశమాత్రుడని యనువాదము చేయబడి యున్నది. దీనినిబట్టి చూచిన వాజస నేయ ఛందోగ శాఖలయందు (బృహదారణ్యక, ఛాందోగ్యోపనిషత్తులయందు) చెప్పబడియున్న వైశ్వానరోపాసన యొకటియే యని స్పష్టమగుచున్నదిగదా. కా వున ఈ దృష్టాంతమును అనుసరించిచూచినచో అన్ని శాఖలయందు చెప్పబడుచున్న ఉపాసనయు నొకటియే, దేవతాభేదము లేదు కావున ఉపాసనా భేదముకూడ లేదని తాత్పర్యము.

—(*) ౨. ఉపసంహారాధికరణమ్. (*)—

అవ॥ ఈవిధముగా పై అధికరణమునందు ఉపాసనలలో భేద ములేదని (అనేకఉపనిషత్తులలో చెప్పబడియున్న ఒకటేజాతిగల యు

పా సనలన్నియు నొక్కటియే యని ) నిరూపించి ఈ యధి కరణము నందు దానిప్రయోజనమును చూపుచున్నాడు.

సూ॥ ౫॥ ఉపసంహారోర్థాభేదా ద్విధిశేషవత్సమానేచ ॥

టీక॥ అర్థాభేదాత్ = విషయమొక్కటియేకావున, విధిశేష వత్ =విధులనుగూర్చి చెప్పబడు ధర్మశేషముల యొక్కవలె, సమానే ఉపాసనేచ=అన్నిశాఖలయందు చెప్పబడు ఉపాసన యొక్కటియే అయి నందున, గుణానాం=గుణములయొక్క (ఉపాస్యదేవతకు చెప్పు గుణములయొక్క,) ఉపసంహారః=సంగ్రహము, అన్యతః=ఇతరశాఖ లవలననుంచి ( ఒకచోట చెప్పని గుణములను మఱియొక చోటనుంచి తెచ్చుకొనవచ్చును. ) కర్తవ్యః=చేసికొనవలయును.

తా॥ పై యధికరణము నందు ఉపాసన లొక్కటియే యని నిరూపించియున్నాము. ఆ ఉపాసనలయందుమాత్రము శాఖాభేదము వలన కొంతభేదము కనుపడుచున్నది. ఉపాస్యదేవతనుగూర్చి చెప్పు నప్పు డొకశాఖయందు కొన్నిగుణములుమాత్రమే వర్ణింపబడుచున్న వి. మఱియొకశాఖయందు కొన్నియధికముగాగాని తక్కువగాగాని చెప్పబడుచున్నవి. ఈవిషయమునెట్లు సవరించు కొనవలయునని సంశ యముతోచవచ్చును కాని అదియొక విషయముకాదు. ఉపాసనయొ క్కటియే కావున ఉపాస్య దేవతా విషయములో నొక శాఖయందు చెప్పియుండని గుణములను మఱియొక శాఖనుండి తెచ్చుకొన వచ్చును. విధిశేషముల విషయములో నట్లే చేయుట వాడుకలో నున్నదిగదా. ( అనగా " అగ్నిహోత్రమును చేయ వలయును " అనువిధి సర్వ శాఖలయందు నొక్కటియేకావున దానినిగూర్చి చెప్పబడు నియమ ములను ఒకచోట లేనివానిని మఱియొకచోటనుండి తెచ్చుకొనుచున్నా ముగదాయనుట.) కావున సర్వ శాఖలయందును చెప్పబడు విషయ ము ఒక్కటియేకాని పరస్పరభిన్నముకాదు. దేవతాస్వరూపముకూడ నొక్క విధమైనదియే. ఇదియే " అన్నిటి యందు చెప్ప బడుచున్న ఉపాసనలు నొక్కటియే." అని మొదటి అధికరణమునందు చేయ బడియున్న నిరూపణకు ఫలమని తాత్పర్యము.

—(✱) ౩. అన్యథాత్వాధికరణమ్. (✱)—

అవ॥ మొదటి అధికరణము నందు " ఒకటే పేరు యుండుట వలనకూడ ఉపాసనలు ఒకటియేయని చెప్పవచ్చును అనినిరూపింప బడియున్నది. దానినిబట్టి ఉద్గీథవిద్యనుగూర్చి కొంత విచారణ చేయు వాడై మొట్టమొదట పూర్వపక్షమున అనువాదము చేయుచున్నాడు.

సూ॥ ౭॥ అన్యథాత్వంశబ్దాదితిచేన్నావిశేషాత్ ॥

టీక॥ అవిశేషాత్ = భేదమేమియును లేకపోవుటవలన, ఉద్గీథ విద్యాయాః ఐక్యం=ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులందు చెప్ప బడిన ఉద్గీథ విద్యయొకటియే, శబ్దాత్ = ఒకఉపనిషత్తునందు కర్మ వాచకశబ్దమును మఱియొక ఉపనిషత్తునందు కర్తృవాచక శబ్దమును ప్రయోగించి యుండుటవలన, అన్యథాత్వం = ఛాందోగ్యోప నిషత్తు నందు చెప్పబడియున్న విద్య వేరు బృహదారణ్యకోప నిషత్తునందు చెప్పబడియున్న విద్య వేరు, ఇతిచేత్ =అనేయెడల, న= అదిసరికాదు.

తా॥ బృహదారణ్యకోపనిషత్తునందును ఛాందోగ్యోప నిషత్తు నందును చెప్పబడియున్న ఉద్గీథవిద్యలు ఒకటియే. దేవాసురులకు యుద్ధముజరిగినది అనుమొదలగు విషయములు ఈ రెండు విద్యలయం దును సమానములుగానే యున్నవి. ఒకచోట " ఉద్గాయ ( గానము చేసి )" అని కర్తృవాచకశబ్దము మఱియొకచోట " ఉద్గీథ ముపా సీత ( ఉద్గీథమును ఉపాసన చేయవలయును )" అని కర్మవాచకపద ముప్రయోగింప బడియున్నను ఈ విద్యలు పరస్పర భిన్నములు కా నేరవు. ఒకానొకచోట కొంచెము భేదమున్నను అనేకచోట్ల నొకటే విధముగా నున్నయెడల ఆ విషయములు పరస్పరభిన్నములు కానేర వని మొదటి యధికరణమునందు మీరే ( సిద్ధాంతులే ) చెప్పియున్నా రుగదా. కావున పైనచూపిన విద్యలురెండును ఒకటియే యనవల యునని తాత్పర్యము. ( ఇదిపూర్వపక్షసూత్రము. )

అవ॥ పైసూత్రముచే చేయబడిన పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతమును నిరూపించుచున్నాడు.

సూ॥ ౮॥ నవాప్రకరణభేదాత్పరోవరీయస్త్వాదివత్ ॥

టీక॥ ప్రకరణభేదాత్ =ప్రకరణములు వేరువేరగుటచేత, పరో

వరీయస్త్వాదివత్ = పరోవరీయస్త్వము ( శ్రేష్ఠులలో శ్రేష్ఠుడై యుం డుట ) మొదలగు గుణములతో జేర్చి చెప్పబడియుండు పరబ్రహ్మో పాసనలకువలె, ప్రకరణభేదాత్ = ప్రకరణములు వేరు వేరగుటవలన, అనయోః = ఈ రెండు ఉద్గీథవిద్యలకును, నవాఐక్యం = ఐక్యములేదు.

తా॥ ఛాందోగ్యోపనిషత్తునందు ఉద్గీథావయవమగు ఓంకార ము ప్రాణమను తలంపుచే నుపాసన చేయవలయునని చెప్పబడి యు న్నది. బృహదారణ్యోపనిషత్తునందు ఉద్గీథమును గానము చేయువా నినే ప్రాణముగా నుపాసింపుమని చెప్పబడియున్నది. ఈ రెండు ప్రక రణములును పరస్పర భిన్నములగుటచే ఇందలి విద్యలుకూడా పరస్ప రము భిన్నములే, ఉపాస్యదేవత యొకటే దేవతయై యున్నసమయ మునందుకూడ గుణభేదమునుబట్టి ప్రకరణభేదమును దానినిబట్టి ఉపా సనభేదమును కలుగుచున్నది. పరబ్రహ్మ మొకటినినే ఉపాసన చేయ వలెనని చెప్పుచున్నవైనను ఆదిత్యపురుషుని గూర్చి చెప్పు విద్యకంటే పరోవరీయస్త్వాది గుణయుక్తుడగు పురుషునిగూర్చి చెప్పువిద్య భిన్న మైనదిగదా. ఇట్లుండ ఉపాస్యదేవతలే భిన్నముగానున్నప్పుడు విద్యా భేదము కలుగుననుటలో సంశయమేమున్నది. కావున పైచెప్పిన ఉద్గీథ విద్యలు రెండును పరస్పర భిన్నములేయని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుట సరికాదు. ఆ రెండు విద్యలకును పేరొ కటియేకదా యనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౮॥ సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తితుతదపి ॥

టీక॥ సంజ్ఞాతః = పేరువలన, విద్యైక్యంచేత్ = ఉద్గీథవిద్యలు ఒకటియేయని చెప్పునెడల, న = అదిసరికాదు, తత్ = ఆవిషయము ( విద్యలు ఒకటిగావను విషయము ) ఉక్తః = చెప్పబడియున్నది, తద పి = అదియు ( పేరుఒకటైయున్నను విద్యలు పరస్పరము భేదముకలిగి యుండుట,) అస్తితు = ఉన్నదిగదా.

తా॥ ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులందు చెప్పబడి యున్న రెండువిద్యలకును ఉద్గీథవిద్యయని యొకటేపేరే యుండుట వలన ఆ రెండువిద్యలు నొకటియే అనుట యుక్తముగాదు. పై సూత్రమునందు నిరూపింపబడియున్న ప్రకారము ఉపాస్య దేవతకు

భేదముకలదని తెలియుటచే విద్యాభేదమేర్పడుచుండ "పేరొకటియే యైయుండుట" అనునొకటి స్వల్పకారణము ఆ భేదమును భంగము చేయగలుగునా మఱియు ఛాందోగ్యోపనిషత్తునందు ప్రథమ పాఠకమునందు చెప్పబడియున్న భిన్నస్వభావముగల యనేక విద్యలకుగూడ ఉద్గీథవిద్యయని సంజ్ఞయొకటియే చేయబడియున్నది. కావున పురుషునికధీనమైన సంజ్ఞాకరణము (దీనికి ఈపేరు అని నిర్ణయించుట.) బలవత్తరములగు ఇతర కారణములచేత భిన్నములని నిరూపింపబడియున్నవానికి అభేదమును కలిగింపనేరదు. కావున ఆవిద్యలు రెండును పరస్పరము భిన్నములేయని తాత్పర్యము.

యస్. బి. సామవేదమునకు ప్రస్తావము ఉద్గీథము ప్రతిహారము ఉపద్రవము నిధనము అను అయిదు భాగములు గలవు. ఇందు రెండవభాగము ఉద్గీథము ఓంకారము దానికి అవయవము అని తెలిసికొనవలయును.

—(*) ౭. వ్యాప్త్యధికరణమ్. (*)—

అవ॥ పై యధికరణమునందు "ఓమిత్యేత దక్షరముద్గీథ ముపాసీత. (ఉద్గీథమగు ఓంఅనునక్షరమును ఉపాసనచేయవలయును.)" అను ఉపక్రమవాక్యమును అనుసరించి ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడియున్న యుద్గీథ ఉపాసన బృహదారణ్యమునందు చెప్పబడియున్నదానికంటే వేరని సిద్ధాంతము చేసియున్నారు. ఈ సిద్ధాంతము సరియైనదికాదు. "ఓమిత్యేతదక్షరం" అనువాక్యమునకు మఱియొక విధముగా అర్థము చెప్పవలయు నన్నను సరియగు వీలుకలదు గదాయనిన ఈ విషయమునుగూర్చి ఈ అధికరణమునందు విచారించుచున్నాడు.

సూ॥ ౯॥ వ్యాప్తేశ్చ సమంజసం ॥

టీక॥ ఓంకారస్య=ఓంకారము, వ్యాప్తేః= వేదమునందంతయును వ్యాపించియున్నదికావున, ఉద్గీథపదం=ఉద్గీథమనుమాట, తద్విశేషణమిత్యేవ=దానికివిశేషణమనుటయే, సమంజసం=సరియైనది.

తా॥ అవతారికయందు చేయబడిన యాక్షేపము సరియైనది కాదు, ఏలయనగా ఓంకారము సర్వవేదములయందును వ్యాపించి

యున్నది. కావున " ఉపాసన చేయవలయునని చెప్పబడియున్న ఓం కారమెద్ది. " అను విచారణ చేయునప్పుడు " ఈ ఓంకారమిదియే " అని నిర్ధారణచేయుటకై ఏదినైన నొకవిశేషణముండి తీరవలయును. ఇచ్చట ఉద్గీథపదముచేదానికి(ఉద్గీథమునకుసామవేదమునకు) అవయవ మగు ఓంకారముఅనే లక్షణావృత్తిద్వారా గ్రహింపవచ్చునుగావున ఆ ఉద్గీథపదము ఓంకారమునకు విశేషణమనుటయే యుక్తము. ఇంతి యకాని ఆశ్రుతికి మఱియొకవిధముగా అర్థము చెప్పవలయునన్న వీలు లేదు. ఎట్లనగా " ఓంకారమే ఉద్గీథము " అని ఆ రెండుపదములకును అభేదముగా నర్థముచెప్పదలచిన నవిరెండును పర్యాయ పదములు కావు. " ఇదివరకు ఓంకారమైయున్నదియే ఉద్గీథము " అని అపవా దార్థమును ( యథార్థస్వరూపమును తెలిసికొనకున్నప్పుడు మఱియొ కవిధముగా తలంపబడియున్న వస్తువునందు యథార్థ స్వరూపమును నిరూపించిచెప్పుట. నీకింతవరకు పాముగానున్నది త్రాడే ) చెప్ప వలయుననిన ఆ రెంటియందును అసత్యమైనది ఒక్కటియును లేదు. " ఉద్గీథమునందు ఓంకారత్వము ఆరోపింపబడియున్నది " అనియ ర్థముచెప్పదమసిన ఉత్తరసందర్భమునకు విరోధము వచ్చును. కావున యెట్లుచూచినను ఉద్గీథపదము ఓంకారమునకు విశేషణమనియే చెప్ప వలయుననియు మూడవ అధికరణమునందు చేయబడిన సిద్ధాంతము నకు భంగమెప్పటికిని రాదనియు తాత్పర్యము.

—(*) ౫. సర్వాభేదాధికరణమ్. (*)—

అవ॥ ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులయందు ప్రాణో పాసననుగూర్చి చెప్పునప్పుడు ఆప్రాణమునకు వసిష్ఠత్వము ( సుస్థి రుడై యుండుట. ఇదివాక్కుయొక్క గుణము. బాగుగ మాటలాడ నేర్చినవాడు స్థిరుడైయుండుట ప్రత్యక్షమగుటచే నిది వాగింద్రియము యొక్క గుణమని చెప్పబడియున్నది. ఈవాక్కు ప్రాణమునకు స్వా ధీనమైనదగుటచే నది ప్రాణగుణమనికూడ చెప్పబడుచున్నది ) మొద లగు గుణములుకలవని చెప్పబడియున్నది. కౌషీతకీ బ్రాహ్మణోపని షత్తునందు అటులేదు. ఇచ్చట ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడి యున్న ఉద్గీథవిద్యయందువలెనే సమీపమునందున్న గుణములనుమూ

త్రమే ఆధారముచేసికొనవలయునా, లేక ఇతరస్థలములయందు చెప్ప బడియున్న గుణములనుకూడ సంగ్రహించుకొనవచ్చునా, అను విష యము నీయధికరణమునందు విచారించుచున్నాడు.

సూ॥ ౧౦ ॥ సర్వాభేదాదన్యత్రేమే ॥

టీక॥ ఇమే = ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులయందు చెప్పబడియున్న వసిష్ఠత్వాది గుణములు, సర్వాభేదాత్ =అన్ని శాఖ లయందును ప్రాణవిద్యయొకటియే కావున, అన్యత్ర = కౌషీతకీబ్రా హ్మణోపనిషత్తునందలి ప్రాణవిద్యయందుకూడ, ఉపసంహర్తవ్యా= సంగ్రహించుకొన వలసియున్నవి.

తా॥ ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులందు చెప్పబడి యున్న గుణములు కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునందలి ప్రాణవిద్య యందుకూడ సంగ్రహించుకొన తగియున్నవి. అన్నిశాఖలయందును ఈప్రాణవిద్య యొకటియే ( అనగా విద్యయొక్కయు దేవతయొ క్కయు స్వరూపము ఏశాఖయందైన నొక్కటియేయనుట ) కావున దీనికి ఉద్గీథవిద్యతో పోలిక లేదని తాత్పర్యము.

—(*) ౬. ఆనందాద్యధికరణమ్. (*)—

అవ ॥ ప్రాణము సవిశేషమైన దగుటచే నొక శాఖయందు చెప్పబడనిధర్మములను మఱియొకశాఖనుండి తెచ్చుకొనుట యుక్తమే కాని స్వభావముగా నిర్విశేషుడైయుండు పరమేశ్వరునివిషయములో అట్లుచేయుట యుక్తముకాదుగదా యనిన, సమాధానమును చెప్పు చున్నాడు.

సూ॥ ౧౧ ॥ ఆనందాదయః ప్రధానస్య ॥

టీక॥ సర్వాభేదాత్ =అన్నిశాఖలయందును పరబ్రహ్మము ఒక టేవిధముగా చెప్పబడియుండుటవలన, ఆనందాదయః = ఆనందము మొదలగు ఐదుగుణములును, ప్రధానస్య ప్రతిపత్త్యర్థం = పరబ్రహ్మ మును తెలిసికొనుటకై, ఉపసంహర్తవ్యాః=సంగ్రహించుకొనతగినవి.

తా॥ సర్వశాఖలయందును విజ్ఞేయము ( తెలిసికొనతగినది ) గా చెప్పబడియున్న పరబ్రహ్మము ఒకటియే కావున ఆయనయొక్క స్వరూపమును బాగుగ తెలిసికొనుటకై ఉపయోగించు సత్య, జ్ఞాన,

ఆనంద, పరిపూర్ణత్వ, సర్వాత్మత్వము, లైదును ఒకచోట చెప్పబడ కున్నను ఇతరస్థలములనుండి సంగ్రహించుకొనవలసినదే. బ్రహ్మ నిర్వి శేషుడనుట ఈసిద్ధాంతమును భంగము చేయనేరదు. ఈగుణములు ఆయనయొక్క స్వరూపమును గ్రహించుటకు చెప్పబడినవే కాని ఆయనకుగలవని చెప్పబడినవి కావుగదా. కావున పైన చేసిన సిద్ధాంత మునకు భంగమేమియును లేదని తాత్పర్యము.

**అవ॥** ఇట్లు చెప్పినయెడల తైత్తిరీయోపనిషత్తునందు చెప్ప బడియున్న తస్యప్రియమేవశిరః (ఆ ఆనందమయ పరబ్రహ్మమునకు ప్రియమే అప్పుడునాగ్రామే * చందనాదులవలన కలుగు ఆనందమే * శిరస్సు) అనుమొదలగు ధర్మములు కూడ ఆనందాదులవలె నిర్గుణ బ్రహ్మమునుగూర్చి చెప్ప ప్రతిస్థలమునందును సంగ్రహించుకొనబడు నని చెప్పవలసి వచ్చును. ఇది విరుద్ధముగా నున్నది, సమాధానము చెప్పుచున్నాడు.

**సూ॥** ౧౨॥ ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయాపచయౌ హి భేదే॥

టీక॥ సర్వత్ర = అన్నిస్థలములయందు, ప్రియశిరస్త్వాద్యప్రా ప్తిః = ప్రియశిరస్త్వము (ప్రియమే శిరస్సుగాగలిగి యుండుట.) మొద లగు గుణములను సంగ్రహించుకొనవలసినదిలేదు, తే = ఆధర్మము లు, ఉపచయాపచయౌ హి = స్థూలసూక్ష్మభేదములు గలవిగదా, తథా విధాశ్చ = అట్టి స్థూలసూక్ష్మములు గలవస్తువులు, భేదేసతి = భేదము ఉన్నప్పుడే (భేదమునగా సవిశేషత్వము) సంభవంతి = సంభవిం చునుగదా.

**తా॥** తస్యప్రియమేవశిరః అనుమొదలగు వాక్యములచే చెప్ప బడియున్న ధర్మములను నిర్గుణ పరబ్రహ్మమునుగూర్చి చెప్పుస్థలముల యందు సంగ్రహించుకొనవలసిన పనిలేదు. ఆ ధర్మములు ఉపచ యాపచయ స్వరూపములు గలవని (ఒకటి మఱియొకదానికంటె హెచ్చనియు మఱియొకటి తక్కువయనియు ననేక భేదములుగలవి)యని స్పష్టముగ నచ్చటి సందర్భమును పట్టి చూచిన యెడల తెలియవచ్చు చున్నది గదా, ఇట్టిధర్మములు భేదములుగల వస్తువులయందు ఉండ వచ్చునుగాని నిర్విశేషమగు పరబ్రహ్మమునందు ఉండుటకు వీలులేదు

గదా. కావున ఉపాసనార్థమై పరబ్రహ్మమును సవిశేషుడుగా చెప్పనప్పుడే వీనికి అవకాశముగలుగుగాని నిర్విశేషుడని చెప్పునప్పుడు స్వరూపభూతములగు ఆనంద జ్ఞానాదులకువలె వీనికిగూడ నవకాశము కలుగనేరదని తాత్పర్యము.

సూ॥ ౧౩॥ ఇతరేత్వర్థసామాన్యాత్ ॥

టీక॥ ఇతరేతు=తక్కినఆనందాదులైతే, అర్థసామాన్యాత్=వానిచేతెలియజేయబడు నిర్గుణబ్రహ్మమొక్కడేకావున, సర్వత్ర సంగృహ్యంతే=అంతట సంగ్రహింపబడును.

తా॥ బ్రహ్మజ్ఞాన సాధనములగు ఆనందము జ్ఞానముమొదలగు ధర్మములనుమాత్రము అన్నిచోట్లను ( ఉపాసనార్థమైకాని స్వరూపజ్ఞానార్థమైకాని పరబ్రహ్మమునుగూర్చి చెప్పునన్ని స్థలముల యందును) సంగ్రహించుకొనవలయును. వానిని సంగ్రహించుకొనక పోయిన యెడల బ్రహ్మయొక్క యథార్థస్వరూపమును తెలిసికొనుటకు వీలు లేదుగదా. పై సూత్రమునందుచెప్పిన ప్రియశిరస్త్వము మొదలగునవి ఉపాస్యధర్మములగుటచే ( ఉపాసనార్థమై సవిశేషుడని చెప్పబడు బ్రహ్మకు ధర్మములగుటచే ) వానికి జ్ఞానమునుగూర్చి చెప్పుసందర్భములయందు ఉపయోగముండదుకాని ఈ ఆనందాదులుమాత్రము స్వరూపజ్ఞాన సాధనము లగుటచే నుపాసననుగూర్చి చెప్పు సందర్భములయందుకూడ వీనికుపయోగముండునని తాత్పర్యము.

—(*) ౭. అధ్యానాధికరణమ్. (*)—

అవ॥ "ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః" అనుమొదలగువాక్యములచే కఠవల్లియందు అనేకవిషయములు నిరూపింప బడియున్నవి. కట్టకడకు "అవ్యక్తాత్ పురుషః పరః" అనువాక్యముచే పరబ్రహ్మము సర్వోత్తముడనియే చెప్పబడియున్నది. ఆవాక్యములన్నియు ప్రత్యేకముగా విషయాద్యుపాసనలనుగూర్చి బోధించునా లేక పరబ్రహ్మమునుగూర్చి చెప్పునా అనుసంశయము నీయధికరణమున పరిష్కరింపబడుచున్నది.

సూ॥ ౧౪॥ ఆధ్యానాయ ప్రయోజనాభావాత్ ॥

టీక॥ అర్థాదీనాం = విషయములు మనస్సు మొదలగువానికి,

పరత్వకథనం=ఒకటికంటె నొకటి అధికమని చెప్పుట, అధ్యానాయ=ధ్యానముచే పురుషుని తెలిసికొనుటకై, భవతి = అగుచున్నది. అన్యథా=అట్లుగాక విషయాదులను ఉపాసనచేయుటకే అనినచో, ప్రయోజనాభావాత్=ప్రయోజనమేమియును లేదుకావున (ప్రయోజనమేమియును లేదుకదా యనుట.)

తా॥ కఠోపనిషత్తునందలి "ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః" అను మొదలగువాక్యములు పరమేశ్వరుని చెప్పనుద్దేశ్యముతో చెప్పబడినవేకాని ప్రత్యేకవిద్యలను ఉపదేశించు నుద్దేశ్యముతో గాదు. విషయములను మనస్సును ఉపాసనచేయుమని చెప్పినను ఉపయోగమేమియు లేదుకదా. కావున కఠోపనిషత్తునందలి ఇంద్రియేభ్యః అనుమొదలగు వాక్యములన్నియు పరమాత్మను నిరూపించునవేయని నిర్ణయింపవలెనని తాత్పర్యము.

సూ ॥ ౧౫ ॥ ఆత్మశబ్దాచ్చ ॥

టీక॥ ఆత్మశబ్దాచ్చ=ఆత్మశబ్దమును ప్రయోగించి యుండుట వలనకూడ, అర్థాదికథనం = విషయములు మొదలగు వానిని గూర్చి చెప్పుట, అభిధ్యానాయ = ధ్యానముచే (వీటి అన్నిటికంటె పరమేశ్వరుడు శ్రేష్ఠుడు అని భావించుటచే) పరబ్రహ్మమును తెలిసికొనుటకే.

తా॥ "ఏషసర్వేషుభూతేషు గూఢోత్మా న ప్రకాశతే" (సర్వశ్రేష్ఠుడగు పురుషుడే ఆత్మ. ఇతడు సర్వభూతములయందును గూఢముగానుండియు ప్రకాశింపడు) అను వాక్యముచేత అర్థాదులకంటె శ్రేష్ఠుడని చెప్పబడియున్న పురుషుడే ఆత్మయనియు ఆయనను తెలిసికొనుట కష్టమనియు చెప్పబడియున్నది. దీనిబట్టి సూచిన పురుషునిగూర్చి నిరూపించుట అత్యావశ్యకమగుటచేత అదియే ప్రస్తుత వాక్యమునకు ఉద్దేశ్యమని స్పష్టమగుచున్నదికదాయని తాత్పర్యము.

—(*) ౭. ఆత్మగృహీత్యధికరణమ్. (*)—

అవ॥ "ఆత్మావా ఇదమేకఏవాగ్ర ఆసీత్" (ఆత్మయొకడే సృష్ట్యారంభమున నుండెను)" అను ఐతరేయశ్రుతియందు ఆత్మశబ్దముచే చెప్పబడినవాడు పరబ్రహ్మమా, లేక చతుర్ముఖబ్రహ్మమా, పూర్వాధికరణమునందు విషయాదులనుగూర్చి చెప్పవాక్యములన్ని

యు నొకటియేయని ( ఏకవాక్యమని ) సిద్ధాంతముచేయుటకు పూర్వోత్తర సందర్భములను ఆధారముచేసికొనియున్నారు. ప్రస్తుతవిషయమునందును పూర్వవాక్యమునందు చతుర్ముఖ బ్రహ్మను గూర్చి చెప్పబడియుండుటచేత దానిని ఆధారముచేసికొనియే ఆత్మ శబ్దమునకు అర్థము చెప్పవలసినదికదా, యనిన దానినిగూర్చి ఈ అధికరణమునందు విచారించుచున్నాడు.

సూ ॥ ౧౬ ॥ ఆత్మగృహీతి రితరవదుత్తరాత్ ॥

టీక॥ ఉత్తరాత్ = ఉత్తరసందర్భములవలన, ఇతరవత్ = ఇతర శ్రుతులయందువలె, అత్రాపి = ఇచ్చటకూడ, ఆత్మగృహీతిః = ఆత్మయనగా పరబ్రహ్మమనియే గ్రహింపవలయును.

తా॥ అవతారికయందు చూపబడినప్రకారము పూర్వవాక్యమును విచారించిన ఆత్మశబ్దార్థమునుగూర్చి కొంత సంశయము గలుగుచున్నను " సఐక్షత ( ఆ, ఆత్మసంకల్పించెను ) " అను మొదలగు ఉత్తర సందర్భమునుబట్టి " పరమేశ్వరుడు " అనియే ఆయాత్మపదమునకు అర్థమని నిర్ణయింపవచ్చును. సంకల్ప పూర్వకమగు సృష్టిని చెప్పిన ప్రతిసందర్భమునందును పరమేశ్వరునిగూర్చియే చెప్పబడియున్నట్లు ఇతర శ్రుతులవలన స్పష్టముగుచునే యున్నది కదా. కావున ఇతరశ్రుతులయందువలె ఈఐతరేయ శ్రుతియందుకూడ ఆత్మశబ్దార్థమును నిర్ణయించుకొనవచ్చుననియు, పూర్వవాక్యమును ఈ నిర్ణయముననుసరించియే యన్వయింపవచ్చుననియు తాత్పర్యము.

రెండవపక్షము.

అవ॥ బృహదారణ్యకోపనిషత్తునందు " కతమ ఆత్మ (ఆత్మయనగా నెవ్వడు) " అను మొదలగు వాక్యములయందు ఆత్మ శబ్దము జీవపరముగా ప్రయోగింపబడి అతడే పరబ్రహ్మయని చెప్పబడియున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు " సదేవసోమ్యేదమగ్రఆసీత్ " అను వాక్యమునందు ఆత్మశబ్దమును ప్రయోగింపక శ్రుతి సచ్ఛబ్దమునుమాత్రమే ప్రయోగించియున్నది. సచ్ఛబ్దము సామాన్యముగా ఉనికిని చెప్పునుగాని ఆత్మను చెప్పదుగదా. కావున ఈరెండు ఉపనిషత్తు

లందు చెప్పబడినవిద్యలు భిన్నములా, అభిన్నములా, అను విషయమును ఈయధికరణమున విచారించుచున్నాడు.

టీక॥ ఇతరవత్ = బృహదారణ్యకోపనిషత్తునందువలెనే, అత్రాపి=ఈఛాందోగ్యోపనిషత్తునందుకూడ, ఆత్మగృహీతిః= ఆత్మనుగ్రహింపవలయును. కుతః=ఎందువలననగా, ఉత్తరాత్ = ఉత్తరసందర్భమునుబట్టి.

తా॥ ఈఛాందోగ్యోపనిషత్తునందుకూడ సచ్ఛబ్దమువలన ఆత్మనే గ్రహింపవలయును. ఉపసంహారమునందు "సఆత్మా (ఆతడే జీవుడు)" అనువాక్యము ఈవిషయమునందు ఆధారము. బృహదారణ్యకోపనిషత్తునందును, ఇచ్చటను చెప్పబడియున్నవిద్యలు రెండును పైనిరూపించిన కారణమువలననే అభిన్నములగునని తాత్పర్యము.

ఇంకొక పక్షము.

అవ॥ "సఇమాంల్లోకానసృజత (ఆయన ఈలోకములను సృజించెను)" అనియారంభించి భూలోకాదులయొక్క సృష్టియే చెప్పబడి యున్నది. కావున మొట్టమొదట ప్రయోగింపబడియున్న ఆత్మశబ్దమునకు చతుర్ముఖుడని అర్థముచెప్పుటయే యుక్తమైన అట్లు కాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౧౭॥ అన్వయాదితిచేత్స్యాదవధారణాత్ ॥

టీక॥ అన్వయాత్ =అచ్చట చెప్పబడియున్న విషయము, హిరణ్యగర్భుని విషయమునందే సమన్వయమగుచుండుటవలన; తథా న= ఆవిధముగాచెప్పుట సరికాదు (ఆత్మశబ్దమునకు పరమేశ్వరుడే అర్థమని చెప్పుట యుక్తముగాదు) ఇతిచేత్ = అందువేమో, అవధారణాత్= "ఏవ" అనుపదముచే నిశ్చయించుటవలన, తథాస్యాత్= ఆవిధముగానే చెప్పవలయును.

తా॥ అవతారికయందు చూపబడిన యాక్షేపము సరియైనది కాదు. "సఇమాన్" అనుమొదలగు వాక్యములచే చెప్పబడినవిషయము పరబ్రహ్మవిషయమునందుకూడ సమన్వయము చేసికొనవచ్చును. ఛాందోగ్య శ్రుతియందు తేజస్సృష్టి నారంభించుటవలన తైత్తిరీయోపనిషత్తునుండి ఆకాశ వాయుసృష్టులను ఎచ్చటికి తెచ్చు

కొంటిమో అట్లే ఇచ్చటకూడ లోకసృష్టులనే యారంభించినను ఇతర ఉపనిషత్తులనుండి మహాభూతసృష్టులను తెచ్చుకొనవచ్చును గాని " ఆత్మావా ఇదమేకఏవాగ్ర ఆసీత్ " అను వాక్యముచే చెప్పబడిన అవధారణమును ( ఈతడొక్కడే యున్నాడు అను నిశ్చయమును ) హిరణ్యగర్భునియందు సమన్వయము చేయుటకు వీలులేదు గదా. కావున ఆత్మశబ్దమునకు పరబ్రహ్మమనియే తాత్పర్యము.

రెండవపక్షము.

అవ॥ ఇట్లు చెప్పుట సరికాదు. ఉపసంహారము ఉపక్రమమునకు సంబంధించియేకదా యుండవలయుననిన సమాధానము చెప్పుచున్నాడు.

టీక॥ అన్వయాత్ = ఉపసంహారము ఉపక్రమముతోనే సంబంధపడి యుండవలయునుగాన, తథానేతిచేత్ = అవిధముగా (సచ్ఛబ్దముచేత ఆత్మనే గ్రహింపవలయునని) చెప్పుట సరికాదను నెడల, న = అదిసరికాదు. కుతః = ఎందువలననగా, అవధారణాత్ = ఏవశబ్దమును ప్రయోగించి పైనచేయబడిన సిద్ధాంతమునే నిశ్చయించియుండుటవలన.

తా॥ అవతారికయందు చూపబడిన దోషము యుక్తమైనది కాదు. ఛాందోగ్యోపనిషత్తునందలి యుపక్రమము ఉపసంహారముకంటె భిన్నమగు అర్థమును చెప్పుటయే లేదు. " సదేవ " అని చెప్పుటచేత సద్రూపమగు పరబ్రహ్మ మొక్కటియే ఉపక్రమమునందు వర్ణింపబడినట్లు స్పష్టమగుచున్నది. ఏకవిజ్ఞానముచే సర్వ విజ్ఞానము కలుగునను ప్రతిజ్ఞకూడ సచ్ఛబ్దము పరబ్రహ్మమునుగూర్చి చెప్పకపోయినయెడల సిద్ధింపదుకదా. కావున ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులయందు చెప్పబడియున్న విద్యలు రెండును ఒక్కటియే యని తాత్పర్యము.

—(*) ౯. కార్యాఖ్యానాధికరణమ్. (*)—

అవ॥ ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులయందు ప్రాణవిద్యనుచెప్పు సందర్భమువలన " తస్మాద్వా ఏతదశిష్యంతః పురస్తాచ్చోపరిష్టాచ్చాద్భిః పరిదధతి, తద్విద్వాంసః శ్రోత్రియా అశిష్యంత

ఆచామంతి'' ( జలము ప్రాణమునకు వస్త్రమగుటవలన భోజనము చేయువారు చేయుటకు పూర్వమును చేసినపిదపను జలముచే ప్రాణమును కప్పుదురు. అనగా ఆచమనము చేయుదురు * జలము ప్రాణమునకు వస్త్రమని తెలిసిన శ్రోత్రియులు భోజనము చేయుబోవునప్పుడు ఆచమనము చేయుదురు. ) అనుమొదలగు వాక్యములచేత జలము ప్రాణమునకు వస్త్రమని ధ్యానము చేయవలయు ననియు భోజనమునకు పూర్వోత్తర కాలములయందు ఆచమనము చేయవలయుననియు రెండువిధులు విధింపబడియున్నవి. ఈ విధులలో ప్రాణవిద్యకు అంగభూతమైనది ధ్యానవిధియా, ఆచమనవిధియా, అనువిషయమునుగూర్చి ఈ యధికరణమునందు విచారింప బడుచున్నది.

సూ॥ ౧౮॥ కార్యాఖ్యానాదపూర్వం ॥

టీక॥ కార్యాఖ్యానాత్ = శ్రుతిస్మృతులయందు ప్రసిద్ధమైన ఆచమన రూపకార్యమునే ఇచ్చటకూడా చెప్పి యున్నందువన ( అను వాదముచేసి యుండుటవలన, ) అపూర్వం = ఇతర శ్రుతులయందు చెప్పబడక ప్రస్తుత ప్రాణ విద్యయందు మాత్రమే చెప్పబడియున్న ధ్యానవిధియే, ప్రాణవిద్యా=ప్రాణవిద్యకు అవయవమైనది.

తా॥ జలము ప్రాణమునకు వస్త్రమని ధ్యానింప వలయునను విధియే ప్రాణోపాసనాంగము. ఈ సందర్భమునందు చెప్పబడిన రెండువిధులలో ఆధ్యాన విధియేకదా అపూర్వమైనది. ఆచమనవిధి త్రిరాచామేత్ (మూడుమారులు ఆచమనము చేయవలయును.) అను మొదలగు శ్రుతులచేతను, ఆచాంతేనకర్తవ్యం ( ఆచమనము చేసియే సర్వకార్యములు చేయవలయును. ) అను మొదలగు శ్రుతుల చేతను శుద్ధికొరకై ప్రతిసమయమందును ఆచమనము అవశ్యముగా చేయవలయునని ముందే వర్ణింపబడియున్నది. దానిని ఇచటమరల చెప్పుట కేవలము అనువాదమే యగునుగాని విధికానేరదు. ఈకారణమువలన అపూర్వమగు ధ్యానవిధియే ప్రాణోపాసనకు అంగమని నిర్ణయించుటయే యుక్తమని తాత్పర్యము.

—(*) ౧౦. సమానాధికరణమ్. (*)—

అవ॥ వాజసనేయ శాఖయందలి అగ్నిరహస్యము నందును

బృహదారణ్యకోపనిషత్తునందును శాండిల్య విద్యయను నొకవిద్య కలదు. అగ్నిరహస్యమునందు, మనోమయః ప్రాణశరీరః అనుమొద లగు వాక్యములచే ననేక గుణములు పరమేశ్వరునకు చెప్పబడి యున్నది. బృహదారణ్యకోపనిషత్తునందు గుణములు అతి స్వల్పముగా వర్ణింపబడియున్నది. ఇట్లు భేదము కనుపడుచుండుటచే మనముసిరూపించిన రెండుస్థలములయందును చెప్పబడిన శాండిల్యవిద్య ఏకమా, భిన్నమా, అను విషయమునుగూర్చి ఈయధికరణమునందు విచారింప బడుచున్నది.

సూ॥ ౧౯॥ సమానఏవంచాభేదాత్ ॥

టీక॥ సమానేచ=ఒకటేశాఖయందుకూడా, అభేదాత్=ఉపాస్తి దేవతయొక్క స్వరూపము ఒకటిగానే యుండుటవలన, ఏవం= ఈవిధముగానే ( భిన్నశాఖలయం దున్నవిద్యలు ఉపాస్య దేవత యొక్క అభేదమువలన ఎట్లు అభిన్నములగునో ఆవిధముగనే ) విద్యలకు భేదములేదని తెలిసికోనవలయును.

తా॥ అవతారికయందు చూపబడిన రెండు స్థలములయందును చెప్పబడిన శాండిల్య విద్యయొక్కటియే. వానియందు ఉపాస్యదేవత యొక్క గుణములు ఒకచోట అధికముగాను మఱియొకచోట స్వల్పముగాను చెప్పబడియున్నవే కాని దేవతకు మాత్రము భేదమేమియు లేదుగదా. ఒకశాఖయందు ఒకటేవిద్యను రెండుమారులు ఉపదేశించెననిన పునరుక్తిదోషము వచ్చునని తలంపవలదు. అగ్నిరహస్యమునందు ఉపాస్యదేవతకు చెప్పతగియున్న సర్వగుణములును చెప్పియుండుటచేత అచ్చటవిధి ముఖ్యమైనదనియు బృహదారణ్యకోపనిషత్తునందు ఆగుణములు సూచింపబడిమాత్రమే యుండుటచేత అచటివిధి అప్రధానమయినదనియును చెప్పుటకు వీలుకలదుకదా. కావున ఉపాస్యదేవత యొకటియగుటచే భిన్నశాఖలయందలి విద్యలెట్లు భేదములేనివని చెప్పబడుచున్నవో అట్లే దేవతా భేదము లేక పోవుటచే స్థల ద్వయమందున్న ఈ శాండిల్య విద్యయు ఒకటియేయని చెప్పుటకు చాలినంత యాధారము కలదని తాత్పర్యము.

—(*) ౧౧. సంబంధాధికరణమ్. (*)—

అవ॥ బృహదారణ్యకోపనిషత్తునందు సత్యవిద్యను చెప్పు నప్పుడు సూర్యమండలాంతర్గతుడని చెప్పబడిన పురుషునకు అహః అను పేరుకలదనియు, నేత్రమునం దున్నాడని చెప్పబడు పురుషునకు అహం అను పేరుగలదనియు వర్ణింపబడియున్నది. ఒకటి-విద్యయందే చెప్పబడియున్నవి. కావున ఈ రెండు పేరులును పరస్పర సంబంధము కలవి కావచ్చును. అను పూర్వపక్షమును ఈ యధికరణమున ఖండింప బోవువాడై మొట్టమొదట పూర్వపక్షస్వరూపమును చూపు చున్నాడు.

సూ॥ ౨౦॥ సంబంధాదేవమన్యత్రాపి ॥

టీక॥ సంబంధాత్ =ఒకవిద్యయందే చెప్పబడియుండుటవలన, అన్యత్రాపి=మఱియొకచోటగూడ (సత్యవిద్యయందుకూడా ) ఏవం= పై యధికరణమునందు చెప్పిన ప్రకారమే ( పై యధికరణము నందు శాండిల్య విద్యకు భేదములేక పోవుటచేత ఒకచోట లేని గుణములను మఱియొకచోటనుండి తెచ్చుకొనవచ్చునని చెప్పినట్లు, ) జ్ఞాతవ్యం = తెలిసికొనవలసి వచ్చును.

తా॥ ఉపాస్య దేవతకు భేదములేక పోవుటచే శాండిల్య విద్య యొకటియేయనియు, ఒకచోట చెప్పినగుణములను మఱియొకచోటికి తెచ్చుకొనవలయుననియు, పై యధికరణమునందు చెప్పియున్నారు. దీనివలెనే ఈ సత్యవిద్యయందుకూడా అహః అహం, అను పేరులను ఒకచోటనుండుదానిని మఱియొకచోటికి తెచ్చుకొనవచ్చును. అనగా దేవతయగు సూర్యునియందున్న పురుషునకు అహం అను పేరుకూడా కలదనియు శరీరమగు నేత్రమునందుండుపురుషునకు అహః యను పేరు కూడా కలదనియు చెప్పవచ్చుననుట. ) ఈ విద్య యొకటియే కావున శాండిల్య విద్యయందువలె ఇచ్చటకూడ ఒకచోటనున్న గుణములను మఱియొకచోటికి తెచ్చుకొనవలయుననుట సిద్ధాంతమేనని తాత్పర్యము ( ఇదిపూర్వపక్షసూత్రము. )

అవ॥ పై పూర్వపక్షమును ఖండించుచున్నాడు.

సూ॥ ౨౧॥ నవావిశేషాత్ ॥

టీక॥ నవా=అట్లుచెప్పుట సరికాదు, కుతః=ఎందువలననగా, విశేషాత్=విశేషము ( మార్పు ) ఉండుటవలన.

తా॥ పై సూత్రముచే చేయబడిన పూర్వపక్షము సరియైనది కాదు. శాండిల్య విద్యయందు గుణములు సంగ్రహించబడినవి. దాని వలెనే ఇచ్చట పేరులను సంగ్రహించుకొందుమనుటసరికాదు. ఉపాస్య దేవత పరబ్రహ్మయొకడే యైనను స్థాన భేదముల నభేదముల ననుసరించి వ్యవహారార్థమై నామభేదములు కల్పింపబడియున్నది. గుణములు ఇట్టివికావుగదా. కావున వానిపోలిక నామములకు రానేరదు. ఈ కారణమువలన స్థానము ననుసరించి పెట్టబడినపేరు ఆ స్థానము నందున్న పరమేశ్వరుని చెప్పుచు నట్లేయుండునుగాని వఱియొక స్థలమునకు తేబడనేరదని తాత్పర్యము.

సూ॥ ౨౨॥ దర్శయతిచ ॥

టీక॥ శ్రుతియు నిట్లే చెప్పుచున్నవి.

తా॥ "తస్యైతస్యత దేవరూపంయదముష్యరూపం" ( ఈ ఆదిత్యపురుషునియందు వేరూపముగలదో ఈ యక్షిపురుషుని యందును కూడా నదేరూపముకలదు ) అనుమొదలగు శ్రుతులచేత ఆదిత్యపురుషునియందు చెప్పబడిన రూపమునే అక్షిపురుషునియందు కలదనిచెప్పబడియున్నది. దీనినిపట్టిచూచిన విద్యయొక్కటేయైనను స్థానభేదము వలన ఆదిత్యాక్షి పురుషులనుగూర్చి చెప్పబడిన సర్వ విషయములను భిన్నములేయనియు రూపము మొదలగునవి ఇరువురకును సమానము లేయని ( అక్షిపురుషుని రూపముకూడ ఆదిత్య పురుషుని రూపము వంటిదేయని ) చెప్పబడియున్నను, పేరుల విషయము అట్టిది కాదనియు స్పష్టమగుచున్నది. కావున అహః, అహం, అనుపేరులు ఒకచోటినుండి మఱియొక చోటికి సంగ్రహించుకొనబడుటకు వీలు లేదని తాత్పర్యము.

—(*) ౧౭. సంభృత్యధికరణమ్. (*)—

అవ॥ "బ్రహ్మజ్యేష్ఠా వీర్యాసంభృతాని బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివమాతతాన ( ఈపంచ భూతములు బ్రహ్మమే ముఖ్యకారణము గాగలవి స్థిరపరుపబడియున్నవి. సర్వకారణమగు నా బ్రహ్మము

ఇంద్రాదుల యుత్పత్తికిముందే స్వర్గమును ఆక్రమించెను)" అని ఒక శాఖయందు చెప్పబడియున్నది. ఇది ప్రత్యేక ఉపాసనయా, లేక ఆశాఖయందు మఱియొకచోటనుండు శాండిల్యవిద్య మొదలగు విద్యలయందు, ఇచ్చట చెప్పియున్న గుణములను సంగ్రహించుకొనవలయునా, అనువిషయమును, ఈ అధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౨౩॥ సంభృతిద్యువ్యాప్త్యపిచాతః ॥

టీక॥ సంభృతిద్యువ్యాప్తీ = ఆకాశాదులకు కారణమగుట, స్వర్గలోకమునువ్యాపించుట, అపి= ఈరెండుధర్మములుకూడ, అతః= పైననిరూపింపబడిన కారణమువలననే ( స్థానభేదముండుటవలననే ) నచోపసంహర్తవ్యే= ఇతరవిద్యలయందు సంగ్రహించుకొనకూడదు.

తా॥ అవతారికయందు చెప్పబడిన ధర్మములు శాండిల్యాది ఇతరవిద్యలయందు సంగ్రహించుకొనుటకై చెప్పబడినవికావు. అది ప్రత్యేకోపాసనమే. పై అధికరణమునందు నిరూపించియున్న ప్రకారము ఇచటకూడ ఒకభేదముకలదు. శాండిల్యాది విద్యలయందు పరబ్రహ్మకు ఉపాసనార్థమై యొకస్థానము చెప్పబడియున్నది. ప్రస్తుత సందర్భమున, అట్లులేదుగదా. కావున ఇచ్చట చెప్పబడియున్న గుణములు శాండిల్యాదివిద్యలలోనికి ఉపసంహారము చేసికొన నవసరము లేదని తాత్పర్యము.

—(*) ౧౩. పురుషవిద్యాధికరణము. (*)—

అవ॥ "పురుషోవావయజ్ఞః ( పురుషుడే యజ్ఞము అని ఛాందోగ్యోపనిషత్తునందు ఒకపురుషవిద్య చెప్పబడియున్నది. ఈపురుషవిద్యయే తైత్తిరీయకోపనిషత్తునందుకూడ వర్ణింపబడి యున్నది. ఈరెండువిద్యలును పరస్పరభిన్నములా, కావా, అను విషయమును ఈఅధికరణమున విచారింపబడుచున్నది.

సూ॥ ౨౪॥ పురుషవిద్యాయామివచేతరేషామనా
మ్నానాత్ ॥

టీక॥ పురుషవిద్యాయామివ=ఛాందోగ్యోపనిషత్తునందలి పురుషవిద్యయందువలె, ఇతరేషాం = తైత్తిరీయశాఖవారియొక్క, పురుషవిద్యాయాం = పురుషవిద్యయందు అనామ్నానాత్ = ధర్మములు

చెప్పబడి యుండకపోవుటవలన, తే భిన్నే=అవి భేదముగలవియే.

తా॥ ఛాందోగ్య తైత్తిరీయోప నిషత్తులయందలి పురుష విద్యలు ఒకటికావు. ఆ రెంటియందును చెప్పబడియున్న ధర్మములకు పరస్పరభేదము కలదు. ఛాందోగ్యోపనిషత్తునందు పురుషుడే యజ్ఞమనిచెప్పి ఆతనియాయుస్సును మూడువిధములుగా విభాగించి ఆభాగములే సవనములని చెప్పబడియున్నవి. ఆకలి, దప్పి, మొదలైనవియే దీక్షలనికూడ చెప్పబడియున్నది. తైత్తిరీయోపనిషత్తునందు ఇట్లు లేకపోవుటయేగాక పురుషుడే యజ్ఞమనికూడ చెప్పబడియుండలేదు. దీనివలన ఆ రెండువిద్యలు నొకటికావు. కావున ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడియున్న ధర్మములు తైత్తిరీయోప నిషత్తునందును తైత్తిరీయోపనిషత్తునందు చెప్పబడియున్న ధర్మములు ఛాందోగ్యోపనిషత్తునందును సంగ్రహించుకొనవలసిన పనిలేదని తాత్పర్యం.

—(*) ౧౮. వేధాద్యధికరణమ్. (*)—

అవ॥ " సర్వం ప్రవిధ్య హృదయం ప్రవిధ్య, శంనోమిత్రశ్శంవరుణః (సర్వమును ఛేదించి హృదయమును ఛేదించి సూర్యుడున్ను వరుణుడున్ను మనకు సుఖమునిచ్చుగాక) " అను మొదలగు ఉపనిషదాదియందు పఠింపబడు మంత్రములు ఆయా ఉపనిషత్తులయందు చెప్పబడువిద్యలలో సంగ్రహింపబడునా, లేదా, అనుసంశయము ఈ అధికరణమున పరిష్కరింపబడుచున్నది.

సూ॥ ౨౫ ॥ వేధాద్యర్థభేదాత్ ॥

టీక॥ వేధాద్యర్థభేదాత్ = ఛేదించుట సుఖమునిచ్చుట మొదలగు మంత్రార్థములు ఆ ఉపనిషత్తులయందు చెప్పబడు విద్యలకంటె వేరైయుండుటవలన, ఉపనిషదాదిమంత్రాణాం= ఉపనిషత్తులయొక్క మొట్టమొదట పఠింపబడు మంత్రములకు, విద్యాసునోపసంహారః= ఆ ఉపనిషత్తులయందు చెప్పబడుచున్న విద్యలతో సంబంధము లేదు.

తా॥ ఉపనిషత్తులయొక్క ఆరంభమునందు పఠింపబడు మంత్రములు ఆఉపనిషత్తులయందు చెప్పబడుచున్న విద్యలతో సంబంధపడవు. ఆవిద్యలకు పరబ్రహ్మను ఉపాసింపవలయుననుట యర్థము. ఉపనిషదాదిమంత్రములకు అభిచారము ( శత్రువినాశము ) సుఖప్రాప్తి

మొదలగునవి యర్థము. ఈ రెంటికినీ సంబంధము కలుగుటకు వీలు లేదుకదా. కావునఉపనిషదాదిమంత్రములు వేరైనవేయనితాత్పర్యము.

—(*) ౧౫. హాన్యధికరణమ్. (*)—

అవ॥ ఉపాసనలకు ఫలమును చెప్పుసందర్భమందు కొన్నిశ్రుతులలో " అశ్వఇవరోమాణి విధూయపాపం ( గుఱ్ఱము వెంట్రుకలనువలె పాపమును రాల్చి" అనుమొదలగువాక్యములచే ఉపాసకుడు పాపమును విడచుననిమాత్రము చెప్పబడియున్నదికాని విడచిన పిదప ఆ పాపమునకు గతియేమిద్వైనదియును చెప్పబడియుండలేదు. "అశ్వరోమములు మాలిన్యముతోకూడ రాలిపోవునట్లు " అను దృష్టాంతముచేత పాపముకూడ ఉపాసకునిచే విడువబడియునేకాని స్వరూపాభావమును జెందలేదని స్పష్టముచేయ బడుచున్నదికదా. కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తునందు మాత్రము " తస్యప్రియా జ్ఞాతయస్సుకృతముపయంతి ( ఆ ఉపాసకుని బంధుమిత్రులు పుణ్యమును తీసికొనియెదరు )" అను మొదలగు వాక్యములచేత ఉపాసకుడు విడచినపుణ్యమును ఆతనిమిత్రులును పాపమును ఆతనిశత్రువులును తీసికొనియెదరని చెప్పబడియున్నది. ఈవిభాగము ఇతర ( ఈవిభాగమునుగూర్చి చెప్పని ) శ్రుతులయందు సంగ్రహించుకొనవలయునా, లేదా? అనువిషయమును గూర్చియును, " విధూయపాపం " అను వాక్యమునందలి " విధూయ " అను శబ్దమున కర్థమేమి, " వదలించి " అనియా లేక " విడచి " అనియా, అను సంశయమునుగూర్చియును ఈ యధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౨౬॥ హానౌతూపాయనశబ్దశేషత్వా త్కుశా

చ్ఛందఃస్తుత్యుపగానవ త్తదుక్తం ॥

టీక॥ హానౌ=ఇతర శ్రుతులయందు చెప్పబడిన పుణ్యపాప పరిత్యాగ సందర్భమునందు లేక నాశనమునందు, ఉపాయనోప సంహారః విధూననశబ్దః=ఉపాయనవాక్యమును ( అవతారికయందు చూపబడియున్న పుణ్యపాప విభాగవాక్యమును ) సంగ్రహించుకొనవలయును. లేక, విధూననశబ్దము ప్రవర్తించును. కుతః = ఎందువల్లననగా, ఉపాయనశబ్దశేషాత్ = ఉపాయనమునుగూర్చి చెప్పువాక్యము

పుణ్యపాప పరిత్యాగ వాక్యమునకు శేషమై యుండుటవలన, లేక, విధూననశబ్దము ప్రయోగింపబడియున్న వాక్యమునకు శేషమైయుం చుటవలన, ఏతచ్చ=ఇదిన్ని, కుశాచ్ఛందః స్తుత్యుపగానవత్ = కుశలు (యజ్ఞమునందు స్తోత్రములను లెక్కపెట్టుకొనుటకై ఋత్విక్కులు ఉపయోగించు పుల్లలు) ఛ్ఛందస్సులు, స్తోత్రములు, ఉపగానము (సామవేదము చెప్పువారు సామగానము చేయుచున్నప్పుడు ఇతర ఋత్విక్కులుచేయు, హెూ, అనుశబ్దము) వీటివిషయము నందువలె, జ్ఞాతవ్యం= తెలిసికొనవలయును, పూర్వతంత్రే = పూర్వమీమాంసా శాస్త్రమునందు, తదుక్తం=ఈ విషయమే చెప్పబడియున్నది.

తా॥ ఇతరశ్రుతులయందు చెప్పబడియున్న పుణ్యపాప పరిత్యాగ సందర్భమునందు కౌషీతకీ బ్రాహ్మణోప నిషత్తునందలి విభాగ క్రమమును సంగ్రహించు కొనవలయును. అవతారికయందు చూపబడిన ప్రకారముగా పాపపుణ్యములు విడువబడినవే కాని అభావ రూపమును చెందలేను. కావునను, అవి నిరాధారముగ నుండుటకు స్వాతంత్య్రము కలవికాక పోవుటచేతను వానికి ఉపాయనమావశ్యకము. దీనివలన ఉపాయన వాక్యము పరిత్యాగ వాక్యమునకు శేషమేయని చెప్పవలయును. ఒకశ్రుతియందు చెప్పబడియున్న సామాన్యమునకు శేషభూతమగు విశేషము మఱియొక శ్రుతియందు చెప్పబడియున్నను, దానిని సామాన్యవాక్య సమీపమునకు సంగ్రహించుకొనుట ప్రసిద్ధము. ఎట్లనగా " కుశావానస్పత్యాః (కుశలు వృక్షసంబంధమైనవిగా నుండవలయును)" అనుశ్రుతిచే సామాన్యముగా కుశలనుగూర్చి చెప్పబడియున్నను అవి యేవృక్షముతో సంబంధించి యుండవలయునో స్పష్టముకాకపోవుటచేత, " ఔదుంబర్యః కుశాః (కుశలు అత్తిచెట్టునకు సంబంధించి యుండవలయును)" అని శాఖాంతరమందున్నవిశేష శ్రుతిఆశ్రయించ బడుచున్నది. "ఛందోభిఃస్తువతే (ఛందస్సులచేత స్తోత్రము చేయుచున్నారు.)" అని దైవాసురములను భేదములుగల ఛందస్సుల విషయమై, ఏఛందస్సులను ముందు ఉపయోగింపవలయునో, వేనిని తరువాత నుపయోగింప వలయునో నిరూపింపక సామాన్యముగా నొకశ్రుతి చెప్పు చుండుటచే " దేవ

ఛందాంసి పూర్వాణి ( దైవఛందస్సులను మొదట నుపయోగింపవల యును )" అను శాఠ్యాయన శాఖలోని విశేషశ్రుతి సంగ్రహింప బడుచు న్నది. షోడశిఅనుపాత్రను గ్రహించునప్పుడు దానినిగూర్చి చేయవల సిన స్తోత్రమునుగూర్చి ఛందోగశ్రుతి యందు కాలనియమము లేకపో వుటచే దానిని, నిర్ణయించుటకై " సమయాధ్యుషితే సూర్యే ( సూ ర్యుడు అస్తమయ సమీపమునకు వచ్చినప్పుడు. )" అను తైత్తిరీయ శ్రుతి గ్రహింప బడుచున్నది, మఱియు " ఋత్విజ ఉప గాయంతి ( ఋత్విక్కులు ఉపగానము చేయుదురు.)" అను సామాన్య శ్రుతిని నియమించుటకై " నాధ్వర్యురుపగాయేదితి ( అధ్వర్యుడు ఉపగాన ముచేయగూడదు)" అనువిశేషశ్రుతిని అంగీకరించి దానివలన అధ్వ ర్యుడుతప్ప తక్కిన ఋత్విక్కులు ఉపగానము చేయవలయును అను విధి నిర్ధారణ చేయబడుచున్నది. కావున ప్రస్తుత సందర్భము నందు కూడ పరిత్యాగశ్రుతి ఉపయోగము లేనప్పుడు ( విడచిన వస్తువులను ఎవ్వరును తీసికొనకపోయినప్పుడు ) సంపూర్ణముకానేరదు. కావున వాక్యశేషముగు విభాగశ్రుతి యవశ్యము సంగ్రహించుకొనవలసినది యే. పూర్వ మీమాంసా శాస్త్రమునందు జైమిని మహాముని కూడ నిట్లే ( మఱియొక శాఖయందున్నను విశేషశ్రుతిని సామాన్యశ్రుతికి శేషముగా సంగ్రహించుకొనవలసినదియే యని ) చెప్పియున్నాడు. ఇట్లు సంగ్రహించుకొనక పోయినయెడల " సామాన్య శ్రుతియందు చెప్పబడినది గాని విశేషశ్రుతియందు చెప్పబడినదిగాని చేయ వలయు ను " అని వికల్ప మేర్పడును. ఇది దోషయుక్తముగదా. కావున, ఉపాయనవాక్యము పరిత్యాగ వాక్యశేషమేయనుట అవతారికయం దు చూపబడిన మొదటి సంశయమునకు సమాధానము. ఇక రెండవ సంశయమును బట్టిచూచిన, విధునశబ్దమునకు నాశనమనియే అర్థ ముగాని, చలనము అర్థముగాదు. చలనమునిన పుణ్యపాపములు కొంతకాలము ఊరకయుండుననియు కొంతకాలము పురుషుని బాధిం చుచునే యుండుననియు కదా, యర్థము చెప్పవలయును. ఇట్లర్థము చెప్పుటకు వీలులేదు. కౌషీతకి బ్రాహ్మణోపనిషత్తునందు చెప్పబడి యున్న విభాగవాక్యము ఈ వాక్యమునకు శేషముగదా. మఱియు

ఆ ఉపనిషత్తునందుకూడ మొట్టమొదట పుణ్యపాపవిధూననమునుగూర్చి చెప్పబడి పిదప విభాగమునుగూర్చి చెప్పబడియున్నది. ఇంతకుపూర్వమే చూపబడియున్న దృష్టాంతముల వలనను, పూర్వమీమాంసా న్యాయయుక్తులవలనను, విభాగమునుగూర్చి చెప్పని శ్రుతులయందు కూడ నావిభాగవాక్యమును సంగ్రహించుకొనవలయుననుట సిద్ధాంతమై యున్నది. కావున విధూననశబ్దమునకు నాశమనియర్థమనుటయే అవతారికయందు చూపబడిన రెండవ సంశయమునకు సమాధానము. ఈవిధముగా అవతారికయందలి రెండుసంశయములనుసయుక్తికముగా నివారింపబడినవనియు, దీనిచే ఉపాసకులయందు యెల్లరకును అనురాగము ఉండవలయునను విషయమును స్తోత్రము చేయుటకై చెప్పబడిన విభాగవాక్యమెంతయు, యుక్తియుక్తముగా నిరూపింపబడినదనియు తాత్పర్యము.

—(*) ౧౬. సాంపరాయాధికరణమ్. (*)—

అవ॥ ఉపాసకునకు పుణ్యపాపకర్మములు, క్షీణము లగునని చెప్పబడియున్నదిగదా. అవియెప్పుడు క్షీణములగును. విరజానదిని దాటిన పిమ్మటనా, లేక, అంతకంటే ముందా, అనువిషయము ఈ యధికరణమున విచారింప బడుచున్నది.

సూ॥ ౨౭॥ సాంపరాయే తర్తవ్యాభావాత్తథాహ్యన్యే ॥

టీక॥ పుణ్యపాపే=పుణ్యపాపములు, తర్తవ్యాభావాత్=విరజానదిని దాటినపిమ్మట చాటవలసినది ఏమియులేనందున లేక, ఉపాసకుడు క్రమక్రమముగా ముక్తికి పోవువాడగుటచే దేహత్యాగమునకు పిదప పుణ్యపాపముల సహాయమువలన కాతగినపని ఏదియులేకపోవుటవలన, సాంపరాయే=దేహత్యాగ సమయమునందే, నశ్యతః=నశించును, అన్యే=ఇతరులు, తథాపఠంతిహి=ఆవిధముగానే అధ్యయనము చేయుచున్నారుగదా.

తా॥ దేహత్యాగసమయమునందే పుణ్యపాపములు నశించునుగాని విరజానదిని తరించునంతవరకును అవి నిలచియుండవు, ఒక పక్షమునుబట్టిచూచిన నదిని తరించినపిదపపుణ్యపాపకర్మలచే నిర్వహింపతగినపని ఏదియులేదు. కావున, ఆనది వరకు ఆకర్మలు నాశనమును

చెందకుండునని చెప్పుటకు వీలులేదు. మఱియొక పక్షముబట్టి చూచిన కర్మక్షయమునకు హేతువగువిద్య జీవించి యున్నప్పుడే సిద్ధించి యుండును. కావున, ఉపాసకుడు క్రమముక్తిని చెందువాడగుటచే దేహత్యాగానంతరము కర్మచే పొందదగిన ఫలమేదియును లేదు. కావున, ఆకర్మలు దేహత్యాగానంతరముకూడ కొంతకాల ముండునని చెప్పుటకు వీలులేదు. ఒక్క కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునందు విరజానది తరణానంతరమున కర్మక్షయమని చెప్పబడియున్నను, దానిని ఛాందోగ్యాదిశ్రుతులను అనుసరించి మార్చుకొనవలయును. ఆశ్రుతులయందు ప్రత్యక్షముగా దేహత్యాగమునకు ముందే కర్మక్షయమని చెప్పబడియున్నదిక దానికే తాత్పర్యము.

అవ॥ ఉపాసనలకు కర్మక్షయమే ఫలమని చెప్పుచున్నావు ...న బ్రహ్మప్రాప్తివలె నదియును శరీరత్యాగానంతరమే కలుగునని చెప్పవలయునుగదా, అనిన నట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౨౮॥ ఛందత ఉభయావిరోధాత్ ॥

టీక॥ ఉభయావిరోధాత్ = రెండింటికి (శ్రుతికిని యుక్తికిని) విరోధములేక పోవుటవలన, జీవతః = బ్రతికియుండి, ఛందతః = ఉపాసనలనుసాధించు స్వాతంత్ర్యముగలవానికి, తస్మిన్నేవ సమయే = ఆ జీవించియున్న సమయమునందే, కర్మక్షయః = కర్మలునశించుననుట, యుక్తః = తగియున్నది.

తా॥ కర్మక్షయము ఉపాసనలకు ఫలమైనను మరణానంతరమున కలుగుననుటకు వీలులేదు. తగినంతకాలము ఉండగా కార్యోత్పత్తికి ఆలస్యమగుననుట ప్రత్యక్షవిరుద్ధముగదా. కావున కర్మక్షయము గలిగించు ఉపాసనలను చేయుటకు స్వాతంత్ర్యము కలిగియున్న జీవితకాలమునందే కర్మక్షయముగలుగు ననుట యుక్తము. ఇట్లు చెప్పినయెడల పైనజూపినయుక్తికిని శరీరత్యాగమునకు పూర్వమే కర్మక్షయమగునని చెప్పు శ్రుతులకును అవిరోధము కలుగును. ఈ విషయమున బ్రహ్మప్రాప్తి దృష్టాంతము సరియైనదికాదు. అది కర్మక్షయమునకు తర్వాత కలుగవలసినదికదా, కావున దేహత్యాగమునకు పూర్వమే విద్యాప్రభావమువలన కర్మక్షయము కలుగు ననియు

అదియే విద్యలకు ఫలమనుటలో విరోధమేమియు లేదనియు తాత్పర్యము.

—(*) ౧౭. గతేరర్థవత్త్వాధికరణమ్. (*)—

అవ॥ ఈవిధముగా ప్రసంగమువలనవచ్చిన కర్మక్షయ కాల విచారమును ముగించి మరల ప్రకృతమగు గుణ సంగ్రహామునుగూర్చి విచారించుచున్నాడు. ౧౫ వ- అధికరణమునందు ఏదోయొక యుపనిషత్తునందు కర్మక్షయ శేషముగా చెప్పబడియున్న ఉపాయనములు అన్నిచోట్లయందును సంగ్రహించుకొనవలయునని సిద్ధాంతము చేయబడియున్నది. అట్లే ఒకానొక యుపనిషత్తునందు కర్మక్షయానంతరముననే చెప్పబడుచున్న దేవయాన మార్గముకూడా అన్ని స్థలములయందును సంగ్రహించుకొనవలసినది యేకదా, యనిన నట్లుకాదని ఈయధికరణమున నిరూపించుచున్నాడు.

సూ॥ ౨౯॥ గతేరర్థవత్త్వముభయథాఽన్యథాహివిరోధః॥

టీక॥ ఉభయథా=రెండువిధములుగా జెప్పినప్పుడే,గతేః=దేవయానమార్గమునకు, అర్థవత్త్వం = సార్థకత్వమును, భవతి = అగును, అన్యథా=అట్లుచెప్పకపోయున, విరోధః = శ్రుతివిరోధము, ఆగచ్ఛతిహి=వచ్చునుగదా.

తా॥ ఈదేవయాన మార్గమును అన్నిచోట్లను సంగ్రహించుకొనుటకు వీలులేదు. ఆమార్గము సగుణోపాసకులకు కల దనియు నిర్గుణోపాసకులకు లేదనియు చెప్పవలయును. ఇట్లుచెప్పినప్పుడే కాని దానికిసార్థకత్వము కలుగదు. అన్నిచోట్లను దీనికి సంగ్రహాము కల దనినయెడల "విద్వాన్పుణ్యపాపే విధూయనిరంజనః పరమంసామ్యముపైతి (పరబ్రహ్మము నెఱింగినవాడు పుణ్య పాపములను నశింపజేసి దేనితోను సంబంధములేనివాడై పరబ్రహ్మముతోనైక్యము జెందును)" అనుశ్రుతికి విరోధమువచ్చును. కావున దేవయానము సగుణ విద్యలయందేకాని నిర్గుణవిద్యలయందు సంగ్రహింప బడదని తాత్పర్యము.

అవ॥ కొన్నిచోట్ల దేవయాన మార్గమునకు ఉప సంహారము కలదనియు మఱికొన్నిచోట్ల లేదనియు చెప్పుటయుక్తముకాదుగదా. అనిన నట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౩౦॥ ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్ ॥

టీక॥ తల్లక్షణార్థోపలబ్ధేః = ఆగతివలన కలుగవలసిన విషయములు సగుణవిద్యయందే శ్రుతిచేచెప్పబడి యుండుటవలన, లోకవత్ = లోకమునందువలెనే, ఉక్తార్థః = పైన చెప్పబడిన సిద్ధాంతము, ఉపపన్నః=యుక్తియుక్తమైనది.

తా॥ పైసూత్రమునందు చేయబడియున్న సిద్ధాంతమునందు దోషమేమియునులేదు. ఏలయనగా ఉపాసకుడు ఒక మార్గము ననుసరించి నడచుటచే సాధించవలసిన ఫలములు దివ్యమగు గంధము నాఘ్రాణించుట, రుచికరపదార్థమును భుజించుట మొదలగునవి సగుణవిద్యలయందేకదా, చెప్పబడియున్నవి. ప్రపంచాతీతమైన పరబ్రహ్మమును పొందుటకు ఒకచోటనుండి మఱియొకచోటికి వెళ్ళవలసిన పనిలేదు గదా, దూరదేశమునందుండువారు ఇతరదేశమునకు పోవలయునన్న మార్గము కావలయునుగాని అదే స్థలమునందుండువారు అచ్చటికే వెళ్ళవలయుననిన (అనగా కాశిలోనుండువారు కాశికే వెళ్ళవలయుననిన) మార్గము నొకదానిని చెప్పవలయునా? ఈ లోకదృష్టాంతమునుబట్టి చూచిన పైన వ. సూత్రమునందు చేయబడిన సిద్ధాంతమే యుక్తియుక్తమని యేర్పడుచున్నదని తాత్పర్యము.

—(*) ౧౮. అనియమాధికరణము. (*)—

అవ॥ ఈ దేవయాన మార్గము సగుణ విద్యలయందు కూడ కొన్నిచోట్ల చెప్పబడియుండలేదు. ఆయా ప్రకరణములను అనుసరించి ఆయా ఉపాసనలను చేసినవారికిమాత్రమే ఆమార్గము కలదని చెప్పవలయునా, లేక అన్నిచోట్లకును దానిని సంగ్రహించుకొనవలయునా, అనువిషయము ఈ యధికరణమున విచారింపబడుచున్నది.

సూ॥ ౩౧॥ అనియమస్సర్వేషామవిరోధశ్శబ్దానుమానాభ్యాం ॥

టీక॥ సర్వేషాం=అన్నిసగుణవిద్యలకును, దేవయానసంబంధే= దేవయానమార్గముతో సంబంధపడుటయందు, అనియమః = నియమము లేదు, శబ్దానుమానాభ్యాం= శ్రుతి, స్మృతులవలన, అవిరోధః= ఒక ప్రకరణమునందున్న విషయమును మఱియొక ప్రకరణము లోనికి సంగ్రహించుకొనుటయందు, అవిరోధః=విరోధములేదు.

తా॥ దహరవిద్య, శాండిల్య విద్య, మొదలగు కొన్నివిద్యల యందు దేవయానమార్గము చెప్పబడి యుండకపోయినను, ఇతరస్థలమునుండి దానిని సంగ్రహించుకొనవచ్చును. ఒకప్రకరణమునందున్న విషయమును మఱియొకప్రకరణములోనికి సంగ్రహించుకొనుటవలన విరోధము లేదు. " యఏవ మేత ద్విదుర్యేచామీ అరణ్యే శ్రద్ధాంసత్య ముపాసతే త్వేర్చిరభిసంభవంతి (ఎవ్వరీపంచాగ్ని విద్యను తెలిసికొందురో, ఎవ్వరరణ్యమునందు పరబ్రహ్మమును శ్రద్ధాతపః పూర్వకముగా పరబ్రహ్మమును ఉపాసన చేయుదురో వారిరువురును దేవయానమును చెందుదురు)" అనుశ్రుతియు " శుక్లకృష్ణేగతీహ్యేతే జగత శ్శాశ్వతీమతే । ఏకయాయాత్యనావృత్తి మన్యయావర్తతే పునః॥ (అర్చిరాదిమార్గము, ధూమాదిమార్గము, అనిచెప్పబడు రెండుమార్గములును ప్రపంచమునందలి ఉపాసకులకును, కర్మలొనర్చువారలకును, శాశ్వతములై యున్నవి. ఇందు అర్చిరాది మార్గమును [దేవయానమును] ఆశ్రయించినవాడు పునరావృత్తి రహితమైన మోక్షమును చెందును. రెండవదియగు ధూమమార్గము [పితృయానము] నాశ్రయించినవాడు పునరావృత్తిని చెందును.)" అను మొదలగు స్మృతియును పై విషయమును (అనగా ఉపాసకుల కందరకును దేవయానము కలదనుటను) సిద్ధాంతము చేయుచున్నవి. కావున ఒకవిద్యయందు చెప్పబడిన దేవయానముసగుణవిద్య లన్నిటియందును సంగ్రహించుకొనవలయునని తాత్పర్యము.

—(*) ౧౯. యావదధికారాధికరణమ్. (*)—

అవ॥ నిర్గుణవిద్యయందు దేవయానమును సంగ్రహించుకొననవసరము లేదని సిద్ధాంతముచేసియున్నారు. అదిసరికాదు. బ్రహ్మవేత్తలగు వసిష్ఠుడు, సనత్కుమారుడు మొదలగు వారుకూడ మరల జనించినట్లు స్మృతులచే తెలియచేయబడుచున్నది. దీనివలన బ్రహ్మజ్ఞానముకూడ మోక్షఫలమునిచ్చునది కాదనియు, దేహాంతరప్రాప్తిని కలిగించుననియు తెలియుచున్నది. కావున ఈ నిర్గుణ విద్యలయందు కూడ దేవయానమును అవశ్యముగ అంగీకరింపవలయును. దేహాంతర

ప్రాప్తినికలిగించునది పరలోకమునందును భోగములను కలిగింపవచ్చు నుగదా? అనిన, అట్లుకాదని ఈఅధికరణమున నిర్ణయించుచున్నారు.

సూ॥ ౩౨॥ యావదధికారమవస్థితిరాధికారికాణామ్ ॥

టీక॥ ఆధికారికాణాం = ధర్మరక్షణా ద్యధికారములయందు పరమేశ్వరునిచే నియోగింపబడిన వసిష్ఠ, సనత్కుమారాదులగు అధికారపురుషులకు, యావదధికారం = వారియధికారమున్నంతవరకు, అవస్థితిః = ఒకశరీరముతోగాని అనేక శరీరములతోగాని ఉంచుట, సంభవించుచున్నది.

తా॥ బ్రహ్మజ్ఞానముకలవారలకుకూడా సుఖదుఃఖ భోగములు కలవనుటయు పునర్జన్మముకలదనుటయు పొరబాటు. ధర్మ రక్షణము మొదలగు నధికారములయందు పరమేశ్వరునిచే నియోగింప బడియున్న వసిష్ఠసనత్కుమారాదులు ఈ విషయమున దృష్టాంతములు కానేరరు. జ్ఞానమువలన సంచితము ( ఫలమునియ్యవలసినకర్మ ) నశించుటచేతను ఆగామి ( ఉత్తరకాలమందు చేయ బడవలసినకర్మ బంధమును, కలిగింపలేకపోవుటచేతను ఫలమునిచ్చుట ప్రారంభించి యున్న ప్రారబ్ధకర్మమాత్రము ఫలానుభవము పూర్తియగునంతవరకు నశించుటకు వీలులేకపోవుటచేతను, జ్ఞానులుకూడ ప్రారబ్ధకర్మనశించుపర్యంతము శరీరము ధరించియే యుందురనుట సిద్ధాంతము. దీని ననుసరించిచూచిన పైన చెప్పిన వసిష్ఠ సనత్కుమారాదులు వారిప్రారబ్ధవశమున ధర్మరక్షణా ద్యధికారములయందు నియోగమును పొందియుండిన వారగుటచే ఆప్రారబ్ధఫలానుభవము ముగియునంతవరకు అనగా అధికారము పూర్తియగునంతవరకు అనేకజన్మముల నైనను ఎత్తుచునుండవలసినవారలే. కావున వసిష్ఠాదులజన్మను పట్టి బ్రహ్మజ్ఞానులకడవరకును పునర్జన్మము కలదనుట తప్పనియును నిర్గుణ విద్యలయందు ఈకారణము వలననే దేవయానమును సంగ్రహించుకొనుట యనావశ్యకమనియును తాత్పర్యము.

—(*) ౨౦. అక్షరధ్యధికరణమ్. (*)—

అవ॥ బృహదారణ్యకోపనిషత్తునందు " అస్థూలం అనణు ( పరబ్రహ్మ స్థూలుడుకాడు. అణుస్వరూపుడునుకాడు ) " అనుమొద

లగు కొన్నిగుణములను నిషేధించి పరబ్రహ్మము ఉపదేశింప బడియు న్నాడు. ముండకోపనిషత్తునందు "యత్తదద్రేశ్యమగ్రాహ్యం (చూచుటకుగాని ఇతర ఇంద్రియములచేత నే విధముగా నైనను గ్రహింప బడుటకుగాని వీలైనదికాదు.)" అనిబృహదారణ్యకోపనిషత్తునందు నిషేధింప బడని మఱికొన్నిగుణములు నిషేధింపబడియున్నవి. ఇందు నిషేధముల నన్నిటిని అన్ని స్థలములయందును సంగ్రహించు కొనవల యునా, లేదా. అనువిషయము ఈ అధికరణమున విచారింప బడు చున్నది.

సూ॥ ౩౩॥ అక్షరధియాంత్వవరోధస్సామాన్యతద్భావాభ్యా మౌపసదవత్తదుక్తమ్ ॥

టీక॥ సామాన్యతద్భావాభ్యాం = నిషేధవాక్యము లన్నియు ద్వైతమును నిషేధించి పరబ్రహ్మను ప్రతిపాదించుట సామాన్యమే యగుటవలనను, ప్రధానముగు బ్రహ్మయు సర్వస్థలముల యందును ఉండుటచేతను, అక్షరధియాం = పరబ్రహ్మమునుగూర్చి చెప్పు నిషేధ వాక్యములకు, ఉపసదవత్ = ఉపసదమంత్రములకు, (జామదగ్న్య చతూరాత్ర మనుయాగమునందు పురోడాశమును హోమముచేయు మంత్రములకు) వలె, అవరోధః=అన్ని సందర్భములయందును సంగ్ర హముకలుగును, తత్తు=అదిన్ని' ఉక్తం=పూర్వమీమాంస శాస్త్రము నందు చెప్పబడి యున్నది.

తా॥ నిషేధవాక్యములను అన్నిస్థలములయందును సంగ్రహించు కొనవలయును. ఆవాక్యములన్నియు నిషేధపూర్వకముగా (పర బ్రహ్మమునం దారోపింపబడియున్న నానావిధ భేదములను నిషేధించుటద్వారా) పరబ్రహ్మమునే ప్రతిపాదించుచున్నవనుట యథార్థముగదా. పై నిరూపించిన ధర్మము సామాన్యముగా నన్నిటియందు నుండుటచేతను ప్రతిస్థలము నందును పరబ్రహ్మము ప్రత్యక్షముగా చెప్పబడియే యుండుటచేతను ఆ ప్రకరణములు (నిషేధ వాక్యము లున్న ప్రకరణములు పరస్పర భిన్నము లనుటకు వీలులేదు. కావున ఉపసదమను యాగమునందువలె సర్వనిషేధములును సర్వబ్రహ్మవిద్య లయందును సంగ్రహించుకొనబడవచ్చును. ఎట్లనగా, జామదగ్న్య

చతూరాత్రమను యాగమునందు పురోడాశమును హోమము చేయ వలసిన ఉపసదమనునొక కర్మగలదు. అందుపురోడాశమును హోమము చేయునప్పుడు ప్రయోగింప బడవలసిన మంత్రములు సామవేదము నందున్నవి. యజ్ఞమునందు సామవేదమును చెప్పువానికి ఉద్గాతయని పేరు. పై చెప్పిన మంత్రములు చెప్పవలసినవాడు ఉద్గాత యేయని యేర్పడుచున్నను. పురోడాశమును హోమముచేయువాడు అధ్వర్యు డుకావునను ఆమంత్రములు పురోడాశమును హోమముచేయునప్పుడే ఉపయోగింప బడవలసినవి కావునను, అధ్వర్యుచే ఆ మంత్రములను చెప్పవలయునని సిద్ధాంతము చేయబడి యున్నది. ఈ ఉప సద యాగమునందు పురోడాశ శేషములగు ( పురోడాశ హోమమునం దుపయోగించు ) మంత్రములు పురోడాశ సంబంధముగల అధ్వర్యు నితో నెట్లు కూర్పబడియున్నవో అట్లు పరబ్రహ్మ శేషములగు నిషేధవాక్యము పరబ్రహ్మ సంబంధముగల ప్రతిప్రకరణమునందునుసంగ్ర హించు కొనబడవలయును. పూర్వమీమాంసా శాస్త్రమునందుకూడ " ప్రధానవస్తువునకును దాని శేషములకును ధర్మవిరోధము తటస్థించి నప్పుడు ప్రధానమునుబట్టి శేషమును అన్వయింపవలయును. (ప్రధానమున కెచ్చట సంబంధముగలదో శేషమునకుగూడ నచ్చట సంబంధముగలదని నిర్ణయింపవలయును. )" అని చెప్పబడియున్నది. దీనినంత యును విచారించిన నిషేధవాక్యములకు అన్ని ప్రకరణములయందును సంబంధము కలదనుటయే సిద్ధాంత మగునని తాత్పర్యము.

—(*) ౨౦. ఇయదామననాధికరణము. (*)—

అ॥ " ద్వాసుపర్ణాసయుజాసఖాయా । ఋతంపిబంతౌసుకృతస్యలోకే॥" అను శ్రుతులయందు చెప్పబడిన విద్య యొకటియా, భిన్నమా, ఆ రెండు స్థలములయందును చెప్పబడియున్న గుణములు పరస్పరము సంగ్రహించు కొనబడునా, లేదా, అను విషయము ఈ యధికరణమున విచారింపబడుచున్నది.

సూ॥ 34॥ ఇయదామననాత్ ॥

టీక॥ ఇయత్ = ఇంతఅని ( స్వల్ప పరిమాణమును ) ఆమననాత్ = చెప్పియుండుటవలన, ఉభయోరభేదః = అవతారిక యందు

చూపబడియున్న రెండుస్థలములయందును చెప్పబడియున్న విద్య లొకట్టి టియే.

తా॥ అవతారికయందు చూపబడియున్న రెండు ప్రకరణములను జీవానువాద పూర్వకముగా ( లోకసిద్ధుడగు జీవునిగూర్చి చెప్పి పరబ్రహ్మమునకును ఇతనికిగల కల్పితభేదము నిరూపించి ) పరమేశ్వరుని యథార్థస్వరూపమును తెలుపుటకై ప్రవర్తించుచున్నవి. వీటి రెంటికిని పరస్పరభేదములేదు. పరిచ్ఛిన్నత్వమును చెప్పుట, ఇరువురు కలరనుట, పరబ్రహ్మమునందు భేదమును చెప్పుట, అనునవి ఈ రెండు విద్యలయందును సమానమేగదా. కావున ఈ రెండు విద్యలు ఒకట్టి యే. వీనియందు చెప్పబడియున్న గుణములను ఒకదానినుండి మఱి యొకదానిలోనికి సంగ్రహించుకొనవచ్చును అని తాత్పర్యము.

—(*) ౨౨. అంతరత్వాధికరణమ్. (*)—

అవ॥ బృహదారణ్యకోపనిషత్తునందు ఉషస్తియు, కహోళుడును, అనుమహర్షులిద్దరు ఆత్మోపదేశమునకై యాజ్ఞవల్క్యుని ప్రశ్నచేసిరనియు ఆయన " పరబ్రహ్మము కార్యకారణములు లేనివాడు " అని ఉషస్తి మహామునికిని, ఆకలిదప్పుల నతిక్రమించినవాడు అని కహోళునకును సమాధానము చెప్పెననియు, రెండు ప్రకరణములచేత వరుసగా వర్ణింపబడియున్నది. పై రెండు ప్రకరణములయందును వర్ణింపబడియున్న విద్య ఒకట్టియా, భిన్నమా, అనువిషయము నీయధికరణమున విచారించువాడై మొట్టమొదట " పై రెండు ప్రకరణములయందును బ్రహ్మమునుగూర్చి వేరువేరువిధములుగా చెప్పబడియుండుటచేత అందుచెప్పబడిన విద్యలు పరస్పర భిన్నములైనవి అను పూర్వపక్షమును ఖండించుచున్నాడు.

సూ॥ 3౫॥ అంతరాభూతగ్రామ వత్స్వాత్మనః ॥

టీక॥ అంతరామ్నానాత్ = లోపలనున్నాడని చెప్పియుండుటవలన, విద్యైకత్వం = పైసూచింపబడిన రెండుప్రకరణములయందు నిరూపింపబడియున్నవిద్య యొకట్టియే, అన్యథా = అట్లుకాకపోయినట్లైతే, భూతగ్రామవత్ = పంచభూతములకు వలె, ఏకస్యాత్మ్యం, అన్యస్యఆపేక్షికంచ, ఆంతరత్వంస్యాత్ = ఒకడు ( ఒకక్షే

రణమునందు చెప్పబడిన యాత్మ ) ముఖ్యముగా సర్వభూతములయందును వ్యాపించి యున్నాడనియు, మఱియొకడు ( రెండవ ప్రకరణమునందు చెప్పబడినయాత్మ ) వానికంటె వేఱుగ సర్వమును వ్యాపించి యున్నాడనియు చెప్పవలసివచ్చును.

రెండవ అర్థము.

భూతగ్రామవత్ = " ఏకో దేవస్సర్వభూతేషుగూఢః ( ఒకఁడే ఆత్మయే సర్వభూతములయందును నిండియున్నాడు)" అను శ్రుతి యందువలెనె, అన్యథా = ఈరెండువిద్యలయందును కూడ, అంతరామ్నానాత్ = లోపలనున్నాడని చెప్పబడి యుండుటవలన, విద్యైక్యం = రెండుప్రకరణములయందును చెప్పబడియున్న బ్రహ్మవిద్యలొకటియే.

తా॥ అంతరాత్మ యని చెప్పబడిన రెండుప్రకరణములయందును ( ఉషస్తిబ్రాహ్మణము, కహోళబ్రాహ్మణము, ఈ రెంటియందును ) చెప్పబడియున్నవిద్య యొకటియే. ఆ రెండు స్థలములయందును పరబ్రహ్మము సర్వవ్యాపకుడని చెప్పబడి యున్నదిగదా. అందలి విద్యలు భిన్నములనినచో సర్వవ్యాపకులిద్దరున్నారని వలసి వచ్చును. అట్లుచెప్పినయెడల ఇద్దరును సర్వవ్యాపకులనుటకు వీలే లేకపోవును. ఒకడుప్రధానుడనియు వేఱొకడప్రధానుడనియు చెప్పవలసివచ్చును. లోకమునందు "పంచభూతములవలన శరీరములు పుట్టును." అనునప్పుడు " పృథివిముఖ్యము ( శరీరము నంతయును వ్యాపించియుండును ) దానితరువాత జలము, పిమ్మటఅగ్ని " ( ఇది భూలోక శరీరములనుగూర్చియే చెప్పబడుచున్నదని తెలిసికొనవలయును. ఇతరలోక శరీరములయందు వాయువు, అగ్ని, జలము, ముఖ్యములై యుండును. ) అని చెప్పవలసి వచ్చినట్లు పై రెండు విద్యలయందు చెప్పబడియున్న ఆత్మలనుగూర్చి కూడ చెప్పవలసి వచ్చును. రెండుస్థలములయందును సమానముగా సర్వవ్యాపకత్వము చెప్పబడియుండగా, ఒకయాత్మ ముఖ్యుడనియు రెండవయాత్మ ముఖ్యుడుకాడనియు చెప్పుట యుక్తియుక్తము యుండదుగదా, కావున పై రెండు ప్రకరణముల యందలి విద్యలును ఒకటియే యనవలయును. మఱియొక యర్థమును బట్టిచూచిన " ఏకో దేవస్సర్వ భూతేషుగూఢః "

అను శ్రుతియందు సర్వవ్యాపి యొకఁడేయని నిరూపింప బడియు న్నది. ఇట్లే ఇచ్చటకూడ నిరూపింప బడియుండ వలయును. లేకున్న శ్రుతులకు పరస్పర విరోధము వచ్చునుగదా. దీనినిబట్టి చూచినను, ఈ విద్యలు రెండు ఒకటిఅనియే చెప్పవలసివచ్చును. అని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పినయెడల "ఒకటే విద్యనుగూర్చి రెండుస్థల ములయందు చెప్పుటవలన ప్రయోజనమేమియు నుండదు. ఇవి రెండు విద్యలు అనిచెప్పుటకు కూడ వీలులేదు" అను ప్రశ్నలకు ఏమి సమా ధానము చెప్పెదరు. అనిన, చెప్పుచున్నాడు.

సూ॥ ౩౬॥ అన్యథాభేదానుపపత్తిరితిచేన్నోపదేశాంతరవత్॥

టీక॥ అన్యథా=అట్లుకాకపోయినయెడల ( రెండువిద్యలయం దును చెప్పబడుచున్న దేవత ఒకఁటియే అనినయెడల ) భేదానుప పత్తిః=ఇదియొకప్రకరణము, ఇదిమఱియొక ప్రకరణము అనుభేదముం డుటకే వీలులేదు, ఇతిచేత్ = అనేయెడల, న=అదిసరికాదు, కుతః= ఎందువలననగా, ఉపదేశాంతరవత్ =తత్వమసి" అనుమొదలగు ఉప దేశములయందువలె, అత్రాపి=ప్రస్తుత సందర్భమునందుకూడ, తత్సి ద్ధేః=భేదముసిద్ధించును.

తా॥ అవతారికయందు చూపబడిన పూర్వపక్షములు సరియైన వికావు. "( తత్వమసి = ఆ పరబ్రహ్మమేనీవు )" అనువిషయము ఛాందోగ్యోపనిషత్తునందు తొమ్మిదిమార్లు చెప్పబడియున్నది. ఎన్ని మార్లు చెప్పినను విషయమునకు భేదములేదు. "తొమ్మిదిమార్లుచెప్ప బడియున్నది" అను భేద వ్యవహారమునకు కూడ హానిలేదు. అట్లే ఇచ్చటకూడ విద్యలురెండు అను భేదవ్యవహారము కలుగవచ్చును. ఒక టే విషయము చెప్పబడియుండుటచే ఆరెండువిద్యలును పరస్పర భిన్న ములు కావనికూడ చెప్ప బడవచ్చును. కావున పై సూత్రమునందు చేయబడియున్న సిద్ధాంతమునకు భంగములేదని తాత్పర్యము.

—(*) ౨౩. వ్యతిహారాధికరణమ్. (*)—

అవ॥ ఐతరేయ శాఖయందు సూర్యుని యందున్న పురుషుడే నేను. నేనే ఆపురుషుడు అని చెప్పబడియున్నది. ఇచ్చట "జీవుడేపర బ్రహ్మము ( నేనేబ్రహ్మము )" అను విషయమునుమాత్రమే ధ్యానిం

చుచు పరబ్రహ్మమును ఉపాసింపవలయునా, లేక " జీవుడే బ్రహ్మము, బ్రహ్మమే జీవుడు " అను రెండువిషయములను ( దీనికి వ్యతిహారమని పేరు ) ధ్యానించుచు నుపాసింప వలయునా, అను విషయమును ఈయధికరణమున నిర్ణయించుచున్నారు.

సూ॥ ౩౭॥ వ్యతిహారోవిశింషంతిహీతరవత్ ॥

టీక॥ వ్యతిహార=వ్యతిహారము ( జీవుడే బ్రహ్మము, బ్రహ్మమే జీవుడు అనిపరస్పరము విశేషణ, విశేష్యభావము ) ఉపాస్యః= ఉపాసనచేయుతగినది ( అనగాపైనచెప్పిన రెండుధర్మములను ధ్యానించుచు పరబ్రహ్మమును ఉపాసింప వలయుననుట ) ఇతరవత్ = ఇతరములగు సత్యకామత్వాది గుణములనువలెనే, ఏనిమిహి= ఈ వ్యతిహారమునుకూడ, జాబాలాః=జాబాలశాఖవారు, విశింషంతిహి=వివరించుచున్నారుగదా ( పరబ్రహ్మ గుణములలో నొకదానినిగా చెప్పుచున్నారుగదా.)

తా॥ " జీవుడేబ్రహ్మము బ్రహ్మమేజీవుడు " అనురెండువిషయములను ధ్యానించుచు, పరబ్రహ్మమును ఉపాసింపవలయునుగాని, ఇందొకటి దానిని విడువరాదు. వేదమునందు ఈ రెండు విషయములను నిరూపింపబడి యుండుటచేత ఒకదానిని దేనిని విడచినను వేదమునకు విరోధమగును. మరియు జాబాలోపనిషత్తునందు పరబ్రహ్మమునకు కలవనిచెప్పబడు సత్యసంకల్పత్వాది గుణములతోబాటు " త్వంవాహామస్మి భగవోదేవతే, అహంవైత్వమసి భగవోదేవతే ( ఓ భగవంతుడగు బ్రహ్మమా, నీవనేను ఓ భగవంతుడగు పరమేశ్వరుడా, నేనేనీవు )" అనువాక్యములచే పైవర్ణించిన వ్యతిహారముకూడ చెప్పబడియున్నది. ఉపాసనార్థమై చెప్పబడుచున్న గుణములతోచేర్చి చెప్పియుండుటచేత ఈ వ్యతిహారముకూడ ఉపాసనార్థమై ఉద్దేశింపబడినదనియు దీనిలో నొకభాగమును విడుచుట యుక్తముకాదనియు పై వాక్యసందర్భమును బట్టి చూచిన తెలియవచ్చుచున్నది. కావున పై వ్యతిహారమును ధ్యానించుచునే పరబ్రహ్మమును ఉపాసింప వలయుననుట సిద్ధాంతము చేయబడి యున్నదని తాత్పర్యము.

—(*) ౨౪. నైవహిసత్యా ద్యధికరణమ్. (*)—

అవ॥ బృహదారణ్యకోపనిషత్తునందు "సయో హా హైతన్మహ ద్యక్షంవేదసత్యం । తద్య త్తత్సత్యం ( పూజ్యుడైన ఆ హిరణ్యగర్భుని నెవడు సత్యస్వరూపునిగా నెరుంగునో, ఆసత్యస్వరూప మెద్దియో దానిని )" అను రెండు వాక్యములచేతను చెప్పబడియున్న విద్య లొకటియా, భిన్నమా, రెండువిద్యలయందును ఫలములు వేరువేరుగా చెప్పబడియుండుటచేత ఈ రెంటికిని భేదమున్నట్లు కనుపడు చున్నది. కావున దీనియందలి యథార్థమేమి? అనువిషయమునుగూర్చి ఈ అధికరణమునందు విచారించుచున్నాడు.

సూ॥ ౩౮॥ నైవ హిసత్యాదయః ॥

టీక॥ విద్యా=ఉత్తరవిద్య ( రెండవవాక్యమునందు చెప్పబడియున్నవిద్య ) నైవహి=అదియేగదా, తస్మాత్= ఆ కారణమువలన, సత్యాదయః=సత్యాదిగుణములు, ఉపసంహర్తవ్యాః = రెండువిద్యల యందును సంగ్రహించుకొనవలసినవే.

తా॥ అవతారికయందు చూపబడిన రెండువాక్యములయందును చెప్పబడి యున్న విద్య యొకటియే. రెండవ వాక్యమునందు "తద్య త్తత్సత్యం" అనిపూర్వవిద్యయందు చెప్పబడియున్న హిరణ్యగర్భుడే పరామర్శ చేయబడి యున్నాడుకదా. ఉపాస్యదేవత ఒకడైయున్న ప్పుడు విద్యలకు భేదము కలుగనేరదు. ఫలభేదము ఒక విషయము గాదు. విద్యయొకటియై యున్నప్పుడు దానియందు చెప్పబడిన వన్నియును తత్ఫలములే యగునుగదా. కావున ఈరెండువిద్యల యందును కనుపడుచున్న గుణములను పరస్పరము సంగ్రహించు కొనవచ్చును. కావున ఆరెండువిద్యలలోను భేదమేమియు లేదని తాత్పర్యము.

—(*) ౨౫. కామాద్యధికరణమ్. (*)—

అవ॥ ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులందు హృదయ విద్య ( అనగా హృదయాకాశమును బ్రహ్మముగాను ఉపాసింపవలయునని యొకచోటను హృదయమునందున్న పరబ్రహ్మను తెలిసికొనవలయునని మఱియొకచోటను హృదయస్థానమునుగూర్చియుపదేశింపబడినవిద్య. ) పరస్పర భిన్నముగా చెప్పబడి యున్నది. ఈ రెండు

విద్యలయందును గల గుణములను ఒకచోటనుండి మఱియొక చోటికి సంగ్రహించుకొనవచ్చునా, కూడదా అను విషయమును ఈయధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౩౯॥ కామాదీతరత్ర తత్రచాయతనాదిభ్యః ॥

టీక॥ కామాది = ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడియున్న సత్యకామత్వాది గుణములు, ఆ యతనాదిభ్యః=హృదయస్థానము మొదలగునవి యొకటిగానే యుండుటవలన, ఇతరత్రచ=బృహదారణ్యకోపనిషత్తునందుకూడ, ఉపసంహర్తవ్యం = సంగ్రహించుకొనబడవలయును.

తా॥ ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడియున్న సత్యకామత్వము సత్యసంకల్పత్వము మొదలగు గుణములను బృహదారణ్యకోపనిషత్తునందును అబృహదారణ్యకోపనిషత్తునందు చెప్ప బడియున్న సర్వవశిత్వము ( అన్నిటిని వశపరుచుకొని యుండుట.) సర్వేశ్వరత్వము మొదలగు గుణములను ఛాందోగ్యోపనిషత్తునందును సంగ్రహించుకొనవలయును. హృదయస్థానమునుగూర్చి చెప్పుట ఉపాస్యదేవత సర్వప్రపంచ మర్యాదలకును సేతువువలె నున్నాడని చెప్పుటమొదలగు ధర్మములు పైరెండు విద్యలయందును ఒకటిగనే గదా. కావున ఈ రెండువిద్యలయందలి గుణములను ఒకదానినుండి మఱియొకదానికి సంగ్రహించుకొనవచ్చును. యథార్థస్థితిలో ఛాందోగ్యోపనిషత్తునందలి విద్య సగుణవిద్య, రెండవది నిర్గుణవిద్య. కావున ఈరెంటికిని వాస్తవమగు భేదము కలదు. ఇట్లున్నను విద్యాస్తోత్రార్థమై గుణములు సంగ్రహింపబడుటవలన విరోధములేదు. స్తోత్రము విద్యాభేదము ననుసరించి మార్పునొందదుకదా. అనుటయే సూత్రకారుని యభిప్రాయమని నిరూపింపవలసియున్నదని తాత్పర్యము.

—(*) ౨౬. ఆదరాదలోపాధికరణమ్, (*)—

అవ॥ ఛాందోగ్యోపనిషత్తునందు వైశ్వానరవిద్య కంగముగా ప్రాణాగ్నిహోత్రవిధి ( ప్రాణాహుతులు ) చెప్పబడియున్నది. జాబాలోపనిషత్తునందు అది మిక్కిలి ఆదరముతో వర్ణింపబడియున్నది. తనయగ్నిహోత్రమును ఉపాసింపకముందు ఇతరుల యగ్ని

హెూత్రమును ఉపాసించుట ఎట్లు యుక్తముగాదో. అట్లే తనప్రా ణాగ్ని హెూత్రములను ఉపాసించుట యుక్తముకాదని చెప్పుచు అతి థులకంటే కూడ ముందుగా తాను భోజనము చేయవలయునని చెప్పు చున్నదిగదా. ఇది విధికాకపోయినను " ప్రాణాగ్నిహెూత్రవిధినను ష్ఠించుట యత్యావశ్యకము " అని తిరిగిచేయు అర్థవాదము కావ చ్చును. మీసిద్ధాంతముకూడ నిట్లేకదా. కావున భోజనము చేయని నాడు ఈ ప్రాణాగ్ని హెూత్రమును అనుష్ఠింపవలయునా, అవసర ములేదా, అనుసంశయమునుగూర్చి ఈ యధికరణమున విచారించుచు మొట్టమొదట పూర్వపక్షమును అనువాదము చేయుచున్నాడు.

సూ॥ ౪౦॥ ఆదరాదలోపః ॥

టీక॥ ఆదరాత్ = జాబాలోపనిషత్తునందు అత్యాదరముగా చెప్పబడి యుండుటవలన, అలోపః = భోజనము చేయక పోయినను ప్రాణాగ్నిహెూత్రవిధికి లోపముకలదు.

తా॥ అవతారికయందు చూపబడిన ప్రకారముగా ప్రాణా గ్నిహెూత్రవిధి విషయమై జాబాలోపనిషత్తునందు అత్యాదరము చూపబడి యుండుటవలన ప్రాణాగ్నిహెూత్రవిధికి ఎప్పటికిని లోప ముకలుగదనియే చెప్ప వలసియున్నది. భోజనముచేయక పోయినను దానికి ప్రతినిధియగు ( భోజనము చేయని దినమున దానికి బదులుగా నుపయోగింప బడెడు ఫలములు మొదలగు ) పదార్థము చేతనైనను ప్రాణాగ్ని హెూత్రవిధిని జరుపవలయుననియే చెప్పవలసి వచ్చుచు న్నదని తాత్పర్యము. ( ఇది పూర్వపక్ష సూత్రము.)

అవ॥ పై పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతము చేయు చు న్నాడు.

సూ॥ ౪౧॥ ఉపస్థితేఽతస్తద్వచనాత్ ॥

టీక॥ ఉపస్థితే=భోజనము సమీపమునకు వచ్చినప్పుడే, అతః= ఆభోజనద్రవ్యమువలననే, ప్రాణాగ్నిహెూత్రం=ప్రాణాగ్ని హెూత్ర విధిని జరుపవలయును, కుతః=ఎందువలననగా, తద్వచనాత్=అట్లే శ్రుతియందు చెప్పబడి యుండుటవలన.

తా॥ " యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్తద్ధోమీయం ( ము

మొదటయే అన్నమువచ్చునో అదియే ప్రాణాగ్ని హోత్రమునకు ఉపయోగింప వలసినది. )" అనువాక్యముచేత శ్రుతియందు "భోజనముకొరకు ఏర్పడుచబడిన పదార్థమే ప్రాణాహుతులకు ఉపయోగింపవలయును-" అని చెప్పబడి యున్నది కావున భోజనము చేయునప్పుడే ప్రాణాహుతులుగాని అవిలేనప్పుడు లేదని యేర్పడుచున్నది. జాబాలోప నిషత్తునందు చెప్పబడియున్న ఆదర వచనము ప్రాణాహుతులు అత్యావశ్యకములని నిరూపించుటకై ఏర్పడుచున్నవని తెలిసికొనవలయును. కావున పై పూర్వోక్తము సరిగాదనియు భోజనము లేనప్పుడు ప్రాణాహుతులు లేవనుటయే సిద్ధాంతమనియు తాత్పర్యము.

—(*) ౨౭. తన్నిర్ధారణానియమాధికరణమ్. (*)—

అవ॥ కర్మాంగములైన ఉద్గీథము మొదలగు వానియందు ప్రాణాద్యుపాసనలుకలవు. అవికర్మాంగములేనా. లేక స్వతంత్రములా, అనువిషయము ఈయధికరణమున విచారింప బడుచున్నది.

సూ॥ ౪౨॥ తన్నిర్ధారణానియమస్తద్దృష్టేః పృథగ్ఘ్య ప్రతిబంధః ఫలం ॥

టీక॥ తద్దృష్టేః = శ్రుతియందగ్లు ( ప్రాణాద్యుపాసనలు కర్మాంగములు కాకుండకూడ నుండవచ్చునని ) చెప్పబడియుండుట వలన, తన్నిర్ధారణానియమః = ఆఉద్గీథము మొదలగువానియందలి ప్రాణాద్యుపాసనలకు కర్మాంగత్వ నియమములేదు. తాసాం = ఆ ఉపాసనలకు, అప్రతిబంధః=అడ్డములేకపోవుట ( అధికబలము కలిగియుండుట ) అను, ఫలం=ఫలము, పృథక్ =ప్రత్యేకముగా, కథితం హి=చెప్పబడియున్నదిగదా.

తా॥ " తేనోభౌ కురుతోయశ్చైన మేవం వేద, యశ్చనవేద ( పైచెప్పిన కారణమువలన ఈ ఉపాస్యదేవతయొక్క స్వరూపమును యథార్థముగా తెలిసికొనినవాడును, అట్లు తెలిసికొనని వాడును కూడ కర్మనుచేయుచున్నారు )" అను వాక్యముచేత ప్రాణాద్యుపాసనలను చేసినను చేయకున్నను పురుషునకు కర్మయందధికారము కలదని చెప్పబడియున్నది. ( ఉపాసనయనగా, విద్య దేవతయొక్క యథార్థస్వరూప పరిజ్ఞానము దీనిబట్టిచూచిన ఉపాసన కర్మకే

అంగముగా చెప్పవలసిన నియమము లేదనియు అది స్వతంత్రమే యని యు తెలియవచ్చుచున్నది. ఇదియునుగాక "యదేవవిద్యయాకరోతి ఏకర్మను దేవతాస్వరూప పరిజ్ఞానముతో (ఉపాసనతో) కూడ చేయునో అది బలవత్తరమగును" అను మొదలగు వాక్యములచేత ఉపాసనను కర్మాంగముగా నాచరించిన యెడల ఆకర్మ పూర్వమున కంటే అధికబలము కలదియగును. అని చెప్పబడియున్నది. ఈవిధ ముగా, "ఉపాసనల చేయుకున్నను కర్మలను చేయువచ్చును" అని యొకచోటను "ఉపాసనలతోకూడ చేయబడినకర్మ మిక్కిలి బలవం తమైనదగును" అని మరియొకచోటను చెప్పబడెయుండుటచేత ఉపా సనలకును కర్మలకును నిత్యసంబంధము లేదని సూచింపబడుచున్నది. అట్టి నిత్యసంబంధమే యున్నయెడల ఉపాసనా సహితములగు కర్మ లకు అప్రతిబంధ రూపమైన (అడ్డములేకపోవుట సంపూర్ణమగు స్వా తంత్ర్యము అను) ప్రత్యేకఫలమును చెప్పుటకు వీలుండదు గదా. కావున ఉపాసనలు కర్మాంగములుగా చెప్పబడియున్నను సంపూర్ణ ముగా స్వతంత్రములే (ఉపాసనలు కర్మాంగములని చెప్పుట అని త్యవిధియే) అని తాత్పర్యము.

—(*) ౨౮. ప్రధానాధికరణమ్. (*)—

అవ॥ సంవర్గవిద్యయందు ప్రాణోవావసంవర్గః, వాయుర్వా వసంవర్గః (ప్రాణమే సంవర్గము, వాయువే సంవర్గము) అని ఉపా స్యదేవతనుగూర్చి రెండు విధములుగా చెప్పబడియున్నది. ఇచ్చట వాయు ప్రాణములు రెండును ఒకటే తత్వమగుటచే అవి రెండు ఒక టియేయని చెప్పవలసినట్లు కనుపడుచున్నవి. అట్లు చెప్పుట యుక్త మా, అయుక్తమా, అను సంశయమును ఈయధికరణమున నివారిం చుచున్నాడు.

సూ ॥ ౪౩ ॥ ప్రధానవ దేవతదుక్తమ్ ॥

టీక॥ ప్రధానవత్ = పురోడాశప్రధానమునందువలె, అత్రాపి = ఈసంవర్గయందుకూడా, దేవతాభేదఏవ = దేవతలకు భేదముగ లదు. తత్ = దేవతయొకడేమైనను ధర్మభేదమువలన భేదమువచ్చు నని, ఉక్తం = పూర్వమీమాంసా శాస్త్రమునందు చెప్పబడియున్నది.

తా॥ అవతారికయందు చూపబడినరీతిగ ప్రాణము వాయువు ఈ రెంటను ఒకటియేయని చెప్పుట యుక్తముకాదు. తత్త్వమొకటి యైనను వానికి అధ్యాత్మ అధిదైవ భేదములు (శరీరమందుండుట దేవతలయందుండుట యనుభేదములు) కలవుగదా. కావున ఆరెంటికిని పరస్పరభేదముకలదు. ఇట్లు చెప్పుటచేత విద్య రెండు భేదములుగా నుండవక్కరలేదు. ఒక్కటే ఉపాస్యదేవతనే అధ్యాత్మ అధిదైవతము లందు భావింపవలయు ననుటవలన విద్యాభేదము కలుగవలసినంత యవసరముండదుగదా. పురోడాశ ప్రదానసమయమునందు దేవత ఇంద్రుడొక్కడేయైనను ఆయనకు చెప్పబడియున్న గుణభేదములను బట్టి (రాజగునింద్రునికంటె స్వరాజగు ఇంద్రుడు వేరు.) దేవతాభేదము చెప్పబడియున్నట్లే ప్రకృతసంవర్గ విద్యయందుకూడ వాయువొక్కడే ఉపాస్యదేవతయైనను అధ్యాత్మ అధిదైవత భేదములను బట్టి పరస్పరభేదము వర్ణింపబడినదని తెలిసికొనవలయును. వాస్తవముగా దేవతకు భేదములేకపోయినను గుణభేదములనుబట్టి కలుగవచ్చునని పూర్వమీమాంసయందుకూడ జైమినిమహాముని చెప్పియున్నాడు. దీనిననుసరించి చూచిన ప్రాణవాయువులకు భేదముకలదనుటయే సిద్ధాంతమని తాత్పర్యము.

—(*) ౨౯. లింగభూయస్త్వాధికరణమ్. (*)—

అవ॥ వాజసనేయశాఖయందలి అగ్నిరహస్యమునందు మనశ్చితుడు (మనస్సుచేత చేర్పబడినవాడు) అనుమొదలగు ననేకఅగ్నులు వర్ణింపబడియున్నవి. అది కర్మనుచెప్పు ప్రకరణమగుటచే దానియందు చెప్పబడియున్నయగ్నులు కర్మాంగములేయని యేర్పడుచున్నది. కొన్ని కొన్ని ఉత్తరవాక్యములనుబట్టిచూచిన నవి స్వతంత్ర విద్యలనికూడ తెలియవచ్చుచున్నది. ఇచట నిర్ణయమెట్లు? అను సంశయము నీయధికరణమున నివారించుచున్నాడు.

సూ॥ ౪౪॥ లింగభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి ॥

టీక॥ లింగభూయస్త్వాత్ =గురుతులధికముగా నుండుటవలన, మనశ్చిదాదయః=మనశ్చితుడు మొదలగునగ్నులు, స్వతంత్రాఏవ = స్వతంత్రములైనవే. (ఆ అగ్నులను గూర్చి చెప్పునవి స్వతంత్రవిద్యలే)

తత్=అగురుతు, బలీయోపి=ప్రకరణమునకంటే బలవత్తరముగదా, తదపి=ఈ విషయమున్ను, పూర్వమీమాంసాయాం=పూర్వమీమాం సాశాస్త్రమునందు, ఉక్తం=చెప్పబడియున్నది.

తా॥ అగ్ని రహస్యమునందు చెప్ప బడియున్న మనశ్చితుడు మొదలగునగ్నులు స్వతంత్రములేకాని కర్మాంగములు కావు. "యత్కించేమానిభూతాని మనసాసంకల్పయంతి ( ఈ సర్వ జంతువులు ను దేనిని సంకల్పించునో అదియే అగ్ని ) " సర్వదా సర్వాణిభూతాని విచిన్వంతి)" అనుమొదలగునవి మనశ్చితాదులు స్వతంత్రములనుటకు గురుతులు. అవి కర్మాంగములే అయినయెడల సర్వకాలములయందును చేర్చబడు ( ఉపాసింపబడు ) చుండుననుటకును భూతము లేదిసంకల్పించినను అదియెల్ల నగ్నియే యనుటకును వీలులేదు కదా. కావున ఈగురుతునుబట్టి చూచిన ఆయగ్నులు స్వతంత్రము లనియే చెప్పవలయును. ప్రకరణమును బట్టిచూచిన నాయగ్నులు కర్మాంగములనియే చెప్పవలసివచ్చునుగదా యనుటకువీలులేదు. ప్రకరణమునకంటే లింగము ( గురుతు ) బలవత్తరమైనది. పూర్వమీమాంసయందును ఈవిషయము విస్తరింప బడియున్నది. కావున మనశ్చితాదులు స్వతంత్రములేయనియు వానినిగూర్చి చెప్పుస్థలములు ప్రత్యేకవిద్యలేయనియు సిద్ధాంతముచేయబడెనని తాత్పర్యము.

అవ॥ ఇట్లు పైసూత్రముచే సిద్ధాంతమునుచెప్పి పూర్వపక్షమును చేయుచున్నాడు.

సూ॥ ౪౫॥ పూర్వవికల్పః ప్రకరణాత్స్యాత్క్రియా మానసవత్ ॥

టీక॥ ప్రకరణాత్=ప్రకరణమువలన, పూర్వవికల్పః= ఇదివరకు సిద్ధాంతము చేయబడియున్న మనోమయత్వరూపము, క్రియా = కర్మకుసంబంధించినదే, స్యాత్ =అగును, ఇదం = ఇది, మానసవత్ = ద్వాదశాహామనుక్రతువునందు చెప్పబడియున్న మానస పాత్రమువలె, జ్ఞేయమ్=తెలిసికొనవలయును.

తా॥ పైన చేసినసిద్ధాంతము సరియైనదికాదు. " ఇష్టకాభిరగ్నించినుతే ( ఇటికలచేత అగ్నిని కుప్పచేయుచున్నాడు ) " అను

సందర్భముచేత చెప్పబడియున్న మనశ్చితాద్యగ్నులు కర్మాంగములే కావలయునుగాని స్వతంత్రములగుటకు వీలులేదు. మనోమయత్వము చెప్పబడియున్నను అది పైచెప్పబడినకర్మకే రూపాంతరము కావచ్చునుగదా. ( అనగా సంకల్ప రూపముగా గూడ అగ్ని చయన మును చేయవచ్చునని చెప్పబడియుండవచ్చునుగదా, యనుట ) ఇట్లు కర్మం యందు మానసికములగు ప్రయోగములు ( మనస్సుతోనే కొన్ని పను లను చేయుట ) కూడ ననేకచోట్ల కనుపడుచున్నది. " అనయాత్వా పాత్రేణ సముద్రందరసయా ప్రాజాపత్యం మనోగ్రహం గృహ్ణామి ( ఓసముద్రుడా! నిన్ను భూమియను పాత్రచేత ప్రజాపతి దేవతగా గల మనోమయమగు పట్టును ఏర్పరచి గ్రహించెదను )" అనువాక్యముచేత ద్వాదశాహమను క్రతువునందు " మనోమయమగు పట్టుఅని ధ్యానరూపమగు గ్రహణము చెప్పబడియున్నదికదా. కావున ఈ మనశ్చితాదులు కర్మాంగములేయైనను వీనికిసంకల్పమయత్వముచెప్ప బడుటవలన విరోధములేదనియు పై సిద్ధాంతము యుక్తముగాదనియు తాత్పర్యము. ( ఇది పూర్వపక్షము. )

సూ॥ ४५॥ అతిదేశాచ్చ॥

టీక॥ అతిదేశాచ్చ = మొదటచెప్పబడియున్న ( ఇష్టకాభిర గ్నించినుతే అను వాక్యముచేత చెప్పబడియున్న ) అగ్నులయొక్క ధర్మములను ( ఈమనశ్చితాదులయందు ) ఆరోపించుటవలనకూడ. మనశ్చితాదయః క్రియాంగాని = మనశ్చితుదు మొదలగు నగ్నులు కర్మాంగములే.

తా॥ " ఇష్టకాభిరగ్నించినుతే " అను వాక్యముచేత చెప్పబడిన అగ్నియందలి ధర్మములు తావాన్ యావాన్ అసౌపూర్వః ( పూర్వమందు చెప్పబడిన యగ్నియెట్టిదో ఇప్పుడు చెప్పబడు చున్న అగ్నికూడ నట్టిదియే " అని మనశ్చితాదులయందు ఆరోపింప బడియున్నవి. ఒక కర్మయందే సంబంధపడి యుండకపోయినయెడల పరస్పర ధర్మాధ్యాసము కలుగదు గదా. కావున మనశ్చితాదులు కర్మాంగములే లింగము ప్రకరణమునకంటె బలవత్తరమైనదేయైనను అది ప్రస్తుతసందర్భమున అర్థవాదవాక్యములో నుండుటచే కేవలము

స్తోత్రపరమనియే చెప్పవలసియున్నదికాని మనశ్చితాదులను స్వతంత్రములను చేయు సామర్థ్యము గలదియని చెప్పుటకు వీలులేదు. కావున పైనచేయబడిన సిద్ధాంతము దోషయుక్తమని తాత్పర్యము. ఇదియును పూర్వపక్షమే.

అవ॥ పై పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ॥ ౪౭॥ విద్యైవతునిర్ధారణాత్ ॥

టీక॥ నిర్ధారణాత్తు= శ్రుతివలననే నిరూపణచేయబడియుండుటవలననైతే, విద్యైవ= మనశ్చితాదులువిద్యలే, (విద్యామయములే, స్వతంత్రములే యనుట.)

తా॥ "తేహైతేవిద్యాచిత ఏవ ( ఈమనశ్చితాద్యగ్నులు విద్యచేతనే [ జ్ఞానముచేతనే ] కూర్పఁతగినవి )" అను శ్రుతిచేత ఈ మనశ్చితాదులు విద్యామయములేకాని కర్మాంగములు కావని నిరూపింపబడియున్నవి. శ్రుతియందలి "ఏవకారము" ఈవిషయమును దృఢము చేయుచున్నది గదా. కావున మనశ్చితాద్యగ్నులు స్వతంత్రములేకాని కర్మాంగములనుటకు వీలులేదని తాత్పర్యము.

సూ॥ ౪౮ ॥ దర్శనాచ్చ ॥

టీక॥ దర్శనాచ్చ = శ్రుతివలనకూడ, మనశ్చితాదయః స్వతంత్రాః = మనశ్చితుడు మొదలగునవి స్వతంత్రములే.

తా॥ ౪౪ వ సూత్రమునందు చూపబడిన లింగమును ( గురుతును ) బట్టిచూచినను పైన చేయబడిన సిద్ధాంతమే దృఢమగుచున్నదని తాత్పర్యము.

అవ॥ ఈగురుతు మీసిద్ధాంతమును దృఢపరుప నేరదని ౪౬ వ, సూత్రమునందు చెప్పియున్నాముకదా, యనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౪౯॥ శ్రుత్యాదిబలీయస్త్వాచ్చనబాధః ॥

టీక॥ శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ = ఏవకారము మొదలగునవి ప్రకరణమునకంటె బలవంతము లగుటవలనకూడా, బాధః= సిద్ధాంతభంగము, న= లేదు.

తా॥ మఱియు పైన చూపబడియున్న ప్రకారము ఏవకారము లింగము "విద్యయాహైవైతఏవం విదశ్చితోభవంతి ( ఈమనశ్చితా ద్యగ్నులు వానియథార్థస్వరూపమును తెలిసికొనినవారికి జ్ఞానముచేత కూర్పబడినవి అగుచున్నవి )" అను వాక్యము ఇవి ప్రకరణమున కంటే బలవంతములగుటచేతకూడ మాసిద్ధాంతమునకు భేదములేదు. అర్థవాద వాక్యమునందుండుటచేత లింగమునకుగూడ స్తోత్రపరత్వమే యనుట సరికాదు. ప్రస్తుత అర్థవాక్యము అపూర్వవిషయమును ప్రతి పాదించునది యగుటచేతను, పైన నిరూపించిన శ్రుతునకు సమీప మునందే ఏవకారము మొదలగునవి యుండుటచేతను అగ్నులకు మన శ్చితాదులకు విద్యాత్వమును ( స్వతంత్రములుగా యుండుటను ) సంపాదించుననుటలో బాధయేమియును లేదు. ( అపూర్వ విషయ మనగా పూర్వమునందు చెప్పబడియున్నదానికంటే క్రొత్తదగువిష యము అని తెలిసికొనవలయును ) అట్టి అపూర్వవిషయమునుగూర్చి చెప్పునదియగుటచే ప్రస్తుత అర్థవాదవాక్యము అపూర్వ అర్థవాదవా క్యమేయని తెలిసికొనవలయును. కావున యెట్లు చూచినను మనశ్చి తాదులు కర్మాంగములు కానేరవని తాత్పర్యము.

సూ॥ ౫౦॥ అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతర పృథక్త్వవ
ద్దృష్టశ్చ తదుక్తం ॥

టీక॥ ప్రజ్ఞాంతరపృథక్త్వవత్ = శాండిల్యాది విద్యలకువలె, అనుబంధాదిభ్యః= అనుబంధము మొదలగు కారణమువలన, మనశ్చిదా దీనాం = మనశ్చితుడు మొదలగునగ్నులకు, స్వాతంత్ర్యమింవక్తవ్యం= స్వాతంత్ర్యము చెప్పవలయును' దృష్టశ్చ=ఇట్లు ఒకటే ప్రకరణము నందే చెప్పబడియున్న విషయములకు కూడ పరస్పర భేదము కలిగి యుండుట కర్మకాండయందు చూడబడుచే యున్నది. తదుక్తం=పూ ర్వమీమాంసా శాస్త్రమునందును, ఇట్లే చెప్పబడియున్నది.

తా॥ మఱియును ప్రస్తుత ప్రకరణము నందు '' మనసైవా ధీ యంత ( మనస్సుతో నాధానము చేయబడినది. )'' అను మొదలగు వాక్యములచేత మనశ్చివాది అగ్నులనుగూర్చి చేయవలసిన కర్మలన్ని యును మనస్సు మొదలగు వృత్తులతోనే చేయవలయునని చెప్పబడి

యున్నది. ఇది అనుబంధ మనబడును ౪౬ వ: సూత్రమునందు పూర్వపక్షిచే చూపబడిన "తావాన్ యావానథోపూర్వః" అనుమొదలగు అతిదేశము (మనశ్చిదాద్యగ్నులు కర్మాంగమగు నగ్నివంటివేయని చెప్పుట) కూడా సిద్ధాంతులకే యనుకూలము. అది మనశ్చిదాద్యగ్నులలో ప్రతియగ్నియు కర్మాంగాగ్నితో సమానమైనదేయని చెప్పుటచే నామనశ్చిదాదులకు స్వాతంత్ర్యము కలదనియే తెలియజేయుచున్నది కదా, ఇదియునుగాక పై సూత్రమునందు చెప్పబడిన హేతువులవలనకూడా ఈ విషయమునే నిర్ధారణ చేయుచున్నది. ఈయన్ని కారణముల వలనను మనశ్చిదాదులు స్వతంత్రములేయని చెప్పవలయును. ఏప్రకరణమందున్నను శాండిల్యాది విద్యలు కర్మకంటెను ఇతరవిద్యలకంటెను వేరని యొప్పుకొనబడుచున్నట్లు కర్మ ప్రకరణమందున్నను ఈ మనశ్చిదాదులు ఆకర్మలకంటే వేరనియే యొప్పుకొనబడవచ్చును. ఇట్లుభేదము కలవి యొక ప్రకరణమునందే చెప్పబడియుండుట యనేకచోట్ల ప్రత్యక్షమైయున్నది. క్షత్రియుడుమాత్రమే చేయవలసిన రాజసూయ యాగమును చెప్పుటకారంభించి యాప్రకరణమునందే బ్రహ్మక్షత్రియ వైశ్యులు ముగ్గురును చేయతగిన అవేష్టి యను యాగమునుగూర్చి శ్రుతియే చెప్పబడియున్నది ఇందు ఈఅవేష్టి యాగమునుగూర్చి నిర్ణయించునప్పుడు పూర్వమీమాంసాశాస్త్రమునందుకూడా పైన నిరూపించినట్లే (తగిన హేతువులున్నచో ప్రకరణమొకటియైనను అందు చెప్పబడియున్న విషయమునకు భేదముకలుగవచ్చుననియే) చెప్పబడియున్నది. కావున మనశ్చిదాదులు స్వతంత్రము లనుటయే యుక్తియుక్తమని తాత్పర్యము.

అవ॥ ౪౫ వ- సూత్రమునందు మనోమయమని చెప్పబడిన పాత్రమెట్లు కర్మాంగమో అట్లే ఈ మనశ్చిదాద్యగ్నులును కర్మాంగములేయని చేయబడియున్న పూర్వపక్షమును ఖండించుచున్నాడు.

సూ॥ ౫౦॥ నసామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువన్నహి లోకాపత్తిః ॥

టీక॥ సామాన్యాదపి= మానసిక పాత్రము మనశ్చిదగ్ని ఈ రెంటికిని మానసికత్వము (మనసువలనపుట్టుట) సమానమే యైనను,

న కర్మాంగత్వమ్ = ఆపాత్రమువలె నీయగ్ని కర్మాంగము కానేరదు. కుతః = ఎందువలననగా, ఉపలబ్ధేః = పైనచూపబడియున్న కారణములచే అగ్ని స్వతంత్రుడని నిశ్చయింపబడి యుండుటవలన, మృత్యువత్ = "సవఏవమృత్యుర్య్యఏష ఏతస్మిన్మండలే (ఈసూర్యమండలమందు ఏపురుషుడున్నాడో ఈతడే మృత్యువు) అను వాక్యముచే మృత్యువని చెప్పబడిన ఆదిత్యపురుషునకును మృత్యుదేవతకును మృత్యుశబ్దము సమానమైనను మిక్కిలి భేదమున్నట్లు, ఇదంయుక్తం = పైన చెప్పబడిన సిద్ధాంతముకూడా నిర్దోషమైనదియే, కించ = మఱియును, లోకాపత్తిః = ద్యులోకాదులగ్నులనుట (సమిధలు మొదలగునవి అగ్నికివలెనే ద్యులోకాదులకుకూడా కలవని పంచాగ్నివిద్యయందు చెప్పబడియున్నప్పటికిని ఆద్యులోకాదులు ప్రత్యక్షమగు నగ్నులేయనుట) నహి = సంభవింపదుగదా.

తా॥ మానసిక పాత్రమునకును ప్రస్తుతాధికరణమునందు విచారింపబడుచున్న యగ్నికిని మానసికత్వము సమానమైనను ఆపాత్రమువలె నీయగ్నికూడ కర్మాంగమగుటకు వీలులేదు. ఇంతకుపూర్వము నిరూపింపబడియున్న కారణములచే నీయగ్ని కర్మాంగముకాదని స్పష్టముచేయబడియే యున్నది కదా. దీనికనేక దృష్టాంతములు కలవు. "సవఏవమృత్యుర్య్యఏష ఏతస్మిన్మండలే పురుషః" అను వాక్యమునందు మృత్యువని చెప్పబడియున్న పురుషునకును మృత్యుదేవతకును మృత్యుశబ్దవాచ్యత్వము (మృత్యుశబ్దముచేత చెప్పబడుట) సమానమైనను వారిరువురకును అత్యంతభేదము గలదు కదా. మఱియు పంచాగ్నివిద్యయందు అగ్నిరూపముగా వర్ణింపబడియున్న ద్యులోకాదులును ప్రత్యక్షఅగ్నియు అగ్నిశబ్దవాచ్యత్వముచేతను (అగ్నిశబ్దముచేత చెప్పబడుటచే) సమిధలు మొదలగువానినిగూర్చి చెప్పబడియుండుటచేతను అభిన్నములే యగుటకు వీలుకాదుగదా. కావున యెట్లుచూచినను ఈమనశ్చిదగ్ని స్వతంత్రమైనదియేకాని కర్మాంగములలో చేరదని తాత్పర్యము.

సూ॥ ౫౩॥ పరేణచశబ్దస్యతాద్విధ్యంభూయస్త్వా
త్త్వనుబంధః ॥

టీక ॥ పరేణచ=పూర్వ పర బ్రాహ్మణములను (ప్రకరణము లను) బట్టిచూచినను, శబ్దస్య= మనశ్చిదాదులనుజెప్పు బ్రాహ్మణము నకుకూడ, తాద్విధ్యం=అవిధమే (విద్యనుగూర్చి చెప్పుటయే) కలదు. అనుబంధస్తు= కర్మను ఉపక్రమించి చెప్పుటయైతే, భూయస్త్వాత్= అనేకములగు కర్మావయవములు యిందు చెప్పబడవలసి యుండుటవ లన, భవతి= అగుచున్నది.

తా॥ ప్రస్తుతము మనమువిచారించుచున్న ప్రకరణమునకంటే ముందునను, వెనుకనుకూడ కేవలము విద్యనుగూర్చి చెప్పు (ఉపాస ననుగూర్చిచెప్పు) ప్రకరణములే యున్నవి. దీనివలన మధ్యనుండు ప్రస్తుతప్రకరణముకూడ విద్యనుబోధించునదియే యని చెప్పబడవలసి యున్నది. ఇట్లు చెప్పినయెడల ఈప్రకరణారంభమున కర్మనుపక్ర మించుటకు అర్థమేమి అందురేమో ఈమనశ్చిదాద్యగ్నులనుగూర్చి చెప్పువిద్యయందు కర్మాంగములగు ఆధానముమొదలగు ననేకములను చెప్పవలసియుండుటచేతను అట్లుపక్రమింపబడినదిగాని వేరేమియును లేదు. కావున అన్నివిధముల నీమనశ్చిదగ్ని మొదలగునవి స్వతంత్ర ములనుటయే సిద్ధాంతమని తాత్పర్యము.

—(*) ౩౦. శరీరేభావాధికరణమ్. (*)—

అవ॥ ఉపాసన మోక్షమునిచ్చుననుట సరికాదు. శరీరమున కంటే నితరుడగు నాత్మయే లేడుగదా. అను పూర్వపక్షమును ఈయ ధికరణమున బరిహరించువాడై మొట్టమొదట పూర్వపక్ష స్వరూప మును అనువాదము చేయుచున్నాడు.

సూ॥ ౫౩॥ ఏక ఆత్మనశ్శరీరే భావాత్ ॥

టీక॥ ఆత్మనః=ఆత్మకు, శరీరవ్యతిరేకః = శరీరమునకంటేభే దము, న=లేదు. కస్మాత్ =ఎందువలననన్నగా, శరీరేసత్యేవ=శరీరము న్నప్పుడే, చైతన్యధర్మాణాం= ఆత్మధర్మములని మీచేచెప్పబడుచున్న జ్ఞానముమొదలగునవి, భావాత్ =ఉండుటవలన, ఇత్యేకేవదంతి = అని కొందరు (లోకాయతమతస్థులు) చెప్పుచున్నారు.

తా॥ దేహమే ఆత్మ. ఎలయనగా? ఆత్మ ధర్మములని మీచే (వేదాంతులచే) చెప్పబడుచున్న తెలివిమొదలగునవి శరీరమున్న

వ్పుడే కనుపడునుగాని అదిలేనప్పుడు కనపడవుగదా. కావున అధర్మములన్నియు శరీరమునకే యున్నవని చెప్పవలయును. అనిలోకాయత మతస్థులు తలంచుచున్నారు. దీనికి సమాధానమేమి? యని తాత్పర్యము. (ఇదిపూర్వపక్షసూత్రము.)

అవ॥ పై పూర్వపక్షమును ఖండించుచున్నాడు.

సూ॥ ౫౪॥ వ్యతిరేకస్తద్భావాభావిత్వాన్నతూపలబ్ధివత్ ॥

టీక॥ నతు తదయుక్తం = ఈలోకాయతుల యభిప్రాయము సరియైనదికాదు, తద్భావాభావిత్వాత్ = శరీరమున్నను కొన్ని సమయములయందు (నిద్రామూర్ఛాదుల యందు,) చైతన్య ధర్మములు లేకపోవుటవలన, ఉపలబ్ధివత్ = విషయేంద్రియాదులను గ్రహించు జ్ఞానమునకువలె, దేహాత్మనోర్వ్యతిరేకః = దేహమునకును ఆత్మకును భేదము, యుక్తం = ఉచితము.

తా॥ లోకాయతికుల మతము సరియైనదికాదు. దేహమున్న ప్పటికిని నిద్రామూర్ఛాదిసమయములందు విషయము లను గ్రహించుట మొదలగు చేతన ధర్మము లేదుగదా. "నుతియు ఇది దేహము ఇప్పుడీ యింద్రియము ఈ విషయమును గ్రహించుచున్నది." అని తెలిసికొను తెలివి తెలియబడు నీ దేహేంద్రియాదులకంటె వేరని చెప్పి తీరవలయునుగదా. కావున ఆ ఉపలబ్ధి ఆశ్రయుడగు (అనగా జ్ఞానమే ధర్మముగా గలవాడని) వాడని చెప్పబడు ఆత్మగాడ దేహేంద్రియాదులకంటె వేరైనవాడె కావలయును. కావున శరీరమునకంటె నాత్మ భిన్నుడనియు ఈ కారణమువలన విద్య మోక్షము నిచ్చుననుటలో విరోధమేమియును లేదనియు తాత్పర్యము.

—(*) ౩౧. అంగావబద్ధాధికరణమ్. (*)—

అవ॥ సామవేదము ఐదువిధములు (దీనిని ఉద్గీథోపాసన విషయమునందు వివరించియున్నాము.) ఈ ఐదుశాఖలను పృథివి, అగ్ని, అంతరిక్షము, ఆదిత్యుడు, ద్యులోకము, అను నభిప్రాయములతో ఉపాసింపవలయునని చెప్పబడియున్నది. వేదమునందలి ప్రతిశాఖయందును సామమంత్రములు కలవుగాని పైన వర్ణింపబడి యున్నయుపాసనలనుగూర్చి మాత్రము చెప్పబడియుండలేదు.(సామ

మంత్రములు ఆ వేదములోని అయిదు శాఖలలో దేనిలోనైననొక దాని యందు చేరును. కావున ఆశాఖనుగూర్చి చెప్పబడి యున్న రీతిగా అనగా పృధివ్యాదులలో నేదోయొక రూపముతో నా మంత్రమును ఉపాసనచేయవలసి వచ్చునని తెలిసికొనవలయును ) ఇప్పుడు ఒక శాఖయందు చెప్పబడియున్న విధమున నన్నిశాఖలయందును కనుపడు సామ మంత్రములను ఉపాసింపవలయునా, లేదా, అను విషయమును ఈ యధికరణమున నిర్ధారణ చేయుచున్నాడు.

సూ॥ ౫౫॥ అంగావబద్ధాస్తునశాఖాసుహిప్రతివేదం ॥

టీక॥ ప్రతివేదం= అన్ని వేదములయందును, అంగావబద్ధాః= ఉద్గీథాది అవయవములనుగూర్చి చెప్పబడిన, ఉపాసనాస్తు=ఉపాసన లైతే, నశాఖాస్వేవ = శాఖలయందుమాత్రమే స్థిరములైయుండవు ( అనగా అన్ని శాఖలయందును అనువర్తించుననుట,) కుతః = ఎందు వలననగా, శ్రుత్యవిశేషాదిహి= శ్రుతియందు భేదమేమియు లేకుం డుటవలన.

తా॥ ఉద్గీథాదులనుగూర్చి చెప్పబడిన యుపాసనలు అన్నిశా ఖలయందును అనువర్తించుచుండునుగాని స్వశాఖయందు మాత్రమే స్థిరములైయుండవు. ( అనగా ఒకశాఖయందు ఉపాసనలు చెప్పబడి యుండిన ఆశాఖయందుండు మంత్రములను మాత్రమే అట్లుఉపాసింప వలయుననుట నియమముకాదు. ఏశాఖయందున్నను ఒకశాఖయందు చెప్పియున్న ఉపాసనాక్రమముతో నుపాసింపవచ్చును. అనుట ) ఏల యనగా " ఉద్గీథముపాసీత " అను మొదలగుశ్రుతులు ''ఉద్గీథశాఖా గత మంత్రము లెచ్చటనున్నను దాని నంతరిక్షదృష్టితో నుపాసింప వలయును " అనిచెప్పుచున్నవిగాని " ఈశాఖయందున్న ఉద్గీథమంత్ర ములను మాత్రమే ఇట్లుపాసింపవలయును " అని భేదమును చెప్పుట లేదుగదా. కావున ఈ యుపాసనలు సర్వ శాఖలయందును సంగ్ర హించుకొనబడ వలసినవేయని తాత్పర్యము.

అవ॥ పై విషయము నిర్ణయించుటకై యొక దృష్టాంతమును జూపుచున్నాడు.

సూ॥ ౫౬॥ మంత్రాదివద్వాఽవిరోధః॥

టీక॥ మంత్రాదివద్వా = మంత్రము మొదలగువానివలె, ఉపాసనానామపి=ఉపాసనలకుకూడా, అన్యత్రోపసంగ్రహః=ఇతరశాఖలయందు ఉపసంహరించుకొనుటలో, అవిరోధః=విరోధములేదు.

తా॥ ఒకశాఖయందు చెప్పబడియున్న మంత్రములును ప్రయాజలు ( యజ్ఞమునందు ఒకసందర్భమున నుపయోగింపబడు విధులు ) ను మనయొక్క శాఖలోనికి సంగ్రహించుకొనబడు చున్నవి గదా. ఇట్లే ఒకశాఖయందు చెప్పబడియున్న యుపాసనలు కూడా మఱియొకశాఖలోనికి సంగ్రహించుకొనవలయు ననుటలో విరోధమేమియును లేదు. కావున పైసూత్రమునందు చేయబడిన సిద్ధాంతము నిర్దోషమైనదే యని తాత్పర్యము.

—(*) ౩౭. భూమజ్యాయస్త్వాధికరణమ్. (*)—

అవ॥ వైశ్వానర విద్యయందొకచోట సూర్యుని ద్యులోకము మొదలగువానియందు అగ్నిదృష్టిచే నుపాసన చేయవలయునని చెప్పబడియున్నది. మఱియొకచోట సన్నిటియందును అగ్నిదృష్టి నుంచవలయునని సమస్తోపాసన చెప్పబడి యున్నది. ఈ రెండు విషయములలోను శ్రుతి కభిప్రాయమెద్ది? అను విషయమును ఈ యధికరణమున విచారించుచున్నాము.

సూ॥ ౫౭॥ భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథాహి దర్శయతి ॥

టీక॥ క్రతువత్=యజ్ఞమునకువలె, భూమ్నః= సమస్తోపాసనకే, జ్యాయస్త్వం= ప్రధానత్వముకలదు, తథా=అప్రకారమే, దర్శయతిహి=శ్రుతి చెప్పుచున్నదిగదా.

తా॥ సర్వావయవ సంపూర్ణుడైన వైశ్వానరుని ఉపాసింపవలయునని చెప్పుటయే వేదమునకు ముఖ్యోద్దేశముగాని అవయవములను ప్రత్యేకము నుపాసించుమని చెప్పుటగాదు. ఎన్ని అవయవముల విధించినను సర్వావయవత్వముగు దానిని (క్రతువును) చేయవలెననియే యభిప్రాయముండునుగాని ఒక్కొక్క యవయవమును గూర్చి మాత్రమే ఉపాసనాదులను చేయవలయునని యభిప్రాయముండదు. గదా. కావున అవయవములు ననేకములవిధించినను ప్రధానమగు యజ్ఞమునే ఆచరింపవలయుననుటయే శ్రుతికి ముఖ్యోద్దేశమని ఎట్లు నిశ్చ

యింపవలయునో అట్లే ప్రస్తుత వైశ్వానర విద్యయందునుకూడా సమ స్తోపాసనయే వేదాభి ప్రాయమని నిర్ణయింప వలసియున్నది. ఇది యునుగాక వేదము ఈ విషయమును “ మూర్ధా తేవ్య పతిష్యద్యన్మాం నాగమిష్య ( నీవు నాయొద్దికి రాకున్న యెడల నీశిరస్సు పడిపోవును.) అనువాక్యముచేత స్పష్టముగ తెలియజేయుచున్నది. నన్ను అని చెప్పి నప్పుడు నా అవయవము అని అర్థము చేయుటకు వీలు లేదు కదా. కావున సమస్తోపాసనయే వేదాభిప్రాయమని తాత్పర్యము.

—(*) ౩౩. శబ్దాదిభేదాధికరణమ్. (*)—

అవ॥ సగుణబ్రహ్మను ఉపాసన చేయవలెనని చెప్పు విద్యలు అనేకములుకావు. ఈవిద్యలన్నిటికిని ఉపాస్యదేవత సగుణ బ్రహ్మ యొక్కడే కావున ఇది పరస్పరము భిన్నములని చెప్పుటకు వీలు లేదు. ఈవిషయమున నిశ్చయమెట్లు? అనిన ఈ యధికరణమువందు సమా ధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౫౮॥ నానాశబ్దాదభేదాత్ ॥

టీక॥ శబ్దాదిభేదాత్ =విధులనుచెప్పుశబ్దములును ఉపాస్యులను గా చెప్పుదేవతలును వీరికి పరస్పరము భేదముండుటవలన, విద్యాః= ఉపాసనలు, నానా= పరస్పరము భిన్నములైనవే.

తా॥ సగుణబ్రహ్మయొక్కడే యుపాస్యదేవతయైనను విద్య లకు పరస్పరమభేదముండదు. ఉపాసనచేయవలయును. తెలిసికొనవ లయును. అను మొదలగు విధిభేదములును “ మనోమయత్వాది గుణ ములుగలవాడు. హృదయము మధ్యమునందు ఆకాశమువలె నున్న వాడు ” అనుమొదలగు గుణభేదములు చెప్పబడియుండుటచే ఆయా గుణములతోగూడిన యుపాస్యదేవతలకు పరస్పరభేదములును కను పడుచున్నవిగదా. పైన వర్ణించిన విధముగా విధులయందును దేవ తలయందు పరస్పరభేదము కనుపడుచుండ ఆదేవతలనుగూర్చి చెప్పు విద్యలకభేదమెట్లు వచ్చును. కావున దేవతలందరియందును సగుణ బ్రహ్మత్వము (గుణసహితుడగు బ్రహ్మగానుండుట ) సమానముగానే యున్నను ఆయాస్థలములయందు చెప్పబడియున్న గుణభేదములను

అనుసరించి యెట్లు భేదముకలదో అట్లే దేవతాభేదము ననుసరించి విద్యలకుకూడ పరస్పరభేదము కలదని తాత్పర్యము.

—(*) ३४. వికల్పాధికరణమ్. (*)—

అవ॥ విద్యలలో పరస్పరము భేదముకలదని పై యధికరణము నందు సిద్ధాంతము చేసియున్నారుగదా. అందు ఉపాసకుడు తాని జీవితపర్యంతము ఏదో ఒక్క విద్యనుమాత్రమే అనుష్ఠానము చేయు చుండవలయునా, లేక రెండుమూడు విద్యలను అనుష్ఠింపవచ్చునా, అను విషయము ఈ అధికరణమున సిద్ధాంతము చేయబడుచున్నది.

సూ॥ ५८॥ వికల్పోఽవిశిష్టఫలత్వాత్ ॥

టీక॥ అవిశిష్టఫలత్వాత్=సమానమైన ఫలములు కలవగుట వలన, విద్యానామనుష్ఠానే= విద్యల ననుష్ఠించుటయందు, వికల్పః= వికల్పమే, ( దేనినో యొకదాని నాచరింపవలయునేగాని అన్నిటిని ఆచరింపనక్కర లేదనుట. )

తా॥ ఉపాసనలకన్నిటికిని ఫలమొక్కటియే, ఉపాస్యదేవతను ప్రత్యక్షముచేయుట. కావున ఉపాసకుడు వానిలో దేనినో యొక దానినిమాత్రము అనుష్ఠించినను. ఒకదానిచేతనే కావలసినఫలముగలుగుచుండగా రెండుపాసనల ననుష్ఠించుటవలన ప్రయోజనముం డదుగదా. “ తం యథా యథోపాసతే తదేవ భవతి ( అర్జునుడా ! ఏ, ఏ, దేవతను ఉపాసించువాడు ఆయా దేవతను చెందును ) ” అనియెడి శ్రుతివాక్యముకూడ ఒక్కవిద్యనే ఉపాసింపవలయు ననువిషయమున ప్రమాణమగుచున్నది. కావున రెండుమూడువిద్యలను ఉపాసనచేయ వలసినపనిలేదని తాత్పర్యము.

—(*) ३५. కామ్యాధికరణమ్. (*)—

అవ॥ పై యధికరణమునందలి సిద్ధాంతమును అనుసరించి కామ్యోపాసనల ( దేవతాసాక్షాత్కారముకొరకైగాక యేదియో యొక్కకోరిక సిద్ధించుటకై చేయబడునుపాసనల ) విషయమునందు కూడ ఒక్కొక్కటిగా చేయవలయునా, లేక రెంటిమూటిని చేర్చి చేయవచ్చునా, అను సంశయమురాగా దానిని ఈ యధికరణమున నివారించుచున్నాడు.

సూ॥ ౬౦॥ కామ్యాస్తుయథాకామం సముచ్చీయేరన్నవాపూర్వహేత్వభావాత్ ॥

టీక॥ కామ్యాస్తు=కామ్యోపాసనలైతే, యథాకామం=స్వేచ్ఛగా, సముచ్చీయేరన్=చేర్పవచ్చును. నవా = చేర్పకున్నను చేర్పకుండవచ్చును. కస్మాత్=ఎందువలననగా, పూర్వహేత్వభావాత్=పైయధికరణమునందు చెప్పబడియున్న కారణములేకపోవుటవలన.

తా॥ కామ్యోపాసనలుకూడ పై యధికరణమునందు చేయబడియున్న సిద్ధాంతము ననుసరించి యొక్కొక్కటిగానే అనుష్ఠింపబడవలయునని సందేహింపవలసిన పనిలేదు. అవి దేవతను ప్రత్యక్షముచేయుటయను సమానఫలము ( అన్నిటికి నొక్కటేఫలము ) లేనివగుటచేతను ప్రత్యేకముగా భిన్నములగు కోరికలను సిద్ధింపచేయునవియగుటచేతను పైనియమము వీనియందుండవలసిన యవసరములేదు. ఒకదానిని ఉపాసించువాడు మఱియొకదానినికూడ నుపాసించినను వీటియందు నిరర్థకత్వముగలుగదుకదా. ఒకకోరికసిద్ధించుటకై ఒకదానిని మఱియొకకోరికకై వేరొకదానిని ఇట్లెన్నిటి నొక్కమారు ఉపాసించినను విరోధముండదు. కావున కామ్యోపాసనల నెన్నిటినైనను కలిపి ఉపాసనచేయవచ్చును. లేక నొక్కదానినైనను అనుష్ఠింపవచ్చును. ఈవిషయమున నియమములేదని తాత్పర్యము.

—(*) ౩౬. యథాశ్రయాధికరణమ్. (*)—

అవ॥ కర్మాంగములగు ఉద్గీథాదుల నాశ్రయించి చెప్పబడియున్న యుపాసనలు సముచ్చయముచేసియే ( చేర్చియే ) అనుష్ఠింపబడవలయునా, లేక, నవియును ౩౪ వ, అధికరణమునందు చేసిన సిద్ధాంతప్రకారము ప్రత్యేకముగానే అనుష్ఠింపబడవలయునా, అను సంశయమును ఈ యధికరణమున నివారించువాడై మొట్టమొదట పూర్వపక్షమును అనువాదము చేయుచున్నాడు.

సూ॥ ౬౧ ॥ అంగేషుయథాశ్రయభావః ॥

టీక॥ అంగేషు = ఉద్గీథము మొదలగు కర్మాంగములయందు, విహితోపాసనానాం = విధించబడిన యుపాసనలకు, యథాశ్రయ

భావః= ( అఉపాసనలకు ) తమకాశ్రయములగు ఉద్గీథాదులవలె నుండుటః స్యాత్ =కలుగవచ్చును.

తా॥ ఉద్గీథాదులను ఆశ్రయించి విధింపబడిన యుపాసనలు స్వయముగా కర్మాంగములు కాకపోయినను వానికాశ్రయములగు ఉద్గీథాదులు కర్మాంగములు గావున వానివలెనే సముచ్చయముతో ననుష్ఠింపబడవచ్చును. (అనగా ఉద్గీథాదులను కర్మలతోచేర్చి యనుష్ఠించునట్లే వానినాధారముచేసి చెప్పబడిన యుపాసనలనుగూడ వానితోచేర్చి యనుష్ఠింపవచ్చుననుట.) కావున కర్మాంగోపాసనలకు స్వాతంత్ర్యము లేదని తాత్పర్యము. ( ఇది పూర్వపక్షసూత్రము. )

సూ॥ ౬౨॥ శిష్టేశ్చ॥

టీక॥ శిష్టేశ్చ=విధించుటవలనకూడను, తాసాం సముచ్చయానుష్ఠానం = ఆ ఉపాసనలను సముచ్చయముతోనే చేయవలయును.

తా॥ కర్మల నాధారముచేసి వానియంగములెట్లు విధింపబడి యున్నవో అట్లే ఈ ఉపాసనలుకూడ కర్మాంగముల నాధారము చేసి విధింపబడియున్నవి. కావున ఒకచోట చెప్పబడిన యంగముల నైనను మఱియొకచోటనుండి సంగ్రహించి కర్మలతో నట్లు జేర్తురో అట్లే ఈఉపాసనలనుకూడా సముచ్చయముతో ననుష్ఠింపవలయు ననుట నియమమని తోచుచున్నది. విధించుట గాను బలము గాననేకదా అంగకర్మలకు సముచ్చయము కలిగియున్నది. ప్రస్తుత ఉపాసనల యందుకూడ ఆవిధి సమానమేగదా. కావున ఈవిధివలనకూడకర్మాంగములయందు విధింపబడిన ఉపాసనలు సముచ్చయముతో చేయబడవలసినవేయని యేర్పడుచున్నదని తాత్పర్యము. ( ఇదియును పూర్వపక్షసూత్రమే. )

సూ॥ ౬౩॥ సమాహారాత్ ॥

టీక॥ సమాహారాత్ = పరస్పర సంబంధమువలనకూడ, ఏవమేవ=పైనచెప్పినవిషయమే సిద్ధాంతమని తెలియుచున్నది

తా॥ " వేదమునందు ప్రణవమును, ఉద్గీథమును, రెండునొకటియేయని తెలిసికొనిన ఉద్గాత (సామగానమును చేయువాడు) తనకర్మయందు ప్రమాదమువలన లోపము కలిగినను చక్కజేసికొ

నును. అనిచెప్పబడియుండుటచేత ఉద్గీథాదులను ఆశ్రయించియున్న ఉపాసనలుకూడ సముచ్చయముతో నుపాసింపవలసినవేయని సూచింపబడుచున్నది. ఎట్లనగా, ఉద్గాత అనుష్ఠింపవలసిన ఉద్గీథము సామవేదమునందు చెప్పబడియున్నది. హోత (ఋగ్వేదమును జెప్పుచు హోమము నాచరించువాడు) ఆశ్రయించినట్టి ఓంకారము ఋగ్వేదమునందు జెప్పబడియున్నది. ఈ రెండునొకటియేయని తెలిసికొనినచో హోతచేయుకర్మ చక్కగనున్న కారణముచేతను తానుచేయు నుద్గీథమునకును హోతయాశ్రయించిన ఓంకారమునకును భేదము లేకపోవుటచేతను ఉద్గాత తానొనర్చినకర్మమునందు లోపమున్నను అదిసరియైనదేయని తెలిసికొనును. ఇట్లుచెప్పుటచేత వేరు వేరు వేదములయందు చెప్పబడియున్నను అంగములకు పరస్పరమైక్యము కలదని తెలియుచున్నది. దీనినిబట్టిచూచిన ఉపాసనలకుకూడ వాని వానికాశ్రయములగు నంగములతో సముచ్చయమున్నదనియే చెప్పవలసివచ్చుచున్నది. వేరు వేరు వేదములలో చెప్పబడియున్న అంగములవలెనే ఒకవేదమునందు చెప్పబడియున్న యంగముతో మఱియొకవేదమునందు చెప్పబడియున్న ఉపాసనలకుకూడ సంబంధము కలదుగదా. కావున ఇంతకుపూర్వము చెప్పబడినదియే సిద్ధాంతమని యేర్పడుచున్నదని తాత్పర్యము. (ఇదియును పూర్వపక్షసూత్రమే.)

సూ॥ ౬౪॥ గుణసాధారణ్య శ్రుతేశ్చ ॥

టీక॥ గుణ=ఉపాసనకాశ్రయమగు ప్రణవము, సాధారణ్య= మూడువేదములయందును సమానమేయని, శ్రుతేశ్చ= శ్రుతియందు చెప్పబడియుండుటవలనకూడా, ఏవమేవ=పైన చెప్పినదియే సిద్ధాంతము.

తా॥ ఉపాసన కాశ్రయమగు ప్రణవము అన్ని వేదములయందును సమానమేయని (సంగ్రహించుకొనవలసినదియేయని) చెప్పబడియున్నది. దీనినిబట్టిచూచిన ఆప్రణవము నాశ్రయించివిధింపబడిన యుపాసనలుకూడ సంగ్రహించుకొనబడవలసినవేయని చెప్పవలసివచ్చుచున్నది. కావున ఉద్గీథాదులగు నంగములను ఆశ్రయించివిధింపబడిన యుపాసనలు సముచ్చయముతో ననుష్ఠింప బడవలసినవేయని తాత్పర్యము. (ఇదియును పూర్వపక్షసూత్రమే.)

అవ॥ ఈ పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ॥ ౬౫॥ నవాతత్సహాభావాశ్రుతేః ॥

టీక॥ అథవా = అట్లుగాకపోయినయెడల (అట్లుకాదనుట.) తత్సహాభావాశ్రుతేః= ఆ ఉపాసనలు సముచ్చయముతో ననుష్ఠింపబడవలయుననుట శ్రుతియందు లేకపోవుటవలన, తన్న= పైనచేసినపూర్వపక్షము సరియైనదికాదు.

తా॥ పైనచేసిన పూర్వపక్షము యుక్తియుక్తమైనదికాదు. ఆశ్రయములగు కర్మలతోచేర్చి సముచ్చయముగా అంగముల ననుష్ఠింపవలయునని శ్రుతియందున్నదికాని అంగములతోచేర్చిఉపాసనల నాచరింపవలయునని లేదుకదా. కావున ఉపాసనలు స్వతంత్రములేయని తాత్పర్యము.

సూ॥ ౬౬॥ దర్శనాచ్చ ॥

టీక॥ దర్శనాచ్చ= శ్రుతివలనకూడ, ఏవమేవ = పైసూత్రమునందు చెప్పినదియే సిద్ధాంతము.

తా॥ "ఏవంవిద్ధవై బ్రహ్మా యజ్ఞం యజమానం సర్వాంశ్చ ఋత్విజో భిరక్షతి (ఈవిధముగా విద్వాంసుడగు బ్రహ్మ) [బ్రహ్మ యనగా యజ్ఞమునందు ఋత్విక్కులు చేయునట్టి కార్యములనుచూచుచుండుటకై నియమింపబడు పురుషుడు] యజ్ఞమును, యజమానుని, ఋత్విక్కులను రక్షించుచున్నాడు)" అని వేదమునందు చెప్పబడియున్నది. దీనివలన ఈ బ్రహ్మ ఉపాసకుడని తెలియుచున్నది. ఉపాసనయన్నను విద్యయన్నను ఒక్కటియే యగుటచేత ఉపాసకుడన్నను విద్వాంసుడన్నను ఒక్కటియేగదా. దీనివలన ఉపాసనలు సముచ్చయముతో ననుష్ఠింపబడవలసిన పనిలేదని స్పష్టమగుచున్నది. కర్మలనొనర్చు యజమానుడు మొదలగువారే వాని యంగములతో కూడ తదాశ్రితములగు నుపాసనల నాచరించి విద్వాంసులగుదురేని బ్రహ్మతోనే పని యుండదు గదా. కావున యెట్లు చూచినను ఉపాసనలు సముచ్చయముతో నాచరింపవలసినవి కావనుటయే సిద్ధాంతమని తాత్పర్యము.

సర్వవేదాంతప్రత్యయసారంప ట్ త్రింశత్షష్టిః॥ ౩౬॥ ౬౬॥

సర్వవేదాంతో, పసంహారో, న్యథాత్వే, వ్యాప్తే, స్సర్వా భేదా, దానందాదయ, ఆధ్యానాయా, త్మగృహీతిః, కార్యాఖ్యానా, త్సమాన, స్సంబంధా, త్సంభృతి, పురుషవిద్యాయాం, వేధాద్యర్థ, హానౌ, సాంపరాయే, గతే, రనియమో, యావదధికార, మక్షరధీ యాం, మియదామనన, దంతరాభూతగ్రామ, వ్యతిహార, స్సైవహి, కామాద్యా, దదరాదలోప, స్తన్నిర్ధారణానియమః, ప్రధానవ, ల్లింగభూయ, ఏకఆత్మనోం, గావబద్ధాస్తు, భూమ్నో, నానాశబ్దాది, వికల్పః, కామ్యా, అంగేషు యథాశ్రయభావష్ట త్రింగ్ శత్॥ ౩౬॥

ఇతి బ్రహ్మసూత్రే తృతీయస్యాధ్యాయస్య తృతీయపాదః.

ఇట్లు తృతీయాధ్యాయమునందు తృతీయపాదము,

ముగిసెను.

ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

౯నమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## తృతీయాధ్యాయము - చతుర్థపాదము.

—(*) ౧, పురుషార్థాధికరణమ్. (*)—

అవ॥ పూర్వపాదమునందు బ్రహ్మవిద్య నెచ్చట నున్నను పరస్పరము గుణసంగ్రహముకలదని నిరూపించుటచేత వాని పరిమాణము స్పష్టము చేయబడియున్నది. ఇక నీ పాదమునందు ఆవిద్యలు స్వతంత్రముగానే మోక్షము గలిగింప గలవని నిర్ణయింప బడును.

అందుమొట్టమొదట బ్రహ్మవిద్య కర్మాంగ మగునా, కాదా, యను సంశయము ఈయధికరణమునందు విచారింప బడుచున్నది.

సూ॥ ౧॥ పురుషార్థోతశ్శబ్దాదితిబాదరాయణః ॥

టీక॥ అతః=ఈబ్రహ్మజ్ఞానమువలన, పురుషార్థః = మోక్షము కలుగును. కుతః=ఎందువలననగా, శబ్దాత్ = శబ్దమువలన ( వేదము నందు అట్లనేచెప్పబడియుండుటవలన ననుట ) ఇతి= ఇట్లు, బాదరా యణః=వ్యాసమహాముని, మన్యతే= తలంచుచున్నాడు.

తా ॥ బ్రహ్మవిద్యలు స్వతంత్రములయ్యే మోక్షమునిచ్చును " తరతిశోకమాత్మవిత్, బ్రహ్మవేద బ్రహ్మైవభవతి " ( ఆత్మజ్ఞానము గలవాడు దుఃఖమునుతరించును. బ్రహ్మను తెలిసికొనినవాడు బ్రహ్మ మేయగును ) అనుమొదలగు శ్రుతులచేత నీవిషయమే నిరూపింపబడు చున్నదిగదా. నిర్గుణబ్రహ్మవిద్య విద్యలవలెనే సగుణబ్రహ్మవిద్యలు కూడా బ్రహ్మసాక్షాత్కారసాధనములే యగుటచేత, వానికికూడ ఫల మునిచ్చుటయందు స్వాతంత్ర్యముకలదని తెలిసికొనవలయును. కావున బ్రహ్మవిద్యలు కర్మకు అంగములుకావు. ఇదియే వ్యాసమహాముని అభిప్రాయమని తాత్పర్యము.

సూ॥ ౨॥ శేషత్వాత్పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమినిః ॥

టీక॥ ఆత్మనః=ఆత్మ, శేషత్వాత్ = కర్మకు శేషభూతుడగు టచేత, పురుషార్థవాదః = జ్ఞానమువలన మోక్షముగలుగునని చెప్పు మాట, యథాన్యేషుపర్ణమయీ (ఆకులతోచేయబడిన యజ్ఞపాత్ర) మొదలగువాని యందు చెప్పబడియున్నట్లే, అర్థవాదఏవ = అర్థవా దమే, ఇతి=ఇట్లని, జైమినిః = జైమినిమహాముని ( పూర్వమీమాంస కర్త ) మన్యతే=తలంచుచున్నాడు.

తా॥ ఆత్మకర్త ( కర్మలనుచేయువాడు ) కావున కర్మకుశేష భూతుడు ( పరతంత్రుడగుట ) ఇట్లగుటచే ఆత్మవిషయమగు జ్ఞానము కూడా కర్మకుపరతంత్రమే కావలసివచ్చును. కావున నీబ్రహ్మజ్ఞాన ము స్వతంత్రముగా మోక్షమునివ్వనేరదు. " తరతి శోకమాత్మ విత్ " అను మొదలగు శ్రుతులు చెప్పువిషయము అర్థవాదము.

కర్మాంగములగు ద్రవ్యము యజమానుడు క్రియలు ( అచ్చటచ్చట చేయబడుపనులు ) వీటినిగూర్చి చెప్పబడిన ఫలవాదములు ( ఈద్రవ్యమువలన ఇంతఫలము గలుగును. అనుమొదలగునవి ) కర్మను ప్రశంసించునట్టి అర్థవాదము లెట్లగునో అట్లే బ్రహ్మజ్ఞానమునుగూర్చి చేయబడిన ఫలవాదముకూడా ( బ్రహ్మజ్ఞానమువలన మోక్షముగలుగునని చెప్పుటకూడా ) అర్థవాదమేయగును. అని జైమినిమహాముని యభిప్రాయమని తాత్పర్యము.

సూ॥ ౩॥ ఆచారదర్శనాత్ ॥

టీక॥ ఆచారదర్శనాత్=ఆచారముకూడ, పైనచెప్పినట్లే కనుపడుచుండుటవలన, బ్రహ్మజ్ఞానంనస్వతంత్రం= బ్రహ్మజ్ఞానము స్వతంత్రముగాదు.

తా॥ " జనకోహవైదేహో బహుదక్షిణేన యజ్ఞేనేజే ( విదేహదేశములకురాజగు జనకమహారాజు విశేషముగా దక్షిణలు ఇచ్చి యజ్ఞమునుచేసెను ) " అను మొదలగు శ్రుతులచేత బ్రహ్మవేత్తలగువారుకూడ కర్మలనాచరించినట్లు చెప్పబడియున్నది. దీనినిబట్టి చూచినను జ్ఞానము కర్మాంగమనియే చెప్పవలయునని జైమినిమహాముని తలంచుచున్నాడని తాత్పర్యము.

సూ॥ ౪॥ తచ్ఛ్రుతేః ॥

టీక॥ తచ్ఛ్రుతేః= ప్రత్యక్షముగా జ్ఞానము కర్మాంగమని చెప్పుశ్రుతికూడ నుండుటవలన, జ్ఞానంనస్వతంత్రం = జ్ఞానము స్వతంత్రముకాదు. " యదేవవిద్యయాకరోతి ( దేనినిజ్ఞానముతో నాచరించును ) " అను మొదలగు శ్రుతులు జ్ఞానము కర్మాంగమని ప్రత్యక్షముగానే చెప్పుచున్నవి. దీనినిబట్టిచూచినను జ్ఞానమే స్వతంత్రముగా మోక్షమిచ్చుననుటకు వీలులేదని జైమినిమహాముని తలంచుచున్నాడని తాత్పర్యము.

సూ ॥ ౫ ॥ సమన్వారంభణాత్ ॥

టీక॥ సమన్వారంభణాత్=కూడా ( ఒకమారే ) వెళ్లుటవలనకూడా, నజ్ఞానంస్వతంత్రం = జ్ఞానముస్వతంత్రముకాదు.

తా " తంవిద్యాకర్మణీ సమన్వారభేతే " ( విద్యాకర్మలు

రెండును పరలోకమునకు బోవువానిని గూడ బోవును ) అను శ్రుతిచే విద్యాకర్మలు రెండును ఫలమునిచ్చునప్పుడు ఒకటినొకటి విడచియుండవని తెలియజేయబడి యుండుటచేతనుగూడ జ్ఞానము కర్మాంగమను విషయమే దృఢపడుచున్నది. కావున విద్యకు స్వాతంత్ర్యము లేదనుటయే జైమిని మతమని తాత్పర్యము.

సూ॥ ౬॥ తద్వతో విధానాత్ ॥

టీక॥ తద్వతః= సర్వవేదార్థమును తెలిసినవానికి, విధానాత్ = కర్మను విధించుటవలనకూడ, జ్ఞానం న స్వతంత్రం= బ్రహ్మజ్ఞానము స్వతంత్రముగా ఫలమునిచ్చునదిగాదు.

తా॥ “ఆచార్యకులాద్వేదమధీత్య ( గురువువద్దనుండి వేదమునంతయు తెలిసికొని ) అను మొదలగు శ్రుతులవలన సర్వవేదార్థజ్ఞానముకలవాడే కర్మ నాచరింపవలయునని తెలియజెప్పుచుండుట వలనకూడ బ్రహ్మజ్ఞానము స్వతంత్రము కాదని స్పష్టమగుచున్నది. సర్వవేదార్థమును తెలిసికొనినవాడు అప్రధానమగు విషయమును ఆచరింపదుగదా. కావున బ్రహ్మజ్ఞానము స్వతంత్రముగా ఫలము నిచ్చునది కాదనుటయే సిద్ధాంతమని జైమిని మహామునియొక్క తలంపని తాత్పర్యము.

సూ॥ ౭॥ నియమాచ్చ ॥

టీక॥ నియమాచ్చ= జ్ఞానము కర్మయందే వినియోగింపవలయునను నియమము వలనకూడ, జ్ఞానమస్వతంత్రః= జ్ఞానము స్వతంత్రముగా ఫలము నిచ్చునదిగాదు.

తా॥ “ కుర్వన్నేవేహ కర్మాణి ( కర్మలను చేయుచునే ) అను మొదలగు శ్రుతులచేత బ్రహ్మవేత్తలకుకూడ కర్మలు విధింపబడి యుండుటవలన జ్ఞానమస్వతంత్రమనియే యేర్పడుచున్నదని జైమిని యభిప్రాయమని తాత్పర్యము.

అవ॥ పై జైమిని మతమును ఖండించి సిద్ధాంతమును చేయుచున్నాడు.

సూ॥ ౮॥ అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం
తద్దర్శనాత్ ॥

టీక॥ కింతు= మతియేమనిన, అధికోపదేశాత్ = జీవునికంటే యితరుడగునట్టియు కర్మకు శేషుడని చెప్పుటకు వీలులేనట్టియు పర బ్రహ్మమును ఉపదేశించి యుండుటవలన, బాదరాయణస్య = మొదటి సూత్రమునందు చెప్పబడిన వ్యాసునియొక్క మతమే, ఏవం=ఈప్రకా రముగానున్నది. ( సిద్ధాంతమనుట ) కుతః=ఎందువలననగా, తద్దర్శ నాత్=అవిధముగా శ్రుతియుండుటవలన.

తా॥ ఈ జైమినిమతము సరియైనదికాదు. కర్మలకు శేష భూ తుడని చెప్పతగినవాడు జీవుడు, ఈ ఉపనిషత్తుల యందన్నను జీవున కంటే భిన్నుడై సర్వజ్ఞుడైయున్న పరబ్రహ్మము చెప్పబడి యున్నా డు, దానివలన పైన నుదహరింపబడియున్న యాధారము లేవియును జ్ఞానమునకు అస్వతంత్రత్వమును సాధింపనేరవు. అవియెల్లను జీవుని విషయమున చెప్పబడియున్నవేకదా. కావున ఈ పాదము మొదటి సూత్రమునందు చెప్పబడియున్న వ్యాససిద్ధాంతమునకు జైమిని మత మువలన భంగముకలుగదు. “ యస్సర్వజ్ఞస్సర్వవిత్ ( ఎవడు సా మాన్యముగాను విశేషముగాను నెఱుంగుచున్నాడో )” అనుమొద లగు శ్రుతులవలన పరమాత్మ జీవునికంటే భిన్నుడనియు ఈ కారణ మువలననే కర్మకు శేషభూతుడని చెప్పుటకు వీలులేనివాడనియు తెలి యుచున్నది. కావున వ్యాసునిమతము సిద్ధాంతమని తాత్పర్యము.

అవ॥ ఈవిధముగ తనమతమును నిరూపించి జైమిని మతము నందు దోషమును జూపుటకై వారు తమమతమునకు ఆధారముగా జూపిన ప్రమాణములను ఖండించుచున్నాడు. బ్రహ్మవేత్తలు కూడా కర్మచేయవలయునని చెప్పియున్నది. కావునజ్ఞానము కర్మాంగమేయని ౩ వ- సూత్రమునందు చెప్పబడిన హేతువును ఇచ్చట ఖండించు చున్నాడు.

సూ॥ ౯॥ తుల్యంతు దర్శనమ్ ॥

టీక॥ దర్శనం శ్రుతితుల్యం=మీపక్షమునందును (జైమిని ) మా పక్షమునందును సమానముగానే యున్నది.

తా॥ మూడవసూత్రమునందు చూపబడినయాధారముసరియై నదికాదు. జనకాదులు కర్మలనాచరించిరని చెప్పినట్లే జ్ఞానులగువార

కర్మలనాచరింపవలసిన పనిలేదని కూడ శ్రుతి చెప్పుచున్నది. "ఏతద్ధస్మవై తత్ పూర్వేవిద్వాంసోఽగ్నిహోత్రం నజుహువాంచక్రిరే(ఇదిసే ఆబ్రహ్మజ్ఞానము ఈజ్ఞానముగలపూర్వులు హోమమును చేయలేదు. [కర్మలనుచేయనక్కఱలేదనుట]" అనుమొదలగు వాక్యములచే నీవిషయము స్పష్టముచేయబడుచున్నదిగదా. దీనిబట్టిచూచిన మన (జైమిని, వ్యాస) పక్షములు రెండును ప్రమాణసిద్ధములై యుగుచున్నవి. ఇట్లుండుటకు వీలులేదు. కావున ఈరెండుశ్రుతులకును గల శక్తి తారతమ్యమును విచారింపవలసివచ్చుచున్నది. అందు కర్మచేయవలయునని చెప్పు శ్రుతినిగూర్చి విచారించిన— జనకుడు మొదలగువారు కర్మజన్యములగు (కర్మలవలనగలుగవలసిన) ఫలములందు ఆశలేని జ్ఞానులగుటచే వారుచేసిన కర్మ కర్మగానేరదు. ఫలములందు ఇచ్ఛగలవానినిగూర్చి వేదము కర్మనుపదేశించును. వాడును దానినాచరించును. కర్మకు లేకధర్మమునకు చోదనయే (దీనిచేయవలయును అనిచెప్పుటనే) లక్షణము. దేనియందు చోదనయుండునో అదియే ధర్మము లేక కర్మ అనుగురుతు) అనిగదా మీ (జైమిని) సిద్ధాంతము. ప్రకృతజనకాదుల కర్మయందు చోదనయుండుటకు వీలులేకపోవుటచే నది కర్మకాదనుట నిర్వివాదాంశము. ఈకారణమువలన "జనకోహవై" అనుమొదలగు శ్రుతులు జ్ఞానమునకు కర్మాంగత్వమును సంపాదింపనేరవు. కావున దుర్బలములు అనియే ఏర్పడును. ఈనిరూపణచేతనే "ఏతద్ధస్మవై" అనుశ్రుతి బలవంతమైనదని నిరూపింపబడినది. కావున మా (వేదాంత) సిద్ధాంతమే యుక్తియుక్తమని తాత్పర్యము.

అవ॥ నాలగవసూత్రమునందు చూపబడియున్న ప్రమాణమును ఖండించుచున్నాము.

సూ॥ ౧౦॥ అసార్వత్రికీ॥

టీక॥ శ్రుతిః— "యదేవవిద్యయా" అనుశ్రుతి, అసార్వత్రికీ— అన్ని విద్యలకును సంబంధించినదికాదు.

తా॥ నాలగవసూత్రమునందు చూపబడిన ప్రమాణముకూడ మీ (జైమిని) మతమును సిద్ధాంతముచేయనేరదు. "యదేవవిద్య

యా ” అను శ్రుతి ఉద్గీథవిద్యనుగూర్చి చెప్పునదియే కాని సర్వవిద్యలను గూర్చి చెప్పునదికాదు. గదాయని తాత్పర్యము.

అవ॥ అయిదవ సూత్రమునందు చూపబడిన ప్రమాణమును ఖండించుచున్నాడు.

సూ॥ ౧౧॥ విభాగశ్శతవత్ ॥

టీక॥ శతవత్ = నూరు అను సంఖ్యకువలె, విద్యాకర్మణోః= విద్యాకర్మలకు, విభాగః=విభాగమే.

తా॥ “ పరలోకగతుడైన పురుషునితోగూడ విద్యాకర్మలు పోవును ” అనుటచే విద్యాకర్మలకు సముచ్చయము సిద్ధించుననుట సరికాదు. “వీరిరువురకును నూరురూపాయలు ఇవ్వవలెను ” అనిచెప్పిన “ వీనికొకయేబది, వానికొకయేబది, ఇవ్వవలయును ” అని విభాగమెట్లు అర్థమగునో అట్లే ప్రస్తుతస్థలమునందుకూడా “ ఒకనికి (ఉపాసకునకు) ఫలమునిచ్చుటకై విద్యయు, మఱియొకనికి ( కర్మఠునకు ) ఫలమునిచ్చుటకై కర్మయు, వారితోకూడ పరలోకమునకు బోవును ” అని విభాగమే యర్థమగును. మఱియొకవిధముగా చెప్పుటకు వీలులేదని తాత్పర్యము.

అవ॥ ఆరవ సూత్రమునందు చూపబడిన యాధారమును ఖండించుచున్నాడు.

సూ॥ ౧౨॥ అధ్యయనమాత్రవతః ॥

టీక॥ అధ్యయనమాత్రవతః= వేదాధ్యయనమును చేసినవానికి మాత్రమే, బ్రహ్మజ్ఞానవిధురస్య=బ్రహ్మజ్ఞానములేనివానికి, విధానం= కర్మవిధింపబడియున్నది.

తా॥ ఆరవసూత్రమునందు చూపబడిన “ ఆచార్యకులాద్వేదమధీత్య ” అనుమొదలగు శ్రుతులయందు వేదాధ్యయనము నొనర్చినవానికిమాత్రమే కర్మవిధింపబడియున్నది గాని బ్రహ్మజ్ఞానముగలవానికి గాదుగదా. పైచూపినయుక్తులవలన బ్రహ్మజ్ఞానముకలవాడు కర్మయందు ప్రేరేపింపబడుటకు వీలులేకపోవుటచే ఆయధ్యయనముకూడ కర్మకాండవరకేయనికాని సంపూర్ణవేదమును అధ్యయనముచేసినను అర్థజ్ఞాన మంతవరకేయని గాని సంపూర్ణమగు నర్థజ్ఞానమున్నను

భ్రాంతివశమున కర్మజన్యములగు ఫలములను కోరువారినిగూర్చి యీకర్మ విధింపబడినదనిగాని చెప్పవలసివచ్చుచున్నది. కావున ఆరవసూత్రము నందు చూపబడిన యాధారము మీమతమును నిలుపనేరదుఅని తాత్పర్యము.

అవ॥ ఏడవసూత్రమునందు చూపబడిన యాధారమును ఖండించు చున్నాడు.

సూ॥ ౧౩॥ నావిశేషాత్ ॥

టీక॥ **అవిశేషాత్** = భేదమేమియు ( నిర్ధారణ ) లేకపోవుట వలన, ననియమః=ఏడవసూత్రమునందు చెప్పబడిననియమము లేదు.

తా॥ " కుర్వన్నేవేహకర్మాణి " అనుశ్రుతి " జ్ఞానులుకూడ కర్మచేయవలయును " అని చెప్పుచున్నదనుట సరికాదు. ఆశ్రుతి కర్మలను చేయవలయుననియనేకాని [illegible] కర్మచేయవలయునని ప్రత్యేకముగా చెప్పలేదుగదా. కావున ఆశ్రుతి అజ్ఞాని పరమైనదియేయని చెప్పవచ్చును, ఈకారణమువలన నాశ్రుతి మీకాధారము కానేరదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుట సరికాదు. ప్రకరణమువలన నాశ్రుతి జ్ఞానులనుగూర్చియే చెప్పునదియని తెలియవచ్చు చున్నదిగదా" అందులకేమో అట్లైనను మాసిద్ధాంతమునకుభంగమురాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౧౪॥ స్తుతయేనుమతిర్వా ॥

టీక॥ స్తుతయే = విద్యనుస్తోత్రముచేయుటకై, అనుమతిర్వా = కర్మనొప్పుకొనుటగాని, శ్రుత్యర్థోభవేత్ = నాశ్రుత్యర్థముకావచ్చును.

తా॥ ప్రకరణమును బట్టిచూచిన నాశ్రుతి జ్ఞానులనుగూర్చియే చెప్పునట్లు తెలియవచ్చుచున్నదని పట్టుపట్టినను మా సిద్ధాంతమునకు భంగమురాదు. " నీవు జీవితకాలమంతయును కర్మను చేయుచున్నను అదినీకు అంటదు " అని విద్యాప్రభావమును స్తోత్రము చేయుటకుగాను " కుర్వన్నేవ " అనుశ్రుతి ప్రవర్తించుచున్నదని చెప్పవచ్చును గదా. కావున ఏవిధముగా చూచినను వేదాంత సిద్ధాంతమునకు భంగములేదని తాత్పర్యము.

అవ॥ ఈవిధముగ పూర్వపక్షులు చెప్పిన హేతువులను ఖం

డించి సిద్ధాంతి తనమతమును స్థిరపరుచుకొనుటకై మఱికొన్ని కారణములను చూపుచున్నాడు.

సూ॥ ౧౫॥ కామకారేణచైకే ॥

టీక॥ ఏకే=మఱికొందరుజ్ఞానులు, కామకారేణ= మనస్ఫూర్తిగానే, కర్మసన్యాసం కృతవంతః = కర్మసన్యాసమును చేసిరి, ఇతి శ్రూయతే=అనిశ్రుతియందున్నది.

తా॥ మఱియు "ఏతద్ధస్మవైతత్పూర్వే విద్వాంసో ప్రజాం నకామయంతే కింప్రజయాకరిష్యామో యేషాంనోయ మాత్మాయం లోకః" (పూర్వకాలమునందున్న జ్ఞానులు కర్మాంగములగు ప్రజలు మొదలగువారిని కోరలేము * కర్మనువిడిచి పెట్టిరనుట.) ఈ పరబ్రహ్మమే మనకు ప్రత్యక్షఫలమైయుండగా పరోక్షఫలములతో నేమి పని. ధనము సంతానముతో నేమిచేయుదుము (అను వాక్యముచే కొందరు జ్ఞానులు మనస్ఫూర్తిగనే కర్మలను విడచిపెట్టిరని చెప్పబడియున్నది. ప్రత్యక్షఫలము విద్యవలన దొరుకుచుండగా పరోక్షఫలము నిచ్చు కర్మలతో పనిలేదనికూడా సూచింపబడుచున్నది. బ్రహ్మజ్ఞానము కర్మాంగమైనయెడల నట్లు చెప్పుటకు వీలులేదుగదా. కావున ప్రత్యక్షఫలము నిచ్చు విద్య పరోక్షఫలము నిచ్చుకర్మకు అంగ మగుటకు వీలులేదని తాత్పర్యము.

సూ॥ ౧౬॥ ఉపమర్దంచ ॥

టీక॥ బ్రహ్మజ్ఞానాత్ = బ్రహ్మజ్ఞానమువలన, కర్మ సాధనానాం = కర్మకు సాధనములగు కర్తృకరణ ము మొదలగు వానియొక్క, ఉపమర్దంచ=నాశనముకూడా, శ్రుతిరాహ = వేదము చెప్పుచున్నది.

తా॥ "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కంపశ్యేత్" (సర్వము ఆత్మస్వరూపమైనప్పుడు ఈ బ్రహ్మజ్ఞాని దేనితో దేనినిజూచును) అను మొదలగు వాక్యములచేత బ్రహ్మజ్ఞానము కలిగినపిదప కర్మచేయుటకు కావలసిన కర్తసాధనము మొదలగునవి ఏవియును యుండవని తెలియజేయబడుచున్నవి. దీనిని పట్టిచూచిన కర్మవినాశకరమగు విద్యకర్మకు అంగమనుటకు వీలులేదనియే ఏర్పడుచున్నదని తాత్పర్యము.

టీక॥ జైమినిః = జైమినిమహాముని, త్రయ ఇత్యాదిశ్రుతిం= త్రయఅనుమొదలగుశ్రుతిని, పరామర్శం= అనువాదముగా, మన్యతే= తలంచుచున్నాడు. హి=ఏకారణమువలన, సా=ఆశ్రుతి, అచోదనా= చోదనము మొదలగునదిలేనిదియో, అన్యత్రచ = ఇతరస్థలములయం దును, అపవదతి = నాలగవయాశ్రమము నిందించుచున్నది.

తా॥ " త్రయ " అను మొదలగు వాక్యమునందు చోదనము (నాలగవయాశ్రమము నంగీకరింపవలయును, అని ప్రేరణ) లేదు. " వీరహావాఏష దేవానాం యోగ్నిముద్వాసయతి " (సర్వదేవత లలోను ముఖ్యుడగు అగ్నినెవ్వడు ఉద్వాసనచేయునో వాడు వీరహ త్యచేసినవాడు) అను మొదలగు శ్రుతులు కొన్ని ప్రత్యక్షముగానే సన్యాసాశ్రమమును నిందించుచునేయున్నవి. అగ్నినుద్వాసనచేయక సన్యాసాశ్రమమును స్వీకరించుటకు వీలులేదు కదా. ఈకారణముల వలన పైనవుదహరింపబడిన " త్రయ " అను మొదలగుశ్రుతి సన్యాస మునుగూర్చి చెప్పునదికాదు. మఱియేమనిన, బ్రహ్మజ్ఞానిని స్తోత్రము చేయుటకై (అనగా బ్రహ్మజ్ఞానములేనివాడు అశాశ్వతఫలమును చెం దుననియు జ్ఞానియగువాడు శాశ్వతఫలమును చెందుననియు అన్నియా శ్రమములయందును ఇది సమానమేయనియు చెప్పుటకై యనుట.) ఆశ్రమములను అనువాదముచేసెను. కావున " త్రయః " అనుశ్రుతిచే సన్యాసాశ్రమమును సాధించుటకు వీలులేదు. దీనినిబట్టిచూచినసన్యా సాశ్రమము శ్రుతిసమ్మతముకాదనియు స్మృతియందొకానొకచోట నున్నను శ్రుతికివిరుద్ధమగుటచే నాదరింపబడతగినదికాదనియు ఈకా రణమువలన ఆయాశ్రమము నాధారముగాచేసికొని చేయబడిన పై అధికరణమునందలి సిద్ధాంతముకూడ సరికాదనియు జైమినిమతమని తాత్పర్యము. (ఇది పూర్వపక్షసూత్రము)

అవ॥ పై పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతమును చూపు చున్నాడు.

సూ॥ ౧౯॥ అనుష్ఠేయం బాదరాయణస్సామ్యశ్రుతేః ॥

టీక ॥ బాదరాయణః = వ్యాసాచార్యులు, సామ్యశ్రుతేః= సమానముగా శ్రుతిచెప్పుచుండుటవలన, అనుష్ఠేయం=నాలగవయా

శ్రమము ననుష్ఠింపవలసినదానినిగా, మన్యతే = తలంచుచున్నాడు.

తా॥ ఈజైమినిమతము సరియైనదికాదు. ఇతరశ్రుతులయందు విధింపబడియున్న గృహస్థాశ్రమమును యెట్లను వాదముచేసెనో అట్లే (ప్రమాణసిద్ధమగు గృహస్థాశ్రమముతో పాటు) సన్యాసాశ్రమమునుకూడ "త్రయః" అనుమొదలగు శ్రుతి యనువాదము చేసియున్నది. ప్రామాణికమగుదానితోకూడ నప్రమాణికమగు విషయము ననువాదముచేయుట సంభవింపదుగదా. కావున ఆశ్రుతి బ్రహ్మనిష్ఠ కలవానిని స్తోత్రముచేయునదియేమైనను దానిచే చెప్పబడిన నాలగవయాశ్రమము ఆచరణీయము కాకపోదు. ఇట్లు చెప్పినయెడల "వీరహా" అనుమొదలగు శ్రుతికి విరోధము వచ్చునని తలంపవలదు. ఆశ్రుతి అశ్రద్ధవలన అగ్నినుద్వాసనచేసిన పురుషునిగూర్చి చెప్పును గాని సన్యాసినిగూర్చి చెప్పనదికాదు. కావున నాలగవయాశ్రమము ఆచరింపతగినదియే. ఇదియే వా[illegible]నని తాత్పర్యము.

సూ॥ ౨౦॥ విధిర్వాధారణవత్ ॥

టీక॥ ధారణవత్ = సమిధలను ధరించుటయను క్రియవలె, అయమపి=ఇదియు, విధిర్వా=సన్యాసాశ్రమమునకు విధియైనను కావచ్చును.

తా॥ "త్రయః" అను మొదలగు శ్రుతి సన్యాసాశ్రమము ననువాదముచేయునని యొప్పుకొనినను మాసిద్ధాంతమునకు భంగములేదని పై సూత్రమునందు నిరూపించియున్నాము. బాగుగ విచారించినచో పైశ్రుతియందు సన్యాసాశ్రమము విధింపబడియే యున్నదని చెప్పవచ్చును. ఇతరప్రమాణములవలన సిద్ధించిన విషయమును కార్యార్థమై మఱియొకమారుచెప్పుట అనువాదమగును గాని క్రొత్తవిషయమును చెప్పుట అనువాదముకానేరదుగదా "అధస్తాత్సమిధం ధారయన్ననుద్రవేదుపరిహి దేవేభ్యోధారయతి (సమిధను క్రిందుగా పట్టుకొని వెళ్ళవలయును. దేవతలకొరకు కర్మనాచరించునప్పుడు గదా పైపైపున సమిధను ధరింతురు)" అనువాక్యమునందు "పైపైపున సమిధనుధరించుట" అను విషయమును చెప్పువాక్యము, అనువాదవాక్యమువలె నున్నను దానియందు చెప్పబడిన విషయము

పూర్వమెప్పుడును చెప్పబడినదికాకపోవుటచేత ఈస్థలమునందు విధిం పబడినదనియే చెప్పవలయునుగదా. అట్లే ప్రస్తుతమగు " త్రయః " అనువాక్యముకూడ అనువాదరూపమేయైనను దానియందు చెప్పబ డిన సన్యాసాశ్రమము ఇదివరకు విధింపబడినది కాకపోవుటచేత ఆఅంశమున (సన్యాసాశ్రమమునుగూర్చి చెప్పునంశమున మాత్రము ఆశ్రుతివిధియనియే చెప్పవలయును) అని తాత్పర్యము.

## —(*) ౩. స్తుతిమాత్రాధికరణమ్. (*)—

అవ॥ " సఏషఉద్గీథోరసానాం రసతమః పరమః ( ఈ ఉద్గీథము మనోహరములలో మనోహరము శ్రేష్ఠము. ) అను వాక్యము ఉద్గీథవిద్యయందున్నది. ఇది కర్మాంగమగు ఉద్గీథమును స్తోత్రముచే యునదియా, లేక ప్రత్యేకముగా నుపాసనను విధించునదియా, అను విషయమును ఈయధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౨౧॥ స్తుతిమాత్ర ముపాదానాదితి చేన్నా పూర్వత్వాత్ ॥

టీక॥ ఉపాదానాత్ =కర్మాంగమగు ఉద్గీథమును గ్రహించుటవలన, స్తుతిమాత్రమితిచేత్ = " సఏష " అను మొదలగు శ్రుతులు స్తోత్రముమాత్రమే అనేయెడల, న = అదియుక్తముగాదు. కుతః= ఎందువలననగా, అపూర్వత్వాత్ = రసతమత్వాదిగుణములు ఇంతకుపూర్వము చెప్పబడి యుండక పోవుటవలన.

తా॥ కర్మాంగములగు ఉద్గీథాదులను గ్రహించి దానినివర్ణించినంతమాత్రముచేతనే " సఏష " అను మొదలగు శ్రుతులు కర్మాంగస్తుతిపరములు కానేరవు. ఆశ్రుతులయందు విధింపబడిన రసతమత్వాదిగుణములు అంతకుపూర్వము ఇతర ప్రమాణములచే చెప్పబడినవికావు. కావున ఈశ్రుతులు ఉపాసనను విధించునవి యనియే చెప్పబడవలసి వచ్చుచున్నవిగదా. కాబట్టి "సఏష" అను మొదలగు శ్రుతులు ఉద్గీథాదుల ఉపాసనలను విధించుననుటయే నిశ్చయమని తాత్పర్యము.

సూ॥ ౨౨॥ భావశబ్దాచ్చ ॥

టీక॥ భావశబ్దాచ్చ= స్పష్టముగు శ్రుతివలనకూడ, నస్తుతిమాత్రం= "సఏష" అనుమొదలగు శ్రుతులు స్తోత్రములుకావు.

తా॥ "ఉద్గీథముపాసీత (ఉద్గీథమును ఉపాసన చేయవలయును)" అనుమొదలగు శ్రుతులు ప్రత్యక్షముగాకూడ ఉద్గీథాదులను ఉపాసనచేయవలయునని చెప్పుచున్నవి. కావున అపూర్వధర్మమునుచెప్పిన "సఏష" అను మొదలగు శ్రుతులు కర్మాంగ స్తుతిపరమాత్రములే యని చెప్పబడుటకు వీలులేదు. అవి స్వతంత్రోపాసనలనే విధించునని తాత్పర్యము.

—(*) ౮. పారిప్లవార్థాధికరణమ్.(*)—

అవ॥ ఉపనిషత్తులయందు కొన్నికథలుగలవు. అవి పారిప్లవమునకు (పారిప్లవమనగా, అశ్వమేధయాగమునందు దానినిచేయు రాజునకు చెప్పవలయునని విధింపబడియున్నకథలు) సంబంధించినవా, లేక ఆకథలలో చెప్పబడియున్న బ్రహ్మవిద్యలను స్తోత్రముచేయుటకు సంబంధించినవా, అనువిషయము ఈఅధికరణమున విచారింపబడుచున్నది.

సూ॥ ౨౩॥ పారిప్లవార్థాఇతిచేన్న విశేషితత్వాత్ ॥

టీక॥ కథాః=కథలు, పారిప్లవార్థాఇతిచేత్ = పారిప్లవము కొరకై చెప్పబడినవనినయెడల, న=అదియుక్తముకాదు. కుతః=ఎందువలననగా, తదర్థానాం= ఆపారిప్లవముకొరకై చెప్పబడినకథలు, విశేషితత్వాత్ = ప్రత్యేకముగా కొన్నిమాత్రమే యుండుటవలన.

తా॥ ఉపనిషత్తులయందున్నకథలు పారిప్లవముకొరకై చెప్పబడినవికావు. ఏలయనగా, ఆపారిప్లవమునందు "మనుర్వైవస్వతో రాజా (వైవస్వతుడనేమనువు రాజ్యముచేయుచుండెను)" అను మొదలగు కొన్నికథలు మాత్రమే విధింపబడియున్నవి. ఇట్లగుటచే ఉపనిషత్తులయందలి కథలుకూడ అపారిప్లవముకొరకే చెప్పబడెననుట యుక్తియుక్తముకాదని తాత్పర్యము.

సూ॥ ౨౪॥ తథాచైకవాక్యతోపబంధాత్ ॥

టీక॥ తథాచ= అవిధముగా (ఉపనిషత్తులయందలి విద్యలు పారిప్లవముకొరకై చెప్పబడినవికావని ఏర్పడుటచేత నవి బ్రహ్మవి

ద్యల కంగములేవై) యుండుటవలన, ఏకవాక్యతోపబంధాత్ =ఏక వాక్యసంబంధము కలిగియుండుటవలన, తాః = పారిప్లవార్థా ఆకథలు బ్రహ్మవిద్యలను స్తోత్రము చేయుటకై చెప్పబడినవే.

తా॥ పైసూత్రమునందు చేసిన సిద్ధాంతమువలన ఉపనిషత్తుల యందలి కథలు వాటివాటియందు చెప్పబడిన బ్రహ్మవిద్యలను స్తోత్రము చేయుటకు గా చెప్పబడినవనియే ఏర్పడుచున్నదిగదా. ఈ విషయమును మఱియొకవిధము గాకూడ నిరూపింపవచ్చును. ఈకథలు వానియందు చెప్పబడియున్న విద్యలను ఆచరింపవలయునని బోధించుచుండుటచే నవి రెండును (విద్యలును, కథలును) ఏకవాక్యమైయున్నది. ఈ కారణమువలనకూడ ఉపనిషత్తులయందలి కథలు అచ్చటనుండు విద్యలను స్తోత్రముచేయుటకై ఏర్పడినవే యని స్పష్టమగుచున్నదని తాత్పర్యము.

—(*) ౫. అగ్నీంధనాధికరణమ్. (*)—

అవ॥ ఈవిధముగా మొదటి అధికరణమునందు బ్రహ్మవిద్య స్వతంత్రమని నిరూపించి దానినాశ్రయించివచ్చిన విచారములనన్నిటిని నాలగవ యధికరణమువరకు విచారించి ముగించి ప్రస్తుత అధికరణమున బ్రహ్మవిద్యాస్వాతంత్ర్యఫలమును చెప్పుచున్నాడు.

సూ॥ ౨౫ ॥ అతఏవ చాగ్నీంధనాద్యనపేక్షా ॥

టీక॥ అతఏవ= బ్రహ్మవిద్య స్వతంత్రమైన కారణమువలననే, అగ్నీంధనాద్యనపేక్షా = అగ్ని, సమిధలు, మొదలగువానిచే సాధింపతగిన కర్మలతో పనిలేదు.

తా॥ మొదటి అధికరణమునందు నిరూపింపబడిన ప్రకారము బ్రహ్మవిద్య కర్మలతో సంబంధములేక స్వతంత్రమున్యై యున్నందువలన దానికి మోక్షమునిచ్చువిషయములో కర్మలసహాయము మక్కఱలేదని తాత్పర్యము.

—(*) ౬. సర్వాపేక్షాధికరణమ్ (*)—

అవ॥ బ్రహ్మవిద్యకు కర్మలతో సంబంధములేదనిన సంపూర్ణముగా సంబంధములేదని యభిప్రాయమా, లేక కొన్నివిషయము

లందుమాత్రమే సంబంధము లేదని యభిప్రాయము. అనుసంశయము
నీ యధికరణమున పరిహరించుచున్నారు.

సూ॥ ౨౬॥ సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్॥

టీక॥ యజ్ఞాదిశ్రుతేః = జ్ఞానము కలుగుటకై యజ్ఞాదులను చేయవలయునని చెప్పు శ్రుతియుండుటవలన, విద్యాయాః = విద్యకు, సర్వాపేక్షా = సమస్తములగు కర్మలతోను సంబంధము కలదు. (జ్ఞానముత్పత్తియగుటకు అన్నియును కావలసినదే) అశ్వవత్ = గుఱ్ఱములకువలె, మోక్షే = మోక్షమునందు, వానన్నిటితోను సంబంధము లేదు.

తా॥ "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి, యజ్ఞేన దానేన తపసా (వేదాధ్యయన, యజ్ఞ, దాన, తపస్సులచే మోక్షార్థులగువారు ఆబ్రహ్మమును తెలిసికొన నిచ్ఛయించుచున్నారు)" అను శ్రుతిచేత జ్ఞానోత్పత్తి కొఱకుటకై యజ్ఞాదుల నాచరింపవలయునని చెప్పబడుచున్నది. దీని ననుసరించి యాచరించినయెడల బ్రహ్మజ్ఞానమునకు ఫలమునిచ్చు సమయమునందు మాత్రమే కర్మలతో సంబంధము లేదుగాని ఉత్పత్తిసమయమునందు కలదు. అనగా, బ్రహ్మజ్ఞానము కర్మలవలననే పుట్టవలయునట. మోక్షమునందు గాని (మోక్షము నిచ్చునప్పుడు గాని) సర్వకర్మజ్ఞానములకు సంబంధము ఏలయుండరాదనుకొనిరో:— అశ్వమునకు యోగ్యత్వము (వీలియుండుట) లేదు. అనగా, మొదటి అధికరణమున నిరూపించబడిన విధముగా కర్మలకు మోక్షమునిచ్చుటకు శక్తిలేదనుట. లోకమునందు దేనికెదితగియుండునో దానియందు అది వినియోగింపబడుచుండును. రథమునీడ్చుటకై ఉపయోగించు నశ్వమును (బండిని యీడ్చుటయందే, యలవాటుపడిన గుఱ్ఱమును) నాగలినీడ్చుటయందు ఉపయోగింపరుగదా. కావున కర్మలు మొదలగునవన్నియు జ్ఞానోత్పత్తికి సాధనములగును గాని, అజ్ఞానముతో కూడి మోక్షము నిచ్చునవి కావని తాత్పర్యము.

అవ॥ పై సూత్రమునందు ఉదహరింపబడిన శ్రుతి "వివిదిషంతి (తెలిసికొన దలంచుచున్నారు)" అని వర్తమానకాలము చెప్పుటవలన "అప్పటికి జ్ఞానముపుట్టలేదు. ఇచ్ఛమాత్రమే యున్నది." అని తెలియజేయబడుచున్నదిగదా. కావున కర్మలకు జ్ఞానముతో

ఉత్పత్తి సమయమునందుకూడ సంబంధమున్నదని చెప్పుటకు వీలు లేదు. అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౭॥ శమదమాద్యుపేతస్స్యాత్తథాపితుతద్విధేస్త
దంగతయా తేషామవశ్యానుష్ఠేయత్వాత్ ॥

టీ॥ తథాపి= అట్లైనప్పటికిని ( కర్మలు విద్యోత్పత్తికి సాధనములని చెప్పుటకు వీలులేదని తలంపబడినప్పటికిని, తద్విధేః = వానిని ( శమదమాదులను ) విధించుటవలన, తేషాం= అవి, అవశ్యం= ముఖ్యముగా, అనుష్ఠేయత్వాత్ = అనుష్ఠింపబడవలసియుండుటవలన, శమదమాద్యుపేతః = శమము, దమములతో కూడినవాడు స్యాత్ = కావలయును.

తా॥ అవతారికయందు చెప్పబడిన ప్రకారము ఒకవేళ కర్మలు విద్యాసాధనములగుటకు వీలులేదని చెప్పినను శమదమాదులనుగూర్చి అట్లుచెప్పుటకు వీలు లేదు. వానిని విద్యోత్పత్తికై అవశ్యమాచరింపవలయును. " శాంతో దాంతః ( శమదమములు గలవాడు ) " అను మొదలగు శ్రుతి వానినిసాధనములుగా విధించుచున్నదిగదా. బాగుగ విచారించిన కర్మలవిషయమునందుకూడ నట్లు చెప్పుటకు వీలు లేదు. మొదటి అధికరణమునందు నిరూపించిన ప్రకారము కర్మజ్ఞానములకు బొత్తిగానే సంబంధములేదు కావున " కర్మజ్ఞానములకు సంబంధము కలదు " అని చెప్పుట క్రొత్తవిషయముగుటచే నావాక్యము విధివాక్యమనియే చెప్పవలయును. అనగా, మనస్సు పరిశుద్ధమై బ్రహ్మజ్ఞానమునందు ఇచ్ఛగలుగుటకు కర్మలను ఆచరింపవలయునని విధించుట. ఈకారణమువలన కర్మలు పరంపరగా జ్ఞానసాధనములనుట నిశ్చయమగును. అయినను కర్మలకును, శమదమాదులకును కొంతభేదము కలదు. జ్ఞానేచ్ఛకు సాధనములగుటచే బహిరంగసాధనములు; ప్రత్యక్షముగా జ్ఞానసాధనములగుటచే శమాదులు అంతరంగ సాధనములు. కావున అవతారికయందు చేయబడిన పూర్వపక్షము సరియైనది కాదనియు కర్మలుకూడ జ్ఞానోత్పత్తికి సాధనములే యనియు తాత్పర్య.

—(*) ౭. సర్వాన్నానుమత్యధికరణమ్. (*)—

అవ॥ బృహదారణ్యకోపనిషత్తునందు ప్రాణవిద్యను చెప్ప

నప్పుడు సహావావవం విదికింతనానన్నం భవతి ( ఇట్లు తెలిసికొని నవాడు దేనినితినినను అదిసరియేయగును ) అను వాక్యముచే నుపాస కునకు సర్వాన్నభక్షణము చెప్పబడియున్నది. ఇదివిధియా, లేక విద్యాస్తోత్రమా, అనువిషయము ఈయధికరణమునందు విచారింప బడుచున్నది.

సూ॥ ౨౮॥ సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయేతద్ద ర్శనాత్ ॥

టీక॥ తద్దర్శనాత్ = ఆవిధముగా శ్రుతియుండుటవలన, సర్వా న్నానుమతిః = సర్వాన్నములను భుజించుమనిచెప్పుట, ప్రాణాత్య యఏవ=ప్రాణాంతము సమయమునందే.

తా॥ పురుషుడు తనకు ప్రాణముపోవునంతస్థితి వచ్చినప్పుడు ఏవిధమైన ఆహారమునైనను ( ఎంగిలినైనను చలిదియైనను ) భుజింప వచ్చునని శ్రుతిచెప్పుచున్నది. కొన్ని కథలుకూడా, ఈవిషయము నందు దృష్టాంతము జూపుచున్నది. కురుదేశమునందున్న చాక్రాయ ణుడను మహాముని ఆదేశమునకు క్షామమువచ్చుటచేత నొకయొక దేశమునుజేరి మిక్కిలి ఆకలిచే బాధింపబడుచున్న వాడగుటచే నొక డుభుజించుచున్న అలచందలను భుజించినట. అటువిన్నట త్రాగగా మిగిలియున్న జలమును పానముచేయుమని అపురుషుడుచెప్పగా ఉచ్ఛి ష్టజలమును నేనుపానముచేయనని చెప్పినట. అలచందలు మాత్రము ఉచ్ఛిష్టములుకావాయనగా అప్పుడు ప్రాణముపోవు సమయము కా వున వానిని భక్షించుటవలన దోషములేదు. ఇప్పుడు నాకు శక్తివ చ్చినది మరికొంతదూరముపోయి మరియొక తటాకములో పరిశుద్ధజల మును త్రాగుటకు శక్తికలిగినప్పుడు ఉచ్ఛిష్టజలమును త్రాగుట దోష మగునని చెప్పెనట. ఇట్లుశ్రుతిప్రమాణమువలనను వృద్ధాచారమువల నను ప్రాణాంతసమయమునందు మాత్రమే అభక్ష్యభక్షణము చేయ వచ్చునుగాని స్వస్థులగువారు చేయరాదని ఏర్పడుచున్నది. దీనినిబట్టి చూచిన ప్రాణోపాసకునిగూర్చి విధించినట్లు తెలంపబడుచున్న సర్వా న్నభక్షణము విద్యాస్తోత్రరూపమగు నర్థవాదమేకాని విధికాదని స్పష్టముగా తెలియవచ్చుచున్నదని తాత్పర్యము.

సూ॥ ౨౯॥ అబాధాచ్చ ॥

టీక॥ అబాధాచ్చ = శాస్త్రమునకు బాధలేక పోవుటవలనకూడా, సర్వాన్నానుమతిర్నవిద్యాంగం = సర్వాన్నములను భుజింపవచ్చుననుట విద్యాంగముగాదు.

తా॥ ఆహారము పరిశుద్ధమైనయెడల మనస్సుకూడా పరిశుద్ధమైయుండును, అను శాస్త్రమునకు ఉపాసకుడు సర్వాన్నములను భుజింపవచ్చుననిన బాధకలుగునుగదా. మనశ్శుద్ధికై ప్రయత్నించు నుపాసకుడు దాని నతిక్రమించి దుష్టాన్నములను భుజింపవచ్చుననుట ప్రత్యక్షవిరోధముగదా. కావున ఈవిరోధమును తొలగించుటకై ప్రాణవిద్యయందలి సర్వాన్నభక్షణవాక్యము స్తోత్రపరమే యగునవలయును. వేదప్రామాణ్యమునకు భంగమెప్పటికిని రాకూడదు గదా. ప్రత్యక్షాది ఇతరప్రమాణములతో కూడా పైన నిరూపింపబడిన సిద్ధాంతము దృఢపరుపబడుచున్నదని తాత్పర్యము.

సూ॥ ౩౦॥ అపిచస్మర్యతే ॥

టీక॥ అపిచ=ఇంకెయు, స్మర్యతే = పైనచెప్పబడిన రెండువిషయములును స్మృతియందును చెప్పబడియున్నవి.

తా॥ " ముఖ్యాంతికాలే బాహ్మణోఽన్నమత్తి ( బ్రాహ్మణుడు నద్యమును సర్వదా వదలిపెట్టవలయును. ) ( జీవితాత్యయమాపన్నో యోఽన్నమత్తి యతస్తతః। లిప్యతే న స పాపేన ( ప్రాణాంతమగు స్థితిని పొందినవాడు యెటువంటి అన్నమును భుజించినను వానికిపాపము లేదు ) " అను మొదలగు వాక్యములచే స్మృతులయందు జ్ఞానియైనను అజ్ఞానియైనను భుజింపకూడని పదార్థముల నెప్పుడును భుజింపరాదనియు, ప్రాణాంత సమయమునందు మాత్రము వానిని భుజించుటవలన దోషమురాదనియు చెప్పబడియున్నది. ఈప్రమాణమును బట్టిచూచినను ప్రాణవిద్యయందు గల సర్వాన్నభక్షణవాక్యము స్తుతిమాత్రమేకాని, విధికాదని యేర్పడునని తాత్పర్యము.

సూ॥ ౩౧ ॥ శబ్దశ్చాతోఽకామకారే ॥

టీక॥ అతః = ఈకారణమువలననే, అకామకారే = యథేష్టముగా సంచరింపకూడదని, శబ్దశ్చ=శ్రుతియును, వర్తతే = ఉన్నది.

చేయనక్కఱ లేదని యేర్పడుచున్నది. దీనికి సమాధానమేమి? యనిన నీపూర్వపక్షమును ఈయధికరణముచే ఖండించుచున్నాడు.

సూ॥ ౩౨॥ విహితత్వాచ్చాశ్రమకర్మాపి ॥

టీక॥ విహితత్వాత్ = వేదముచే విధింపబడియుండుటవలన, తత్ = జ్ఞానసాధనమగు నాకర్మ ఆశ్రమకర్మాపి = ఆశ్రమములకుకూడ కర్మయే. ( ఆశ్రమస్థులుకూడ నాచరింపవలసినవియే యనుట. )

తా॥ అవతారికయందు చూపబడిన పూర్వపక్షము సరియైనదికాదు. కర్మ, జ్ఞానసాధనమని మాత్రమేకాక, బ్రహ్మచారి, గృహస్థుడు మొదలగు ఆశ్రమములవారిచేకూడ నాచరింపబడవలయునని, శ్రుతి " యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్ ( బ్రతికియున్నంతకాలము అగ్నిహోత్రమును హోమముచేయవలయును " అనువాక్యముచే చెప్పుచున్నది. ఇట్లు చెప్పుటవలన కర్మనిత్యమనియు, అందరిచేత నాచరింపబడవలయుననియు సిద్ధాంతమగుచున్నదని తాత్ప.

అవ॥ ఇట్లు చెప్పినయెడల విరోధమువచ్చును. కర్మలు జ్ఞానసాధనములని చెప్పినయెడల అవి నిత్యములగుటకు వీలులేదని ఇదివరకే చెప్పియున్నాముగదా. అనిన, సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౩౩॥ సహకారిత్వేనచ ॥

టీక॥ సహకారిత్వేనచ = కర్మలు జ్ఞానమునకు సహాయములగుటవలనకూడ, ఆశ్రమకర్మ అనుష్ఠేయమేవ = ఆశ్రమమునకు విధింపబడినకర్మలు ఆచరింపతగినవే.

తా॥ కర్మలు నిత్యములని చెప్పినంత మాత్రముననే విద్యాసాధనములని చెప్పుటకు వీలులేకపోలేదు. " తమేతం వేదానువచనేన " అనుమొదలగు శ్రుతి దానినిగూడ విధించుచునే యున్నదికదా. ఈవిధముగా కర్మ నిత్యమనిచెప్పుశ్రుతులును అనిత్యమని ( ఫలము కావలసినవారే చేయవలయునని ) చెప్పు శ్రుతులును ఉండుటవలన ఈరెండువిషయములును ప్రమాణములే. సిద్ధమైన ( మొదటినుండియు యేర్పడియున్న, ఒకనిచేత కల్పింపబడని ) వస్తువునందు రెండువిరుద్ధధర్మములు యున్నవనినయెడల దోషమగునుగాని, సాధ్యమగు ( మనచే కల్పింపబడుచున్న ) వస్తువులవిషయమునందు ఇవి దోషముకానేరదు.

కావున కర్మలు నిత్యములు. జ్ఞానసాధనములు కావున అనిత్యములు అని తెలిసికొనవలయునని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుటకూడ యుక్తముగా నుండలేదు. బాగుగ నాలోచించిన కర్మకాండయును, జ్ఞానకాండయును, వేరువేరగుటచే జ్ఞానకాండయందలి " తమేతం " అనుమొదలగు శ్రుతిచేత చెప్పబడిన కర్మలును, కర్మకాండలోని కర్మలును, ఒకటియే యనుటకు వీలు లేదు. ప్రకరణములు వేరువేరగుటచే అందుచెప్పబడిన విషయములు గూడ వేరువేరుగానే యుండవలయునుగదా. ఇట్లుచెప్పినచో కర్మ కాండలో చెప్పబడినకర్మలు నిత్యములనియు జ్ఞానకాండలోనివి అని త్యములనియు చెప్పుటకు వీలగును. ఇట్లు చెప్పినయెడల విరోధమేమి యునుండదుగదా, యనిన నట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౩౪॥ సర్వథాపితఏవోభయలింగాత్ ॥

టీక॥ సర్వథాపి = అన్నివిధములుగాను (జ్ఞానార్థముగాను, నిత్యముగాను) తఏవ=ఒకటేకర్మలే, అనుష్ఠేయాః=అనుష్ఠింపబడవల యును. కస్మాత్=ఎందువలననగా, ఉభయలింగాత్ = శ్రుతియం దును స్మృతియందును అట్లు గురుతులు కనుపడుచున్నందువలన.

తా॥ కర్మజ్ఞానకాండలయందు చెప్పబడుచున్న కర్మలు ఒకటి టియేగాని అవి పరస్పర భిన్నములైనవి కావు. శ్రుతియందును స్మృ తియందును " తమేతంవేదానువచనేన " అను మొదలగు వాక్యముల చేతను " అనాశ్రితఃకర్మఫలంకార్యం కర్మకరోతియః । ససన్యాసీచ యోగీచ ( కర్మఫలమునుకోరక చేయవలయునను నభిప్రాయముతో నెవ్వడు కర్మల నాచరించుచున్నాడో వాడే కర్మసన్యాసి వాడేకర్మ యోగి ) " అను మొదలగు వాక్యములచేతను పైన నిరూపింపబడిన విషయమే స్పష్టముచేయబడియున్నది. కావున జ్ఞాన కర్మకాండలలో చెప్పబడియున్న కర్మలకు పరస్పరభేదముకలదని చెప్పుట యుక్తియు క్తముకాదని తాత్పర్యము.

సూ॥ ౩౫॥ అనభిభవంచదర్శయతి ॥

టీక ॥ అనభిభవం = దుఃఖములచే జ్ఞానము చెడకుండుటను, శ్రుతిః=శ్రుతి, దర్శయతిచ=చూపుచున్నది.

తా॥ మఱియు "ఏషహ్యాత్మనశ్యతి యం బ్రహ్మచర్యేణానువిందతే (ఏఆత్మను బ్రహ్మచర్యముచే తెలిసికొనుచున్నాడో ఆఆత్మ దుఃఖములు మొదలగు వానిచేత నశింపదు. [అనగా బ్రహ్మచర్యము గలవానికి దుఃఖములు మొదలగువానిచే ఆత్మజ్ఞానము నశింపదనుట]" అను మొదలగు శ్రుతులచేత బ్రహ్మచర్యము మొదలగు నాశ్రమకర్మములు జ్ఞానికి కలుగు కామక్రోధాది వేగములను తగ్గించి వానియొక్క జ్ఞానమును దృఢపరుచుటకై యుపయోగించునని చెప్పబడియున్నది. దీనినిబట్టిచూచిన కర్మకాండలో ఏకర్మలు చెప్పబడియున్నవో అవియే జ్ఞానకాండమునందుకూడ చెప్పబడియున్నవనియు, అవి నిత్యములుగాను, అనిత్యములుగానుకూడ నుండవచ్చుననియు యేర్పడుచున్నది. కర్మలు జ్ఞానసాధనములనుటలో పైన నుదహరింపబడిన శ్రుతి ప్రబలప్రమాణముగదా. "తమేతం" అను శ్రుతి స్తోత్రపరమని సందేహింపబడినను ఈశ్రుతినిగూర్చి అట్లు చెప్పుటకు వీలులేదుగదాయని తాత్పర్యము.

—(*) ౯. అంతరాతద్దృష్ట్యధికరణమ్. (*)—.

అవ॥ ఆశ్రమము లేనివారలుగలరు. అట్టివారే విధురులు. (వివాహములేక భార్యలేనివారు) వీరికి బ్రహ్మవిద్యయందు అధికారము కలదా, లేదా, "తమేతం" అను శ్రుతి "ఆశ్రమకర్మలే జ్ఞానసాధనములు" అని చెప్పుచున్నది. విధురుడు ఆశ్రమము లేనివాడు కావున వీడుచేయు కర్మలు జ్ఞానసాధనములు కానేరవుగదా. అనిన నీవిషయమునుగూర్చి ఈ అధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ 3౬॥ అంతరాచాపితు తద్దృష్టేః॥

టీక॥ తద్దృష్టేః=విధురులగు రైక్వుడు మొదలగు వారుచేసిన కర్మలు జ్ఞానసాధనములయ్యెనని శ్రుతియందు కనుపడుచుండుట వలన, అంతరాచాపి=ఏఆశ్రమమును లేని విధురునకుకూడ, బ్రహ్మవిద్యాధికారః=బ్రహ్మవిద్యయందధికారముగలదు.

తా॥ రైక్వమహారాజు మొదలగు విధురులకు అనేకులకు బ్రహ్మజ్ఞానము కలదని శ్రుతియందు వర్ణింపబడియున్నది. ఈ వర్ణనమును బట్టిచూచిన వారుచేసినకర్మలు జ్ఞానసాధనము లయ్యెనని చెప్పవల

యున్నగదా. కావున ఏ ఆశ్రమమును గాక మధ్యలోనుండు విధురులకు కూడ బ్రహ్మ విద్యయందు అధికారము గలదనియే చెప్ప వలయునని తాత్పర్యము.

సూ॥ ౩౭॥ అపిచ స్మర్యతే ॥

టీక॥ అపిచ=మఱియు, స్మర్యతే=స్మృతియందును ఇట్లు చెప్ప బడి యున్నది.

తా॥ భారతము మొదలగు ఇతిహాసములయందుకూడ పైవిష యమే చెప్పబడియున్నది. ఎట్లనగా, దిగంబరత్వము మొదలగు కర్మల నాశ్రయించి యున్నవారగుటచే సంవర్తుడు మొదలైనవారికి ఆశ్రమ కర్మలతో పనిలేదు. అట్లున్నను వారు మహాయోగులని బ్రహ్మ వేత్త లని భారతాదులు వర్ణించుచున్నవి. దీనిబట్టి యేయాశ్రమము లేనివారికికూడ బ్రహ్మవిద్యయందు అధికారముకలదని ఏర్పడుచున్న దని తాత్పర్యము,

అవ॥ రైక్వాదులకు బ్రహ్మజ్ఞానము కలదనుట మీసిద్ధాంతము నకు ఆధారముకానేరదు. వారు ఆశ్రమములేనివారగుటచేవారుచేయు కర్మలు జ్ఞానసాధనములు కానేరవుగదా. జ్ఞానము కలుగుచుండుచున్నను, పూర్వజన్మమునందు ఆచరింపబడిన కర్మవలన సంభవింప వచ్చును. అనిన నీవిషయమును అంగీకరించినను సిద్ధాంతమునకు భంగము లేదని చెప్పుచున్నాడు.

సూ॥ ౩౮॥ విశేషానుగ్రహశ్చ ॥

టీక॥ విశేష=కొన్నికొన్ని కర్మలచేతనే, అనుగ్రహః=బ్రహ్మ విద్యాధికారము గలదను సంస్కారము, సంభవతి=సంభవించును.

తా॥ అవతారికయందు చూపబడినట్లు విధురులు చేయు నా శ్రమకర్మలు జ్ఞానజనకములు కానేరవనినను బాధలేదు. సర్వసాధా రణముగా ఆశ్రమాదివిధుల నపేక్షింపకయే విధింప బడియున్న జప ము, ఉపవాసము, దేవతార్చనము, మొదలగునవియే జ్ఞానము కలిగిం చుటకు చాలును. వీటియందు ఆశ్రమకర్మలను నియమము లేకపోవు టచే ఇవి అందరిచేతను ఆచరింప బడవచ్చునుగదా. "జప్యేనైవతు సంసిద్ధ్యేత్ (జపముచేతనే బ్రహ్మజ్ఞానమును పొందవలయును" అను

ష్మృతికూడ పై విషయమునే నిర్ణయించుచున్నది. కావున విధురులకుకూడ బ్రహ్మజ్ఞానమునందు అధికారము కలదనుట నిర్వివాదమగు సిద్ధాంతమని తాత్పర్యము.

సూ॥ ౩౯॥ అతస్త్వితరజ్జ్యాయోలింగాచ్చ ॥

టీక॥ అతః=ఈకారణమువలననుంచి (విధురులు ఆశ్రమము లేనివారగుటవలననుంచి) లింగాచ్చ=గురుతువలననుంచిన్ని (ఆశ్రమము లేకుండా నుండకూడను. అనుమొదలగు గురుతువలననుంచిన్ని) ఇతరత్=రెండవది (ఆశ్రమము కలిగియుండుట) జ్యాయః=శ్రేష్ఠమైనది.

తా॥ పైనచేసిన నిరూపణవలన విధురులకుగూడ బ్రహ్మవిద్యయందు అధికారముకలదని యేర్పడుచున్నదిగదా. దీనివలన ఆశ్రమము కలిగియుండుట లేకుండుట ఈ రెండునొకటియేయని తలంపకూడదు. ఆశ్రమములు లేకుండుటకంటె వానికలిగియుండుట శ్రేష్ఠము. అది శీఘ్రముగా ఫలమునిచ్చును. సంపూర్ణమగు పుణ్యముచేసియున్నవారలకుగాని ఆశ్రమభంగము కలుగకుండుట సంభవింపదు. "అనాశ్రమీనతిష్ఠేత్ (ఆశ్రమములు లేకుండా క్షణమాత్రమైనను ఉండకూడదు") అనుమొదలగు వాక్యములచేత ఆశ్రమములు లేకపోవుట దోషమనియు, పుణ్యవంతులకుగాని ఆదోషము తటస్థింపకుండదనియు ఏర్పడుచున్నదిగదా. ఈ విషయమునే "తేనైతి బ్రహ్మవిత్పుణ్యకృత్ (బ్రహ్మవేత్తయగువాడును సంపూర్ణమగు పుణ్యము నొనర్చినవాడును ఆ పరబ్రహ్మముతో నైక్యమునొందును.)" అను శ్రుతికూడ పుణ్యకృత్ శబ్దముచే సూచించుచున్నది. సంపూర్ణమగు పుణ్యము ఆశ్రమము కలవారలకుతప్ప యితరులకుండుటకు వీలులేదు కావున వారే (ఆశ్రమములుకలవారే) విధురులకంటె శ్రేష్ఠులని పై శ్రుతివలన తెలియవచ్చుచున్నదనుట. కావున బ్రహ్మవిద్యయందు అధికారమందరకునున్నను ఆశ్రమము కలవారలు పుణ్యాధికులగుటచే విధురులకంటె శ్రేష్ఠులనియు ఇంతమాత్రమున విధురుల కధికారము లేదని చెప్పకూడదనియు తాత్పర్యము.

## —(*) ౧౦. తద్భూతాధికరణమ్. (*)—

అవ ॥ పై యధికరణమునందు ఆశ్రమము లేనివాడికి కూడా బ్రహ్మవిద్యయందు అధికారము కలదని చెప్పియున్నారు. దీనినిపట్టి చూచిన ఉత్తమాశ్రమమును జెందియును మరల పూర్వాశ్రమమునకు వచ్చిన పురుషునకుకూడా బ్రహ్మవిద్యాధికారము కలదనియు వాడు చేయుకర్మలుకూడా జ్ఞానసాధనములగు ననియు చెప్పవలసి వచ్చుచున్నది. ఈ విషయమున మీసిద్ధాంత మేమియనిన, చెప్పుచున్నారు.

సూ॥ ౪౦॥ తద్భూతస్యతునాతద్భావో జైమినేరపి
నియమాతద్రూపాభావేభ్యః ॥

టీక॥ నియమాతద్రూపాభావేభ్యః=విధించుటవలనను ఉత్తమాశ్రమము ( సన్యాసాశ్రమము నుండి పూర్వాశ్రమమునకు రావచ్చుననుటలో ప్రమాణము లేకుండుటవలనను పెద్దల యాచారమునందు అట్లు లేకుండుటవలనను, తద్భూతస్య=ఆ ఉత్తమాశ్రమము నంగీకరించినవానికి, అతద్భావః=ఆ ఆశ్రమమునుండి పూర్వాశ్రమమునకు వచ్చుట, న=లేదు, ఇదం=ఇది, జైమినేః అపి=జైమిని మహామునికికూడా, సమ్మతం=సమ్మతమైనది. )

తా॥ ఉత్తమాశ్రమము నవలంబించినవాడు మరల పూర్వాశ్రమమునకు రాకూడదు. అందువలన అట్లువచ్చినవాడు చేసినకర్మలు జ్ఞానసాధనములు కానేరవు. ఉత్తమాశ్రమమును పొందినవాడు ఏకార్యమువలననైనను పూర్వాశ్రమమునకు రావచ్చుననుటలో ప్రమాణముగాని పూర్వాచారముగాని లేదు. మఱియు " అరణ్యమియాత్ ( ఉత్తమాశ్రమమును పొందవలయును") అనువిధి క్రింది యాశ్రమములవారు ఉత్తమాశ్రమములకు పోవలయునని తెలియజేయుచున్నది గాని ఉత్తమాశ్రమములవారు క్రింది ఆశ్రమములకు రావచ్చునని సూచింపనైనను లేదుగదా. విశేషించి ఈ విధివలన ఉత్తమాశ్రమము వారు పూర్వాశ్రమమునకు వచ్చుట నిషేధమనికూడా తెలియవచ్చుచున్నది. ఈ కారణములవలన ఉత్తమాశ్రమనిష్ఠులు పూర్వాశ్రమమునకు మరలవత్తురనుట ఎట్లును సంభవింపదు. ఉత్తమాశ్రమము (సన్యాసాశ్రమము ) లేదను జైమిని మహామునికికూడా నీవిషయము సమ్మ

తమే. కావున ఆశ్రమభ్రష్టుడొనర్చిన కర్మములు బ్రహ్మజ్ఞానమును కలిగింప నేరవని తాత్పర్యము,

—(*) ౧౧. అధికారికాధికరణమ్. (*)—

అవ॥ ఉత్తమాశ్రమమునుండి ( సన్యాసాశ్రమము నుండి ) భ్రంశమునొందినవాడు చేసినకర్మలు విద్యాహేతువులుకావని పైయధికరణము నందు నిరూపించి యున్నారు. ఆసన్యాసికి ప్రమాదము వలన నేదేని భంగము తటస్థించినప్పటికని అట్లే కావలయునుగదా. అనిన, నట్లు కాదని చెప్పుచు పూర్వపక్షమున అనువాదము చేయుచున్నాడు.

సూ॥ ౪౧॥ నచాధికారికమపి పతనానుమానాత్తదయోగాత్ ॥

టీక॥ అవకీర్ణినః=వ్యభిచారము చేసిన నైష్ఠికబ్రహ్మచారికి, ఆధికారికమపి=మీమాంసయందలి అధికారలక్షణమను ఆరవఅధ్యాయము నందు చెప్పబడిన ప్రాయశ్చిత్తమున్ను, న=లేదు, కస్మాత్=ఎందువల్లన ననగా, పతనానుమానాత్= పతితుడగునను స్మృతివలన, తదయోగాత్=ఆప్రాయశ్చిత్తమతనికి సంభవింపదు కావున.

తా॥ నైష్ఠికబ్రహ్మచర్యాశ్రమమును ( దీర్ఘబ్రహ్మచర్యమును ) అవలంబించిన వాడు దోషియయ్యేనేని వానికి మీమాంసాశాస్త్రము నందలి ఆరవ యధ్యాయమునందు చెప్పిన ప్రాయశ్చిత్తము పరిశుద్ధమును కలిగించుననుటకు వీలులేదు. వానిదోషమునకు ప్రాయశ్చిత్తమే లేదని " ఆరూఢోనైష్ఠికంధర్మం ( నైష్ఠిక బ్రహ్మచారియైనవాడు) " అనుమొదలగు స్మృతిచెప్పుచున్నదిగదా. దీనినిబట్టి చూచిన సన్యాసి కూడ ప్రమాదమువలన దోషియయ్యేనేనివానికికూడప్రాయశ్చిత్తము లేదని చెప్పవలసియున్నది. కావున అట్టిసన్యాసి కెప్పటికిని పారిశుద్ధ్యములేదనియు వాడుచేసినకర్మలు విద్యాసాధనములు కానేరవనియు తాత్పర్యము. ( ఇది పూర్వపక్షసూత్రము )

అవ॥ ఇట్లు పూర్వపక్షమును అనువాదముచేసి దానిని ఖండించి సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ॥ ౪౨॥ ఉపపూర్వమపిత్వేకే భావమశనవత్తదుక్తం ॥

టీక॥ అపితు=అయితే, ఏకే, కొందరు, నైష్ఠికవ్యభిచరణం=

నైష్ఠిక బ్రహ్మచారియొక్క వ్యభిచారము, అశనవత్ = మాంసభక్షణమువలె, ఉపపూర్వం=ఉపపాతకములలో చేరినదియనియు, అతః= ఈకారణమువలన, ప్రాయశ్చిత్తభావం = ప్రాయశ్చిత్త మున్నదనియు, మన్యంతే=తలంచుచున్నారు. తదుక్తం = అదియును పూర్వమీమాంసాశాస్త్రమునందు చెప్పబడియున్నది.

తా॥ పై పూర్వపక్షము సమంజసమైనదికాదు. కొందరు ఆచార్యులు నైష్ఠిక బ్రహ్మచారియొక్క వ్యభిచారము మహాపాతకములలో చేరదనియు ఆకారణమువలన ప్రాయశ్చిత్తముండవచ్చుననియు చెప్పుచున్నారు. గురుభార్యాగమనముక్క తప్ప తక్కిన వ్యభిచారములన్నియు మహాపాతకములలో చేర్చబడలేదుగదా. మరియు " బ్రహ్మచార్యవకీర్ణీ ( వ్యభిచరించిన బ్రహ్మచారి అనుమొదలగు శ్రుతి దోషయుక్తులగు బ్రహ్మచారులకందరకును ప్రాయశ్చిత్తము కలదని చెప్పుచున్నది. పై సూత్రమునందు ఉదహరింపబడిన స్మృతియన్నను లక్షణావృత్తిచేత ( ఊహామాత్రముచేత ) వారలకు ప్రాయశ్చిత్తము లేదని తెలియజేయుచున్నది. ఇట్లుండుటచేత స్మృతికంటె ప్రధానముగా శ్రుతిని యాదరింపవలయును. లక్షణావృత్తిచేత చెప్పబడిన యర్థముకంటె ప్రధానముగ అభిధావృత్తిచేత ( వాక్యముచే స్పష్టముగా ) చెప్పబడిన యర్థమును గ్రహింపవలయును. పరస్పరవిరోధము కలిగినప్పుడు శ్రుతి, స్మృతులనిర్ణయమిట్టిదని పూర్వమీమాంసాశాస్త్రమునందు చెప్పబడినదిగదా. కావున నైష్ఠిక బ్రహ్మచారికొచ్చిన దోషమునకు ప్రాయశ్చిత్తము కలదనియే నిర్ణయింపవలసియున్నది. సన్యాసివిషయమునందుకూడ నిట్లే నిర్ణయించుకొనవలయును. కావున ఉత్తమాశ్రమస్థులు ప్రమాదములన దోషయుతులైనను ప్రాయశ్చిత్తముచే పరిశుద్ధులై రేని వారుచేయు కర్మములు బ్రహ్మజ్ఞానాంగములగుననుటలో సందేహములేదని తాత్పర్యము.

—(*) ౧౨. స్మృత్యాచారాధికరణమ్. (*)—

అవ॥ ప్రాయశ్చిత్తముచే పరిశుద్ధులైన భ్రష్టులు చేయుకర్మములు జ్ఞానసాధనములగునని పై యధికరణమునందు నిరూపించియున్నారు. శిష్టులగువారు అట్టివారలతో కూడ సవ్యవహారము ( వారి

తోఁకూడ భుజించుట, అధ్యయనము చేయుట, మొదలగునవి ) చేయుదురుగదా యనిన నట్లు చేయరని ఈ అధికరణమున నిరూపించుచున్నాడు.

సూ॥ ౪౩॥ బహిస్తూభయథాపి స్మృతేరాచారాచ్చ ॥

టీక॥ ఉభయథాపి= రెండువిధములు గాకూడ, ( భ్రష్టుకొనర్చినపాపము మహాపాపమైనను ఉపపాపమైనను ) స్మృతేః ఆచారాచ్చ=స్మృతివలనను, ఆచారమువలనను, సతు=అభ్రష్టుడైతే, బహిః= శిష్యులచే బహిష్కరింపబడును.

తా॥ అభ్రష్టుడు చేసినది మహాపాపమైనను ఉపపాపమైననగుగాక రెండువిధములుగాకూడ శిష్టులగువారు వానిని బహిష్కరింపవలయును. ( అనగా సకార్యమునందును వానితో సంబంధము కలిగించుకొనకూడదనుట ) " నైష్ఠికానాం వనస్థానాం యతీనాంచావకీర్ణినాం । శుద్ధానామపిలోకేస్మిన్ ప్రత్యాపత్తిర్న విద్యతె ఇతి ( నైష్ఠిక బ్రహ్మచారులుగాని వానప్రస్థులుగాని యతులుగాని భ్రష్టులై ప్రాయశ్చిత్తాదులచేత మరల పరిశుద్ధులైనను వారిని లోకమునందు చేర్చుకొనకూడదు. ) " అనుస్మృతి స్పష్టవిషయమునే స్పష్టము చేయుచున్నది. శిష్టనియాచారముకూడ నట్లేయున్నది. ఇందు రహస్యమేమనిన, ప్రాయశ్చిత్తము చేసికొనినవానికి పరలోకమునందు దండన చేయవలసిన పాపాంశము నశించినను ఇహలోకమునందు వారిని బహిష్కరింపజేయగల పాపాంశము నశింపదు. లోకమెప్పటికిని పామరజనబహుళమన్యోయుండును. కావున నది ప్రాయశ్చిత్తమువలన గలిగిన మనశ్శుద్ధిని తెలిసికొననేరదు. ప్రసిద్ధమైయున్న దోషమునేయెంచుచు, " వీరుతప్పుచేసిరి. వీరినికులములోనికి నెట్లు రానిచ్చెదరు " అని వారినెప్పుడును నిందించుచుండును. కావున శిష్టులగువారు ప్రాయశ్చిత్తముచే శుద్ధులైరని ఆదోషులను పరిగ్రహించిరేని సామాన్యముగా లోకులకంతయును ఆశిష్టులపై యభిమానము తగ్గును. అప్పుడు ధర్మమునందుకూడ నాపామరులు అనాదరము చూపుదురు. కావున ఆపామరుల నుద్ధరించుటకై ప్రాయశ్చిత్తశుద్ధులగు దోషులను ఇహలోకమునందు పరిగ్రహింపకూడదని శ్రుతిస్మృతులు చెప్పుచున్నట్లు

లోచుచున్నది. ప్రాయశ్చిత్త శుద్ధులైనవారికిని ఇహలోకమునందు బహిష్కరింపచేయగల పాపాంశముండుననుట కిదియేయర్థమని నిర్ణయించుకొనవలసియున్నది. ఈవిధముగా భ్రష్టులగువారు ప్రాయశ్చిత్తశుద్ధులైనను బహిష్కరింప బడవలసినవారేయని నిరూపింపబడియుండుటవలన వారలతోకలసి చేయుకార్యము లేవియును ఫలము లియ్యవని తాత్పర్యము.

—(*) ౧౩. స్వామ్యధికరణమ్. (*)—

అవ॥ ఉద్గీథము మొదలగు కర్మాంగములను ఆశ్రయించి విధింపబడియున్న ఉపాసనలను యజమానుడు చేయవలయునా, లేక, ఋత్విక్కుడు చేయవలయునా యను సంశయమును ఈ యధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౪౪॥ స్వామినః ఫలశ్రుతేరిత్యాత్రేయః ।

టీక॥ ఫలశ్రుతేః=ఫలమును సూచించు శ్రుతివలన, ఉపాసనాకర్తృత్వం=ఉపాసనలను చేయుట, స్వామినః - యజమానునిదని యే, ఇతి—అని, ఆత్రేయః = ఆత్రేయమహాముని తలంచుచున్నాడు.

తా॥ " [illegible] య ఉపాస్తే ( ఎవడు ఉపాసన చేయునో వానికివర్షించును ) అను మొదలగు శ్రుతులయందు ఏకర్మ చేయునో వానికే కర్మఫలము కలుగునని చెప్పబడియున్నది. అంగసహితమగు కర్మయొక్క ఫలమును అనుభవించువాడు యజమానుడే కదా. ఈకారణమువలన కర్మాంగోపాసనలను యజమానుడే చేయవలయును. కర్మసా[illegible]యు [illegible] పైనుదహరించిన శ్రుతియందలి " ఉపాస్తే " అను లకారమువలన ఉపాసనలను మాత్రము యజమానుడు చేయవలయునని యుక్తమగుచున్నది. అని ఆత్రేయ మహాముని తలంచుచున్నాడని తాత్పర్యము. ( ఇది పూర్వపక్షసూత్రము. )

అవ॥ ఈవిధముగా పూర్వపక్షమును అనువాదముచేసి దానిని ఖండించుచు సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ॥ ౪౫॥ ఆర్త్విజ్యమిత్యౌడులోమిస్తస్మైహి పరిక్రీయతే ॥

టీక॥ ఔడులోమిః = ఔడులోమి మహాముని, ఉపాసనం=

కర్మాంగోపాసన, ఆత్రేయ్యం = ఋత్విక్కులు చేయవలసినదియే, ఇతి = ఈలాగునని, మన్యతే = తలంచుచున్నాడు. సః = ఆఋత్విక్కు (సామాన్యముగజాతియందు ఏకవచనం) తస్మై = ఆకర్మకొఱకు, యజమానేన = యజమానునిచేత, పరిక్రీయతే హి = ధనదానాదులచే కొనబడుచున్నాడుగదా (స్వాధీనము చేసుకొనబడుచున్నాడు గదా యనుట.)

తా॥ ఆత్రేయమతము సరియైనది కాదు. తనకై కర్మలనంతయును చేయుటకు యజమానుడు తగినంతధనమునిచ్చి ఋత్విక్కులను స్వాధీనము చేసికొనును. ఆకారణమువలననే వారు చేసిన కర్మలు యజమానునకే ఫలము నిచ్చును. దీనినిబట్టియుంచిన "వర్షత్యస్మై" అనుమొదలగు ఫలశ్రుతికి విరోధమేమియును రాదు. వీటననిన్నిటిని విధించిన కర్మాంగోపాసనలను ఋత్విక్కులు చేయవలసినదియే కాని యజమానుడు చేయనక్కఱలేదని ఏర్పడుచున్నది. ఇదియే సిద్ధాంతమని ఔడులోమిమహాముని తలంచుచున్నాడు. వ్యాసాభిప్రాయము కూడ నిదియేయని తాత్పర్యము.

సూ॥ ౪౬॥ శ్రుతేశ్చ ॥

టీక॥ శ్రుతేశ్చ = శ్రుతివలనకూడ, పూర్వోక్తం = ఇంతకుముందుచేయబడిన సిద్ధాంతము, సిద్ధం = దృఢమగుచున్నది.

తా॥ "యాంవై కాంచనఋత్విజ ఆశిషమాశాసతే యజమానాయతామాశాసతే (ఋత్విక్కు ఏదఆశీర్వాదమును చేయునో దానినంతయు యజమానునికొఱకయ్యే చేయును)" అను మొదలగు శ్రుతులచేత ఋత్విక్కులుచేయు కర్మలన్నియును యజమానునే కొందునని చెప్పబడినది. కావున ఉపాసనయును అట్లే యజమానునకు ఫలమునిచ్చును. ఋత్విక్కులు చేసినంతమాత్రముననే అది ఋత్విక్కులకు ఫలమునియ్యనేరదని తాత్పర్యము.

—(*) ౧౪. సహకార్యంతర విధ్యధికరణమ్. (*)—

అవ॥ బృహదారణ్యకోపనిషత్తునందు "తస్మాత్ బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్యబాల్యేనతిష్ఠాసేత్ బాల్యంచ పాండిత్యంచ నిర్విద్యాథమునిః (ఆకారణమువలన బ్రాహ్మణుడగువాడు వేదాంత

శ్రవణమువలన కలిగిన పరోక్షజ్ఞానమును పొంది దానిని మననముచే యుంచుండవలయును. శ్రవణమును మననమును బాగుగా పొందినపిదప ధ్యానరూపమగు నిదిధ్యాసమును చేయవలయును. [ శ్రవణమనగా వినుట, మననమనగా, ఆవినినదానిని ఆలోచనచేసి స్థిరపరుచుకొనుట. నిదిధ్యాసమనగా, అట్లు స్థిరమైన విషయమును ధ్యానముచేయుట. ] " అను శ్రుతిచేత చెప్పబడిన నిదిధ్యాసము విధియా, కాదా, అనువిషయము ఈ అధికరణమునందు విచారింపబడుచున్నది.

సూ॥ ౪౭॥ సహకార్యంతర విధిః పక్షేణ తృతీయం తద్వ
తో విధ్యాదివత్ ॥

టీక॥ అస్మిన్ వాక్యే= " నిదిధ్యాసితవ్యో " అను వాక్యమునందు, తృతీయం సహకారి = మూడవదియగు ధ్యానమును గూర్చిచెప్పుట, తద్వతః= పరోక్షజ్ఞానముకలవానికి, పక్షేణ = ఒకపక్షమునందు, సహకార్యంతరవిధిః= అపరోక్ష బ్రహ్మజ్ఞానమునకు, సహాయముగా శ్రవణ, మననములకంటె వేరగు నొకదానిని ( నిదిధ్యాసమును ) విధించుటయే, ఇదంచ=ఇదియు, విధ్యాదివత్= విధివలె, అదియందుగల దర్శపూర్ణమాసాది వాక్యమునందువలె, జ్ఞేయం= తెలిసికొనతగినది.

తా॥ అవతారికయందు ఉదహరించినవాక్యమునందు శ్రవణ మననములవలె అపరోక్ష బ్రహ్మజ్ఞాన సాధనములలో మూడవదియగు నిదిధ్యాసము విధింపబడుచున్నది. ధ్యానమనగా నిదిధ్యాసమే. ఇది పూర్వము ఏ ప్రమాణముచేతగాని చెప్పబడియుండలేదు. కావున ఈ వాక్యమునందు విధింపబడుచున్నదనియే స్పష్టముగా చెప్పవలయును. పై వాక్యమునందలి పాండిత్యశబ్దముచేత నీనిదిధ్యాసమే చెప్పబడెననుటకు వీలులేదు. ఆశబ్దము శ్రవణమువలన కలిగిన పరోక్షజ్ఞానమును చెప్పునని స్పష్టముగా నిర్ణయింపబడినదే యున్నది. పరోక్ష బ్రహ్మజ్ఞానము కలవానికే అపరోక్ష బ్రహ్మజ్ఞాన సాధనములను విధించుట యుక్తము. కావున ధ్యానపాండిత్యపదముల యర్థమొక్కటిగా నేరదు. ఈవిషయమును సూత్రకారుడు, " తద్వతః " అనుపదముచే సూత్రమునందే స్పష్టముచేసియున్నాడు. మఱియును సూక్ష్మవస్తువులను గ్రహించునప్పుడెల్లను ఆవస్తువులయొక్క రూప

మును పలుమారు మనస్సునందు భావింపవలసియుండును: అదియే గదా నిదిధ్యాసము. బ్రహ్మవిషయమునందుకూడ నిదివిధించుటతో నవసరములేకయే సంభవించును. ( సంభవించవచ్చును ) ఇట్లుండ దీనినివిధించుటచేత ప్రయోజనమేమియందురేమో, ఇంతమాత్రము వలన ఈవిధి నిరర్థకముకానేరదు. ఏలయనగా:—మీరన్నట్లు సూక్ష్మ వస్తువుల విషయమునందంతటను ఈనిదిధ్యాసము అవశ్యముగా కావలసివచ్చుననుట నిశ్చయమే. అయినను ఆస్థలములందు "తానువేరు ఆవస్తువువేరు" అనుభేదదృష్టి యుండును. కావున యచ్చటి నిదిధ్యాసనమున కెప్పటికిని భంగమురాదు. ఈబ్రహ్మవిషయమునం దన్నను "నేనేబ్రహ్మను" అనునభేదభావన ఆవశ్యకమై యుండుటచేతను "నేనువేరు బ్రహ్మమువేరు" అను భేదభావన అనాదిసిద్ధమైయుం డుటచేతను ఎంతదృఢచిత్తులకైనను ఒకానొకప్పుడు నిదిధ్యాసభంగము తటస్థించును. ఈకారణమువలన పైవాక్యమునందు చేయబడిననిదిధ్యాసవిధి నిరర్థకముకానేరదు. ఈవిషయమునంతయును "పక్షేణ" అనుపదముచే సూత్రకారుడు స్పష్టము చేసియున్నాడు. ఇదియును గాక బ్రహ్మసంబంధమగు నీవాక్యమునందు నిదిధ్యాసమును విధించుటయుక్తమని చెప్పుటకు వీలులేదు. పూర్వ కాండమునందు ( కర్మకాండమునందు ) ఇట్టి దృష్టాంతములు అనేకములు గలవు. దర్శపూర్ణమాస యాగమునుగూర్చి చెప్పువాక్యమునందు దానియంగములు విధింపబడియున్నవిగదా. ఇట్లే బ్రహ్మప్రధానమగు నీవాక్యమునందుగూడ అపరోక్షజ్ఞానాంగమగు నిదిధ్యాసము విధింపబడియున్నది. ఈవిషయమున సూత్రకారుడు "విధ్యాదివత్" అను పదముచే స్పష్టీకరించియున్నాడు. ఇట్లు సర్వమును విమర్శించిన అవతారికయందు చూపబడిన "తస్మాత్" అను మొదలగు వాక్యమునందు నిదిధ్యాసము విధింపబడుచున్నదియనుట నిర్వివాదాంశమై యున్నదని తాత్పర్యము.

అవ॥ శ్రవణము మొదలగు ధర్మములు ప్రధానముగా గల సన్న్యాసాశ్రమము ఒకటియున్నదని "సఖల్వేవం వర్తయన్యావదాయుషం" ( అగృహస్థుడు ఈవిధముగా [ వేదముచెప్పునట్లు ] జీవి

తకాలమంతయును ఇరువుకొనుచుండవలయును. ) అను ఛాందోగ్య శ్రుతికి విరోధము వచ్చును. ఆశ్రుతియందు సన్యాసాశ్రమము లేదని చెప్పబడియున్నదికదా. అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౪౮॥ కృత్స్న భావాత్తు గృహిణోపసంహారః ॥

టీక॥ తస్య=( అగృహస్థునకు ) వానికి, కృత్స్న భావాత్తు= జ్ఞానసాధనములన్నియు నుండుటవలన, గృహిణాతు = అగృహస్థునితో, సర్వేషాం ఉపసంహారః = సర్వధర్మములును ఉపసంహరింపబడుచున్నవి.

తా॥ అవతారికయందు చెప్పబడిన పూర్వపక్షము సరియైనదికాదు. ఆఛాందోగ్యశ్రుతికిని సన్యాసాశ్రమము కలదనుమాటకును విరోధములేదు. ఏలయనగా, ఆశ్రుతి గృహస్థుని ప్రవర్తనలనుగూర్చి చెప్పుచున్నదికాని సన్యాసాశ్రమము లేదని చెప్పుటలేదు. గృహస్థునియందు బ్రహ్మవిద్యకు కావలసిన అంగములన్నియు నుండుటచేత వానినిగూర్చి " సఖల్వేవం " అని చెప్పుటవలన విరోధములేదు, "యావదాయుషం" అనియున్నంతమాత్రమువలన సన్యాసాశ్రమము లేదని చెప్పుటకు వీలులేదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు సన్యాస గృహస్థాశ్రమములనుగూర్చి మాత్రమే విచారించుటవలన మాధుదేవ్వడైనను ఇతరాశ్రమములు లేవని తలంచునేమోయని ఆయాశ్రమములనుగూర్చి ఈక్రింది సూత్రమునందు చెప్పుచున్నాడు.

సూ॥ ౪౯॥ మౌనవదితరేషా మప్యుపదేశాత్ ॥

టీక॥ మౌనవత్ =సన్యాసాశ్రమమువలెను, గార్హస్థ్యవచ్చ= గృహస్థాశ్రమమువలెను, ఇతరేషామపి= తక్కినఆశ్రమములనుగూడ, ఉపదేశాత్ = ఉపదేశించియుండుటవలన, తానిచగ్రాహ్యాణి = అవియును గ్రహింపతగినవే.

తా॥ గృహస్థ సన్యాసాశ్రమములనుగూర్చిమాత్రమే ఇతరాశ్రమములు లేవని తలంపకూడదు. బ్రహ్మచర్యాద్యాశ్రమములుకూడ శ్రుతులయందును స్మృతులయందును విధింపబడియేయున్నవి. కా

శున బ్రహ్మజ్ఞానమును కోరువాడు ఈనాలుగు ఆశ్రమములను ఆదరిం పవలసినదియే యని తాత్పర్యము.

—(*) ౧౫. అనావిష్కారాధికరణమ్. (*)—

అవ॥ పై అధికరణమందు విచారించిన "తస్మాద్బ్రాహ్మణః" అను శ్రుతియందలి బాల్యపదముయొక్క అర్థమును విచారించుటకై ఈ అధికరణమును ఆరంభించుచున్నాడు.

సూ॥ ౫౦॥ అనావిష్కుర్వన్నన్వయాత్ ॥

టీక॥ అన్వయాత్ = మోక్షము నాశ్రయించిన వాడగుటచే, ఆత్మానం అనావిష్కుర్వ౯ = తనను లోకమునందు ప్రకటించుకొనక (అభిమానాదులులేక) తిష్ఠేదితి=ఉండవలయునని, బాల్యశబ్దార్థః= "తస్మాద్బ్రాహ్మణః" అను మొదలగు శ్రుతియందున్న బాల్యశబ్దమునకు అర్థము.

తా॥ బాల్యమనగా, బాలురవలె యథేష్టముగా సంచరించుట యని యర్థముగాదు. విద్యాహీనుడగుటచే అల్పవయస్సుగల బాలుని లోకమునందెట్లు ప్రసిద్ధిలేదో అట్లే జ్ఞానియగు వానికికూడ తనకు లోకమునందెట్లు ప్రసిద్ధిలేదో అట్లే జ్ఞానియగు వానికికూడ తనంత సామర్థ్యమున్నను లోకమునందు ప్రసిద్ధియుండకూడదు. (అనగా ప్రసిద్ధుడగువానికి అహంకారము మొదలగు కొన్ని దుర్గుణములు కలుగుటకు అవకాశముండును. కావున పరోక్ష బ్రహ్మజ్ఞానము గలవాడు తనకట్టి దుర్గుణములు రాకుండుటకై తనసామర్థ్యమును లోకమునందు ప్రకటింపకూడదనుట. ఇదియే ఆశ్రుతియందలి బాల్యశబ్దమునకర్థము. "యన్న సంతం నచాసంతం నాశ్రుతంనబహుశ్రుతం। నసువృత్తంనదుర్వృత్తం వేదకశ్చిత్సబ్రాహ్మణః (ఏపురుషుడు ఉన్నను, లేకున్నను, జ్ఞానవంతుడైనను, కాకపోయినను, సదాచారుడైనను, దురాచారుడైనను, ఇతరులచేత నెరుంగబడడో వాడే బ్రహ్మజ్ఞాని [ అనగా బ్రహ్మజ్ఞాని అట్లుండవలయుననుట.] ") అనుశ్రుతి పై చెప్పిన సిద్ధాంతమునకు ఆధారమని తాత్పర్యము.

—(*) ౧౬. ఐహికాధికరణమ్. (*)—

అవ॥ ఇట్లు జ్ఞానసాధనములను గూర్చిచెప్పి అజ్ఞానము ఈజన్మ

మునందు కలుగునా, జన్మాంతరమునందు కలుగునా, అను విషయ మును ఈ అధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౫౧॥ ఐహికమప్రస్తుత ప్రతిబంధే తద్దర్శనాత్ ॥

టీక॥ అప్రస్తుత ప్రతిబంధేసతి = ఈదినమునందు ఫలమునిచ్చు చున్న ప్రారబ్ధకర్మము ఆటంకపరుపక పోయినయెడల, జ్ఞానసాధనైః జ్ఞానజన్మా=బ్రహ్మజ్ఞానసాధనములచే నాజ్ఞానము జన్మించుట, ఐహిక మేవ=ఈజన్మమునందే కలుగును, తద్దర్శనాత్ =శ్రుతి స్మృతులుకూడ నట్లే చెప్పుచుండుటవలన.

తా॥ ప్రస్తుతజన్మమునందు ఫలము నిచ్చుచుండు కర్మకు ప్రార బ్ధకర్మయనిపేరు. ఉత్తర జన్మములయందు ఫలమునివ్వబోవుకర్మ ఆగా మియనియు, ఇకనెప్పుడో ఫలమునిచ్చుటకై చేర్చబడియున్నకర్మ సం చితమనియు, చెప్పబడును. విత్తనమును నాటినపిదప అదిఫలమునిచ్చు టకు కొంతకాలము కావలసివచ్చినట్లు శుభకర్మగాని, అశుభకర్మ గాని, ఫలమునిచ్చుటకు కొంతకాలము కావలసియుండుటచే నైనచూ పబడిన మూడువిభాగములును ఏర్పడుచున్నవని తెలిసి కొనవలయు ను. జ్ఞానియగువానికి నేనుకర్తను ఇదికర్మ దీనిఫలము నాకుకావలయు ను అనుమొదలగు భేదదృష్టియే నశించి పోవునుకావున మిథ్యయగు నీకర్మవాసనవిషయమునందు ఏమియును చేయనేరదు. అట్లైనను ప్రస్తుతము ఫలమునిచ్చుటకు ఆరంభించియున్న ప్రారబ్ధకర్మమాత్రము దానిఫలమునియ్యక విడువదు. ఆప్రారబ్ధమే తానిచ్చుఫలములను అను భవింప జేయుటకై జీవునకొక శరీరమును కల్పించినది. కావున ఆ శరీరముండవలసిన కాలము ప్రారబ్ధఫలానుభవముచేతనే నిర్ణయింప బడుచున్నది. ( అనగా ప్రారబ్ధకర్మఫలమును పురుషు డెంతకాలము ననుభవింప వలయునో అంతకాలమే వాని శరీరముండును అనుట. ) ప్రకృతమున మోక్షేచ్ఛగలవారు మోక్షజ్ఞానమునై అపరోక్ష జ్ఞానము కొరకు శ్రవణాది సాధనములను ఆచరించుచుందురుకదా. అప్పుడు వారల ప్రారబ్ధకర్మ వారికనుకూలమై తగిన దేశకాలాదులను సమకూ ర్చెనేని ఆ అపరోక్షజ్ఞానము ఈజన్మమునందే కలుగును. ప్రతికూలమై ఆటంకపరచెనేని మరుజన్మమునందు కలుగును. ఈ విషయమును

" శ్రవణాయాపి బహుభిర్యోనలభ్యః. శృణ్వంతోపి బహవోయం నవేద, అనేకజన్మసంసిద్ధః ( ఏపరబ్రహ్మము వినుటకుకూడ ననేకులకు దొరకువాడుకాడో సదావినుచున్నవారైనను అనేకులెవనిని తెలిసికొనలేరో, అనేకజన్మములకు పిదప సిద్ధినొందును. )" అనుశ్రుతిస్మృతివాక్యములు స్పష్టముచేయుచున్నవి. బాగుగవిచారించిన అపరోక్షబ్రహ్మజ్ఞానము కలవానికికూడ విడువని ప్రారబ్ధము పరోక్షబ్రహ్మజ్ఞానికి ప్రతిబంధము కలిగించుననుటలో సంశయ మేమియును లేదుకదా యని తాత్పర్యము.

—(*)౧౭. ముక్తిఫలాధికరణమ్. (*)—

అవ॥ బ్రహ్మజ్ఞానమునందు భేదముకలదని ( ఆలస్యముగాకలుగుట, శీఘ్రముగాకలుగుట, అనుభేదముకలదని ) పై యధికరణమునందు నిరూపింపబడియున్నది. అట్లే మోక్షమునకుకూడ భేదముకలదా యనిన, లేదని ఈ అధికరణముచే నిరూపించుచున్నాడు.

సూ॥ ఏవంముక్తిఫలానియమస్తదవస్థావధృతేస్తదవస్థావధృతేః ॥

టీక॥ ఏవం = ఈప్రకారముగా ( జ్ఞానమునకు ఐహికత్వము, ఆముష్మికత్వము, అనుభేదమున్నట్లు, ) ముక్తిఫలానియమః = మోక్షమునందు నియమములేదు, కుతః = ఎందువలననన గా, తదవస్థావధృతేః తదవస్థావధృతేః = పరబ్రహ్మగానుండుటయే మోక్షమని నిర్ణయించియుండుటవలన, ( ఒకపదమును రెండుమారులు చెప్పుట అధ్యాయము ముగిసినదని తెలియజేయుటకు. )

తా॥ పై యధికరణమునందు బ్రహ్మజ్ఞానమునందు భేదములున్నవని అనగా ఈజన్మమునందు పుట్టుట ఉత్తరజన్మమునందు పుట్టుట అనుశ్రుతులు గలవని నిరూపింప బడియున్నది. దీనినిబట్టి జ్ఞానసాధ్యమగు మోక్షమునకుకూడ భేదములుకలవని చెప్పుటకు వీలులేదు. సాధనములలోనుండు భేదములవలన సాధ్యమునందు భేదము కలుగవలసిన పనిలేదుగదా. ఒకడొకపనిని ఆలస్యముగా చేయును మఱియొకడు త్వరగా చేయును. ఇప్పుడు పురుషులయొక్క చేష్టయందు భేదముకలిగినను వారుసాధించు కార్యమునందు భేదముకలుగదుకదా. ఇదియునుగాక " బ్రహ్మవేద బ్రహ్మైవభవతి ( బ్రహ్మను తెలిసికొ

సినవాడు బ్రహ్మమేయగును. )" అనుమొదలగు శ్రుతులు స్వభావ సిద్ధమగు బ్రహ్మత్వమును తెలిసికొనవలయునేగాని ఆ బ్రహ్మత్వమే మోక్షమని చెప్పుచున్నవి. ఆ పరబ్రహ్మము నిర్విశేషుడని ( భేదములు లేనివాడని ) ఇదివరకే నిరూపింపబడియున్నది. కావున మోక్షముకూడ భేదములేనిదే కావలయును. కావున మోక్షరూపమగు ఫలమునందు ఏవిధమగు భేదము లేదని తాత్పర్యము.

పురుషార్థస్సూత్రదశద్విపంచాశత్ ॥ ౧౭॥ ౫౨॥

పురుషార్థః, పరామర్శం, స్తుతిమాత్రం, పారిప్లవార్థా, అగ్నీంధనాది, సర్వాపేక్షా చ, సర్వాన్నానుమతిశ్చ, విహితత్వాచ్చ, అంతరాచాపి, తద్భూతస్య తు, న చాధికారికం, బహిస్తూభయథా, స్వామినః, సహకార్యంతరవిధిః, అనావిష్కుర్వ, న్నైహికం, ఏవం ముక్తిఫలానియమస్తదవ॥ ౧౭॥

ఇతి శ్రీమత్కృష్ణద్వైపాయనముని ప్రణీతే బ్రహ్మసూత్రే.
తృతీయస్యాధ్యాయస్య చతుర్థః పాదః.

క॥ అనువది యేడధికరణము ।
లనగను రెనుబదియును నారును విశదా ।
ర్థరుచిర సూత్రంబులు భవ ।
హరణము తృతీయ సాధ నాధ్యాయమునన్ ॥

క॥ వైరాగ్యము తత్త్వంపద ।
శుద్ధము గుణోప సంహారములో ।
ఘోరుతర సాధ నౌఘవి ।
చారంబును వరుస నాల్గు పాదములందున్ ॥

ఇట్లు శ్రీ వెన్నెలకంటి సుందరరామశర్మచే రచియింపబడిన బ్రహ్మ
సూత్రార్థబోధినియను ఆంధ్రటీకా తాత్పర్యమునందు
తృతీయాధ్యాయము చతుర్థపాదము.
ముగిసెను.



ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణే నమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## చతుర్థాధ్యాయము - ప్రథమపాదము.

—(*) ౧. ఆవృత్త్యధికరణమ్. (*)—

అవ॥ పై అధ్యాయమునందు బ్రహ్మజ్ఞాన సాధనములనుగూర్చి విచారింపబడినది. ఇచ్చట ఫలములను గూర్చి విచారింపబడును. అందు శ్రవణాదులు ఒకమారు అనుష్ఠించిన చాలునా, లేక మరల మరల (అనగా ఫలమువచ్చునంతవరకు) ఆచరించు చుండ వలయునా, అను సంశయమును ఈ మొదటి అధికరణమున విచారించుచున్నారు.

సూ॥ ౧॥ ఆవృత్తిరసకృదుపదేశాత్ ॥

టీక ॥ అసకృదుపదేశాత్ = పలుమారు చెప్పబడియుండుట వలన, విద్యానాం ఆవృత్తిః = విద్యలను పలుమారు అనుష్ఠింపవల యును.

తా॥ బ్రహ్మజ్ఞానసాధనములగు శ్రవణాదులను పలుమారు అనుష్ఠింపవలయును. "శ్రోతవ్యోమంతవ్యో నిదిధ్యాసితవ్యః" అను శ్రుతి ఈవిషయమును తెలియచేయుచున్నది. మఱియు ఈశ్రవణా దులవలన కలుగుఫలము దృష్టఫలము ( కనుపడునట్టిఫలము ) కావున ఆఫలము (సగుణ బ్రహ్మముయొక్క గాని, నిర్గుణ బ్రహ్మముయొక్క గాని సాక్షాత్కారము ) కలుగునంతవరకు ఆయుపాసనలను ఆచరించు చునే యుండవచ్చును. ఉపాసనయనగా పలుమారు ధ్యానముచే యుచుండుటయే, కావున " ఉపాసనచేయుము " అనిచెప్పిన "పలు

మాట చేయనక్కఱలేదు" అని చెప్పినట్లు కానేరదుకదా. ఇదియునుగాక ఏదైన నొకసూక్ష్మవస్తువును గ్రహింపవలసివచ్చినప్పుడు దానిని గూర్చిన శ్రవణాదులు పలుమారు ఆచరింపబడుచుండుట లోకమునందు ప్రత్యక్షసిద్ధమైయున్నది. సామాన్య విషయమునందే ఇట్లున్న నిర్గుణకగు పరబ్రహ్మమునుగూర్చి చెప్పవలసినదేమున్నది. ఈకారణమునుబట్టిచూచిన శ్రవణాదిసాధనములు పలుమారు అనుష్ఠింపబడవలసినవియేకాని అదృష్టఫలములగు ( ఫలముకనుపడని ) కర్మలవలె నొక్కమారు ఆచరించి విడువదగినవి కావని తాత్పర్యము.

సూ॥ ౨॥ లింగాచ్చ ॥

టీక॥ లింగాచ్చ=గురుతువలనకూడ, ఏవమేవ = పైసూత్రమునందు చేయబడినసిద్ధాంతమే స్థిరమగును.

తా॥ మఱియు ఉద్గీథవిద్యయందు " రశ్మీం స్త్వంపర్యావర్తయాత్, ( నీవు సూర్యకిరణములను పలుమారు ధ్యానింపుము )" అని ధ్యానావృత్తి చెప్పబడియున్నది. ఈగురుతువలనకూడ అన్నిస్థలములయందును ధ్యానావృత్తికలదని నిర్ణయింపవచ్చునుగదాయని తాత్ప.

— (*) ౨. ఆత్మత్వోపాసనాధికరణము. (*)—

అవ॥ పై అధికరణమునందు శ్రవణాదులకు ఆవృత్తి చెప్పబడియున్నదికదా. అందు నిదిధ్యాసము చేయునప్పుడు పరబ్రహ్మమును ఆత్మస్వరూపముగా ధ్యానింపవలయునా, లేక, వేఱుగా ధ్యానింపవలయునా, అను సంశయమును ఈ అధికరణమున నివారించుచున్నాము.

సూ॥ ౩॥ ఆత్మేతితూపగచ్ఛంతి గ్రాహయంతిచ ॥

టీక॥ ఆత్మేతి = బ్రహ్మము ఆత్మయనియే, జాబాలాః ఉపగచ్ఛంతి= జాబాలశాఖవారు తెలిసికొనుచున్నారు. తత్వమస్యాదివాక్యానిచ = తత్వమసి అను మొదలగు వాక్యములును, గ్రాహయంతి= అట్లే తెలియజేయుచున్నవి.

తా॥ సగుణవిద్యనుగాని నిర్గుణవిద్యనుగాని చేసినుపాసించినను ఉపాస్యదేవతయగు పరబ్రహ్మమును తానుగానే భావింపవలయునుగాని తనకంటెనన్యునిగా తలంపకూడదు. " త్వంవా అహమస్మి భగవో దేవతే ( ఓదేవతా నీవె నేను ) " అను మొదలగువాక్యములచే

ఉపాసకుడు దేవతలు తనకంటే వేరుగా తలంపకూడదని జాబాలో పనిషత్తునందు చెప్పబడియున్నది. "తత్త్వమసి" అనుమొదలగు శ్రుతులుకూడ నీవిషయమునే స్పష్టము చేయుచున్నవి. కావున ఏవిద్య నుపాసించువాడైనను పరబ్రహ్మమును ఆత్మగానే ధ్యానింపవలయునని తాత్పర్యము.

—(*) ౩. ప్రతీకాధికరణమ్. (*)—

అవ॥ ఉపాస్యదేవతను ఆత్మగానే ధ్యానముచేసినట్లే ప్రతీకములను (ధ్యానముచేయుటకై చెప్పబడిన మనస్సుమొదలగు ఉపాధులను) గూడ ధ్యానముచేయవలయునా, కూడదా, అను సంశయమును ఈ అధికరణమున నివారించుచున్నాము.

సూ॥ ౪॥ నప్రతీకేనహిసః ॥

టీక॥ ప్రతీకే=ఉపాధియందు, ఆత్మభావోనకర్తవ్యః = ఆత్మభావనచేయకూడదు. సః=ఆఉపాసకుడు, ప్రతీకోనహి = ఉపాధి కాదుగదా.

తా॥ ఉపాసనచేయుటకు ఆధారముగా నుండుటకై "మనోబ్రహ్మేత్యుపాసీత (మనస్సు బ్రహ్మయని ఉపాసన చేయవలయును)" అను మొదలగు వాక్యములచే చెప్పబడిన మనస్సు మొదలగు నుపాధులను ఆత్మగాభావింపవలసిన పనిలేదు. ఏలయనగా ఉపాధులు జడములు ఉపాసకుడు చేతనుడు కావున వీరిద్దరకును అభేదముకలుగ నేరదుగదా. ఈకారణమువలన చేతనుడగు పరబ్రహ్మమునందు ఆత్మభావము తగునుగాని జడమగునుపాధియందు అది తగదని తాత్పర్య.

—(*) ౪. బ్రహ్మదృష్ట్యధికరణమ్. (*)—

అవ॥ పరబ్రహ్మమును ఉపాసించుటకై మనస్సు మొదలగు నుపాధులు (విగ్రహములవంటివి) చెప్పబడియున్నవిగదా. ఇందు పరబ్రహ్మమునందు మనోదృష్టిని (పరబ్రహ్మమే మనస్సు అనుటను) ఉంచవలయునా, లేక, మనస్సునందు పరబ్రహ్మదృష్టిని (మనస్సే పరబ్రహ్మ అను తలంపును) ఉంచవలయునా, అను సంశయమును ఈ అధికరణమున నివారించుచున్నాడు.

సూ॥ ౫॥ బ్రహ్మదృష్టిరుత్కర్షాత్ ।

టీ॥ ఉత్కర్షాత్=అధికుడగుటవలన, మనఆదిషు = మనస్సు మొదలగు ప్రతీకముల యందు, బ్రహ్మదృష్టిః= పరబ్రహ్మమనుతలంపు కర్తవ్యా=చేయబడవలయును.

తా॥ మనస్సు మొదలగు ప్రతీకములను పరబ్రహ్మమునుగా భావించి ఉపాసింపవలయుననుటయే ప్రమాణాదిరూపమగు సిద్ధాంతము. ఏలయనగా, పరబ్రహ్మాధికుడు. మనస్సు మొదలగునవి హీనములు. అధికుడగువానిని హీనునిగా తలంపవలయుననుట సర్వప్రమాణములకును విరుద్ధముగదా. లోకమునందు హీనులగు (తక్కువవారైన) మంత్రిమొదలగువారియందు ప్రభువను అభిప్రాయముంచిన నది ఫలమును కలిగించునుగాని అధికుడగు ప్రభువునందు మంత్రియను నభిప్రాయముంచిన నది నిష్ఫలమగుటయేగాక నష్టహేతువుకూడ నగునుగదా. కావున పరబ్రహ్మము నిర్గుణస్వరూపముతో నుపాసించుట కష్టమని యా యుపాసన కాధారముగా చెప్పబడిన వగుట చేత ఆప్రతీకములయందు పరబ్రహ్మమును భావించుటయే యుక్తమని తాత్పర్యము.

యస్. వి. మూడు, నాలుగు, అధికరణములయందు ప్రతీకపదమునకు ఉపాస్యమనినర్థము చెప్పబడియున్నది. వైకుంఠవాసుడగు విష్ణువును పూజింపవలయునని ఆయన ఇచ్చటికి వచ్చువాడు కాకపోవుటచేత తద్భావనతో పూజించుటకై పాషాణము విగ్రహము నుంచుకొందుముగదా. అవిగ్రహముకూడ విష్ణుభావమునకు ఆధారమైనదగుటచే నాయనకు ఉపాధియేయగును. ఆకారరూపమగు మంత్రమునొక ఉపాధి ఇంతకుముందే వర్ణింపబడియున్నది. పై రెండధికరణములయందును ఉపాధియని చెప్పబడియున్న ప్రతీకము విగ్రహము వంటిదనియు నిర్గుణబ్రహ్మమును ప్రత్యక్షముగ తెలిసికొనలేనివానికి ఆధారముగా చెప్పబడియున్నదనియు తెలిసికొనవలయును.

—(*) ౫. ఆదిత్యాదిమత్యధికరణమ్. (*)—

అవ॥ "య ఏవాసౌ తపతి తముద్గీథముపాసీత (ఏసూర్యుడు ప్రకాశించుచున్నాడో అతనిని ఉద్గీథముగా నుపాసింపవలయును)" అనుమొదలగు నుపాసనలయందు భావింపవలసిన విధమెట్లు? సూర్యా

దులయందు ఉద్గీథాది దృష్టుల నుపాసింపవలయునా, లేక, నుద్గీథా దులయందు సూర్యాదిదృష్టుల నుపాసింపవలయునా? అను సంశయమును ఈ అధికరణమున నివారించుచున్నాడు.

సూ॥ ౬॥ ఆదిత్యాదిమతయశ్చాంగ ఉపపత్తేః ॥

టీక॥ ఉపపత్తేః=తగియుండుటవలన, అంగే= ఉద్గీథాదికర్మాంగములయందు, ఆదిత్యాదిమతయః= ఆదిత్యాదులు మొదలగు భావములు, యుక్తాః=తగియున్నవి.

తా॥ అవతారికయందు చూపఁబడిన సందర్భము కర్మాంగోపాసనలయందు తప్ప మఱి చెప్పటనుండదు. అచ్చటకూడ కర్మాంగములయందు సూర్యాది దృష్టినుంచుటయే కర్తవ్యము. ఒకపక్షమున ఉద్గీథాదులు కర్మాంగములగుటచేత వానికంటె ఫలరూపులగు ఆదిత్యాదులు అధికులనియు చెప్పవచ్చును. మఱియొక పక్షమున, ఉపాసనలు కర్మాంగములతో సమృద్ధినిగలిగించి తన్మూలమున కర్మకు శ్రేష్ఠత్వమును సంపాదించునవగుటచేత ఆదిత్యాదిదృష్టిమూలముగా కర్మాంగదృష్టి నుంచుటవలన ప్రయోజనముండదుకదా. ఈకారణమువలన కర్మాంగములయందే ఆదిత్యాదిభావన నుంచుటయుక్తమని తాత్ప.

—(*) ౬. ఆసీనాధికరణమ్. (*)—

అవ॥ కర్మాంగములను ఆశ్రయింపని ఉపాసనలను కూర్చుండియే అనుష్ఠింపవలయునా, నిలుచుండియా, లేక, పరుండియా, అను విషయము ఈఅధికరణమున విచారింపబడుచున్నది.

సూ॥ ౭॥ ఆసీనస్సంభవాత్ ॥

టీక॥ సంభవాత్ = తగియుండుటవలన, ఆసీనః = కూర్చుండియే, ఉపాసనాని=కర్మాంగములకు సంబంధింపని ఇతరఉపాసనలను, కుర్యాత్ =అనుష్ఠింపవలయును.

తా॥ కర్మాంగోపాసనలు కర్మాంగములకు పరతంత్రము లగుటచే వానివిధుల ననుసరించి ఎట్లైనను చేయబడవచ్చును. అందు నియమము లేదు. ఇతరోపాసనలనుమాత్రము కూర్చుండియే చేయువలయును. ఇతరసమయములయందు మనస్సు ఏకాగ్రముగా నుండుటకు వీలులేదుగదా యని తాత్పర్యము.

సూ॥ ౮॥ ధ్యానాచ్చ ॥

టీక॥ తస్యధ్యానాచ్చ = అదిధ్యానమగుటవలనకూడ ( ధ్యాయతి అను ధాతువునకు అర్థమగుటవలన కూడ ) ఉపాసన మాసీనః కుర్యాత్ = ఉపాసనమును కూర్చుండియే చేయవలయును.

తా॥ ఉపాసనము ధ్యానమన బడుచున్నదిగదా. ధ్యానమనునది ధ్యాయతి అను క్రియనుండి పుట్టుచున్నది. ఆక్రియ నిశ్చలములగు అవయవములుగలిగి ఇతరకార్యములయందు ప్రవర్తింపక ఒకటి విషయమునందే దృష్టినిలిపి మనస్సును ఏకాగ్రముచేసియున్న వారినిగూర్చి చెప్పును. ఇట్టిస్థితి కూర్చుండి ధ్యానము చేయువారియందుతప్ప ఇతరులయందు సంభవింపదుగదా. కావున కర్మాంగములతో సంబంధింపని యుపాసనలను కూర్చుండియే యనుష్ఠింపవలయునని తాత్పర్యము.

సూ॥ ౯॥ అచలత్వం చాపేక్ష్య ॥

టీక॥ అచలత్వం=కదలకుండుటను, అపేక్ష్య=అపేక్షించి, పృథివ్యాం=భూమియందు, ధ్యాయతీత్యుక్తిః = ధ్యాయతియని చెప్పుట, ధ్యానమాసీన కర్మేత్యత్ర=ఉపాసనలను కూర్చుండియే చేయవలయుననుటయందు, లింగం=గురుతు.

తా॥ మఱియు " ధ్యాయతీవ పృథివీ ( భూమి ధ్యానించు చున్నట్లున్నది. ) " అనువాక్యమునందు భూమి కదలకుండును. కావున దానియందు " ధ్యాయతీ అనుక్రియ ప్రయోగింపబడియున్నది. దీనిని బట్టి చూచినను నిశ్చలుడగువాడే ధ్యానముచేయవలయునని చెప్పుటకు వీలగుచున్నది." కావున ఉపాసనను కూర్చుండియే యనుష్ఠింప వలయునని తాత్పర్యము. సూ॥ ౧౦॥ స్మరంతిచ ॥

టీక॥ స్మరంతిచ=స్మృతియందుకూడ నిట్లే చెప్పబడియున్నది.

తా॥ " శుచౌదేశే ప్రతిష్ఠాప్యస్థిరమాసనమాత్మనః ( తనయాసనమును పరిశుద్ధమగు స్థలమునందు స్థాపించి )" అనుమొదలగు వాక్యములచే వస్త్రకృష్ణాజినాది రూపమగు ఆసనము ఉపాసనకు అంగముగా చెప్పబడియున్నది. మఱియు పద్మకము, స్వస్తికము, మొదలగు శారీరాసనములు ( శరీరములోని అవయవములయొక్క విన్యాస భేదములచే నేర్పడునవి ) యోగాంగములుగా చెప్పబడి యున్నవి.

ఈయాధారమువలనకూడ "ఉపాసనలకూర్చిండియే చేయవలయును" అనియే సిద్ధాంతము చేయవలయునని తాత్పర్యము.

—(*) ౭. యత్రైకాగ్రతాధికరణమ్. (*)—

అవ॥ కర్మాంగములకు సంబంధింపని యుపాసనలను చేయుటలో దిగ్దేశకాలనియమములు కలవా, లేవా, అనువిషయమును ఈ అధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౧౧॥ యత్రైకాగ్రతాతత్రావిశేషాత్ ॥

టీక॥ అవిశేషాత్ = విశేషము చెప్పబడి యుండక పోవుటవలన, యత్ర = ఏదిగ్దేశకాలములయందు, ఏకాగ్రతా = ఏకాగ్రత్వముకలుగునో (మనస్సునిలుకడ గలిగియుండునో,) తత్ర=ఉపాసనాకర్తవ్యా= ఉపాసన చేయబడవచ్చును.

తా॥ ఈ ఉపాసనను తూర్పు దిక్కునందు చేయ వలయును, ప్రదోష కాలమునందు చేయ వలయును, నదీ తీరమునందు చేయవలయును, అనుమొదలగు దిగ్దేశకాల నియమములు కర్మాంగములకు సంబంధించిన యుపాసనలయందు కలవుగాని వానికి సంబంధింపని యుపాసనలయందు లేవు. మనస్సు నిలకడగలదై ఉపాస్యదేవతను ధ్యానించుటకు ఏదిగ్దేశకాలములు అనుకూలములై యుండునో అవియే ప్రస్తుతోపాసనలను చేయుటకై యుపయోగింప బడవచ్చును. శ్రుతియందును ఈ దిగ్దేశ కాలములనుగూర్చి నియమము ఏమియును చెప్పబడియుండలేదు. ఇంతియేగాక "సమేశుచౌ శర్కరావహ్నివాలుకావివర్జితే (సమమైనదియును, పరిశుద్ధమైనదియును, గులకరాళ్ళు, అగ్ని, యిసుక, లేనిదియును)" అనుమొదలగు వాక్యములచేత "మనస్సునకేకాగ్రత్వమును కలిగింపగల దేశమును మాత్రమే ఉపపాసనాంగముగా శ్రుతి చెప్పుచున్నది. దీనినిబట్టి దిక్కాలములను గూర్చి కూడ నూహింపవచ్చునుగదా." కావున పైనిరూపించిన కారణముల వలన కర్మాంగములను ఆశ్రయింపని యుపాసనలయందు దిగాది నియమము లేదని తాత్పర్యము.

—(*) ౮. ఆప్రాయణాధికరణమ్. (*)—

అవ॥ సగుణబ్రహ్మ ఉపాస్యదేవతగాగల అహంగ్రహోపా

సనలను ( ఆ ఉపాస్య దేవత నేనే అనుసంధింపుతో చేయవలసిన ఉపాసనలను ) జీవితకాలమంతయు నాచరించుచునే యుండవలెనా, లేక, రెండుమారులు ఆచరించి నిలుపవచ్చునా, అనువిషయమును ఈ యధికరణమునందు విచారించుచున్నాడు.

సూ॥ ౧౨॥ ఆప్రాయణాత్తత్రాపిహిదృష్టం ॥

టీక॥ ఉపాసనాని=ఉపాసనలు, ఆప్రాయణాత్ = మరణము వరకు, కర్తవ్యాని=చేయబడవలసినవే, తత్రాపి=ఆమరణసమయమందును, ఉపాస్యదేవతాధ్యానం=ఉపాస్యదేవతను ధ్యానముచేయుట, దృష్టంహి = కనుబడుచున్నదిగదా. ( శ్రుతిస్మృతులయందు చెప్పబడుచున్నదిగదా ) యనుట.

తా॥ అహంగ్రహోపాసనలను మరణకాలమువరకు చేయుచునే యుండవలయును. "సయావత్క్రతురస్మాల్లోకాత్ప్రైతి (ఉపాసకుడు ఉపాసనతోకూడ పరలోకమునకు పోవును)" అనుమొదలగు శ్రుతులచేతను. "సదాతద్భావభావితః ( సర్వకాలముల యందును ఆ ఉపాస్య దేవతయొక్క ధ్యానముచేత సంస్కృతుడై )" అనుమొదలగు స్మృతులచేతను పై చెప్పినవిషయము దృఢపరుపబడియున్నది. ఎట్లనగా, పై శ్రుతి, స్మృతులచేత మరణకాలము నందుకూడ ఉపాస్యదేవతా ధ్యానముకలదని నిరూపింపబడుచున్నది. దీనివలన "మరణకాలము వరకు ఉపాసన చేయుచుండిననేగాని ఆసమయమున ఉపాస్యదేవతా స్మరణముకలుగదు. అని నిర్ణయింపవచ్చునుగదా. ఒకటి రెండుమారులు ఆచరించి నిలిపినను దానివలన కలిగిన అదృష్టముయొక్క బలముచే మరణకాలమునందు ఉపాస్యదేవతాస్మరణ కలుగును కదాయనుట సరికాదు. ప్రత్యక్షముగా ఫలముకలుగుచుండగానదుమవన పూర్వము నొకదానిని కల్పించుట యుక్తము కాదుగదా. ( అనగా ఉపాసనలను మరణకాలమువరకు చేయుచుండిన ప్రత్యక్షముగానే ఆసమయమునందు ఉపాస్యదేవతా స్మరణ కలుగును. ఇట్లు ప్రత్యక్షఫలము కనుపడుచుండగా ఉపాసనల నొకటి రెండు మారులు చేసిన చాలుననియు దానివలన నొక అదృష్టము పుట్టి మరణ కాలమునకు ఉపాస్యదేవతాస్మరణము కలిగించుననియు చెప్పుటయుక్తియుక్తము

—(*) ౧౦. ఇతరాధికరణమ్. (*)—

అవ॥ ఈవిధముగా పాపమునుగూర్చిచెప్పి పుణ్యమునుగూర్చి ఈఅధికరణమున చెప్పుచున్నాడు.

సూ॥ ౧౪॥ ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతేతు ॥

టీక॥ ఇతరస్యాపి = పాపమునకంటె వేరగు పుణ్యమునకు గూడ, ఏవం=పైచెప్పినవిధముగానే, తద్వ్యపదేశాత్ = శ్రుతియందు దట్లు చెప్పబడియుండుటవలన, అసంశ్లేషవినాశశ్చ= సంబంధింపకుండుటయును నాశనమునుకలుగును. అపి=ఇట్లు పుణ్యపాపములు లేకపోవుటవలన, పాతేతు=శరీరమునశించినాగానే, ముక్తిః = విదేహముక్తి కలుగును.

తా॥ పై అధికరణమునందు చెప్పబడినవిధముగానే పూర్వోత్తరపుణ్యములకుగూడ వినాశ అసంబంధములు కలుగునని తెలిసికొనవలయును. " ఉభేఉహైవైష ఏతే తరతి (జ్ఞానిగనువాడు పుణ్యపాపములను రెంటిని అతిక్రమించును ) " అను మొదలగు వాక్యములచేత శ్రుతియు నీవిషయమును స్పష్టము చేయుచున్నది. ఈవిధముగా బ్రహ్మజ్ఞాన ప్రభావమువలన మోక్ష ప్రతిబంధకములగు పుణ్యపాపములు నశించుటచే శరీరపాతమునాగానే జ్ఞానికి కైవల్యము కలుగునుగాని పునర్జన్మము కలుగదని తాత్పర్యము.

— (*) ౧౧. అనారబ్ధకార్యాధికరణమ్. (*)—

అవ॥ జ్ఞానమువలన కర్మలునశించుననిచెప్పియున్నారు. సర్వకర్మలును నశించునా, లేక, ప్రారబ్ధకర్మతప్ప తక్కినవి మాత్రమే నశించునా, అనువిషయమును ఈఅధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౧౫॥ అనారబ్ధకార్యే ఏవతుపూర్వేతదవధేః ॥

టీక॥ అనారబ్ధకార్యే=ఫలమునిచ్చుటకు ఆరంభింపని, పూర్వే ఏవతు = సంచిత పుణ్యపాపములుమాత్రమే, నశ్యతః = నశించును. కుతః=ఎందువలననగా, తదవధేర్మోక్షస్య= మోక్షమునకు శరీరపాతమే అవధిగా చెప్పబడియుండుటవలన.

తా॥ పూర్వజన్మములయందుగాని జ్ఞానోత్పత్తికి పూర్వము ఈజన్మమునందుగాని చేయబడి ప్రస్తుతము ఫలమునిచ్చుటకు ఆరంభిం

పకముం దెప్పుడో ఫలమునివ్వబోవు సంచిత పుణ్యపాపములు మాత్రమే జ్ఞానమువలన నశించునుగాని, ప్రస్తుతశరీరమును కలిగించి దానియందు తనుఫలములను అనుభవింపచేయుచున్న ప్రారబ్ధపుణ్యపాపములు నశింపవు. "తస్యతావదేవచిరం ( జ్ఞానియగువాడు మోక్షమును చెందుటకును [ మోక్షమనగా విదేహకైవల్యమని తెలిసికొనునది జీవన్ముక్తియని తలంపగూడదు ] శరీరపాతమే యాలస్యము )" అను వాక్యముచేత శరీరపాతము కలుగునంతవరకు విదేహకైవల్యములేదని శ్రుతిచెప్పుచున్నది. దీనినిబట్టిచూచిన (శరీరధారణమునకు కారణమగు ప్రారబ్ధకర్మ జ్ఞానముచే నశింపదని నిర్ధారణము) చేయవలసియున్నది. కావుననే జ్ఞానియగువాడు జ్ఞానోత్పత్తికి తరువాత నెంతకాలము శరీరపాతములేకయుండునో అంతవరకు జీవన్ముక్తుడనియు పిదప విదేహముక్తుడనియు చెప్పబడును. ఈకారణములవలన ప్రారబ్ధము జ్ఞానముచే నశింపదనుట సిద్ధాంతమయ్యెనని తాత్పర్యము.

—(*) ౧౬. అగ్నిహోత్రాధికరణము. (*)—

అవ॥ పై అధికరణమున ప్రారబ్ధముతప్ప తక్కినకర్మలన్నియు నశించునని చెప్పియున్నారు. నిత్యనైమిత్తిక కర్మలుకూడ నట్లే నశించునా ( అనగా జ్ఞానిచే విడువబడునా ) లేదా, అను విషయమును ఈ అధికరణమున విచారించుచున్నారు.

సూ॥ ౧౬॥ అగ్నిహోత్రాదితు తత్కార్యాయైవ
తద్దర్శనాత్ ॥

టీక॥ అగ్నిహోత్రాదితు=అగ్నిహోత్రము మొదలగు నిత్యనైమిత్తికకర్మలు, తత్కార్యాయైవ = ఆజ్ఞానముచేత కలిగింపబడు మోక్షమునకే యుపయోగించును. కుతః=ఎందువలననగా, తద్దర్శనాత్ = శ్రుతియందు ఆవిధముగానే చెప్పబడియుండుటవలన.

తా॥ అగ్నిహోత్రాది నిత్యనైమిత్తిక కర్మలు ప్రారబ్ధములు కాకపోయినను అవి జ్ఞానమువలన నశింపవు. (అనగా జ్ఞానులు వానిని విడువకూడదనుట ) అవి మనస్సును పరిశుద్ధిచేయుట మొదలగుకార్యములను చేయును. కావున జ్ఞానముచేయునట్టి పనియందు ( మోక్షమునందు ) సహాయములగునుకదా. ( అనగా కర్మజ్ఞానములు కలసి

వనేగాని మోక్షమురాదని యర్థముకాదనియు నిత్యకర్మ సంచిత పుణ్యపాపాదులవలె బంధహేతువు కాకపోవుటచే దానిమాత్రము విడువవలసిన పనిలేదనియు నభిప్రాయమని తెలిసికొనవలయును. ) “ తమేతం వేదానువచనేన ” అను మొదలగు శ్రుతులయందును వేదాధ్యయనాది ( ఇదియే బ్రహ్మయజ్ఞము ) కర్మలు జ్ఞాన సాధనములని చెప్పబడియుండుటచే పైనచెప్పబడిన విషయమే దృఢమగుచున్నది. కావున జ్ఞానులగువారుకూడ నిత్యనైమిత్తిక కర్మలను విడువకూడదని తాత్పర్యము.

అవ॥ పైసూత్రమునందు నిత్యనైమిత్తిక కర్మలు మాత్రము జ్ఞానముచే నశింపవని చెప్పియుంటిరి. ఇట్లైన “ తస్యపుత్రా దాయ ముపయంతి, సుహృదస్సాధుకృత్యాం, ద్విషంతః పాపకృత్యాం ( అతనికుమారుడు దాయభాగమును తీసికొనును. మిత్రులగువారు పుణ్యమును తీసికొనియెదరు. శత్రువులగువారు పాపమును తీసికొనియెదరు ) అను శ్రుతికర్థమేమి? అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౧౭॥ అతోఽన్యాపి హ్యేకేషాముభయోః ॥

టీక॥ అతః = ఈనిత్యనైమిత్తిక కర్మలకంటె, అన్యాపి = ఇతరమగు సాధుకర్మ, అస్తిహి = ఉన్నదికదా. “ ఏకేషాం సుహృదస్సాధుకృత్యాం ” అనుమొదలగు శ్రుతియుండిన శాఖవారికికూడ, విషయః = ఇదియే విషయము, ( అనగా ఆ శ్రుతి దీనినిగూర్చియే చెప్పుచున్నదనుట ) ఇదం = ఇది, ( నిత్యనైమిత్తికకర్మలకు వ్యతిరిక్తములగు సత్కర్మలనే స్నేహితులు తీసికొందురను విషయము, ఉభయోః = జైమిని వ్యాసుల కిరువురకును, సమ్మతం = సమ్మతమైనదియే.

తా ॥ “ తస్యపుత్రా దాయ ముపయంతి ” అను మొదలగు శ్రుతి నిత్యనైమిత్తిక కర్మలనుగూర్చియే చెప్పుచున్నదన నవసరము లేదు. నిత్యనైమిత్తికములకంటె వేరుగా కామ్యములనబడు పుణ్యపాపకర్మములు కలవుకదా. అవి బ్రహ్మజ్ఞానమునకు ఉపకారముచేయునవికావు. ఏదియో ఒకఫలమునుగోరియే వానిని చేయుదురుగాని కేవలమనశ్శుద్ధికొరకై నిష్కామముగా చేయరుకదా. కావున పైయుదహరించినశ్రుతి అట్టికామ్యకర్మలను గూర్చియే చెప్పుచున్నదనుట

లో వివాదమేమియును లేదు. ఈవిషయము ( మిత్రులును విరోధులును కామ్యములగు పుణ్యపాపములను పంచుకొనుచున్నారను విషయమును వ్యాస జైమినులిరువురును ఒప్పుకొనుచున్నారు. కావున పైనసుదహరించినశ్రుతి నిత్యనైమిత్తిక వ్యతిరిక్తములగు కామ్యకర్మములనుగూర్చియే చెప్పుననుట సిద్ధాంతమని తాత్పర్యము.

—(*) ౧౩. విద్యాకర్మ్యవత్త్వరాధికరణమ్. (*)—

అవ॥ జ్ఞానసాధనములగుటచేత నిత్యనైమిత్తిక కర్మలు ఆచరింపబడవలసినవేయని చెప్పియున్నారు. ఆకర్మలు అంగోపాసనసహితములుగా చేయబడవలయునని నియమముకలదా, లేదా, అను విషయము ఈయధికరణమున విచారింపబడుచున్నది.

సూ॥ ౧౮॥ యదేవవిద్యయేతిహి ॥

టీక॥ తత్ర, అనియమః = ఆవిషయమునందు నియమములేదు. ( నిత్యనైమిత్తిక కర్మలను కర్మాంగోపాసనలతోగూర్చియే చేయవలయునని నియమములేదు ) కుతః శ్రుతేః, యదేవవిద్యయా = యదేవ విద్యయా అనుమొదలగు వాక్యముల చేత, వదతిహి = చెప్పుచున్నది కదా.

తా॥ నిత్యనైమిత్తిక కర్మలను అంగోపాసనలతో చేర్చియే అనుష్ఠింపవలయునని నియమములేదు. " యదేవవిద్యయాకరోతి, తదేవకర్మవీర్యవత్తరంభవతి ( ఏకర్మను ఉపాసనలతోకూడ చేర్చిచేయునో అది మిక్కిలి బలముగలది యగును) " అనుశ్రుతి కర్మాంగోపాసనలతో చేర్చి చేయబడని కర్మలకుకూడ ఫలమునిచ్చుశక్తి కలదనియే చెప్పుచున్నదికదా. కావున ఈ నిత్యనైమిత్తిక కర్మలు అంగోపాసనలతో చేయబడినను ప్రత్యేకముగా చేయబడినను జ్ఞానరూప ఫలమునివ్వగలవు. కావున నావిషయమునందు నియమముండ నవసరములేదని తాత్పర్యము.

—(*) ౧౪. ఇతరక్షపణాధికరణమ్. (*)—

అవ॥ ౧౧ వ, అధికరణమున జ్ఞానముచే ప్రారబ్ధకర్మ మాత్రము నశింపదని చెప్పబడియున్నది. దానినిబట్టి జ్ఞానికి మరణముకలిగిన

పిదపకూడ సంసారముండునా, లేదా, అను విషయము ఈ యధికరణ మున విచారింపబడుచున్నది.

సూ॥ ౧౯॥ భోగేనత్వితరే క్షపయిత్వా సంపద్యతే ॥

టీక॥ ఇతరే=ప్రారబ్ధములగు పుణ్యపాపకర్మములను, భోగేన= అనుభవించుటచేత, క్షపయిత్వా=నాశనమును పొందించి, విద్వాన్= జ్ఞానియగువాడు, బ్రహ్మ= పరబ్రహ్మమును, సంపద్యతే= పొందును.

తా॥ ప్రారబ్ధము జ్ఞానమువలన నశింపక పోయినను అనుభవము వలన నశించును. కావున జ్ఞానికి మరణానంతరమున సంసారము కలుగదు. "తస్యతావదేవచిరం " అను మొదలగు శ్రుతికూడ ఈ విషయమునే స్పష్టము చేయుచున్నదికదా యనితాత్పర్యము.

అవృత్త్యస్తరద్వైకోనవింశతిః॥ ౧౪ ॥ ౧౯॥

ఆవృత్తిః, రాత్మేతి, న ప్రతీకే, బ్రహ్మదృష్టిః, రాదిత్యాదిః, రాసీనో, యత్రైకాగ్రతా, ప్రాయణాత్, తదధిగమః, ఇతరస్య, నారబ్ధకార్యే, గ్నిహోత్రాది, యదేవవిద్యయా, భోగేనత్వితరే చ సూత్రకాః॥౧౪॥

ఇతిశ్రీ బ్రహ్మసూత్రే - చతుర్థస్యాధ్యాయస్య ప్రథమః పాదః.

ఇట్లు చతుర్థాధ్యాయమునందు ప్రథమ పాదము,

ముగిసెను.



ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

# చతుర్థాధ్యాయము - ద్వితీయపాదము.

—(*) ౧. వాగధికరణమ్. (*)—

అవ॥ పూర్వపాదమునందలి అంత్యాధికరణమునందు "బ్రహ్మ

జ్ఞానులు శరీరమునుండి నెచ్చటికిని ( ఏలోకమునకు ) పోవలసిన యవసరములేకయే శరీరపాతానంతరమున ముక్తిని చెందుదురు. ” అని చెప్పబడియున్నది. సగుణబ్రహ్మోపాసకులకుగల బ్రహ్మలోకప్రాప్తినిగూర్చి చెప్పుటకై ఈ పాదము నారంభించుచు మొట్టమొదట సర్వసాధారణమగు ఉత్క్రాంతిని ( మరణమును ) మొదట నిరూపించుచున్నాడు. అందు “ వాఙ్మనసి సంపద్యతే (వాక్కు మనస్సునందు కలియును )” అను మరణవిషయక శ్రుతియందు “ వాగింద్రియము మనస్సునందు కలియునని చెప్పబడియున్నదా, లేక, వాగింద్రియ వృత్తి మనస్సునందు కలియునని చెప్పబడియున్నదా? ” అనువిషయము మొదటియధికరణమున విచారింప బడుచున్నది.

సూ॥ ౧॥ వాఙ్మనసిదర్శనాచ్ఛబ్దాచ్చ ॥

టీక॥ వాక్=వాగింద్రియవృత్తియే, మనసి=మనస్సునందు, సంపద్యతే=కలియును, కస్మాత్=ఎందువలన ననగా, దర్శనాత్= ప్రత్యక్షమువలనను, శబ్దాచ్చ=శ్రుతివలనను.

తా॥ “ వాఙ్మనసి ” అను శ్రుతికి వాగింద్రియవృత్తి మనస్సునందు కలియుననుటయే యర్థముగాని, వాగింద్రియమే మనస్సునందు కలియుననుటకాదు. లోకమునందు మృతిచెందువానికి మనోవృత్తికంటే ముందుగా వాగ్వృత్తి లయమగుచున్నదనుట ప్రత్యక్షముగదా. వాగింద్రియమే మనస్సునందు లయమగునని చెప్పిన దోషమేమియందులేమో అప్పుడు ఆ యింద్రియము తనకుపాదానకారణము కాని మఱియొక ఇంద్రియమునందే లీనమగుచున్నదని చెప్పవలసి వచ్చునుగదా. ఇది ప్రత్యక్ష విరుద్ధమగుటచే దోషము. ఈ కారణము వలననే “ వాఙ్మనసి ” మొదలగు శ్రుతి వాగ్వృత్తికిని వాక్కునకును అభేదము చెప్పినని నిర్ణయింప బడుచున్నది. ఉపాదానముకాని మనస్సునందు వృత్తిమాత్రము లయమగుటకు వీలుకలదా యందులేమో అచ్చట విరోధములేదు. అగ్నికుపాదాన కారణముకానిజలమునందు ఆ యగ్నివృత్తి ( కాల్చుట, వేడిమి ) లయమగుచుండుటను ప్రత్యక్షముగానే చూచుచున్నాముగదా. ఈ కారణములవలన వాగ్వృత్తియే మనస్సునందులీనమగునుగాని, వాగింద్రియముకాదని తాత్పర్యము.

అవ॥ పైన నిరూపించిన ప్రకారము వాక్ప్రవయమునందు మాత్రము దానివృత్తిమాత్రమే మనస్సునందు లీనమగునని చెప్పవచ్చును గాని తక్కిన యింద్రియముల విషయములలో నట్లు చెప్పుటకు వీలు లేదుగదాయనిన చెప్పుచున్నాము.

సూ॥ ౨॥ అతఏవచ సర్వాణ్యను ॥

టీక॥ అతఏవ=పై చెప్పిన కారణములవలననే, ( మృతిచెందు వానికి మనోవృత్తులున్నప్పుడే ఇతరేంద్రియవృత్తులు నశించుటనుచూచుచున్నాము కావున, ) సర్వాణి= అన్ని యింద్రియములును, మనోనువర్తంతే వృత్తిద్వారేణైవ = వృత్తి ద్వారాగానే మనస్సును అనువర్తించుచున్నవి.

తా॥ మృతిచెందువానికి మనోవృత్తి నశించకమునుపే సర్వేంద్రియవృత్తులను నశించుట ప్రత్యక్షసిద్ధమున్నది. " ఇంద్రియైర్మనసి సంపద్యమానైః ( మనస్సునందు చేరిన యింద్రియములతో ) " అను శ్రుతినికూడ పైసూత్రమునందు చెప్పిననాయ్యాయమును ననుసరించి వృత్తిపరమైనదానిగా ( ఇంద్రియవృత్తులే మనస్సునందు లీనమగునని చెప్పుదానినిగా ) అన్వయించవచ్చును. ఈ కారణములవలన వాగింద్రియమునకు వలెనే సర్వేంద్రియములకును వృత్తిలయమే కాని స్వరూపలయము లేదని సిద్ధాంతము తేలుచున్నది. పూర్వపక్షమునందు చేయబడిన సంశయము కేవలము భ్రాంతిమూలమేయని తాత్పర్యము.

—(*) ౨. మనోధికరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా వాఙ్మనసి అను వాక్యమును విచారించి, " మనః ప్రాణే ( ఆమనస్సు ప్రాణమునందు లయమగును ) " అను వాక్యమునుగూర్చి ఈ యధికరణమున విచారించుచున్నాడు. అందు మనోవృత్తిమాత్రమే ప్రాణమునందు లయించునా, లేక, మనస్సే స్వరూపముతో లయించునా? అను సంశయమును, ఇందు నివారించుచున్నాడు.

సూ॥ ३॥ తన్మనః ప్రాణఉత్తరాత్ ॥

టీక॥ తత్=ఆ (సర్వేంద్రియవృత్తులను లీనము చేసికొనియున్న) మనః=మనస్సు, ప్రాణే=ప్రాణమునందు, లీయతే=వృత్తిద్వారా

గానే లీనమగును, ఇతి= ఈలాగున, ఉత్తరాత్ = ఉత్తర వాక్యము వలన, అవగంతవ్యం= తెలిసికొనవలయును.

తా॥ ఇంద్రియములవలెనే మనస్సుకూడ వృత్తిద్వారా ( మనోవృత్తిమాత్రమే ) ప్రాణమునందు లయమునొందునుగాని స్వరూపముతోగాదు. " మనః ప్రాణే " అను శ్రుతికికూడ పై యధికరణమునందలి న్యాయమననుసరించియే ( మనస్సనగా మనోవృత్తియని యే యర్థము చెప్పవచ్చును. సుషుప్త్యాదులయందు ప్రాణ ముండగానే మనోవృత్తులు లీనమగుచుండుటయు మనస్సుమాత్రము లీనము కాకుండుటయు ప్రత్యక్షమైయున్నదికదా. " అన్నమయం హిసోమ్య మనః । ఆపోమయః ప్రాణః ( మనస్సు అన్నమయమైనది. అనగా పృథివీవికారమైనది. ప్రాణములు జలవికారములు ) " అను శ్రుతిచే మనస్సు పృథివీవికారమనియు, ప్రాణములు జల వికారము లనియు చెప్పబడియున్నది కావునను, భూమికి జలము ఉపాదానకారణము కావునను, మనస్సు ప్రాణమునందు స్వరూపముతోనే లయము నొందవచ్చును. అనిచెప్పుటకు రేమో అవసరము. భూమికి జల ముపాదాన కారణమైనను భూవికారమునకు ( భూమివలన కలిగిన వస్తువునకు ) జలవికారము ఉపాదానకారణ మగుననుటకు వీలులేదుకదా. ప్రత్యక్షముగ మను కుండమొదలగువానికి నుంచుమొదలగునవి ఉపాదాన కారణములు కానేరవుకదా. (కావున మనోవృత్తియే ప్రాణమునందు లయమగునుగాని మనస్సు కాదని) తాత్పర్యము.

—(*) 3. అధ్యక్షాధికరణమ్. (*)—

అవ॥ ఇట్లు " మనః ప్రాణే " అనువాక్యమును విచారించిన పిదప " ప్రాణస్తేజసి ( ఆప్రాణము తేజస్సునందు లీనమగును ) " అను ఉత్తరవాక్యమునుగూర్చి విచారింపవలసియున్నది. అందు ప్రాణమునకు లయస్థానమగు తేజస్సు ఏదికి అగ్నియా, లేక జీవుడా, తేజశ్శబ్దము సామాన్యముగా అగ్నియందే ప్రయోగింపబడుచున్నది. కావున అగ్నియనియేచెప్పుట యుక్తమని తోచుచున్నది. అను సంశయమును ఈయధికరణమున విచారించుచున్నారు.

సూ॥ ౪॥ సోధ్యక్షే తదుపగమాదిభ్యః ॥

టీక॥ తదుపగమాదిభ్యః= ఆజీవునివద్దకుపోవుట అను మొద లగు కారణములవలన ( జీవునివద్దకుపోవుట, జీవునితోకూడ శరీర మునుండి లేచిపోవుట, జీవునితోకూడ నిలచియుండుట, అను మూడు కారణములవలనను ) సః = ఆప్రాణము, అధ్యక్షే = ప్రభువగుజీవుని యందే, వినుతే = లయమునొందును.

తా॥ తేజశ్శబ్దమునకు జీవుడనియే అర్థము చెప్పవలయును గాని ప్రత్యక్షఅగ్నియని అర్థము చెప్పుటకు వీలులేదు. ఆప్రాణము జీవుని యందు లీనమగునని స్పష్టముగా చెప్పుటకు తగినకారణములు అనేక మున్నవి. ( ప్రాణము లీనమగుటయనగా ఆయనకు స్వాధీనము గుటయని తెలిసికొనవలయును. ఎట్లనగా " ఏవమేవేమమాత్మానమంతకాలే సర్వేప్రాణా అభిసమాయంతి ( ప్రాణములన్నియును మరణకాలము నందు ఈజీవునిపొందును ) " అని ప్రాణములు జీవునియొద్దకుచేరుట చెప్పబడుచున్నది. "తముత్క్రామంతం ప్రాణోనూత్క్రామతి (ఆజీ వుడు శరీరమును విడచిపోవుచుండగా ఆయనతోగూడ ప్రాణము శరీ రమును విడచును ) " అని ప్రాణములు జీవుననుసరించుట వర్ణింపబడి యున్నది. ఇవియున్నియునుగాక " సవిజ్ఞానోభవతి (ఆప్రాణము జీవు నితోకూడియే యుండును) అనువాక్యముచే నడుమనున్నప్పుడే ప్రాణ ముండుననిచెప్పి శ్రుతి ప్రాణములు జీవునకే యాధీనములనుటను స్పష్ట ముచేయుచున్నది. కావున ప్రాణములు జీవునియందే ఏకీభవించును. అవతారికయందుదహరించిన శ్రుతియందలి తేజశ్శబ్దము జీవవాచక మేయని తాత్పర్యము.

అవ॥ పైన నిర్ణయించినట్లు ప్రాణము జీవునియందే లయము గుట నిశ్చయమైనయెడల " ప్రాణస్తేజసి " అను శ్రుతియందు తేజశ్శ బ్దమును ఉపయోగించుట కర్థమేమి? అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౫॥ భూతేషుతచ్ఛ్రుతేః॥

టీక॥ సః=ప్రాణములతోకూడిన ఆజీవుడు, భూతేషు = భూత సూక్ష్మములయందు, అవతిష్ఠతే=నిలచియుండును. కుతః=ఎందువలన ననగా, తచ్ఛ్రుతేః = పైశ్రుతి ఆవిధముగా చెప్పుచుండుటవలన.

తా॥ పైశ్రుతియందు తేజశ్శబ్దమును ఉపయోగించుట దోష

ముగాదు. ఆశ్రుతియందు తేజశ్శబ్దముచే ఉత్తర దేహమును కలిగించుటకై జీవునిచే కొనిపోబడుచున్న పంచీకృత పంచమహాభూత సూక్ష్మావయవములు ఉపలక్షణముచే గ్రహింపబడుచున్నవి. ( అనగా జీవుడు తనమరణకాలమునందు తనసూక్ష్మశరీరముతోకూడ నిర్గమించుననుట స్పష్టము.) ఆసూక్ష్మశరీరము అపంచీకృత భూతములచే చేయబడియున్నది. ప్రస్తుతము చెప్పుచున్నదేమనగా:— జీవుడు తనకు రెండవశరీరమును కలిగించుటకై స్థూలభూతములలోని [ పంచీకృత పంచమహాభూతములలోని ] సూక్ష్మాంశములను తనతోగూడ కొని పోవును. ఆసూక్ష్మాంశములే ప్రస్తుతశ్రుతియందలి తేజశ్శబ్దముచే చెప్పబడినవనుట ) ఆభూతసూక్ష్మములు జీవునకు ఉపాధిగావున జీవునియందు చేరినప్రాణము పంచభూతములయందుకూడ చేరినదియేయగునుగదా. ఈవిషయమును ప్రకటించుటకై ప్రస్తుతసూత్రమునందు " ఆజీవుడు భూతములయందు చేరును " అని చెప్పబడియున్నది. కావున " ప్రాణస్తేజసి " అను శ్రుతియందు తేజశ్శబ్దమును ప్రయోగించుటవలన దోషములేదని తాత్పర్యము.

అవ॥ శ్రుతియందు అగ్నివాచకమగు తేజశ్శబ్దమొకటియే కలదు. పై సూత్రమునందు తేజశ్శబ్దముచే సర్వభూతములను గ్రహింపవలయునని చెప్పియున్నారు. ఇది ఎట్లనిన, సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౬॥ నైకస్మిన్దర్శయతో హి ॥

టీక॥ జీవః=జీవుడు, ఏకస్మిన్ = ఒకటి తేజోభూతమునందే, నావతిష్ఠతే=ఉండడు. తథా=అట్లే, పంచాగ్నివిద్యా ప్రశ్నప్రతివచనే శ్రుతిస్మృతీ వా = పంచాగ్ని విద్యయందలి ప్రశ్నోత్తరములును లేక శ్రుతి స్మృతులును, దర్శయతో హి= తెలియజేయుచున్నవిగదా.

తా॥ ఇట్లు చెప్పుట తప్పుకాదు. పంచభూతాత్మకమగు శరీరమును సంపాదించుకొనపోవువాడు ఒకటిభూతముతో మాత్రమే చేరియుండుననుట అసంభవముగదా. మూడవ అధ్యాయము మొదటిపాదము మొదటి అధికరణమున విచారింపబడియున్న పంచాగ్ని విద్యనుగూర్చిన ప్రశ్నోత్తరములు ఈవిషయమును ( శరీరము పంచ

భూతాత్మకమను విషయమును ) స్పష్టముచేయుచున్నవి. మఱియును “ పృథివీమయః ఆపోమయః ( ఈశరీరము పృథివీమయమైనది. జలమయమైనది ) ” అనశ్రుతియును “ అణ్వ్యోమాత్రా వినాశిన్యో దశార్థానాంతుయాస్మృతాః । తాభిస్సార్థమిదంసర్వం సంభవత్యను పూర్వశః ( పంచభూతములయొక్క సూక్ష్మాంశములేవిగలవో వానితో నీసర్వమును క్రమక్రమముగా జనించును. ) అను మొదలగు స్మృతులును ఈవిషయమునే దృఢపరుచుచున్నవి. కాన పైన చేయబడిన పూర్వపక్షము సరియైనదికాదని తాత్పర్యము.

—(*) ४. అసృత్యుపక్రమాధికరణమ్. (*)—

అవ॥ పైన వివరింపబడిన యుత్క్రాంతి అజ్ఞానికిమాత్రమే సంభవించునా, లేక సగుణబ్రహ్మోపాసకులకుగూడ కలదా, అను విషయమిందు విచారింపబడుచున్నది.

సూ॥ ౭॥ సమానాచాసృత్యుపక్రమాదమృతత్వం చానుపోష్య ॥

టీక॥ ఆసృత్యుపక్రమాత్ = బ్రహ్మలోకమార్గమును ఆరంభించునంతవరకు, ఉత్క్రాంతిః = శరీరమునుండియుత్క్రమించుట, విద్వదవిదుషోః = సగుణబ్రహ్మోపాసకునకును అజ్ఞానికిని, సమానః = సమానమైనదియే, అమృతత్వంచ = శ్రుతియందుచెప్పబడిన మోక్షమైతే, అనుపోష్యజాయమానత్వాత్ = అవిద్యాదులను నశింపచేయకయుండే కలుగునదియగుటవలన, ఆపేక్షికం = ఔపచారికమే.

తా॥ పై మూడధికరణములయందును వివరింప బడియున్న యుత్క్రాంతి అజ్ఞానికిని సగుణబ్రహ్మోపాసకునకునుగూడ సమానమైనదియే. తర్వాతమాత్రము అజ్ఞానియగువాడు తనకర్మానుగుణముగా ఏదియో యొకనాడిని ( నరమును ) ననుసరించి ఏదియోయొకస్థలమునకు బోవును. ( తాను రెండవమారు జన్మమెత్తవలసిన స్థలమునకనుట ) సగుణబ్రహ్మోపాసకుడు అట్లుగాక శిరస్సునైపునకు బోవునట్టి నాడినాశ్రయించి వానిద్వారా అర్చిరాది మార్గమును పొంది బ్రహ్మలోకమునుచేరును. కావున దేవయానమార్గమునుగూర్చియు శిరస్సునుగూర్చిపోవు నాడినిగూర్చియు చెప్పనంత వరకు

నై యిరువురకును ఉత్క్రాంతి యొకటేను. "వాఙ్మనసి సంపద్యతే" అనుమొదలగు సామాన్యశ్రుతివలనను "శతంచైకాచ హృదయస్యనాడ్యః తాసాం మూర్ధానమభినిస్సృతైకా తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" (హృదయమునందు ౧౦౧ నాడులుగలవు. వానిలో నొకటి శిరస్సునుగూర్చి పోవుచుండును. దానిద్వారమున శరీరమునుండి నిర్గమించినజీవుడు మోక్షమును చెందును. తక్కిన నూరునాడులును స్వకర్మానుగుణముగా జీవుడు నిర్గమించుటకు మార్గములే యగుచుండును) " అను విశేష శ్రుతివలనను పైన నిరూపించిన విషయము స్పష్టమగుచున్నది. మఱియు "శతంచైకా" అనుశ్రుతియందు చెప్పబడియున్న "అమృతత్వం" అను శబ్దమునకు బ్రహ్మైక్యరూపమగు మోక్షమని అర్థము కాదు. ఆపదమునకు ఆర్థము చెప్పనెడల ఉత్క్రాంతితోనే యవసరముండదు కదా. అప్పుడు "తయోర్ధ్వమాయన్" అనువాక్యము వ్యర్థము కావలసివచ్చును. ఈకారణమువలన ఆఅమృతత్వశబ్దమునకు "బ్రహ్మలోకప్రాప్తి" అనియే అర్థము చెప్పవలయును. ఆబ్రహ్మలోకప్రాప్తిగూడ ఉత్తరకాలమున మోక్షమును కలిగించునదియగుటచే అట్లు చెప్పబడినదని తెలిసికొనవలయును. ఇదియునుగాక రాగద్వేషాదులు సంపూర్ణముగా నశింపకమునుపే సగుణబ్రహ్మోపాసనా ప్రభావమువలన కలిగి యొకమార్గముచే పొందతగినది బ్రహ్మైక్యరూపమగు మోక్షమగుటకు వీలులేదుకదా. ప్రస్తుత అమృతత్వమునుగూర్చి శ్రుతులయందు పైవిధముగానే చెప్పబడియున్నది. ఈకారణములను బాగుగవిమర్శించిన అజ్ఞానులకును, సగుణబ్రహ్మోపాసకులకునుకూడ ఉత్క్రాంతి సమానమేయని సిద్ధాంతమగునని తాత్పర్యము.

—(*) ౫. తదాపీతేస్సంసారవ్యపదేశాధికరణమ్. (*)—

అవ॥ ఇట్లు చెప్పుట సరికాదు. "తేజః పరస్యాం దేవతాయాం (తేజస్సు [ సూక్ష్మశరీరము ] పరబ్రహ్మమునందు లయము నొందును.)" అనువాక్యమునందు జీవసహితమై సూక్ష్మశరీరము పరబ్రహ్మమునందు సంపూర్ణముగా లయమునొందునని చెప్పబడియు

న్నది. పరబ్రహ్మము సర్వమునకును ఉపాదాన కారణమగుటచే ఆ యనయందు అన్నియు సంపూర్ణముగా లయమునొందుట స్వాభావికమే. ఇట్లుండ జీవుడు శరీరమునుండి యుత్క్రమించి మఱియొకచోటికి పోవునను ఎట్లుసంభవించును అనుపూర్వపక్షమును ఈ యధికరణముచే ఖండించుచున్నాడు.

సూ॥ ౮॥ తదాఽపీతేస్సంసారవ్యపదేశాత్ ॥

టీక॥ తత్ = ఆతేజస్సు, అపీతేః = మోక్షమువరకు, తిష్ఠతి = ఉండును, కస్మాత్ = ఏమువలననగా, సంసారవ్యపదేశాత్ = సంసారమునుగూర్చి చెప్పియుండుటవలన.

తా॥ జీవునితోను ఇంద్రియములతోను ఇతర భూతములతోను కూడిన తేజస్సు పరబ్రహ్మమునందు లయమగుటయనగా స్వరూపమే లేకపోవుటయని యర్థముగాను. సుషుప్తియందువలె వృత్తిమాత్రము లేకయుండుటయే దానికర్థమని యెఱిఁగికొనవలయును. సూక్ష్మశరీరమునకు మరణకాలమునందే సంపూర్ణవినాశము కలుగునెడల కర్మలు మొదలైనవానిని చేయవలయునని చెప్పు విధిశాస్త్రములును బ్రహ్మమునెఱుంగవలయునని చెప్పు జ్ఞానశాస్త్రములును వ్యర్థములు కావలసి వచ్చును. కావున బ్రహ్మైక్యరూపమగు మోక్షము కలుగునంతవరకు ఈ సూక్ష్మశరీరమునకు నాశము లేదు. "యోనిమన్యే ప్రపద్యంతే (కొందఱు [ జీవులు ] యోనులను ప్రవేశించి శరీరధారులై జన్మింతురు. )" అనుమొదలగు వాక్యములచే జీవులకు సంసారమున్నట్లు స్పష్టముచేయబడుచున్నది. ఈకారణమువలన తేజస్సు పరబ్రహ్మమునందు లీనమగుననుటకు వృత్తిశూన్యమై నిలుచుననుటయే యర్థమగును గాని వేఱొకటికాదని తాత్పర్యము.

అవ॥ పై సూత్రమునందు వర్ణింపబడినట్లు జీవాదులకు ఆశ్రయమగు తేజస్సు ఒకటికలదేని అది శరీరమునుండి నిర్గమించునప్పుడు పార్శ్వమున నున్నవారలకు కనుపడవలయును. మఱియొక వస్తువుచేత ఆటంకపఱుపబడవలయును. అట్లు లోకానుభవములేదు, కావున అట్టి తేజస్సే లేదని చెప్పవలసి వచ్చుచున్నదనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౯॥ సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః ॥

టీక॥ తేజః=ఆ తేజస్సు, భూతాంతర సంయుక్తమపి = ఇతర భూతములతో చేరియున్నదైనను, ప్రమాణతశ్చ = ప్రమాణమువలనను, స్వరూపమువలనను కూడ, సూక్ష్మం=అతిసూక్ష్మమైనది, కుతః= ఎందువలననగా, తథా=ఆప్రకారముగానే, ఉపలబ్ధేః=వేదవాక్యములచే తెలియజేయబడి యుండుటవలన.

తా॥ అవతారికయందు చేయబడిన యాక్షేపము సరియైనది కాదు. తేజస్సు నితరపదార్థములతో కూడి యున్నదైనను మిక్కిలి సూక్ష్మమైనదియే. పరిమాణమునందును రూపమునందును గూడ అతి సూక్ష్మమైనదియే. ఆకారణమువలన పార్శ్వమునందున్న వారలకు కనుపడుటకుగాని ఇతరవస్తువులచేత నాటంకపరుప బడుటకుగాని వీలు లేదు. ఈ విషయముపై శ్రుతివలననే తెలియజేయబడుచున్నది. తేజస్సు స్థూలమైనదియే యనిచెప్పిన అతిసూక్ష్మములగు నాడీరంధ్రముల నుండి నిర్గమించుట సంభవింపదుకదా. కావున తేజస్సు సూక్ష్మమైనదియేయని తాత్పర్యము.

సూ॥ ౧౦॥ నోపమర్దేనాతః ॥

టీక॥ అతః=ఈకారణమువలననే, ఇదం = ఈసూక్ష్మశరీరము, ఉపమర్దేన=శరీరమును సంకటపెట్టుటచే, నోపమృద్యతే=పీడింపబడదు.

తా॥ పైనిరూపించిన కారణములవలననే తేజస్సని చెప్పబడు సూక్ష్మశరీరము అత్యల్పపరిమాణము గలదగుటచేతనే అది వెడలిపోవునప్పుడు స్థూలశరీరమును కాల్చుట మొదలగునవి కలుగవు. ఆసూక్ష్మశరీరముకూడ సమ్మర్దమును చెందదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు సూక్ష్మదేహము అతిసూక్ష్మ ప్రమాణము కలదియనిచెప్పి ఇప్పుడు స్థూలదేహమునకంటే వేరుగా సూక్ష్మమను మఱియొకదేహముండుటకు ప్రమాణమును చూపుచున్నాడు.

సూ॥ ౧౧॥ అస్యైవచోపపత్తేరూష్మా ॥

టీక॥ ఊష్మా = బ్రతికియున్నవారి శరీరములయందు కనుపడు వేడి. అస్యైవ= ఈ సూక్ష్మశరీరమునకు సంబంధించినదిగానే, భవితుం=ఉండుటకు, అర్హతి= తగియున్నది, కుతః = ఎందువల్లననగా,

ఉపపత్తేః=అట్లుచెప్పుట యుక్తియుక్తమై యుండుటవలన.

తా॥ స్థూలశరీరమునకంటె వేరుగా సూక్ష్మశరీరము కలదనుట ప్రత్యక్షమువలననే సిద్ధాంతము చేయవచ్చును. బ్రతికియున్నవారి శరీరములను తాకిచూచిన కనుపడునట్టి ఉష్ణము సూక్ష్మశరీరమునకు సంబంధించినదియే. ఇట్లు కానిచో సూక్ష్మశరీరములేని మరణానంతర కాలమున స్థూలశరీరమున్నను అచ్చట వెచ్చదనములేదు. ఈకారణము వలన మనకు ప్రత్యక్షముగా కనుపడుచున్న ఉష్ణమునుబట్టి దానికి హేతువగు వస్తువు ఒకటిగలదని ఊహింపవచ్చును. అదియే సూక్ష్మశరీరమనిన విరోధమేమియు నుండదు. కావున స్థూల శరీరమున కంటె వేరై అతి సూక్ష్మమైన లింగశరీరము (సూక్ష్మశరీరము) ఒకటిగలదనుట నిర్వివాదమని తాత్పర్యము.

—(*) ౬. శారీరాధికరణమ్. (*)—

అవ॥ నాల్గవ యధికరణమునందు సగుణ బ్రహ్మోపాసకునకును అజ్ఞానికిని ఉత్క్రాంతికలదని చెప్పుటచేత నిర్గుణోపాసకునకు ఉత్క్రాంతి లేదని చెప్పినట్లైనది. ఇది యుక్తి యుక్తము గాలేదు. అను నాక్షేపమునకు సమాధానముగా ఈ యధికరణమున చెప్పవాడై మొట్టమొదట పూర్వపక్షమున ననువాదము చేయుచున్నాడు.

సూ॥ ౧౨॥ ప్రతిషేధాదితిచేన్న శారీరాత్ ॥

టీక॥ ప్రతిషేధాత్ = నిషేధించియుండుటవలన, నోత్క్రాంతిః=బ్రహ్మవేత్తకు ఉత్క్రాంతిలేదు, ఇతిచేత్ =అనెదవేని, న=అది సరికాదు, స్తాత్పర్యః=అర్థము, శారీరాత్ = జీవునినుండి, ఉత్క్రాంతం = ఉత్క్రమణమును, నిషేధతి = నిషేధించుచున్నది, నదేహాత్ = దేహమునుండికాదు.

తా॥ "నతస్య ప్రాణా ఉత్క్రామంతి (ఆజీవుని ప్రాణములు వెడలిపోవు)" అను శ్రుతి నిర్గుణ బ్రహ్మజ్ఞానము కలవానికి ఉత్క్రాంతి లేదని చెప్పుచున్నది. దీనిబలమువలన సగుణ బ్రహ్మోపాసకునకును అజ్ఞానికిని ఉత్క్రాంతికలదుగాని నిర్గుణబ్రహ్మజ్ఞానికి లేదని సిద్ధాంతము చేయవచ్చును. అని అందురేమో అదిసరికాదు. పైన ఉదహరించిన శ్రుతియందలి "తస్య" అనుశబ్దమునకు ఆజీవునినుండి అని అర్థ

ము. (అనగా ఆశ్రుతియందు "జీవునిదగ్గరనుండి ప్రాణములుపోవు" అని నిషేధింపబడియున్నదిగాని "శరీరమునుండి ప్రాణములుపోవు." అని నిషేధింపబడి యుండలేదు అనుట) ఈ విషయము "నతస్మా త్ప్రాణా ఉత్క్రామంతి (ఆ జీవునినుండి ప్రాణములు పోవు.)" అను మాధ్యందినశాఖలోని శ్రుతిచేత స్పష్టము చేయబడు చున్నది. కావున మీరు (సిద్ధాంతులు) ఆధారముగా చెప్పుచున్న నిషేధము మీమతమును స్థాపింపనేరదు. ఈకారణమువలన బ్రహ్మవేత్తకు కూడ ఉత్క్రాంతికలదనియే చెప్పవలయునని తాత్పర్యము. (ఇది పూర్వ పక్ష సూత్రము.)

అవ॥ పై పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతము చేయుచు న్నాడు.

సూ॥ ౧౩॥ స్పష్టోహ్యేకేషాం ॥

టీక॥ ఏకేషాం శాఖాయాం = కొందరిశాఖయందు, (కాణ్వ శాఖయందు) శరీరాదేవ ఉత్క్రాంతిర్నిషిద్ధేతి = శరీరమునుండియే ఉత్క్రాంతి నిషేధింపబడియున్నదని, అయంవిషయః = ఈవిషయము, స్పష్టఃహి = స్పష్టముగానే యున్నదికదా.

తా॥ పై సూత్రముచే చేయబడిన పూర్వపక్షము సరియైన దికాదు. మాధ్యందినశాఖయందలి శ్రుతి కొంచెము సంశయముగా నున్నను కాణ్వశాఖయందలి శ్రుతి "శరీరమునుండి ప్రాణములు నిర్గ మింపవు." అనువిషయమును స్పష్టము చేయుచున్నది. ఆ కాణ్వశాఖ యందు ఇట్లు చెప్పబడియున్నది. ఆర్తభాగుడను నొక మహాముని "బ్రహ్మవేత్తయగువాడు మృతిచెందినప్పుడు వాని శరీరమునుండి ప్రాణము (సూక్ష్మశరీరము) నిర్గమించునాలేదా." అని యాజ్ఞ వల్క్యమహామునిని ప్రశ్నచేసెను. "బ్రహ్మజ్ఞానము కలవారియొక్క శరీరమునుండి ప్రాణములు నిర్గమింపవు." అని యాప్రశ్నమునకు యాజ్ఞవల్క్యుడు ఉత్తరమునిచ్చెను. "అట్లు నిర్గమింపకుండిన బ్రహ్మ జ్ఞాని మృతుడే కాకూడదుగదా" అని యార్తభాగ మహాముని మరల ప్రశ్నింపగా "జ్ఞాని ప్రాణము అచ్చటనే లీనమగును (తన కుపాదానములగు భూతములలో కలసిపోవును)" అని యాజ్ఞ

వలుర్యాదు సమాధానముచెప్పి దానిని దృఢపరుచుటకై "ప్రాణ ములులేనప్పుడు శరీరము వాచును. బయటనుండు వాయువుచే నింతిం పబడి బహువిధములగు శబ్దములను జేయును. ఈగురుతులవలన పురు షుడు మృతిజెందెనని తెలిసికొనవచ్చును" అని చెప్పియున్నాడు. ఇచ్చట వాచుట మొదలగు ధర్మములు శరీరమునకు సంబంధించినవే కాని జీవునకు సంబంధించినవి కావుగదా. దీనినిబట్టి "శరీరమునుండి ప్రాణములు నిర్గమించును" అనువిషయమే ఈశాఖయందు నిషేధిం పబడియున్నదని స్పష్టముగ నిర్ణయింపవచ్చునుకదా. దీనితో సమా నార్థముగలదియే యగుటచేత మాధ్యందినశాఖయందలి "నతస్మాత్" అనుమొదలగు శ్రుతికూడ "శరీరమునుండి ప్రాణములు నిర్గమించు నను విషయమునే నిషేధించు ననవలయును. కావున జీవునినుండి ప్రా ణములు నిర్గమించును. అనునొక శ్రౌతవిషయమునుగూర్చి విధిగాని, నిషేధముగాని, పైశ్రుతులయందు ఎచ్చటను లేదని తాత్పర్యము.

అవ ॥ ఈవిధముగా బ్రహ్మజ్ఞానము గలవారికి ఉత్క్రాంతి కాని, దేవయానాది మార్గములుగాని, లేదని సిద్ధాంతముచేసి అవిష యమున మఱియొకప్రమాణమును చూపుచున్నాడు.

సూ॥ ౧౪॥ స్మర్యతేచ ॥

టీక॥ కించ=మఱియు, అయం=ఈపైచెప్పినవిషయము, మహా భారతే=మహాభారతమునందు, స్మర్యతే= చెప్పబడుచున్నది.

తా॥ మఱియు "సర్వభూతాత్మభూతస్య సమ్యగ్భూతాని పశ్యతః। దేవాపిమార్గేముహ్యంతి హ్యపదస్యపదైషిణః (సమస్త భూతములును తానే అయియున్నవాడును సర్వభూతములయొక్క తత్వమును బాగుగ తెలిసికొనినవాడును తనకంటె నితరమగు పదా ర్థమేదియును లేకపోవుటచే స్థానమునందును ప్రేమలేనివాడును అగు బ్రహ్మజ్ఞానియొక్క మార్గమును, ఉత్తమస్థానమును కోరువారగుటచే దేవతలుకూడ తెలిసికొనలేరు. [వానికి మార్గములేదు కావున ననుట]" అని భారతమునందు పైసూత్రముచే చేయబడిన సిద్ధాం తమే అనువాదము చేయబడుచున్నదని తాత్పర్యము.

—(*) ౭. పరసంపత్త్యధికరణమ్. (*)—

అవ॥ బ్రహ్మజ్ఞానియగువాని సూక్ష్మశరీరము పృథివ్యాదిభూతములయందు లీనమగునా, లేక, పరబ్రహ్మమునందే లీనమగునా? గతాఃకలాః పంచదశప్రతిష్ఠాః ( సూక్ష్మశరీర అవయవములగు ఇంద్రియములు మొదలగు పదునైదుకళలును వాటివాటి ఉపాదానకారణములగు పృథివ్యాదులను చేరును )" అనుశ్రుతిచే విద్వాంసుని సూక్ష్మశరీరము భూతములలోనే కలయునని చెప్పబడియున్నదిగదా. కావున, ఈవిషయమునుగూర్చి ఈయధికరణమున విచారించుచున్నాము.

సూ॥ ౧౫॥ తానిపరేతథాహ్యాహ ॥

టీక॥ తాని= సూక్ష్మశరీరమని చెప్పబడు ఇంద్రియములును, ప్రాణములును, పరే=పరబ్రహ్మమునందు, లీయంతే=లీనములగును. తథా=అదేవిధముగానే, శ్రుతిః=వేదము, ఆహాహి = చెప్పుచున్నదిగదా.

తా॥ పరబ్రహ్మ నెఱింగినవాని సూక్ష్మశరీరము అపరబ్రహ్మమునందే లీనముకానుగాని భూతములయందు లీనముగాదు. "ఏవమేవాస్యపరిద్రష్టురిమాః షోడశకలాః పురుషాయణాః పురుషంప్రాప్యాస్తంగచ్ఛంతి ( ఈప్రకారముగ అంతయును పరబ్రహ్మముయొక్క వివర్తమే కావున సూక్ష్మశరీరముకూడ నట్టిదే. కావున ఏపురుషుడైనను పరబ్రహ్మమును దెలిసికొనియెనో వానిసూక్ష్మశరీరము అపరబ్రహ్మమును చేంది అచ్చటనే లీనమగును )" అని శ్రుతిచేత స్పష్టముగానే చెప్పబడుచున్నదిగదా. ఇట్లుచెప్పిన యెడల "గతాఃకలాఃపంచదశ" అనుశ్రుతి- అర్థమేమి అనినయెడల ఆశ్రుతి లోకన్యాయము ననుసరించి "కార్యములు తమ ఉపాదానకారణములయందు లయమగును" అని చెప్పుచున్నది. "ఏవమేవ" అనుమొదలగు శ్రుతియన్నను "సర్వమును బ్రహ్మవివర్తమే యగుటచే ఈ సూక్ష్మశరీరముకూడ ఉపాదానసహితమై పరబ్రహ్మమునందు లీనమగును" అనిచెప్పుచున్నది. కావున వీటికేటికిని విరోధమేమియును లేదని తాత్ప.

—(*) ౮. అవిభాగాధికరణమ్. (*)—

అవ॥ జ్ఞానియొక్క సూక్ష్మశరీరము పరబ్రహ్మమునందు లీనమ

గునని చెప్పితిరిగదా. అది నిర్విశేషముగా (స్వరూపమే లేకుండా) లీనమగునా, లేకసవిశేషముగా (స్వరూపము చెడకుండా అనగా దృఢమగుమూతగల యొక పాత్రలోపోసి సముద్రమునందు విడువబడిన జలమువలె స్వస్వరూపమునకు హానిలేకుండానన్నట) లీనమగునా (నేను పుణ్యము చేయుచున్నాను దీనిచేత నాకు సుభఫలము కలుగును అనుమొదలగు భ్రాంతిపూర్వకములగు సంకల్పములే సూక్ష్మ శరీరమునకు నిర్విశేషలయమును కలిగించు ప్రతిబంధములని తెలిసికొనవలయును) అను విషయమునుగూర్చి ఈ అధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౧౬॥ అవిభాగోవచనాత్ ॥

టీక॥ వచనాత్ = శ్రుతివాక్యమువలన, బ్రహ్మసూక్ష్మశరీరయోః = బ్రహ్మకును జ్ఞానియొక్క సూక్ష్మశరీరమునకును, అవిభాగః=భేదమే లేదు. (అనగా సూక్ష్మశరీరము బ్రహ్మమునందు నిర్విశేషలయమునే చెందుననుట.)

తా॥ బ్రహ్మజ్ఞానియొక్క సూక్ష్మశరీరము పరబ్రహ్మమునందు నిర్విశేషముగానే లయమగును. అటు లయము కాకుండ నిలుపుటకు భ్రాంతిలేదుగదా. ఇట్టియును శ్రుతియందు సూక్ష్మశరీర వినాశము చెప్పబడినదిగదా "భిద్యేతే నామరూపే (ఈకళలయొక్క [సూక్ష్మశరీరావయవములయొక్క] నామరూపములు రెండును నశించును)" అను వాక్యముచేత పైన నిరూపింపబడిన విషయమే (సూక్ష్మశరీరము పరబ్రహ్మమునందు నిర్విశేషలయమును చెందుననువిషయమే) నిర్ధారణ చేయబడియున్నది. ఈకారణములవలన పైన నిరూపించిన విషయము సిద్ధాంతమని తాత్పర్యము.

—(*) ౯. తదోకోధికరణము. (*)—

అవ॥ ఈవిధముగా ప్రసంగమువలన వచ్చిన బ్రహ్మజ్ఞాని విషయమును ముగించి మరల సగుణబ్రహ్మోపాసకునిగూర్చి కొన్నివిషయములను విచారించుటకై క్రింది అధికరణములను ఆరంభించుచున్నాడు. అందు అజ్ఞానియును సగుణోపాసకుడును ఉత్క్రమించుటలో కొంతవరకు భేదములేదని ౪ వ, అధికరణమునందు చెప్పబడియు

న్నది. వానినిగూర్చియే ఈ అధికరణమునందు మఱికొంత విచారింప బడుచున్నది.

సూ॥ ౧౭॥ తదోకోగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యా
సామర్థ్యాత్తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ
హార్దానుగృహీత శ్శతాధికయా ॥

టీక॥ వాగాదిలయానంతరం = వాక్కు మొదలగునవి లయము లైనపిదప, తదోకోగ్రజ్వలనం=ఆజీవునికి స్థానమగు హృదయముయొక్క కొన (నాడీముఖము) ప్రకాశించుట (ఉత్తర [జన్మ] స్మృతి గలుగుట) సంభవించును. తత్ప్రకాశితద్వారః = ఆ ప్రకాశముచేత స్పష్టము చేయ బడిన నిర్గమనద్వారము కలవాడుగా, జీవోభవతి=జీవుడగును. సగుణోపాసకస్తు= సగుణబ్రహ్మను ఉపాసించిన జీవుడైతే, హార్దానుగృహీతస్సన్ = హృదయమునందున్న పరబ్రహ్మముచే అనుగ్రహింపబడినవాడై, విద్యాసామర్థ్యాత్ = బ్రహ్మవిద్యయొక్క సామర్థ్యమువలనను తచ్ఛేషగత్యను, స్మృతియోగాచ్చ=ఆసగుణవిద్యకు తరువాత కలుగునని చెప్పబడియున్న సుషుమ్నా నాడీమార్గము అర్చిరాదిమార్గము అను మొదలగువానియొక్క ధ్యానవిధివలనను, శతాధికయా=నూటికంటె నెక్కువగానున్న (నూటఒకటవ) సుషుమ్నా నాడీ ద్వారముగా, నిర్గచ్ఛతి=శరీరమును విడుచును.

తా॥ "వాఙ్మనసి" అనుమొదలగు శ్రుతులయందు చెప్పబడియున్న ప్రకారము వాక్కు మొదలగునవి లీనములైన పిదప జీవస్థానమగు హృదయముయొక్క అగ్రము ప్రకాశించును. (అనగా అప్పుడు వానికి ఉత్తరవిషయములు స్మరణకు వచ్చునట (దీనికే ప్రద్యోతమని పేరు. ఈప్రద్యోతముచే ప్రతిజీవునకును వారువారు నిర్గమింపవలసినమార్గము స్పష్టమగును.) ఇంతవరకు అజ్ఞానికిని సగుణబ్రహ్మోపాసకునకును కలుగు ఉత్క్రాంతిలో భేదమేమియును లేదు. తర్వాత ఆసగుణోపాసకుడు మాత్రము హృదయమునుండి శిరస్సువరకుబోవుచు సూర్యమండలముతో నేకీభవించియున్న నూటవకటవదియగు సుషుమ్నా నాడీద్వారమున నిర్గమించును. అజ్ఞానులగువారు వారి వారి కర్మలననుసరించి కన్ను మొదలగు నితర స్థలములయందు

వ్యాపించియున్న నాడులమార్గమున నిర్గమింతురు. "శతంచైకాచ హృదయస్యనాడ్యః" అనుశ్రుతి ప్రసరావృత్తిరహితమగు స్థితి సుషుమ్నా నాడీమార్గమున నిర్గమించినవానికిగాని కలుగదని చెప్పుచుండుటచేతను "సగుణబ్రహ్మోపాసనవలన సద్గతిని పొందవచ్చును" అని మఱియొక శ్రుతి చెప్పుచుండుటచేతను సగుణబ్రహ్మవిద్యా సామర్థ్యమునను ఉపాసకులందరును సుషుమ్నా నాడీ ద్వారముననే నిర్గమింతురనుట సిద్ధాంతమగుచున్నది. ఉపాస్య దేవతయొక్క యనుగ్రహము కలదనుటకూడ పై విషయమును నిర్ణయించుటకు గొప్పసాధన మగునుకదా. ఇదియునుగాక "మరణసమయమువరకు సర్వకాలములయందును సగుణోపాసనాగమ్యములగు సుషుమ్నా నాడీమార్గము అర్చిరాదిమార్గము మొదలగువానిని ధ్యానించుచుండవలయును." అని యొకవిధిగలదు. ఉపాసకులుగూడ అజ్ఞానులవలెనే ఏదియో యొకనాడి ననుసరించి నిర్గమింతురని చెప్పిన పైచూపిన విధికి విరోధమువచ్చును. మరణకాలమునందు స్మరణకు రావలయు ననియే గదా సర్వకాలములయందును ఉపాసకులు ఆమార్గములను ధ్యానించుచుండుట. కావున ఉపాసకుడగువాడు సుషుమ్నానాడీమార్గమున నిర్గమించుననుటయే సిద్ధాంతమని తాత్పర్యము,

—(*) ११. రశ్మ్యనుసారాధికరణమ్. (*)—

అవ॥ "అథైతైరేవరశ్మిభిరూర్ధ్వ ఆక్రమతే (ఈ సూర్యకిరణములద్వారా బ్రహ్మలోకమునకు బోవును.)" అను శ్రుతిచేత సుషుమ్నానాడీ మార్గమున నిర్గమించినవాడు సూర్య కిరణముల ద్వారా బ్రహ్మలోకమునకు పోవునని చెప్పబడియున్నది. రాత్రి కాలమునందు మృతిచెందినవానికికూడ నదియే మార్గమా, లేక, వేఱొకటి గలదా, అనువిషయమును ఈ యధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ १८॥ రశ్మ్యనుసారీ॥

టీక॥ సః= ఉపాసకుడు, రశ్మ్యనుసారీ = సూర్యకిరణములనే అనుసరించి పోవును.

తా॥ రాత్రికాలమునందుగాని పగటికాలమునందుగాని ఎప్పుడు మృతిచెందినను సుషుమ్నా నాడీమార్గమునుండి నిర్గమించిన యు

పాసకునకు సూర్యకిరణములే యూర్ధ్వలోకమునకు మార్గములు గాని వేఱేవియును గావు. పైన నుదహరింపబడిన శ్రుతి "రాత్రియం దైన నిట్లు పగటియందైననిట్లు అనిభేదమును చెప్పక సర్వసాధారణ ముగానే చెప్పుచున్నదిగదా. కావున ఎప్పుడుమృతిచెందినను ఉపాస కునకు సూర్యకిరణములే బ్రహ్మలోకమార్గములని తాత్పర్యము.

అవ॥ రాత్రియందు సూర్య కిరణములు లేవు కావున అప్పుడు మృతిచెందిన యుపాసకుడు ఉదయమగు నంతవరకు సూర్య కిరణము లతో సంబంధపడుననుటకు వీలులేదని చెప్పుచున్నాడు.

సూ॥ ౧౯॥ నిశినేతి చేన్న సంబంధస్య యావద్దేహ భావిత్వాద్దర్శయతిచ ॥

టీక॥ నిశి=రాత్రికాలమునందు, న = సుషుమ్నానాడికిని సం ర్యకిరణములకును సంబంధములేదు, ఇతిచేత్=అనేయెడల, న = అ సరికాదు, సంబంధస్య=ఆసంబంధము, యావద్దేవభావిత్వాత్=దేహ మున్నంతకాలము ఉండును కావున, ఏవం=ఈప్రకారముగానే, దర్శ యతి=వేదము చెప్పుచున్నది.

తా॥ అవతారికయందు చేయబడిన పూర్వపక్షము సరియైన కాదు. నాడులకును సూర్యకిరణములకును సంబంధము దేహమున్న తకాలము ఒకటేవిధముగా నుండును. "అముష్మాదాదిత్యాత్ ప్ర తాయంతే (సూర్యునివలన విస్తరించుచున్నవి.)" అను మొదల శ్రుతికూడ పైవిషయమునే స్పష్టముచేయుచున్నది. మఱియును రా కాలమునందు సూర్య కిరణములు కనుపడకుండుట అతి స్వల్పమ యుండుటవలననేకాని బొత్తిగాలేక పోవుటవలనగాదు. అవిబొత్తి లేవనినయెడల రాత్రులయందు ఉష్ణము అనుభవమునకు రాకూడ గదా. కావున ఉపాసకుడగువాడు రాత్రికాలమున మృతిచెందిన పగటికాలమున మృతిచెందినను సూర్యకిరణములకు సంబంధ పడి బ్రహ్మలోకమునకు పోవుననుట సిద్ధాంతమయ్యెనని తాత్పర్యము

—(*) ౧౧. దక్షిణాయనాధికరణమ్. (*)—

అవ॥ సగుణోపాసకుడు దక్షిణాయనమునందు మృతి చె

మొదల వానికి బ్రహ్మలోకప్రాప్తిగలదా, లేదా, అను విషయమును యధికరణమున విచారించుచున్నాడు.

సూ॥ ౨౦॥ అతశ్చాయనేపి హిదక్షిణే ॥

టీక॥ అతశ్చ = పైనచెప్పబడిన కారణము వలననే ( అనగా సగుణ బ్రహ్మోపాసన అధికమగు సామర్థ్యము కలిగియుండుట చేతనే) దక్షిణే అయనే=దక్షిణాయనమునందు, మృతస్యాపి=మృతిచెందినవానికిగూడ, బ్రహ్మలోకప్రాప్తిర్హి = బ్రహ్మలోకమును పొందుట కలుగునుకదా,

తా॥ పై యధికరణములయందు బ్రహ్మవిద్యకు సంపూర్ణసామర్థ్యముగలదని నిరూపింపబడియున్నవి. ఆకారణమువలన సగుణోపాసకుడు దక్షిణాయనమునందు మృతిచెందినను విద్యాఫలమును చెందును. " ఉత్తరాయణమునందు మృతి నొందుట శ్రేష్ఠము " అను విషయము అజ్ఞానులనుగూర్చి చెప్పబడినదియేగాని సగుణోపాసకులను గూర్చి చెప్పబడినది కాదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుట సరికాదు. " అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః " అను మొదలగు స్మృతివాక్యము ఉత్తరాయణాది కాలములయందు మృతిచెందినవాడుమాత్రమే పునరావృత్తి రహితమగు స్థానమును చెందునని చెప్పబడియున్నదికదా, అనుసమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౨౧॥ యోగినః ప్రతిస్మర్యతే స్మార్తేచైతే ॥

టీక॥ యోగినః ప్రతి=సాంఖ్యయోగులను గూర్చియును, కర్మయోగులనుగూర్చియు మాత్రమే, స్మృతియందు చెప్పబడు చున్నది. ఏతే=ఈసాంఖ్యయోగములు, స్మార్తేచ=స్మృతియందు చెప్పబడినవే.

తా॥ ఫలాపేక్షనువదలి భగవదారాధనమనుబుద్ధితోను కర్మల నాచరించుట కర్మయోగము. ప్రాణాయామాది సాధనములచే నభ్యసింపబడు యోగము సాంఖ్యయోగము. ఈరెండుయోగములును స్మృతులయందు చెప్పబడియున్నవి. అవతారికయందు ఉదహరింపబడిన వాక్యము తనకు సమీపమునందున్న సాంఖ్యయోగములను గూర్చియే ( అనగా వాటిని అవలంబించిన వారిని గూర్చియే ) చెప్పును గాని శ్రుత్యుక్తములగు దహరాద్యుపాసనలను గూర్చియు దాని

నుపాసించువారలను గూర్చియు చెప్పదు. కావున సగుణ బ్రహ్మో పాసకుడగువాడు రాత్రియందు మృతిచెందినను దక్షిణాయనమునందు మృతిచెందినను ఉపాసనా ఫలమును సంపూర్ణముగా చెందు నని తాత్పర్యము.

వాఙ్మనస్యైకాదశైకవిగ్ంశతిః॥ ౨౧॥

వాఙ్మనసి, తన్మన, స్సోఽధ్యక్షే, సమానా, తదాపీతేః, ప్రతిషేధా, త్తానిపరే. అవిభాగ, స్తదోకో, రశ్మ్యనుసా, ర్యతశ్చాయనే, స్త్వేకాదశ॥ ౧౧॥

ఇతిశ్రీ బ్రహ్మసూత్రే- చతుర్థస్యాధ్యాయస్య ద్వితీయపాదః.

ఇట్లు చతుర్థాధ్యాయమునందు ద్వితీయపాదము,

ము గి సె ను.



ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## చతుర్థాధ్యాయము - తృతీయపాదము

—(*) అర్చిరాద్యధికరణమ్. (*)—

అవ॥ పై పాదమునందు ఉత్క్రాంతిని గూర్చి వివరింప బడియున్నది. ఈ పాదమున ఆ ఉత్క్రాంతి కనంతరము సగుణోపాసకులకు కలుగు దేవయాన మార్గమును గూర్చి విచారణ చేయువారు ఈ మొదటి అధికరణమునందు సగుణోపాసకు లందరును అనుసరింపవలసిన మార్గమొకటియేయని సిద్ధాంతము చేయుచున్నారు.

సూ॥ ౧॥ అర్చిరాదినాతత్ప్రథితేః ॥

టీక॥ సర్వేప్యుపాసకాః = సగుణోపాసకులందరును,

రాది మార్గముననుసరించియే, బ్రహ్మలోకంగచ్ఛంతి = బ్రహ్మలోకమునకు బోవుదురు, నాన్యేన = ఇతరమార్గము ననుసరింపరు, కుతః = ఎందువలన ననగా, తత్ప్రథితేః = ఆ అర్చిరాదిమార్గమే, పంచాగ్నివిద్యమొదలగు అన్నివిద్యలయందును ప్రసిద్ధముగ నుండుటవలన.

తా॥ ఉపాసకులందరును దేవయానమార్గము నొకదానినాశ్రయించియే బ్రహ్మలోకమునకు బోవుదురని వేదమునందంతటను చెప్పబడియున్నది. కొన్నికొన్నిస్థలములయందు కొంతభేదమున్నట్లు తోచుచున్నను ఆసర్వస్థలముల యందును దేవయానమునకు సంబంధించిన సూర్యాదులే వర్ణింపబడియుండుటచేతను బ్రహ్మలోకమొకటియే గమ్యస్థానముగా వర్ణింపబడియుండుటచేతను ఆస్థలములన్నియును సమానముగువిషయమును చెప్పునవియేయని సిద్ధాంతముచేయవలసియున్నది. ఈకారణమువలన ఉపాసకులందరును దేవయానమార్గము నొకదానినే అనుసరించి బ్రహ్మలోకమునకు బోవుదురని తాత్పర్యము.

—(*) ౨. వాయ్వధికరణము. (*—

అవ॥ పై అధికరణముచేత ఉపాసకులకందరికిని సాధారణముగా దేవయానమార్గము కలదని (అనగా అందరును దేవయానమార్గము అనుసరించియే బ్రహ్మలోకమునకు బోవుదురని) చెప్పబడియున్నది. ఈయధికరణమున ఆమార్గస్వరూపమును నిరూపించుచున్నాడు.

సూ॥ ౨॥ వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యామ్ ॥

టీక॥ అబ్దాత్ = సంవత్సరాభిమానిదేవతను అనుక్రమించినపిదప, తే = ఉపాసకులు, వాయుం = దేవలోకసహితుడగు వాయువును, అభిసంభవతి = పొందుదురు. కుతః = ఎందువలననగా, అవిశేషవిశేషాభ్యాం = ఈవాయువునుగూర్చి చెప్పుశ్రుతులు ఒకచోట సామాన్యముగాను మఱియొకచోట విశేషముగాను చెప్పుచుండుటవలన.

తా॥ ఉపాసకుడగువాడు సుషుమ్నానాడీ మార్గమున నిర్గమించి దేవయానమార్గముబొంది సూర్యకిరణములద్వారా బ్రహ్మలోకమునకు బోవుచు తేజస్సు, పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము,

సంవత్సరము, వీనినభిమానించు దేవతలయొక్క లోకములను క్రమ
క్రమముగాగడచి ఆసంవత్సరాభిమాని దేవతయొక్క లోకమునుండి
దేవలోకమునకును పిదప వాయులోకమునకు పోయి అచ్చటినుండి
సూర్యలోకమునకుబోవును. శ్రుతియందును సంవత్సరాభిమాన దేవ
తను విడచి పిదప ఉపాసకుడగువాడు వాయువునుపొంది అచ్చటి
నుండి సూర్యునిజెందుననువిషయము స్పష్టముచేయబడియున్నది. ఎట్లన
నగా " సవాయులోకం ( ఆఉపాసకుడు వాయులోకమును చెందు
ను ) " అను కౌషీతకీ బ్రాహ్మణ శ్రుతివలన దేవయానమునందు సూ
ర్యాదులతోపాటు వాయువుకూడ కలదని తెలియజేయబడుచున్నది.
" ఆవాయువు వసించుట నతిక్రమించిన పిదప ఉపాసకునిచే పొందబ
డును " అనుసందర్భమునుబట్టి " సవాయుమాగచ్ఛతి సతస్మై విజిహీ
తేయథారథచక్రస్య ఖం స ఊర్ధ్వమాక్రమతే ( ఆఉపాసకుడు వా
యువునొద్దకుబోవును. రథచక్రమునకు ఆకాశము చోటిచ్చునట్లు
వాయువు అతనికి ఎడమునిచ్చును. దానిద్వారా అతడు సూర్యునిచెం
దును ) " అను బృహదారణ్యకశ్రుతి " సూర్యునిదగ్గరకు పోవుటకు
ముందుగా ఆయుపాసకుడు వాయువునొద్దకు బోవును " అని వాయు
వునుచెందు సమయమును నిర్ణయించుచున్నది. మఱియును " మాసే
భ్యో దేవలోకం ( మాసముల నభిమానించు దేవతనుండి [ మాసము
లని చెప్పుటవలన మాసములన్నియు నంగములుగా గలిగియున్న సంవ
త్సరమనికూడ ఇతరశ్రుతిసహాయముచే నిర్ణయించుకొనవలయును ]
దేవలోకమునకుబోవును ) " అనువాక్యమునుబట్టియుంచిన వాయువున
కును సంవత్సరాభిమానిదేవతకును నడుమ దేవలోకమొకటి కల
దని తెలియవచ్చుచున్నది. ఈకారణమువలన ఉపాసకుడగువాడు సం
వత్సర, దేవలోక, వాయు, సూర్యులను క్రమముగా జెందునని తా
త్పర్యము.

—(*) ౩. వరుణాధికరణమ్. (*)—

అవ॥ మఱియు కౌషీతకీ బ్రాహ్మణశ్రుతియందు వాయువును
గూర్చి చెప్పినపిదప వరుణాదులనుగూర్చి చెప్పబడియున్నది. ఈఅర్చి
రాదిమార్గమునందు ఆవరుణాదు లెట్లు సంబంధపడుదురను విషయ
మునుగూర్చి ఈఅధికరణమున నిర్ణయించుచున్నాడు.

సూ॥ ౩॥ తటితోఽధివరుణస్సంబంధాత్ ॥

టీక॥ సంబంధాత్ = సంబంధము సరిగానుండుటవలన, తటితోఽధి=తటిల్లోకమునకు తరువాత, వరుణః=వరుణుడు, నివేశనీయః= నిలుపుకొనతగినవాడు.

తా॥ సూర్యునివిడచినపిదప ఉపాసకుడు చంద్రలోకమును తటిల్లోకమును (మెరుపులను) వరుణలోకమును ఇంద్రలోకమును ప్రజాపతిలోకమును ప్రవేశించి పిదప బ్రహ్మలోకమునకు జేరును. కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునందు వాయువునకు పిదప వరుణుడు చెప్పబడియున్నను అతనిని తటిల్లోకమునకు తరువాతనే చేర్చు కొనవలయును. జలాధిపతియగుటచే నావరుణుడు మెరుపులకుపైనున్న జలసహిత మేఘములను ఆశ్రయించియున్నాడనుటనే యుక్తియుక్తముగదా. ఈయుక్తివలన వరుణుని తటిల్లోకమునకు తరువాతనే చేర్చుకొనవలయును. ఆకౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునందే వరుణునికి పిదప చెప్పబడియున్న ఇంద్రలోక ప్రజాపతి లోకములు మాత్రము క్రమముగానే చేర్చుకొనబడవలయునని తాత్పర్యము.

—(*) ౪. అతివాహికాధికరణము. (*)—

అవ॥ ముందుచెప్పబడియున్న అర్చి (దానినధిష్ఠానించు అగ్ని లోకము) మొదలగునవి సగుణోపాసకులు మోక్షమార్గమునకు గుర్తులా, లేక, సుఖభోగము అనుభవించునట్టి స్థలములా, లేక, ఉపాసకులను ఒకచోటనుండి మఱియొకచోటికి తీసికొనిపోవునట్టి అంచలా, అనువిషయమును ఈ అధికరణమున విచారించుచున్నాము.

సూ॥ ౪॥ ఆతివాహికాస్తల్లింగాత్ ॥

టీక॥ తల్లింగాత్ = దానికితగిన గుఱుతు లుండుటవలన, అగ్న్యగ్ని దయోవిద్యుదంతాః = అర్చిరధిష్ఠాన దేవతయగు అగ్ని మొదలు మెరుపువరకు చెప్పబడియున్న దేవతలందరును అతివాహికాః= ఉపాసకుని ఒకస్థలమునుండి మఱియొకస్థలమునకు గొనిపోవువారే.

తా॥ అగ్నిమొదలగు దేవతలు తమలోకమునకువచ్చిన ఉపాసకుని ఇతర లోకమునకు తీసికొనిపోవుచుందురు. మెరుపునుగూర్చి చెప్పునంతవరకు ఇట్లనుని తెలిసికొనవలయును. ఇట్లు సిద్ధయుంచు

టకు శ్రుతియందు ఒకగురుతు కనబడుచున్నది. ఎట్లనగా ( ఉపాసకుడు తటిల్లోకమునకు పోవునని చెప్పినపిదప " చంద్రమసోవిద్యుతం తత్పురుషో ఽమానవస్సఏనాన్ బ్రహ్మగమయతి ( ఉపాసకులు చంద్రలోకమునుండి తటిల్లోకమునకు పోవుదురు. సిద్ధుడొకడు వారి నచ్చటినుండి బ్రహ్మలోకమునకు గొనిపోవును. ) అని చెప్పబడియున్నది. దీనినిపట్టిచూచిన విద్యుల్లోకమువరకు క్రమముగా చెప్పబడియున్న అగ్న్యాదిదేవతలుకూడా తమతమలోకములనుండి అనంతరలోకమునకు గొనిపోవువారేయను సిద్ధాంతము జేయవలసియున్నది. ఈకారణమువలన ఆఅగ్న్యాదిలోకములు దేవయానమార్గమునకు గురుతులని చెప్పుటకు వీలులేదు. అగ్నిలోక వాయులోకము అను మొదలగునవి శ్రుతియందు లోకశబ్దమున్నదను నంతమాత్రమున నాలోకములు బ్రహ్మలోకమునకు బోవుచున్న జీవునకు భోగస్థానములని చెప్పుటకు వీలులేదు. ఆజీవునకు అప్పుడు భోగసాధనములగు సర్వేంద్రియములును లీనమై యున్నవికదా. కావున అగ్న్యాదులు తమతమ లోకములనుండి అనంతరలోకములకు ఉపాసకుని గొనిపోవుదురనుటయే సిద్ధాంతమని తాత్పర్యము.

అవ॥ పైన సిద్ధాంతముచేసియున్న విషయమును దృఢపరుచుటకై మఱియొక లోకన్యాయమును జూపుచు అర్చిరాది పదములు తత్తదభిమాని దేవతలనుగూర్చియే చెప్పుననియు అచ్చటనుండు లోకశబ్దము " లోక్యత ఇతిలోకః " అను వ్యుత్పత్తిచేత దేవతనే జెప్పును గాని లోకమునుగూర్చి చెప్పదనియు నిరూపించుచున్నారు.

సూ॥ ౫॥ ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః ॥

టీక॥ అన్యథా = అర్చిరాదిశబ్దములు లోకములను గూర్చియే చెప్పుననిన, ఉభయ వ్యామోహాత్ = ఇరువురకును ( లోకములకును బ్రహ్మలోకములకు పోవలసియున్న యుపాసకులకును ) అజ్ఞానమే యుండుటవలన, లోకన్యాయవిరోధః = " చేతనులైనను మూర్ఛనుచెంది ఇంద్రియచేష్టలు లేకుండునప్పుడు వారిని మఱియొక చేతనుడు నడిపించును, లేక, తీసికొనిపోవును. " అను లోకన్యాయమునకు విరోధమువచ్చును. అస్మాత్ = ఈ కారణమువలన, తత్సిద్ధేః = పైనచెప్పి

సిద్ధాంతమే ( అర్చిరాదులు తమలోకమునకు వచ్చిన యుపాసకుని అనంతరలోకమునకు గొనిపోవుట కనువనియే యని చెప్పు సిద్ధాంతమే ) స్థిరమగుచున్నది కావున, పూర్వోక్తం సమంజసం = పై సూత్రమునందు చెప్పినదియే సరి.

తా॥ శ్రుతియందలి లోకశబ్దము అగ్న్యాదిలోకములనుగూర్చియే చెప్పవలసిన యుక్తికి విరోధము వచ్చునని పై సూత్రము నందు నిరూపించి యున్నాము. ఆ నిరూపణవలన శ్రుతియందలి అగ్న్యాది పదములు తత్తద్దేవతా వాచకములనియే చెప్ప వలసి వచ్చుచున్నది గదా! ఇట్లు చెప్పకపోయిన యెడల ప్రత్యక్ష సిద్ధమగు న్యాయమునకు విరోధమువచ్చును. ఎట్లనగా:— అగ్నిలోకాది శబ్దములు అగ్ని మొదలగువారు ప్రభువులుగానుండు లోకములను గూర్చియే చెప్పవలసిన అచేతన పదార్థములను గూర్చియే చెప్పుచున్నవి అని అనవలయును గదా. బ్రహ్మలోకమునకు బోవు నుపాసకులు మూర్ఛావస్థను జెందుటచేత స్వప్రయత్నమేమియును లేనివారుగావున చేతనులైనను అచేతనులవంటివారు. వారికి స్వతంత్రముగా ఒకలోకమునుండి మఱియొక లోకమునకు గమనము సంభవింపదు. పైన నిరూపింపబడిన విధముగా అర్చిరాది శబ్దములుకూడ అచేతనములగు అగ్నిలోకాదులను చెప్పునవియగునేని ఆయుపాసకులు యొకచోటనుండి మఱియొక చోటికి పోవుటకే వీలులేదు. ఒకయచేతనము మఱియొక యచేతనమును లేక తత్తుల్యమును ఒకచోటికి తీసికొని పోవుననుట ప్రత్యక్షమునకు విరుద్ధముగదా. ఈ కారణమువలన అచేతనతుల్యుడగు నుపాసకుడు ఒకలోకమునుండి మఱియొకలోకమునకు వోవుట సిద్ధించుటకై, "అర్చిరాది శబ్దములు చేతనులగు నగ్న్యాదిదేవతలనే చెప్పును" అనిలోక న్యాయానుసారముగా నొప్పుకొనవలయును. అప్పుడు " లోక్యత ఇతి లోకః ( చూడబడునది లేక తెలిసికొనబడునది కావున లోకము )" అనువ్యుత్పత్తిచే లోకశబ్దమును అగ్న్యాదులకు విశేషణమునుగా చేసికొనవచ్చునని తాత్పర్యము.

అవ॥ పైన చేసిన సిద్ధాంతము సరియైనది కాదు. " తాన్ వైద్యుతాల్లోకాదమానవః పురుషః బ్రహ్మగమయతి ( ఆ ఉపాస

కులును విద్యుల్లోకమునుండి యొక సిద్ధుడు బ్రహ్మలోకమునకు తీసికొనిపోవును.)" అను శ్రుతియందు విద్యుల్లోకానంతరము వరుణాదులు ఆ ఉపాసకుని గొనిపోవుదురనియు సిద్ధుడొకడు ఆ యుపాసకుని బ్రహ్మలోకమును జేర్చుననియు చెప్పబడి యున్నది. దీనిని బట్టి చూచిన అర్చిరాదులుగూడ ఉపాసకుని అనంతర లోకములకు తీసికొనిపోవువారు కారని చెప్పవలసి యున్నదికదా. అనిన నట్లు కాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౬॥ వైద్యుతేనైవతతస్తచ్ఛ్రుతేః ॥

టీక॥ తతః=విద్యుల్లోకమునుండి, తచ్ఛ్రుతేః = శ్రుతిచెప్పిన ప్రకారము, వైద్యుతేనైవ=వైద్యుతపురుషునిద్వారాగా బ్రహ్మలోకమునుండి ఈ యుపాసకులను గొనిపోవుటకై వచ్చిన సిద్ధుడు వైద్యుతుడనబడును,) బ్రహ్మలోకగమనం = ఉపాసకులు బ్రహ్మలోకమునకు బోవుదురు.

తా॥ బ్రహ్మలోకమునుండి ఉపాసకుని గొనిపోవుటకై విద్యుల్లోకమునకు వచ్చిన పురుషుడు వైద్యుతుడనబడునని తెలిసికొనవలయును. ఉపాసకులగువారు దేవయానమార్గము నవలంబించి అగ్ని మొదలగువారిచే క్రమక్రమముగా అనంతర లోకములకు గొనిపోవబడుచు తటిల్లోకమును జేరుదురు. అచ్చటనుండి మాత్రము అనంతరలోకస్థులగు వరుణాదులు స్వయముగా వారినిగొనిపోరు. వైద్యుతపురుషుడు ఒకడే ఆ వరుణాదుల సహాయముచే వారిని బ్రహ్మలోకమునకు జేర్చును. ఈ విషయమంతయును అవతారికయందు ఉదహరింపబడిన శ్రుతిచేతనే స్పష్టముచేయబడినది. మొట్టమొదట "అర్చిరాదులు ఉపాసకులను తమతమ లోకములనుండి యనంతరలోకములకు గొనిపోవును. అనువిషయము ఎట్లు సిద్ధించిన దందురేమో ఆ విషయముకూడ నపై శ్రుతిచేతనే సిద్ధాంతము చేయబడుచున్నది. అది యెట్లనిన:—విద్యుల్లోకమునుండి వైద్యుతపురుషుడు వారిని గొనిపోవునని చెప్పుటచే నంతకుముందుకూడ వారుస్వతంత్రులై వచ్చినవారు కారనియు యితరులెవరో యొకరు వారినొకచోటనుండి మఱియొకచోటికి తీసికొని వచ్చుచునే యుండిరనియు తెలియవచ్చుచున్నది.

విద్యుల్లోకమునుగూర్చి చెప్పుటకుముందు అర్చిరాదిలోకములకుప్రభువులగు అగ్నిమొదలగువారినిగూర్చితప్ప మఱియెవ్వరినిగూర్చియుచెప్పియుండక పోవుటచేత నాయగ్న్యాదులే వారిని తమ లోకమునుండి మఱియొక లోకమునకు గొనిపోవుచుండవలయుననికూడ వానివలననే ఏర్పడుచున్నది. ఈ విషయము నాల్గవ సూత్రమునందు నిర్ణయింపబడియున్నది. ఇదియథార్థమా, కాదా, అని కొంతసంశయము కలిగిన నదికూడ ప్రస్తుతశ్రుతిచేతనే నివారింపబడుచున్నది. ఎట్లనగా:— అర్చిరాదిలోకములకు ప్రభువులగు నగ్న్యాదులు ఎట్లు ఉపాసకుని యనంతర లోకములకు గొనిపోవుదురో అట్లే విద్యుల్లోకమునకు అనంతరమందున్న వరుణాదులుకూడ ఉపాసకులకు వాహకులే (ఒకచోటనుండి మఱియొకచోటికి గొనిపోవువారే) కావలయును గదా. శ్రుతియందు అట్లు చెప్పబడలేదు. కావున నగ్న్యాదులుకూడ వాహకులగుదురో కారో అను సంశయము కలుగును. అట్లుకలిగినను దానిని పై శ్రుతియే నివారించును. బాగుగ నాలోచించిన "వైద్యుతపురుషుడు ఉపాసకులను విద్యుల్లోకమునుండి గొనిపోవును." అనుటకును "వరుణాదులు ఉపాసకులను వాహకులు కావలయును" అనుటకును విరోధమేలేదు. ఒకడు (వైద్యుతపురుషుడు) ప్రధాన వాహకుడనియు తక్కినవారు (వరుణాదులు) అప్రధాన వాహకులనియు చెప్పవచ్చునుగదా. దీనినిబట్టి చూచిన అగ్న్యాదులు ప్రధాన వాహకులనికూడ పైశ్రుతిచేతనే నిర్ణయింపబడినట్లు స్పష్టమగుచున్నది. ఈ కారణముల వలన అర్చిరాదుల వాహకులను విషయము చక్కగ సిద్ధాంతము చేయబడెనని తాత్పర్యము.

—(*) ౫. కార్యాధికరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా నాలుగు అధికరణములచేత బ్రహ్మలోకప్రాప్తికి వలసిన దేవయానమార్గమును నిరూపించి ఈక్రింద ఫలభూతమగు బ్రహ్మలోకమునుగూర్చి నిరూపించువాడై మొట్టమొదట స్వసిద్ధాంతమును చెప్పుచున్నాడు.

సూ॥ ౭॥ కార్యంబాదరిరస్యగత్యుపపత్తేః॥

టీక॥ అస్య=ఈ సగుణబ్రహ్మకు (ఈ సగుణబ్రహ్మనుగూర్చి)

యింపబడెను. కావున పైసూత్రమునందు చేసినసిద్ధాంతమునకు భంగములేదు. ఇట్లు నిరూపింపబడిన బాదరినమహాముని మతమే వ్యాసమతమని తెలిసికొనవలయునని తాత్పర్యము.

అవ॥ ఇట్లుచెప్పుట సరికాదు. నపుంసక లింగమునందుండు బ్రహ్మశబ్దము పరబ్రహ్మమును చెప్పునప్పుడే (నిర్గుణ బ్రహ్మమును చెప్పునప్పుడే) ఉపయోగింపబడును. కావున సగుణ బ్రహ్మమును చెప్పునప్పుడు ఉపయోగింపబడదు. ఈకారణమువలన "సఏనాన్" అనువాక్యమునందున్న బ్రహ్మశబ్దము సగుణబ్రహ్మపరము గాదనియు దానివలన పైనచెప్పిన మతము సరికాదనియు చెప్పవలసివచ్చుచున్నది. అనిన, నట్లుగాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౯॥ సామీప్యాత్తు తద్వ్యపదేశః ॥

టీక॥ సామీప్యాత్ = పరబ్రహ్మముయొక్క సన్నిధానమువలన, కార్యేపి=సగుణబ్రహ్మమునందుకూడ, తద్వ్యపదేశః= ఆనపుంసకలింగ బ్రహ్మశబ్దముచేత చెప్పుట, సంభవతి= సంభవించును.

తా॥ అపతారికయందు చూపబడిన దోషము సరియైనదికాదు. నిర్గుణబ్రహ్మమునకును సగుణబ్రహ్మమునకును మిక్కిలిదగ్గర. నిర్గుణుడగు బ్రహ్మ నొక్కడానినే ఉపాసకులను అనుగ్రహించుటకై మనోమయత్వాది గుణములు కలదానినిగా నొక్కచోటను తత్త్వముము తెలియజేయుటకై నిర్విశేషమైన దానినిగా నొక్కచోటను చెప్పుచున్నాముగదా. ఇందు మనోమయత్వాది గుణములుగల బ్రహ్మ సగుణ మనియు అపరమనియు కార్యమనియు చెప్పబడుచున్నది. ఈకారణమువలన సగుణబ్రహ్మమునకును శుద్ధబ్రహ్మమునకును భేదమేలేదు. కావున శుద్ధబ్రహ్మవాచకమగు నపుంసకలింగ బ్రహ్మశబ్దముచే సగుణబ్రహ్మను చెప్పుటవలన విరోధమేమియును లేదని తాత్ప.

అవ॥ ఇట్లుచెప్పిన " నసపునరావర్తతే వాడు [ బ్రహ్మను పొందినవాడు ] తిరిగి రాడు " అనుశ్రుతికి విరోధమువచ్చును. కార్యబ్రహ్మలోకము పంచభూతములవలన కలిగినదగుటచేత అనిత్యముగదా. అనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౦॥ కార్యాత్యయేతదధ్యక్షేణ సహాతఃపరమభి
ధానాత్ ॥

టీక॥ అభిధానాత్ = " నసపునరావర్తతే " అను మొదలగు శ్రుతివలన, కార్యాత్యయే = కార్యబ్రహ్మలోకము నశించునప్పుడు, తదధ్యక్షేణసహ = దానికధిపతియగు బ్రహ్మతోకూడా, అతః = ఆకార్యబ్రహ్మలోకమునకంటె, పరం = శ్రేష్ఠమైన మోక్షమును, ఉపాసకాః = ఆయుపాసకులు, ప్రతిపద్యంతే = పొందుదురు.

తా॥ పైన నిరూపింపబడిన మతము " నసపునరావర్తతే " అనుశ్రుతికి విరుద్ధమని చెప్పవలసిరలేదు. ఉపాసకుడగువాడు పైన నిరూపింపబడిన దేవయానమార్గము అనుసరించి బ్రహ్మలోకమును జేరి అచ్చటనే అపరోక్ష బ్రహ్మజ్ఞానమునుపొంది ఆలోకము నశించునప్పుడు దానికధికారియగు కార్యబ్రహ్మతోకూడ మోక్షమును పొందునని " నసపునరావర్తతే " అను పైశ్రుతినిబట్టియే నిర్ణయించుటకు వీలుగలదుకదా. కావున అవలోకియమును చూపబడిన పూర్వపక్షమువలన సిద్ధాంతమునకేమియును భంగమురాదని తాత్పర్యము.

సూ॥ ౧౧॥ స్మృతేశ్చ ॥

టీక॥ స్మృతేశ్చ = స్మృతివలనకూడా, ఏవమేవ = పైనచెప్పిన విధముగానే సిద్ధించుచున్నది.

తా॥ " బ్రహ్మణాసహతేసర్వే సంప్రాప్తేప్రతిసంచరే । పరస్యాంతేకృతాత్మానః ప్రవిశంతిపరంపదం ( మహాప్రళయము వచ్చినప్పుడు హిరణ్యగర్భుని యధికారము తీరిపోవును. అప్పుడు ఆతనిలోకమునందున్న ఉపాసకులు అపరోక్ష బ్రహ్మజ్ఞానము కలవారై ఆయనతోకూడ మోక్షమును చెందుదురు. ) " అనుస్మృతిని బట్టిచూచినను పైసూత్రమునందు చెప్పినవిషయమే స్థిరమగుచున్నదని తాత్ప.

అవ॥ ఈవిధముగా స్వసిద్ధాంతమును తెలియజేసి సూత్రకారుడు పూర్వపక్షమును చూపుచున్నాడు.

సూ॥ ౧౨॥ పరంజైమినిర్ముఖ్యత్వాత్ ॥

టీక॥ ముఖ్యత్వాత్ = నపుంసకలింగ బ్రహ్మశబ్దము పరబ్రహ్మమునందే ముఖ్యమైయుండుటవలన, బ్రహ్మ = " సమానవః " అను

వాక్యమునందున్న బ్రహ్మము, పరం = పరబ్రహ్మమే (నిర్గుణబ్రహ్మమే) ఇతిజైమినిర్మన్యతే = అని జైమినిమహాముని తలంచుచున్నాడు.

తా॥ నపుంసకలింగమునందలి బ్రహ్మశబ్దము ముఖ్యముగా నిర్గుణబ్రహ్మమునుగూర్చియే చెప్పును. ముఖ్యార్థమునకు బాధలేనప్పుడు గౌణార్థమును ( అప్రధానముగానర్థమును ) చెప్పుట యుక్తముకాదుగదా. కావున " సమానః " అను వాక్యమునందలి నపుంసకలింగ బ్రహ్మశబ్దముచేత చెప్పబడునది శుద్ధబ్రహ్మమే ఈ కారణమువలన అర్చిరాదులను సిద్ధులను ఉపాసకులగువారికి శుద్ధపరబ్రహ్మముయొక్క సమీపమునకే గొనిపోవుదురని జైమినిమహాముని అభిప్రాయపడుచున్నాడని తాత్పర్యము.

సూ॥ ౩॥ దర్శనాచ్చ ॥

టీక॥ దర్శనాచ్చ = శ్రుతివలనకూడ, ఏవమేవేతి = ఇదియే సిద్ధాంతముగా చెప్పబడును, జైమినినః = జైమినియభిప్రాయము.

తా॥ " తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి ( అసుషుమ్నానాడీ మార్గమున నిర్గమించినవాడు మోక్షమును పొందును ) " అని శ్రుతి ఉపాసకునకు మోక్షమును చెప్పుచున్నది. " సమానవః " అను శ్రుతియందలి బ్రహ్మశబ్దమునకు " సగుణబ్రహ్మ " అని యర్థము చెప్పి "ఉపాసకులగువారు సగుణబ్రహ్మలోకమును పొందుదురు" అని చెప్పినచో పైశ్రుతికి విరోధము వచ్చునుగదా, కావున అచ్చటనుండు బ్రహ్మశబ్దమునకు నిర్విశేషబ్రహ్మమే అర్థము. యీ అమానవుడు ఉపాసకుని నచ్చటికే గొనిపోవునదనియు వానివలనను ఉపాసకుడు ముక్తుడగుననియు జైమినిమహాముని యభిప్రాయపడుచున్నాడనియు తాత్పర్యము.

అ॥ ఇట్లు చెప్పుట సరికాదు. " ప్రజాపతేస్సభాంవేశ్మప్రపద్యే ( బ్రహ్మదేవునియొక్క సభాభవనమునుగూర్చి పోవుదును ) " అను శ్రుతియందు ఉపాసకుడగువాడు బ్రహ్మలోకమునకు ( సగుణబ్రహ్మలోకమునకు ) పోవలయునని సంకల్పించునట్లు చెప్పబడియున్నదికదా. అనిన జైమినిమహాముని ( పూర్వపక్షి ) సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౧౪॥ నచకార్యే ప్రతిపత్త్యభిసంధిః ॥

టీక॥ ప్రతిపత్త్యభిసంధిః = "ప్రజాపతేః" అను మొదలగు వాక్యమునందలి ప్రతిపత్త్యభిసంధి (పొందవలయుననేఇచ్ఛ) కార్యే= కార్యబ్రహ్మవిషయమునందు, నచసంభవతి = సంభవించుననిచెప్ప టకువీలులేదు.

తా॥ పైన ఉదహరించబడిన శ్రుతియందు చెప్పబడిన విషయ ము (ఉపాసకుడు బ్రహ్మలోకమును పొందవలయునని కోరుననువిష యము) సగుణబ్రహ్మపరమైనదికాదు. (అనగా సగుణబ్రహ్మలోక మునుగూర్చి పోవలయునని తలంపడనుట) మఱియేమనిన "నిర్గుణ బ్రహ్మమును పొందవలయుననియే సంకల్పించును" అనియే చెప్పవల యును. వీలయునగా "యదంతరా తే తద్బ్రహ్మ (నీలోపలనుండునదిపర బ్రహ్మమే)" అను వాక్యము నేత "ప్రస్తుత ప్రకరణమునందు శుద్ధపర బ్రహ్మమును గూర్చియే చెప్పబడుచున్నది" అని స్పష్టము చేయబడుచు న్నదిగదా. నిర్గుణపరబ్రహ్మమునుగూర్చి చెప్పననినయెడల సర్వవ్యాప కుడగు నాపరబ్రహ్మను జెందుటకై యొకచోటనుండి మఱియొకచోటికి పోవలసిన యావశ్యకతలేదు. కావున "ప్రజాపతేస్సభాం" అనువా క్యమునందు చెప్పబడియున్న సంకల్పము నిరర్థకము కావలసివచ్చు నందురేమో అదియొకవిరోధము కాదు. ప్రాప్తి (పొందుట) అను పదమునకు ఔపచారికముగా అర్థము చెప్పవచ్చునుగదా. ఈకారణ మువలన "సమానవః" అను మొదలగు వాక్యమునందలి బ్రహ్మ శబ్దమునకు నిర్విశేష బ్రహ్మమనియే యర్థము చెప్పుట యుక్తియుక్త మని జైమిని యభిప్రాయపడుచున్నాడు. ౧౨వది, మొదలుకొని ౧౪ వ, సూత్రములవరకు చెప్పబడిన విషయము పూర్వపక్షము. ౭ వది, మొదలు ౧౧వ, సూత్రములవరకు చెప్పబడినవిషయము సిద్ధాంతము. ఆ యా సూత్రముల యర్థమునుబట్టిచూచిన మొదటివి సిద్ధాంతసూత్ర ములుగాను తర్వాతవి పూర్వపక్షసూత్రములుగాను కనుపడుచున్నను శంకరాచార్యులవారల పాఠక్రమమువనుసరించియే వాటికి వ్యాఖ్యా నముచేసెను. వాచస్పతి మిశ్రులుమాత్రము పాఠక్రమమునకంటే అర్థక్రమము బలవత్తరమను నభిప్రాయముచే పూర్వపక్షమును ముం

నను సిద్ధాంతమును తరువాతను కూర్చియున్నాము. ఈ పూర్వపక్షమునందు చూపబడిన కారణములలో ౧౨ వ - సూత్రమునందు చెప్పబడిన " ముఖ్యత్వను ( నపుంసక లింగబ్రహ్మశబ్దము పరబ్రహ్మమునందే ముఖ్యమను కారణము. ) " ౯ వ- సూత్రమునందును, ౧౩ వ- సూత్రమునందు చెప్పబడిన "దర్శనాత్ ( శ్రుతివలన బ్రహ్మశబ్దము నిర్గుణ బ్రహ్మపరమను కారణము ౧౦ వ సూత్రమునందును ఖండింపబడియే యున్నవి. ప్రస్తుత సూత్రమునందు చూపబడియున్న కారణముకూడ సిద్ధాంతమునకు భంగముకలుగజేయ నేరదు. "ప్రజాపతేస్సభాం " అను మొదలగునది " వాక్యము " కావున ప్రకరణమునకంటె బలవత్తరము. అయినను గాని గతిసంకల్పమునకు ( పోందుదును అనుసంకల్పమునకు ) ముఖ్యార్థము ( పోవుట అనునట్టి ప్రధానమగు నర్థము ) ఉండగా ( అనగా నిచ్చెను వానికి సగుణబ్రహ్మలోకమునుగూర్చి పోవుట అను ముఖ్యార్థము. పోవుటకు శక్తిని గల్గి కలిగియుండగా నట్టి) ఓ మరొకయర్థమును చెప్పుట యుక్తియుక్తముగాదు. ఈ విషయము, ౭ వ- సూత్రమునందే రూపింపబడియున్నది. కావున ఈ పూర్వపక్షమువలన సిద్ధాంతమునకేమియును భంగములేదనియు " అమానవః " అను వాక్యమునందలి బ్రహ్మపదమునకు సగుణబ్రహ్మయే యర్థమనియు తాత్పర్యము.

—(*) ౬. అప్రతీకాలంబనాధికరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా బ్రహ్మలోక మార్గమును గూర్చియు బ్రహ్మలోకమును గూర్చియు నిరూపించి యిక్రింది యధికరణమునందు బ్రహ్మలోకమునకు పోవువానిని నిరూపించుచున్నారు. ఉపాసకులందరును బ్రహ్మలోకమునకు బోవువారేనా, కారా, అను విషయము ఇందు విచారింపబడును. ఉపాసకులు రెండువిధములుగా నున్నారు కొందరు నిర్విశేషుడగు పరబ్రహ్మమును మనోమయత్వాది గుణములుకలవానినిగా నుపాసింతురు. ఇతరులందరు వాక్కు, మనస్సు మొదలగు వానినే పరబ్రహ్మదృష్టిలో నుపాసింతురు. ఈ రెండువిధములగు వారిలోను బ్రహ్మలోకమునకు పోవువా రెవ్వరు, పోకుండు వా రెవ్వరు, అనువిషయము ఇందు నిర్ణయింపబడును.

సూ॥ ౧౫॥ అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ

ఉభయథాఽదోషా త్తత్క్రతుశ్చ॥

టీక॥ ఉభయథా= రెండువిధములుగాకూడ ( ఉపాసకులలో కొందరిని సిద్ధుడు బ్రహ్మలోకమునకు గొనిపోవును. కొందఱిని గొని పోవడు. అనిచెప్పినప్పటికిని కూడ ) అదోషాత్ = దోషము లేకపోవుట వలన, అప్రతీకాలంబనాత్= ప్రతీకోపాసనలను చేయకుండువారినే, అమానవః=సిద్ధుడు, బ్రహ్మలోకంనయతి= బ్రహ్మలోకమునకు తీసి కొనిపోవును. తత్క్రతుశ్చ=ఎవ్వడు దేనినుపాసించునో వాడు దానిని చెందును." అనున్యాయము కూడ, ఏతత్సమర్థయతి=పైనచెప్పినవిషయ మును సిద్ధాంతము చేయుచున్నది, ఇతి=అని. బాదరాయణః = వ్యా సాచార్యులు. మన్యతే=తలంచుచున్నాడు,

తా॥ సిద్ధుడు పరబ్రహ్మమును ఉపాసించిన యుపాసకులనే బ్రహ్మలోకమునకు గొనిపోవునుగాని ప్రతీకములను ( బ్రహ్మదృష్టి చే ధ్యానింపబడు మనస్సు మొదలగువానిని ) ఉపాసించు నుపాసకుల నచ్చటికి గొనిపోవడు. ఇట్లు చెప్పుటవలన " అనియమ స్సర్వేషాం " అనుస్థలమునందు చెప్పిన మార్గసంగ్రహమునకు ( దేవయాన మార్గ ము ఉపాసకుల కందరికును కలదనుటకు) విరోధ మేమియును రాదు. ఆస్థలము ప్రతీకోపాసకులనుగూర్చి చెప్పునది కాదని తెలిసి కొనవల యును. ఈ కారణమువలన ఉపాసకులలో కొందరు బ్రహ్మలోక మును జెందుదురనియు కొందరు లేదనియు నొప్పుకొనుటవలన దోష మేమియును రాదు. మఱియు తత్క్రతు న్యాయమువలన ( ఎవ్వడెట్టి యుపాసనలను చేయునో వాడు ఆస్థలమునే లేక దేవతనే జెందును. అనున్యాయమువలన ) పైనచెప్పిన విషయమేదృఢీకరింపబడుచున్నది. కావున సిద్ధుడు ప్రతీకోపాసనల చేసినవారిని బ్రహ్మలోక మునకు గొనిపోవడని వ్యాసమహాముని యభిప్రాయమని తాత్పర్యము.

సూ॥ ౧౬॥ విశేషంచదర్శయతి ॥

టీక॥ విశేషంచ=భేదమునుకూడా ( ప్రతీకోపాసనలయందు ఫలభేదమునుకూడ ) దర్శయతి=శ్రుతిచెప్పుచున్నది.

తా॥ శ్రుతి ప్రతీకోపాసనలకు పరస్పర భిన్నములగు ఫలవ

లుగలవని చెప్పుచున్నది. ఈ కారణమువలన నీ యుపాసనలు పరబ్రహ్మోపాసనలు కానేరవు. "విశేష్యాఽవిశిష్టఫలత్వాత్" అను సూత్రమునందు పరబ్రహ్మోపాసనలకు ఫలభేదము లేదని చెప్పబడి యున్నదిగదా. ఈ కారణమువలన ప్రతీకోపాసకు లగువారిని ఆసిద్ధుడు బ్రహ్మలోకమునకు గొనిపోవడు. అయితే ఆ ప్రతీకోపాసకులుకూడ దేవయానమార్గము నవలంబించి తటిల్లోకము వరకు పోయి అచ్చటనే కర్మఫలమునందు మగుడ నంతవరకు నుందురని సంప్రదాయము నెరింగినవారు చెప్పుదురు. పైన నిరూపించిన కారణములవలన ప్రతీకోపాసకులు బ్రహ్మలోకమును పొందరనుటయే సిద్ధాంతమయ్యెనని తాత్పర్యము.

అర్చిరాదినా షట్కాః ॥ ౬ ॥ ౧౬ ॥

అర్చిరాదినా, వాయుం, తటితః, ఆతివాహికాః, కార్యం, బాదరి, అప్రతీకాత్ ॥ ౬ ॥

ఇతిశ్రీ బ్రహ్మసూత్రే చతుర్థస్యాధ్యాయస్య తృతీయః పాదః.

ఇట్లు చతుర్థాధ్యాయమునందు తృతీయపాదము,

ముగిసెను.

ఓం.

శ్రీవాసుదేవపరబ్రహ్మణే నమః.

శ్రీగురుభ్యోనమః - హరిః ఓమ్.

# బ్రహ్మసూత్రములు.

## చతుర్థాధ్యాయము - చతుర్థపాదము.

—(*) ౧. సంపద్యావిర్భావాధికరణమ్. (*)—

అవ॥ ఈ విధముగా పైపాదమునందు సగుణ బ్రహ్మోపాసకునకు కలుగుగతిని విచారించి ఇప్పుడు నిర్గుణబ్రహ్మవేత్తకు కలుగు

గతినిగూర్చి విచారించుచున్నాడు. అందు " ఏషసంప్రసాదోస్మా చ్ఛరీరాత్సముత్థాయపరంజ్యోతి రుపసంపద్యస్వేన రూపేణాభినిష్ప ద్యతే ( ఈ జీవుడు ఈ శరీరమునుండి లేచి పరమాత్మనుజేరి అచ్చట స్వస్వరూపముతోనే కలిసిపోవును [ అనగా జీవబ్రహ్మల కైక్యము కలుగుననుట.] )" అను శ్రుతియందు " జీవ పర బ్రహ్మల కైక్యము చెప్పబడియున్నదా, లేక, స్వర్గాదులయందువలె బ్రహ్మము నందును జీవుడు భిన్నస్వరూపముతోనే " యుండునని చెప్పబడి యున్నదా, అనుసంశయమును ఈ యధికరణమున నివారించుచున్నాడు.

సూ॥ ౧॥ సంపద్యావిర్భావః స్వేనశబ్దాత్ ॥

టీక॥ స్వేనశబ్దాత్ = స్వేనఅనుపదమును ప్రయోగించి యుం డుటవలన, సంప్రసాదశ్రుతౌ = " ఏష సంప్రసాద " అను శ్రుతి యందు, బ్రహ్మసంపద్య ఆవిర్భావః=పరబ్రహ్మమునుచెంది తత్స్వ రూపముతోనే నిలచుట ( తనస్వరూపమునకును పరబ్రహ్మ స్వరూప మునకును భేదములేకుండనుండుట, ఐక్యమగుట) ఉక్తః=చెప్పబడినది.

తా॥ పైన ఉదహరింపబడిన శ్రుతియందలి అభినివృత్తి శబ్ద ముచే చెప్పబడినది ఐక్యమేగాని తాను ప్రత్యేకముగా పరబ్రహ్మము నందుండుటకాదు. ఈ విషయము శ్రుతియందున్న " స్వేన "అను శబ్దముచే దృఢీకరింప బడుచున్నది. స్వశబ్దమునకు " తాను " అని అర్థముగదా. ప్రకృతమున నాశబ్దము రూపమునకు విశేషణ మగు చుండుటచే " తననిజస్వరూపము " అని యర్థమువచ్చును. ఈ కార ణమువలన పరబ్రహ్మముయొక్క యంశమే యగుటచే జీవుడు ఆ పర బ్రహ్మమునందైక్యమగునని పైశ్రుతి కర్థమేర్పడుచున్నది. మఱియు జీవ బ్రహ్మలకుగల భేదము అవిద్యామూలక మైనదియే కావున పరోక్ష బ్రహ్మజ్ఞానమువలన ఆ యవిద్య నశింపగా జీవుడు పరబ్రహ్మము నం దైక్యము జెందుననుటయంతయు యుక్తియుక్తముగదా. కావున అవతారికయందు ఉదహరింప బడిన శ్రుతియందు చెప్పబడి యున్న విషయము ఐక్యమేగాని వేరొకటి కాదని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుటవలన విశేషమేమియును కానరాలేదు. జీవుడెప్పుడును బ్రహ్మస్వరూపుడే కావున వానికి ఐక్యరూపమగు

ముక్తి స్వతస్సిద్ధముగానే ఉన్నదిగదా. అనిన సమాధానము చెప్పు చున్నాడు.

సూ॥ ౨॥ ముక్తః ప్రతిజ్ఞానాత్ ॥

టీక॥ ప్రతిజ్ఞానాత్ = " ఏతంత్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి ( ఈపురుషునిగూర్చి నీకు మఱియొకమారు విస్తరించి చెప్పెదను ) " అని శ్రుతియందు అవస్థాత్రయము మొదలగు బంధములేవి యునులేని జీవుడే పరబ్రహ్మమునం దైక్యమును బొందునానుగా ప్రతిజ్ఞ చేయబడి యుండుటవలన, ముక్తః = సర్వబంధ విముక్తుడగు పురుషుడే, ఐక్యంగచ్ఛతి = ఐక్యరూపమగు మోక్షమును బొందును.

తా॥ అవతారికయందు చేయబడిన పూర్వపక్షము సరియైన దికాదు. సంసారావస్థయందు కూడ జీవుడు బ్రహ్మరూపుడగుటలో సంశయము లేకపోయినను ఆకాలమునందు కల్పితమగు అవిద్యాసంబంధమువలన కలిగినబంధము ( అవస్థాత్రయము మొదలగువానితోటి సంబంధము ) ఆజీవునకు కలదు. ఈముక్తావస్థయందన్ననో అట్లుకాక బ్రహ్మజ్ఞానమువలన నాయవిద్య నశించును. కావున నాబంధము లేదు. " ఏతంత్వేవ " అనుశ్రుతికూడ ముక్తునివిషయమై చెప్పుటకు ఉపక్రమించి ప్రతిజ్ఞ ( నేను ఈవిషయమును చెప్పబోవుచున్నాను అనిముందుగా చెప్పుట ) చేయుటవలన పైనచెప్పినవిషయమే సిద్ధాంతమగుచున్నది. కావున పైసూత్రమునందు చేయబడిన సిద్ధాంతమున కెట్టిను భంగము రాదని తాత్పర్యము.

అవ॥ " ఏషస " అనుమొదలగు శ్రుతియందలి జ్యోతిశ్శబ్దమునకు అగ్నియని అర్థము. కావున కార్యమగు నాజ్యోతిని పొందినవానికి ముక్తికలుగుననుట అయుక్తమనిన సమాధానము చెప్పుచున్నాడు.

సూ॥ ౩॥ ఆత్మా ప్రకరణాత్ ॥

టీ॥ ప్రకరణాత్ = ప్రకరణమువలన, పరంజ్యోతిః = " ఏషస " అనుమొదలగు శ్రుతియందు చెప్పబడిన పరంజ్యోతి, ఆత్మా = పరమాత్మయే.

తా॥ జ్యోతిశ్శబ్దమునకు అగ్నియనియర్థము గాదు. య ఆత్మాఽపహతపాప్మావిజరః ( సర్వపాపములతోను జరామరణములతోను

సంబంధములేని పరమాత్మకలదో ) అను ప్రకరణారంభ వాక్యముచేత నీవిషయము స్పష్టము చేయబడుచున్నది. కావున జ్యోతిశ్శబ్దమునకు పరబ్రహ్మమే యర్థమనియు పైనచేసిన సిద్ధాంతమునకు భంగములేదనియు తాత్పర్యము.

—(* ౨. అవిభాగేన దృష్టత్వాధికరణమ్. (*)—

అవ॥ బ్రహ్మమును జెందిన జీవుడు బంధవిముక్తుడేనైనను బ్రహ్మభిన్నుడయ్యే యుండవచ్చునుగదా. అనిన నట్లుకాదని ఈఅధికరణముచే సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ॥ ४॥ అవిభాగేన దృష్టత్వాత్ ॥

టీక॥ దృష్టత్వాత్ = శ్రుతియందు చెప్పబడి యుండుటవలన, సః=ఆముక్తజీవుడు, అవిభాగేన=పరబ్రహ్మముతో భేదములేనివాడుగానే యుండును.

తా॥ " బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి ( పూర్వావస్థయందు కూడ బ్రహ్మముగానే యుండుటచే జీవుడు మోక్షావస్థయందు కూడ బ్రహ్మమే యగును ) " అను శ్రుతినిబట్టిచూచిన మోక్షావస్థయందు జీవబ్రహ్మలకు భేదమే లేదని స్పష్టముగా తెలియ వచ్చుచున్నది. కావున శ్రుతియందు చూపబడిన పూర్వపక్షము భ్రాంతిమూలకమైనదియేగుని తాత్పర్యము.

—(*) ౩. బ్రాహ్మాధికరణమ్. (*)—

అవ॥ పై రెండధికరణములచేతను సిద్ధాంతము చేయబడిన బ్రహ్మరూపుడగు ముక్తునిస్వరూపమును నిరూపింపబోవుచు మొట్టమొదట పూర్వపక్షముల ననువాదము చేయుచున్నాడు.

సూ॥ ౫॥ బ్రాహ్మేణ జైమి నిరుపన్యాసాదిభ్యః ॥

టీక॥ జైమినిః=జైమినిమహాముని, ఉపన్యాసాదిభ్యః = ఉపన్యాసము, ( ఈయన సర్వపాపసంబంధములును లేని పరమాత్మ అని ఉద్దేశించుట ) విధి ( అంతకుముందు తెలియకుండువిషయమును క్రొత్తగా దెల్పుట ఆ పరబ్రహ్మమునుగూర్చి విచారింపవలయును అనుమొదలగునవి ) వ్యపదేశము ( ఆ బ్రహ్మ సర్వజ్ఞుడు అని ప్రత్యక్షముగా చెప్పుట ) ఈకారణములవలన, ముక్తః=ముక్తుడగుజీవుడు

టీక॥ ఏవమపి=పైసూత్రమునందు చెప్పబడిన యభిప్రాయమే నిశ్చయమైనను ఉపన్యాసాత్ = ౫ వ, సూత్రమునందు చూపబడిన ఉపన్యాసాది కారణములు యథార్థములే యగుటవలన పూర్వభావాత్=మొదటి యభిప్రాయమువలన (జైమిని యభిప్రాయమువలన) అవిరోధం=విరోధము లేదని, బాదరాయణః= వ్యాసమహాముని, మన్యతే=తలంచుచున్నాడు.

తా॥ ఔడులోమి మహాముని చెప్పినయట్లు యథార్థస్థితిని విచారించిన పరబ్రహ్మము లేక ముక్తజీవుడు చిన్మాత్ర స్వరూపుడే యైనను అతనికి సర్వజ్ఞత్వాది గుణములతో సంబంధముండదని చెప్పి నజైమిని మతమువలనకూడ సిద్ధాంతమునకు విరోధమేమియును రాదు. అపరబ్రహ్మ లేక ముక్తజీవుడు పరమార్థస్థితిలో నెట్లున్నను వ్యావహారికస్థితిలో గుణసంబంధమును కలిగియుండవచ్చునుగదా. ౫ వ, సూత్రమునందు ఉదహరింపబడిన ఉపన్యాసము మొదలగు కారణములుకూడ " బ్రహ్మము లేక ముక్తజీవునకు సర్వజ్ఞత్వాది గుణములతో నిత్యసంబంధము కలదు " అనిచెప్పుచు పైనచెప్పిన విషయమును దృఢపరచుచున్నవి. ( అనగా ఆ ఉపన్యాసాదులు బ్రహ్మగుణములతో నిత్యసంబంధము కలిగియున్నాడని చెప్పుటచేతను ఇతర శ్రుతులు బ్రహ్మ శుద్ధవిజ్ఞానస్వరూపుడని చెప్పుటచేతను ఈరెంటిని సమన్వయించిచూచిన పరబ్రహ్మమునకుగల గుణసంబంధము వాస్తవము కాదని వ్యక్తపరచుచున్నదియనుట ) ముక్తదృష్టికి బ్రహ్మము నిర్విశేషముగానే యున్నను ఇతరులదృష్టికి సర్వజ్ఞత్వాది గుణయుక్తముగా నుండవచ్చునుగదా. కావున సర్వజ్ఞత్వాది గుణములు వ్యావహారికములే యనియు వానితో బ్రహ్మమునకుగాని ముక్తజీవునకుగాని సంబంధము కలదని చెప్పినను వేదాంతసిద్ధాంతమునకు భంగమురాదనియు వ్యాసమహాముని యభిప్రాయమని తాత్పర్యము.

—(*) ४. సంకల్పాధికరణమ్. (*)—

అవ॥ ఈవిధముగా అపరోక్ష బ్రహ్మజ్ఞానమువలన కలుగుఫలమును వివరించి మరల ఉపాసనలవలన గలుగు ఫలములను చెప్పుచున్నాడు.

సూ॥ ౮॥ సంకల్పాదేవతుతచ్ఛ్రుతేః ॥

టీక॥ ముక్తస్య=ఉపాసకుఁడై కార్యబ్రహ్మలోకమునకుఁబోయిన జీవునకు, సంకల్పాదేవ = సంకల్పమాత్రమువలననే, భోగసాధనానాం=బ్రహ్మలోకభోగము ననుభవించుటకు సాధనములగు పదార్థములు, ఉత్తిష్ఠంతే=పుట్టుచున్నవి, కుతః=ఎందువలనననగా, తచ్ఛ్రుతేః=శ్రుతి ఆవిధముగానే చెప్పుచుండుటవలన.

తా॥ ఉపాసకుఁడగువాఁడు, కార్యబ్రహ్మలోకమునకు బోవునని పై పాదమందే నిర్ణయించి యున్నాము. అచ్చట ఆముక్త జీవునకు కలుగవలసిన భోగములన్నియు అతని సంకల్పమువలననే కలుగును గాని సాధనములేవియును అక్కరలేదు. ఈవిషయము " సంకల్పాదేవ ( సంకల్పమువలననే ) ఇత్యాదులగు శ్రుతిచేత స్పష్టము చేయబడుచున్నది. ఆశ్రుతియందున్న ఏవ అనుశబ్దము ఉపాసకునకు భోగములు గలుగుటకై ఇతరసాధనములతో సంబంధము లేదని స్పష్టము చేయుచున్నదిగదా. మఱియు పైన నిర్ణయించిన విషయమువలన మఱియొక దానిని ఇట్లు నిర్ణయించుకొనవలయును. పై నుదహరించిన శ్రుతివలన ఉపాసకుని సంకల్పము సామాన్యుల సంకల్పమువంటిది కాదని తెలియుచున్నదిగదా. ఈ కారణమువలన అతనిభోగములు సంకల్ప జన్యములేయైనను అతనికి ముక్తిగలుగు నంతవఱకు నిలచియుండగలవు. ఈ కొత్తవిషయమునుకూడా పై శ్రుతి సహాయము వలననే నిర్ణయించుకొనవలయును. పై నిరూపించిన కారణమువలన ఉపాసకునకు గలుగు భోగములు సంకల్పమాత్ర జన్యములేయని సిద్ధాంతమైనదని తాత్పర్యము.

అవ॥ మఱియు ముక్తుని పరబ్రహ్మ రూపుఁడుగావున ఆయన సత్యసంకల్పుఁడే కావలయును. ఇదియు పైన జేసిన సిద్ధాంతమువలననే కానిదని దృఢపడఁడని చెప్పుచున్నారు.

సూ॥ ౯॥ అతఏవచానన్యాధిపతిః ॥

టీక॥ అతఏవచ=పైననిరూపించిన కారణమువలననే ( ఉపాసకుఁడగువాఁడు తనసంకల్పమువలననే సమస్త భోగములను కల్పించుకొనును కావున ) అనన్యాధిపతిః=ఆ ఉపాసకునకు మఱియొక ప్రభు

వు లేదు.

తా॥ ఆ ఉపాసకునకు అధిపతులు పరమేశ్వరుడు తప్ప మఱియొకరును లేరు. అట్లున్నయెడల వారికి స్వాధీనమై యుండు భోగములు ఈ ఉపాసకులకు సంకల్పమాత్రముననే లభించుననుట అసంభవముగదా. ఈకారణమువలనకూడ ఉపాసకులు సత్యసంకల్పులు (సంకల్పమాత్రముచేతనే దేనినైనను కల్పింపగలవారు) అనుట సిద్ధించుచున్నది. వేద ప్రామాణ్యమువలన పరమేశ్వరుడుకూడా ఆ ఉపాసకుల సంకల్పమును ప్రతిబంధింపడు. ఈ కారణమువలన ఉపాసకుని భోగములు సంకల్పమాత్ర జన్యములేయని తాత్పర్యము.

—(*) ౫. అభావాధికరణమ్. (*)—

అవ॥ సంకల్పాదేవ అను శ్రుతివలన ఉపాసకునకు మనసుకలదని తెలియవచ్చుచున్నదికదా. దానిపై శరీరేంద్రియాదులు కలవా, లేవా, యను సంశయము కలుగును. కావున దానిని ఈ యధికరణమున నివారించువాడై మొదలు పూర్వపక్షము ననువాదము చేయుచున్నాడు.

సూ॥ ౧౦॥ అభావం బాదరిరాహ హ్యేవమ్ ॥

టీక॥ బాదరిః= బాదరిమహాముని, ఉపాసకస్య = ఉపాసకునకు, ఇంద్రియాదీనాం=ఇంద్రియములు మొదలగువానియొక్క, అభావం=అభావమేకలదని, మన్యతే=తలంచుచున్నాడు, ఏవం= ఈప్రకారముగానే, శ్రుతిః=వేదము, ఆహహి=చెప్పుచున్నదికదా.

తా॥ ఉపాసకునకు మనస్సుయొకటే యుండునుగాని ఇంద్రియాదులేమియు ఉండవు. శ్రుతి ఉపాసకుని భోగములు సంకల్పజన్యములని చెప్పి తరువాత "మనసైతాన్ కామాన్పశ్యన్రమతే (అభోగములను మనసుతోనే జూచుచు నాహ్లాదమును జెందును)" అని సుఖానుభవ ప్రకారమును స్పష్టము జేయుచున్నది. అని బాదరి మహాముని యభిప్రాయ పడుచున్నాడు. పైశ్రుతిచేత మనసునకంటే వేరగు నింద్రియము లేదియును లేదని స్పష్టము జేయబడుచున్నది. ఇతర ఇంద్రియము లున్నయెడల నున్నచో పై శ్రుతి ప్రవర్తించుటకే (ఉపాసకుడు మనసుచేతనే భోగముల ననుభవించునని చెప్పుటకే) వీలులేదుకదా.

కావున ఉపాసకునకు ఇంద్రియాదులు లేవని తాత్పర్యము. ( ఇది యొక పూర్వపక్షము.

సూ॥ ౧౧॥ భావంజైమినిర్వికల్పామననాత్ ॥

టీక॥ వికల్పామననాత్ = శ్రుతియందు వికల్పము చెప్పబడి యుండుటవలన, జైమినిః=జైమినిమహాముని, భావం=ఇంద్రియాదులు ఉపాసకునకున్నవని, మన్యతే=తలంచుచున్నాడు.

తా॥ బాదరి మతము సరికాదు. ఉపాసకునకు దేహేంద్రియాదులుకూడ కలవు. " ఏకధాభవతి. ద్విధాభవతి, త్రిధాభవతి, ( ఆపురుషు డొకరూపము గలవాడుగాను రెండురూపములు గలవాడుగాను మూడు రూపములు గల వాడుగాను అగును )" అనుశ్రుతి ఉపాసకు డనేకరూపములుకూడ చెందునని చెప్పుచున్నది. శరీరభేదములేనిది రూపభేదము కలుగదుగదా. అని జైముని మహాముని తలంచుచున్నాడని తాత్పర్యము. ( ఇదిరెండవ పూర్వపక్షము.)

అవ॥ పై విషయమునందు సిద్ధాంతమును చెప్పుచున్నాడు.

సూ॥ ౧౨॥ ద్వాదశాహవదుభయవిధంబాదరాయణోతః ॥

టీక॥ అతః=ఈ కారణమువలననే ( అనగా బాదరి మహాముని యు జైమిని మహామునియు వారివారి మతములను దృఢపరుచు కొనుటకై చూపిన కారణముల వలననే అనుట, )బాదరాయణః=వ్యాసాచార్యులు, ద్వాదశాహవత్ = ద్వాదశాహక్రతువువలె, ఉభయవిధం = పైచెప్పినవిషయము రెండువిధములుగాకూడ కలదని, మన్యతే=తలంచుచున్నాడు.

తా॥ ఇట్లుచెప్పుట సరికాదు. రెండువిధములగు ( ఉపాసకునకు శరీరము లేదనియు కలదనియుకూడ చెప్పు ) శ్రుతు లుండుటవలన ఆయుపాసకునకు వాని సంకల్పము ననుసరించి యొకప్పుడు శరీరముండుటయు మఱియొకప్పుడు లేకపోవుటయుకూడ కలదని చెప్పవచ్చును. ఇట్లే శ్రుతివలన రెండు విధములుగా చెప్పబడు చున్నదని ద్వాదశాహమను కర్మ యజ్ఞముగాను అహీనముగాను (ఇదియజ్ఞములో నొకభేదము ) ఏర్పడుచున్నదని పూర్వ మీమాంసయందు చెప్పబడియున్నదికదా. ఆవిధముగానే ఇచ్చటకూడ సిద్ధాంతము చేయ

వచ్చునని వ్యాసమహాముని అభిప్రాయపడుచున్నాడని తాత్పర్యము.

అవ॥ ఇట్లు చెప్పుట విరుద్ధము. శరీరేంద్రియములు లేకపోయిన భోగము కలుగుటకు వీలులేదు. కావున బాదరిపక్షమును సంపూర్ణముగ నిరాకరించుట యుక్తమనిన నట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౧౩॥ తన్వభావేసంధ్యవదుపపత్తేః ॥

టీక॥ తన్వభావే=శరీరములేనప్పుడు, సంధ్యవత్ = స్వప్నావస్థయందువలె, ఉపపత్తేః=సుఖ భోగములు కలుగవచ్చును కావున, బాదరిమతంగ్రాహ్యమేవ=బాదరిమతమును గ్రహింపవచ్చును.

తా॥ బాదరిమతమును నిరాకరింపవలసిన పనిలేదు. ఇంద్రియ వ్యాపారములులేక కేవలము మనస్సుమాత్రమేయున్న స్వప్నావస్థయందు నానావిధభోగములు కలిగినట్లే ఇంద్రియాదులులేక కేవలము మనస్సుతోమాత్రమే కూడియున్న ఉపాసకులకుగూడ నానావిధ భోగములు కలుగవచ్చుననుటయు త్తియుక్తమేకదాయనితాత్పర్యము.

అవ॥ దేహము లేకయే భోగము కలుగవచ్చునని చెప్పిన యెడల జైమినిమతము నొప్పుకొనుట నిరర్థక మగుననిన నట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౧౪॥ భావేజాగ్రద్వత్ ॥

టీక॥ భావే=శరీరాదులున్నప్పుడు, జాగ్రద్వత్ = జాగ్రదవస్థయందువలె, భోగోపపత్తేః=సుఖదుఃఖభోగములు కలుగవచ్చును.

తా॥ జైమిని మతముకూడ నిరాకరింప తగినదికాదు. ముక్తునకు స్వసంకల్పబలమున శరీరేంద్రియాదు లుండు కాలమునందు కలుగు భోగములు జాగ్రదవస్థయందు కలుగు భోగములవలె నుండును. ఇవి స్వప్నభోగములకంటే భిన్నములైనవేకదా. ఈ విధముగాముక్తునకు ( ఉపాసకునకు ) కలుగు భోగములయందు భేదమును కలిగించునది యగుటచే నీరెండవ స్థితికూడ దేహము ( కలదను స్థితికూడ) అవశ్య మంగీకరింప బడవలసినదియే. ఈ రెండు పక్షముల యందును శ్రుతిసమ్మతి కలదని మొట్టమొదటనే చూపియున్నాముకదా. కావున ఈ బాదరి జైమిని మతములలో రెండును అంగీకరింప తగినవే యనుట వేదాంత సిద్ధాంతమని తాత్పర్యము.

## —(*) ౬. ప్రదీపవదావేశాధికరణమ్. (*)—

అవ॥ పై అధికరణమునందలి జైమినిమతమునందు ఉపాసకు నిచే అనేక శరీరములు సృజింపబడునని చెప్పబడియున్నది. దానిని మీరును అంగీకరించియున్నారు. అది దోషము. క్రొత్తగా సృజింపబడిన శరీరములన్నియు జీవశూన్యములగుటచేత నవి భోగసాధనములని చెప్పుటకు వీలులేదుకదా. అనిన అట్లుకాదని ఈ అధికరణముచే సిద్ధాంతము చేయుచున్నాడు.

సూ॥ ౧౫॥ ప్రదీపవదావేశ స్తథాహిదర్శయతి ॥

టీక॥ ప్రదీపవత్ =దీపముయొక్కవలె, విదుషః = జ్ఞానియొక్క, ఆవేశః=ప్రవేశము, సర్వశరీరేషు = క్రొత్తగా సృజింపబడిన సర్వశరీరములయందును, భవేత్ =కలుగవచ్చును. తథా = అవిధముగానే, శ్రుతిః=శ్రుతి, దర్శయతిహి = చెప్పుచున్నదికదా.

తా॥ ఉపాసకునిచే సంకల్పబలమువలన సృజింపబడిన శరీరములు జీవరహితములు గావు. దీపముయొక్కటయ్యును అనేకములగు వత్తుల ( దీపపువత్తుల ) యందు ప్రవేశించునట్లు ఈ ఉపాసకుడును అంతఃకరణము మొదలగు సర్వసాధనములతోను కూడియున్న నూతనశరీరములయందు ప్రవేశించును. " ఏకధాభవతి ద్విధాభవతి " అనుమొదలగు శ్రుతికికూడ నిదియే యభిప్రాయము. కావున క్రొత్తగా సృజింపబడిన శరీరములు జీవరహితములుకావు. ఆశరీరములన్నియును జ్ఞానికి భోగసాధనములగును. అని తాత్పర్యము.

అవ॥ మొట్టమొదట జ్ఞానికి శరీరమున్నదనుటయే యుక్తము గాదు. " తత్కేనకంపశ్యేత్ (జ్ఞానియగువాడు ఏయింద్రియముతో దేనిని జూచును)" అనుమొదలగు శ్రుతిచేత జ్ఞానికి శరీరములేదనియు స్వభావముగా తనకంటె రెండవది లేకపోవుటచే మతియేవస్తువును అనుభవింపదనియు చెప్పబడుచున్నదికదా. అనిన చెప్పుచున్నాడు.

సూ॥ ౧౬॥ స్వాప్యయ సంపత్త్యోరన్యతరాపేక్షమా విష్కృతంహి॥

టీక॥ విశేషజ్ఞానాభావవచనం = " తనకంటె రెండవవస్తువు ఉన్నదని తెలంపదు. అనువాక్యము, స్వాప్యయసంపత్త్యోః = సుషు

ప్త్యవస్థ పరబ్రహ్మైక్యము అనువానిలో, అన్యతరాపేక్షం = ఏదో యొకదానిని ఆధారముచేసికొని చెప్పబడియున్నది. ఏవం= ఈప్రకారముగానే, ఆవిష్కృతంహి=శ్రుతియందే స్పష్టముచేయబడియున్నదికదా.

తా॥ అవతారికయందు చేయబడిన పూర్వపక్షము సరియైనది కాదు. అచ్చట చూపబడియున్న శ్రుతి సుషుప్త్యవస్థనుగూర్చిగాని పరబ్రహ్మ ఐక్యరూపమగు మోక్షమునుగూర్చిగాని చెప్పునదియే కాని సగుణోపాసనల చేసినవారు చెందునట్టి బ్రహ్మలోక ప్రాప్తినిగూర్చి చెప్పునదికాదు. "ఏతేభ్యోభూతేభ్యస్సముత్థాయ, యత్రత్వస్యసర్వమాత్మైవాభూత్ ( ఈభూతములనుండి లేచి [ అనగా సుషుప్త్యవస్థనుచెందియనుట ] అచ్చట ఆత్మస్వరూపమునకంటే వేరగువస్తువేద్దియును లేదో [ పరబ్రహ్మతో నైక్యముచెందినప్పుడు ] అను మొదలగు వాక్యములు పైవిషయమును స్పష్టముచేయుచున్నవి. కావున సగుణోపాసకులకు శరీరమున్నదనుటలో విరోధమేమియును లేదని తాత్పర్యము.

—(*) ౭. జగద్వ్యాపారవర్జాధికరణమ్. (*)—

అవ॥ ఉపాసకుడగువాడు శరీరమునుకల్పించుటయందు సామర్థ్యవంతుడని చెప్పియున్నారు. ఈసామర్థ్యము పరమేశ్వరుని సామర్థ్యమువలె సర్వవ్యాపారములయందును నిరంకుశమైనదియా, లేక, పరిచ్ఛిన్నమైనదియా, నిరంకుశమని చెప్పినచో ఈశ్వరు లనేకులని చెప్పవలసివచ్చునసిన అట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౧౭॥ జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ ॥

టీక॥ ముక్తానాం=ముక్తులయొక్క (సగుణోపాసకులయొక్క) ఐశ్వర్యం=సామర్థ్యము, జగద్వ్యాపారవర్జం= జగత్తును సృజించుటమాత్రము లేకుండా, అన్యత్ర=ఇతరస్థలములయందు, భవతి = అగుచున్నది. కుతః=ఎందువలననగా, ప్రకరణాత్=అచ్చటి ప్రకరణములవలన ( సృష్టిప్రకరణములవలన ) అసన్నిహితత్వాచ్చ=ఉపాసకుని విషయ మచ్చట లేకుండుట వలనను.

తా॥ ఉపాసకుడగువానికి సాధారణమైన అణిమాద్యైశ్వర్యమే కలుగునుగాని ప్రపంచ నిర్మాణశక్తి యుండదు. సృష్టిప్రకరణములయం దెక్కడజూచినను పరబ్రహ్మనుగూర్చియే చెప్పబడుచున్నది కాని, ముక్తజీవులనుగూర్చి చెప్పబడుటలేదు. (ఇచ్చట ముక్తజీవులనగా సగుణోపాసకులని తెలిసికొనునది) ఈకారణమువలన ఈశ్వరులనేకులను దోషము రానేరదని తాత్పర్యము.

అవ॥ ఇట్లుకాదు. " ఆప్నోతిస్వారాజ్యం " అనుమొదలగు శ్రుతిచే ముక్తుడగువానికి సర్వశక్తులును కలవని చెప్పబడుచున్నది కదా. అనిన అట్లుకాదని చెప్పుచున్నాడు.

సూ॥ ౧౮॥ ప్రత్యక్షోపదేశాదితిచేన్నాధికారికమండలస్థోక్తేః॥

టీక॥ ప్రత్యక్షోపదేశాత్ = ప్రత్యక్షముగానే ముక్తుడగువాడు సంపూర్ణశక్తిని కలిగియున్నాడని చెప్పుటవలన, నేత్రసంకోచః = వారిశక్తియందు సంకోచములేదు. ఇతిచేత్ = అనేయెడల, న = అది యుక్తముగాదు. కుతః = ఎందువలననగా, అధికారికమండలస్థోక్తేః = సూర్యాది మండలమునం దున్నవానినిగూర్చి చెప్పుటవలన.

తా॥ "ఆప్నోతిస్వారాజ్యం" అనుశ్రుతిచేత చెప్పబడియున్న విషయము ఉపాసకునకు సంపూర్ణశక్తి కలదనుటకాదు. ఏలయనగా "ఆప్నోతిమనసస్పతిం (పరబ్రహ్మమును చెందును)" అను మొదలగు ఉత్తరవాక్యములను బట్టిచూచిన స్వారాజ్యప్రాప్తియనగా పరబ్రహ్మప్రాప్తియేయని తెలియవచ్చుచున్నది. ఆశ్రుతి సూర్యాది మండలస్థితుడగు పరబ్రహ్మమునుగూర్చి చెప్పుచు అపరబ్రహ్మమునే చెందవలయునని పై ఉదహరించిన ఉత్తరవాక్యముచే స్పష్టము చేయుచున్నది కదా. కావున ఉపాసకునకు గలశక్తి పరిచ్ఛిన్నమైనదియే కాని సంపూర్ణమైనదికాదనియు దానివలన ఈశ్వరులనేకులు ఉన్నారని చెప్పవలసిన పనిలేదనియు తాత్పర్యము.

సూ॥ ౧౯॥ వికారావర్తిచ తథాహిస్థితిమాహ॥

టీక॥ సగుణే = సగుణబ్రహ్మమునందు, వికారావర్తిచ = నిర్వికారుడగు నిర్గుణబ్రహ్మముగూడగలదు. తథా = ఆప్రకారమే, స్థితిం = బ్రహ్మ

యందు నిర్గుణత్వ సగుణత్వములు రెండును ఉండుటను, శ్రుతిః = వే
ము, ఆహహి = చెప్పుచున్నదికదా.

తా॥ పైనజూపిన కారణములేగాక పైసిద్ధాంతమును దృ
పఱచుటకు మఱియొక కారణముగూడ గలదు. సగుణబ్రహ్మమున
నిర్గుణబ్రహ్మకూడ నున్నాడు. "ఏతావానస్యమహిమా అతోజ్యాం
గంశ్చపురుషః (పైనజెప్పబడియున్న సహస్రశీర్షత్వము వెయ్యి
స్సు గలిగియుండుట) మొదలగునవి ఈపరమేశ్వరునివిభూతి ఈగ
ఉవిభూతికంటె ఉత్తముడుగాకూడ (నిర్గుణుడుగా కూడ ఉన్నాడ
అనువాక్యముచే పైనచెప్పిన విషయము స్పష్టము చేయబడుచున్న
ఈఉపాసకుడు సగుణబ్రహ్మను ఉపాసించినవాడే కావున నాసగ
బ్రహ్మమును జెందును. అణిమాద్యైశ్వర్యముల పొందును. నిర్గు
బ్రహ్మముకూడ అచ్చటనేయున్నను దాని నుపాసించలేదు కా
ఈఉపాసకుడచ్చటికి పోనేరడు. ఆబ్రహ్మమునకు కలిగియున్న జగ
ర్మాణ సామర్థ్యమును పొందనేరడు. కావున సగుణబ్రహ్మమ
నభిన్నముగానే యున్నను ఆయుపాసకుడు నిర్గుణబ్రహ్మము నె
పొందనేరడో అట్లే ఆయనకుగల సామర్థ్యములను పొందనేర
తాత్పర్యము.

అవ॥ పైసూత్రమునందు దృష్టాంతార్థముగ నిర్గుణ బ్రహ
మునుగూర్చి చెప్పబడియున్నది. ఆవిషయమును (నిర్గుణబ్రహ్మము స
ణస్వరూపములలో లీనమైయున్నాడను విషయమును) దృఢపఱ
టకై మఱియొక ప్రమాణమును జూపుచున్నాడు.

సూ॥ ౨౦॥ దర్శయతశ్చైవంప్రత్యక్షానుమానే॥

టీక॥ ప్రత్యక్షానుమానే = శ్రుతిస్మృతులు, ఏవం = పైజెపి
విధముగానే, దర్శయతశ్చ = చూపుచున్నది.

తా॥ "నతత్రసూర్యోభాతి, నతద్భాసయతేసూర్యః (ఆ
మేశ్వరునియొద్ద సూర్యుడు ప్రకాశింపడు. ఆపరమేశ్వరుని సూర్యు
ప్రకాశింపచేయనేరడు [అనగా పరమేశ్వరుని కనుగొనవలయు
ప్రయత్నించునప్పుడు ఈ సూర్యునివలన నేమియును సహాయముకల
దనుట.]) అనుమొదలగు శ్రుతిస్మృతులు గూడా పరమేశ్వరు

సగుణపదార్థములయందెల్లగూడ వృత్తితో నున్నాడనియు ఆయనను ఎఱుగుట మిక్కిలికష్టమనియు చెప్పుచున్నది. ఈకారణములవలనగూడ సగుణ స్వరూపమునందు నిర్గుణబ్రహ్మ యున్నాడనుట నిర్వివాదాంశమని తాత్పర్యము.

అవ॥ ఈ విధముగా ప్రసంగమువలనవచ్చిన నిర్గుణ పరబ్రహ్మ విషయమును ముగించి ఉపాసకునిశక్తి ప్రపంచ సృష్టియందు సమర్థముకానేరదని నిరూపించుటకేమఱియొకకారణమును చెప్పుచున్నాము.

సూ॥ ౨౧॥ భోగమాత్రసామ్యలింగాచ్చ ॥

టీక॥ భోగమాత్ర= సుఖానుభవమునందుమాత్రమే, సామ్య= ఉపాసకుడును ఉపాస్యదేవతయును సమానమని, లింగాచ్చ = వేదమునందు గురుతు కనుపడుచుండుటవలనకూడ, ఉపాసకుని సాతిశయ శక్తిః= ఉపాసకుడు పరిపూర్ణశక్తికలవాడుకాడు.

తా॥ ఉపాసకుడు సగుణబ్రహ్మను పొందినను సగుణబ్రహ్మతో నైక్యమగుననిగాని సర్వవిషయములయందును ఆయనతో సమానుడగుననికాని యర్థముకాదు. సుఖము ననుభవించుటను మాత్రమే ఆయనతో సమానుడై యుండునని తెలిసికొనవలయును. "తమాహాపో వై ఖలుమీయంతే (అమృత పదార్థములగు నీ జలములు నాచే ననుభవింప బడుచున్నవి. నీవుగూడ భోగసాధనము లివియే యని సగుణబ్రహ్మ ఆయుపాసకుని గూర్చి పలికెను.)" అను వాక్యమువలన నీ విషయము తెలియవచ్చుచున్నది. ఈకారణమువలనగూడ ఆయుపాసకునకు ప్రపంచ నిర్మాణాదులయందు సామర్థ్యము కలదనుట సంభవింపదని తాత్పర్యము.

అవ॥ ఈ విధముగా ఉపాసకునకు పరిపూర్ణ సామర్థ్యము లేదని సిద్ధాంతముచేసి ఈ క్రింది సూత్రముచే వానికి పునరావృత్తి లేదని స్థిరపరచుచున్నాడు.

సూ॥ ౨౨॥ అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్ ॥

టీక॥ శబ్దాత్=వేదమువలన, అనావృత్తిః= ఆ ఉపాసకులకు కూడా, పునరావృత్తిః=( మఱియొకజన్మము ) లేదు. ( ఈసూత్రము

రెండవపూరుచెప్పుట శాస్త్రసమాప్తిని తెలియ జేయుటకని తెలిసి కొనునది. )

తా॥ అర్చిరాదిమార్గము ననుసరించి సగుణ బ్రహ్మను జెందిన యుపాసకులకుకూడా పునర్జన్మములేదు.) వారందరును కల్పాంతము వరకు నా బ్రహ్మలోకమునందుండిపిదప ఆలోకాధీశ్వరుడగు బ్రహ్మతో కూడా పరబ్రహ్మైక్య రూపమగు మోక్షమును జెందుదురని క్రమ ముక్తిని గూర్చి చెప్పశ్రుతి ఘోషించుచున్నది. సగుణబ్రహ్మవిదులగు ఈ యుపాసకులస్థితియే ఇట్లుండ నిర్గుణ బ్రహ్మవేత్తలనుగూర్చి చెప్ప వలసిన దేమున్నది. పరమానంద స్వరూపుడగు పర బ్రహ్మ మాత్మ గా నెఱింగి యా యపరోక్షబ్రహ్మజ్ఞాని ప్రారబ్ధభోగము పరిపూర్ణ ముకాగానే ఆ పరబ్రహ్మము నందే ఏకీభవించునని యిదివరకే నిరూ పించియున్నాము.) కావున వీరల విషయమునుగూర్చి నూతనముగా చెప్పవలసినదేమియును లేదని తాత్పర్యము.

సంపద్య విభాగేన బ్రాహ్మణ సంకల్పాదభావం ప్రవీశ్యాభావః॥ ౭॥ ౨౨॥

సంపద్య, విభాగేన, బ్రాహ్మణ, సంకల్పా, దభావం, ప్రవీ పవ, జగద్వ్యాపారవర్జమ్, స్పష్ట॥ ౭॥

ఇతిశ్రీ కృష్ణద్వైపాయనముని ప్రణీతే- బ్రహ్మసూత్రే-

చతుర్థస్యాధ్యాయస్య చతుర్థఃపాదః.

ఇతి శ్రీమ ద్వైయాసకీశారీరకమీమాంసాసమాప్తా.

---

శ్లో॥ ఆత్మావబోధవిధురం ప్రసమీక్ష్యలోకముద్ధర్తు మాదృత మనానిగమార్థసారమ్। నిశ్చిత్యసూత్రనిచయంరచయాంచకార శ్రీబా దరాయణమునిర్భువనైకమాన్యః॥ ౧॥ దుర్యుక్తిప్రథన ప్రశస్తవిభవై ర్బాద్ధాద్యసద్వాదిభిః ప్రత్యుభ్యత్పరమాత్మ నిర్మలధియా మాత్మావ బోధాప్తయే। యశ్శారీరకసూత్ర భాష్యమనఘం చక్రేకృపాసాగర స్సోయంసర్వయతి ప్రభుర్విజయతే శ్రీశంకరార్యోగురుః॥ ౨॥ శ్రుతి స్మృతిపురాణానామాలయంకరుణాలయమ్। నమామిభగవత్పాద శంకరం లోకశంకరమ్ ॥ ౩ ॥ సదాశివసమారంభాం శంకరాచార్య మధ్యమామ్। అస్మదాచార్యపర్యంతాం వందేగురుపరంపరామ్॥ ౪॥

ఉ॥ బాలుడనయ్యునట్లయినపండితపాదనిషేవణంబునన్ ।
జాలనివాడనయ్యునొకచందమునన్ బ్రతికూలవైవదు ।
శ్రీలకుఁజిక్కియున్ గృతులరీతినొనర్చితిదీనినాంధ్రటీ ।
కాలలితన్ స్వమానసవికాసముగోరుచునీశుచోదనన్ ॥

కం॥ సీతారామకృపాసం ।
తాసుండుబరూనుత్యాగరాయాఖ్యుండా ।
సీతారామసుతుమసం ।
ప్రీతిన్ బ్రేరేపనుత్కహృదయుడనగుచున్ ॥

సీ॥ ఎవ్వనిశుభదృష్టిఏర్పడసకలమో । హధ్వాంతములతునహా
సహ్యరుండు। ఎవ్వనిసూక్తిథక్తిత విజ్ఞానమై । రాగ్యాంకురములకురమ్య
భూమి।ఎవ్వనియుపదేశమింపారుబ్రహ్మసు । ధామృతాబ్ధిసమందరాచ
లంబు।ఎవ్వనిమతిశక్తియేపారసర్వవు।ర్వాదకాంతారవైశ్వానరుండు॥
తే. గీ॥ ఎవ్వనివిభూతినాకనివెల్లజగము । ఎవ్వనిపదాంబుజ
ములు నాకెల్లవియును । అట్టిమల్లాదిరామకృష్ణాఖ్యగురున । కాచ
రించెదనొగిప్రణామాయుతంబు ॥

కం॥ వీక్షింపనంతరతమ। ప్రేక్షావృత్తులకునెల్ల ప్రేరకుడగుటన్ ।
సాక్షాత్కృతుడయ్యునఖిల।సాక్షిగనెవడదృశ్యతముడు జగములకెల్లన్ ॥
తే. గీ॥ ఆహృషీకేశుడట్టిసర్వాత్మకుండు। ఆదివానందమూర్తి
యాయదృతుండు । అనిరుపమానవిభవుడయ్యాదిపురుష । డీకృతిగ్ర
హించుగాతలక్ష్మీశ్వరుండు ॥

ఇట్లుహారితసగోత్రపవిత్ర వెన్నెలకంటి కులకలశాంబుధిరోహిణీకళత్ర
సుచరిత్ర పరదేశామాత్యపుత్ర సుందరాంబికా గర్భ శుక్తి
ముక్తాఫలమానసుజనజనతాభజమానసుందరరామాభిధాన
ప్రణీతమగు బ్రహ్మసూత్రార్థ బోధిని యను
టీకాతాత్పర్యమునందు చతుర్థాధ్యాయము
చతుర్థపాదము - ముగిసెను.

ఓం తత్సత్.

